THE

# Complete Works

OF

## Rao Bahadur K. Veeresalingam Pantulu,

*Retired Telugu Pandit, Presidency College, Madras.*

**Vol. IX. LITERATURE AND BIOGRAPHIES.**

SARASWATHI POWER PRESS, RAJAHMUNDRY.

1951



కీ. శే. కందుకూరి వీరేశలింగం పంతులుగారు.

# కందుకూరి వీరేశలింగకవి కృతగ్రంథములు.

తొమ్మిదవ సంపుటము — సాహిత్యచరిత్రగ్రంథములు.



రాజమహేంద్రవరము : సరస్వతీ పవర్ ప్రెస్‌నందు
శ్రీ అడ్డేపల్లి నాగేశ్వరరావు గారిచే
ముద్రింపఁబడినది. 1951

# పీఠిక

గద్యతిక్కన యని ప్రసిద్ధికెక్కిన కందుకూరి వీరేశలింగము పంతులవారి గ్రంథసంపుటములో నిది తొమ్మిదవసంపుటము - ఇందు సాహిత్యగ్రంథములు, జీవితచరిత్రలును గలవు - పంతులుగారు తాము నూతనపథకము ద్రొక్కినప్పుడు, లక్ష్యలక్షణసమన్వయము మేర్పఱచి యాపథకమును దిద్దితీర్చి, భావిరచయితలకు, మార్గదర్శకులైనారు — ఈ లక్ష్యలక్షణదృష్టితో పరిశీలించిన నిందలి రచనావిశిష్టత తేటపడగలదు.

నేటివచనసాహిత్యమునకు తలమానికమగు నీతిచంద్రిక సంధి విగ్రహములను, వీరేశలింగముగారు, రచించి, ప్రాచీనవచన సంప్రదాయ రీతిని సుప్రతిష్ఠితము గావించిరి — ఈనీతిచంద్రికయందు, మిత్రలాభము, మిత్రభేదము, విగ్రహము, సంధి అను నాలుగుభాగములు గలవు. వీనిలో మొదటి రెండింటిని ప్రఖ్యాతపండితుడు పరవస్తుచిన్నయసూరి రచించెను. విగ్రహతంత్రమును, బ్రహ్మశ్రీయుత కొక్కొండ వేంకటరత్నము పంతులుగారును, వీరేశలింగము పంతులుగారును వేర్వేరుగా రచించిరి. ఈరెండింటిలో వీరేశలింగము పంతులుగారి విగ్రహతంత్రము, చాల వ్యాప్తికెక్కినది. అది చిన్నయసూరిమార్గమున కొంచెము కఠినశైలిని రచితమైనది. ప్రాచీనవచనరచనాసంప్రదాయము తెలుపుటకు నా భాగ మట్లు రచించి యావెనుక సంధినిగూడ పూరించిరి. ఇది విగ్రహముకన్న సులభగ్రాహ్యమైన శైలిలోనుండి నవీనవచనరచనకు మేలుబంతి యగుచున్నది.

ఇట్లు ప్రాచీన నవీనరీతులకు లక్ష్యములుగనుంచి తమరచనలకు ననుగుణ్యమగు భాషాప్రౌఢిమ యలవఱచుటకు "సంగ్రహవ్యాకరణము" రచించెను — భాష ప్రవాహరూపముగ నిత్యవ్యవహారములో మాఱుచుండును — వ్యాకరణ మా ప్రవాహమును రెండువైపుల గట్టులవలె, సరియగు కట్టుదిట్టములతో నడిపించి, రచనకు స్థిరత్వము గలుగజేయును.

సంగ్రహవ్యాకరణమునకు ముందు చిన్నయసూరిగారి బాలవ్యాకరణము, వెంకయ్యవ్యాకరణము మున్నగునవి కలవు — అందు బాలవ్యాకరణము ప్రౌఢులగువారికి గాని యుపాదేయముకాదు — వెంకయ్యవ్యాకరణము బాలురకేగాని ప్రౌఢులకు గాదు — తెనుగుభాషలో నక్షరాస్యు లందఱకు, నవగాహనమగునట్లుగా, క్లిష్టమగు వ్యాకరణసూత్రమును సంగ్రహముగను, సులభగ్రాహ్యముగను, చెప్పుటయందు పంతులవారికి సాటియగువారు లేరని చెప్పవచ్చును —

వ్యాకరణమువలన నిర్దుష్టమగు రచనచేయుటకు వీలుగలుగును గాని యది హృదయమునాకర్షింపక పోవచ్చును. రచనయాహ్లాదకర మగుటకు నలంకారము లావశ్యకములు. దానికొఱకు, అలంకార సంగ్రహము రచించిరి — మఱియు కావ్యమునకు ప్రాణమగు రసమును గూర్చి, నాయికానాయక వివరణముగూర్చి, కావ్యభేదములనుగూర్చి సాహితీసంప్రదాయములనెఱుంగుటకు కావ్యసంగ్రహము రచించిరి. మన సాహితీసంప్రదాయములు పూర్వులచే, శాస్త్రీయమైన పద్ధతిని సుపరి ష్కృతములై, తరువాత వారు ప్రమాణముగా గ్రహింపదగినట్లుగ సిద్ధాంతములు చేయబడినవి— ఆపద్ధతులను తెలుసుకొనుటకు, పూర్వ పక్షప్రతిపక్షములను, ప్రమాణములను వివరించు తర్కసంగ్రహమును రచించుట యావశ్యకమే గదా!

సత్యవాదులగు పంతులుగారు, మతతత్త్వమును, ఆస్తికబుద్ధిని పెంపొందింపజేసి, ఏకేశ్వర మతప్రతిష్ఠాపనకొఱకు అద్వైత, విశిష్టా ద్వైత, ద్వైతమతసంప్రదాయ ప్రవర్తకులగు శంకర, రామానుజ, మధ్వాచార్యుల చరిత్రములను, వారి మతసిద్ధాంతములను వివరించిరి. పరిశుద్ధాస్తిక మతస్వరూపమును వ్యాప్తి చేసిరి. మన దేశమందలి సనాతన ముగా నెలకొన్న మతము లేగాక, పాశ్చాత్యఖండమున ప్రబలముగనున్న క్రైస్తవ మతస్థాపకుఁడు యేసుక్రీస్తుచరిత్రను, విపులముగ వ్రాసిరి.

ఉత్తమస్త్రీల చరిత్రలలో క్రైస్తవమత సిద్ధాంతములను చక్కగ గ్రహించి, సాంఘిక రాజకీయసేవ నొనర్చిన, పాశ్చాత్యసతీమణుల చరిత్రలను, హైందవస్త్రీల కాదర్శప్రాయముగ పంతులుగారు రచించిరి. ఉత్తమమాత, సముద్రమధ్యమున పడవమునిగినవారినిసంరక్షించి కీర్తిని గన్న గ్రేసు డార్లింగుకన్య, ధైర్యసాహసములు మూర్తీభవించిన జోన్ ఆఫ్ ఆర్కు, మతవిశ్వాసమునకై ప్రాణములు బలియిచ్చిన లేడీ జేన్‌గ్రే, కారాగారనివాసులకు సౌఖ్యము లొనగూర్చిన ఎలిజబెత్తుఫ్రై, రామమోహనరాయల యాంగ్లేయదేశజీవితము చిత్రించిన భారతదేశ బాంధవి మిస్ మేరీ కార్పెంటరు — అనువారల జీవితములిందు, మనోహరముగ చిత్రింపబడినవి. మనస్త్రీలు ముఖ్యముగ నీభాగము చదువదగినది. వీరేశలింగముగారి కలమునకుగల యాకర్షణశక్తి యెట్టిదోగాని ఖండఖండాంతరముల జరిగిన విషయములను మనకన్నులకు గట్టినట్లుగా మఱపురానీయక మనస్సును పట్టునట్లుగా, నొకమాఱు చదివిన మఱియొకమాఱు చదువవలెనని యాసక్తి గలిగించును.

పరిశుద్ధమగు ప్రవర్తన, పరతత్త్వమునందు భక్తిపరత, ఆత్మవిశ్వాసము, కార్యదీక్ష, సంఘమునకు పునాదులు - ఈనైతికవిజ్ఞానము పురుషులకువలె స్త్రీలకు నత్యంతావశ్యకము - ఇట్టివిజ్ఞానమును వచనసాహిత్యమూలమున నాంధ్రలోకమున నాచంద్రార్కము వెలుగజేసిన వీరేశలింగకవి వాఙ్మయరంగమున దివ్యజ్యోతి —

తొమ్మిది నిధులవలె, తొమ్మిదిశీర్షికలు గల యీసంపుటమును సమీచీనముగ పునర్ముద్రణము కావించిన, శ్రీ దంగేటి నారాయణస్వామిగారి కాంధ్రలోకమెంతయేని కృతజ్ఞత చూపవలసియున్నది.

ఇట్లు

చెన్నపురి
15-2-1951

నిడదవోలు వేంకటరావు ఎమ్. ఏ.
మదరాసు విశ్వవిద్యాలయాంధ్రభాషా శాఖాధ్యక్షుఁడు.

# విషయసూచిక

3. సంస్కృతసమేతర మగుభాష యచ్చ తెలుఁగనఁబడును. ఆంధ్రమునకు సంస్కృత ప్రాకృతములు రెండును బ్రకృతులు కావున, సంస్కృత మాద్యప్రకృతి యనియు, ప్రాకృతము ద్వితీయప్రకృతి యనియు, ఆంధ్రము వికృతి యనియు, చెప్పఁబడును.

ర. లక్షణవిరుద్ధము లైనపదములు గ్రామ్యములు. ఉ:— వస్తాడు, తెస్తాడు. ఇవి ప్రయోగార్హములు గావు. అయినను మన తొల్లింటి కవీంద్రులు వాడియున్న పదములు గ్రామ్యము లైనను గ్రాహ్యములే. ఉ:—కలికిఁతుఁడు, ప్రాణగొడ్డము. జీవగఱ్ఱ.

౫. భాషకుం బ్రధానసాధనములు వర్ణములు; వర్ణములు పదము లగును; పదములు వాక్యము లగును; వాక్యములు కావ్యము లగును.

---

## వ్యా క ర ణ ము.

౧. ఆంధ్రభాషను సలక్షణముగా వ్యవహరించుటకు ఉపయోగించువిషయములు గల శాస్త్రము ఆంధ్రవ్యాకరణ మనఁబడును.

౨. అది వర్ణపరిచ్ఛేదము, పదపరిచ్ఛేదము, వాక్యపరిచ్ఛేదము, కావ్యపరిచ్ఛేదము, అని నాలుగుభాగములు గలది.

---

## వ ర్ణ ప రి చ్ఛే ద ము.

౧. వివిధములగుధ్వనులను వేర్వేఱ నెఱిఁగించుకొఱకు వ్రాఁతయం దేర్పఱుచుకోఁబడిన గుఱుతులు వర్ణము లనికాని, అక్షరములని కాని, చెప్పఁబడును. ఉ:—అ, ఇ, క, గ. అట్టివర్ణములను గూర్చి చెప్పునది వర్ణపరిచ్ఛేదము.

౨. వర్ణములసమూహమునకు వర్ణసమామ్నాయమని పేరు. ఆంధ్రవర్ణసమామ్నాయమున, ఏబదియారువర్ణములు గలవు. అవి అచ్చులు, హల్లులు, ఉభయాక్షరములు, అని మూఁడువిధములు గలవి.

౩. అచ్చులు పదియారు:—అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ఌ, ౡ, ఎ, ఏ, ఐ, ఒ, ఓ, ఔ. (అచ్చులకు, ప్రాణములు, స్వరములు, అని మారుపేళ్ళు గలవు.)

౪. ఇతరవర్ణసాహాయ్యము లేకయే పూర్ణముగా నుచ్చరింపఁబడువర్ణములు అచ్చులు. అచ్చులలో అ, ఇ, ఉ, ఋ, ఌ, ఎ, ఒ, అను నేడును హ్రస్వములు (అనఁగా కుఱుచలు); ఆ, ఈ, ఊ, ౠ, ౡ, ఏ, ఐ, ఓ, ఔ, అను తొమ్మిదియు దీర్ఘములు (అనఁగా నిడుదలు); ఎ, ఏ, ఒ, ఓ అను నాలుగును వక్రములు (అనఁగా వంకరగా నుండునవి); ఐ, ఔ, అను రెండును వక్రతమములు (అనఁగా మిక్కిలి వంకరగానుండునవి).

౫. హల్లులు ముప్పదియేడు:—క, ఖ, గ, ఘ, ఙ, చ, చ, ఛ, జ, జ, ఝ, ఞ, ట, ఠ, డ, ఢ, ణ, త, థ, ద, ధ, న, ప, ఫ, బ, భ, మ, య, ర, ల, వ, శ, ష, స, హ, ళ, ఱ. (హల్లులకు వ్యంజనములు, ప్రాణులు, అని నామాంతరములు.)

౬. స్వరసాహాయ్యము లేక పూర్ణముగా నుచ్చరింపఁబడని వర్ణములు హల్లులు. హల్లులలో, క, చ, చ, ట, త, ప, అను నారును పరుషములు (అనఁగా కఠినాక్షరములు); గ, జ, జ, డ, ద, బ, అను నారును సరళములు (అనఁగా కఠినములు కానివి); ఖ, ఘ, ఙ, ఛ, ఝ, ఞ, ఠ, ఢ, ణ, థ, ధ, న, ఫ, భ, మ, య, ర, ల, వ, శ, ష, స, హ, ళ, ఱ, అను నిరువదియైదును స్థిరములు (అనఁగా నిలుకడగా నుండునవి); స్థిరములలోని నకారము ద్రుత మనఁబడును; ఖ, ఘ, ఛ, ఝ, ఠ, ఢ, థ, ధ, ఫ, భ, అను పదియు వర్గయుక్కులనఁబడును.

౭. మఱియు హల్లులలో క, ఖ, గ, ఘ, ఙ; చ, ఛ, జ, ఝ, ఞ; ట, ఠ, డ, ఢ, ణ, త, థ, ద, ధ, న; ప, ఫ, బ, భ, మ; అను నిరువదియైదును స్పర్శములు—ఇందు, అయిదయిదు క్రమముగా కవర్గము, చవర్గము, టవర్గము, తవర్గము, పవర్గము, అనఁబడును:— య, ర, ల, వ, అను నాలుగును అంతస్థములు; శ, ష, స, హ, అను నాలుగును ఊష్మములు.

౮. ఉభయాక్షరములు మూఁడు.—ఇవి క్రమముగా, అరసున్న, నిండుసున్న, విసర్గము, అని చెప్పఁబడును. (అరసున్నకు, అర్ధానుస్వారము, అర్ధబిందువు, అనియు, నిండుసున్నకు, పూర్ణానుస్వారము, పూర్ణబిందువు, అనియు వేఱునామములు)

౯. అచ్చులును హల్లులు నగువర్ణములు ఉభయాక్షరములు. హల్లులమీఁదవలె వీనిమీఁద అచ్చులు నిలువకుంటంజేసి యచ్చులును, అచ్చులకువలె వీనికి స్వతంత్రప్రయోగము లేమింజేసి హల్లులును, అని యెఱుంగునది.)

౧౦. ఉత్పత్తిస్థానములనుబట్టి, అ, ఆ, క, ఖ, గ, ఘ, ఙ, హ, ః, లు కంఠ్యములు; ఇ, ఈ, చ, ఛ, జ, ఝ, ఞ, య, శ, లు తాలవ్యములు; ఋ, ౠ, ట, ఠ, డ, ఢ, ణ, ర, ష, ళ, లు మూర్ధన్యములు; ఌ, ౡ, ౘ, ౙ, త, థ, ద, ధ, న, ల, స, లు దంత్యములు; ఉ, ఊ, ప, ఫ, బ, భ, మ, లు ఓష్ఠ్యములు; ఙ, ఞ, ణ, న, మ, ఁ, ం, లు అనునాసికములు; ఎ, ఏ, ఐ, లు కంఠతాలవ్యములు; ఒ, ఓ, ఔ, లు కంఠోష్ఠ్యములు; వ, దంతోష్ఠ్యము; అని చెప్పఁబడును.

౧౧. య, ర, ల, వ, ఈయక్షరములు లఘువులు, అలఘువులు, అని యిరుదెఱంగులు. సాధ్యముగుయకారము లఘువు. ఉ:—

దక్క, పదమధ్య యకారమున కత్వము లేదు. ఉ:—కవ్యము, బయులు.

౧౮. అచ్చతెలుఁగున చ, జ, ఝ, తాలవ్యములు; ౘ, ౙ, ఝ దంత్యములు. తాలవ్యములు, ఇ, ఈ, ఎ, ఏ, ఐ, లంగూడి యుండును. ఉ.—చిగురు, జిగి, మొ. దంత్యములు, అ, ఆ, ఉ, ఊ, ఒ, ఓ, ఔ, లంగూడి యుండును. ఉ.—ౘవి, ౙత, మొ.

౧౯. సంస్కృత సమములయందు ఇకారాంతము లయిన శబ్దముల ఉపధ*లగు చ, జ, వర్ణములు బహువచనమునందు దంత్యము లగును. ఉ.—వీచి, వీౘులు 'రాౙు' శబ్దమునమాత్రము ఏకవచనము నందు దంత్యయుక్తముగా నున్నది.

---

## పదపరిచ్ఛేదము.

౧. అర్థము గల వర్ణముకాని, వర్ణసముదాయముకాని, పద మనఁబడును. ఉ—అ, మా, అటు, నగ, పనస, అట్టిపదములను గూర్చి చెప్పునది పదపరిచ్ఛేదము.

౨. వ్యస్తపదము లనియు, సమాసపదము లనియు, పదములు రెండువిధములు. పెక్కుపదములు చేరి యొక్కపద మగునది సమాస పదము:—గరళకంఠుఁడు, అలరువిల్తుఁడు అట్లు చేరనిది వ్యస్తపదము:- గరళము, కంఠము, అలరు, విల్లు.

౩. సంస్కృతశబ్దములు, ప్రకృతులు, ప్రత్యయములు, అని రెండువిధములు కలవి. లోకములోనిపదార్థములను, వ్యాపారములను,

* ఉపధ యనఁగా తుదివర్ణమునకు ముందుండువర్ణము.

తెలియఁజేయు మూలపదములు ప్రకృతులు, ప్రకృతులకు లింగము, కాలము, మొదలగు భేదములు గలుగుటకై చేర్పఁబడునవి ప్రత్యయములు. ప్రకృతులు ప్రాతిపదికములని, ధాతువులని, ఇరుదెఱఁగులు.

౪. కొందఱిమతమున శబ్దములుమూఁడువిధములుగలవి. అవి నామములు, క్రియలు, అవ్యయములు, కేవలనామములు, సర్వనామములు, అని నామములు రెండు విధములు; కేవలనామములు, విశేష్యములు, విశేషణములు, అని రెండుదెఱఁగులు.

౫. విశేష్యములు, విశేషణములు, సర్వనామములు, క్రియలు, అవ్యయములు, అని పదము లయిదువిధములుగలవి.

---

## వి శే ష్య ము.

౧. మన యింద్రియములకుఁగాని, మనస్సునకుఁగాని, గోచరము లగుపదార్థముల పేళ్లు విశేష్యము లనఁబడును. ఉ.-పుస్తకము, కూఁత, పరిమళము, పులుసు, వేఁడిమి, యోగ్యత.

౨. సంజ్ఞావాచకములు, జాతివాచకములు, గుణవాచకములు, క్రియావాచకములు, అని విశేష్యములు నాలుగువిధములు గలవి.

౩. మనుజులు, దేశములు, పట్టణములు, పర్వతములు, నదులు మొదలగువానిలో నొక్కొక్కదానికిఁ బెట్టఁబడిన నామములు సంజ్ఞావాచకములు. ఉ.—రాముఁడు, కోసలము, ద్వారక, నీలగిరి, గోదావరి.

౪. జంతువస్తు సముదాయములలో నొక్కొక్కతరగతిలోనివానికి సామాన్యముగాఁ బెండునవి జాతివాచకములు. ఉ.—మనుజుఁడు, వృక్షము, ఆవు, రాయి.

౫. వేఱువేఱుగుణములవలనఁ గుణవాచకములు పుట్టును. ఉ.—మాధుర్యము, చేఁదు, యోగ్యత, పెద్దతనము.

౬. భావార్థమునందు తెలుఁగునను తనము, ఱికము, ఇమి, న, ఇక, మొదలగు ప్రత్యయములు అంతమునందు వచ్చును. ఉ.—చిన్నతనము, కన్నెఱికము, పేదిమి, నల్లన, అగ్గలిక.

౭. మత్వర్థంబున, కాఁడు, కత్తియ, ఈఁడు, అరి, ఇ, కె, ఆఁడి, ఆఁడు, మొదలగు ప్రత్యయములు వచ్చును. ఉ.—నేతకాఁడు, నేరకత్తియ, అటుమటీఁడు, కల్లరి, [illegible], [illegible], [illegible] లాఁడి, వగలాఁడు.

౮. క్రియలవలనఁ గలిగినవి క్రియావాచకములు. ఉ.—వండుట, వంట, వండమి: పండుట, పంట, పండమి.

౯. ధాతువులకు, క, ఇమి, ఁత, కువ, ట, టు, వము, పు, ఇక, న, బడి, గడ, ఇకి, వు, అ, అకము, డు, లోనగు ప్రత్యయములు చేర్చుటవలన క్రియాజన్య విశేష్యములు కలుగును: ఉ.—అలుక, కలిమి, కోఁత, పెనఁకువ, ఆట, వ్రేటు, తిరివము, మాపు, కోరిక, గడన, ఏలుబడి, తీఱుగడ, వినికి, మనువు, ఎండ, అమ్మకము, త్రొక్కుడు. వీనినే కృదంతము లందురు.

౧౦. సంస్కృతనామములుకొన్ని యజంతములుగాను, కొన్ని హలంతములుగాను, ఉండును. లింగబోధకప్రత్యయాదులు గలుగ నప్పు డజంతశబ్దములలో మహద్వాచకముల తుది అకారమునకు ఉకార మగును:—(రామ) రాముఁడు; ఏకారాంతరశబ్దంబులకుం దక్క మిగిలినవాని దీర్ఘమునకు హ్రస్వ మగును:—(రమా) రమ, (నదీ) నది, మా, శ్రీ, ఋకారాంతముల ఋకారమునకు ఆకారమగును:—(భ్రాతృ) భ్రాత. హలంతములలో మకారాంతములు ద్వితీయైకవచ

నాంతతుల్యములు; ఇతరములు ప్రథమైక వచనాంతతుల్యములు. అందు, నకారాంతములకుఁ దక్క ప్రథమైక వచనాంతతుల్యంబుల తుది హల్లునకు ద్విత్వమును, ఉకారాగమమును, అగును—(దిక్) దిక్కు; (కకుప్) కకుప్పు; దీర్ఘముమీఁది హల్లునకు ద్విత్వము వైకల్పికము:— (వాక్) వాకు, వాక్కు; నాంతములయు, ద్వితీయైకవచనాంతతుల్యములయు, అంత్యహల్లునకు లోపంబు గలుగును—(గచ్ఛన్) గచ్ఛ, (విద్వాంసమ్) విద్వాంస. [ఇట్లు లోపముం బొందువాని కజంతంబులకుఁ బోలెఁ గార్యంబు:— (విద్వాంస) విద్వాంసు.]

౧౧. దేశ్యనామములు ఔపవిభక్తికాంతములు, అనౌపవిభక్తికాంతములు, అని రెండువిధములు గలవి.

౧౨. విశేష్యములకు లింగము, వచనము, విభక్తి, గలిగి యుండును.

---

## లింగము.

౧. స్త్రీపురుషాదిజాతిభేదము లింగ మనఁబడును. ఆంధ్రమున మహత్తు, మహతి, అమహత్తు, అని లింగములు మూఁడు. మనుష్యుల లోనికాని దేవతలలోనికాని పురుషులును, వారివిశేషణములును, మహత్తులు; స్త్రీలును, వారివిశేషణములును, మహతులు; తిర్యక్కులును, జడములును, వానివిశేషణములును, అమహత్తులు.

౨. సంస్కృతమున శబ్దములకే నియతము లగు లింగములు కలవు గాని, అర్థమును బట్టి లేవు. అవి, పుంలింగము, స్త్రీలింగము, నపుంసకలింగము, అని మూఁడు.

3. ఇకారాంతవ్యతిరిక్తము లగుమహద్వాచకములకు బిందుపూర్వక డువర్ణకంబు వచ్చును:- (రామ) రాముఁడు, (శంభు) శంభుఁడు,

(విధాతృ) విధాతృఁడు, మగఁడు, బల్లిదుఁడు. ఇకారాంతము.—హరి.

౪. కొన్ని ఉకారాంతశబ్దములకును మహద్విశేషయందు దీర్ఘాంత్యము కలుగును:—సముద్రుఁడు, మేఘుఁడు, హిమవంతుఁడు.

౫. ఇట్టి డువర్ణకము వచ్చు మహత్తులు కాని దేశ్యపదములు పుంలింగసమము లనఁబడును.—కర్త్రిళేఁడు, వరికాఁడు.

౬. అకారాంతము లగు అమహద్వాచకములకు మువర్ణకము వచ్చును.—ముత్యము, వనము, గుఱ్ఱము, పల్లము.

౭. మువర్ణ మంతమందువచ్చు నపుంసకవాచకములు కాని పదములు నపుంసకలింగసమము లనఁబడును.—జనము, చుట్టము.

౮. మూఁడులింగములయందును ఉకారాంత తత్సమశబ్దముల యంతమందు వు వర్ణకము వచ్చును.—శంభువు, వధువు, వస్తువు.

౯. మహతీవాచకముల యంతమునందు, డు, ము, వు, లలో నేదియు రాదు:—సీత, వనిత, అక్క, తల్లి. ఉకారాంతములకు వువర్ణకము మాత్రము వచ్చును:—వధువు.

౧౦. లింగబోధకము లగు డు, ము, వు, లలో నొకటిగాని యంతమందురాని స్త్రీవాచకములుకాని శబ్దములు స్త్రీలింగసమము లనఁబడును.—దూత, దొర, చరిత, మూత.

౧౧. ఈభాషయందు మహత్తు, మహతి, వీనిభేదమును దెలిసికొనుటకు మూఁడుమార్గములు గలవు—

౧. పదభేదమువలన.

| మహత్తు. | మహతి. | మహత్తు. | మహతి. |
|---|---|---|---|
| పురుషుఁడు. | స్త్రీ. | పెనిమిటి. | పెండ్లాము. |
| పిత. | మాత. | మామ. | అత్త. |
| వరుఁడు. | వధువు. | బావ. | వదినె. |

౨. అంత్యభేదమువలన.

| | | | |
|---|---|---|---|
| బ్రాహ్మణుఁడు | బ్రాహ్మణి | పాఱుఁడు. | పాఱుత. |
| నాయకుఁడు. | నాయిక. | వగలాఁడు. | వగలాడి. |
| జనకుఁడు. | జనని. | చాలికాఁడు | చాలికత్తె. |

3. పూర్వమొకపదము చేర్చుటవలన.

| | | | |
|---|---|---|---|
| పురుషశిశువు. | స్త్రీశిశువు. | మగపిల్ల. | ఆఁడుపిల్ల. |
| మగబిడ్డ. | ఆఁడుబిడ్డ. | మగశిశువు. | ఆఁడుశిశువు. |

౧౨. కొన్ని శబ్దములకు ఇకారాన్తస్త్రీసమము మహాప్రాణిని, కీలగూపమే కానఁబడుచున్నది.—అసురి, ఒయారి.

---

వచనము.

౧. ఒకటికిని, ఒకటికంటె నెక్కుడవానిని, తెలుగుభేదము వచనమనఁబడును. ఏకవచనము, బహువచనము, అని వచనములు రెండు.

---

ఏకవచనము.

౨. ఒక దానిని తెలుపునది యేకవచనము—రాముఁడు, స్త్రీ, వస్తువు.

3. లింగబోధకములగు, డు, ము, వు, వర్ణకములు మూఁడును ఏకవచనమునందే వచ్చును.—రాముఁడు, వనము, వస్తువు. వీనిలో మువర్ణమునకు మూముడిగాని, పూర్ణబిందుపూర్వక బువర్ణకముగాని, వికల్పముగా వచ్చును.—వనము, వనమ్ము, వనంబు.

౪. 'ఇయ' అనుదానికి మాఱుగా ఎకారము వైకల్పికముగా వచ్చును. విడియము, విడెము, కన్నియ, కన్నె.

౫. పూర్వసూత్రములంబట్టి ఉకారాంత మహచ్ఛబ్దంబుల

కేకవచనంబున, డు, వు, లలో నేదియైన వచ్చునుగాన రెండురూపములు.—గురుఁడు, గురువు; శంభుఁడు, శంభువు.

౬. సాంతములగు హలంతశబ్దముల కడహల్లు వైకల్పికముగా లోపించి రెండురూపము లేర్పడును.—ఉరము, ఉరస్సు; ధనువు, ధనుస్సు. మహద్వాచకములు, కడహల్లు వికల్పముగా లోపింప, ద్వితీయైకవచనాంతతుల్యము లగును.—అంగిరుఁడు, అంగిరసుఁడు.

౭. ఇమనిచ్ ప్రత్యయాంతములకు మువర్ణకము వైకల్పికముగా వచ్చును—గరిమ, గరిమము; మహిమ, మహిమము; అణిమ, అణిమము; లఘిమ, లఘిమము.

---

## బహువచనము.

౮. అనేకములను దెలుపునది బహువచనము.—రాములు, స్త్రీలు. వస్తువులు.

౯. సామాన్యముగా ఏకవచనరూపము తుదను లువర్ణకము చేర్చుటవలన బహువచనము నిష్పన్నమగును.—వనిత, వనితలు; నవలా, నవలాలు; భ్రాత, భ్రాతలు; దిక్కు, దిక్కులు; వనము, వనమ్ము, వనంబు, వనములు, వనమ్ములు, వనంబులు.

౧౦. పుంలింగబోధక మగు డువర్ణకము బహువచనము పరమగునప్పుడు లోపించును.—రాముఁడు, రాములు; గురుఁడు, గురులు; మగఁడు, మగలు. ఱేఁడు శబ్దమునకు లోపింపదు.—ఱేఁడులు. లింగబోధక మగుటచే త్రాఁడులు, ఇత్యాదులందు లోపములేదు.

౧౧. బహువచనము పర మగునప్పుడు, ఇకారాంతశబ్దముల కొన యికారమునకు ఉకార మగును.—హరి, హరులు; కత్తి.

కత్తులు; వాహిని, వాహినులు; ఇకార ముపాంత్యము*గాఁ గూడ గల తెలుఁగుశబ్దముల ఉపాంత్యఇకారమునకును ఉకార మగును:—కలికి, కలుకులు. రెండక్షరములు శబ్దములకును, టి, డి, డు, లు ఉపధలుగాఁ గలశబ్దములకును, కాదు:—జిగి, జిగులు; [illegible], [illegible]; పిడికిలి, పిడికిళులు; రాపిడి, రాపిడులు.

౧౨. కొన్ని నువర్ణాంతశబ్దముల సవర్ణకమునకు బహువచనము పర మగునప్పుడు బిందుపూర్వక కువర్ణంబు వచ్చును:—ప్రమాను, ప్రమాఁకులు. కొలను, కొలఁకులు—[illegible], కెలను, కొలను, గవను, నెలను, వరను, వలను, శబ్దములకు [illegible]. ఈ కువర్ణకము ఏకవచనమునందును వికల్పముగా వచ్చును:—కొలను, కొలఁకు [illegible], గోను, శబ్దముల సవర్ణకమునకు బిందుపూర్వక గువర్ణకం బగును.—రేఁగులు, గోఁగులు.

౧౩. కొన్ని శబ్దములకు బహువచనము పర మగునప్పుడు కడ వర్ణము లోపించును—చేను, చేలు; పేను, పేలు; మీను, మీలు; రేయి, రేలు; తాయి, తాలు; ప్రాయి, ప్రాలు; వేయి, వేలు. కొన్నిటి కీలోపము వైకల్పికము.—ఆవు, ఆవులు, ఆలు; జాము, జాములు, జాలు; చుట్టము, చుట్టములు, చుట్టలు; మీసము, మీసములు, మీసలు.

౧౪. దీర్ఘపూర్వక మగు లకార మంతమున గల సంస్కృతసమ మహచ్ఛబ్దంబులకు బహువచనము పర మగునప్పుడు రువర్ణకము వచ్చును.—బాలుఁడు, బాలురు. ఇట్లు కొన్ని తెలుఁగుశబ్దములకును బహువచనమున రువర్ణకము వచ్చును.—పగతుఁడు, పగతురు; అల్లుఁడు, అల్లురు.

---

* ఉపాంత్య మనఁగా తుదివర్ణమునకు సమీపమం దుండువర్ణము.

౧౭. బహువచనము పర మగునప్పుడు ఉకారాంతశబ్దముల వువర్ణమునకు లోపము బహుళము†గా నగును.—మనువు, మనువులు; గురువు, గురువులు, గురులు; వధువు, వధువులు; తరువు, తరువులు, తరులు.

౧౮. బహువచనము పర మగునప్పుడు, డు, లు, టు, రు, వర్ణముల ఉకారమునకు లోపము వైకల్పికముగాఁ గలుగును.—గుండు, గుండులు, గుండ్లు; కాలు, కాలులు, కాళ్లు; గొంటు, గొంటులు, గొంట్లు; గోరు, గోరులు, గోర్లు.

౧౯. కొన్ని శబ్దములకు బహువచనమునం దనేకరూపములు గలవు:—

| ఏకవచనము. | బహువచనము. |
|---|---|
| విలుకాఁడు. | విలుకాండ్రు, విలుకాలు. |
| వేఁటకాఁడు. | వేఁటకాండ్రు, వేఁటకాలు. |
| చెయువు. | చెయువులు, చెయువులు. |
| చీటి. | చీటులు, చీట్లు. |
| అనఁటి | అనఁటులు, అనంట్లు. |
| తూఁడు. | తూఁడులు, తూండ్లు. |
| వజ్రము. | వజ్రములు, వజ్రాలు. |
| పగడము. | పగడములు, పగడాలు. |
| పేరు. | పేరులు, పేళులు, పేళ్ళు. |
| కొడవలి | కొడవండులు, కొడవండ్లు. |

† కొన్నిచోట్ల నిత్యముగాను, కొన్నిచోట్ల వికల్పముగాను, కొన్నిచోట్ల, మఱి యొకవిధముగాను, వచ్చుట బహుళము.

| ఏకవచనము. | బహువచనము |
|---|---|
| త్రాడు. | త్రాడులు, త్రాళులు, త్రాళ్ళు. |
| మొగిలు. | మొగిళులు, మొగిలులు, మొగిళ్ళు. |
| ఊరు. | ఊరులు, ఊళులు, ఊళ్ళు. |
| ఏఱు. | ఏఱులు, ఏళులు, ఏళ్ళు. |
| విల్లు. | విల్లులు, విండులు, విండ్లు. |
| జెట్టి. | జెట్టులు, జెట్లు. |
| తడి. | తడులు, తళ్లు, మొదలగునవి. |

౧౭. మఱికొన్నిశబ్దములకు బహువచనము నానావిధములుగఁ గలుగును.

| ఏకవచనము. | బహువచనము. | ఏకవచనము. | బహువచనము. |
|---|---|---|---|
| ఆలు. | ఆండ్రు | కూఁతురు. | కూఁతులు. |
| చెల్లెలు. | చెల్లెండ్రు | పెండ్లి. | పెండ్లిండ్లు. |
| కోడలు. | కోడండ్రు | ఱేడు. | ఱేండ్లు. |
| ముద్దరాలు. | ముద్దరాండ్రు. | మఱఁదలు. | మఱదండ్రు. |
| గండఁడు. | గండండ్రు. | చెలియలు. | చెలియండ్రు. |
| మిండఁడు. | మిండండ్రు. | జవరాలు. | జవరాండ్రు. |

౧౮. వస్తుస్వభావమునుబట్టి కొన్నిశబ్దములకు బహువచనము లేదు.—పైఁడి, వెండి, కీలు, మొన్న, నిన్న, రేపు, మూవు.

౧౯. ఈలాగుననే మఱికొన్నిశబ్దముల కేకవచనము లేదు.—ఇరులు, కురులు, వడ్లు, పెసలు.

౨౦. కొన్నిశబ్దముల కేకవచన బహువచనములయందు అనేక రూపములు కానఁబడుచున్నవి.—

| ఏకవచనము | బహువచనము. |
|---|---|
| దయాళుఁడు, | దయాళురు, |
| దయాళువు. | దయాళువులు. |
| రాహువు. | రాహువులు, |
| రాహు. | రాహులు. |
| పుట్టువు, | పుట్టువులు, |
| పుట్టు. | పుట్టులు. |
| సవితృఁడు, | సవితృలు, |
| సవిత. | సవితలు |
| విధాతృఁడు, | విధాతృలు, |
| విధాత. | విధాతలు. |
| నేతృఁడు, | నేతృలు, |
| నేత. | నేతలు. |
| శుంఠుఁడు, | శుంఠులు, |
| శుంఠ. | శుంఠలు. |
| అసురుఁడు, | అసురులు, |
| అసుర, | అసురలు. |
| దూతుఁడు, | దూతులు, |
| దూత. | దూతలు |
| బిడ్డఁడు, బిడ్డ. | బిడ్డలు. |
| గొల్లఁడు, గొల్ల. | గొల్లలు. |
| జాణఁడు, జాణ | జాణలు. |
| వృద్ధుఁడు, వృద్ధ, | వృద్ధులు. |
| గృహస్థుఁడు, గృహస్థు. | గృహస్థులు. |
| చరిత, | చరితలు, |
| చరితము. | చరితములు. |
| అభిలాష, | అభిలాషలు, |

| ఏకవచనము. | బహువచనము. |
|---|---|
| అభిలాషము | అభిలాషములు. |
| భ్రమ, | భ్రమలు, |
| భ్రమము. | భ్రమములు. |
| వధ, | వధలు |
| వధము. | వధములు, |
| కంధరము, | కంధరములు. |
| కంధర. | కంధరలు. |
| నాసికము. | నాసికములు, |
| నాసిక. | నాసికలు |
| మిత్రుఁడు, | మిత్రులు, |
| మిత్రము. | మిత్రములు. |
| ప్రధానుఁడు, | ప్రధానులు, |
| ప్రధానము, | ప్రధానములు. |
| పాత్రుఁడు | పాత్రులు. |
| పాత్రము | పాత్రములు. |
| హంస, | హంసలు, |
| హంసము | హంసములు. |
| ధర్మము, | ధర్మములు, |
| ధర్మువు. | ధర్మువులు. |
| కర్మము, | కర్మములు, |
| కర్మువు. | కర్మువులు. |
| వణిక్కు. | వణిక్కులు, |
| వణిజుఁడు. | వణిజులు |
| ఋత్విక్కు, | ఋత్విక్కులు, |
| ఋత్విజుఁడు, | ఋత్విజులు. |
| భగవంతుఁడు, | భగవంతులు. |
| భగవానుఁడు. | భగవానులు. |

| ఏకవచనము. | బహువచనము. | ఏకవచనము. | బహువచనము. |
|---|---|---|---|
| హనుమంతుఁడు. | హనుమంతులు. | గరిమము. | గరిమములు. |
| హనుమానుఁడు. | హనుమానులు. | మహిమ, | మహిమలు, |
| వయస్సు, | వయస్సులు, | మహిమము. | మహిమములు. |
| వయసు. | వయసులు. | ఆత్మ, | ఆత్మలు, |
| అంగిరుఁడు, | అంగిరులు. | ఆత్ముఁడు, | ఆత్ములు, |
| అంగిరసుఁడు. | అంగిరసులు. | ఆత్మము. | ఆత్మములు. |
| ప్రచేతసుఁడు, | ప్రచేతసులు. | మనసు, | మనసులు, |
| ప్రచేతుఁడు. | ప్రచేతులు. | మనస్సు, | మనస్సులు, |
| స్రక్కు, | స్రక్కులు, | మనము. | మనములు. |
| స్రజము, | స్రజములు. | పల్లకి. | పల్లకీలు, |
| గరిమ, | గరిమలు, | పల్లకీ. | పల్లకీలు. మొ. |

## విభక్తి

౧. విశేష్యములకుఁగాని సర్వనామములకుఁగాని, ఏకవాక్యమునందలి వేఱుపదములతోఁ గలుగు సంబంధమును దెలిపెడురూపము విభక్తి యనఁబడును. — ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థి, పంచమి, షష్ఠి, సప్తమి, అని విభక్తులేడు.

౨. ద్వితీయాదివిభక్తుల ప్రత్యయములతోఁ గూడనిది ప్రథమావిభక్తి. — రాముఁడు; శంభుఁడు; శంభువు, వనము, వనమ్ము, వనంబు; వనిత; గిరి; బంటు; కన్య; వనలా; శ్రీ ఇదియె నామ విభక్తి యనఁబడును.

3. ఎదుటివారిని బిలుచునప్పుడు విశేష్యములమీఁద నుండు ప్రథమ, సంబోధన ప్రథమ యనఁబడును. — ఓ రాముఁడ, ఓ రామ.

౪. సంబోధనంబున నేకవచనంబున నామంబు కడపటి ఉకా

రములనకు అకార మగును — రాముఁడ, శంభుఁడ, శంభువ ; వనము, వనమ్మ, వనంబ ; బంట.

౫. సంబోధనంబున సంస్కృతనామములు లింగబోధక డువర్ణకమునకు లోపము వికల్పముగానగు. — రాముఁడ, రామ; సంస్కృతనామము లనుటచే అక్కుజూఁడు, బల్లిదుఁడు, తమ్ముఁడు, మగఁడు, లోనగు తెనుగు శబ్దములయం దీలోపము లేదు. — అక్కుజూఁడ.

౬. ఉకారాంత సంస్కృతనామంబుల కీలోపంబు గలుగునప్పుడు కడయచ్చునకుఁ బ్లుతము వచ్చును. — శంభూ, గురూ, ప్లుతమనఁగా మూడు మాత్రల కాల ముచ్చరింపఁబడెడి యచ్చు.

౭. సంబోధనంబున బహువచనంబునకు 'అర' అనునాగమము వచ్చును. — రాములార, బాలులార, జవరాండ్రార.

౮. సంబోధనమున అకార ఇకారములకు దీర్ఘము వైకల్పికముగా నగును — రామ, రామా; రాములార, రాములారా ; హరి, హరీ ; తండ్రి, తండ్రీ.

౯. సంబోధ్య వాచకమునకు ముందు ఓ యనునాగమము వికల్పముగా నగును :— ఓ రాముఁడ, రాముఁడ; ఓమిత్రుఁడ, మిత్రుఁడ ; ఓదురాత్ముఁడ, దురాత్ముఁడ ; ఓ నెలఁత, నెలఁత ; ఓవనమ, వనమ; ఓరాములార, రాములార; మొదలగునవి.

౧౦. ఏకవచనంబునఁ బురుషసంబోధనంబున ఓయియు, నీచత్వ మిత్రత్వంబుల స్త్రీపురుష సంబోధనంబులఁ గ్రమముగా, ఓసియు, ఓరియు, వికల్పముగాఁ బూర్వాగమము లగును :— ఓయిరాముఁడ రాముఁడ; ఓసిదురాత్మురాల, దురాత్మురాల; ఓసిచెలి, చెలి; ఓరిదురాత్మ, దురాత్మ; ఓరిమిత్రుఁడ, మిత్రుఁడ.

౧౧. అకార పూర్వకముగాని లింగమునకు డువర్ణకము తుదయందుఁగల శబ్దములకు ద్వితీయాది విభక్త్యేకవచనములు పరములగునపుడు డువర్ణకంబు లోపించుచోట నివర్ణకంబు వికల్పముగా నిలుచును:— రామునిని, రాముని, రామునిచేత, రాముచేత; బల్లిదునిని, బల్లిదుని, బల్లిదునిచేత, బల్లిదుచేత; శంభునిని, శంభుని, శంభునిచేత, శంభుచేత; విధాతృనిని, విధాతృని, విధాతృనిచేత, విధాతృచేత. మొ. అకారపూర్వకమయ్యెనేని, నివర్ణకము నిత్యము:— రంగనిచేత, మగనిచేత, మొ.

౧౨. బహువచనంబున ద్వితీయాదివిభక్తులు పరంబులగునపుడు బహువచనమును దెలుపు లువర్ణముయొక్క ఉకారమునకు అకార మగును:— రాములను, రాములచేత; బాలురను, బాలురచేత; ఆంధ్రను, ఆంధ్రచేత; త్రాళ్ళను, త్రాళ్ళచేత.

౧౩. ని, ను, ద్వితీయావిభక్తి. ఉవర్ణకముపచ్చు మహచ్ఛబ్దంబులకును, ఇ, ఈ, ఐ, అంతమందుఁ గలపదములకును, ఏకవచనమున నివర్ణకము వచ్చును:— రామునిన్; * శంభునిన్, విధాతృనిన్, మగనినిన్, హరినిన్, శ్రీనిన్, రైనిన్. తక్కినచోట్ల నువర్ణకము వచ్చును:— దొరను, గురువును, విధాతను, వనమును, రాములను, వారలను.

౧౪. ని, ను, వర్ణకములు వైకల్పికముగా లోపించును:— రామున్, వనమున్.

౧౫. చేత, చే, తోడ, తో, తృతీయావిభక్తి:— రామునిచేతన్, రాముచేతన్, రాములచేతన్. మొ.

---

* రై, యొక్క, లకుఁదక్క ద్వితీయాదివిభక్తుల కొనయందు ద్రుతముండును.

౧౬. కై, కొఱకు, చతుర్థీవిభక్తి:— రామునికై, రామునకై, రాములకై. మొ.

౧౭. వలన, కంటె, పంచమీవిభక్తి:— రామునివలనన్, రామువలనన్, రాములవలనన్. మొ.

౧౮. కి, కు, యొక్క, లోపల, లో, షష్ఠీవిభక్తి. సి, మీ, లకుఁదక్క ఇకార, ఈకార, ఐకారాంతములకు ఏకవచనమునందు కివర్ణకము వచ్చును:— హరికిన్, శ్రీకిన్, మైకిన్; సికున్, మీకున్. తక్కినచోట్ల కువర్ణకము వచ్చును:— దొరకున్, రామునకున్, ఆవునకున్. ఉకార ఋకారములమీఁది కువర్ణకమునకుఁ బూర్వమున నవర్ణమాగమ * మగును:—రామునకున్, వనమునకున్, విధాతృనకున్. లోపల, లో, వర్ణకములు బహువచనమునందే వచ్చును.- రాములలోపలన్, రాములలోన్.

౧౯. అందు, న, సప్తమీవిభక్తి. అందు వర్ణకము పరమగుచో ఉకార ఋకారములకు నవర్ణమంతాగమంబగును.—రామునందున్; విధాతృనందున్; రాములయందున్. ఉకారాంతములగు అమహచ్ఛబ్దంబుల కేకవచనమునందు నవర్ణకము వచ్చును:— వనమునన్, ధనువునన్, చెట్టునన్.

---

కొన్నిశబ్దముల విభక్తిరూపములు.

రామశబ్దము.

| | ఏకవచనము. | బహువచనము. |
|---|---|---|
| ప్ర. | రాముఁడు. | రాములు. |

---

* ఆగమ మనఁగా వర్ణ మెక్కుడగా వచ్చుట.

శంభుశబ్దము.

ప్ర. శంభుఁడు, శంభువు. శంభులు, శంభువులు.
సం. ఓశంభువ, ఓశంభుఁడా, ఓశంభువులారా, ఓశంభులారా. మొ.
ఓశంభూ 3. మొ.
ద్వి. శంభువుఁగూర్, శంభువుర్, శంభువులనుర్, శంభువులర్,
శంభువునిర్, శంభుర్. శంభులనుర్, శంభులన్.
[శేష మీరీతినే యూహించునది.]

---

వనశబ్దము.

ప్ర. వనము, వనమ్ము, వనంబు. వనములు, వనమ్ములు, వనంబులు.
సం. ప్ర. ఓవనమ, ఓవనమా. మొ. ఓవనములార, ఓవనములారా. మొ.
ద్వి. వనమును, వనమున్. మొ. వనములన్. మొ.
[శేషం బూహ్యంబు]

---

ఔపవిభక్తికాంతములు.

౧. విభక్తికి సహాయముగాఁ బూర్వమందు వచ్చురూపము ఉపవిభక్తి యనఁబడును. ఉపవిభక్తి ప్రత్యయము లౌపవిభక్తిక ములు. అవి కొనయందుఁగలవి. ఔపవిభక్తికాంతములు. నామం బులతుదనుండు, రు, లు, డు, ను, యి, మొదలయినవానికి ద్వితీయా ద్యేకవచనంబులు పరమగునప్పుడు కొన్నియెడల ఆదేశము* గాను కొన్నియెడల ఆగమముగానువచ్చు, ఇ, టి, ంటి, తి, వర్ణము లౌప విభక్తికములు.—

*ఆదేశమనఁగా నొకవర్ణముపోయి దానికిమాఱుగా మఱియొకవర్ణము వచ్చుట.

| ప్రథమా వి. | ఔప వి. | ద్వితీయాది వి. | | | |
|---|---|---|---|---|---|
| ఊరు | ఊరి | ఊరి(నిన్, | చేతన్, | తోడన్, | మొ.) |
| కాలు | కాలి | కాలి(నిన్ | ,, | ,, | ,,) |
| మ్రాను | మ్రాని | మ్రాని(నిన్ | ,, | ,, | ,,) |
| త్రాడు | త్రాటి | త్రాటి(నిన్ | ,, | ,, | ,,) |
| నోరు | నోటి | నోటి(నిన్ | ,, | ,, | ,,) |
| వేయి | వేయుటి | వేయుటి(నిన్ | ,, | ,, | ,,) |
| అన్ని | అన్నిటి | అన్నిటి(నిన్ | ,, | ,, | ,,) |
| కన్ను | కంటి | కంటి(నిన్ | ,, | ,, | ,,) |
| విల్లు | వింటి | వింటి(నిన్ | ,, | ,, | ,,) |
| అఱ్ఱు | అఱుతి | అఱుతి(నిన్ | ,, | ,, | ,,) |
| గోఱ్ఱు | గోఱుతి | గోఱుతి(నిన్ | ,, | ,, | ,,) |
| గోయి | గోతి | గోతి(నిన్ | ,, | ,, | ,,) |
| చేయి | చేతి | చేతి(నిన్ | ,, | ,, | ,,) |

౨. గోయి మొదలగువాని కీరూపము బహువచనము పరమగునపుడు సయితమువచ్చును :— గోతులు, గోతులను, గోతుల చేతన్. మొ.

3. ఔపవిభక్తికములలోఁ గొన్నిటికి వైకల్పికముగాఁ దృతీయాసప్తముల కత్వ మాదేశమగును:—

| ప్ర. వి. | తృ. వి. | స. వి. |
|---|---|---|
| ఊరు | ఊరన్ | ఊరన్. |
| త్రాడు | త్రాటన్ | త్రాటన్. |
| వేయి | వేయుటన్ | వేయుటన్. |
| కన్ను | కంటన్ | కంటన్. |
| అఱ్ఱు | అఱుతన్ | అఱుతన్. |
| చేయి | చేతన్ | చేతన్. |

ఔపవిభక్తికాంతములు.

కన్ను శబ్దము.

| ఏక. | బహు. |
|---|---|
| ప్ర. కన్ను. | కన్నులు. |
| ద్వి. కంటినిన్, కంటిన్. | కన్నులనున్, కన్నులన్. |
| తృ. కంటిచేతన్, కంటిచేన్, కంటితోడన్, కంటితోన్, కంటన్. | కన్నులచేతన్, కన్నులచేన్, కన్నులతోడన్, కన్నులతోన్. |
| చ. కంటికొఱకున్, కంటికై. | కన్నులకొఱకున్, కన్నులకై. |
| ప. కంటివలనన్, కంటికంటెన్. | కన్నులవలనన్, కన్నులకంటెన్. |
| ష. కంటికిన్, కంటియొక్క. | కన్నులకున్, కన్నులయొక్క. |
| | కన్నులలోపలన్, కన్నులలోన్. |
| స. కంటన్, కంటియందున్. | కన్నులయందున్, కన్నులందున్. |

---

విశేషణము.

౧. విశేష్యముల ధర్మములను దెలుపుపదములు విశేషణములనంబడును.

౨. గుణవాచకములు, సంఖ్యావాచకములు, క్రియావాచకములు, అని విశేషణములు మూడువిధములు.

3. విశేష్యముల గుణములను దెలుపునవి గుణవిశేషణములు:— తెల్ల, మంచి, నిగ్గు. [రూపము, రసము, స్పర్శము, మొదలగునవి గుణములు.]

౪. ప్రాయికముగాఁ దెనుఁగు విశేషణములు స్త్రీలింగసమములయి యుండునుగాన; అవి లింగవచనాదిభేదము లేక యెల్ల విశేష్యములకును ముందు ప్రయోగింపఁబడును:— పెద్దమనుష్యుఁడు, మంచి పడఁతి, చిన్నపలక, నల్లమృగములు.

[illegible] లగునప్పుడు అకారాంత గుణవాచకంబుల తుదను నివర్ణకము బహుళముగా వచ్చును. — నల్లని కోక; చక్కని బాలుఁడు; చిన్నిపుస్తకము.



౬. మువర్ణాంత విశేషణముల మువర్ణమునకు విశేష్యము పరమగునప్పుడు పువర్ణకముగాని, పూర్ణబిందు పూర్వక పువర్ణకముకాని, అగును. — సరసము+మాట=సరసపుమాట, సరసంపుమాట.

౭. సంఖ్యను దెలుపునవి సంఖ్యావాచకములు. — రెండు, యిద్దఱు.

౮. సంఖ్యార్థకములు, సంఖ్యేయార్థకములు, పూరణార్థకములు, అని సంఖ్యావాచకములు మూఁడు విధములు. రెండు, మూఁడు, మొదలగునవి సంఖ్యార్థకములు; ఇద్దఱు, ముగ్గురు, మొదలగునవి సంఖ్యేయార్థకములు; రెండవ, మూఁడవ, మొదలగునవి పూరణార్థకములు.

౯. క్రియలవలన గలిగినవి క్రియావాచక విశేషణములు, — కొట్టుచున్న; కొట్టిన; కొట్టఁగల; కొట్టు, కొట్టెడు, కొట్టెడి.

౧౦. ఈక్రియాజన్య విశేషణములతుదను "అట్టి" అనునది వైకల్పికముగాఁ జేర్పఁబడును. — కొట్టుచున్నట్టి, కొట్టుచున్న; కొట్టినట్టి, కొట్టిన; మొ.

౧౧. క్రియావాచకములకుఁదక్క మిగిలిన విశేషణములకు, ఐన, అగు, ఔ, అను క్రియాజన్యవిశేషణములు వైకల్పికముగా సంయోగమంబు లగును — నిగ్గైన, నిగ్గగు, నిగ్గౌ (చెక్కులు), నిగ్గు (చెక్కులు.)

౧౨. లింగబోధక ప్రత్యయములతోఁ గూడిన విశేషణముల క్రియాసంయోగంబులు నిత్యముగా నగును. — యోగ్యుఁడగు పురుషుఁడు, మృదువగువస్తువు, అందమగుపదార్థము.

౧౩. ఒకానొకచో గొన్ని విశేష్యములు విశేషణములుగా వాడఁబడును — పసిఁడిపంచెము, వెండిపళ్ళెము, రాగిచెంబు. [ఇచటఁ బసిఁడి మొదలగు విశేష్యములు విశేషణములుగా వాడఁబడినవి.]

---

## సర్వనామములు

౧. విశేష్యములపునరుక్తిని నివారించుటకయి వానికిమాఱుగా ప్రయోగింపఁబడు పదములు సర్వనామము లనఁబడును.

౨. సర్వనామములు విశేష్యములకుమాఱుగా నుపయోగింపఁబడునవి కాన విశేష్యములకుం బోలె లింగవిభక్తివచనములు వానికిని గలుగును. సంబోధన ప్రథమమాత్ర ముండదు. విశేషణములతో గూడియుండునపుడు సంబోధన ప్రథమయు నగును — ఓచిన్నవాఁడ, ఓచిన్నదాన.

౩. పురుషబోధక సర్వనామములు, సంబంధ సర్వనామములు, ప్రశ్నవాచక సర్వనామములు, విశేషణ సర్వనామములు, అని సర్వనామములు నాలుగువిధములు.

౪. పురుషములను దెలుపునవి పురుషబోధక సర్వనామములు. ప్రథమపురుషము, మధ్యమపురుషము, ఉత్తమపురుషము, అని పురుషములుమూడు.

౫. ప్రథమ పురుషమునందుఁ దక్క లింగభేదములేదు. ప్రథమ పురుషమునందు, వాఁడు, వీఁడు పుంలింగము. అది, యిది, స్త్రీలింగమును నపుంసకలింగమును. నీవు, మధ్యమపురుషము. నేను, ఉత్తమపురుషము.

౬. పురుషత్రయ సర్వనామము లిట్లు రూపనిష్పత్తిఁ జెందును.

| పురు. | లిం | విభ. | ఏక. | బహు. |
|---|---|---|---|---|
| ప్ర. | పుం | ప్ర. | వాడు.<br>వీడు. | వాండ్రు, వారు, వారలు.<br>వీండ్రు, వీరు, వీరలు. |
| ,, | ,, | ద్వి. | వానిన్<br>వీనిన్ | వారిన్, వారలన్, వాండ్రన్.<br>వీరిన్, వీరలన్, వీండ్రన్. |
| ,, | ,, | తృ. | వానిచేతన్. మొ.<br>వీనిచేతన్. మొ. | వారిచేతన్. మొ.<br>వీరిచేతన్. మొ. |
| ,, | స్త్రీ. | ప్ర. | అది<br>ఇది | వారు, వారలు.<br>వీరు, వీరలు. |
| ,, | ,, | ద్వి. | దానిన్<br>దీనిన్ | వారిన్, వారలన్.<br>వీరిన్, వీరలన్. |
| ,, | ,, | తృ. | దానిచేతన్. మొ.<br>దీనిచేతన్. మొ. | వారిచేతన్. మొ.<br>వీరిచేతన్. మొ. |
| ,, | న | ప్ర. | అది, ఇది. | అవి, ఇవి. |
| ,, | ,, | ద్వి. | దానిన్, దీనిన్. | వానిన్, వీనిన్. |
| ,, | ,, | తృ. | దానిచేతన్. మొ.<br>దీనిచేతన్. మొ. | వానిచేతన్. మొ.<br>వీనిచేతన్, మొ. |
| మ. | | ప్ర. | నీవు, ఈవు. | మీరు, మీరలు, ఈరు, ఈరలు. |
| ,, | | ద్వి. | నిన్నున్, నినున్. | మిమ్మున్, మిమున్. |
| ,, | | తృ. | నీచేతన్. మొ. | మీచేతన్. మొ. |
| ఉ. | | ప్ర. | నేను, ఏను. | నేము, ఏము, మేము. |
| ,, | | ద్వి. | నన్నున్, ననున్. | మమ్మున్, మమున్. |
| ,, | | తృ. | నాచేతన్, మొ. | మాచేతన్, మొ. |

[ఇందుఁ ద్వితీయయం దొక్కరూపము నొక్కెను రూపభేదములు వక్కాణింపఁబడినవి. తక్కినవి యూహించుకొన వలయును.]

౭. "తాను" అనునది ప్రథమపురుష సర్వనామముల పునరుక్తిని మాన్పుకొఱకు వాడఁబడు నొకవిధమైన పురుషసర్వనామము— వాఁడు తాను నిన్న వచ్చినాఁడ నని చెప్పుచున్నాఁడు; అది తాను రోగ్యురాల ననుకొనుచున్నది; వారు తాము చెప్పినదనిజమందురు.

| | ఏక. | బహు. |
|---|---|---|
| ప్రథమావి. | తాను. | తాము, తారు, తమరు. |
| ద్వితీయ. | తన్నున్, తనన్. | తమ్మున్, తముఁ. |
| తృతీయాది. | తన(చేతన్. మొ.) | తమ(చేతన్. మొ.) |

౮. పూజయందుఁ ప్రథమపురుషైకవచన పులింగమునకు అతఁడు, ఆయన, ఇతఁడు, ఈయన, అనునవియు; స్త్రీలింగమునకు, ఆమె, ఆపె, ఆకె, ఈమె, ఈపె, ఈకె, అనునవియు; వచ్చును.

౯. "మనము" అనునది మధ్యమోత్తమ పురుషముల కేకముగా నుపయోగింపఁబడు నిత్యబహువచనాంతమగు సర్వనామము. "మనము" అనుదానికి నీవును నేనును నని యర్థము. దీని ప్రథమావిభక్తి, మనము; ద్వితీయ, మనలన్; తృతీయాది, మనచేతన్, మనల చేతన్. మొ.

౧౦. మధ్యమోత్తమపురుష సర్వనామముల విశేషణములకుఁ గ్రమముగా నేకవచనమున, వు, ను, లును బహువచనమున, రు, ము, లును నంతాగమంబు లగును — నీవు జాణవు, నేను జాణను. ఈయాగమంబులు పరంబు లగునప్పుడు ఉకారంబునకు అకారమగును.—నీవు ధన్యుఁడవు, నేను ధన్యుఁడను; మీరు ధన్యులరు, మేముధన్యులము. విశేషణము లికారాంతము లయ్యె నేని వాని, వు,

న్న, లరు, వి, ని, క్రమముగా నగును — నీవు సుకృతివి, నేను సుకృతిని,

౧౧. ఒక వాక్యమునందలి మఱియొక నామముతోడి సంబంధమును గలిగియుండునవి సంబంధ సర్వనామములు — ఎవఁడు తల్లిదండ్రులమాటను వినునో వాఁడు బాగుపడును. [పై వాక్యములోని "ఎవఁడు" అనునది యీవాక్యమందలి "వాఁడు" అను నామముతో సంబంధించుచున్నది కాఁబట్టి సంబంధసర్వనామము.]

౧౨. ఏఁడు, ఏవాఁడు, ఎవ్వాఁడు, ఎవ్వఁడు, ఎవఁడు, ఎతఁడు, ఏతఁడు, ఏయది; ఎవ్వతె, ఎవ్వర్తె, ఎవ్వతె, ఎవరితె, ఎవర్తె, ఎవతె, ఎవ్వరితె, ఎవ్వర్తె, ఎవతె, ఎవ్వతె, ఎవర్తె, ఎతె, ఎవ్వరితె, ఎవ్వర్తె, ఎవ్వతె, ఎవరితె, ఎవర్తె, ఎవతె, ఎవ్వర్తుక, ఎవ్వతుక, ఎవర్తుక, ఎవతుక, ఏమి, ఏవి, ఏవి, ఏబిడ, ఏయును; ఏది, ఏది, ఎద్ది, ఏయది, ఎయ్యది; ఇవి సంబంధసర్వనామములు. ఇందు, "ఏఁడు" మొదలగునవి మహద్వాచకమునందును, "ఎవ్వరితె" మొదలగునవి మహతీవాచకమునందును, "ఏది" మొదలగునవి యమహద్వాచకమునందును వచ్చును.

౧౩. ప్రశ్నముల నడుగుటయందుపయోగపడునవి ప్రశ్నవాచక సర్వనామములు. — ఏసంవత్సరమున నీవు జన్మించితివి? ఎవ్వఁడు రావణుని సంహరించెను?

౧౪. సంబంధ సర్వనామములు, ఏ, ఎందఱు, ఎన్ని, ప్రశ్నములయందు వాడఁబడునుగాన ప్రశ్నవాచక సర్వనామములు.

౧౫. సర్వనామధర్మములను విశేషణధర్మములను గూడఁ గలిగియుండినవి విశేషణసర్వనామములు - అందఱు. [దుర్జను నందఱు నిందింతురు; దుర్జను నందఱు నరులు నిందింతురు. ఇందు మొదటి వాక్యమునందు సర్వనామధర్మమును, రెండవవాక్యమునందు విశేషణ

ధర్మ్యమును, 'అందఱు' అనుదానికిఁ గలదు కావున విశేషణసర్వ నామము.]

౧౬. నిర్దిష్టసర్వనామములు, అనిర్దిష్టసర్వనామములు, సంఖ్యా వాచకసర్వనామములు, అని విశేషణ సర్వనామములు మూఁడు విధములు.

౧౭. తమతో సంబంధించువిషయములను నిర్దేశించునవి నిర్దిష్ట సర్వనామములు — ఆపట్టణము, ఈగ్రామము. ఆ, ఈ, అనురెండును నిర్దిష్టసర్వనామములు. [తొంటివారు వీనిని సర్వనామములుగాఁ జెప్పిరి కాని వీనియందుఁ గేవల విశేషణధర్మమే కానఁబడుచుండుం జేసి విశేషణములని చెప్పుటయే మేలు.]

౧౮. సంయుక్తాక్షరములును, శ, ష, స, హ, ర, లును బరంబు లగునప్పుడు దక్క ఆ, ఈ, ఏ, లు తాము హ్రస్వముంబొంది మీఁదివర్ణములకు వికల్పముగా ద్విత్వంబును బుట్టించును. — ఆకాలము, అక్కాలము; ఈకాలము, ఇక్కాలము; ఏకాలము, ఎక్కాలము; ఆశబ్దము, ఈరూపము, ఏప్రోలు.

౧౯. తమతో సంబంధించువిషయముల నిర్దేశింపనివి యనిర్దిష్ట సర్వనామములు. — పెక్కుతెగలు. అన్ని, ఇన్ని, ఎన్ని, కొన్ని, పలు, అందఱు, అందొఱు, ఇందఱు, కొందఱు, పెక్కు, పెక్కండ్రు, పెక్కురు, పలువురు, పలుగుండ్రు, ఇవి, యనిర్దిష్ట సర్వనామములు.

౨౦. సంఖ్యను జెప్పుటయందు వర్తించునవి సంఖ్యావాచక సర్వనామములు. — ఒకఁడు నిజము చెప్పెనుగాని యిద్దఱు కల్లలాడిరి. ఒక్కఁడు, ఒక్కరితె, ఒక్కటి, ఇద్దఱు, ఇరుగురు, రెండు, మూఁగురు, ముగ్గురు, ముగురు, మూఁడు, మొదలగునవి సంఖ్యావాచక సర్వ నామములు.

[వీఁడు మొదలగువానికి రూపభేదంబు లనేకంబులు గలవు. గ్రంథవిస్తర భీతిచే నవి యుదాహరింపఁ బడవయ్యెను. వాని నెల్లఁదక్కుంగల వ్యాకరణముల వలనను, ఆర్యవ్యవహారంబు వలనను ఎఱుంగునది.]

---

## క్రియ.

౧. వ్యాపారమును దెలుపుపదములు క్రియ లనఁబడును — పోషించు, కొట్టు.

౨. ధాతువులకొనయందు ఉకార ముండును. [ప్రత్యయముల తోడఁ గూడకమునుపు క్రియకు ధాతువనియు నామమునకుఁ బ్రాతిపదిక మనియు, పేళ్ళు.]

౩. క్రియలు తత్సమములు, అచ్ఛికములు, అని రెండుదెఱఁగులుగా నుండును. అందు తత్సమక్రియల యంతమందు 'ఇంచు' ఉండును. — పోషించు. ఈయించు కొన్ని దేశ్యక్రియల యంతమందునను. గానఁబడు చున్నది. — ఆరగించు, అవులించు, తిలకించు, పరికించు, వలవించు. కొన్ని తత్సమక్రియల యంతమందు ద్విరుక్త లకార ముండును. — భాసిల్లు, రంజిల్లు, రాజిల్లు, వర్ధిల్లు, విలసిల్లు.

౪. గురువు లేనట్టియు యకారాంతములు కానట్టియు ధాతువుల కొకటిరెండచ్చులు గలవానికి వికల్పముగా నించునకుఁ బూర్వమున 'ఇయ్' ఆగమం బగును. — భుజించు, భుజియించు; గుణించు, గుణియించు; నగించు; నగియించు.

౫. సకర్మకములు, అకర్మకములు, అని క్రియలు రెండు విధములు.

౬. కర్మమును గోరునవి సకర్మకములు.—బాలుఁడు పాఠమును జదువు చున్నాఁడు. ఇచట "చదువు" ధాతువు సకర్మకము; "పాఠము" కర్మము (క్రియవలనఁ గలుగు ఫలమును పొందునది కర్మము.) కర్మమును గోరనివి యకర్మకములు — పిల్లవాఁడు పరుగెత్తు చున్నాఁడు.

౭. కర్త్రర్థకప్రయోగము, కర్మార్థకప్రయోగము, అని సకర్మక క్రియలలో రెండుప్రయోగములు గలవు.

౮. కర్త ప్రథమగా నుండునది కర్త్రర్థకప్రయోగము — ఉపాధ్యాయుఁడు శిష్యుని శిక్షించెను. ఇచట "ఉపాధ్యాయుఁడు" కర్త. (ధాత్వర్థ వ్యాపారమునకు ఆశ్రయమైనది కర్త.) కర్మము ప్రథమగా నుండునది కర్మార్థకప్రయోగము.— శిష్యుఁడు ఉపాధ్యాయునిచేత శిక్షింపఁబడెను.

౯. సమాపకములు, అసమాపకములు, అని క్రియ లన్నియు రెండువిధములు. సమాపకము లనఁగా ముగిసినవి.—కొట్టుచున్నాఁడు. అసమాపకము లనఁగా ముగియనివి.—కొట్టి.

౧౦. స్వార్థకము, ప్రార్థనార్థకము, ఆశీరాద్యర్థకము, అని సమాపకక్రియలు మూఁడుభాగములు గలవి.

౧౧. వర్తమానకాలము, భూతకాలము, భవిష్యత్కాలము, తద్ధర్మార్థకము, అని స్వార్థకమందు నాలుగుకాలములు గలవు.

౧౨. ఇప్పుడుజరుగుచున్న కాలమును దెలుపునది వర్తమాన కాలము:—పురుగులు ప్రాఁకుచున్నవి. వెనుక జరిగిన కాలమును దెలుపునది భూతకాలము:—పురుగులు ప్రాఁకెను. ముందు రాఁబోవు కాలమును దెలుపునది భవిష్యత్కాలము:— పురుగులు ప్రాఁకఁగలవు. పై మూఁడుకాలములయందును నొకటిగానుండు స్వభావాదులను దెలుపునది తద్ధర్మము:— పురుగులు ప్రాఁకును.

౧౩. అవ్యయములును, విశేషణములును, విశేష్యములును, అని యున్న మూడక్రియలు మూడువిధములు — తుమున్నర్థకము, క్త్వార్థకము, శత్రర్థకము మొదలగునవి యున్నవి. ధాతువునకు వరుసగా ద్రుతసహిత అకారమును, ఇకారమును, ద్రుతసహిత చున్ ప్రత్యయమును చేర్చుటవలన తుమున్నర్థకాదులుగాను సిద్ధించును — కొట్టన్ (తుమున్నర్థకము), కొట్టి (క్త్వార్థకము), కొట్టుచున్ (శత్రర్థకము). [అవ్యయములకు క్రియాకాంక్షము లనియు, విశేషణములకు నామకాంక్షములని విశేష్యములకు ధాత్వర్థనామము లని పేళ్ళు.]

౧౪. భావము, వ్యతిరేకము, అని యర్థము ననుసరించిన రెండు భేదములుగలవు. వ్యతిరేకమనఁగా క్రియయొక్క అభావము.

౧౫. కర్తలనుబట్టి క్రియలకు, ప్రథమపురుషము, మధ్యమపురుషము, ఉత్తమపురుషము, అని మూడేపురుషములుగలవు. ప్రథమపురుషసర్వనామమునుగాని విశేష్యమునుగాని కర్తనుగాఁ గలది ప్రథమపురుషము; మధ్యమపురుషసర్వనామమును కర్తనుగాఁగలది మధ్యమపురుషము; ఉత్తమపురుష సర్వనామమును కర్తనుగాఁగలది ఉత్తమపురుషము.

౧౬. ప్రథమపురుషములలో దక్క లింగభేదము లేదు. ప్రతిపురుషమునందును ఏకవచన బహువచన భేదము కలదు.

౧౭. మఱియు సహాయక్రియలు, స్వతంత్రక్రియలు, న్యూనక్రియలు, అని క్రియలు మూడింగాలుగా నుండును. సహాయక్రియలకే ఉపక్రియ లని పేరు.

5

## ఉ ప క్రి య లు

౧౮. కాలము మొదలగువానిని నేర్పఱుచుటయందుఁ గ్రియలకు సహాయముగా వచ్చుక్రియలు ఉపక్రియలనఁబడును. తెలుఁగున నట్టి యుపక్రియలు నాలుగు, — ఉండు, కలుగు, పడు, కొను,

### ఉపక్రియల రూపనిష్పత్తి.

౧. ఉండుధాతువు.

వర్తమానకాలము.

| పురుషము. | లింగము. | ఏకవచనము. | బహువచనము. |
|---|---|---|---|
| ప్ర. | పుం. | ఉన్నాఁడు. | ఉన్నారు. |
| ,, | స్త్రీ. | ఉన్నది. | ఉన్నారు. |
| ,, | న. | ఉన్నది. | ఉన్నవి. |
| మ. | | ఉన్నావు. | ఉన్నారు. |
| ఉ. | | ఉన్నాను. | ఉన్నాము. |

[ఈక్రియ యింతవఱకే యుపక్రియగా నుపయోగింపఁబడును.]

౨. కలుగుధాతువు.

వర్తమానకాలము.

| | | | |
|---|---|---|---|
| ప్ర. | పుం. | కలఁడు. | కలరు. |
| ,, | స్త్రీ. | కలదు. | కలరు. |
| ,, | న. | కలదు. | కలవు. |
| మ. | | కలవు. | కలరు. |
| ఉ. | | కలను. | కలము. |

[ఈక్రియయు నింతవఱకే యుపక్రియగా నుపయోగింపఁబడును.]

## 3. పడుధాతువు.

### సమాపకములు.

స్వార్థకము; భావము.

వర్తమానకాలము.

| పురు. | లిం. | ఏక. | బహు. |
|---|---|---|---|
| ప్ర. | పుం. | పడుచున్నాడు. | పడుచున్నారు. |
| ,, | స్త్రీ. | పడుచున్నది. | పడుచున్నారు. |
| ,, | న. | పడుచున్నది. | పడుచున్నవి. |
| మ. | | పడుచున్నావు. | పడుచున్నారు. |
| ఉ. | | పడుచున్నాను. | పడుచున్నాము. |

---

భూతకాలము.

| | | | | |
|---|---|---|---|---|
| ప్ర. | పుం. | స్త్రీ. | పడియెను, పడెను. | పడిరి. |
| ,, | | న. | పడియెను, పడెను. | పడియెను, పడెను. |
| మ. | | | పడితివి, పడితి, | పడితిరి. |
| ఉ. | | | పడితిని. | పడితిమి. |

భవిష్యత్కాలము.

| | | | |
|---|---|---|---|
| ప్ర. | పుం. | పడఁగలఁడు. | పడఁగలరు. |
| ,, | స్త్రీ. | పడఁగలదు. | పడఁగలరు. |
| ,, | న. | పడఁగలదు. | పడఁగలవు. |
| మ. | | పడఁగలవు. | పడఁగలరు. |
| ఉ. | | పడఁగలను. | పడఁగలము. |

---

## ౮. కొను ధాతువు.

### సమాపకము, స్వార్థకము.

### భావము.

### వర్తమానకాలము.

| | | | |
|---|---|---|---|
| ప్ర. | పుం. | కొనుచున్నాఁడు, | కొనుచున్నారు, |
| | | కొన్చున్నాఁడు, | కొన్చున్నారు, |
| | | కొంచున్నాఁడు. | కొంచున్నారు. |
| ప్ర. | స్త్రీ. | కొనుచున్నది, | కొనుచున్నారు, |
| | | కొన్చున్నది, | కొన్చున్నారు, |
| | | కొంచున్నది. | కొంచున్నారు. |
| ,, | న. | కొనుచున్నది, | కొనుచున్నవి, |
| | | కొన్చున్నది, | కొన్చున్నవి, |
| | | కొంచున్నది. | కొంచున్నవి. |
| మ. | | కొనుచున్నావు, | కొనుచున్నారు, |
| | | కొన్చున్నావు. | కొన్చున్నారు, |
| | | కొంచున్నావు. | కొంచున్నారు. |
| ఉ. | | కొనుచున్నాను, | కొనుచున్నాము, |
| | | కొన్చున్నాను, | కొన్చున్నాము, |
| | | కొంచున్నాను. | కొంచున్నాము. |

### భూతకాలము.

| | | | |
|---|---|---|---|
| ప్ర. | పుం. స్త్రీ. | కొనియెను, కొనెను. | కొనిరి. |
| ,, | న. | కొనియెను, కొనెను. | కొనియెను, కొనెను. |
| మ. | | కొంటివి, కొంటి. | కొంటిరి. |
| ఉ. | | కొంటిని. | కొంటిమి. |

## భవిష్యత్కాలము.

| | | | |
|---|---|---|---|
| ప్ర. | పుం. | కొనఁగలఁడు. | కొనఁగలరు. |
| ,, | స్త్రీ. | కొనఁగలదు. | కొనఁగలరు. |
| ,, | న. | కొనఁగలదు. | కొనఁగలవు. |
| మ. | | కొనఁగలవు, | కొనఁగలరు. |
| ఉ. | | కొనఁగలను. | కొనఁగలము. |

---

## తద్ధర్మము.

| | | | |
|---|---|---|---|
| ప్ర. | పుం. స్త్రీ. | కొనును. | కొనుదురు, కొందురు, కొంద్రు, కొండురు, కొండ్రు. |
| ,, | న. | కొనును. | కొనును. |
| మ. | | కొనుదువు, | కొనుదురు, కొందురు, కొంద్రు |
| | | కొందువు, | |
| | | కొనుదు, | |
| | | కొందు, | |
| | | కొండువు, | కొండురు, కొండ్రు. |
| | | కొండు. | |
| ఉ. | | కొనుదును, | కొనుదుము, |
| | | కొందును, | కొందుము, |
| | | కొండును. | కొండుము. |

---

తద్ధర్మ్యము రూపాంతరము.

| | | |
|---|---|---|
| ప్ర. పుం. స్త్రీ. | కొనియెడును, కొనెడును, కొనియెడిని, కొనెడని. | కొనియెదరు, కొనెదరు. |
| ,, | కొనియెడును, కొనెడును, కొనియెడిని, కొనెడిని. | కొనియెడును, కొనెడును, కొనియెడిని, కొనెడిని. |
| మ. | కొనియెదవు, కొనెదవు. కొనియెదు. కొనెదు | కొనియెదరు, కొనెదరు. |
| ఉ. | కొనియెదను, కొనెదను. | కొనియెదము, కొనెదము. |

వ్యతిరేకతద్ధర్మ్యము.

| | | |
|---|---|---|
| ప్ర. పుం. | కొనఁడు, | కొనరు. |
| ,, స్త్రీ. | కొనదు. | కొనరు. |
| ,, న. | కొనదు. | కొనవు. |
| మ. | కొనవు. | కొనరు. |
| ఉ. | కొనను. | కొనము. |

ప్రార్థనార్థకము.

౧. భావము.

మ. కొనుము, కొమ్ము. కొనుఁడు, కొండు.

ఉభయకర్తృకము, — కొనుదము, కొందము, కొండము.

౨. వ్యతిరేకము.

మ. కొనకుము, కొనకు. కొనకుఁడు.

ఆశీరాద్యర్థకము — కొనియెడును, కొనెడును, కొనుతను.

## అసమాపకములు.

### ౧. క్రియాకాంక్షములు.

౧. కొని, క్త్వార్థకము.
౨. కొనక, వ్యతిరేక క్త్వార్థకము.
౩. కొనన్, తుమున్నాద్యర్థకము
౪. కొనుచున్, కొన్నన్, కొంచున్, శత్రర్థకము.
౫. కొనుచున్, ఆనంతర్యార్థకము.
౬. కొనినన్, కొన్నన్, చేదాద్యర్థకము

---

### ౨. నామాకాంక్షములు.

౧. కొనుచున్న, కొన్నున్న, కొంచున్న, వర్తమానార్థక విశేషణము.
౨. కొనిన, కొన్న, భూతార్థక విశేషణము.
౩. కొనఁగల, భవిష్యదర్థక విశేషణము
౪. కొను, కొనెడు, కొనెడు, కొనిరెడి, కొనెడి, తద్ధర్మార్థక విశేషణము
౫. కొనని, వ్యతిరేకార్థక విశేషణము.

౧. కొనుట, కొంట, ధాత్వర్థకము.
౨. కొనమి, వ్యతిరేక ధాత్వర్థకము.

[ ఈక్రియకును స్వతంత్రముగాఁ బ్రయోగింపఁబడునప్పుడీరూపములే వచ్చును. ]

---

## స్వతంత్రక్రియలు.

౧. ఇంచు అంతమందుఁ గలధాతువులకు వర్తమానార్థకము, భవిష్యదర్థకము, ప్రార్థనార్థకము, వ్యతిరేకార్థకము, తుమున్నర్థకము, ప్రేరణార్థకము, మొదలైనవి పరంబులగునపుడు చకారంబునకు పకారం బగును.—పోషించు — పోషింపుచున్నాఁడు, పోషింపఁగలఁడు పోషింపుము, పోషింపఁడు, పోషింపన్. పోషింపించు, ము.

## పోషించు, కొట్టు, ధాతువులు.

## ౧. కర్త్రర్థకప్రయోగము.

### సమాపకము — స్వార్థకము.

### శాసనము.

### వర్తమాన కాలము.

౨. ధాతువుయొక్క శత్రర్థక రూపమునకు తుదను ఉండు ధాతువుయొక్క వర్తమానకాలరూపమును చేర్చుటవలన వర్తమాన కాలము నిష్పన్నమగును:—

| | | | |
|---|---|---|---|
| ప్ర. | పుం. | పోషించుచున్నాఁడు. | పోషించుచున్నారు. |
| | స్త్రీ. | పోషించుచున్నది. | పోషించుచున్నారు. |
| | న. | పోషించుచున్నది. | పోషించుచున్నవి. |
| మ. | | పోషించుచున్నావు. | పోషించుచున్నారు. |
| ఉ. | | పోషించుచున్నాను. | పోషించుచున్నాము. |
| ప్ర. | పుం. | కొట్టుచున్నాఁడు. | కొట్టుచున్నారు. |
| | స్త్రీ. | కొట్టుచున్నది. | కొట్టుచున్నారు. |
| | న. | కొట్టుచున్నది. | కొట్టుచున్నవి. |
| మ. | | కొట్టుచున్నావు. | కొట్టుచున్నారు. |
| ఉ. | | కొట్టుచున్నాను. | కొట్టుచున్నాము. |

### ౨. భూతకాలము.

౩. ప్రథమపురుషైకవచన నపుంసకలింగ బహువచనము లందు ధాతువుతుదను 'ఎను' వర్ణకము చేర్పఁబడును. పుంలింగ స్త్రీలింగ బహువచనములందు రివర్ణకమును; మధ్యమపురుషైకవచన బహు వచనములందుఁ గ్రమముగా, తివి, తిరి, వర్ణకములును; ఉత్తమ పురుషైకవచన బహువచనములందుఁ గ్రమముగా, తిని, తిమి, వర్ణక

ములును; క్త్వార్థకరూపమునకు తుదను చేర్పఁబడును. తివిలోని విసర్గకము వైకల్పికముగా లోపించును; —

| | | |
|---|---|---|
| ప్ర. పుం. స్త్రీ. | పోషించెను. | పోషించిరి. |
| న. | పోషించెను. | పోషించెను. |
| మ. | పోషించితివి, పోషించితి. | పోషించితిరి. |
| ఉ. | పోషించితిని. | పోషించితిమి. |
| ప్ర. పుం. స్త్రీ. | కొట్టెను. | కొట్టిరి. |
| న. | కొట్టెను. | కొట్టెను. |
| మ. | కొట్టితివి, కొట్టితి. | కొట్టితిరి. |
| ఉ. | కొట్టితిని. | కొట్టితిమి. |

## 3. భవిష్యత్కాలము.

౮. ధాతువుయొక్క తుమున్నర్థకరూపము తుదను గలుగు ధాతువుయొక్క వర్తమానకాలరూపములను చేర్చుటవలన భవిష్యత్కాలము నిష్పన్నమగును. —

| | | |
|---|---|---|
| ప్ర. పుం. | పోషింపఁగలఁడు. | పోషింపఁగలరు. |
| స్త్రీ. | పోషింపఁగలదు. | పోషింపఁగలరు. |
| న. | పోషింపఁగలదు. | పోషింపఁగలవు. |
| మ. | పోషింపఁగలవు. | పోషింపఁగలరు. |
| ఉ. | పోషింపఁగలను. | పోషింపఁగలము. |
| ప్ర. పుం. | కొట్టఁగలఁడు. | కొట్టఁగలరు. |
| స్త్రీ. | కొట్టఁగలదు. | కొట్టఁగలరు. |
| న. | కొట్టఁగలదు. | కొట్టఁగలవు. |
| మ. | కొట్టఁగలవు. | కొట్టఁగలరు. |
| ఉ. | కొట్టఁగలను. | కొట్టఁగలము. |

## ౮. తద్ధర్మ్యము.

౫౭. ప్రథమపురుషైకవచన నపుంసకలింగ బహువచనములందు నువర్ణకమును, రూపాంతరమునందు ద్రుతసహితకమునగు ఎను, ఎడి వర్ణకములును, పుంలింగ స్త్రీలింగ బహువచనములందు దురువర్ణకమును, రూపాంతరమునందు ఎదరు వర్ణకమును, మధ్యమపురుషైకవచన బహువచనములందు క్రమముగా, దువు, దురువర్ణకములును, రూపాంతరములందు ఎదవు, ఎదరు వర్ణకములును, ఉత్తమపురుషైకవచన బహువచనములందు క్రమముగా, దును, దుము వర్ణకములును, రూపాంతరమునందు ఎదను, ఎదము, వర్ణకములును, ధాతువు తుదను జేర్చుటవలన తద్ధర్మార్థకము నిష్పన్నమగును.—వీనిలో మధ్యమపురుషమునందలి వువర్ణకము వైకల్పికముగా లోపించును. అప్పుడు తుదెలి అకారమునకు ఉకారమగును —

| | | |
|---|---|---|
| ప్ర. పుం. స్త్రీ. | పోషించును. | పోషింపుదురు, పోషింతురు. |
| న. | పోషించును. | పోషించును. |
| మ. | పోషింపుదువు, పోషింపుదు. | పోషింపుదురు, పోషింతురు,* |
| | పోషింతువు, పోషింతు. | పోషింత్రు. |
| ఉ. | పోషింపుదును, పోషింతును. | పోషింపుదుము, పోషింతుము. |

| | | |
|---|---|---|
| ప్ర. పుం. స్త్రీ. | కొట్టును. | కొట్టుదురు. |
| న. | కొట్టును. | కొట్టును. |
| మ. | కొట్టుదువు, కొట్టుదు. | కొట్టుదురు. |
| ఉ. | కొట్టుదును. | కొట్టుదుము. |

* ఇంచునకు దువర్ణకము పరమగునప్పుడు వైకల్పికముగా చువర్ణకము లోపించి దకారమునకు తకారమగును; దానికి రువర్ణకము పరమయ్యేనేని ఉకారము వైకల్పికముగా లోపించును—పోషింత్రు, నిందింత్రు.

రూపాంతరము

ప్ర. పుం. స్త్రీ పోషించెడున్, పోషించెడిన్, పోషించెదరు.
న. పోషించెడున్, పోషించెడిన్ పోషించెడున్, పోషించెడిన్.
మ. పోషించెదవు, పోషించెదు పోషించెదరు.
ఉ. పోషించెదను. పోషించెదము.
ప్ర. పుం. స్త్రీ కొట్టెడున్, కొట్టెడిన్. కొట్టెదరు.
న. కొట్టెడున్, కొట్టెడిన్. కొట్టెడున్, కొట్టెడిన్.
మ. కొట్టెదవు, కొట్టెదు. కొట్టెదరు.
ఉ. కొట్టెదను. కొట్టెదము.

వ్యతిరేకము.

తద్ధర్మార్థకము.

౬. ప్రథమపురుషైకవచనమునఁ బుంలింగమందు డు వర్ణకమును, స్త్రీలింగ నపుంసకలింగములయందు దువర్ణకమును, బహువచనమునఁ బుంలింగ స్త్రీలింగములయందు రువర్ణకమును, నపుంసకలింగమునందు వువర్ణకమును, మధ్యమపురుషైకవచన బహువచనముల యందుఁ గ్రమముగా, వు, రు, వర్ణకములును, ఉత్తమపురుషైకవచన బహువచనములయందుఁ గ్రమముగా, ను, ము, వర్ణకములును, తుమున్నర్థకరూపము తుదను జేర్చుటవలన వ్యతిరేకతద్ధర్మార్థకము సిద్ధమగును.—

| | | | |
|---|---|---|---|
| ప్ర. | పుం. | పోషింపఁడు. | పోషింపరు. |
| | స్త్రీ. | పోషింపదు. | పోషింపవు. |
| | న. | పోషింపదు. | పోషింపవు. |
| మ. | | పోషింపవు. | పోషింపరు. |
| ఉ. | | పోషింపను. | పోషింపము. |

వ్యతిరేక, ప్రార్థనార్థకము.

౫. మధ్యము పురుషైకవచన బహువచనములయందుః క్రమముగా, కుము, కుఁడు, వర్ణకములు తుమున్నర్థక రూపము తుదను జేర్చుటవలన వ్యతిరేక ప్రార్థనార్థకము నిష్పన్నమగును. అపుడు తుమున్నర్థక రూపమందలి ద్రుతము లోపించును.

| | ఏక. | బహు. |
|---|---|---|
| మ. | పోషింపకుము. | పోషింపకుఁడు. |
| మ. | కొట్టకుము. | కొట్టకుఁడు. |

---

ఆశీరాద్యర్థకము.

౧. ద్రుతసహితములగు ఎడు, త, వర్ణకములు ధాతువు తుదను జేర్చుటవలన ఆశీరాద్యర్థకము నిష్పన్నమగును.—పోషించెడున్, పోషించుతన్; కొట్టెడున్, కొట్టుతన్.

౨. తద్ధర్మార్థకము తుదను, కాతన్, కావుతన్, కాక, వీనిని జేర్చుటవలనను ఆశీరాద్యర్థకమగును.- పోషించుఁగాతన్, పోషింతురుగావుతన్; కొట్టుదురుగాక.

౩. ప్రశ్నములు నడుగునపుడు క్రియారూపదంబులమీఁద, ఆ, ఏ, లు వచ్చును.—వానిఁ బోషించితివా ? వారు కొట్టిరే ?

౪. క్రియారూపదంబులమీఁద సందేహార్థమునందు, ఒ, ఓ, లు వచ్చును.—కొట్టునొ, కొట్టెఁడో.

---

## అసమాపకములు.

### ౧. అవ్యయములు.

#### క్త్వార్థకము.

౧. ధాతువు కొనయందలి ఉకారమునకు ఇకారముగాఁ జేయుట వలన క్త్వార్థకము నిష్పన్నమగును.—పోషించి, కొట్టి.

ఇకారము పరమగునపుడు యుకారాంతధాతువుల యూకు సకారమగును.—(చేయు+ఇ)చేసి. ఈ కార్యము ఎ, కొను, పరమగు నపుడు సహితము కలుగును—చేసిరి, చేసెను, చేసెడిన్, చేసికొను.

#### వ్యతిరేక క్త్వార్థకము.

౨. తుమున్నర్థకరూపము తుదను కవర్ణకము చేర్చుటవలన వ్యతిరేకక్త్వార్థకము నిష్పన్నమగును. అప్పుడు ద్రుతము లోపించును. పోషింపక, కొట్టక.

#### తుమున్నాద్యర్థకము.

౩. ధాతువుతుదను ద్రుతసహితమగు అకారము జేర్చుట వలన తుమున్నాద్యర్థకము నిష్పన్నమగును.— పోషింపన్, కొట్టన్.

#### శత్రర్థకము.

౪. ధాతువుకొనను ద్రుతసహితమగు చువర్ణకము చేర్చుట వలన శత్రర్థకము నిష్పన్నమగును.—పోషించుచున్, కొట్టుచున్.

#### ఆనంతర్యార్థకము.

౫. ధాతువుకొనను ద్రుతసహితమగు డువర్ణకము చేర్చుట వలన ఆనంతర్యార్థకము నిష్పన్నమగును.—పోషింపుడున్, కొట్టుడున్.

#### చేదాద్యర్థకము.

౬. క్త్వార్థకరూపముతుదను ద్రుత సహిత నవర్ణకము చేర్చుట వలన చేదాద్యర్థకము నిష్పన్నమగును. — పోషించినన్, కొట్టినన్.

## ౨. విశేషణములు.

### వర్తమానార్థక విశేషణము.

౧. శత్రర్థకరూపము తుదను ఉన్న యనునది చేర్చుటవలన వర్తమానార్థక విశేషణము నిష్పన్న మగును — పోషించుచున్న, కొట్టుచున్న.

### భూతార్థక విశేషణము.

౨. క్త్వార్థకరూపము తుదను నవర్ణకముం జేర్చుటవలన భూతార్థకవిశేషణము నిష్పన్నమగును. — పోషించిన, కొట్టిన.

### భవిష్యదర్థక విశేషణము.

3. తుమున్నర్థకరూపము తుదను కల యనునది చేర్చుట వలన భవిష్యదర్థకవిశేషణము నిష్పన్నమగును. — పోషింపఁగల, కొట్టఁగల.

### తద్ధర్మార్థక విశేషణము.

౪. ధాతువు తుదను, ఎడు, ఎడి, వర్ణకములు వైకల్పికముగాఁ జేర్చుటవలన తద్ధర్మార్థకవిశేషణము నిష్పన్నమగును. — పోషించు, పోషించెడు, పోషించెడి; కొట్టు, కొట్టెడు, కొట్టెడి.

### వ్యతిరేకార్థక విశేషణము.

౫. తుమున్నర్థకరూపము తుదను నివర్ణము చేర్చుటవలన వ్యతిరేకార్థక విశేషణము నిష్పన్నమగును. — పోషింపని, కొట్టని.

---

## 3. విశేష్యములు.

### ధాత్వర్థకము.

౧. ధాతువుతుదను టవర్ణకము చేర్చుటవలన ధాత్వర్థకము నిష్పన్నమగును — పోషించుట, కొట్టుట.

## వ్యతిరేక ధాత్వర్థకము.

౨. తుమున్నర్థకరూపము తుదను మివర్ణకము చేర్చుటవలన వ్యతిరేక ధాత్వర్థకము నిష్పన్నమగును. — పోషింపమి. కొట్టమి.

---

## కృదంతములు.

3. ధాతువులతుదను కొన్ని ప్రత్యయములను జేర్చుటవలన నేర్పడు విశేష్యములు కృదంతములనఁబడును. — ఏలిక (ఏలు), కలిమి (కలుగు), కొనుబడి (కొను), మొ.

---

## ౪. కర్మార్థక ప్రయోగము.

౧. సకర్మకధాతువుల తుమున్నర్థకరూపము తుదను పడుధాతువు చేర్చుటవలన కర్మార్థకము నిష్పన్నమగును. — పోషింపఁబడు, కొట్టఁబడు.

౨. సమాపకములును, అసమాపకములును, అగు పెక్కురూపములును, పడు ధాతువుయొక్క ఆయారూపములను పైయట్లు చేర్చుటవలన నేర్పడును. — పోషింపఁబడుచున్నాఁడు, కొట్టఁబడుచున్నాఁడు; పోషింపఁబడి, కొట్టఁబడి, మొ.

---

## ఆత్మనేపదార్థకము.

౧. క్రియాఫలము కర్తను జెందినప్పుడది యాత్మనేపదార్థకమనఁబడును. ధాతువుతుదను కొనుధాతువు చేర్చుటవలన ఆత్మనేపదార్థకము నిష్పన్నమగును. అప్పుడు ధాతువు కొనయందలి ఉకారమునకు వైకల్పికముగా ఇకార మగును. — పోషించుకొను, పోషించికొను; కొట్టుకొను, కొట్టికొను.

౨. సమాపకములును, అసమాపకములును, అగు నన్ని రూపములను ధాతువుతుదను పైఁ గొట్టుకొను ధాతువు రూపములను జేర్చుటవలన నేర్పడును. కర్త్రర్థకాదులను వెనుక చెప్పినతీరుననే యెఱుంగునది.

### ౧. ఆత్మనేపదకర్త్రర్థకము.

పోషించుకొనుచున్నాఁడు, పోషించికొనుచున్నాఁడు; పోషించుకొని, పోషించికొని; కొట్టుకొనుచున్నాఁడు, కొట్టికొనుచున్నాఁడు, కొట్టుకొని, కొట్టికొని. మొ.

### ౨. ఆత్మనేపద కర్మార్థకము.

పోషించుకొనఁబడుచున్నాఁడు, పోషించికొనఁబడుచున్నాఁడు, పోషించుకొనఁబడి, పోషించికొనఁబడి; కొట్టుకొనఁబడుచున్నాఁడు, కొట్టికొనఁబడుచున్నాఁడు, కొట్టుకొనఁబడి, కొట్టికొనఁబడి. మొ.

---

## ప్రేరణార్థకము.

౧. మఱియొకనిచేఁ జేయించునది ప్రేరణార్థక మనఁబడును. ధాతువుతుదను ఇంచు చేర్చుటవలన ప్రేరణార్థకము నిష్పన్నమగును.— పోషింపించు, కొట్టించు.

౨. సమాపకరూపములును, అసమాపకరూపములును, కర్త్రర్థకము మొదలయినవియు పైని చెప్పిన చొప్పున గ్రహింపవలయును.

### ౧. ప్రేరణకర్త్రర్థకము.

పోషింపించుచున్నాఁడు, పోషింపించి; కొట్టించుచున్నాఁడు, కొట్టించి, మొ.

౨. ప్రేరణకర్మార్థకము.

పోషింపింపఁబడుచున్నాఁడు, పోషింపింపఁబడి, కొట్టింపఁబడుచున్నాఁడు, కొట్టింపఁబడి. మొ.

౩. ప్రేరణాత్మనేపదకర్త్రర్థకము.

పోషింపించుకొనుచున్నాఁడు, పోషింపించికొనుచున్నాఁడు, పోషింపించుకొని, పోషింపించికొని, కొట్టించుకొనుచున్నాఁడు, కొట్టించికొనుచున్నాఁడు, కొట్టించుకొని, కొట్టించుకొని. మొ.

౪. ప్రేరణాత్మనేపదకర్మార్థకము.

పోషింపించుకొనఁబడుచున్నాఁడు, పోషింపించికొనఁబడుచున్నాఁడు, పోషింపించుకొనఁబడి, పోషింపించికొనఁబడి; కొట్టించుకొనఁబడుచున్నాఁడు, కొట్టించికొనఁబడుచున్నాఁడు; కొట్టించుకొనఁబడి, కొట్టించికొనఁబడి. మొ.

---

న్యూనక్రియలు.

౧. కొన్నికాలములయందును, పురుషములయందును మాత్రము ప్రయోగింపఁబడు క్రియలు న్యూనక్రియలు. — ఒల్లఁడు, వలయును. మొ.

౨. 'ఒల్లఁడు' దీనికివ్యతిరేకమునందే కాని భావంబునఁ బ్రయోగము లేదు; ఈప్రకారముగానె వలయును, వలెను, వలదు, కూడును, కూడదు, మొదలగునవియుఁ గొన్నియెడలమాత్రమె ప్రయోగింపఁబడును.

---

౧. మఱియు సాధారణక్రియలు, నిపాతనక్రియలు, అని క్రియలు రెండువిధములు గలవి.

---

౨. ధాతువు తుదను ద్రుతసహిత అకారమును, ము, డు, వర్ణకములును, చేర్చుటవలనఁ గ్రమముగా తుమున్నర్థకమును, ప్రార్థనార్థకమును, నిష్పన్న మగునవి సాధారణక్రియలు.—

| ధాతువు. | తుమున్నర్థకము. | ప్రార్థనార్థకము. |
|---|---|---|
| పోషించు | పోషింపన్ | పోషింపుము, పోషింపుఁడు. |
| భరించు | భరింపన్ | భరింపుము, భరింపుఁడు. |
| కొట్టు | కొట్టన్ | కొట్టుము, కొట్టుఁడు. |
| వండు | వండన్ | వండుము, వండుఁడు. |

3. తుమున్నర్థకమునందును, ప్రార్థనార్థకమునందును వేఱు రూపములను బొందునవి నిపాతక్రియలు.—

| ధాతు. | తుము. | ప్రార్థ. |
|---|---|---|
| అగు | కాన్ | కమ్ము. కండు. |
| వచ్చు | రాన్ | రమ్ము, రండు. |
| చొచ్చు | చొరన్ | చొరుము, చొరుఁడు. |
| చూచు | చూడన్ | చూడుము, చూడుఁడు. |
| ఇచ్చు | ఈన్, ఈయన్, ఇయ్యన్ | ఇమ్ము, ఇండు. |
| తెచ్చు | తేన్, తేరన్ | తెమ్ము, తెండు, తేరుము, తేరుఁడు. |
| చచ్చు | చాన్, చావన్ | చావుము, చావుఁడు. |
| నోచ్చు | నోన్, నోవన్, నొవ్వన్ | నొవ్వుము, నొవ్వుఁడు, నోవుము, నోవుఁడు. |
| పోవు | పోన్, పోవన్ | పొమ్ము, పొండు. |
| అను | అనన్, నాన్ | అనుము, అనుఁడు. |

| ధాతు. | తుము. | ప్రార్థ. |
|---|---|---|
| కను | కనన్, కానన్ | కనుము, కనుఁడు. |
| పిలుచు | పిలువన్ | పిలుము, పిలుఁడు, పిలువుము, పిలువుఁడు. |
| లేచు | లేవన్ | లెమ్ము, లెండు. |
| నిలుచు | నిలువన్ | నిలుము, నిలుఁడు, నిలువుము, నిలువుఁడు. మొదలగునవి. |

## ప్రేరణార్థకము.

౧. క్రియలు ప్రేరణార్థకమున, సమరూపక్రియలు, భిన్నరూపక్రియలు, అని రెండు దెఱఁగులు.

౨. ధాతువుతుదను ఇంచు చేర్చుటవలన నిష్పన్న మగునవి సమరూపక్రియలు.—(పోషించు) పోషింపించు; (కొట్టు) కొట్టించు. అట్లుగాక వేరువేరురూపములను జెందునవి భిన్నరూపక్రియలు.—(రంజిల్లు) రజించు; (అడఁగు) అడఁచు.

## భిన్నరూపక్రియల పట్టిక.

| స్వార్థకము. | ప్రేరణము. | స్వార్థకము. | ప్రేరణము. |
|---|---|---|---|
| పూను | పూనుచు, పూనించు. | మాను | మానుచు, మానుపు, మానిపించు, మానించు |
| తేలు | తేలుచు, తేలించు. | మను | మనుచు, మనుపు. |
| మగుడు | మగుడుచు, మగిడించు. | అడఁగు | అడఁచు, అడఁగించు. |
| కుదురు | కుదురుచు, కుదిరించు. | మాయు | మాపు, మాయించు. |
| విను | వినుచు, వినిపించు. | కరఁగు | కరఁచు, కరఁగించు. |
| అను | అనిపించు. | వడియు | వడుచు. |
| తిను | తినిపించు. | కలఁగు | కలఁచు, కలఁగించు. |
| కను | కనిపించు, కానిపించు. | ఉడుగు | ఉడుపు, ఉడిగించు. |
| మెచ్చు | మెచ్చించు, మెప్పించు. | | |

| స్వార్థకము. | ప్రేరణము. | స్వార్థకము. | ప్రేరణము. |
| --- | --- | --- | --- |
| కడచు | కడపు. | పెరుఁగు | పెనుచు, పెంచు. |
| కుడుచు | కుడుపు, కుడిపించు. | తునుఁగు | త్రుంచు. |
| ఆఁగు | ఆఁచు, ఆఁపు, ఆఁగించు. | మునుఁగు | మునుచు, ముంచు. |
| రేఁగు | రేఁచు, రేఁపు, రేఁగించు. | చొచ్చు | చొనుపు, చొప్పించు. |
| పాయు | పాచు, పాపు. | బిగియు | బిగుచు, బిగియించు. |
| విఱుఁగు | విఱుచు. | చినుఁగు | చించు, చింపు. |
| చూచు | చూపు. | తెగు | త్రెంచు, త్రెంపు. |
| నేరుచు | నేర్పు. | తిరుగు | త్రిప్పు. |
| మేయు | మేపు. | చచ్చు | చంపు. |
| లేచు | లేపు. | నిలుచు | నిలువరించు, నిలుపు. |
| కలియు | కలుపు. | కొను | కొలుపు. |
| తడియు | తడుపు. | ఆడు | ఆడుచు, ఆడించు. |
| తెలియు | తెలుపు. | ఓడు | ఓడుచు, ఓడించు. |
| అగు | కావించు. | కూడు | కూడుచు, కూడించు. |
| వచ్చు | రావించు, రప్పించు. | చెడు | చెఱుచు, చెఱుపు. |
| నొచ్చు | నొంచు, నొప్పించు. | పడు | పఱుచు. |
| ఉండు | ఉనుచు, ఉంచు. | వెలువడు | వెలువరించు, |
| డిగు | డిగించు, డించు. | | వెలువఱుచు, మొ. |

౩. ఇందుఁ గొన్ని క్రియలకుఁ బెక్కురూపంబులు కానఁబడుచున్నవి:—(మొగుడునకు) మొగుడుచు, మొగుచు, మోడుచు, మొగిడించు; (పోవునకు) పుచ్చు, పనుచు, పంచు, పనుపు, అనుచు, అనుపు, అంపు.

---

## అవ్యయములు.

౧. లింగము, వచనము, పురుషము, విభక్తి, వీనిని బొందకుండు పదములు అవ్యయములు.

౨. లాక్షణికములు, ప్రతిపదోక్తములు, అని యవ్యయములు రెండువిధములు గలవి. శాస్త్రముచేత నిష్పన్నములైనవి లాక్షణికములు. పుట్టినవి పుట్టినట్లుండునవి ప్రతిపదోక్తములు.

౩. క్రియాజన్యములు, మొదలగునవి లాక్షణికములైన యవ్యయములు. తక్కినవి ప్రతిపదోక్తములు.

౪. క్త్వార్థకము, వ్యతిరేకక్త్వార్థకము, తుమున్నాద్యర్థకము, శత్రర్థకము, ఆనంతర్యార్థకము, చేదాద్యర్థకము, క్రియలవలనఁ గలిగిన యవ్యయములు.

౫. అగుధాతువు తుమున్నాద్యర్థకరూపమగు "కాన్" అనునది విశేషణములతోడఁ జేరి వానిని అవ్యయములఁ జేయును. అప్పుడు కవర్ణము యొక్క దీర్ఘమునకు హ్రస్వము వైకల్పికముగా నగును. చక్కఁగన్, చక్కఁగాన్; పుల్లగన్, పుల్లగాన్.

౬. పదముల నొండొంటితోఁ గలుపుటకు ఉపయోగింపఁబడు పదములు సముచ్చయము లనఁబడును. సముచ్చయములు రెండు.—యు, ను. ఇవి ద్రుతాంతములు. ఉకారాంతములమీఁద నువర్ణకమును, మిగిలినవానిమీఁద యువర్ణకమును వచ్చును— రాముఁడును. సత్యయు హరియు ద్వారకకు వచ్చిరి.

---

## ప్రతిపదోక్తములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| అంత | అదిగో | అమ్మచెల్ల | అకట | ఇదిగో | ఉవ్వెత్తు |
| అఁట | అద్దిర | అయ్యారె | ఆహా | ఇంచుక | ఊరక |
| అహహ | అనయము | అవుర | ఇఁక | ఇసీ | ఎంతయు |
| అక్కట | అమ్మకచెల్ల | ఆ! | ఇగో | ఉద్దవిడి | ఎట్టా |

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఎత్తిలి | ఓయి | కాఁబోలు | తద్దయు | బలా | హా |
| ఎప్పటి | ఓహో | కావున | తరమిడి | బళె | హుటాహుటి |
| ఎల్ల | కటకట | కొంతె | తర్వాత | బాపు | హోరాహోరి |
| ఏని | కట్టా | కోతె | తలా | బాపురె | అయ్యో |
| ఏల | కడు | క్రమ్మఱ | దనుక | మజ్ఝా | ఎట్టకేలకు |
| ఒండె | కద | గ్రక్కున | దాఁక | మఱి | ఎట్టకేని |
| ఒకో | కదా | గ్రమ్మన | నెఱిన్ | మిక్కిలి | హైఁసరి |
| ఒత్తిలి | కనుక | ఛీ | పదఁపడి | మిన్నక | హాఁహారి |
| ఓహో | కరము | చెఱి | పిదప | వెండియు | బోరన |
| ఓచెల్ల | కాని | చెల్లఁబో | పిమ్మట | వెండి | మొదలగునవి. |
| ఓటు | కాఁబట్టి | చేసి | బళి | పని | |

---

౧. ద్రుతప్రకృతికములు, కళలు అని పదము లన్నియు రెండు విధములు. ద్రుతమంతమందుఁ గలవి ద్రుతప్రకృతికములు. ద్రుతమంతమందు రానివి కళలు.

౨. ద్రుతప్రకృతికములు — ౧ ప్రథమ, కయు, యొక్క కాక మిగిలినవిభక్తులు — గిరినిఁ, దొరకుఁ, వనములఁ ; నాచేతన్, నీచేఁ, వానితోడన్, దానితోన్ ; మాకొఱకున్ ; మీవలనన్, తనకంటెన్ ; హరికిన్, మనకుఁ, శూరులయొపలఁ, నదులలోఁ ; గ్రహమునందున్, స్వర్గమునఁ. ౨. భూతతద్ధర్మార్థక ప్రథమపురుషైకవచనములు. — వచ్చెన్, వండున్, కొట్టెడున్, తిరిమెడిన్. 3. ఉత్తమపురుషైకవచనములు. — వినుచున్నాను, కంటిన్, చేయఁగలన్, నిలుతున్, అరిగెదన్, కనన్. ౪. ఆశీరాద్యర్థకములగు ఎను, తపర్ణకములు. — దగ్ధుఁడయ్యెడున్, మేలుఁగలుగుతన్, శుభంబగుఁగా

వృతన్. ౭. శత్రర్థకము — చనుచున్. ౮. తుమున్నాద్యర్థకము. — ఏగన్. ౭. అనంతర్యార్థకము. — తొలఁగుడున్. ౮. చేదాద్యర్థకము — వర్షించినన్. ౯. సముచ్చయములు — హరియున్, నేనునున్. ౧౦. తాను, నేను, మొదలగునవి. — తాఁజదివె, నేఁజెప్పితి, వలెన్, పోలెఁ, అయ్యుఁ. మొ.

౩. ద్రుతప్రకృతికములు కానివన్నియుఁ గళలు — రాముఁడు, వనము, వస్తువు, హరులు, బల్లిదునికయి, వారియొక్క, (విభక్తులు); చెప్పితివి, వచ్చుచున్నావు (మధ్యమపురుషక్రియలు); లేచిరి, వచ్చిరి, (రేఫాంతక్రియలు); కంటిమి, చేయుచున్నాము, (మాంతక్రియలు); చేసి, వినక, (క్త్వార్థకములు); చేయుచున్నాఁడు, చేయుచున్నది, కొట్టినవి, చేయఁగలదు, చేయఁగలఁడు, చేయఁగలరు, కొట్టఁడు, కొట్టదు, కొట్టవు, (వర్తమాన, భవిష్యత్, వ్యతిరేక, ప్రథమపురుషములు); ఇంచుక బాపురే, ఔర, కటకట, అపుడు, ఇపుడు, ఎపుడు, ఏమి, ఎ, ఏ, ఆ; కదా, ఊరక. మొ. (అవ్యయములు).

౪. వాక్యములతుదనుండు ద్రుతము వైకల్పికముగా లోపించును. — న్యాయమార్గంబున నడువవలయుఁ, నడువవలయు.

---

## సమాసపదములు.

౧. పెక్కుపదములుకూడి యొక్కపద మగునది సమాసం బనఁబడును—నలుగడలు, పాలకడలిపట్టి, రామలక్ష్మణభరతశత్రుఘ్నులు.

౨. సాంస్కృతికము, మిశ్రము, ఆచ్ఛికము, అని సమాసములు మూఁడువిధములు. సాంస్కృతికము, కేవలసంస్కృతపదములచేఁ గలిగినచో సిద్ధ మనఁబడును. — తటాకోదకము; తత్సమపదములచేఁ గలిగినచో సాధ్య మనఁబడును. — తటాకంబునుదకము. తత్సమముల

కును, అచ్చ తెనుఁగుపదములకును కలుగునది మిశ్రము.—శీటాకంబు నీరు, చెఱువునుదకము, కేవలము తెలుఁగుపదములకుఁ గలుగునది యాచ్ఛికము. — చెఱువునీరు.

౩. అవ్యయీభావము, తత్పురుషము, ద్వంద్వము, బహు వ్రీహి, అని సమాసములు నాలుగువిధములు.

౪. మొదటిపదము సర్థము ప్రధానముగాఁ గలది. యవ్యయీ భావము.—మధ్యేసముద్రము, మీఁగాలు, పెడతల.

౫. ఉత్తరపదము నర్థము ప్రధానముగాఁ గలది తత్పురు షము.—చోరభయము, దొంగయలజడి.

౬. సమానాధికరణము, వ్యధికరణము, అని తత్పురుషము ద్వివిధము. విశేష్య విశేషణముల సమాసము సమానాధికరణము; తక్కినది వ్యధికరణము.

౭. సమానాధికరణము—సంఖ్యావాచకము పూర్వపదముగాఁ గలది ద్విగుసమాసము.—త్రిలోకి, ముల్లోకములు, మూజ్జగములు.

౮. సంఖ్యావాచకము కానివిశేషణమునకు విశేష్యముతోడ సమాసముకర్మధారయము.-సరసవచనము, సరసపుమాట, దంటమాట.

౯. ఇందు, ౧. ఉపమానము పూర్వపదముగాఁ గలది యుప మాన పూర్వపదసమాసము. — చంద్రసుందరము, చిరుగుమోవి; ౨. ఉపమాన ముత్తరపదముగాఁ గలది యుపమానోత్తర పద సమాసము.—హస్తపద్మము, కేలుదమ్మి; ౩. అవధారణవాచకము పూర్వమందుఁ గలది యవధారణ పూర్వపదసమాసము. — నిశా కాంత, రేవెలది; ఇదియె రూపకసమాస మనఁబడును, ౪. నడిమి పదములోపించినది మధ్యమపదలోపి సమాసము—ఛాయాద్రుమము, జవ్వాజిసెట్టి.

౧౦. వ్యధికరణము.— ౧. ద్వితీయాతత్పురుషము.— కృష్ణ శ్రితుఁడు, పడగదాఁగి; ౨. తృతీయాతత్పురుషము.—మాసపూర్వము, నెలతక్కువవాఁడు; ౩. చతుర్థీతత్పురుషము. — యూపదారువు, దేవరమేలు; ౪. పంచమీతత్పురుషము. — చోరభయము, దొంగ యులుకు; ౫. షష్ఠీతత్పురుషము.—లక్ష్మీవల్లభుఁడు, లచ్చిమగఁడు; ౬. సప్తమీతత్పురుషము. — ఈశ్వరాధీనము, మాటనేర్పరి; ౭. నఞ్తత్పురుషము.—అజ్ఞానము.

౧౧. రెండుపదముల యర్థములును ప్రధానముగాఁ గలది ద్వంద్వసమాసము.—జననీజనకులు, తల్లిదండ్రులు.

౧౨. ఇతరపదార్థము ప్రధానముగాఁ గలది బహువ్రీహి సమాసము.—శీతకిరణుఁడు, చలివెలుఁగు.

౧౩. లుక్సమాసములు, అలుక్సమాసములు అని సమాసము లెల్ల ద్వివిధములు. విభక్తి లోపించునది లుక్సమాసము —వృక్షమూలము, చెట్టుమొదలు.

౧౪. సమాసమందు విభక్తి లోపించును. లకారము లోపింపదు.—గుణములప్రోక.

౧౫. విభక్తి లోపింపని దలుక్సమాసము. — వనేచరుఁడు, నీతోడిచెలిమి.

౧౬. సమాసమందు, చేత, తోడ, వలన, వీనియంత్య అకారమునకు ఇకారమును, అందునకు తుదను అలి యనునాగమంబును నగును.—నాచేతిపోరు, నీతోడినెయ్యము, నావలనితప్పు, నాయందలి దయ.

౧౭. సమాసములం దంతట ద్రుతమునకు లోపము గలుగును - ఎల్లయంశములు; ఎల్లకాలము. తలఁబ్రాలు మొదలగువానియం దీలోపము లేదు.—తలఁబ్రాలు, సేసఁబ్రాలు, ఊరఁబిచ్చుక.

---

## ప ద స ం ధు లు.

౧. పదము లొకటితో నొకటి చేరునపుడు కలుగు రూపభేదము సంధి యనఁబడును. అచ్సంధి, హల్సంధి, అని సంధి రెండు విధములు గలది.

## అ చ్సం ధి.

౨. మొదటిపదము తుదియచ్చు లోపించి యచట రెండవ పదము మొదలియచ్చు నిలుచుట అచ్సంధి యనఁబడును.— రాముఁడు+అతఁడు=రాముఁడతఁడు.

౩. దీర్ఘాచ్చులంతమునందుఁ గల పదములకును, ఇఁక మొదలగు వానికిఁ దప్ప ద్రుతప్రకృతికములకును, తఱుచుగా సంధిరాదు. సంధి వచ్చునప్పుడు ద్రుతము లోపించును. కిళాశబ్దములకు సంధిరానియెడల మొదటియచ్చునకుఁ బరమందు యకారమాగమముగా వచ్చును.— మా+ఇల్లు=మాయిల్లు, చూడన్+అయితి=చూడనయితి, నాకొ అక్క+ఇచ్చె=నాకొఅకిచ్చె.

## అ కా ర ము.

౪. అకారమునకు సంధి బహుళముగా వచ్చును.—మేన+అత్త=మేనత్త, మేనయత్త. బహుళ మనుటవలన స్త్రీవాచకములు, సంబోధనాంతములు, తత్సమములు, మొదలయిన వానికి సంధి రాదు.—నెలఁత+ఇచ్చెను=నెలఁత యిచ్చెను, రాముఁడ+ఇదిగో= రాముఁడయిదిగో, హంస+ఇది=హంసయిది.

౫. కర్మధారయమునందు, కొన్నిశబ్దములకు ఆలుశబ్దము పర మగునపుడు తుదను రేఫాగమమునచ్చును.—పేద+ఆలు=పేదరాలు, గొడ్డు+ఆలు=గొడ్డురాలు. తత్సమంబుల తుది యత్వంబున కుత్వం బగును.—ధీర+ఆలు=ధీరురాలు.

ఇకారము.

౬. మధ్యమపురుషక్రియలయందు ఇకారమునకు సంధి నిత్యము.—ఏలితివి+అతని=ఏలితివతని, కొట్టితిరి+అప్పుడు=కొట్టితి రప్పుడు.

౭. ఏమి మొదలగుశబ్దముల ఇకారమునకును, ప్రథమోత్తమ పురుషములయందలి ఇకారమునకును, సంధి*వికల్పముగా వచ్చును — ఏమి+అనెను=ఏమియనెను, ఏమనెను; వచ్చిరి+ఇప్పుడు=వచ్చిరి యిప్పుడు, వచ్చిరిప్పుడు; వచ్చితిమి+అప్పుడు=వచ్చితిమియప్పుడు, వచ్చితిమప్పుడు. ఏమి, మఱి, కిమ్మీ, అది, అవి, ఇది, ఇవి, ఏది, ఏవి, ఇవి, యేమి మొదలగునవి.

౮. తక్కినచోట్ల ఇకారమునకు సంధిరాదు.— వచ్చి+ ఇచ్చెను=వచ్చియిచ్చెను; హరి+అతఁడు=హరియతఁడు.

ఉకారము.

౯. ఉకారమునకు సంధి నిత్యముగా వచ్చును.—రాముఁడు+ ఎక్కడ=రాముఁడెక్కడ.

౧౦. ద్రుతప్రకృతికము లగు ప్రథమేతరవిభక్తులయందును, శత్రర్థకచువర్ణకమునందును గల ఉకారమునకు సంధి వైకల్పికముగా వచ్చును.—నన్నుఁ+అడిగెన్=నన్నడిగెఁ, నన్నునడిగెన్; మొ. చూచుచున్+ఉండెను=చూచుచుండెను, చూచుచునుండెను. నన్ను

* ఒకప్పుడువచ్చి యొకప్పుడు రాకపోవుట వికల్పము.

నిన్ను, తన్ను, మమ్ము, మిమ్ము, తమ్ము, లకు ద్విత్వలోపమున సంధి లేదు.—నను నేలె, మిము నడిగె.

౧౧. కర్మధారయమునందు ఉకారమున కచ్చు పరంబగు నపుడు పరమందు టకార మాగమముగా వచ్చును.—కఱకు+అమ్ము= కఱకుటమ్ము. కొన్ని చోట్ల నీయాగమము వైకల్పికము. — పేరు + ఉరము = పేరురము, పేరుటురము.

౧౨. ఉకారాంతసిద్ధర్మార్థక విశేషణములకును, షష్ఠీసమాసమునందు ఉకారాంత ఋకారాంతపదములకును, అచ్చు పరమగు నప్పుడు నకారమంతాగమముగా వచ్చును. —చేయు + అతఁడు = చేయునతఁడు, వచ్చెడు + ఆతఁడు = వచ్చెడువాతఁడు; మోము + అందము= మోమునందము , విధాతృ + ఆజ్ఞ=విధాతృనాజ్ఞ.

౧౩. వాక్యముల తుదనుండు ఉకారమునకు సంధిలేకుండుట యొకదోషముగాదు — సర్వతీర్థాభిగమనంబు సర్వవేద సమధిగమము సత్యంబుతో నమము గావు ఎఱుఁగు మెల్లధర్మములకుఁ.

౧౪. ఆమ్రేడితమందును * ఏమి మొదలగుశబ్దములు పరము లగునపుడును అన్ని అచ్చులకు సంధి నిత్యముగా వచ్చును. — ఆహా+ఆహా=ఆహాహా; పీసె+ఎడు=పీసెడు; తాటి+ఆకు=తాటాకు.

## హల్సంధి.

౧౫. ప్రథమమీఁది క, చ, ౘ, ట, త, ప, లకుఁ గ్రమముగా, గ, స, స, డ, ద, వ, లు వికల్పముగానగును.— వాఁడు + కొట్టె=వాఁడు గొట్టె, వాఁడు కొట్టె; అతఁడు + చేరె=అతఁడు సేరె, అతఁడు చేరె; ఇతఁడు + ౘనియె=ఇతఁడు ననియె, ఇతఁడు ౘనియె;

* ఆమ్రేడితమనఁగా రెండుమారు లుచ్చరింపఁబడుమాట.

వీఁడు+టక్కరి=వీఁడు డక్కరి, వీఁడు టక్కరి; ఆమె+తగవరి=ఆమె దగవరి, ఆమె తగవరి; అది+పలికె=అది వలికె, అది పలికె.

౧౬. ద్వంద్వసమాసమునందు పరపదమునందు క, చ, చ, ట, త, ప, లకుఁ గ్రమముగా, గ, స, స, డ, ద, వ, లు నిత్యముగా నగును.— కూరగాయలు, కాలుసేతులు, టక్కుసొక్కులు, సంపుడొం వులు, అన్నదమ్ములు, ఊరువల్లెలు.

౧౭. తెలుఁగుశబ్దములమీఁది సాంస్కృతిక పరుషములకు గ, స, డ, ద, వ, లు రావు—అనఁగు చక్రి, వాఁడు కిరీటుఁడు. మొ.

౧౮. ద్రుతప్రకృతికములమీఁది, క, చ, చ, ట, త, ప, లకుఁ గ్రమముగా గ, జ, జ, డ, ద, బ, లు నిత్యముగానగును. అప్పు డాద్రుతమునకు బిందువుగాని సంశ్లేషము* గాని స్వత్వము† గాని వచ్చును. — చూచెన్+కమలము=చూచెఁగమలము, చూచెంగమలము, చూచెన్గమలము, చూచెనుగమలము; వచ్చెన్+చక్రి=వచ్చెఁజక్రి, వచ్చెంజక్రి, వచ్చెన్జక్రి, వచ్చెనుజక్రి; ఏగెన్+చాన=ఏగెఁజాన, ఏగెంజాన, ఏగెన్జాన, ఏగెనుజాన; పూనెన్+టక్కు=పూనెఁడక్కు, పూనెండక్కు, పూనెన్డక్కు, పూనెనుడక్కు; విచ్చెన్+తమ్మి=విచ్చెఁదమ్మి, విచ్చెందమ్మి, విచ్చెన్దమ్మి, విచ్చెనుదమ్మి; పూచెన్+పద్మము = పూచెఁబద్మము, పూచెంబద్మము, పూచెన్బద్మము, పూచెనుబద్మము.

౧౯. ద్రుతమునకు పరుషవర్ణముగాని స్థిరవర్ణముగాని పరమగు నప్పుడు లోపముగాని, సంశ్లేషముగాని, స్వత్వముగాని వచ్చును.—

* సంశ్లేష మనఁగా మీఁది హల్లుతోఁ గూడుకొనుట.

† ద్రుతముయొక్క పెంపదలిరూపము స్వత్వమనఁబడును. అది నుకర్ణకము.

వచ్చెన్ + గజము=వచ్చెఁ గజము, వచ్చెన్గజము, వచ్చెనుగజము;
తెచ్చెన్ + ఖడ్గము=తెచ్చెఖడ్గము, తెచ్చెన్ఖడ్గము. తెచ్చెనుఖడ్గము.

౨౦. సమాసమందు ఉకారాంతములగు స్త్రీసమశబ్దములకును, (మువర్ణకమునకు కాదేశము గావచ్చు) వు, ంవు, వర్ణకములకును, పరుషసరళములు పరము లగునప్పుడు ద్రుతమంతాగమముగావచ్చును. అప్పుడు ద్రుతప్రకృతికముల కెట్లట్లస్వత్వముదక్క తక్కినరూపములు వచ్చును, — చిగురు+కయిదువు=చిగురుఁగయిదువు, చిగురుంగయిదువు, చిగురున్గయిదువు; సరసవు+గుణము=సరవున్గుణము. ఇచట ద్రుతమునకు లోపంబురాదు. ఈయాగమము తనవర్ణకము పరమగునప్పుడు అకారాంతవిశేషణములకును వచ్చును — తెల్ల + తనము = తెల్లఁదనము, తెల్లందనము, తెల్లన్దనము.

౨౧. పడు మొదలైనవి పర మగునప్పుడు మువర్ణమునకు లోపముగాని పూర్ణబిందువుగాని వికల్పము గావచ్చును — భయము + పడు=భయపడు, భయంపడు, భయముపడు. పడు, పెట్టు, పట్టు, పఱచు, ఇవి పడు మొదలైనవి.

౨౨. ప్రార్థనార్థక మధ్యమపురుష మువర్ణకమునకు హల్లు పరం బగునపుడు వైకల్పికముగా లోపముకలుగును. — చూడుము + రాముని=చూడురాముని, చూడుమురాముని. చూడకుము+నన్ను= చూడకునన్ను, చూడకుమునన్ను.

౨౩. అను పరమగునపుడు విసర్గమునకు లోపముగలుగును.— త్వమేవగతిః+అనియె=త్వమేవగతియనియె.

౨౪. అనుకరణంబునఁ గడహల్లునకు ద్విత్వ మగును. — పాయాత్+అని=పాయాత్తని. అహమాదిశబ్దముల మకారమునకు ద్విత్వము వైకల్పికము. — దాసోహమ్+అనియె=దాసోహమ్మనియె, దాసోహమనియె.

౨౫. అనుకరణమందు ఉకారాంత నామములకు వుకారం బంతాగమం బగును. — ఇయంధేనుః+అని=ఇయంధేనువని.

పదపరిచ్ఛేదము సంపూర్ణము.

---

## వాక్యపరిచ్ఛేదము.

౧. ఒకక్రియతో నన్వయించుపదసముదాయము వాక్య మనఁబడును. (అనఁగా, కర్తృకర్మ క్రియలకూడికచే సంపూర్ణమైనయర్థము గలుగు పదసమూహము వాక్యము అని యర్థము.) — రాముఁడు రావణుని సంహరించెను. వాక్యములనుగూర్చి చెప్పునది వాక్య పరిచ్ఛేదము.

౨. సకర్మక ప్రయోగమునందు, (కర్త, కర్మము, క్రియ,) మూఁడును, అకర్మక ప్రయోగమునందు, (కర్త, క్రియ,) రెండును, వాక్యమునకు అవయవము లుండును.

| ప్రయోగము. | కర్త. | కర్మము. | క్రియ. |
|---|---|---|---|
| సకర్మకము.<br>అకర్మకము. | వాఁడు.<br>వాఁడు. | సత్యమును. | పలుకుచున్నాఁడు.<br>నవ్వెను. |

3. క్రియ లేనివాక్యమును ఉండును. — వచ్చినవాఁడు ఫల్గునుఁడు. (అయిన నిట్టిచోట్లఁ గ్రియయధ్యాహారమై యుండును.)

౪. ప్రతి అవయవమునందును భాగము లనేకము లుండ వచ్చును.—

| కర్త. | కర్మము. | క్రియ. |
|---|---|---|
| యోగ్యుఁడగు | పాపమూలమైన | ఎప్పుడును |
| పురుషుఁడు, | కల్లను | పలుకఁడు. |

[తఱుచుగా విశేషణములును వానితో నన్వయించు నవ్యయములును కర్తృ కర్మలకును, అవ్యయాదులు క్రియలకును, అంగములై యుండును.]

౫. ఒకవాక్యమునందు విశేషణము, విశేష్యము, మొదలగు వానితోఁ దుల్యముగ నుండు వాక్యమునకు ఉపవాక్యమని పేరు—ఎవఁడు మంచివాఁడుగా నుండునో వాఁడు గౌరవమును బడయును.

[పై వాక్యమునందు "ఎవఁడు మచివాఁడుగా నుండును" "వాఁడు గౌరవమును బడయును" అను రెండువాక్యములు గలవు. వానిలో మొదటిది మంచి యనువిశేషణముతోఁ దుల్యము కావున నుపవాక్యము; రెండవది ప్రధానవాక్యము.]

౬. సమాపకక్రియతో నన్వయించు పదసముదాయము సంపూర్ణవాక్య మనియు, అసమాపకక్రియతో నన్వయించు పదసముదాయము అసంపూర్ణవాక్యమనియు, చెప్పఁబడును.

౭. సామాన్యవాక్యములు, సంశ్లిష్టవాక్యములు, ద్వంద్వవాక్యములు, అని వాక్యములు మూఁడువిధములు.

౮. ఒక్కక్రియనుమాత్రము గలిగియుండు సంపూర్ణవాక్యము సామాన్యవాక్య మనఁబడును.—సూర్యుఁడుదయించెను.

౯. అసంపూర్ణవాక్యముతోఁగాని, ఉపవాక్యముతోఁగాని, కూడియుండు సంపూర్ణవాక్యము సంశ్లిష్టవాక్య మనఁబడును. సూర్యుఁ

డుదయించి పద్మములు వికసించెను; ప్రపంచము నెవఁడు సృజియించెనో మూఢుఁ డెఱుఁగఁడు.

౧౦. సముచ్చయాదికముచేఁ గలుపఁబడిన రెండుమూడు సంపూర్ణవాక్యములుగల వాక్యము ద్వంద్వవాక్య మనఁబడును.—వాఁడు సత్యమునే పలికెనుగాని జను లాతనిమాటలను విశ్వసించినవారు కారు. దీనినేమహావాక్య మందురు.

౧౧. వాక్యమునందలి పదములకుఁ గల పరస్పరసంబంధము అన్వయ మనఁబడును. సమానాధికరణాన్వయము, వ్యధికరణాన్వయము, అని యన్వయము ద్వివిధము.

౧౨. పదములకు లింగ, వచన, విభక్తి, పురుషములయందైకమత్యము గల యన్వయము సమానాధికరణాన్వయము; అట్టి యైకమత్యము లేనిది వ్యధికరణాన్వయము.

---

## సూత్రములు.

### విశేష్యము.

౧. "యొక్క" తప్ప విభక్తులన్నియుఁ గ్రియలతో నన్వయించును.—రాముఁడు సీతతోఁ గొలువుండెను.

౨. సంబోధన ప్రథమతక్క ప్రతిప్రథమయు నొకక్రియను బొందియుండును.—రాముఁడువచ్చెను. [ఇచట "రాముఁడు" అనునది "వచ్చెను" అను క్రియను బొందును.] ఈప్రథమయే కర్త యనఁబడును. ఒకానొకప్పుడు క్రియాపదములోపించియు నుండవచ్చును—వాఁడు యోగ్యుఁడు (గానున్నాఁడు)

౩. ప్రతిక్రియయొక్క కర్మమును ద్వితీయావిభక్తియం దుండవలయును.—రాముఁడు రావణునిఁ జంపెను. [ఇచట "చంపెను"

అనుక్రియకుఁ గర్మము కావున "రావణుని" అనునది ద్వితీయావిభక్తిగా నున్నది.]

౪. అచేతన వాచకము కర్మమైనప్పు డది వైకల్పికముగాఁ బ్రథమ యగును. రాముఁడు రథమెక్కెను; రాముఁడు రథము నెక్కెను.

౫. కర్త్రర్థక ప్రయోగమునఁ గర్తకు చేత వర్ణకము వచ్చును—రామునిచేత రావణుఁడు చంపఁబడియెను. కరణార్థమందును, హేత్వర్థ మందును, చేత, చేవర్ణకములును, సహార్థకమందును, తుల్యార్థకమందును, తోడ తో వర్ణకములును వచ్చును.—గొడ్డలిచేతఁ జెట్టునరకెను (కరణార్థము); విద్యచేఁ గీర్తికలుగును. (హేత్వర్థకము); రాజు సేనలతోడవచ్చె (సహాయార్థకము); పిరికివాఁడు స్త్రీతో సమానుఁడు (తుల్యార్థకము).

౬. సంప్రదానమున కొఱకు వర్ణకము వచ్చును—జనకుఁడు రామునికొఱకు సీతనిచ్చెను. ఇచట షష్ఠియు నగు.—జనకుఁడు రామునికి సీతనిచ్చె.

౭. అపాదానార్థమున వలన వర్ణకమును, నిర్ధారణార్థకమున కంటె వర్ణకమును, వచ్చును.—చెట్టువలన ఫలము పడెను; అపకీర్తి కంటె చావుమంచిది.

౮. సంబంధార్థకమున యొక్క వర్ణకంబును, నిర్ధార ణార్థకమున లోపల, లో, వర్ణకములును వచ్చును.—విప్రునియొక్క గృహము; బాలురలో సోమరి చెడిపోవును.

౯. అధికరణార్థమున అందు, న, వర్ణకములు వచ్చును.—రోసలయందు దయయుండవలయును, పాత్రమున నీరున్నది.

## విశేషణము.

౧౦. విశేషణములు విశేష్యములతోడను, సర్వనామములతోడను, అన్వయించును.—మంచిరాముఁడు.

౧౧. విశేషణములు వానివిశేష్యములతోడ సమానములగు లింగ విభక్తి వచనములఁ గలిగియుండ వలయును.—రాముఁడు యోగ్యుఁడు; సీత యోగ్యురాలు; పాటుపడుట యోగ్యము; వారు యోగ్యులు; యోగ్యుల బాలుర మెచ్చుకొందును.

౧౨. షష్ఠ్యంత విశేషణములకు వికల్పముగాఁ బ్రథమ వచ్చును.—గుణాభిరాముఁడు రామునకు వందనము చేసెద; గుణాభిరామునకు రామునకు వందనము సేసెద.

౧౩. స్త్రీసమములగుగాని, మువర్ణాంతములగుగాని విశేషణముల బహువచనమునకు వైకల్పికముగా నేకవచనం బగును.—పెక్కులు మాటలేల? పెక్కుమాటలేల? వానిచర్యలు చిత్రముగా నున్నవి; వానిచర్యలు చిత్రములుగా నున్నవి.

౧౪. అగుధాతువువలనఁ బుట్టిన విశేషణములచే వ్యవధానము చేయఁబడినట్టి కాని, సముచ్చయములచేఁ గలుపఁ బడినట్టికాని విశేషణములకుఁ బ్రథమ వచ్చును.—శూరుఁ డగు రామునిచే రావణుఁడు చంపఁబడెను; యోగ్యుఁడును ధీరుఁడునగు రామునికొఱకు జనకుఁడు కన్యనిచ్చెను.

౧౫. ఏకవచనమునందుండు రెండుమూఁడు విశేష్యముల విశేషణమునకు బహువచనంబగును.—పూజ్యులగు రాముఁడును గృష్ణుఁడును విచ్చేసిరి.

౧౬. ఒకానొకచోఁ బులింగ విశేషణములు కొన్ని నపుంసకసమములై యుండును. అందమైన మనుష్యుఁడు, సుందరమైనపురుషుఁడు.

సర్వనామము.

౧౭. సర్వనామములు తాముచెందు విశేష్యములతోడఁగాని, సంబంధించు నితరసర్వనామములతోడఁగాని సమానములగు లింగ వచనములను గలిగి యుండవలయును.—ఆబాలుఁడు మంచివాఁడు; వాఁడు కల్లలాడఁడు. సీత మిగులసుకుమారి; అయిన నామె వనవాసము చేసెను. మునులు కోపముగలవారు; కారణము లేక వారితరులను శపింతురు. ఎవఁడుధీరుఁడో వానినిబహుమానించెద. ఎవరుయోగ్యులో వారికి మేలుకలుగును. ఎవతె కష్టపడునో యామెసౌఖ్యమనుభవించును.

౧౮. వాక్యమునకు సహితము మాఱుగా సర్వనామము వాడఁబడును.—సత్రాజిత్తు కూఁతు శతధన్వున కీయకపోయెను. దానంజేసి వాఁడు సత్రాజిత్తునంతంబు నొందించె.

క్రియ.

౧౯. ప్రతిక్రియయుఁ గర్తతో నన్వయించును.—వాఁడు నడిచెను. సకర్మక్రియలు కర్మలతోడఁ గూడ నన్వయించును.—వాఁడు గుఱ్ఱము నెక్కెను.

౨౦. కొన్ని క్రియలకుఁ గర్మములు రెండుండును. అట్టివానికి ద్వికర్మకములని పేరు.—నిన్నొకమాటి వేఁడెదను; వారు రిపుల నాపద బెట్టిరి.

౨౧. జనులు కర్తలగునప్పుడు కర్త వైకల్పికముగా లోపించును.—వానకురియు నని చెప్పుదురు.

౨౨. ప్రతిక్రియయుఁ దనకర్తతోడ సమానమైన లింగ పురుష వచనములను గలిగియుండవలయును.—నేను కొట్టుచున్నాను; మేము కొట్టుచున్నాము; నీవు కొట్టుచున్నావు; మీరు కొట్టితిరి; వారు కొట్టిరి; వాఁడు కొట్టెడు; ఆమె కొట్టును.

౨౩. సముచ్చయములచే నొకటిగాఁ జేర్పఁబడిన కర్తలక్రియ బహువచనమునందుండవలయును.—రాముఁడును హరియు వచ్చిరి.

౨౪. ఏని, ఒండె, కాని మొదలగు వికల్పార్థములతోడఁ గూడిన కర్తలక్రియ యేకవచనంబగును.—తండ్రియేని కొడుకేని వచ్చును. మధ్యమోత్తమపురుషములతోఁ గూడినచో బహువచనమే వచ్చును.—రాముఁడొండె నీవొండె మడియుదురు; నేనుగాని వాలి గాని జయింతుము.

౨౫. అనేక మహదమహత్తులు కర్తలగునపుడు క్రియ కడ కర్తకుందగియుండును.—గుఱ్ఱమును రాతును వచ్చిరి. రాతును గుఱ్ఱమును వచ్చెను.

౨౬. తానుశబ్దముతోఁ గూడినపుడు కర్తలు పెక్కులయ్యును గ్రియ యేకవచనమునందే యుండును.—రాముఁడు తాను లక్ష్మణుఁడును సీతయు రథమెక్కెను.

౨౭. ప్రథమమధ్యమపురుషములు కర్తలగునపుడు మధ్యమ పురుషముతోడను, మధ్యమోత్తమపురుషములు కాని ప్రథమమధ్య మోత్తమపురుషములు మూఁడును గాని కర్తలగునపు డుత్తమపురు షముతోడను, క్రియసంబంధించియుండవలయును — వాఁడును నీవును వచ్చితిరి; నీవును నేనును వచ్చితిమి; వాఁడును నేనును వచ్చితిమి; వాఁడును నీవును నేనును వచ్చితిమి.

౨౮. వాక్యము కర్తయగునపుడు క్రియ యేకవచనమునం దుండును.—ఈవృత్తు మెట్లుద్భవించెనో తెలియదు.

౨౯. పూజార్థమునఁ గర్తలకట్ల క్రియలకును ఏకవచనము బహువచనమగును.—మదీయగురు లిప్పుడ చనుదెంతురు. (మదీయ గురు విప్పుడ చనుదెంచునని యర్థము)

౩౦. వాక్యములలోని రెండువ్యతిరేకక్రియ లొకభావ క్రియ తోడ సమాసము లగును. — వాఁడుకొట్టకపోలేదు (= వాఁడుకొట్టెను)

౩౧. అనేకక్రియ లేకకర్తతో నన్వయించునప్పుడు కడక్రియ తప్ప మిగిలినవి క్త్వార్థకములుగానుండును. — రాముఁడు కపిసేనలను గూడి, వారిధిదాఁటి, లంకఁజొచ్చి, రావణుని సంహరించెను.

౩౨. ఏక కాలమందలి వ్యాపారములను దెల్పుక్రియలనేకములు భిన్నములైనకర్తలతో నన్వయించినఁ గడదానికిఁ దక్క మిగిలిన వానికి తుమున్నర్థక రూపము వచ్చును. — చిలుకలుకూయఁ, దుమ్మెదలుమ్రోయఁ, గోయిలలు రొద సేయ, మరుఁడు వెడలెను.

## అవ్యయము.

౩౩. అవ్యయములు క్రియలతోడను, విశేషణములతోడను, ఇతరావ్యయములతోడను, అన్వయించును: — వాఁడుమిక్కిలినడచును; వాఁడు మిక్కిలి మంచివాఁడు; వాఁడు మిక్కిలి చక్కఁగాఁ జదువును.

౩౪. సముచ్చయములచేత నొకటిగాఁ జేర్పఁబడిన విశేష్యములును సర్వనామములును ఒక్కవిభక్తి కలవిగా నుండవలయును:— హరియును రాముఁడును వచ్చిరి; శివునియొక్కయుఁ గేశవుని యొక్కయు గుణములను శేషుఁడును వర్ణింపఁజాలఁడు.

౩౫. కొన్నిపదములఁ దక్క వాక్యమునం దన్నిపదములను మనస్సువచ్చినచోటం బ్రయోగింపవచ్చును. — ఉపాధ్యాయుఁడు బాలురను కఠినముగాఁ గొట్టెను; బాలుర నుపాధ్యాయుఁడు కఠినముగాఁ గొట్టెను. కఠినముగా బాలుర నుపాధ్యాయుఁడుగొట్టెను; కఠినముగా నుపాధ్యాయుఁడు బాలురనుగొట్టెను, మొదలగునవి.

వాక్యపరిచ్ఛేదము సంపూర్ణము.

## శబ్దాతిదేశము.

ఒకవాక్యమునందలి పదముల సంబంధనిరూపణము చేయు విధము శబ్దాతిదేశ మనఁబడును.

(వాక్యము.)

"ఒకమంచిబాలుఁడు బడికిఁ జని పాఠములను మిక్కిలి క్రమముగాఁ జదివెను; కాఁబట్టి వానికి బహుమతి దొరకెను"

ఒక — సంఖ్యార్థకవిశేషణము, బాలుఁ డనువిశేష్యముతో నన్వయించును.

మంచి—గుణవిశేషణము, బాలుఁడు అను విశేష్యముతో నన్వయించును.

బాలుఁడు—విశేష్యము, మహదర్థకము, ఏకవచనము, ప్రథమావిభక్తి, చదివె ననుక్రియకుఁ గర్త.

బడికిఁ—విశేష్యము, అమహదర్థకము, ఏకవచనము, షష్ఠీవిభక్తి, చని యనుక్రియతో వ్యధికరణాన్వయముఁ జెందును.

చని — క్రియ, చనుధాతువు, అకర్మకము, అసమాపకము, క్త్వార్థకమైనయవ్యయము, బాలుఁ డనుకర్తతో నన్వయించును.

పాఠములను — విశేష్యము, అమహదర్థకము, బహువచనము, ద్వితీయావిభక్తి, చదివె ననుక్రియకుఁ గర్మము.

మిక్కిలి — అవ్యయము, క్రమముగాన్ అను మఱియొక యవ్యయముతో నన్వయించును.

క్రమముగాన్ — అవ్యయము, చదివెను అనుక్రియతో నన్వయించును.

చదివెను — క్రియ, చదువుధాతువు, సకర్మకము, కర్త్రర్థక ప్రయోగము, సమాపకము, స్వార్థకము, భూతకాలము, ప్రథమపురుషము, పుంలింగము, ఏకవచనము, బాలుఁ డనుకర్తతోడను పాఠముల నను కర్మముతోడను నన్వయించును.

వానికిన్ — పురుషబోధకసర్వనామము, ప్రథమపురుషము, మహదర్థకము, ఏకవచనము, షష్ఠీవిభక్తి, బాలుఁడను విశేష్యమునకు మాఱుగా నుపయోగింపఁబడినది.

బహుమతి — విశేష్యము, అమహదర్థకము, ఏకవచనము, ప్రథమావిభక్తి, దొరకెననుక్రియకుఁ గర్త.

దొరకెను — క్రియ, దొరకుధాతువు, అకర్మకము, సమాపకము, స్వార్థకము, భూతకాలము, ప్రథమపురుషము, నపుంసకలింగము, ఏకవచనము, బహుమతి యనుకర్తతో నన్వయించును.

---

## కావ్యపరిచ్ఛేదము.

౧. దోషరహితములును, అలంకారసహితములును, అగు వాక్యసమూహము కావ్య మనఁబడును. కావ్యములను గూర్చి చెప్పునది కావ్యపరిచ్ఛేదము.

౨. కావ్యదోషములు మూఁడువిధములు. ౧. పదదోషములు, అపశబ్దము, నిరర్థకము, అప్రయోజనము, శ్రుతికటువు, ఛందోభంగము, మొదలగునవి. ౨—వాక్యదోషములు—ప్రక్రమభంగము, అధిక పదికము, పునరుక్తి, విసంధి, హీనోపమము, మొదలగునవి. ౩.—అర్థదోషములు, —వ్యర్థము, సంశయము, విరుద్ధము, నేయార్థము, క్లిష్టగూఢార్థము, మొదలగునవి.

౩. అలంకారములు రెండువిధములు,—శబ్దాలంకారములు, అర్థాలంకారములు.

## శబ్దాలంకారములు.

౧. అనుప్రాసము.—మున్నుగొన్న వర్ణమునే పలుమాఱు నుడివిన, అనుప్రాస మగును. — అక్కఱటిపక్కి నిక్కంబ మన దిక్కునకు వచ్చునే నొక్కుముక్కు పోటునం జక్కడంచెద.

ర్గము, పొల్లుహల్లు, వీనిని గూడిన వర్ణములును, సంయుక్తాక్షరమునకు ముందుండు వర్ణములును, గురువులు. గ, ఇది గురువునకుసంజ్ఞ.

3. లఘువులు:—తక్కినవి లఘువులు. ల, ఇది లఘువునకు సంజ్ఞ.

U, ఇట్లు బాలచంద్రునివిధమున వ్రాసిన గురువనియు, I, ఇట్లు నిడుపుగీత లాగున వ్రాసిన లఘువనియు గ్రహింపవలెను.

U I I U U I I U I U I I U U I
[రా ముఁ డు సిం హా స న మె క్కి న్యా య ము గన్ భూ మి
U U I I I I U I I I U U I I
పా లిం చి ప్ర జ ల దుః ఖ ము లఁ బోఁ గొ ట్టె ను.]

౪. నిసర్గగణములు, ఉపగణములు, అని గణములు రెండు విధములు.

౫. నిసర్గగణములు—ఇవి మూఁడేసి యక్షరములవలనఁ గలుగును. అందు, మూడుగురువులు మగణము, ఆదిగురువు భగణము, మధ్యగురువు జగణము, అంత్యగురువు సగణము, మూడులఘువులు నగణము, అది లఘువు యగణము, మధ్యలఘువు రగణము, అంత్యలఘువు తగణము:—

| | |
|---|---|
| U U U<br>శ్రీ రా మా, మగణము. | I I I<br>మె లఁ గు, నగణము. |
| U I I<br>నీ క డ, భగణము | I U U<br>మహాత్ముల్, యగణము |
| I U I<br>దు రం బు, జగణము, | U I U<br>సౌఖ్యమున్, రగణము. |
| I I U<br>గ మ ర న్, సగణము. | U U I<br>శైలేంద్రు, తగణము. |

౬. ఉపగణములు:—సూర్యగణములు, ఇంద్రగణములు, ఉపగణములలో ముఖ్యములు. సూర్యగణములు రెండు; ఇంద్రగణము లాఱు:—

౧. సూర్యగణములు.

| | |
సు ఖ ము, నగణము.

U |
పొందు. గలము.

ఇందు గలమును హాగణ మనియు వాడుదురు. ఈలాగుననే లగము నకు వగణమని పేరు.

౨. ఇంద్రగణములు.

| | | |
న ర స ఖు, నలము.

| | | U
గు ణ ము లన్, నగము.

| | U |
ప లు మా ఱు, సలము.

U | |
మా ను లు, భగణము.

U | U
ప్రే మ తో, రగణము.

U U |
వ ర్ణిం త్రు. తగణము.

౭. యతిప్రాసములు:— పద్యపాదము మొదటివర్ణము యతి; రెండవవర్ణము ప్రాసము. యతి ప్రతిపాదమునకు వేఱువేఱుగా నుండును. ప్రాసము పాదములకెల్ల నొకటిగా నుండును. ఆయాపాదములందుండు మొదటివర్ణముతో మైత్రిగల వర్ణ ముండుచోటు యతిస్థానమనఁబడును.

౮. యతి:— యతికి స్వరము ప్రధానము. అచ్చులలో, అ ఆ ఐ, ఔ లును; ఇ, ఈ, ఋ, ౠ, ఎ, ఏ లును; ఉ, ఊ, ఒ, ఓలును,

తమలోఁ దాము మిత్రములు. హల్లులలో, క, ఖ, గ, ఘ, లును; చ, చ, ఛ, జ, జ, జ, ఝ, శ, ష, స, లును; ట, ఠ, డ, లును; త, థ, ద, ధ, లును; ప, ఫ, బ, భ, వ, లును; య, హ, లును; తమలో దాము మిత్రములు. ఈవ్యంజనములును స్వరమైత్రిఁ జెందియే యొండొంటికిఁ బనికివచ్చును.

౯. ప్రాసము:— ప్రాసమునకు వ్యంజనమైత్రి ముఖ్యము. కాఁబట్టి యేయచ్చుతోఁ గూడినను బనికివచ్చును. ఒకపాదమున సంయుక్తాక్షరమున్న నన్నిపాదముల నాసంయుక్తాక్షరమే యుండవల యును. ప్రాసాక్షరములకు ముందువర్ణములు సర్వత్ర గురువులుగానైనను, లఘువులుగానైనను, ఉండవలయును.

౧౦ పద్యములు:— వృత్తములు, జాతులు, ఉపజాతులు, అని పద్యములు మూఁడువిధములు.

## ౧. వృత్తములు.

౧. ఉత్పలమాల:— భ, ర, న, భ, భ, ర, వ, గణములును, పదియవయక్షరము యతియును గలనాలుగుపాదములు గలది యుత్పల మాల:—

"కొండని వేడ్కతోఁ బసిఁడి ♦ కొండ ధనార్థులకెల్లఁ బంచి యీ
కుండుట దానధారకుఁ బ ♦ యోనిధులెల్ల వ్యయింపలేమి యీ
రెండపకీర్తులం దల ధ ♦ రించినవాఁడు ప్రధానశీలుఁ డా
తం డిరువాగుగా మునికిఁ ♦ దార్చిన వెంద్రుక లన్నిమంబునన్."

౨. చంపకమాల:— న, జ, భ, జ, జ, జ, ర, గణములును, పదునొకండవ యక్షరము యతియును గల నాలుగుపాదములు గలది చంపకమాల:—

"చెలువము నెల్లఁ బ్రోవుగను • జేసి ప్రవీణత నంబుజంబులన్
నలువ సృజింప రేలవిక • నద్యుతిహీనము లౌటఁ గ్రమ్మఱం
గలువలఁ జేనిఁ జేసినఁ బ • గల్రుచిహీనమఁ డతండు నాటఁగా
గలికి మొగంబు రేవగలు • కాంతి దనర్పఁగఁ జేసె నిమ్మహిన్."

౩. మత్తేభవిక్రీడితము:—స, భ, ర, న, మ, య, వ, గణములును, పదునాలవయక్షరము యతియును గల నాల్గుపాదములఁ గలది మత్తేభవిక్రీడితము:—

"నతియూరుద్యుతిఁ జెందఁ బూని నిజదు • శ్చర్మావనోదక్రియా
రతిఁ బాథోలవపూరితోదరములై • రంభేభహస్తంబు లు
న్నతజిన్ వీడె మరుద్విభూతిఁ గదళిం • ద్వగ్దోష మాచంచలో
ద్ధతశుండాతతిఁ బాయదయ్యె నదెపో • తద్వైరమూలం బిలన్."

౪. శార్దూలవిక్రీడితము:—మ, స, జ, స, త, త, గ, గణములును, పదమూడవ యక్షరము యతియును గల నాలుగుపాదములఁ గలది శార్దూలము:—

"పున్నాగంబుల గెల్చు బాలగమనం • బున్నాభిశావర్తముం
బున్నాగంబుల గెల్చు నీలరుచులం • బొల్పారు రోమాళియుం
బున్నాగంబుల గెల్చు నవ్వికసితాం • భోజాక్షి ప్రాపైనచోఁ
బున్నాగంబుల గెల్చు లేమియరుదా • పుష్పాప్తిఁ దూహింపఁగన్."

౫. మత్తకోకిల:—ర, స, జ, జ, భ, ర, గణములును, పదునొకండవ యక్షరము యతియును గలది మత్తకోకిల:—

"పుత్రి యట్లగునన్మ శోకము • బొంది కుందుచునున్న నీ
గాత్ర మొండొకకీడు పాటిలఁ • గందుఁ బాండుతనూభవుల్
పుత్రవర్గము చన్నచో నెద • భూరిశోకముఁ బొందరే
పాత్రహీనతఁ బడ్డ కుంతికి • బాయ నేర్చునె నెవ్వగల్."

౬. మాలిని:—న, న, మ, య, య, గణములును తొమ్మిదవ యక్షరము యతియును గలది మాలిని:—

"కథితశుభచరిత్రా ♦ గ్రావకన్యాకళత్రా
మథితవిమతగోత్రా ♦ మానిసంస్తోత్రపాత్రా
ప్రథనదితిజజైత్రా ♦ భక్తచిత్తాబ్జమిత్రా
పృథులధవళగాత్రా ♦ భీకరోగ్రాగ్నినేత్రా."

౨. జాతులు

౧. కందము:—కందమునకుఁ బ్రథమతృతీయ పాదముల మూఁడేసిగణములును, ద్వితీయచతుర్థపాదముల నయిదేసిగణములును, ఉండును. గగము, నలము, భ, జ, స, గణములువచ్చును. వీనిలో బేసిని జగణమురాదు. ద్వితీయ చతుర్థపాదముల మూఁడవ గణము నల జగణములలో నొకటిగాను, నాలుగవగణము మొదటియక్షరము యతిగాను, కడపటియక్షరము గురువుగాను, ఉండవలయును:—

"అకలుషనీలిమ నాక
న్యకచమునకు నోడి పాఱి ♦ నవిన్నై తేఁటుల్
మకరందార్థము తలుచుగ
వికచము లగుపుష్పములకె ♦ వెదకుచు నేగున్."

౨. ఉత్సాహ:—ఏడుసూర్యగణములు, ఒకగురువు, ఐదవ గణము మొదటి యక్షరము యతియు, కలది యుత్సాహ:—

"తనయుఁగాచుపనికిఁ బూని ♦ ధర్మపుత్రవాయునం
దనులుఁ గవలుఁ జేయఁగలుగు ♦ దండిమగలు నేనలం
గాని వడిం గడంగ సరకు ♦ గొనక నిలిచి యొక్కఁడుం
జెనఁగి యాఁగె సైంధవుండు ♦ బిరుదు దక్షుఁడుం గదే."

3. ఉపజాతులు.

౧. తేటగీతము.—సూర్యగణ మొకటి, ఇంద్రగణములు రెండు, సూర్యగణములు రెండు, నాలుగవగణము మొదటియక్షరము యతియు, కలది తేటగీతము.—

"నీవు చదివింతు వనుచు న ♦ న్ని యును విడిచి
బిచ్చ మెత్తంగరాదుగా ♦ బేలతపసి
గడవ నాడకు చాలు నీ ♦ గొడవ యేల
వెఱ్ఱితన మేల యని మది ♦ లజ్జ వొడమి."

౨. ఆటవెలఁది.—మొదటిపాదమునకు మూడవపాదమునకు మూడు సూర్యగణములు రెండింద్రగణములును, రెండవపాదమునకు నాలవపాదమునకు అయిదుసూర్యగణములును, ప్రతిపాదమున నాలవ గణము మొదటియక్షరము యతియును, కలది యాటవెలఁది యను గీతము.

"అందుఁ బ్రమథముఖ్యు ♦ లందఱు గ్రందుగాఁ
దఱిసి తమయనుంగు ♦ తెఱవఁబిలిచి
గూర్చుకొని మనోజ ♦ కోలాహలస్ఫూర్తి
యలర నోలి నోల ♦ లాడుచుండ."

3. సీసము.—సీసమునకుఁ బ్రతిపాదమున రెండుభాగము లుండును. అందు మొదటిభాగమున నాలుగు ఇంద్రగణములును, రెండవభాగమున రెం డింద్రగణములు రెండు సూర్యగణములును, ప్రతిభాగపు మూడవగణము మొదటియక్షరము యతియును, అయి యుండవలయును. నాలుగుపాదములతుద నొకగీతముఁ జేర్పవలయును.

"వాలెఱ్ఱ తొంటికై ♦ వడి మాటలాడదు,
కుటిలవృత్తివహించెఁ ♦ గుంతలంబు

లక్షులు సిరులురా ♦ నరచూడిక్కఁ గనుఁగొనె,
నాడించె బొమగొని ♦ యాననంబు
చనుగొమల్నెగయు వ ♦ క్షము పేక్షఁ గడకొత్తెఁ,
బాణిపాదము లొత్తి ♦ వాలఁ దోడఁగె
సారెకు మధ్యంబు ♦ దారిద్రములె చెప్పె,
రోచ్చోర్వకిలు లోఁగఁ ♦ జొచ్చె మేను
వట్టి గాంభీర్య మొక్కఁడు ♦ పెట్టుకొనియె
నాభి నానాఁటి కిగితి ♦ నాఁటిపొందు
చవుక యయినట్టి యిచ్చటఁ ♦ జనదు నిలువ
ననుచు జాతినకంటి బా ♦ ల్యంబు జాఱె”

(పీనికిఁ బ్రాసమక్కఱలేదు. యతికిమాఱుగాఁ బ్రాస ముండవచ్చును.)

## గద్యకావ్యములు.

౧. పద్యకావ్యముకానిది గద్యకావ్యము. దీనినే వచనకావ్య మందురు:—

ఆశ్రయించినను ఫలచ్ఛాయాసమన్వితం బగు మహావృక్షము నే యాశ్రయింపవలెను. ఒకవేళ దైవికంబుగ ఫలంబులు లభింపక పోయినను, ననివార్యం బగు దానినీడ నేఁడు మాపనోపును; సింహ ప్రసాదంబున నజంబును వనంబున నిర్భయుంబుగఁ జరియించుటఁ గానమే? అట్లు ప్రబలులంజేరిన లాఘవాస్పదులకును గౌరవంబబ్బును; ద్వేష్యులును సర్వజగన్మాన్యు లగుదురు. ఇఁక నార్యులు ప్రశంసనీయు లగుదురని యుగ్గడింప నేల? ఎప్పుడును హీనుని మాత్రము చేరరాదు. చేరినన్ మును గలగౌరవము సయితము పోవును. శౌండిని కరంబున నున్న పాలముంతనేని కల్లుముంతయే యందురు.

## విరతులు.

౧. చక్కఁగా నర్థ మగుటకు భాషించునపుడు కాని పఠించునపుడుగాని వాక్యాదుల యంతమందు యుక్తకాలము పలుకును నూరకుంట విరతి యనఁబడును, సులభముగా నన్వయించుకొను కొఱకు గ్రంథమును వాక్యములఁగాను వాక్యాంశములఁగాను విభజించుటకయి యట్టి వివిధవిరతులను దెలుపు సంజ్ఞలు (గుఱుతులు) వాడఁబడును.

## సంజ్ఞలు.

, వాక్యాంశబిందువు. అన్వయమునందు సమీపసంబంధమును గలిగియు నించుక విరతి నపేక్షించు వాక్యాంశములతుద నీగుఱుతు వాడఁబడును.—సూర్యుఁడు, చంద్రుఁడు, నక్షత్రములు, ఆకాశము నలంకరించును. ఇది యేకమాత్రకాలపు విరతిని దెలుపును.

; అర్థబిందువు. మహావాక్యములోని ముఖ్యవాక్యములయంతమం దీగుఱుతు వచ్చును.—నీటియందు బెండ్లు తేలును; గాని గుండ్లు తేలవు. ఇది ద్విమాత్రకాలపువిరతిని దెలుపును.

: న్యూనబిందువు దూరసంబంధముగల రెండు ప్రత్యేక వాక్యములనడుమ నీగుఱుతు వచ్చును.—లోకములో నాకంటెఁ బ్రాజ్ఞుఁడు లేఁడనుకొకు: ఒకరినిమించినవా రొక రుండనే యుందురు. ఇది మూఁడుమాత్రలకాలపువిరతిని దెలుపును.

. బిందువు. భిన్నవాక్యముల యంతమునం దీగుఱుతు వచ్చును.—పాపమునకు భయపడుము. మనుష్యుల కోపమునకు భయపడకుము. ఇది నాలుగుమాత్రలకాలపువిరతిని దెలుపును.

౨. ఈవిరతులను దెలుపుగుఱుతులుగాక, అర్థానురాగము

లైన ధ్వన్యాదులను సూచించుగుఱుతులును, మఱికొన్ని పెఱగుఱుతు లును, కలవు.

? ప్రశ్నార్థకచిహ్నము. ప్రశ్నార్థకవాక్యములతుద నీగుఱుతు వచ్చును — ఎవ రక్కడ? సంస్కృతముం జదివితివా?

! రాగచిహ్నము. ఆశ్చర్యము, సంతాపము, మొదలగు వానిని దెలుపుపదములయు వాక్యములయు తుద నీగుఱుతు వచ్చును.- ఆ! ఇవి యేటిమాటలు! అయ్యో! ఎంత మంచివాఁడు పోయెను!

" " అనువాదచిహ్నము. గ్రంథాంతరమునుండి గ్రహింపఁ బడినవాక్యాదుల కిరుప్రక్కల నీగుఱుతు లుండును.—"దుర్బలస్య బలం రాజా" అన వినమే.

( ) వృత్తార్థము, [ ] వలయితము. అముఖ్యము లగునట్టి కాని పర్యాయము లగునట్టికాని పదములయొక్కయు వాక్యముల యొక్కయు రెండుప్రక్కల నీగుఱుతులు వేయఁబడును.—దాశరథికి (రామునకు) నమస్కారము. నిష్కారణముగ నీచుఁడు [పాపమునకు వెఱవఁడు కాఁబట్టి] సత్పురుషుల కెగ్గుచేయును.

^ హంసపాదము. ఈగురుతు లుప్తవర్ణాదులు మీఁద వ్రాయబడి యున్నవని తెలుపును.

* తారకము. } ఈగుఱుతులు రెండును గ్రంథమునందలి
† శూలము. } విషయములనుగూర్చి యడుగున వ్రాయఁబడిన కారికలు మొదలగువానిని జూడుమని చదువువానికిం దెలుపుట కుపయోగింపఁబడును.

కావ్యపరిచ్ఛేదము సంపూర్ణము.

# A GLOSSARY OF GRAMMATICAL TERMS.



భాష=Language.
వ్యాకరణము=Grammar.
వర్ణపరిచ్ఛేదము=Orthography.
పదపరిచ్ఛేదము=Etymology.
వాక్యపరిచ్ఛేదము=Syntax.
కావ్యపరిచ్ఛేదము=Prosody.
వర్ణములు=Letters.
వర్ణసమామ్నాయము=Alphabet.
అచ్చులు=Vowels.
హ్రస్వాచ్చులు= Short Vowels.
దీర్ఘాచ్చులు= Long Vowels.
హల్లులు=Consonants.
పరుషములు=Hard Consonants.
సరళములు=Soft Consonants.
స్థిరములు= Fixed Consonants.
కంఠ్యములు=Gutturals.
తాలవ్యములు=Palatals.
మూర్ధన్యములు=Cerebrals.
దంత్యములు=Dentals.
ఓష్ఠ్యములు=Labials.
అనునాసికములు=Nasals.
అంతస్థములు=Semi-Vowels.
ఊష్మములు=Sibilants.
లఘువులు=Light Semi-Vowels.
అలఘువులు=Harsh Semi-Vowels.
పదము=Word.
వ్యస్తపదము=Simple word.
సమాసపదము=Compound word.
విశేష్యము=Noun.
సంజ్ఞావాచకము=Proper Noun.
జాతివాచకము=Real Noun.
గుణవాచకము=Abstract Noun.
క్రియావాచకము=Verbal Noun.
లింగము=Gender.
పుంలింగము=Masculine Gender.
స్త్రీలింగము=Feminine Gender.
నపుంసకలింగము=Neuter Gender.
వచనము=Number.
ఏకవచనము=Singular Number.
బహువచనము=Plural Number.
విభక్తి =Case.
ప్రథమావిభక్తి=Nominative Case.
ద్వితీయావిభక్తి=Objective Case.
తృతీయావిభక్తి=Implimentive Case.
చతుర్థీవిభక్తి=Dative Case.
పంచమీవిభక్తి=Ablative Case.
షష్ఠీవిభక్తి=possessive Case.
సప్తమీవిభక్తి=Locative Case.
సంబోధనప్రథమ=Vocative Case.
విశేషణము=Adjective.
గుణవిశేషణములు=Adjectives of Quality.
సంఖ్యావాచకములు=Numeral [Adjectives.
సంఖ్యార్థకము=Cardinal.
పూరణార్థకము=Ordinal.
క్రియావాచకము=Participle Adjective.
సర్వనామము=Pronoun.

పురుషబోధకములు=Personal Pronouns.
సంబంధార్థకములు=Relative Pronouns.
ప్రశ్నవాచకములు=Interrogative Pronouns.
విశేషణసర్వనామములు=Adjective Pronouns.
నిర్దిష్టసర్వనామములు=Demonstrative Adjective Pronouns
అనిర్దిష్టసర్వనామములు=Indefinite, Adjective Pronouns.
సంఖ్యావాచకసర్వనామములు=Numeral Adjective Pronouns.
క్రియ=Verb.
సకర్మకము=Transitive.
అకర్మకము=Intransitive.
సమాపకక్రియ=Finite Verb.
అసమాపకక్రియ=Infinite Verb.
కర్త=Agent or Subject.
కర్మము=Object.
కర్త్రర్థకము=Active Voice.
కర్మార్థకము=Passive Voice.
ప్రేరణార్థకము=Causal Voice.
స్వార్థకము=Indicative Mood.
ప్రార్థనార్థకము=Imperative Mood.
ఆశీరర్థకము=Precative Mood.
కాలము=Tense.
వర్తమానము=Present Tense.
భూతము=Past Tense.
భవిష్యత్తు=Future Tense.
తద్ధర్మము=Aorist.
పురుషము=Person.
ప్రథమపురుషము=Third Person.
మధ్యమపురుషము=Second person.
ఉత్తమపురుషము=First Person.
భావము=Affirmative.
వ్యతిరేకము=Negative.
స్వతంత్రక్రియ=Principal Verb.
ఉపక్రియ=Auxiliary Verb.
న్యూనక్రియ=Defective Verb.
సాధారణక్రియ=Regular Verb.
నిపాతనక్రియ=Irregular Verb.
అవ్యయములు=Indeclinable words.
సముచ్చయములు=Conjunctions.
సంధి=Combination Of letters,
ఆగమము=Additional.
ఆదేశము=Substitutional.
నిత్యము=Fixed.
వికల్పము=Optional.
స్వత్వము=State Of Nature.
లోపము=Elision.
సంశ్లేషము=Coalition.
ఆమ్రేడితము=Repetition Of word.
ప్రత్యయము=Particle.
సమానాధికరణాన్వయము=Concord.
వ్యధికరణాన్వయము=Government.
వాక్యము=Sentence.
సామాన్యవాక్యము=Simple Sentence.
సంశ్లిష్టవాక్యము=Complex Sentence.
మహావాక్యము=Compound Sentence.
ప్రధానవాక్యము=Principal Sentence.
ఉపవాక్యము=Subordinate Sentence.

సూత్రము=Rule.
హంసపాదము=Caret.
పద్యము=Stanza.
ప్రాసము=Rhyme.
అలంకారములు=Figures of speech.
ఉపమాలంకారములు=Simile.
ఉత్ప్రేక్ష=Metaphor.
రూపకము=Allegory.
అతిశయోక్తి=Hyperbole.
పద్యకావ్యము=Poetry.
వచనకావ్యము=Prose.
సిద్ధము=Indigenous.
సాధ్యము=Applied.
అతిదేశము=Parsing.
అధ్యాహార్యము=Understood word.

విరతులు=Pauses.
వాక్యాంశ బిందువు=Comma.
అర్ధబిందువు=Semicolon.
న్యూనబిందువు=Colon.
బిందువు=Period.
ప్రశ్నార్థకచిహ్నము=Interrogative Point.
రాగచిహ్నము=Exclamation Point.
అనువాదచిహ్నము=Sign Of Quotation.
వృత్తార్ధము=Parenthesis.
వలయితము=Brackets.
తారకము=Star.
శూలము=Obelisk.



# కావ్యసంగ్రహము



౧. దోషరహితములును, గుణసహితములును, భావాదియుక్తములును, అలంకారసంయుతములును, అగు వాక్యార్థసముదాయము కావ్య మనఁబడును. ఈకావ్యలక్ష్మికి శబ్దార్థములు శరీర మనియు, అలంకారములు సొమ్ములనియు, మాధుర్యాదులు గుణములనియు, వృత్తులు వ్యాపారములనియు, పూర్వకవులు వర్ణించియున్నారు. ఉత్తమకావ్యములు, మధ్యమకావ్యములు, అధమకావ్యములు, అని కావ్యములు మూఁడువిధములు. ధ్వని ప్రధానమయినది యుత్తమ కావ్యము; ధ్వని అప్రధానమయినది మధ్యమకావ్యము. దీనిని గుణీకృత వ్యంగ్య మనియుఁ జెప్పుదురు; ధ్వని యస్ఫుటమైనది అధమకావ్యము. దీనిని చిత్ర మనియుఁ జెప్పుదురు.

౨. మహాకావ్యములనియు, ఉపకావ్యములనియు, కావ్యములు మరల రెండువిధములు. పట్టణము, నది, పర్వతము, ఋతువులు, సూర్యోదయము, చంద్రోదయము, సరస్సు, వనము, మధువు, సంభోగము, విరహము, వివాహము, పుత్రజన్మము, నీతి, యాత్ర, యుద్ధము, జూదము, రాజు, అను అష్టాదశవర్ణనలుగలది మహాకావ్యము. వీనిలోఁ గొన్నివర్ణనలు లేనిది ఉపకావ్యము.

౩. ఇతిహాసములు, పురాణములు, ప్రబంధములు మొదలయినవి కావ్యములలో భేదములు. పారంపర్యముగా వచ్చు పూర్వచరిత్రములమూలమున జనులకు నీతిని తెలివిని బోధించు గ్రంథము లితిహాసములు; వేదములకు వ్యాఖ్యానప్రాయము లయి సర్గము ప్రతిసర్గము, వంశము, మన్వంతరములు, వంశానుచరితము, అను

పంచలక్షణములు గల వ్యాసప్రోక్తములైన కథలు పురాణములు; కొంచెము సత్యముతోఁగూడిన కల్పనాకథలు ప్రబంధములు.

---

## శబ్దార్థములు.

౧. శబ్దములు వాచకములు, లక్షకములు, వ్యంజకములు, అని మూఁడువిధములు. వానియర్థములు వరుసగా, వాచ్యము, లక్ష్యము, వ్యంగ్యము, అనఁబడును. శబ్దవృత్తు లనఁగా శబ్దార్థ సంబంధములు క్రమముగా, అభిధ, లక్షణ, వ్యంజన, అనఁబడును.

(౧) అభిధ — సంకేతితము లయిన పదార్థముల సంబంధ మభిధ యనఁబడును. ఇది యోగమనియు, రూఢి యనియు, రెండు విధములు. అవయవార్థ సంబంధముగలది యోగము. — జలజము. అవయవార్థ సంబంధము లేనిది రూఢి:—కులము.

(౨) లక్షణ—వాచ్యార్థము పొసఁగనియెడల దానిసంబంధము గల యర్థమును దెచ్చుకొనుట లక్షణ యనఁబడును. ఇది జహల్లక్షణ యనియు, అజహల్లక్షణ యనియు ద్వివిధము. వాచ్యార్థమునువిడుచునది జహల్లక్షణ.—జగములు సంతసిల్లె. వాచ్యార్థమును విడువనిది యజహల్లక్షణ:— కోదండపంక్తులు ముందు నడిచెను.

(3) వ్యంజన—పదము లన్వయించి ధ్వనిచే విలక్షణ మైన యర్థాంతరము కలుగుచుండుట వ్యంజన. ఇది శబ్దశక్తిమూలవ్యంజన యనియు, అర్థశక్తిమూలవ్యంజన యనియు ద్వివిధము. కేవల శబ్దశక్తిచేత నర్థాంతరము కలిగినయెడల శబ్దశక్తిమూలవ్యంజన.— నీచేతి కత్తిని దారసించిన శత్రువుల కనిమిషభావంబు చేకూఱును. అర్థశక్తిచేతనే యర్థాంతరము కలిగినయెడల నర్థశక్తిమూలవ్యంజన.— నీదానగుణమును జూచి మేఘము వెలవెలఁబాఱును.

---

దోషములు.

౧. పదదోషములు, వాక్యదోషములు, అర్థదోషములు, అని దోషములు మూఁడువిధములు.

౨. పదదోషములు.—అపుష్టార్థము, నిరర్థకము, గ్రామ్యము, క్లిష్టము, పరుషము, మొదలైనవి.

(౧) ప్రకృతోపయోగము లేనిపదము అపుష్టార్థము.— రాముఁడు వింశత్యర్ధ కంఠుని జంపెను.

(౨) పాదపూరణము నిమిత్తమే వేసినపదము నిరర్థకము— రాముఁ డొగిఁజంపె రావణు రహిఁ జెలంగ.

(౩) పామరులు మాటాడునది గ్రామ్యము.— ఆడు వస్తాఁడు.

(౪) దూరార్థము క్లిష్టము.—పద్మారి జనకపుత్రీ రమణకుమార తాపము.

(౫) శ్రుతికటువైనది పరుషము. — కుద్ధేడ్జాధవమూర్ధధృతార్ధోడ్వధిపతిని గొల్తు.

౩. వాక్యదోషములు—అక్రమము, పునరుక్తి, వ్యాకీర్ణము, ఛందోభంగము, భిన్నలింగము, మొదలైనవి.

(౧) పదములవరుస తప్పియుండుట యక్రమము.— నీకీర్తిని ప్రతాపమును దినకరుఁడును హిమకరుఁడును బోలుదురు.

(౨) పదమునుగాని యర్థమునుగాని మరలఁ జెప్పుట పునరుక్తి.— వెన్నుఁడు విష్ణుఁడు వచ్చె నరుదెంచె.

(౩) భ్రాంతికరమైన యన్వయముకలుగుట వ్యాకీర్ణము. — ఓకాంతా! పెట్టు తిలకమును గొప్పున ముడువు పూవులను.

(౪) గణాదులుతప్పిన ఛందోభంగము.— క॥ కుందరదన కను బొమలు । విండ్లవలె మనోహరంబు లయ్యెను జూడన్.

(౫) స్త్రీని పురుషునితోఁ గాని పురుషుని స్త్రీతోఁ గాని పోల్చుట భిన్నలింగము.— ఆసుందరి చంద్రునివలె నున్నది.

౪. అర్థదోషములు.—హీనోపమ, అధికోపమ, పరుషము, నిరలంకృతి, విరుద్ధము, మొదలైనవి.

(౧) ఘనుని హీనునితోఁ బోల్చిన హీనోపమ. — ఇతఁడు కుక్కవలె మంచివిశ్వాసము కలవాఁడు.

(౨) అల్పుని నధికునితోఁ బోల్చిన నధికోపమ. — ఆమె శివునివలెనే పుత్త్రను బట్టెను.

(౩) అర్థము చెవి కసహ్యముగానుండినయెడల పరుషము — సీరూపమునకు మంటలోఁబడ్డమన్మథుఁడు సమానుఁడు.

(౪) ఉన్నసంగతితప్ప మఱియొకయందము లేనిచో నిరలంకృతి.— ఆరాజు బాహుయుగళయుతుఁడు.

(౫) దేశకాలాదివిరోధముగా నుండుట విరుద్ధము.—తుమ్మెద సంపెంగపువ్వులోని తేనె త్రాగుచున్నది.

---

## గుణములు.

౧. శ్లేషము, ప్రసాదము, మాధుర్యము, సౌకుమార్యము, సమత, అర్థవ్యక్తి, ఔదార్యము, కాంతి, ఓజము, సమాధి, అను పదియు గుణములు.

(౧) సంధి కలిసినపదము లోకపదము రీతిగా మనోహరముగా నుండుట శ్లేషము. — ఆలావణ్యం బగణ్య మావీర్యం బనిర్వాచ్యము.

(౨) ప్రసిద్ధపదములతో నింపుగాఁ జెప్పుట ప్రసాదము. — ఆరాజు యాచకజనులకు ముంగొంగుబంగారము.

(౩) సరసము లగు వాక్యములు వేరువేరుగా వరుసగా నున్నచో మాధుర్యము.—అర్జునుఁడు యంత్రమత్స్యమును వేయుఁగా ద్వాదశ రాసులును వెనుకకుఁబాఱి, గడ్డికఱిచి, వేషమునుమార్చి, కలుగుదూరి, అడవులచేరి, సిగ్గుపడి, భారమువహించి, విషముగ్రహించి, వంగి, నదులీఁది, నీటమునిఁగి, నిలువుగ్రుడ్లువడి, తిరిగెను.

(౪) పూర్ణబిందుపూర్వకము లైన యక్షరములతో నిండుగా నుండుట సౌకుమార్యము.—చందొవవిందుగ్రందుగ విషబిందువులు చింద సుందరి డెందమునఁ గుందు చెందెను.

(౫) అర్ధరీతిచేత నాలుగుపాదములు నొక్కరీతిగా నుండుట సమత —

సీ. శరవేగములు లేవె చలయంత్రపాఠీన
పాటనక్రియకు నేర్పడవుగాక
చాతుర్యములు లేవె శారదాభాండార
చోరకారశ్రీకిఁ జొరవుగాక
వితరణంబులు లేవె వివిధయాచకనృపా
లకకంఠదఘ్నము ల్గావుగాక
సామర్థ్యములు లేవె పరిదన్యవథయాన
శాసనప్రౌఢికిఁ జనవుగాక.

(౬) అర్థము చిక్కులేక స్పష్టముగానుండుట యర్థవ్యక్తి.—నీకీర్తి లోకములోని యేనుఁగులనన్నిటిని నింద్రునియేనుఁగుతో సమానము లగునట్లుగా చేసినది.

(౭) కొన్ని సంయుక్తాక్షరములతోఁ గూడుకొనుచువచ్చినచో నౌదార్యము.—అతని కీర్తికాంత బ్రహ్మాండనాట్యరంగమున వర్తించి నిత్యనర్తనము చేయును.

(౮) కొన్ని వర్ణముల సముదాయ మింపుగా మరల మరల వచ్చుట కాంతి.—వలఱేని నిండుకల్వలఱేని నాతఁడు సోయగంబున మించును.

(౯) ఇంపైనసమానములతో నిండియుండుట ఓజము.—ఆరాజమార్తాండుని శుభ్రయశము హీరహార నీహార డిండీరమందార కర్పూరమనోహరం బయి యున్నది.

(౧౦) ఒకదానిగుణమును వేఱొకదానికి రమ్యముగాఁ గూర్చుట సమాధి.—ఓరాజా! దానకన్య బలిచక్రవర్తిచేత నడుగు లిడనేర్చి, కర్ణునిచేఁ గంచుకము ధరింపనేర్చి, కామధేనువు చన్నుఁబాల బెరిగి, నీకరగ్రహణము చేసినది.

---

## భావములు.

౧. స్థాయిభావములు, విభావములు, అనుభావములు, సాత్త్విక భావములు, సంచారిభావములు, అని భావములు అయిదువిధములు కలవి.

(౧) స్థాయిభావములు:— శృంగారాదినవరసములకును కారణములయి నడుమ నంచారిభావము లెన్నివచ్చినను తాముమాత్రము విడువకుండునవి తొమ్మిదియు స్థాయిభావము లనఁబడును. అందు రతి శృంగారరసమునకును, హాసము హాస్యరసమునకును, శోకము కరుణారసమునకును, ఉత్సాహము వీరరసమునకును, భయము భయానక రసమునకును, జుగుప్స బీభత్సరసమునకును, రోషము రౌద్రరసమున కును, విస్మయ మద్భుతరసమునకును, శమము శాంతిరసమునకును, కారణములు. పురుషులకును స్త్రీలకును సంభోగవిషయ మయిన

యభిలాష రతి; క్రూరములుకాని యుత్తారెవికారచేష్టలు చూచి నప్పుడు పుట్టుమనోవికాసము హాసము; ప్రియజనవిరహముచే మన స్సులోఁబుట్టుదుఃఖము శోకము; లోకోత్తరకార్యములను జేయఁగోరి చేసెడు ప్రయత్నము త్సాహము; క్రూరాకారాదులను జూచినప్పుడు మనస్సులోఁ బుట్టుభీతి భయము; నెత్తురు, మాంసము మొదలయిన వానిని జూచుటవలనఁ గలిగెడి యసహ్యత జుగుప్స; క్రూరులు దుష్ట కార్యములను జేసినప్పుడు పుట్టెడుక్రోధము రోషము; అపూర్వవస్తువు లను జూచినప్పుడు మనస్సులోఁ బుట్టు ప్రమోదము విస్మయము; వైరాగ్యాదులచేత మనస్సు నిశ్చలత వహించుట శమము.

(౨) విభావములు:— స్థాయిభావములకుఁ గారణములయినవి విభావము లనఁబడును. ఆలంబనవిభావము, ఉద్దీపనవిభావము, అని విభావము ద్వివిధము. స్థాయిభావమునకు సమవాయికారణ మయిన దనఁగా పుట్టుట కాశ్రయ మయిన దాలంబనవిభావము. రతికి నాయికా నాయకు లాలంబనవిభావము; ఉత్సాహమున కాలంబనము వీరుఁడు; శోకమున కిష్టవస్తువును బోఁగొట్టుకొన్న వాఁడు. &c. స్థాయిభావమున కుద్దీపనకారణ ముద్దీపనవిభావము. అది యాలంబన విభావముయొక్క గుణము, చేష్ట, అలంకారము, తటస్థము, అని చతుర్విధములు గలది. శృంగారమున కాలంబనగుణము రూపయౌవనాదులు; ఆలంబనచేష్ట హావభావాదులు; ఆలంబనాలంకారము హారనూపురాదులు; తటస్థ ములు మలయమారుతకోకిలాలాపాదులు.

(3) అనుభావము:—స్థాయిభావముచేఁ గలిగి దానిని దెలియఁ బఱుచునది యనుభావ మనఁబడును. రతికి కటాక్షభ్రూవిక్షేపాదు లనుభావములు. ఇవి నాయికకు నాయకవిషయమున రతిచేతఁ గలిగి నాయికామనోగత మగునట్టి యారతిని దెలియఁబఱుచుచున్నవి.

(౪) సాత్త్వికభావములు:— పరుల సుఖదుఃఖాదులను విచారింపఁగా సత్త్వగుణముచేతఁ గలిగెడునట్టి భావములు సాత్త్వికభావములు. స్తంభము, ప్రళయము, అశ్రువు, స్వేదము, వైస్వర్యము, రోమాంచము, కంపము, వైవర్ణ్యము, అనునెనిమిదియు సాత్త్వికభావములు. రాగభయాదులచే దేహము చలింపకుండుట స్తంభము; సుఖదుఃఖాదులచేఁ బరవశత్వము పొందుట ప్రళయము; హర్షరోషాదులచేఁ గన్నుల నీరు వచ్చుట యశ్రువు; రతిశ్రమాదులచేఁ బుట్టు చెమట స్వేదము; ఈర్ష్యారోషాదులచే గద్గదస్వరము కలుగుట వైస్వర్యము; సుఖాధిక్యాదులచే శరీరము గగురుపొడుచుట రోమాంచము; రోషభయాదులచేఁ బుట్టు వడఁకు కంపము; రోషవిషాదాదులచే మొగము వెలవెలవోవుట వైవర్ణ్యము.

(౫) సంచారిభావములు:— స్థాయిభావమునకు నలుప్రక్కలను సంచరించి దానిని వృద్ధి పొందించుచు రసోత్పత్తికి సహాయము లైన నిర్వేదాదులు సంచారిభావములు. నిర్వేదము, శ్రమము, దైన్యము, జాడ్యము, గ్లాని, త్రాసము, శంక, ఆర్తి, రోషము, గర్వము, ఆవేగము, ధృతి, స్మృతి, చాపలము, ఉగ్రత, అవహిత్థ, త్రప, విషాదము, మదము, ఔత్సుక్యము, మతి, నిద్ర, మోహము, బోధము, మృతి, ముదము, ఆలస్యము, వితర్కము, సుప్తి, అసూయ, చింత, ఉన్మాదము, అపస్మృతి, అను ముప్పదిమూడును సంచారిభావములు. వీనికి వ్యభిచారిభావములనియు పేరు గలదు. ఈర్ష్య, తత్త్వజ్ఞానము మొదలయినవానిచేఁ గలుగు హేయత్వబుద్ధి నిర్వేదము; సురతము, మార్గగమనము మొదలయినవానిచేఁ గలుగుఖేదము శ్రమము; విరహము దారిద్ర్యము మొదలగువానిచేఁ గలుగుదురవస్థ దైన్యము; ఇష్టానిష్టదర్శనాదులవలన కర్తవ్యమును తెలిసికొనలేకుండుట జాడ్యము

(జడత); సురతాయాసాదులచేఁ గలిగెడుబలహీనత గ్లాని; మనస్తాపాదులచేఁ గలుగు హృదయసంక్షోభము త్రాసము; దుర్ణయాదులచేత కీడు మూడు నేమో యనువిచారము శంక; హృదయతాపము వలనఁ గలిగిన శరీరంపీడ ఆర్తి (వ్యాధి); అవమానతాధక్షేపాదులవలనఁ గలుగు రోషము అమర్షము; ఐశ్వర్యము బలము కులీనత మొదలైనవాని వలన తనయందుఁ గలుగు సర్వోత్కృష్టబుద్ధి గర్వము; ఇష్టానిష్ట ప్రాప్తిచేఁ గలుగు తొట్రుపాటు ఆవేగము; జ్ఞానశక్త్యాదుల వలనఁ గలుగు నిస్పృహత్వము ధృతి; పూర్వ మనుభూతమైన విషయము జ్ఞప్తికి వచ్చుట స్మృతి; రాగద్వేషాదుల వలన పనులు తాఱుమాఱుగాఁ జేయుట చాపలము; అపరాధము రోషము దౌర్జన్యము లోనగువానిచేఁ గలుగునిర్దయత్వ ముగ్రత; గౌరవము కౌటిల్యము మొదలయిన వానిచే హర్షాద్యాకార గోపనము చేయుట యవహిత్థ; స్తుతిరత్యాదులచే గలుగు మనస్సంకోచము త్రప (వ్రీడ); అపరాధము, ధనహాని మొదలయిన వానిచేత నేమియు తోఁచక మనస్సులో పుట్టెడు వ్యసనము విషాదము; సురాపానము మొదలయినవానిచేతఁ గలిగిన హర్షమోహముల యతిశయము మదము; ప్రియస్మరణాదులచేత కాలవిలంబము సహింపలేకుండుట ఔత్సుక్యము; శాస్త్ర చింతనాదులచేతఁ గలిగెడి యర్థనిర్ణయజ్ఞానము మతి; చింత బడలిక మొదలయిన వానిచేత మనోవ్యాపారముడుగుట నిద్ర; భయ దుఃఖాదులచేఁ గలుగు మూర్ఛ మోహము; నిద్ర లేకపోవుట వలనఁ గలిగెడి యింద్రియ ప్రకాశము బోధము; మరణ ప్రయత్నము మృతి; ఉత్సాహాదులచేఁ గలుగుమనఃప్రసాదముముదము (హర్షము); గర్భాదుల వలనఁ గలుగు మంద ప్రయత్నము ఆలస్యము; సాధక బాధక విచారము వితర్కము; నిద్రాతిశయము సుప్తి; దౌర్జన్యాదుల

చేత పరోత్కర్షము సహింపలేమి అసూయ; ఇష్టవస్తువు లభింపక పోవుట మొదలయినవానిచేతఁ గలుగు వగపు చింత; ప్రియవియోగము, ధననాశనము మొదలయిన వానిచేత చేతనాచేతనముల యందు సమానముగా ప్రవర్తించుట యున్మాదము; మోహ దుఃఖాదులచేతఁ గలిగెడి యావేశము అపస్మృతి (అపస్మారము).

---

## వృత్తులు.

౧. కైశికి, ఆరభటి, భారతి, సాత్వతి, అని యర్థసంబంధములగు కావ్యవృత్తులు నాలుగు.

(౧) కైశికి—మృదువయి తేలికైన యర్థరచన కైశికి. దీనిని శృంగార కరుణారసములయం దుపయోగించవలెను.

(౨) ఆరభటి—కఠినమై తీక్ష్ణమయిన యర్థరచన యారభటి. దీనిని రౌద్ర బీభత్సరసములయం దుపయోగించవలెను.

(౩) భారతి—ఈషత్ప్రౌఢ మయిన యర్థరచన భారతి. దీనిని హాస్యశాంతాద్భుత రసములయం దుపయోగించవలెను.

(౪) సాత్వతి—ఈష త్కోమల మైన యర్థరచన సాత్వతి. దీనిని వీర భయానక రసములయం దుపయోగించవలెను.

---

## రీతులు.

౧. మాధుర్యాదిగుణములతో గూడిన పదములకూర్పు రీతి యనఁబడును. వైదర్భి, గౌడి, పాంచాలి, అని రీతులు మూడు.

(౧) వైదర్భి—బంధపారుష్యమును, పదకాఠిన్యమును, దీర్ఘ సమాసములును, లేనిది వైదర్భి.

(౨) గౌడి—బంధపారుష్యమును, దీర్ఘసమాసములును, గలది గౌడి.

(3) పాంచాలి—కోంశవలకు వయిరెండురీతుల నుండునది పాంచాలి.

---

## పాకములు.

౧. అర్థగాంభీర్యము పాక మనఁబడును. ద్రాక్షాపాకము, నారికేళపాకము, అని పాకములు రెండువిధములు.

(౧) ద్రాక్షాపాకము—పయిని లోపలను స్పష్టముగా తెలియు చున్నరసము గలది ద్రాక్షాపాకము.

(౨) నారికేళపాకము—స్పష్టముగా బోధపడని గూఢమైన రసము లోపలఁ గలది నారికేళపాకము.

---

## శయ్య.

౧ పదము లొకదానితో నొకటి మనోహరముగా చేయుట శయ్య యనఁబడును.—రతిపతిపో చెలువున భారతిపతిపో మతి.

---

## అలంకారములు.

౧. కావ్యమునకు శోభను దెచ్చెడిధర్మము లలంకారములు. అవి శబ్దాలంకారములు, అర్థాలంకారములు, అని రెండువిధములు.

---

## శబ్దాలంకారములు.

౧. శబ్దరూపము లయిన అనుప్రాసము, యమకము, ముక్తపదగ్రస్తము, మొదలయినవి శబ్దాలంకారములు.

౨. వృత్త్యనుప్రాసము, ఛేకానుప్రాసము, లాటానుప్రాసము, అని యనుప్రాసము లు మూడువిధములు.

(౧) వృత్త్యనుప్రాసము—సంఖ్యానియమము లేక యొకటి రెండు మూడక్షరములు మరల మరలఁ జెప్పఁబడినచో వృత్త్యనుప్రాస మగును.—వివక్షుశిక్షణవిచక్షణుఁ డగు నాథరాధ్యక్షుఁడు దక్షుఁ డయి వివక్షులను శిక్షించెను.

(౨) ఛేకానుప్రాసము—ఎడ తెగక రెండేసి యక్షరములు మరల మరల వచ్చినచో ఛేకానుప్రాస మగును—త్రిపురసంహారు హారు మనమనములలోఁ దలంతము.

(3) లాటానుప్రాసము—ఒక్క యర్థము గలపదములను తాత్పర్యభేదము కలుగునట్లు మరల మరలఁ జెప్పినచో లాటానుప్రాస మగును.—పరోపకారము చేసెడి వానిహస్తములు హస్తములు, అట్టి వానిజన్మము జన్మము.

3. వచ్చినపదములనే యర్థభేదము కలుగునట్లుగా మరలఁ బ్రయోగించినచో యమక మగును. — ఆసైనికనికాయంబులోఁ గాయంబు గాయంబుకానివాఁడు లేఁడు.

౪. వెనుకవిడిచినపదమునే యవ్యవధానముగా మరల మరల గ్రహించుచు వచ్చినచో ముక్తపదగ్రస్త మగును. — ఆమెముఖము చంద్రునియందము చూపు; చూపుతూపులను మించును; మించును శరీరకాంతి తిరస్కరించును.

---

## అర్థాలంకారములు.

౧. ఉపమ—ఉపమానమునకును, ఉపమేయమునకును, మనోహర మయిన సాదృశ్యము గలిగియున్న వత్తుమున, ఉపమాలం

కార మగును. ఇది పూర్ణోపమయనియు, లుప్తోపమ యనియు, రెండు విధములు. ఉపమానము, ఉపమేయము, సాధారణధర్మము, ఉపమావాచకము, ఈనాలుగును ప్రయోగింపఁబడినచో పూర్ణోపమ — ఆమె ముఖము చంద్రునివలె నందముగ నున్నది. ఈనాలుగింటిలోఁ గొన్ని లోపించినయెడల లుప్తోపమ.—ఆమెముఖము చంద్రునివలె నున్నది. పోల్చుట కయి గ్రహించెడి గుణాధిక్యముగల చంద్రాదిక ముపమానము, వర్ణనీయ మయిన ముఖాదిక ముపమేయము, ఉపమానోపమేయములకు సామాన్య మయిన అందము మొదలయినది సాధారణధర్మము, పోలికను తెలుపు చంద్రునివలె మొదలగునది యుపమావాచకము.

౨. అనన్వయము—ఒకవస్తువునే యుపమానము గాను, ఉపమేయముగాను కూడఁ జెప్పుట యనన్వయము.—ఆమెముఖమున కామెముఖమే సమానము.

3. ఉపమేయోపమ—ఉపమానము నుపమేయముగాను, ఉపమేయము నుపమానముగాను మార్చివర్ణించుట యుపమేయోపమ.—ఆమెముఖమునకుఁ జంద్రుఁడు సాటి; చంద్రున కామెముఖము సాటి.

౪. ప్రతీపము — ప్రసిద్ధోపమానమున కుపమేయత్వము కల్పించుట ప్రతీపము.—ఆమెముఖముతోఁ జంద్రుఁడు సమానుఁడు.

౫. రూపకము—ఒకవస్తువునందు మఱియొకవస్తుత్వ మారోపించుట రూపకము.—ఆమెముఖచంద్రబింబము కళంకములేక యొప్పుచున్నది.

౬. ఉల్లేఖము—ఒకవస్తు వాయాగుణములనుబట్టి యొకనిచే ననేకవస్తువులుగాఁ జెప్పఁబడినను, అనేకులచే ననేకవస్తువులుగాఁ

జెప్పఁబడినను ఉల్లేఖము.—నేనా రాజును దానమున కర్ణునిగాను, కీర్తిని నర్జునునిగాను, బుద్ధిని బృహస్పతినిగాను, సత్యమున హరిశ్చంద్రునిగాను, తలఁచెదను. అతనిని స్త్రీలు మన్మథునిగాను, యాచకులు కల్పవృక్షముఁగాను, శత్రువులు యమునిగాను, భావింతురు.

౭. స్మృతిమంతము—ఉపమానోపమేయములలో నొకదానిని జూచినప్పుడు మఱియొకటి స్మరణకువచ్చుట స్మృతిమంతము.—పూర్ణిమాచంద్రబింబమును జూచినప్పుడెల్ల నా కామెముఖము స్మరణకు వచ్చుచుండును.

౮. భ్రాంతిమంతము— ఒకవస్తువునం దన్యవస్తుభ్రమ కలిగినయెడల భ్రాంతిమంతము.—తుమ్మెద యామెముఖము పద్మమని వ్రాల వచ్చుచున్నది.

౯. అపహ్నవము—వర్ణ్యమైన వస్తువును మఱుఁగుపఱిచి దానిని మఱియొకవస్తువునుగా నిర్ణయించుట యపహ్నవము.— ఆ కనఁబడునది యామె మోము కాదు; కేవలపూర్ణిమాచంద్రబింబము.

౧౦. ఉత్ప్రేక్ష—అన్యవస్తువులతోడి గుణాదిసంబంధమును బట్టి యొకవస్తువుయొక్క ప్రసిద్ధగుణాదులకు విశేషతాత్పర్యమును కల్పించుట యుత్ప్రేక్ష.—పద్మము నీచరణైక్యమును పొందుటకో యన నీటిలో తపస్సుచేయుచున్నది.

౧౧. అతిశయోక్తి—సంబంధము లేనిచో యున్నట్టుగాని, సంబంధమున్నను లేనట్టుకాని వర్ణించుట యతిశయోక్తి.—ఆపట్టణమునందలి మేడలు చంద్రబింబమును స్పృశించుచున్నవి; నీవు దాతవయి యుండఁగా కల్పవృక్షముల నెవ్వరు నాదరింపకున్నారు.

౧౨. తుల్యయోగిత—ప్రకృతములకుఁ గాని, అప్రకృతములకుఁ గాని యేకధర్మములు చెప్పుట తుల్యయోగిత— చంద్రోదయము కాఁగానే పద్మములును జారిణులముఖపద్మములును కూడ ముడుచుకొనిపోవుచున్నవి; నీశరీరసౌకుమార్యము చూడఁగా మాలతీ పుష్పమునందును పల్లవములందునుగూడ కాఠిన్యము, తోఁచుచున్నది.

౧౩. దీపకము— ఉపమానోపమేయముల కేకధర్మమును జెప్పుట దీపకము.—మదముచే నేనుఁగును, ప్రతాపముచే రాజును ప్రకాశింతురు.

౧౪. ప్రతివస్తూపమ—ఒక్క సామాన్యధర్మమును రెండు వాక్యములయందు భిన్నపదములచేఁ జెప్పుట ప్రతివస్తూపమ.— సూర్యుఁడు తాపముచేఁ రాజిల్లును; శూరుఁడు చాపముచే శోభిల్లును.

౧౫. దృష్టాంతము—రెండు వాక్యములయందు భిన్నధర్మములను భిన్నపదములతోఁ జెప్పుట దృష్టాంతము—ఓరాజా! లోకములో నీవేకీర్తిమంతుఁడవు. చంద్రుఁడే కాంతిమంతుఁడు.

౧౬. నిదర్శన—సమానము లయిన వాక్యార్థముల కైక్యమారోపించుట నిదర్శన.—దాతకు పారుష్యము లేకపోవుట చంద్రునకుఁ గళంకము లేకపోవుటయే.

౧౭. సందేహము—సాధారణధర్మముచే రెండువస్తువులలో నిదియో యదియో యని సంశయము తోఁచినయెడల సందేహము.— అతఁ డింద్రుఁడో చంద్రుఁడో.

౧౮. వ్యతిరేకము—ఉపమానోపమేయములకు విరుద్ధధర్మములను జెప్పినయెడల వ్యతిరేకము.—సత్పురుషులు పర్వతములవలె మహోన్నతులు; అయినను వారు ప్రకృతికోమలులు.

౧౯. సహోక్తి—సహార్థము (తోడ) ను జనరంజకముగా నుప

యోగించినయెడల సహోక్తి. — అతనికీర్తి శత్రువులతోఁడఁగూడ దిగంతములకుఁ బోవుచున్నది.

౨౦. వినోక్తి—ఒకవస్తువు లేకపోవుటవలన వర్ణ్యము రమ్య మగునని కాని, నింద్య మగునని కాని, చెప్పినయెడల వినోక్తి— ఓరాజా! నీసభ దుష్టులు లేకపోవుటచేఁ బ్రకాశించుచున్నది; విద్య హృద్యమైనను వినయము లేకపోవుటచేఁ సావద్య యగుచున్నది.

౨౧. పరికరము—సాభిప్రాయవిశేషణ మున్నయెడల పరిక రము.—హిమాంశుని శిరస్సున ధరించిన శివుఁడు నాతాపమును పోఁగొట్టునుగాక!

౨౨. పరికరాంకురము—సాభిప్రాయవిశేష్య మున్నయెడల పరికరాంకురము.—దేవుఁడైన చతుర్భుజుఁడు నాకుఁ బురుషార్థచతు ష్టయము నిచ్చునుగాక!

౨౩. శ్లేషము—ఒకవాక్యమున కనేకార్థములు కలుగునట్లు చెప్పుట శ్లేషము.—పద్మాకర మూర్మికాకంకణాదులచే శోభిల్లు చున్నది.

౨౪. అప్రస్తుతప్రశంస — ప్రస్తుతవిషయమున కనుకూలించు నట్లుగా అప్రస్తుతవిషయమును ప్రశంసించుట యప్రస్తుతప్రశంస — ఇంద్రునిఁదక్క మఱియొక్కనిని యాచింపని యాచాతకపక్షియే పక్షులలోనెల్ల సుకృతి.

౨౫. ప్రస్తుతాంకురము—ఒక ప్రస్తుతవిషయమే ద్యోతక మగునట్లుగా మఱియొక ప్రస్తుతవిషయమును వర్ణించుట ప్రస్తుతాం కురము. దీనినే యన్యాపదేశ మందురు.—ఓభృంగమా! చక్కని మాలతీకుసుమమును విడిచి కంటకములతోఁగూడిన మొగలిపూవు మీఁదికిఁ బోయెదవేమి!

౨౬. వ్యాజస్తుతి.— చేసెడునింద వ్యాజముచేత స్తుతియే యైనపక్షమున వ్యాజస్తుతి— ఓగంగా! నీవు మహాపాపులను స్వర్గమునకుఁ బంపుచున్నావు. నీకు వివేక మెక్కడిది?

౨౭. వ్యాజనింద.— చేసెడిస్తుతి వ్యాజముచేత నిందయైనచో వ్యాజనింద — ఓసుందరీ! నీవు మంచిదానవు. నాపెనిమిటిని బిలువఁబోయి నానిమిత్తమయి యాతని నఖక్షత దంతక్షతములకు లోనయి శ్రమనొంది వచ్చితివికదా?

౨౮. ఆక్షేపము—తన యభిమతమును స్పష్టముగాఁ జెప్పక, ఆక్షేపణపూర్వకముగా తనకిష్టము లేనిదానినే విధించుచు మఱియొక విధముగా తనయభిమతమును గమ్యముగాఁ జెప్పుట యాక్షేపము.— ఓనాథా! నాకు చింతలేదు. నన్ను విడిచిపెట్టి నీమవను వచ్చిన చోటికే పొమ్ము. నేనక్కడనే మరలఁబుట్టి నీపాదసేవ చేసెదను.

౨౯. విరోధాభాసము.— రెండువాక్యము లన్యోన్యవిరుద్ధార్థములుగాఁ గనఁబడుచున్నను, అర్థాంతరముచేత విరోధము లేకుండఁ జెప్పుట విరోధాభాసము.— ఆరాజు నీతిమంతుఁ డయ్యు ననీతిని ప్రజాపాలనము చేసెను.

౩౦. విభావన— కారణములేక కార్యము పుట్టినట్టు చెప్పినను విరుద్ధకారణము వలనఁ గార్యము పుట్టినట్టు చెప్పినను విభావన — ఓకాంతా! నీపాదములు లత్తుకపెట్టక పోయినను నెఱ్ఱ నగుచున్నవి. పతి నెడబాసిననన్ను శీతాంశుకిరణములే సంతాపపెట్టుచున్నవి.

౩౧. విశేషోక్తి—సంపూర్ణమయిన కారణమున్నను కార్యము పుట్ట లేదని చెప్పుట విశేషోక్తి.— ఆమె హృదయములో స్మరదీపము పూర్ణముగా వెలుఁగుచున్నను స్నేహ మూవంతయు తగ్గలేదు.

౩౨. అసంగతి.— కారణ మొకచోటఁ గలుగఁగాఁ గార్యము

మఱియొకచోటఁ గలిగినదని చెప్పుట యసంగతి.—విషపానము మేఘములు చేయఁగా విరహిణీస్త్రీలు మూర్ఛ నొందుచున్నారు.

33. విషమము—ఒకదాని కొకటి తగనిది సంప్రాప్త మయిన దని చెప్పినను, కోరినదానికంటె విరుద్ధఫలము సంభవించినదని చెప్పినను, విషమము — ఆపుష్పకోమలి యెక్కడ? ఇటువంటి దుర్వార మదనజ్వర మెక్కడ? ఎలుక బుట్టకొఱకు యాహారమును పొందఁగోరి పాముచే భక్షింపఁబడియె.

34. చిత్రము—తాను కోరెడుఫలమునకు విపరీత మయినపని చేయుచున్నట్టు వర్ణించినచో చిత్రము.—అతఁడు మహోన్నతి పొందఁ గోరి నమ్రత నభ్యసించుచున్నాఁడు.

35. అన్యోన్యము— రెండువస్తువుల కన్యోన్యోపకారమును వర్ణించిన యెడల నన్యోన్యము.— కవిచే రాజును రాజుచే కవియుఁ బ్రకాశింతురు. కంకణముచే హస్తమును హస్తముచేఁ గంకణమును శోభిల్లుచున్నవి.

36. విశేషము—ఒకవస్తువునే యనేకస్థలములయం దున్నట్లు వర్ణించుట విశేషము.— నాకు లోపలను వెలుపలను ముందును వెనుకను సర్వత్ర ప్రియుఁడే తోఁచుచున్నాఁడు.

37. కారణమాల— వరుసగా నొకదానికొకటి కారణములుగా కొన్నిసంగతులను వర్ణించుట కారణమాల — నీతిచేత ధనమును, ధనముచేత వితరణమును, వితరణముచేత కీర్తియు, కీర్తిచేత స్వర్గమును కలుగును. నరకము పాపమువలనను, పాపము దారిద్ర్యము వలనను, దారిద్ర్యము దానహీనతవలనను సంభవించును గనుక దానపరుఁడవు కమ్ము.

38. సారము— పూర్వమునకంటె నుత్తరోత్తర ముత్కృ

ష్టముగా వర్ణించినచో సారాలంకారము. — తేనె తియ్యనిది; అమృత ము దానికంటెను తియ్యనిది; కవివాక్య మమృతముకంటెను మధుర మయినది.

౩౯. యథాసంఖ్యము—క్రమసంఖ్య గలవానిని వరుసగాఁ గ్రమసంఖ్య గలవానితో నన్వయించునట్లు వర్ణించుట యథాసంఖ్యా లంకారము. దీనినే క్రమాలంకార మందురు.—పుత్రులను మిత్రు లను శత్రులను పోషింపుము భూషింపుము దూషింపుము.

౪౦. పరివృత్తి—ఒకదాని నిచ్చి మఱియొకదానిని పుచ్చు కొనుట పరివృత్తి.—రాజు తా నొక్క బాణమునువిడిచి శత్రువుల లక్ష్మీకటాక్షమును గ్రహించెను.

౪౧. పరిసంఖ్య—ఒకవస్తువు నొకచోట నిషేధించి మఱి యొకచోట విధించినచో పరిసంఖ్య.—దీపములయందు స్నేహక్ష యము కలిగినను కలుగునుగాక స్త్రీలహృదయములయందు కలుగదు.

౪౨. వికల్పము—తుల్యబలము గల రెండువిరోధము లైన కార్యములలో నేదైననొకటి చేయవలెననుటవికల్పము.—నీవు తల నైనను ధనువు నైనను వంచుకొని నీశత్రువువద్దకు పోవలెను.

౪౩. సముచ్చయము— ఒక్కకార్యమున కొక్కకారణము చాలియుండఁగా ననేకకారణములను జెప్పుట సముచ్చయము.—అతని మదమునకు కులమును రూపమును వయస్సును విద్యయు ధనమును హేతువు లయినవి.

౪౪. సమాధి— ఆరంభించిన కార్యమునకు మఱియొక కార ణముచే సౌలభ్యము కలిగినయెడల సమాధి—అసలే జారస్త్రీ బయలు వెడలఁ దలఁచి యుండెను, ఇంతలో సూర్యుఁడును గ్రుంకెను.

౮౫. కావ్యార్థాపత్తి—ఒక యుత్కృష్టవస్తువే సాధింపఁబడుచున్నప్పుడు సామాన్యవస్తువును సాధించుట యెంతని చెప్పినచో కావ్యార్థాపత్తి.—నీముఖముచేత చంద్రుఁడే జయింపఁబడుచుండఁగా నిఁక పద్మములు జయింపఁబడు టెంత?

౮౬. కావ్యలింగము—సమర్థనీయ మయిన కార్యమును కారణవాక్యముచే సాధించుట కావ్యలింగము. — నామనస్సులో ఫాలలోచనుఁ డున్నాఁడుగనుక నేను మన్మథుని జయించితిని.

౮౭. అర్థాంతరన్యాసము — విశేషము జెప్పి దానిని సాధించుట కయి సామాన్యమును తెచ్చుకొన్నను, సామాన్యమును జెప్పి దానిని సాధించుట కయి విశేషము దెచ్చుకొన్నను అర్థాంతరన్యాసము — రామకార్యమునకై హనుమంతుఁడు సముద్రమును దాఁటెను; మహాత్ములకు దుష్కర మేది? మహాత్ములఁ జేరి యల్పులును గౌరవ మొందుదురు? పుష్పమునుగూడి దారము తలకెక్కదా?

౮౮. ప్రౌఢోక్తి—క్రియాధిక్యమున కయి హేతువునందు హేతువు కల్పించినచో ప్రౌఢోక్తి — ఆమెశిరోజములు యమునాతీరతమాలవల్లికలవలె నీలముగా నున్నవి.

౮౯. సంభావన—ఈలాగున నయినపక్షమునఁ బ్రకృతకార్యసిద్ధి యగునని యూహించినచో సంభావన.—వర్ణించెడువాఁడు శేషుఁడయ్యెనా నీగుణములను పూర్ణముగా వర్ణింపఁగలుగును.

౯౦. మిథ్యాధ్యవసితి — ఒకదానికి మిథ్యాత్వమును సూచించుట కయి మఱియొక మిథ్యాభూత మయినదానిని కల్పించుట మిథ్యాధ్యవసితి. — ఆకాశపుష్పమాలను ధరింపఁ గలిగిన వాఁడు వేశ్యను వశ్యనుగాఁ జేసికోఁగలుగును.

౫౧. ప్రహర్షణము—యత్నము లేకుండ కోరిన కార్యము సిద్ధించినచోఁ బ్రహర్షణము—తాను వెదుకవలెనన్న తీఁగె కాళ్ళనే చుట్టుకొనెను.

౫౨. విషాదనము—ఇష్టితార్థసిద్ధికయి ప్రయత్నించు చుండఁగా తద్విరుద్ధఫలము గలిగినచో విషాదనము—దీప మెగసనద్రో యుట కయి చేయి పెట్టఁగానే దీప మాఱిపోయెను.

౫౩. అవజ్ఞ—అధికాశ్రయమును పొందినను, అధికఫలము లభింపలేదని చెప్పుట యవజ్ఞ—బొక్కెన సముద్రమున మునిఁగినను కుండెడునీటినే తెచ్చుచున్నది.

౫౪. లేశము—ఆనుకూల్యమునుబట్టి దోషమును గుణమునుగాఁ జెప్పినను, ప్రాతికూల్యమునుబట్టి గుణమును దోషమునుగాఁ జెప్పినను, లేశాలంకారము.—ఓచిలుకా! స్వచ్ఛందవిహారముగల తక్కిన పక్షులకులేని వాఙ్మాధుర్యము కలుగఁబట్టికదా నీకు పంజర బంధనము కలిగినది?

౫౫. తద్గుణము—తనగుణమును విడిచి యన్యగుణమును పొందుట తద్గుణము—అధరకాంతిచే నీముక్కు ముత్యము పద్మరాగ మణి యగుచున్నది.

౫౬. అతద్గుణము — అన్య వస్తుగుణమును పొందుటకుఁ దగినకారణ ముండియుఁ బొందకపోవుట యతద్గుణము — ఓరాజా! నీకీర్తిధావళ్యముచేత శివునికంఠ మయినను తెలుపగునుగాని నీశత్రుల దుష్కీర్తి తెలుపుగాదు.

౫౭. అనుగుణము—పూర్వము స్వతస్సిద్ధముగా నున్న గుణము నకు మఱియొక వస్తువుచే గుణాధిక్యమును జెప్పుట యనుగుణము—

చెవులయందలి నీలోత్పలములు త్వత్కటాక్షలబ్ధిచేత మఱింత నైల్యమును బొందుచున్నవి.

౫౮. మీలితము — గుణసామాన్యముచే భేదము లేనట్లు వర్ణించుట మీలితము:—నీసహజారుణము లయిన చరణముల యందు లత్తుకపూఁత కనఁబడనే కనఁబడదు.

౫౯. సామాన్యము — సాదృశ్యముచేత నుపమానోపమేయములకు భేదము కనఁబడలేదని చెప్పినచో సామాన్యము—తామర కొలఁకులోఁ జొచ్చిన యామెముఖమే కనఁబడుచుండలేదు.

౬౦. లోకోక్తి—సామెతను చక్కఁగా సమర్చినచో లోకోక్తి—పాముకాళ్లు పామునకే తెలియును.

౬౧. వక్రోక్తి—శ్లేష కాకుస్వరాదులచే నన్యార్థము కల్పించుట వక్రోక్తి — ఓయింతీ! కాకులు కూయుచున్నవి యిప్పుడు పగలగునుజుమా. ఓనాథా! కొఱనోము నోచిన నాకుఁ బగలు గాక స్నేహము లెట్లుకలుగును?

౬౨. స్వభావోక్తి — చక్కనిపదములచే వస్తువుల నున్నవి యున్నట్లు వర్ణించుట స్వభావోక్తి—ఆలేడి చెవులు నిక్కించి బెదరి బెదరి చూచుచు గొరిసెలతోఁ దల గోఁకుకొనుచున్నది.

౬౩. భావికము—భూతకాలము నందలికాని భవిష్యత్కాలమునందలికాని కథ లిప్పుడు చూచినట్టుగా జెప్పుట భావికము—రామ రావణ యుద్ధ కథలఁ జదువుచో నాకుం బ్రత్యక్షముగఁ గనఁబడుచున్నది.

౬౪. నిరుక్తి—యౌగికార్థము గలశబ్దముల కనయుచార్థము వలన నర్థాంతరకల్పన చేయుట నిరుక్తి—ఓచంద్రా! మమ్ము బాధించుటవల్లనే నీదోషాకరత్వము తేటపడుచున్నది.

౬౫. ప్రతిషేధము—ప్రసిద్ధ మయిననిషేధము ననువదించి వర్ణించుట ప్రతిషేధము.—ఓశకునీ! ఇది నాటి పాచికలతో నాడిన జూదము కాదు. ఇప్పుడు వాడిబాణములతోఁ నాడెడుజూదము సుమీ.

---

## నాయకాదిలక్షణము.

౧. కావ్యనాటకాదులయందు వర్ణింపఁబడు ప్రధానపురుషుఁడు నాయకుఁడనియు, ప్రధానస్త్రీ నాయిక యనియు, చెప్పఁబడుదురు. ధీరోదాత్తుఁడు, ధీరోద్ధతుఁడు, ధీరశాంతుఁడు, ధీరలలితుఁడు, అని కథానాయకులు నాలుగు తెగలవారు.

(౧) ధీరోదాత్తుఁడు—స్థైర్యవంతుఁడును, ఆత్మస్తుతి లేనివాఁడును, కరుణాళుఁడును, సాత్వికుఁడును, గాంభీర్యశాలియు, గర్వరహితుఁడును, సత్యసంధుఁడును, క్షమాసంపన్నుఁడును, అయినవాఁడు ధీరోదాత్తుఁడు.

(౨) ధీరోద్ధతుఁడు—శౌర్యశాలియు, కోపశీలుఁడును, దర్పవంతుఁడును, ఆత్మస్తుతిపరాయణుఁడును, మాయావియు, చపలుఁడును, అగువాఁడు ధీరోద్ధతుఁడు.

(౩) ధీరశాంతుఁడు—ధీమంతుఁడును, శుచియు, అభిమానియు, శమసమన్వితుఁడును, అగు బ్రాహ్మణుఁడు ధీరశాంతుఁడు.

(౪) ధీరలలితుఁడు—భోగలోలుఁడును, రూపవంతుఁడును, కామభీరుఁడును, కామినీ పరవశుఁడును, అగువాఁడు ధీరలలితుఁడు.

౨. శృంగారమునం దీనాయకులు నలుగురును దక్షిణుఁడు, అనుకూలుఁడు, ధృష్టుఁడు, శఠుఁడు, అని మరల నాలుగుభేదములు కలవారుగా నున్నారు.—

(౧) బహుకాంతలకు సమానప్రియుఁ డయినవాఁడు దక్షిణుఁడు; (౨) ఏకభార్యానురక్తుఁ డైనవాఁ డనుకూలుఁడు; (౩) తన జారత్వము బయలఁబడినను భయపడనివాఁడు ధృష్టుఁడు; (౪) ఒక కాంతయందు మనస్సు గలవాఁ డయి మఱియొక కాంతయందు పయి కనురాగమును చూపుచు నప్రియము చేయువాఁడు శఠుఁడు.

౩. ఈనాయకులకు స్త్రీలను కూర్చుటలో సహాయులుగా నుండువారు విటుఁడు, పీఠమర్దుఁడు, చేటుఁడు, విదూషకుఁడు అని నలుగురు.—నాయకాసంఘటన కనుకూలమైన యేవిద్య గలవాఁడు విటుఁడు; (౨) నాయకుని కంటె కొంచెము హీనములైన గుణములు కలవాఁడయి కార్యమునకు సహాయుఁడుగా నుండువాఁడు పీఠమర్దుఁడు; (౩) నాయికాసంధానమునం దసమానచాతుర్యము గలవాఁడు చేటుఁడు; (౪) వికృతములైన యంగములచేతను మాటలచేతను వేషాదులచేతను నవ్వుపుట్టించి యుత్సాహము కలుగఁ జేయువాఁడు విదూషకుఁడు.

౪. స్వీయ, పరకీయ, సామాన్య, అని నాయికలు ముగ్గురు.—

(౧) ఉచితలజ్జయు, ఆర్జవమును, శీలమును, సౌందర్యమును, గలస్వభార్య స్వీయ; (౨) పరునిభార్యయు వివాహము కాని కన్యయు పరకీయ; (౩) వేశ్య సామాన్య.

౫. ఈనాయికలు ముగ్ధ, మధ్య, ప్రౌఢ, అని మూఁడుభేదములు కలిగి యుందురు.—(౧) నూతనముగా యౌవనమును పొందినదియు, అల్పరతమును గోరునదియు, ముగ్ధ; (౨) యౌవనమధ్యస్థయై రతాంతమునందు పరవశ యగునది మధ్య; (౩) యౌవనము ముదిరి యల్పలజ్జ గలదై సురతమునందు పురుషుని చొక్కించునది ప్రౌఢ.

౬. ధీర, అధీర, ధీరాధీర, అని మరల మధ్యయు ప్రౌఢయు

ము త్తెఱంగుల నుందురు.— (౧) సాపరాధుఁ డయిన భర్తను పరిహాస ముగా నెత్తిపొడుచునది మధ్యాధీర; (౨) కన్నీల నీరుఁ బెట్టుకొని పరుషము లాడునది మధ్యాధీర; (౩) కన్నీటితో వక్రోక్తులను పలుకునది మధ్యధీరాధీర; (౪) భర్త యపరాధ యైనప్పు డాకా రాదులచేత కోపము కనఁబడనీయక రతివేళఁ దలయించునది ప్రౌఢధీర; (౫) భర్తను రోషముచేత కొట్టునది ప్రౌఢాధీర; (౬) కోప ముతో కుటిలవాక్యము లాడునది ప్రౌఢధీరాధీర.

౭. ఈశృంగారనాయికలు స్వాధీనభర్తృక, వాసకసజ్జిక, విర హోత్కంఠిత, విప్రలబ్ధ, ఖండిత, కలహాంతరిత, ప్రోషితభర్తృక, అభిసారిక, అని యెనిమిది విధములఁ జెప్పఁబడుదురు.— (౧) తనకు భర్త వశుఁడై యున్నది స్వాధీనభర్తృక; (౨) ప్రియుని రాక వేచి శరీర మును గృహమును అలంకరించుకొనునది వాసకసజ్జిక; (౩) పతివచ్చుట కాలస్యము చేయఁగా తాళలేక తహతహపడునది విరహోత్కంఠిత; (౪) సంకేతస్థలమునకుఁ బోయి నాథుఁడు లేకపోవుటచే ఖేదము నొందు నది విప్రలబ్ధ; (౫) విభుఁడు పరస్త్రీని బొంది వేకువను రాఁగా కోపించు నది ఖండిత; (౬) భర్తను దూషించి పశ్చాత్తాపపడునది కలహాంత రిత; (౭) భర్తవిదేశమునకుఁ బోఁగా వ్యథ చెందునది ప్రోషిత భర్తృక; (౮) కాంతు ననుసరించి పోఁగోరునది యభిసారిక.

---

## దృశ్యకావ్యములు.

ఈవఱకు శ్రవ్య (వినఁదగిన) కావ్యములనుగూర్చి చెప్పఁ బడెనుగదా! దృశ్య (చూడఁదగిన) కావ్యము లను యింకొక తెగవి కలవు. దృశ్యకావ్యములకే రూపకము లని పేరు. నటులు రామకృష్ణాది

రూపములను తద్విషయం దారోపించుకొని నటించుటచేతి వీనికి రూపకము లని పేరుకలిగినది.

నాటకము, ప్రకరణము, భాణము, ప్రహసనము, డిమము, వ్యాయోగము, సమవకారము, వీథి, అంకము, ఈహామృగము, అని రూపకములు పది. వీనిలో నాటకము, ప్రకరణము, వ్యాయోగము, వీథి, అనునవిమాత్ర మిప్పుడు తెనుఁగునం దున్నవి.

౧. నాటకమునందు కథ ప్రఖ్యాతమైనదిగా నుండవలెను; నాయకుఁడు ధీరోదాత్తుఁడు; శృంగారవీరరసములలో నేదైన నొకటి ప్రధానము; అంకము లయిదు మొదలుకొని పదివఱకు నుండవలెను.

౨. రంగస్థలమునందుఁ బ్రత్యక్షముగాఁ జూపఁబడెడి యొక్క నాఁటికి మించనినాయక చరిత్ర మంకము. అంకములో దూరప్రయాణము, వధ, యుద్ధము, ముట్టడి, రాజ్యదేశాదులయుపద్రవము, భోజనము, స్నానము, మైపూఁత, సురతము, చుంబనము, దంతక్షతనఖక్షతములు, నిద్ర, మొదలయినవి చూపఁబడఁగూడదు; విదూషకాది పాత్రములు నాలుగయి దుండవలెను; అంకాంతమున పాత్రము లన్నియు నిష్క్రమింప వలెను.

౩. అంకమునందుఁ జెప్పరాని కడచినకథనుగాని రాఁబోవు కథనుగాని సంగ్రహముగా మధ్య నీచపాత్రములచేఁ జెప్పించునది విష్కంభము. కథ మధ్యపాత్రలచేఁ జెప్పఁబడినచో శుద్ధవిష్కంభ మనియు, మధ్య నీచపాత్రములచేఁ జెప్పఁబడినచో మిశ్రవిష్కంభ మనియు, చెప్పఁబడును.

౪. రెండంకముల మధ్యను నీచపాత్రములచేఁ బ్రయోగింపఁబడునది ప్రవేశక మనఁబడును.

౫. ప్రకరణమునందు కథ కవికల్పిత మయి, లోకానువర్తన మున కాశ్రయమై యుండవలెను. నాయకుఁడు ధీరశాంతుఁడయి, విప్రుఁడుఁగాగాని వణిజుఁడుఁగాగాని యుండవలెను. నాయిక కుల కాంతగాని, వేశ్యగాని, ఉభయులుగాని యుండవలెను. నాయకుఁడు ధర్మకామములయం దాసక్తుఁడయి, అపాయములను గడచి కార్యసిద్ధిని బొందవలెను, పదియంకము లుండవలెను.

౬. వ్యాయోగమునందు కథ ప్రఖ్యాతమై యొక్కనాఁడు జరగిన స్త్రీనిమిత్తము గానట్టి యుద్ధవిషయ మయినదిగా నుండవలెను ; నాయకుఁడు ధీరోద్ధతుఁడు; ఏకాంకము.

౭. వీథియందు కథ శృంగారరసప్రధానమై కల్పిత మైనది; నాయకుఁడు ధీరోద్ధతుఁడు; నాయిక యనురాగముగలదైన పరస్త్రీ ; ఒకటిగాని రెండుగాని పాత్రములు గలయేకాంకము.

౮. ఇవిగాక పదునెనిమిదియురూపకము లున్నను, వానిలో నాటిక యొక్కటిమాత్రమే తెనుఁగునం దున్నది. నాటికయం దంక ములు నాలుగు; నాయకుఁడు ధీరలలితుఁడు; రసము శృంగారము; స్త్రీపాత్రము లధికము; ప్రగల్భురాలైన జ్యేష్ఠభార్య యుండఁగా, తదధీనురాలై నాయకసంగమము కష్టముమీఁదఁ బొందెడు కన్యక నాయికగా నుండవలెను.

౯. రూపకములకు నాట్యము ప్రధానము. రూపకమునందు వచ్చు స్త్రీపురుషులయొక్క యవస్థల నభినయించుట నాట్యము. ఆంగికము, వాచికము, సాత్త్వికము, ఆహార్యము, అని యభినయము చతుర్విధము. కర చరణాద్యంగములతోఁ జేయునది యాంగికము; మాటలతోఁ జూపునది వాచికము; మనోభావములను కనబఱుచు నది సాత్త్వికము; వస్త్రాలంకారాదులచే సూచించునది యాహార్యము.

## కవిసమయములు

ఉన్నవానిని లేనట్లుగాని, లేనివాని నున్నట్లుగాని, అనేక స్థలములయం దుండువాని నొక్కచోటనే యున్నట్లుగాని, వర్ణించుటకై ప్రాచీనకవు లేర్పఱుచుకొన్న నియమములు కవిసమయము లనఁబడును.

(౧) ఉన్నవానిని లేనట్లు వర్ణించుట — వసంత కాలమునందు జాజీ పుష్పించదనుట, చందనవృక్షములయందు పుష్పఫలము లుండవనుట, అశోకవృక్షములకు కాయలుండవనుట, పద్మములు రాత్రియు కలువలు పగలును వికసించవనుట, కృష్ణపక్షమున వెన్నెలయు శుక్లపక్షమున చీఁకటియు లేవనుట, మొదలయినవి.

(౨) లేనివాని నున్నట్లు వర్ణించుట — సమస్త పర్వతములయందును స్వర్ణరత్నాదులను వర్ణించుట, సర్వజలాశయములయందును హంసాదిక పక్షిసంచారమును జెప్పుట, నదీసముద్రముల యందు తామరపువ్వులును కలువలును ఉండు ననుట, రసాలచందనాది వృక్షములను తీఁగెలనుగాఁ జెప్పుట, నవ్వును కీర్తియు తెల్లఁగాను, కోపమును ప్రేమయు పరాక్రమమును ఎఱ్ఱగాను, అపకీర్తియు ఆకాశమును పాపమును నల్లఁగాను, ఉన్నట్లు చెప్పుట, రాత్రి చక్రవాకము లెడఁబాసి ప్రాతఃకాలమున కలిసికొను ననుట, చకోరములు వెన్నెలలు త్రాగు ననుట, లక్ష్మి పద్మములయందును రాజ నేత్రములయందును వసించు ననుట, వానకాలమున హంసలు మానస సరస్సునకు పోవుననుట, స్త్రీ తన్నుటవలన నశోకవృక్షమును— కల్లుమింయుట వలన పొగడచెట్టును పూచుననుట, మన్మథతాపముచేత హృదయములును హారములును పగులుననుట, యువతీకటాక్షముల చేతను మదన

బాణములచేతను యువజన హృదయములు భేదిల్లు ననుట, మేఘము గర్జించునప్పుడు నెమళ్లు నృత్యముచేయుననుట, మొదలయినవి.

(3) అనేక స్థలములయం దుండు వాని నొక్క-చోటనే వర్ణించుట—మలయ పర్వతమునందే మంచిగంధపు చెట్లుండు ననుట. వస్త్రములకును ఛత్రములకును పుష్పములకును తెలుపే చెప్పుట, మేఘసముద్రములకు నలుపే చెప్పుట, వసంతమునందే కోయిలలును వర్షాకాలమునందే నెమళ్లును కూయుననుట, ఆకాశమూర్ధ్వము నందే యున్నదనుట, మొద లయినవి.

---



పరబ్రహ్మణే నమః



క. శ్రీకళ్యాణగుణుఁ డఖిల
లోకారాధ్యుఁడు సాధు లోకావనదీ
క్షాకలితుఁడు నిత్యుఁడు జగ
దేకగురుఁడు దేవదేవుఁ డిచ్చుత శుభముల్.

గీ. మొదల వాగనుశాసను మదిఁ దలంచి
సోమయాజిని భాస్కరు సోము నెంచి
భీముఁ గొనియాడి శ్రీనాథు వినుతి చేసి
తక్కఁగలయట్టివిబుధులఁ దవిలి గొలుతు.

ఉ. చిన్నయసూరి ధీరు లెదఁ జేరిచి సారెకు గారవింపఁగా
మున్ను రచించి మించె సగము న్వచనంబుగ నీతిచంద్రికన్;
నన్నుతి కెక్క దాని కిదె సాటి యటంచు బుధు ల్మనంబులం
దెన్నఁగ నిప్పుడేను రచియించెదఁ దక్కినయుత్తరార్థముల్.

ఉ. పేరిచి సావకాశముగ విగ్రహ మీయది వ్రాయఁ బూని నే
నారసి పెక్కు లాంధ్రకృతు లంతటఁ బోక హితోపదేశమున్
భారతపంచతంత్రములఁ బల్మఱునుం బరికించి వానిలోఁ
గోరికయాకథల్గొనియుఁ గూర్చితిఁ గొన్నిటి నూతనంబుగన్.

గీ. దీన సామాన్యముగఁ దొంటి తెలుఁగుకవులు
వాడియున్నట్టి పదవాక్య పద్ధతులనె
యేర్చి కూర్చినవాఁడఁ గవీంద్రులకును
డెందముల రుచియించుకొఱకు.

క. ఎందైన నిందుఁ దొల్లిటి
చందంబుల రచన లున్న ౿ సైరించి యెదం
బొందింప కుండ నీనుల
వందన మొనరింతు నార్య ౿ వర్యుల కెల్లన్.

---

శ్రీ ర స్తు

# నీతిచంద్రిక, విగ్రహము.



## ప్రథమ భాగము

అనంతర మానరేంద్రనందను లమందానందకందళితహృదయారవిందు లయి, విష్ణుశర్మం గని, యిట్లనిరి. "దేవా! తావకం బగు సేవావిశేషంబున, నిరవశేషంబుగ మిత్రభేదంబును వినంగని, మనంబున ఘనంబగు మోదంబు నొందితిమి. ఇంక విగ్రహంబుం గూడ ననుగ్రహించి, మమ్ముఁ గృతార్థులం జేయ వేఁడెదము. వేగిర మీనవకథాసుధారసంబు వెల్లిగొలిపి, యాఁకొన్న మావీనులకు విందు సేయుఁడు." అనిన నాయవనీసురసత్తముం డాదరాయత్తచిత్తుం డయి, యిట్లు వినిపింపందొడంగె.—

తొల్లి, తుల్యబలవిక్రమంబు లగు మయూరమరాళంబులకు సమీకంబు చేకుఱినతఱి, నొక యరిష్టమును నమ్మి, యాహంసమ్ము పరాజయమ్ము నొందెను. మీకక్కథ వక్కాణించెద; చక్కఁగా వినుండి.

కర్పూరద్వీపమునందుఁ బద్మకేళి యనుకొలను గలదు. అందు హిరణ్యగర్భుం డను మానసౌకస్స్వామి వాసము చేయుచుండును. అందలి జలవిహంగమంబు లాయంచలరాయనిం దమ కందరకు దొరఁగాఁ జేసికొని, వాసిగని యుండును. ఆపరమహంసావతంసుఁ డాశలజయించి, నైజతేజం బెల్లకడల వెలుంగ, నొక్కనాఁడు

నూర్యుండు పూర్వపర్వతశృంగం బలంకరించిన యనంతరంబ నిజాప్త ద్విజనికర పరివేష్టితుండయి, రాజయోగంబు మెఱయఁ బుండరీకాసనంబున సుఖాసీనుం డయి, నిండుకొలువుండఁ గతిపయమాసంబులకు మున్ను దేశాంతరం బరిగి మరలి యరుదెంచిన దీర్ఘముఖుండను బక ముఖ్యుఁడు, వాకిట నిలిచి, ప్రతీహారులవలనఁ దనరాక యెఱిఁగించి పుచ్చి, సముచితప్రకారంబునఁ గొలువు సొచ్చి, వినయవినమిత గాత్రుండయి, దండప్రణామంబుఁ గావించిన, రాజును సాదరాహ్లాద మేదుర నిరీక్షణంబుల నాతని నీక్షించి, "రమ్ము కూర్చుండు" మని, చేయి చూపి, దాపునఁ గూర్చున్న యతని కిట్లనియె. "ఓయీ! దీర్ఘ ముఖా! నేమమా నీకు? బహుకాలంబునకు నేఁడు నీజాడఁ జూడఁ గంటిమి! విదేశవాసాయాసక్లేశంబున, భృశంబును జెన్నుఁదఱిగి పట్టున్నవాఁడవు. ఇంతతడవు నేయేదేశమ్ములఁ గ్రుమ్మరుచుంటివి? ఏయేసీమల నేయేవిచిత్రంబులు నేత్రంబులఁ గపూర్వపర్వంబు లొనరించె? ఎక్కడను మిక్కిలి యక్కజంబులు లేవుగా? నీమోము పొలఁకువ దిలకింప, నెప్పట్టుననో యొక గొప్పవిశేషం బున్నట్టు పొడకట్టుచున్నది. నీవేగినచోట విశేషంబు లేలపుట్టకపోవును? వరగ నెఱిఁగింపుమా; వినదము." అనిన, జేని మొగంబున దృష్టి వఱపి, యూతం డిట్లనియె.

"ఏలిక పాలనంబు సేయునేల నేమూలం గుశలం బణుమాత్రంబును గుంటువడ దన, సార్వకాలము దేవరపాదము లాశ్రయించి సన్నిధానంబు నన మెలంగు నస్మదాదులను, 'నేమమా' యని వేఱ యడుగనేల? ఇఁక దేశాంతరమం దున్ననాఁటి నాకుశలమో, శశ విషాణప్రరోహంబు. అది యంతయు దేవర కీర్తనద్యుతియే తెలుపుడు సేయుచున్నది. అది యుండనిండు. నాఁ డట్లు స్వామిపాదంబుల

యాదేశంబు గొని, చనిన వాదిగా నీయూదేశం బననేల? అశేషాశావకాశమ్ములుఁ గ్రుమ్మరి, క్రమ్మఱి, భాగ్యవశమ్మున సమ్ముఖమ్ముఁ జేరఁగంటిని. అంతరాంతరంబుల, నే నెడనెడఁ గాంచినవింత లసంఖ్యాకంబులు గలవు. అవియన్నియు నెన్న, నేండ్లును బూండ్లునుం బట్టు. నిలకడమీఁద విన్నపంబు చేసికొనియెద. త్రోవను సేవకుం డొక్కయుపరాధంబుఁ గావించుకొని వచ్చినవాఁడు. ముహూర్తమాత్రంబు మార్గఖేదం బపనయించి, యామూలాగ్రంబుగఁ గార్యనివేదనం బొనరించెదు. దేవరదివ్యచిత్తంబున లెస్సగా నవధరింపవలయును. అని యరమోడ్పుఁగన్నులతో వేడినిట్టూర్పు నిగిడించి, క్షణ మూరకుండి, యల్లన నిట్లనియె.

జంబూద్వీపంబున వింధ్యం బను ధరాధరంబు గలదు. ఆగిరివరశిఖరంబున గహనవిహగంబులకెల్ల వల్లభుండయి, చిత్రవర్ణుం డను శిఖావలతల్లజుండు కాపురముండును. తదంతిక కాంతకాంతారంబున, నతనియనుజీవు లగుఖగంబులు కొన్ని, నన్ను బహుయోజనాధ్వగామిం గాంచి, యాతిథేయసత్కారంబు లాచరించి, యమృతకల్పంబు లగు పరిపక్వఫలంబులొసంగి, మెసంగి విశ్రమించియున్న నన్నుం జూచి, కుశల ప్రశ్నపూర్వకంబుగా నిట్లనియె. "ఓబకోత్తమా! యేదేశంబు భవజ్జననంబునకుఁ దావలంబై, పుణ్యంబువహించినది? ఏయేదేశములను నీవియోగవ్యథపాలు చేయుచు వచ్చి, యిప్పు డీదేశము నలరించుచున్నాఁడవు? ఇంకను నీపాదము లేదేశమును బవిత్రము గావింప నున్నవి? ధర్మపరిపాలనంబు గ్రాల మీనేల నేలుచు, నిను బోటిశుచిమూర్తుల సేవకులనుగాఁ బడయునంతటిభాగ్యము వహించి, సత్పురుషశిరోమణి యనిపించుకొనుచు, మీరాజ్యము నలంకరించుచున్న రాజరత్న మెవఁడు? మాయందఱకర్ణంబులు, భవదీయ

17

వృత్తాంత శ్రవణకుతూహలాధీనంబులయి వేచియున్నయవి. ప్రయాణ త్వర యొక్కింత కుదియింప వలనుపడునేని, నిమిషమాత్రం బిందు నిలిచి, నీయుదంతంబు సాంతంబుగా వానికిం బ్రసాదింపుము. నావుడు నే నిట్లు వాక్రుచ్చితిని.

"కర్పూరద్వీపమన, మును విని యుండు రేకదా? నే నాదీవికి దేవర యగుహిరణ్యగర్భుం డను చక్రాంగపుంగవుని యనుంగుభృత్యుం డను. ఆరాజు బహుకాలమునుండి లోకప్రసిద్ధుండు; కాన, నాతం డొకవేళ మీకు శ్రుతపూర్వుండై యుండనోవు. అందఱు నన్ను దీర్ఘముఖుం డందురు. ఆజాలపాదనాయకుండు నన్ను ప్రాణంబు ప్రాణంబుగా మన్నింప, సన్నిధానవర్తినై, మెలంగు చుందును. అట్లు సుఖైకభాజనంబనై యుండి, యొక్కనాఁడ శేషవిషయంబులం గల విశేషవిషయంబుల నీక్షింప నపేక్ష వొడమి, యారాయెడ యనిపీడుకోలు వడసి, యాపురము వెడలి, యొండనాక, వాననాక, దేశమ్ములు గాని దేశమ్ము లెల్ల సంచరించి, తత్తద్విశేషంబులకు డెందంబున నానందించుచు, వచ్చి వచ్చి, యట్టే పనిగ నేఁ డీదీవిఁ జొచ్చితి. ఇచ్చటివిశేషంబు లెల్లఁ జూడ నాయుల్లంబు కడువేడుకపడుచున్నది. పక్షివరులారా! యీగినశేషంబు, మీసమక్షంబున, నీదీవివినోద వీక్షావిహారంబునఁ గాలక్షేపంబు చేసి, రాత్రియు మీతోడఁగూడ; నిష్టకథాగోష్ఠి నడపి, యెల్లిప్రొద్దున మాసీమ కేగెద." అనవుడు నావిహంగంబులు ప్రహృష్టాంతరంగంబు లయి, "యట్ల యగుంగాక" యని, గమనపరిశ్రాంతి కొంత శాంతి పొందినపిమ్మట, నన్ను మున్నిడుకొనిపోయి, యాధాత్రింగల విలోకనపాత్రంబు లగు చిత్రంబు లెల్ల నాకుం గ్రమంబునఁ జూపి, యాపిదప నన్ను మగుడఁ దమ మనికిపట్టునకుం దోకొని, వచ్చి, యచ్చేరువ నివ్వాల దవ్వాల నిలిచి,

లోనితపఃజేనిం గాసిపించి, యిట్లనియె "ఓయకుండజకులమండనా! మీభువనంబును మాభువనంబును లెస్సగాం జూచితివి గదా. ఏది, యీదీవులరెంటిలో, సకలతీ కింపును సొంపును మిగుల నింపుచున్నది? ఏవాండు మనజేండు లిద్దఱలోం దద్దయుం బెద్దతనంబు వహించి మించును? అభిజనాభిమానంబును, ననుమానంబును మాని, నీమానసంబునం గలయది తప్పక చెప్పుము." అనినం, బ్రహాసభాసురముఖుండనయి నేనిట్లు పలికితిని:—

"నెచ్చెలులారా! మీరు, కూపకూర్మంబులవలె, సదా యిందుండి, దేశాంతర వృత్తంబులం గలనైనం గని విని యెఱుంగమింజేసి, యీలాగున జేలతనంబునం బలుకుచున్నారు. మీడెందంబులం గ్రందుకొన్నసందేహంబు వాపికొన, మిక్కిలి యక్కఅపడి యడిగితిరి. కాన, మైత్రిం బురస్కరించి, యున్నది యున్నట్లు వాక్రుచ్చెద, ఆలింపుండు. నిజముగా మాదీవికి మీదీవికి హస్తిమశకాంతరము గలదు. మాయావాసంబు జనతగణ్యాభువనంబు; మీనివాసము మహారణ్యము. ఇంక రాజుల సమగుచు రేని—మాజేనికిని, మీజేనికిని, బర్వతంబునకుం బరమాణువునకుం గలవాసి. మాయధీశ్వరునికి నిలయము కేవలము పద్మాకరము; ఆహార మమృతము; అనుచరులు నిరంతరము సరసులసంగతి సుంకుకవికులంబులు: మావిభునివైభవము సమగ్రముగా నెన్న వేనోళ్ళవాండును చేరం డస మనమా యింక వాకొనం గలవారము? పట్టిచూడ, మీదొరయుం దివియున్నియు విపరీతంబు లయి యున్నవి, నిలయంబు నట్టడవి; అశనమో, కాయలు గడ్డలు; భృత్యు లందుసూ, యనవరతము కుజనులసంగతిం దిరుగువలుగాకిమూంకలు. ముంజేతికంకణమున కద్దమేల? ఇట్టిమీప్రభువు వైభవము మీయుల్లంబులకే తెల్లంబు. అది యటుండ నిండు. మీరీ

శిఖచెంతఁ జేరి, చెట్ల గట్ల నీరీతిఁ బరితపింపనేల? కాయగసురు లేఱుకొని తిని మననేల? మిమ్ము గన్నప్పటినుండియు, నాహృదయంబున కిదియు విచార మగుచున్నది. ఏమి సేయవచ్చు? ఇది యంతయు మిమ్మిట్లుపుట్టించిన దైవంబుదోషంబు గాని మీదోషంబు గాదు. లోకములో సజ్జనులతోడి సఖిత్వంబు సంభాషణమాత్రసిద్ధంబు; కావున, మీరు నాకిపుడు పరమాప్తు లయితిరి. సత్పురుషులైనవారు పరుల కష్టంబు లైనఁ జూచి సహింపఁజాల రన, నాప్తుల యాపద లెట్లు చూచి సైరింపఁగలరు? ఈదేహమును ధరించుటయుఁ బరోపకారార్థమె యగుటను, మీకొక్క హితోపదేశంబు చేసెద. నాపలుకులు కుఱుచ సేయక, చెవులం జొనుపుఁడు. బుద్ధిమంతులరు, మీకు విస్తరించి చెప్పఁ బనిలేదు. బాగుపడఁ గోరెద రేని, గీడు మేలాడక, వైళంబ పయనంబయి, రేవకడ నాతోడఁగూడ మానేలకు రండు. అకడ మీకనన్యాపేక్షంబుగ వలయునట్లు జీవనము నడుచును. మారాయొడయండును, సర్వజనసంస్తవనీయుండు; పరమకృపానిరతుండు; ఆశ్రితసులభుండు; మిమ్మందఱఁ దనపరివారంబులోనివారిఁగా మన్నించును. ఆతని పాలంబడి, మీకుబోలినలీల మేలుగం గాలం బచ్చుటఁ బుచ్చవచ్చును. దీనికిం దగినయుత్తరం బంగీకారంబ. ఒండుతలఁపుఁదక్కి, ప్రయాణంబై రండు. ఆడుచుం బాడుచుం బోవుదము." అనిన, రోగార్తులకుఁ బథ్యపదార్థంబులుం బోలె, నాహితవచనంబులు, రుషారోగపీడితంబు లగు నాపక్షుల శ్రవణంబుల కనూయాజనకంబు లయిన, ముఖంబులఁ గోపంబులు ముడివడ, శుష్కహాసితంబు తెచ్చుకొని, కన్నుల మిడుఁగుఱులు రాల నన్నుఁ దుష్ణీంభావంబున నీక్షించుచు నాపక్షులెల్ల, నోరికి వచ్చినట్లు నన్నును దేవరను గొన్ని నికృష్టవాక్యంబు లాడెను. అవియెల్ల నిండినతోలగంబున నుగ్గడింపఁ బోలవు. అకుకక్క లటు

మొలిచినమాత్రంబున, నేలినసారిగౌరవంబున నొక్కతక్కువయుఁ గలుగదు. అవి తమనైజగుణంబులే వెడల నాడుకొన్నవి. పాములకుఁ బాలు వోయ విషవృద్ధి యగునట్లు, వివేకశూన్యులకు హితవాక్యంబులు గఱప దుర్మదం బెక్కును. సర్పంబుల కొక్కనోరె నెగాని, ఖలులకు నిలు వెల్లను విషంబే యని, మనీషులు నుడువుదురు. కావున క్షుల్లకజనంబులకుఁ బాడిఁ గఱపఁబోవుట నోరినాసంబు గాని వేఱు కాదు; అట్టి హితోపదేశంబువలనఁ జలంబు బలియుం గాని, లవంబును గుణం బలవడదు. కాఁబట్టి, బుద్ధిమంతుఁ డెల్లవిధంబుల వివేకలోకంబునకే బోధింప యత్నపడవలయును. కానిచోఁ జనితానవంబులకుఁ దెలుపఁ బోయిన చెవులపోతురీతిని, దన్పాక ముప్పుఁజెందును. ఆకథ యాకర్ణింపుఁడు.

మాల్యవంతంబుపొంత సంతతపరిణత ఫలకలిత తరుమండ మండితం బగువనం బొండు గలదు. అచ్చటిగోలాంగూలజాలంబు, మండు వేసవి నొక్కవాసరమధ్యంబున, మెండుగఁ దృషార్దితంబయి, బయలు వెడలి, కడుదవ్వునఁ బొడఁగను నగు మృగతృష్ణాప్రవాహం బాలోకించి, నదీప్రవాహం బని భ్రమయించి, మించినయెండ వేఁడిమి నడుగు లొక్కమొగిఁ బొక్క మిక్కిలిదూరము నడచి, యెక్కడను నిక్కంపు వారి పూరంబు గాన నేరక, యూరక డస్సి, యుస్సు రనుచు నడుగామడగా నాచాయ నున్న యొక్కన్యగ్రోధపాదపచ్ఛాయాశీతలం బగుసికతాతలంబున కల్లన నొడళ్లు సేర్చి, జటాఝూటంబులూఁతగా గూరుచుండియుండఁ, గొండప్రముచ్చొక్కటి తక్కటివానితో నిట్లనియె. "చూచితిరా! మలినముఖులారా! మన మిపు డెంతదూర మరుదెంచినారమో! మనయావాసంబున కీవసుమతీజరాజంబు యోజనంబుండు నని వినుచుందుము. ఎండతాఁకునం గడుబడలియు, జలంబులాన

నానను తలంపున, నదియొదె కాసారంబు డాసెద మని, యాసాసలం దత్తుకు నడిచితిమి. నడచినకొలంది నీ జలంబు లంతకంతకు దవ్వగు చున్నట్లు నామనసకుం గన్పట్టుచున్నవి. ఇప్పటిచొప్పు పరికింప, నడుగు తీసి యడుగిడుజాడ పొడగానరాదు. మధ్యందిన దినకరాతపతైక్ష్ణ్యం బునఁ గాళ్లు కాలి చాల బొబ్బ లెక్కినవి; నాలుక తడియాఱి పిడచవాఱుచున్నది. నేఁడీదప్పి కెట్లు దప్పువారము? ఏమిసేయుదము?” అని మిగుల వగలం బొగులుచుండ, నావటకుటకోటరాభ్యంతరంబున వసియించుశశకం బొకం డాదీనాలాపంబు లాలించి, స్వాంతరంగంబు కరుణాతరంగితం బగుడు, మనసు పట్టలేక, విధిప్రేరణంబునఁ దొఱ్ఱ వెడలి వచ్చి, యటుతే నిలిచి, కర్ణంబులు ఱిక్కించి యిట్లనియె. “ఓబుద్ధిహీనులారా! మీ రామెండమావులం గని కాఁబోలు, నీటి తావులని యాసపడుచున్నవారు. అవి మరీచికలుకాని వీచికలుగావు. ఇదిగో—నాచెయిచాయం దిన్నఁగఁ జూడుఁడు. అల్లదె—యాపల్లం బున, ననతి దూరంబున వారిజాకరం బొకండు గలదు. అందరిగి, మీపెదవఁ దీర్చికొండు; పొండు.” అన, నొక యసితాననంబు ప్రహసితాననంబై, కాలానల జ్వాలలీల మండిపడి, పటపటఁ బండ్లు గీటుచుఁ, గుటిలభ్రుకుటి యయి, చదలున నదరులు సెదరఁ జూచుచు లేచి, కప్పురపాటున నాకుం దేటిమీఁదికిఁ గుప్పించి యుఱికి, దానికడకాళ్లు తనకేలఁ గీలించి, పైకెత్తి చూసి,—“ఏంటిరే? యీశశాధముండు నోరఱుగ మనల నెన్నికాఱు లఱచెనో. మన మెల్లరము బుద్ధిహీనులమఁట! తానేమో మనకు బుద్ధులు దిద్దెడి పాటి మహాబుద్ధిమంతుండఁట! మనకుఁ దనకున్నపాటి వివేక మున్నదే? మనకుఁ జక్కట్లుదిద్దఁ డాఁగాక మఱియెవ్వ రున్నారు? ఏమి దీని త్రుళ్లు?” అని, నిందాగర్భంబుగాఁ దోడిమసికోఁతులతోడ నాడుచు,

గేలిగొనుచు, నిర్దాక్షిణ్యచిత్తంబున నాచెవులపిల్లిని బిట్టుగ నేలఁగొట్టి కాలం జమరి, కృతాంతనితాంతంబున కతిథిం జేసి, యవియన్నియుఁ గదలి జలాశయంబునకుం బోయి, తోయంబు లాపోవఁ ద్రావి, యథేష్టంబుగం జనియె. కావున, నెంతమాత్రము మూర్ఖుల కుపదేశింపఁ బూనరాదు. అట్లు పూనువానికి వరానక కీడుమూఁడును.

అట్లు దూఱి యప్పక్షు లెల్ల నన్ను రూక్షవీక్షణంబుల నీక్షించుచు, పరోపహరు షాక్షరంబుల మఱియు నిట్లనియె. "ఓరీ! దుర్మతీ! నీవు మతిభ్రమ గప్పి, మాకడ గోరంతలు కొండంతలు గాఁ జదువఁ జొచ్చితివి. అంతతోనైన నిలువక, నిర్భయంబుగ మాదేశమ్మును మమ్మును నూరక మిగుల నాడితివి. నీవు పాపవర్తనుండవు, నీబుద్ధి పోనిచ్చుకొందువే? ఏవారలంగాని వారినింబట్టుకొన్న నైసర్గిక దోషంబులు విడువవు. నీవును పక్షపాతలోలబుద్ధివై నీమనంబువాలిన యందఱకుం దేటపఱిచితివి. సర్వజనసమాదరణీయుండు చిత్రవర్ణుండు నీకాదరణమాత్రుండు గాకపోయెంగా! విపరీతచేతస్కులకుఁ బూజ్యులే యక్షిగతులగుదురు. నీవు నితరం బెఱుంగక, యెక్కుడువారల ధిక్కరించెదవు. నీకింతదురాగతంబు కొఱగాదుసుమీ. మింటఁబొఱు మొయిలుం జూచి పొఱుసహజభీరువునా నాన లేక, మాకడ నేమో గొప్పపౌరుషశాలి యని, యింతతడవును వర్ణించితివి! అట్టి మీరాజహంసంబున కెవరు రాజ్యాధికారం బొసంగిరి? అతఁడు రాజ్యభారంబు భరియింప నెట్లు సమర్థుం డగును? ఏవారు దేనిఁ బూననర్హులో, వారు దానిఁ బూనఁ బొసంగి యుందురు. అట్లు గానిచో, హాస్యాస్పదు లగుదురు. మీహిరణ్యగర్భుఁడా ను మ్మావదలవలనం బొచి, యేలఁజాలువాఁడు? మొగిలినీరునమ్మి, చెఱువునీరు పాఱఁ జల్లించునంతటి బుద్ధిమంతుఁ డిం దెవ్వాఁడును లేఁడు. మీరాజువంటి

వారు వేఱైన, మారాజున కెత్తు వత్తురే? చాలుఁ జాలు. ఈపాటి నీమాట లుడుగుము. మాకుఁ గాదు—నీకే మే మొక్క హితోపదేశంబు చేసెదము. తగవరివై తేని, మాపలుకు సేయుము. మారాజు మీరాజుఁగోటివారి నూఱుపుర రక్షింప దక్షుండు. మామాటఁబట్టి నీవును మీరాజును గూడ మారాజు నాశ్రయించి బ్రదుకుండు" అని యీపలుగుపులుగులు దేవరం దూఱుచున్న నేమిచెప్పుదు? నాకు నాకసంబును భూమియు నొక్కగ్రుక్కను మ్రింగవలెనన్నంత కోపంబు వచ్చినది. ఐన నే నప్పటి వెనుకముందరలేమి విచారించి, చేయునది లేక, యీ కన లెల్ల నుల్లంబుననె దిగఁద్రావి, పొరలి పొరలి వచ్చు పరుషోక్తుల నాలుకకుదకు రాకుండఁ గ్రుక్కి, కొంత శాంతం బవలంబించి, మది కలంగియు గాంభీర్యంబు తెచ్చుకొని, యిట్లంటిని. "ఆ! ఏటిమాటలివి! మీ రందఱుం జేరి యుపచారపూర్వకంబుగాఁ బ్రార్థించి యడిగిన, లోకంబుతోడిపాడిగా నాకుం దోఁచినది పలికితిని. మీ కది మనస్సువచ్చి చేయుదురేని మేలు; చేయకుండిన గడుమే లయ్యె. అంతియకాని, యింతమాత్రంబునకె కోపమెత్తి, యిట్టి తెఱంగుమాలిన పలుకులు నోర వెడల నిచ్చుట మీయట్టియుచితజ్ఞులకు ధర్మ మగునె? మారాజుగౌరవంబు పేర్కొన మీ రేపాటివారు? ఏల నిర్నిమిత్తంబుగ నసాధారణ గౌరవోదారుం డగుమారాజుని నోరికోఁదు లాడి, వలపనిపాపంబు కట్టుకొనియెదరు? లోకంబున సాధునిందకంటె నిక్కలిపాతకం బెద్ది? వృథాప్రయాసంబు; ఇట్టినోరిచే మేలు? నాబుద్ధి విని, యిఁకనైన మృదుమార్గంబు పట్టుఁడు. లోకంబున నెట్టిదిట్టలకును నాతివాఁడితనంబు చెట్టలఁ బుట్టింపక పోదు. ఎవ్వరును జాల నవ్వినవానిఁ బూలరువ్వరు! కాన, నేనును మిమ్మొక్కటి నడుగవలసివచ్చెడును. మారాజుమాట మిమ్మటఁ జూచు

కొందము. ఏదిట్ట ఖిూనట్టువపిట్టను బక్షిరాజ్యంబునకుఁ బట్టము గట్టినో మొట్టమొదట దాని నడుపుండు," అను నానోటిమాటలు నోట నుండఁగనె, కట్టలుక నొకపలుగాకికాకి కనుగీట, వేగ నాసైగఁ గైకొనిన గాకము లెల్లఁ బెల్లురేఁగి, చివ్వకుం జేఁ జాఁచుడు, లాతిచో శాంతంబునట్ల యవమానంబగుచోటఁ బరాక్రమంబ పురుషులకు భూషణం బగుటం దలపోసి, నేనును వెనుకదీయక కలని కాయితం బయి, ప్రతిఘటించి నిలిచితిని. అనవుడు సస్మితాస్యుండై, చక్రాంగ పుంగవుండు కొంగ కిట్లనియె. "ఎవ్వఁడుక్రొవ్వునఁ బరనిజశక్తులకొలంది గణింపక, రొక్కుఁడువారల డీకొన నుంకించునో, యాకట్టిఁడిమత్తుఁ డిక్కట్టులకెల్లఁ బుట్టినిల్లగును. తొల్లి యొకకపోతంబు పోతరంబున నంతరం బెఱుంగక, సాభువంబుతో నెదిరి మద మడఁచెను. నీ కాకథ జెప్పెద వినుము.

పాండ్యమండలంబున మధుర యను పురవరంబు గలదు. ఆవీటికోవెల నాశ్రయించి, యొకపారావత మిథునము వాసము చేయుచుండును. ఆఖగయుగ్మం బొక్కనాఁడు ముఖమండప సమీపంబున దేవాలయములో నేల ప్రాలి చెఱ లాడుచుండ, నొక్క శ్యేనంబు వాని దవ్వుదవ్వుల నీక్షించి, చేరవచ్చి దుర్గసమా శ్రయ బలంబునఁ బట్టనలవికాక, యప్పటికి నొడుపుదప్పి 'వంటయింటి కుందేళ్ళివి యెందేగఁగల' వనియెంచి, నాఁటి కెందేనియుం జనియె. అదియంతయు తెప్పలిడక చూచి, వెఱచి, పారావతి పతికిట్లనియె. "చూడరుగదా? ఇప్పుడొక్కజాలి, జాలిమాలి, మనలం బట్ట నీపట్టున కేతెంచి దుర్గబలంబుల మనలం జెనకరామికిఁ దలయూఁచి, మహాకోపంబున మనపైపునకె చూడ్కి నిగిడించుచుం జనియెడు. పుణ్యవశంబున నిప్పటి కాశశాద నాఘ మృత్యుదేవతవాతం బడక

బ్రదికితిమి. అది ముందెప్పుడును మనమీఁదనే కన్ను వేసి యుండును. ఇఁక నీచోటు వాయకుండిన, నెన్నఁడో మన మాయోరణంబు బారి కగ్గ మగుదుము. ఏవారిఁగాని బలవద్విరోధంబు లగ్గుగాదు. ఈతావు తరలి, వేగ నీడేఁగ నేగి తలంగుదము. తాత త్రవ్వించిన తటాకంబని పొంగి బ్రుంగం దగదుగదా? అందుల గొప్పకొన్నను, ఇది పెద్దలార్జించిన కాణాచియుఁగాదు. నిలయంబు వదలలేక, యిందుండి మిన్నక లయుం బంద నేల? ఇంక నీనేగికి వేగిర ముఱవగు వెరవు పరికింపక మసలరాదు. మసలితిమే నుసుఱులు తొఱఁగవలసి వచ్చును. కావున, మునుముట్ట మెలఁకువ పడవలయును. ఏమిబుద్ధి?” అని, కన్నుల నీరుపెట్టుకొని, గద్గదవచనయై యుమ్మలించు తనబోటిమాటలు గీటునంబుచ్చి, మగపులుంగు మొగంబున కలంతినగవు చెలువు గొలువఁ దన చెలువ కిట్లనియె. “ఏల యీలాగున వలవనివెఱపు గట్టుకొని, నాలా వెఱఁగక, రిత్తయుత్తలపాటు చిత్తంబునకు హత్తించెదు? ఉన్నయూరును గన్నతల్లియు నొక్కరూవన వినవే? సాటివానిపోటున కోహటించి, గృహంబు పాడఱఁజేసి పాఱినఁ దోడివారు మనలంగని నగరే? దానిచే నగుపాటు దక్క నొక్కకార్యంబు లేదు. దైవంబు తప్పఁజూచిన, మనయత్నంబు లన్నియు నీట్రివా లగును. వెరవులు వేయును నొసలివ్రాలు తుడువనేరవు. దేహికి సుఖదుఃఖంబు లీశ్వరేచ్ఛాయత్తంబులు. సుఖమ్ములు రమ్మని తెచ్చుకొన్న వచ్చి, దుఃఖమ్ములు పొమ్మని త్రోచివైచినఁ బోవునే? మాఱియొక్కటి వినుము ఎట్టి విక్రమ ధురంధరులును నాకట్టెదుటఁ దలచూప నోడుదురు. ఈతుచ్ఛంబగు డేగ యెంత? ఆసాళువంబును నొక్క ఖగంబకాని దయ్యంబుగాదు. నీమది నాయధమశశాననంబున కింత భీతిల నేల? అదియు శకుంతంబు; నేనును శకుంతంబను. ఎక్కుడ నేనియు వజ్రంబు

నకు వజ్రంబు తక్కువగునె? ఏల యూరక కొఱమాలిన పిరికితనంబుఁ గఱపెదవు? అక్కఱటిపక్కి నిక్కంబ మనదిక్కునకు వచ్చెనేని, నేనొక్క ముక్కుపోటునం గీటడంచెద నొండె; కులిశనఖంబులగు నిశాతనఖంబులం జించి చెండాడెద నొండె. ఆర్యులు కార్యమ్ముల దమశౌర్యమ్ములం బ్రకటింతురుగాని, మాటలం బ్రకటింప నొల్లరు. నాకిప్పు డూరక నీతోడ వాగ్వాదమేల? నీవు చూచి మెచ్చుతఱియును వచ్చును. నావచనములు విశ్వసించి, యావంత యావంతయు లేక, నిశ్చింతమ్ముగ నుండుము. మన కిప్పుడు వచ్చిన భయమేమియు లేదు; అని, యూఱడించిన నాపులుఁగుచెలువ చెలువునిమాటకు మాఱాడ వెఱచి, లోనియారటంబున కూరటఁగానక, డెందంబున డోలాందోళనంబు నొంద, మొగము వెలవెలపా టెలనగవున నడంచి, యూరకుండెను. అంత నాఁడేగయుఁ బగచాటి, మఱునాఁడు రేపాడి వెడలి వచ్చి, యాలయప్రాసాదంబుమీఁద నిర్గమద్వారంబువలనికిం దృష్టి సారించి, పొంచి చూచుచుండెను. అప్పు డక్కలరవంబు లరుణోదయంబున, నెప్పటియట్ల సంచారార్థంబు మందమందగమనంబుల దిక్కుల కరుగ వెడలుడు, నాఁటితోఁ బావురపుసతికిం బతితోడి ఋణానుబంధంబు తీఱుటం జేసి, యయ్యాణుజు, పోతుబకదారి నుక్కున ముక్కునం గఱచికొనిపోయి, నాఁటిబోనంబునకుం దానిఁ బోలి ముద్దఁగాఁ జేసికొని, యాప్యాయనంబుగ సాపడియె. అకలరవాంగనయుఁ బులినోరికండ జాఱిపడ్డట్లు చావునకుం దప్పి, దేవళంబుం దూఱె. ఎంతవారికిఁగాని, యాత్మకృతదోషఫలం బవశ్యభోక్తవ్యంబ కదా. కావున, బలవంతునితో నొంటమిఁగొంట దుర్మరణంబునకే కారణంబగును.

మఱియు నెంతటిబల్లిదులకును వాక్పారుష్యంబు మేలుగాదు.

దానివలన సర్వకార్యంబులును విఫలంబులై చనును. గోడ్డంట నటు కిన తరువైన మరలఁ జిగిరించుంగాని, మాటల విఱిగిన మనసు తిన్నఁ బడ నేరదు. మున్ను వాగ్దోషంబునంగాదె యొకగర్దభంబు మర్దింపఁ బడియె. నీకాకథ వాక్రుచ్చెద నాలింపుము.

కరిపురంబున విలాసుం డను రజకుం డొకండు గలఁడు. ఆమడి వేలు చేరువగ్రామమునుండి క్రొత్తగా నొకగాడిదను విలిచి తెచ్చి, దాని బలిసింపవలె నను తలంపునఁ జక్కనియుపాయం బొక్కండు వెదకి, పొడగాంచి, యాగాలిగాని మేన నొక్కపులితోలు ద్రేలం గప్పి యప్పుడప్పు డరణ్యప్రాంతసస్యక్షేత్రంబుల రాత్రులు ద్రోలుచుండును. క్షేత్రరక్షకులును విభావరిం బులికళాసంబులోనిదాని దూరమునుండి విలోకించి, చిత్తమున వ్యాఘ్ర మను భ్రమ గప్పి, యప్పుడ భయో త్కంపంబున డాయ నోడి, యూడనీఁబొడుదురు. కాఁబట్టి నిరంత రాయముగా నిచ్చలుఁ బచ్చగందని పయిరు కడుపార దొరుకుచుంటం బట్టి, కఱవాఱ మేసి పోసరించి, యారాసభంబు యథేచ్ఛముగాఁ గ్రుమ్మరుచుండును. ఇట్టు కొంతకాలము కడచినపిమ్మట నొక్క నాఁడు, క్షేత్రస్వామి యొక్కఁడు తాగుఁడియవాఁడు తన పయిరు నిచ్చలుఁ బొలివోవుచుంటకు మనంబున దుఃఖించి, దూరము విచా రించి, యెట్టకేలకు మనంబు గట్టిపఱుచుకొని, నెట్టన సాహసించి, దుర్గమం బగు ప్రయత్నంబునఁ బొలంబు సొచ్చి, ధూసరకంబళంబు మెయినిండం గప్పుకొని, యుపాలంబునవలతటి నొకవృక్షంబు క్రీనీడ నధిజ్యశరాసనుండయి కనుమోసములేక పొంచి కూర్చుండి యుండెను. అవ్వ డెప్పటియలవాటుచొప్పున ఖరంబు చేను చొచ్చి, యచ్చేరువ బూదివన్నెయగొంగళిలో నున్న పొలముకాఁపును వే ఱొక్కగర్ద భంబుగా వగచి, కాలపరిపాకం బగుటను వాని కళిముఖంబుగాఁ

గూయుచు డాయవచ్చెను. ఆకూఁత విని పాలముకాఁపు కలరూపు తెలిసి, దరహాసచంద్రికా సుందరవదనేందుండయి, "యీకాకిగ్గాడి గాడిదా యిన్నాళ్లను మాయుందఱకన్నులను గప్పినది!" అని నిర్భయంబుగ డాయఁబోయి, యాబాలేయము నవలీల నొక్కకోలం గూలనేసి, కృతాంత దర్శనంబునకుం బుచ్చి, కృతకార్యుండయి చని నాఁటఁబట్టి కరము సుఖంపడియుండె.

కావునఁ బలుకు బ్రల్లద మెప్పుడుం దప్పక గొప్పయొప్పమిఁ బుట్టించును. శ్రేయస్కాముం డది యుడిగి, యడఁగి మడఁగి యుండ వలెను. అది యట్లుండె; తదనంతరవృత్తాంతంబు వినిపింపు మనిన, హంసంబునకు బకోటం బిట్లనియె.

అట్లు వాని పరుషభాషణంబులకు రోషించి యుద్ధసన్నద్ధుండ నయి నిలిచిన నన్ను వీక్షించి, యాపక్షు లిట్లనియె. "ఓరీ! స్వామి ద్రోహీ! యింటఁగుడిచి యింటివాసము లెన్నికయిడిన వడువున, మాదేశమునఁ గ్రుమ్మరుచు మాస్వామినే యాక్షేపింపఁ జొచ్చితివి. కావున, నీవు సద్యోవధార్హుండవు; పాపకర్ముండవు; నీయెడ నించు కయిన దయఁ జూడఁదగునె? కుడిచి కూర్చుండి యుబుసుపోక, నోరి క్రొవ్వున నింత తెచ్చుకొంటివి. చేసికొన్న దనుభవింపకతీఱదు. మ మ్మెవరిఁగా జూచితివి? శౌర్యాలంకారుం డగు చిత్రవర్ణుని బంట్లను మ మ్మెఱుంగవే? ఇప్పు డెట్టును నీప్రాణంబులు పుచ్చుకొనక విడువము. నిమిష మడిచిపడకుండ నిలువుము. నీవడుబాములు చూచెదవు." అనుచుం గవిసి, దురాగ్రహాగ్రస్తంబులై యాఖగంబులు నఖరముఖ విదారణంబుల బక్షతాడనమ్ముల నన్ను నొంచి, మఱియు నిట్లనిరి. మీరాజు మరాళంబు మిగుల మెత్తనివాఁడు. అట్టివానికి రాజ్యాధి కారపూజ్యత యెక్కడిది? సంతతక్షుముండైనవానిం గని, భృత్యులు

వెఱపిక యెల్లిదంబుగఁ జూతురు. క్షమాతేజంబు లారాయి యెడలఁ బ్రయోగించుట రాజధర్మంబు. అట్టిరాజే ప్రజానురంజకుం డగును. సంతతతేజుం డగుటయు క్షేమంబు గాదు. తేజంబు కడుఁజూపిన వాని నతిక్రూరునిగా భావించి, వానిపొత్తు నహిపొత్తుగా నెంతురు. కావున, నిలాపాలనంబుఁ బూనువాఁ డవసరోచితంబుగ క్షమా తేజంబులు రెండును వెలయించుచు, వీరశాంతాదిగుణంబుల, సరఘాసమాశ్రిత మధుకోశంబు చందంబున నధృష్యుండును నభిగమ్యుండును నయి చూపట్టవలెను. ఏకాంతమృదువగు వాఁడు కరస్థమగు నర్థము నేని రక్షించుకొన సమర్థుండు గాఁడన, ప్రజాపాలనదక్షుండయి రాజ్య భారంబు భరియింప నెట్లు శక్తుం డగును? అప్పాలఁ బడియుండు తెలి పిట్టయా రాజనామంబుఁ దాల్ప నర్హుండు? దానిఁ బూనువాఁ డెంతటి వాఁడు కావలెను? అట్టి దుర్బలుని పాదసేవకుండవయి నీ వేమిభాగ్య మనుభవించితి వని, నిక్కంపు హితుండవుఁబోలె మాకీ వెడబుద్ధులు గఱపవచ్చితివి? లోకమున నెవ్వారైనఁ బ్రబలునిం జేపట్టుదురు! గాని దుర్బలునిపొంతలం బోనైన నొల్లరు. ఆశ్రయించినను, ఫల చ్ఛాయాసమన్వితం బగు మహావృక్షమునే యాశ్రయింపవలెను. ఒకవేళ దైవికంబుగ ఫలంబులు లభింపకపోయినను, ననివార్యంబగు దానినీడ నేఁడు మాపనోపునే? సింహప్రసాదంబున నజంబును వనం బున నిర్భయంబుగఁ జరియించుటఁ గానమె? అట్లు, ప్రబలులం జేరినలాఘవాస్పదునకును గౌరవం బబ్బును? ద్వేష్యులును సర్వజగ న్మాన్యు లగుదురు; ఇఁక నార్యులు ప్రశంసనీయు లగుదురని యుగ్గ డింప నేల? ఎప్పుడును హీనుని మాత్రము చేరరాదు. చేరినచో, మునుగల గౌరవము సైతము పోవును. శౌండికకరంబున నున్న పాల ముంత నేని కల్లుముంతయే యందురు. నీచసేవ కేవలము శ్వవృత్తి

పడిన యాయాసం బెల్ల నిష్ఫలం బగుటయకాక, దాన మనోభీప్సితం బెప్పుడును సఫలంబు కాదు. హీనమానసపదార్థాశ్రయులకుఁ గొన్ని యవ సరంబుల వోనంగులును బోసంగును; అట్టివారి జన్మంబు లెప్పుడును దుఃఖభాజనంబు లగును. ఎప్పుడైనఁ దప్పిదారి, యించుక యభీష్టఫల సిద్ధి యయిన నది తుదముట్టనేరదు. అల్పజలాశయంబుఁ జేరిన విసా రంబునట్టుల, యల్పు నాశ్రయించువాఁడును వానితోడన తీఱును; అట్లు తీరకయున్నను, నాగండకమున కెట్లు వానికి నట్లు గండములు మెండుగా నుండును. అల్పులతో క్షణమాత్రంబును నిలువను, సం భాషింపను, బోలదు. సజ్జనసాంగత్యంబున సర్వార్థసిద్ధులంబోలె, దుర్జనసంగమంబున సకలానర్థములును ప్రాప్తము లగును. ఆధారా ధేయభావంబునం జేసి యాదర్శంబున ద్విరదం బన్నువయయి కనుపట్టు నటుల, యలంతులఁ జేరినవలంతులును నలంతులయి కానఁబడుదురు. కాన, హీనసేవ యావంతియుఁ గర్తవ్యంబుగాదు. పొట్టకయి యట్టి హీనుని కాళ్ళుపట్టుకొని, కష్టపుజీవనము జీవించుటకంటె, మానవంతు నకు నిశ్చంచలం బగు నిశ్చయంబున నడవిలో నుండి, వన్యాహారం బుల సుఖముగాఁ గాలము గడపుట సర్వలోక సమ్మత మైన పక్షము; లేదా, కీర్తిధను నొక్కనిపాదభక్తుఁడ నని పేరుపెట్టుకొని, తక్కవ పాటులేక బ్రతుకుట యంతకంటె నుత్తమపక్షము. మఱియు లోక ములో రాజునాశ్రయించుట, కష్టకాలంబులఁ దమ్మాతం డపాయం బులవలనం బాపి కాపాడునని కదా? అట్టిరక్షణ మా రాజువలనం గలుగకపోయెనా, వానితోడి ప్రయోజన మేమి? అట్టి పరివృఢుండు లేకపోయినను, వ్యవ దేశంబున నైన బ్రతుకవచ్చును. తొల్లి శశ మ్ములు వ్యవదేశంబునంగాదే, యభిమతార్థసిద్ధిఁ బడసి నితాంత సౌఖ్యం బనుభవించె? ఆకథ ససాకల్యముగా వినిపించెదము వినుము.

పూర్వ మొకప్పు డనగ్రహనిగ్రహంబు సంభవించి, జలాశయంబు లెల్ల జలశూన్యంబు లైన, దైన్యంబున గహనంబునం గల మాతంగజనివహంబులు యూథనాథు పాలికిం బోయి, సకరుణంబుగా నిట్లనియె. "స్వామీ ! యేమని చెప్పుదుము ? ఈనికటంబున మే మజస్రంబును స్నానపానంబులు సేయుతటిని, యీయేటివఱపుచే నిదాఘంబగుడుఁ బ్రబలాతపతాపంబున జంబాలమాత్రావశిష్టం బయ్యె. అల్ప కాసారంబులగతి తడవ నేల ? తావకచరణసేవకుల ముగాఁ గాఁజాలియు, ననతిక్రమణీయం బగుమాయభాగ్యంబుకతం బునఁ దృష్ణాతిరేకంబున మాకిట్లాకులపాటు పాటిలవలసిన కాలంబు సంప్రాప్తమయ్యెను. ఇట్టిదుష్కాలంబు ప్రాప్తమగునని కల నేనిం దలఁచి యెఱుంగము. ఏకాలమున నేమివచ్చునో యెవ్వఁ డెఱుఁగును? ఆహా! కాలంబుఁ బోలుదానిఁ, గాలంబుఁ దక్క నింకొక్క దానిం గానము గదా? ఇత్తఱి మమ్ము భవదీయప్రసాదోపజీవుల నీవిపానం గాసిలకుండ నేది, యీబారిఁ గడవఁబెట్టు దేవరచరణంబులుదక్క నన్యంబు శరణంబుఁ గానము. మేమందఱము మామనఃపరితాపంబు నివేదించి, దేవరకృప నాశ్రయింప వచ్చితిమి. వేళంబ దీనికిం దగిన నదుపాయంబు చింతింప వలయు. అనన్యగతికులమగు మమ్మింక ముంచినం దేల్చినను దేవరదే భారము." అని యూరకున్న, యూథనాయకుండును సంక్షుభితం బగుహృదయంబునఁ, గార్యభారమగ్నుండై కొండొకవడిచింతించి, యొక్కజంఘాలునింబిలిచి, నీవిప్పుడతిత్వరితగతిం బోయి, "యీకుఱంగల నెందైన మధురశంబరపూరితం బగుసరోవరం బారసి, మాకడనున్నట్లు చనుదెమ్ము. అట్లు సేయఁబ్రాలుమాలి యూరక రాక, నీయనువర్గంబులపోక సుమీ." అని పంచిన, వాఁడును వినయానయ భయంబులు హృదయంబునం గదుర, ఱేనియానతిని శిరసా

వహించి తత్క్షణంబునఁ గదలి మనోవేగముతో నేగి, విపినం బెల్ల వెదకి, తుద కచ్చేరువ నొక్కమడువు పొడగని, హర్షోత్కర్షంబునఁ బఱతెంచి, యూథపతి కిట్లనియె. "దేవా! సేనకుం డీవనమధ్యంబున నిర్మలజలపూర్ణహ్రదం బొక్కటిచూచి, యిదిగో సఫలప్రయత్నుఁ డయి వచ్చె; ఇంక భృత్యులతోడఁ గూడి దేవర విచ్చేయ నవసరంబు. మనవారెల్ల నాప్యాయనంబుగఁ బానీయంబులు గ్రోలఁ గాంచిరి." అన; సామజస్వామియు, గడుఁబ్రమోదించి, యతని నభినందించి, గజవ్రజంబుల వెంటఁబెట్టుకొని మడువుకడకు నడచి, జలమ్ముల డిగి, తోయమ్ము లాకంఠమ్ముగఁ గ్రోలి, కంఠదఘ్నమ్ము లగునంబువులం దేలి, యోలలాడం దొడంగెను. అప్పుడు, యాతాయాతగజవ్రాత పదతలాఘాతమ్ములం జదిసి సమసినశశకవిసరమ్ముల నాలోకించి, శోకానలసంతప్తస్వాంతుండయి, శశకేంద్రునిమంత్రి రోమకర్ణుఁడు బెగ్గలంబగ్గలింపరోజుచుఁ బారుతెంచి, నిజాధీశ్వరునిశిలీముఖునిఁ గాంచి, వినయవినమితోత్తమాంగుండయి నమస్కరించి, తమవారికిఁ బాటిల్లిన 'ముప్పుచెప్పఁబోయి, డగ్గుత్తికపడి, కొంతవడియూరకుండి, యెట్టకేలకు నెలుంగుతెచ్చుకొనియిట్లనియె "దేవరవారుకంటిరో కానరోకాని, గజ విసరములచే మనశశములకుం బ్రళయము ప్రాప్త మయ్యెను.— అనుచు, నాదారుణ భాషణము శ్రవణములం దూఱి హృదయ దారణము గావింపఁ, గరగుప్తకర్ణుండై 'హరిహరీ' యని కన్నులు మూసికొని, కొంతసేపు చిత్రాయమానగాత్రుండయి ఱిచ్చవడి యుండి, మంత్రిప్రయత్నంబునం దెలిసి, దీర్ఘనిశ్వాసపురస్సరముగా నలుదెసలుం జూచి, యల్లన లేచివచ్చి, కార్యచింతాపరత్వమున నమాత్యులంగని శిలీముఖుండిట్లనియె. "మంత్రులారా! యీ యేఁడు వేసవివేఁడిమిఁ బోఁడిమిచెడి, యెల్లవంకలవంక లింకంబాఱిన, మీఱిన

దగ వెల్లిదమున నుల్లములు పల్లటిల్ల, వదనములు వఱువట్లువట్ట, వేదండతండములు నడగొంకపిండువడువున వెడలి, పుడమి యీనిన చందమున నెల్లెడలఁ దామ యయి, మెండుకొని యున్నవి. ఇప్పుడు వానియడుగుల యడుగునం బడి మడిసిన మనచెవులపిల్లులసుద్ది విని యప్పటినుండి నాయుల్లము పెల్లు తల్లడిల్లుచున్నది. పిపాసాపరాయత్త చిత్తము లగు నీమత్తదంతావళసంతానముల సక్రాంతము నంబుపానార్థము వచ్చుచుఁ బోవుచు నుండ నిచ్చితిమేని, యచిరకాలమున మన కులంబెల్లఁ బ్రాణములు గోలు వోయి, నామమాత్రావశేషం బయి యుండవలసి వచ్చును. ఇప్పటికే కించిదూనముగాఁ బొలిసి, పారావారమ్ముఁ బురుడించుబలంగమ్ము గోష్పదాకృతి యయ్యె. ఇంకఁ దడసినఁ, గార్యంబు తప్పును. బలహీనులము కావున, మనకు వాని మాఱుకొనుపాటిబలిమిలేదు. ఏమిసేయువారము? ఎట్లయిన నీవారణంబులబారికిం దగు ప్రతీకారంబు సత్వరంబుగ నారయం జను." అన, శోకవిస్మయపరీతస్వాంతులయి యెద్దియుం దోఁచక, మంత్రులన్యోన్యముఖావలోకనంబులు సేయుచు, మన కిట్టెడ దైవంబకాని వేఱొండు శరణంబు లేదని వగఁగూరి, మొగంబులం దెలివితప్పి యుండ, నాదరవినయసంభ్రమంబులు ముప్పిరిగొన నాతటి విజయుం డను ముసలికుందేలు శిలీముఖున కిట్లనియె. "ఓమహాప్రభూ! దేవరదివ్యచిత్తంబున నిది యొకపనిగా నెంచి చింతింపవలదు. దేవరదయ గలుగ, నాకీయమిత్రుల నోర్చు టెంతపని? లోకంబునఁ బ్రజ్ఞాసాధ్యంబులు కాని కార్యంబు లేవియు లేవు. దేహబలంబు లేనివాఁడయ్యు, శేముషీమంతుం డెంతఘనకార్యంబు నైనఁ దృణప్రాయంబుగ నిర్వహింప సమర్థుండై యుండును. దేశకాలజ్ఞులమై యనారతము దేవరమోలగంబునం గొలువుసేయుమముబోఁటివారి కీనాగమ్ములఁ దోలఁగఁ

ద్రోలుట యొకదుష్కరము గాదు. స్వామి కనుగిఱిపినం జాలు వీలినవారిని యోగబలంబున, నశ్రమంబున నెంతటికార్యంబు నైన ననివార్యంబుగా సాధించుకొని, నీ లెంకల లెంక రాఁగలండు." అని యనిపించుకొని చనువాఁడయి యాజ్ఞయే యనఁ గుందేళ్ళరాయం డును నాతనిఁ బ్రీతిశీతలంబగు నాలోకనంబునం జూచుచు, నంగీకార పిశునమందహాసనకందళసుందరం బగు మొగంబు వంకించి, "సరగ నరిగి కర్జంబు సఫలంబు చేసికొని రమ్ము. నీతలంపునకు దైవం బనుకూలం బయ్యెడు" మని దీవించిన, 'మహాప్రసాదం' బని వనివిని, మార్గంబున నిట్లు చింతించెను.—ఆదంతిరాజు మహాజంతువు; నేను గడు నల్పజంతువను. ఆగౌరవం బారసించి నా కెట్లు మాటలాడఁ దలకూడును ? తలకూడెఁబో, కార్యసంఘటనం బెట్లు సాధ్యమగును? నే నందని మ్రానిపండ్లు గోయం దలపెట్టితి. నా కోరిక యీడేఱునో యీడేఱదో గదా? — అని చింతాడోలాయమానమానసుండయి, కడకుఁ బరమోపాయంబొక్కటి బుద్ధికిం దవిలినఁ జక్కఁగాఁ బరికించి, యది మనసునకు సరివడ్డ తరువాతఁ గదలిపోయి, 'స్పృశించుచునె ద్విపంబును, నాఘ్రాణించుచునె యురగంబును, పాలించుచునె నృపాలుండును, నవ్వుచునె దుర్జనుండును, హింసింతు' రని విచక్షణులు పలుకుదురు.—కాన, నేనీనగాగ్ర మెక్కి కరిరాజుతో ముచ్చటించెద నని నిశ్చయించి, వేగ నాగిరిశృంగం బధిరోహించి, రాగమనంబు ప్రతీక్షించుచుండె. అపగిదిం గొంతతడవాతనిరాక కెదురుచూచుచుండి, దంతినాయకునితో మడువున కేతెంచి పానీయంబులు గ్రోలి మరల యిరవున కరుగుచున్నవానితోఁ గొండ కొమ్మున నుండి యిట్లనియె. 'ఓ మాతంగపుంగవా! నీకు సమస్తంబును శస్తంబగుఁగాక! ముహూర్తమాత్రంబు నిలిచి, నావచనంబులు విని పొమ్ము"

నావిని యూపలుగొమ్మల మొగమ్ములజేఁడు మొగమెత్తి చూచి, “నీవెవ్వఁడవు? మాతోడ నేమికార్యము గలిగి మాటలాడ వచ్చితివి? కాలవిలంబనంబు సేయక నీయుదంతం బంతయు నొకటి రెండు మాటల నుడువుము” అనిన, విజయుం డిట్లనియె. “ఎవ్వనిపేరు విన్న నహిత చక్రంబులు నిచ్చనుఁ దల్లడిల్లుచుండు, నాకు వలహ్యైకాధినాథుండగు రాజుదూతను నేను; దూత యయినవాఁడు విరోధి యనిరోధ క్రోధంబునఁ గృపాణపాణి యయి ప్రాణంబులుగొన గమకించుచున్న నైనఁ, ద్రాసంబు వాసివాయోడక యథార్థంబె వచియింప వలయుం గాన, నానిశానాథుండు తానుగ నీతోడ నాడుమని నాకుం గఱపి వుత్తెంచిన వార్తలు కొన్ని గలవు: వచించెద. వాని సావధానముతో నవధరింపుము.—మదీయాజ్ఞాపరిపాలితం బగుటంజేసి, యీసరోవరం బెట్టి భీమబలులును నాయనుమతంబు వడయక కదియ శంకింతురు. మీరు నన్నుఁ బూరికింగొనక, నేటితే పోట లేక యీకొలను సొచ్చి, కలగుండు వఱచితిరి. అంతియకాక, పథంబున నస్మదీయ పాదభక్తుల శశంబులనేకంబులరూపుమాపి నాయెడ మహాపరాధంబుగావించితిరి. బుద్ధిగలిగి బ్రదుకఁదలంతురేని, యీక్షణంబ మడుంగువిడిచియొండుకడకు నడచునది. ఇదిమొదలెన్నండును నాముదలఁగొనక కొలఁకుఁ జొరకుండునది. ఎఱిఁగి యెఱుఁగములంజేసి, మీరింతదనుకం జేసిన నేరంబు సైరించితి. ముందు నాపనువుచేసి, మొక్కలంబు మాని ప్రాణంబులు గాచికొండు. అట్లుగాక యింకను మదాంధకారంబునఁ గన్నుగానక మదీయాజ్ఞోల్లంఘనంబుఁ గావింపఁ బాలుపడుదురేని, మిమ్ముందఱ నస్మదీయప్రతాపానలంబున కొక్కటఁ బూర్ణాహుతిఁ జేసెద. మీఁద మీకుంబోలినగతిఁ జూచుకొండు.—అని రోషాతిభీషణుండయి, సంవర్త సమయభీషణ హుతాశనకీలపోలిక మండిపడుచున్నవాఁడు. కాలాతి

పాతంబుగాకుండఁ, బరమకృపానిరతుం డగు హిమకరుని శరణుసొచ్చి, తదనుగ్రహంబునకు భాజనంబ వగుము. ఆతనియానతి మన కందఱకు నవిలంఘనీయము. మీకుఁ బ్రాణములు చేఁ దగునేని, యాతనియాజ్ఞ నన్యథాకరించునది." అనుడు, దంభోళిపాతతుల్యంబు లగు నావాక్యముల హృదయంబు వగిలి, బెగడు గదిరి, కంపంబు సర్వాంగీణంబై యొలయ, వివశం బగు డెందంబు నెట్టకేలకు నూలుకొల్పి, గద్గదిక నెలుంగు దగులువడఁ గుంజరపతి చెవులపోతుం గని యిట్లనియె. "క్షుద్రులము మే మామహామహుని కోపంబున కెంతవారము! తనయు లెం దయిన బుద్ధిదోషమున నెదురుపడి యాజ్ఞ మిగిలినఁ, దండ్రి యది మనసునఁ బెట్టునే? ఆశీతాంశునకు బుధుఁడొకఁడును మే మొకరముఁ గాము. మే మజ్ఞానకృతంబున మి మ్మాయాసపెట్టి కడునవజ్ఞఁ జేసితిమి. మాచేసినయావ్యతిక్రమమ్ము క్షమియింప నీవే మామారుగా క్షమాకరుం బ్రార్థింపుము. ముందెప్పుడు నీతటాకంబు చెంతలం జేరము. దీనిం బ్రాణభయమునం బలుకు కార్యవశంపు మాటనుగాఁ బాటింపఁబోకుము. ఏనిన్ని మాటలవాఁడంగాను. ఇంక నీపలుకుఁ ద్రోచిన, నీపాదములకుం దప్పినవార మగుదుము. మీరాజు సమ్ముఖమ్మున మామీఁద దయ పుట్టునట్టుగా నెట్లు ప్రసంగించెదవో నీదే భారము. మదీయవిజ్ఞాపనము విని వాఙ్మాత్రంబున నీవు మాకీ యుపకారము తప్పక చేయవలయును. మఱవకుమీ పోయివత్తుము." అనిన, శశకం బిట్లనియె. "ఓయూథనాథా! మానాథుం డగు సుధాంశుండు సన్మార్గవర్తి; దయాసుధానిధి; శరణాగతభరణైకబిరుదాంకుండు; భక్తు లెంతలెంతలు తప్పులు చేసినను, ననుతాప వడిరేని నెరసు లెన్నక మన్నించును. తలం కొందకుము. నీవారును నీవును గావించిన యపగడంబు లెల్ల నిస్సంశయముగా లోఁగొనును. ఈ

సరోలలామం బాయున పేరనె చంద్రసరస్సనాఁ బరఁగు చున్నది. మ మ్మాత్మసంతు దీనికిం గావలిపెట్టి, నిచ్చోట నున్నవారము. మే మందఱు మాయన భృత్యులము. ఆదయాళుండు మ మ్మనవరతము హితప్రాణంబులుగాఁ జూచుకొని, పుత్రవాత్సల్యంబునం బ్రోచు చుండును. శశంబులం గలిగి యుంటనే, యాశశధరునకు శశి యను నామము జగమునఁ బ్రఖ్యాతం బయ్యె. ఇప్పు డాతం డతిదూరం బగు గగనపథంబున వర్తించు చుండును. మన కాప్రదేశంబు బహుళతర ప్రయాసగమ్యంబు. ఆతఁ డెడపడడవ నీమడుగునకు వచ్చి చూచి పోవుచుండును. ఈనిశాసమయమున నీసరోవరంబునకు విజయము చేయఁ గలవాఁడు. సమ్ముఖమున రాయబార మేటికి? అప్పు డాతని పాదసందర్శనంబు చేసికొని, మీయపరాధంబు సర్వంబును నివేదించి తదీయానుగ్రహంబు వడసి, చనుటమంచిది. అందాఁక నిందు నిలువుము." అని, యొడఁబఱిచి, ప్రొద్దు వాలినపిమ్మట గజరాజును వెంటఁ బెట్టుకొనిపోయి, సంజవేళకు జలాశయంబు చేరి, కొలనిజలంబుల ననిలవశంబునం గదలునరుణంబగు నిశాకరప్రతిబింబంబుఁ జూపి, యిట్లనియె. "అదె చూడుము. కుముదబాంధవుండు క్రోధరసం బుట్టి పడ నెట్లు కోపప్రకంపమానాంగుఁ డయి యున్నవాఁడో. ఇది నీవు సంభాషింప నవసరంబుగాదు. కినుక తీఱిన వెనుక సమయము చూచి, నీచందం బీచందమామకువిన్నవించి, నీదెసఁబ్రసన్నహృదయుం గావించెద. ఇక్కడ నీవు మతేమియుఁ ద్రవ్వక, గ్రక్కున మ్రొక్కి నీయిక్కకుంజనుము. కడమపని నామీఁద విడువుము." అని సము యోచితముగాఁ బలికి యేనుఁగును మ్రొక్కించి వీడుకొలిపి, విజయుం డును దనజన్మంబు సఫలంబయ్యెఁగదాయని యలరి, వికసన్ముఖుం డయి చని, శిలీముఖమునకు నమస్కరింపుడుఁ, గార్యనివేదనం బొన

రించునంతకు మానసంబు పట్టఁజాలక, విస్మయసూచనలోచనలోచులు నిట్టివాడువ నిట్టనియె. "కార్యము గోట మీటుకొనివచ్చుట నీముఖ వికాసంబె చెప్పక చెప్పుచున్నది. అమోఘసంకల్పుండవు? నీతలం పెన్నఁడయినఁ బొల్లగునే? నీయంతటిహితుండు కలుగంబట్టికదా, నేఁడు మే మందఱము మృత్యువక్త్రగతులముగాక, బ్రతుకు గంటిమి. నీఋణంబు మేము పదివేలజన్మంబు లెత్తి యయిన నీఁగఁగలమె?" అని మఱియు బహువిధంబుల నాతనివిన్నాణంబుఁ బ్రశంసించుచుండ, రాజున కభిముఖుం డయి విజయుండు సవినయంబుగా నిట్లనియె. "ఆశ్రితపక్షముచే దేవర యిట్లానతిచ్చెదరు, గాని నిక్కంబునకు దేవరప్రశంససేయఁ దగినంత శక్తియుక్తుండను గాను. అనామకుల మగుమాదృశులకును, బ్రశంసకు నెంతదూరము? ఒకవేళ మాకట్టి శక్తిగలిగిన, నదియు మీసేవవలననేకదా! దేవరయాజ్ఞ కన్యథాత్వం బెలగలుగును? కార్యంబు వండించుకొని వచ్చితి." అని తనవృత్తాంతం బాద్యంతంబును విజ్ఞాపనం బొనరించి, పారితోషికంబు వడసి, విజయుం డపరిమిత సంతోషంబునం బొదలియుండె. అది దొరంకొని లంబ కర్ణంబులెల్ల నతివేల నమ్మోదమ్మునం దేలుచు, సుఖంబు పడియుండె. కావున, రాజు లేకున్నను నెపమ్మొ వెట్టియయిన సుఖంపవచ్చును.

అనుడుఁ దదీయ వచనశ్రవణానంతరంబున నుద్దీపితం బగు పాటోపంబు లోలోపలన యడంచుకొనుచు, మనోవికారం బెఱుఁగఁ దోఁపనీక, నేనిట్లంటిని. "ఆర్యజనమిత్రుండగు నా హంసకుల నవి త్రుండు వీరాధివీరుండు; నిజప్రతాపదీపాంకురనిరస్తసమస్తవైరివీర దుర్వారగర్వాంధకారుండు; విక్రమమాధుర్య నొరు నాతనిఁ జెప్పి చెప్ప వలెను; పిఱికితనం బాయన యున్న యూరనైన లేదు; ఆతం డించుక కాలు గదిపెనేని, భువనంబులెల్ల నల్లలనాడుచుండును. ఉబ్బునుపోకక్షు

మీ రూరక పుట్టనిబొట్టలకుం బేళ్ళు పెట్టెదరుగాని, యాతండు నలుపో తెలుపో, యెఱుంగరు. భవాదృశులు ప్రాజ్ఞులే యిట్లు భావ్యంబులు కానిపలుకులు పలుకుచుండ, నింక నజ్ఞులగతి యేమనవచ్చును? పరాక్రమగుణంబున నాతం డొక్క కర్పూరద్వీపంబునకె కాదు, త్రిలోకాధిపత్యంబునకైనం దగినవాఁడు. ఇంక నాతనిం బేరుగ్రుచ్చి యేమైన నన్న, నపచారం బగును. మీప్రల్లదంబు లుడిగి యూరకుండుండు." అన, నాయండజంబులు మండిపడి, నన్నుఁ దెగటార్పఁ గృతనిశ్చయంబు లయి, తమప్రేలి యెఱుకమీఁద మఱి పరిమార్చు తలంపునఁ బెడతెక్కలు విఱిచికట్టి, కొట్టి కంఠగతప్రాణుం గావించి, హతదంష్ట్రమహాభుజంగంబుభంగి రోజుచున్న నన్నుఁ బ్రసభాచరణంబున దుష్టభూయిష్ఠం బగుసభాస్థలికిం గొనిపోయి, తమ రాజు ముందఱఁ బెట్టి, సభాస్తారు లందఱు విన నిట్లనియె. "స్వామీ! యేము భవదాజ్ఞాధీనకృత్యులముగాన, నెఱిఁగినయర్థము చెప్పక కప్పిపుచ్చి మాయంతన యొకటి చేయుట భృత్యధర్మంబు గాదని, యీవృత్తాంతంబు దేవరకు నివేదించి భవదుక్తమార్గంబున నడవఁ జనుదెంచితిమి. ఈమొక్కలీఁడు, సమయుటకు సమయంబై, యుచితానుచితవివేకంబు లేక, ధర్మస్వరూపుల రగుదేవరయెడఁ గోడిమలు గడియింపఁ దొడఁగినవాఁడు. "అన్యదోషకారి తనకిల్బిషంబునఁ దానె కాలిపోవు; చచ్చిన వానిఁ జంపనేల? యనరాదు ఒకప్పుడు దైవంబును దోసకారులకె తోడు చూపును. ఈమూర్ఖబకంబు మనసీమం దిరుగుచుఁ దేకువ మాలి, యేలినవారిపాదంబులనె యధిక్షేపించుచుఁ, బలుకరానిపలుకు లెల్లం బలికె. కావున, నీబకాధముం డవశ్యవధ్యుం డయ్యెను. కలహశీలుండగు నీతనిఁ బొలియింప మేము సంజాతనిశ్చయులమై యున్న

వారము ముక్కుపోడుమనఁగా లేనియుండెనోప మదిమొన్న? వీనియొక్క లేశంబును దయ తలంపవలదు. ఆజ్ఞయైన వీనిఁ గడతేర్చెదను.' అని యన్నియు నేకవాక్యతగాఁ బలికిన నాలించి, వాని వారించి, భయాదీనమానసుండనై మాఱుమొగముపెట్టి వడవడ వడఁకుచున్న నన్నుఁ గరుణాతరంగితాపాంగుండై కాంచుచుఁ, చిత్రవర్ణుండు 'ఏఁ డెవఁడు? ఏ దేశమునుండి వచ్చుచున్నవాఁడు? తెలుపుఁడు.' అన, నవి యు 'హిరణ్యగర్భుండను రాజహంసంబు ననుచరుండఁట; కర్పూరద్వీపమునుండి వచ్చినవాఁడు' అని విన్నవించుసమయంబునఁ, బరిసరవర్తి యగునా శిఖండిప్రకాండునిమంత్రి దూరదర్శియనుగ్రద్ధ నన్నుపలక్షించి, 'మీ యధ్యక్షుని సమక్షంబున ముఖ్యామాత్యుఁ డేవాఁడు?' అని యడిగిన, నేనిట్లు చెప్పితిని. "వివిధవిద్యావిశారదుండగు సర్వజ్ఞనామక చక్రవాకప్రశస్తుండు. ఆతండు సర్వధర్మములను మూలముట్టుగ నెఱుంగును; సత్య శౌచాది సద్గుణ గరిష్ఠుండు; స్వదేశసంభవుండును, ఉపధాశుచియు, అఖిలార్థసంవేదియు, అభ్యస్తసమస్త వ్యవహారుండును, సుప్రసిద్ధుండును, సర్వజనసమ్మతుండును, ధైర్య శౌర్య ధుర్యుండును, ప్రతిభావంతుండును, ధర్మాధర్మ విశారదుండును, స్వామికార్యైకతత్పరుండును, నగువాఁడు మంత్రిపదంబున కర్హుఁ డని నీతిశాస్త్రవేత్తలు చెప్పుదురు. దైవానుగ్రహంబున నీసకలసద్గుణములును నాజక్కవదొరయందుఁ బొందుపడియున్నవి.' అని చెప్పునవసరంబున, నాయాస్థానంబుననున్న యరుణముఖుం డనుకీరంబు మయూరరాజున కిట్లనియె. "దేవా! యవధరింపుము. కర్పూరద్వీప ప్రముఖాంతరీపంబులెల్ల నీజంబూద్వీపాంతర్గతలఘుద్వీపంబులె కావున, నాకర్పూరపు దీవియు దేవరవారిద యయియుండును. దాన, నామానసౌకస్స్వామియు నానుగాదనక స్వామియానకు లోనై మెలఁగఁదగినవాఁడు. నేఁ

డాదిగా నేఁడేఁడును దేవర కరివెట్ట నాజ్ఞాపింప, హిరణ్యగర్భునిపాలి కొక్కవేగరిని వేగఁ బుచ్చుట ప్రధానానుష్ఠేయమైన కార్యము. నీతిహోత్రుండు కాష్ఠంబులఁ దృప్తి పొందనిచందంబున, భూకాంతుండు రాజ్యంబునఁ దనివిసనక యుండవలెను. అసంతుష్టుం డగు భూసురునట్లు, సంతుష్టుండగు పార్థివుండును జెడును. కావున, మహీకాంతుండు సంతతోత్సాహవంతుండై, యార్జవంబునంగాని, యనార్జవంబునంగాని, దుర్జయులగువగఱ నిర్జింపవలయును. అంతియకాక, వేఱొక్క ధర్మసూక్ష్మతగలదు; సావధానమతివై యాకర్ణింపుము. 'రాజ్యంబు వీరభోజ్యంబు' అని ధర్మశాస్త్రమర్మపారగులు వచింతురు. కాన, సముచితసైన్యసమన్వితులరై కదలి, దేవర చేవ మెఱ నాదీని నావరించుట యర్హాకృత్యము. అతండు మంచిమాటలం జిక్కఁబడెనేని మేలయ్యెడు. అట్లుగాక, కాదు కూడదని దేవర పలుకు సేయక యవధీరణము చేసెనేనిఁ దత్ఫలం బాతండు చేసేతం గుడువఁగలాఁడు. మదీయ ప్రార్థనాభంగంబు సేయక, యొకదూతం బనిచి యెదిరిహృదయం బెఱుంగుట యపరిహార్యకార్యంబు.' అనిన వికాసహాస భాసురాననుండై, చంద్రకేంద్రుండును. "అవు; అది కార్యంబు" అని తలయూఁచె. పౌరా; 'రాజ్యమదాంధుండును, బాలుండును, ధనగర్వితుండును, మన్మదుండును, శక్యాశక్యవిచారంబు సేయక యలభ్యంబుల లభ్యంబులఁగాఁ దలంతు' రనునోవిదులవలుకుల కేల యన్యథాత్వంబు గలుగును? రాజ్యలోభంబెకదా, యీదుర్విచారంబులకెల్ల మూలంబు. కోటరస్థానలంబు కుజంబుంబోలె, హృదయస్థతృష్ణానలంబు మనుజు దగ్ధంబుచేయును. ఆశయే సర్వానర్థంబులకు నాకరంబు. అట్టియాశను దిగనాడి, ప్రాప్తలాభముదితహృదయుండై యుండువాఁడె కృతార్థతముండు. అప్పుడు దేవర

యక్షీణ రణపక్షతావిశేషంబు తలంచి, [illegible]వు లొల్లరో కో యనుబుద్ధి జనించె. అది యుండ నిండు. ఆ విషోపమంబు లగు దుష్టాలాపంబులు మనస్తాపంబు సేయుచు, నున్న నేన యుపశమించుకొని, రాజుపంక మరలి "నే నొక్కటి విన్నవించెద; కోపంబు లేకుగదా' యని హెచ్చరించి. యాజ్ఞనచే లేదనిపించుకొని, మితహితోక్తుల నిట్లంటిని. "లోకంబున నెందైన నౌరుల సొమ్ములు రమ్మన్న వచ్చునె? ఏల, యఘటమానంబగు కార్యంబునందు, నిరర్థకప్రయాసంబు వడియెదరు? చెప్పెడివా రొక వేళఁ జెప్పినను, వినెడు వారికైన వివేక ముండవలెనుగదా! అట్లుగాక, 'దున్న యీనినదన, దూడను గట్టుమన్న' మతివస యొక్కటే రచ్చ కెక్కుంగాని, దాన నభిమతకార్యకరణంబు చేకూరనేరదు. అఖిల విదుండవు; నీవెఱుంగనిధర్మాధర్మంబులు గలవే? దుర్దాంతరిపుస్ఫురణ హరణపరిణతుం డగుహిరణ్యగర్భుండు, వారువీరుంబోలెనస దనితలంప వలదు. విక్రమంబున నాతం డతిలోకుం డని స్మరణకుఁ దెచ్చుకొని, పిమ్మట నొక్కత్రోవ త్రొక్కుము. కాలనియోగప్రేరితుండై, నిజ జీవితనిష్ప్రహత్వంబునఁ గడువూఁదఁదీఱఁ బ్రేలినయంతనె రాజ్యంబు రాఁబోదు. మదిమదినుండి, యేల నిర్నిమిత్తంబ చెట్టుగొట్టి పై వేసి కొనెదరు? తదీయప్రభావం బెంతవారికి నపరిభావ్యంబు. మీమీ పంతంబు లెల్లఁ దదీయభ్రూభంగపర్యంతంబులుగాని, యామీఁదం జెల్లవు. ఆతనికడవారును నుగ్రరణకోవిదులు; మీమదాభిమానంబు మాని, మాయొడయనిం గడవ నాడక, ప్రాణపరిత్రాణంబు చేసి కొండు. లోకంబున వచనమాత్రంబుననె యాధిపత్యంబు సిద్ధించు నేని, మత్ప్రభుం డగుహిరణ్యగర్భునకును నీనేరెడుదీవియందు స్వామ్యంబు గలదనవచ్చును. ఈ చప్పిడిమాటలతోడ నేమి ప్రయో-

జనము! ఈచాలెడువారికెల్ల నోరికి మాఱు లేదుగనుక, నేలినవారి మెఱమెచ్చునకె యోలగంబున వలసినట్లెల్ల వదరవచ్చుంగాని, తమ దుర్వ్యవసాయంబునఁ గార్యపాకంబు తప్పి, స్వామి కొక్కయొప్పమి వచ్చినప్పుడు దానికిం దగుప్రతీకారంబుఁ గానక, విస్మయపరీతచేత స్కులై మిన్నుచూచుటదక్క నొక్కటి శక్యంబుగాదు. చిత్రవర్ణునకు మాకర్పూరద్వీపమునఁ బ్రాజ్యరాజ్యాధికారంబు గలదో, హిరణ్య గర్భునకు మీతొలుదీవిని నెఱదొరతనంబు గలదో, యెట్లు నిర్ణయింప నగును!" అనినఁ జఱునవ్వునవ్వి యవ్విషధరభుగ్వల్లభుం డిట్లనియె. "త్వరయేల! యుద్ధంబుననె యెల్లయర్థంబులును నిర్ధారణంబులగును. ఇప్పుడుపోయి, నీయేలిక నాలంబున కాయితంబు చేయుము. ఇదె నీతోడ మాదూతుఁడు నేతెంచెడు. క్షణమాత్రంబు నిలుపుము." అని పలికి, మంత్రి మొగంబు చూచి యిట్లనియె. "మంత్రివరా! మన కిపు డొకదూతకార్యంబు ప్రభూతం బయినది. దక్షతయుఁ, గార్య వాదిత్వంబును, బ్రగల్భతయుఁ, బరమర్మజ్ఞతయు, సద్వచోగౌరవం బును, గలవాఁడు సందేశహారకృత్యంబున శక్యంతొర్పుండు. హిరణ్య గర్భునియొద్ద కీకొక్కరతోడఁగూడఁ బనుప, మనవారిలో నేరుపరి నొక్కనిఁ జేరుకొమ్ము." అనిన శుకంబు మొకంబు చూపి, దూర దర్శి యిట్లనియె. "ఈయరుణముఖుండె మీ రెన్నినట్టి సర్వలక్షణ సంపన్నుండు; కాలము చెల్లినవాఁడు; గుణజ్యేష్ఠుఁడు; మనకుం బరమవిశ్వాసి. కావున, దూతభావంబున కితండె యోగ్యుండు. ఈతనిఁ బనుపఁజను." అనిన వినయంబుమీఱ నాకీరం బిట్లనియె. "దేవా! నాయెత్తువిత్తమ్ముఁ గ్రమ్మరించినను, నీమదోన్మత్తుని తోడఁగూడి యడుగు వెట్ట నొడంబడ నేరను. సర్వవిధంబుల న న్నీ కార్పణ్యదోషావహాతిస్వభావం బగు దుష్టబకంబుతోఁ బంచుట యించు

కలయుఁ గళ్యాణదాయకము గాదు. దేవరమాటకు మాఱువల్కుట నని కాఁకసేయక, నామాటలు తేటపడ విని, మీఁద దేవర యిచ్చ వచ్చినట్లు చేయవచ్చును. ఈ టక్కరికొక్కెర ముం దడఁగుటయె మిక్కిలి యుక్తము. వీనివెనుకనె నేనును జనియెద. సర్వధర్మ విదులు దేవరకు ధర్మములు సెప్పునంతటివాఁడఁ గాను; నానేరము సైరింపుఁడు. దుర్జనునితోడం గూడి నడచుట యెవరు తొడరుటకె కారణం బగును. మన మీతనిగుణము లెల్ల మనవారివలనఁ గథ లుగా విన్నవారము. కొంతదారి సాఁగనిచ్చి, యచ్చట నన్నుఁబొడ వడఁగించిన నెద్దిదిక్కు? అదియుఁగాక, నడఁగూడి నార తలకెక్కిన ట్లెక్కువవారిం జేరినతక్కువవారికి గౌరవమును, నినుమును గూడిన వేఁడి వేల్పునకు సమ్మెట పెట్టబ్బినట్లు హీనునిఁగూడిన మానసీయునకు లాఘవంబును, గలుగుట సహజము. గౌరవలాఘవంబు లెందును సంసర్గాధీనంబులె కావే? ఖలులు సలుపు దుర్వృత్తంబుల ఫలంబు తప్పక సన్నికృష్టు లగు సత్పురుషులం బొరయును. తొల్లి యొక్క *వాయసముతో సావాసము చేసి, హంస హింసింపఁబడియె. ఆ కథ యాకర్ణింపుఁడు.

ఉజ్జయినివజ్జ తెరువుప్రక్క నొక్కగొప్ప పిప్పలవృక్షము గలదు. ఆపాదపంబుమీఁద నొక వాయసంబును హంసంబును గూండ్లు కావించుకొని, వాసము చేయుచుండును. అట్లుండ భీష్మం బగునొక్క గ్రీష్మవాసరంబున, నధ్వనీనుం డొక్కరుండు మిక్కిలి యధ్వపరిశ్రాంతుం డయి, యెక్కిడినవి ల్లక్కడ నిడి, త్రోవక్రేవం దనరు నారావిసీడ నిద్రించుచుండఁ, గొండొకవడికి ఛాయ తొలంగి, యరుణకిరణములు తెరువరిమోమునం బడఁదొడఁగె. అయ్యది వీక్షించి, వనస్పతిస్థితచక్రాంగంబు దయాంతరంగం బయి, గఱులు

విచ్చి యొకచెట్టుక్రింద నిదురించు పాంథుని మొగమున కెండసోఁకకుండఁ బట్టి అప్పుడప్పథికుని సౌఖ్యంబు కన్నుఁగుట్టి, యూపోపక, యశ్వద్ధంబు మీఁది పికవర్ధనంబు స్వభావదౌర్జన్యంబున వాని యాననంబునం బురీషోత్సర్గంబు చేసి, యాచోటువాసి యాకసంబున కెగసి, మాయ మయిపోయెను. ఆచెన్నంటికాకి తనదౌష్ట్యం బందఱకు నెఱిఁగించెఁ గాని, దాన నేమి కట్టుకొనియో? ఏదియు లేకున్నను, దుర్జనులకుఁ బరపీడయే పరమలాభంబు గదా? అంత, నాజాలపాద శ్రేష్ఠమునకుం గాలావధియైన, నాయధ్వగుండు మేలుకాంచి, యుప్పరము విలోకించి తన మూస్యమున రెట్టవైచిన దా తెలిపిట్టయే యని యెంచి, కోపావేశమున నప్పట్టున మోపెట్టి పెట్టియున్న విల్లు దిగిచికొని, యొక్క భల్లంబున నేపాపము నెఱుఁగని యాయంచపిల్ల డొల్లనేసిన, నది బాంధవ రాజహంసా వళిదృష్టి నీఱు నేయుచు నేలఁగూలి, ప్రాణములు విడిచె. కంటిరిగదా కాలవక్రతప్రకారము? దైవకృతమునకు మాఱు గలదె? అపరాధి యగు గాకి ముండఁగా, ననపరాధియగు హంసము హింసింపఁబడియె! "పాపీచిరాయు" వనుపండితుల మాట కేనాఁటికైన బొంకు గలుగునే? ఎట్లును, జెడుగులతోడిసంగాత మిడుమలకే మూలంబగును.

తదనంతరము నేఁ జిలుకవల నవలోకించి యిట్లు పలికితిని· "సంగడీఁడా! నాకు మాస్వామి హిరణ్యగర్భుఁ డెట్టివాఁడో నీవు నట్టివాఁడవె; లోకములోన మహాత్ముల కందఱు నాత్మ సమానులు గాక, పెఱవారొకరు గలరె? ఆత్మ పరభేద బుద్ధిఁ గల్పించుకొంట మంద బుద్ధులకుం గాని, మహాబుద్ధుల కట్టి భేదభావములేదు, ఆత్మవ త్సర్వ భూతాని యను నీతి దలంప వలదె? నామనంబు లోఁతు గానక, వలవని కొలలు కట్టెదవు. నిమిష భంగురంబగు శరీరము

నమ్మి, నీయమనుబు పోసికొని, మొప్పఁగను శాశ్వతనరక కూపంబునం బడి వెతకుడువఁ గడఁగుదు! నామొడ నీకుఁ బ్రత్యయ మేల పుట్టదు? సత్పురుషుల తోడి మైత్రి సప్తపదీనం బన వినవే? ఫలభంగకులు సేయుట నీకు నైజంబ కాన, నీవెల్లర నట్లుగాఁ దలంచెదవు. నీవెడ కలదలుడిగి, పయనము తూఁగింపుము. అనినఁ బకపక నవ్వి, శుకం బిట్లనియె. "నీవు దర్దురస్వర దర్వీకరంబవు; నీయెడ నెవ్వరికైన నమ్మిక పుట్టునే? ఏది యెట్లయిన, నాత్మరక్షణోపాయం బేమఱి యుండఁ గూడదు. నీవిప్పటిపగ మనంబునఁ బెట్టుకొని పైకిఁ గానరానీక, దారి సాఁగనిచ్చి, యొక్క విజనప్రదేశంబునఁ గికురవెట్టి, నన్ను మట్టు పెట్టుట కిన్ని యెన్నుచున్నాఁడవు. ఇంతతడవు మన్మనను మాయెడ యనిని నోరికసిదీఱ దూఱి, యింతలో, నేనోరు పెట్టుకొని మరల నెయ్యంబు నెఱపెదవు? నీవు పరమధూర్తాగ్రగణ్యుండ వౌట నీవాల కమే చెప్పుచున్నది. 'అతివినయము ధూర్తలక్షణ' మనియ కదా సుధీజనులు పలుకుదురు. ప్రియంబులు నామోదజనకంబులు నయ్యుఁ, గుజనవచనంబు లకాలకుసుమంబులుంబలె, నవసానంబున ననర్థదాయకంబులై పరిణమించును. నీ దుర్జనత్వము వాగ్వ్యాపారముచేతనె ప్రత్యక్షీకృతం బగుచున్నది. చిత్రవర్ణ హిరణ్యగర్భుల మహోగ్రవిగ్రహంబునకు నీవచనములె కదా నిదానములు. అల్పుఁడు గిట్టనివానిఁ గొల్చుచ్చుట కయి యెన్ని పన్నుగడ లైనం బన్నును. ధారుణిపయిం జిరకాలము జీవింపఁగోరువా రానుడుల కెడ మీరు. మున్నొక ముష్పన్నె మొకం బొక బకంబును బలవంతంబునంగాదె యంతంబు నొందించె. నీకాకథ వినిపించెద సమాహితమతివై యాలింపుము."

జంబూద్వీపంబునఁ గామ్యకం బను లోకైకరమ్యం బగు వనంబు గలదు. అందు, నిరంతరవికిపుల్ల వనమల్లికావల్లికా మతల్లికా వేల్లిత

నికుంజపుంజరంజితం బయి, కుసుమవిసరపరిమళ మిళితగళిత మకరంద బిందుసందోహాస్వాదనాగత మిళిందబృందసుందరంబై నికటవిటపివిటప చ్ఛటారటచ్ఛకుంతసతతానాక్రాంత తతరవాక్రాంతదిగంతరాళంబగు, పొదలు పొదరుటడవి యొక్కటి యుండును. దానినడుమ, నాయతచ్ఛా యానిరస్త సమస్త తీవ్రగభస్తిగభస్తిచయం బగునొకకుజంబుక్రింది యారమ్ములో, దీర్ఘకాలమునుండి పుండరీకం బొకండు నివసించు చుండును. అచెంగట, జువ్విచెట్టుమీఁద గులాయంబు నిర్మించుకొని, యొకకొంగ కాపుర ముండును. ఆశార్దూలం బొక్కనాఁ డొక్క యురణంబును మరణంబు నొందించి, దానిపిశితంబు మెసవుచుండ, దైవయోగంబున సూక్ష్మకీకసం బొక్కటి దళనమధ్యంబునఁ జిక్కు కొని మిక్కిలి వ్యథపఱుపఁజొచ్చెను. పులి, దాని వెలువరించుకొను తెరవు దొరకక, శిరంబు ధరణీతలంబున వ్రేలవైచుకొని, పొరలుచుఁ, దీవ్రవేదనానలంబున మలమల మఱుంగుచు, దిక్కులుప్రతిశబ్దంబులీన నంగలార్చుచుండెను. ఆయార్తస్వరంబున నంతరంగంబు గరంగి, ప్లక్షవృక్షంబు మీఁదిబకోటంబు వ్యాఘ్రంబుం గనుంగొని, కరుణా మీఱ నిట్లనియె. “ఓశార్దూలకులోత్తమా! నిన్నీయరణ్యంబునఁ జిర కాలమునుండి పొడగనుచున్నాఁడను. మున్నెన్నఁడుగాని యిట్లు వావిడిచి కస్తి పడినవాఁడవుగావు. ఇప్పటి నీచొప్పుచూడ, నాకత్యా ద్భుతమగుచున్నది. నీవాపోవుటకు నిమిత్తమేమి? తెలుపుము. అనినఁ గొంతచింతాశల్యంబు వాసి, ప్రమోదమగ్నమానసం బయి, నాలుక తొట్రుపడఁ బులి యిట్లనియె. “ఓదయామయా! నాయభాగ్య మేమని చెప్పుకొందును? నిన్నరేయే నొకతగరుం దెగటార్చి, నంజుడు గుడుచుచుండ, నాపాపకర్మ మేమోకాని యొకయెముకనారదనంబుల సందునం దగులుకొనియె. దానిఁ దీయునుపాయంబు దోఁపక,

యప్పటి నుండియు నిప్పగిదిం దెప్పరం బగు వెతఁ గుడుచుచున్నవాఁ డను. ఇంక నన్నీయుపాయంబువలనం దలంగి రక్షింపఁజాలు కరుణాళు లెవ్వరు గలుగుదురొకో యని వ్యాకులపడుచుండ, నాపాలిటి భాగ్య దేవత యన్నిటికి నీసన్నిధానం బనునాధారంబు గల్పించినది. ఆరసి చూడ నీవు ఒక మాత్రంబవె? నన్ను బ్రతికింప మూర్తిమంతం బయి నిలిచినబహుజన్మకృత సుకృత ఫలస్వరూపంబవు గాక, నాకింక నీవు దక్క నన్యంబు శరణ్యంబు లేదు. నాకు దిక్కెక్కనను గాకున్నను నీవ. నామనోరథంబు వ్యర్థంబు సేయక, సదయహృదయుండవై ప్రాణ దానంబుచేసి, పుణ్యంబుఁ గట్టుకొమ్ము. నాకింతమాత్రము నీచేత నైనయుపకారంబుఁ జేసితివా, యావజ్జీవము నీమేలు మఱచి పోను. జాగేల? ప్రపన్నుండ నగున న్నవిపన్నుంజేయుము.' అని యతికరుణంబుగా బహువిధదీనాలాపంబులు పలికినఁ, బట్టరానిదయ పుట్టి, చెట్టు దిగివచ్చి, యాకొంగ తనగొంతు క్రోల్పులినోరఁ జొనిపి, యాయస్థిశకలంబు మెలపున నూడఁబెఱికె. అది దొరంకొని, యా ద్వీపియుఁ గొక్కెరయు బద్ధసఖ్యంబున నుండి, సౌహార్దసౌఖ్య మనుభ వించుచుఁ, బ్రత్యేకముఁ గడుపుం బ్రోచుకొనుచుండెను. అట్లు కొంత కాలముండి, యొక్కనాఁ డాచాఱులమెకం బెక్కడ నాహారంబు చేకూఱమి, సంగద నలంగుచు, నంతర్గతంబున నిట్లు చింతించెను. 'నే నెంత దుర్దినమొ! ఒట్టుపెట్టినట్లు లెంతతిరిగిన నొకకబళమాత్రం బైన మాంసం బీవఱకు దొరకలేదు; ఇంకనుం జిక్కుజాడ గానరాదు. ఇన్నాళ్ళయినది; మున్నెన్నఁడైన నెఱచి పుట్టనిదినంబు గలదే? దైవంబు ప్రతికూలం బైనయప్పుడు పౌరుషం బేమియుఁ గొఱగాదు గదా! ఏమి సేయుదు? నేఁ డీయెరియు జఠరాగ్ని కాఱవగునెర యర యకున్న, మిన్నక యసువు లీవలసివచ్చును:— "మాహింస్యాత్సర్వ

భూతాని" యను ధర్మంబు గలదు. అయినను దనప్రాణంబులు నిలిచిన పిమ్మటఁగదా సర్వధర్మములును. "శరీరమాద్యంఖలు ధర్మసాధన" మన మునువినమే? కానఁగలిగిన, బదివేలు గలుగును. కావున, ధర్మ పథంబుఁ దప్పనిదొక్కటైనను, దన్నుఁదాఁ గాపాడుకొనుట పరమ ధర్మంబు. ఒడికట్టెఁ ఱకుఁ బుడమినైనను విడువఁజనును "ఆత్మార్థం పృథివీంత్యజే" త్తని నీతివేత్తలు వాక్రుత్తురు. నేనిప్పు డొక్క యుపా యంబున నీకహాఁంబు కాయంబున కపాయంబు కల్పించి, మృత్యు ముఖంబునకుం దప్పి ప్రాణంబులు నిల్పికొనియెద. ప్రాణంబులు దక్కినఁ జక్కన పాతకంబు లేపాచితంబులనైనఁ బాచికొనవచ్చును" అని నిశ్చయించి, తద్ద్రోహచింతనానుకూలంబగు నుపాయంబు చింతించి, పూర్వప్రకారమ్మునఁ గ్రమ్మఱఁ దల నేల వ్రేలవైచి, తొంటికంటె నినుమడిగా గుహాలు మాఱుమ్రోయఁ గుహానావిలాపంబు సేయఁ జొచ్చెను. ఆవిలాపం బాలించి ప్రాణంబులు గలఁగఁబాఱి, యప్రతీ కారం బగు శోకంబున బమ్మరపోయి, క్రమ్మఱఁ దెలివొంది మిత్రం బగు బకంబు నిర్మలాంతఃకరణంబుతోఁ జేర వచ్చి సమాదరణ పూర్వకంబుగా నిట్లనియె. 'చెలికాఁడా? నేఁడేల యీలాగునఁ జింతా స్తిమితమూర్తివై మగుడఁ దల్లడకుడుచుచున్న వాఁడవు? నీమనికితంబు నాకడదాఁపురము సేయనేల? నీకు నే నొకవింతవాఁడనే? గొబ్బున నీయుమ్మలంబునకుఁ గారణం బెఱిఁగింపుము. ఇత్తఱి, మదాయత్తం బగు కార్యం బొక్కటి గలిగిన, నీనిమిత్తమై నాప్రాణంబుల నైన నిచ్చెద.' అనిన, బెబ్బులి యంతరంగంబున నుబ్బి, యాననంబున దీన భావం బభినయించుచు, నెలుంగుఱాలుపడ నిట్లనియె. "నేను గృతం బెఱుఁగనివాఁడఁగాను. సందేహము లేదు; ఈదేహము నీవు పెట్టిన పెట్టు. మీఁద సేవింపఁటయు నీయాధారమునను. నీ విప్పు డిచ్చిన

నరంబు మఱచిపోక చెల్లించి, నత్యసరస్వతి వగుదుము. ఓప్రాణసఖా! ప్రాణప్రదాత యగు మహోపకారి కెంతవఱకుం బ్రత్యుపకారము సేయు నద నౌదవక పోయెంగదా యని, నాహృదయంబున నాకే లజ్జ వొడముచున్నది. లోకమున నెంతటివాఁడును 'నేను బలవంతుఁడ ; నాకితరులతోడి దేమి ?' యని విఱ్ఱవీఁగరాదు. బలవంతులకును బల హీనులవలన ప్రయోజనంబులు నిచ్చలు సంభవనీయంబులై యుండును. నీవు నాఁడట్లు ప్రాణాంతంబుఁ జెందకుండ నన్ను నిలిపితివి. బల్లిదుండ నయ్యు, వ్యర్థునికైవడి నేను దానికి బదులుసేయఁ జాలకుంటిని. కట కటా! నాబ్రతు కింకఁ గాల్పనే? ఏమో యీశ్వరమాయ యెట్టిదొగా! అది యట్లుండ, మెండియు నేఁడు నీసాయంబె నాకు స్పృహణీయం బయి యున్నది. చూచితే కాలగతి? కాల మెంతవారికి దుస్తరంబు గదా? అది యట్లుండె. ఇప్పటి నాదురవస్థ వినుము. తొల్లింటిచంద మున నే, నాదంతంబులయంతరంబున నేఁడొక్క యెముకముక్క చిక్కు వడి, మిక్కుటంబుగ బాధించుచున్నది. నాయట్టిసత్వసంపన్నున కుప కారం బొనరించి, యింతతడవు నీ వుదరపోషణంబునకై యిటునటుఁ జనుచుండఁ గన్నులు పెట్టుకొని చూచుచు, నిన్నాళ్లు సైఁచిననాతప్పు మన్నింపుము. నీయడుగులాన యింకఁ దొంటియట్ల నిన్నాహారార్థం బిందునందుఁ దిరుగులాడనియ్యను. నేఁటితో నీకష్టము గట్టెక్కెను. నాహృదయంబున గలయది నిక్కముగా వచియించితి. నామాట విశ్వసింపుము. ఇదె మిత్రకార్యము సమకూర్చ సమయము వచ్చినది. కాలవిలంబనము సేయక, మిత్రరక్షణతత్పరుండవై నావక్త్రబిలంబు సొచ్చి, చెచ్చెర నీయంగద నార్పుము.'' అని వెసనుదవులఁ బలికిన నాబకోటంబు గాటం బగు సంతోషంబున, వ్యాఘ్రముంబున కిట్లనియె. "మిత్రరత్నమా! యిది యెంతపని? విషాదంబు మానుము. ఇట్టి

పాటులు లోకమున నీతులని పుట్టెనే? విధి త్రిప్పులకు లోనుగాక కడ తేఱినవా రేరు? నాచేతిలో నున్న యీమాత్రపుఁబనికి, నన్నేనట్లు నన్నును నీ విం తదూరము వేడికొనవలెనునా? ఉత్తమచరిత్రునకు మిత్రమనోరథపూరణంబుకన్న నపత్యకర్తవ్యం బొక్కటి గలదే? నేఁడుగా నాఁకను వెత్తినఫలంబుఁ గాంచఁగంటిని? నాపుణ్య మేమి చెప్పను? చూడు మే నిదె నిమిషమాత్రంబున నిన్నీయాపదవలనం బాపి, ప్రాణసమానుం డగు మిత్రునిఋణంబుఁ దీర్చికొనియెద. ఇది నీయట్టి శక్తిసంపన్నునకు దాఁదగినయాపద కాదు' అని పలుకుచుం దానినోరఁ జొరఁబాఱుడుఁ బసిదిండి కఱుఁకుఁగ్రన మెడం దెగఁగొఱికి యాక్షణంబ యాబకంబును భక్షించెను. దురాత్ము లాత్మంభరి త్వంబునకై మిత్రద్రోహంబునకైనఁ బాలుపడుదురుగదా! కావున దుష్టులు పలుకునిష్టాలాపంబులు చెవిఁ బెట్టరాదు. తప్పిదారి చెవిఁ బెట్టితిమా, బెట్టిదం బగు చెట్ట పుట్టక మానదు.

అని మఱియు నాచిత్రవర్ణునికొలువుడుకాండ్రు పెక్కండ్రు రోషదూషితులై నన్ను దిసంతులు గొట్టుచుఁ, బెక్కులు దురాలా పంబులు పలికిరి. అవియెల్ల నుల్లంబునంబట్టి, ప్రత్యర్థి నంతకు చెంతకుఁ బుచ్చునంతకు నెంతయు దేహదాహంబు సేయుచుండును. నే నశక్తుండఁ గావున, లాఘవాస్పదుండనై భంగంబు మ్రింగి, యెప్పటి యొప్పున నందరిలో నొకని తలయెత్తి తిరుగుచుంటిని. నే నొక పౌరుషశాలినే? ఈయవమానంబు మానవంతుం డోర్చునట్టిది కాదు. అచేతనమయ్యును, సూర్యకాంతము తపనుపాదములు సోఁకినంతనే ప్రజ్వరిల్లుననఁ, జేతనుం డగునభిమానవంతుఁ డె ట్లహితకృతతిరస్కా రంబుఁ జూచి సైఁచును? అయిన, నాభంగపాటు స్వామికి నివేదింప వలె ననునభిలాషపాశంబు, ప్రాణంబుల వెడలనీక బొందితో బంధించి

నన్నీకడ కీడిచి తెచ్చెను. ఆహా! విధిచెయిద మేమనవచ్చును? నాకు గొండంత బలఁగంబు గలిగియు లేనివాఁడనై, కానిదేశములలో దిక్కుమాలినపక్షినై నిలిచితిని. అది యట్లుండె. నీయట్టిజనవిశ్రుతునియడుగులు పట్టఁగలిగియు, విధివశంబున నొప్పనివారి ముందఱఁ గొలువులో నన్నిరోఁతమాటలకు వీను లొగ్గవలసివచ్చెను. గతవృత్తంబులకు విచారపడ నయ్యెడు కార్యము లేదు కాని, మఱచినను మఱుపునకురాక, యాకష్టపాటు నాహృదయంబున నాటుకొని, మనశ్శల్యంబయి యలయించుచున్నది. నాకిన్ని త్రవ్వనేల? కానివారిచే గాసిఁబొందుమని విధి యట్లు వ్రాసియుండ, నెవ్వఁడు తప్పింప నేర్చును? ఇది దేవర మొగంబునం దెలిపి, మనంబు నొగిలించుట కెంతయు నాస్వాంతంబు దురపిల్లెడును. అచ్చోఁ జిత్రవర్ణుం డించుక యక్కటికంబు వహించి, వైదేశికుండ వని నన్ను మన్నిగొన మదిఁగొల్పక, విడిచిపుచ్చె. స్వామిపాదపద్మంబులు మరలసందర్శించుభాగ్యంబు కరంబు కల్గుటఁబట్టి, యీసంగ్రామవార్తాహారత్వంబు వహించి, యిట్లేతెంచఁగాంచితిని. మార్గాయాసనిమిత్తంబునఁ జిత్తంబు స్వాయత్తంబు కాకున్నయది; అందులకుతోఁడు, విషాదవేదనాదోదూయమానమానసుండ నయి యున్నవాఁడను. ఇంక మిక్కిలి విన్నవింప నేఱను. స్వామికి వార్తావిశేషంబులు నివేదింపవలయు ననుత్సాహమును, స్వామిసన్నిధాన నివసనాభిరతియు, నవలంబంబులుగా నింతతడవు నిలువఁ గలిగితిని. ఎఱింగినంతవఱకు మొఱంగక జరిగిన సర్వవృత్తాంతమును దేవరకువిన్నవించి, కృతకృత్యుఁడ నైతిని. ఆచంద్రకీంద్రుండు నన్ను వీడ్కొల్పునపుడు 'నీవెనుకనే కీరంబుఁ బుత్తు ముందు పొమ్మని పంపెను. అదియు నింతకుఁ జనుదెంచు చుండును. ఇఁకఁ గర్తవ్యాంశంబు దేవరచిత్తమునకే విదితంబు, పోయివచ్చెద." అనిన

హిరణ్యగర్భుండను నాతనిఁ గృపాకటాక్షవీక్షణంబులం జూచుచు నిట్లనియె. "దీర్ఘముఖా! దైవతంత్రం బైనపని కార్తిఁజెంద బని లేదు. సమస్తముఁ దెలిసినవాఁడవు; నీకు నేఁ జెప్పవలయునె? నీవు మిక్కిలి ధైర్యశాలివే, యిట్లు పేదమాట లేల యాడెదవు? అచిత్ర వర్ణుఁడు సమ్రాజ్యమాత్యమాత్రంబుగా జావఁదలంచి కాఁబోలు, నీయట్టిసాధువును కపకారంబు దలంచె. ఏమయిన నేమి? ఇంతటితో మునిఁగిపోయిన దేమియు లేదు. రేప చని, యాపాపఁమేపరిదొరయువ లేపంబు మాపుదము. ఊఱడుము. సర్వజనసత్కారార్హుండ వగు నీవంటివానికా, యిట్టిపాటులు పాటిలవలె?" అని శ్రవణరసాయన ముగాఁ బలుకుచు విషాదాపనోదము సేయుచున్న తేనియనుజ్ఞ వడసి దీర్ఘముఖుండు కొంత మనసునందుఁ గొఱకొఱమాని. విశ్వసించుచు నిజాగారంబునకుల జనియె.

అంత నక్కడ దీర్ఘముఖునిఁ బనిచినవెనుకఁ బర్హీంద్రుం డరుణ ముఖుఁ జేరఁజీరి, హిరణ్యగర్భుని కొలువులోఁ బలుకవలయువలుకు తెల్లఁ దేటపడఁ గఱపి, 'నీ వివియన్నియు నీళ్ళు నములక దిటంబున నోలగమునఁ బలుకవలయుఁ జుమీ' యని పుచ్చి యంత మంత్రి కేకాంత మిచ్చి, తద్వచనానుస్మృతిని మేఘవర్ణుం డనుకాకమును రప్పించి, బహుమానపురస్సరముగా నిట్లనియె. 'మనకిప్పు డక్కర్పూ రద్వీపి నావరింప యత్నము కలిగి యున్నది. దానికి నీతోడుపా టవ శ్యము గావలసి యున్నది. ఈకార్యంబు కడముట్ట నిర్వహింప భవ దన్యుండు సమర్థుండు లేడు. కావున సర్వప్రయత్నముల నీవీపనికి వేగు నడపవలయును. నీవు ప్రచ్ఛన్నవేషమునఁ జని, యేలాగునసైన హిరణ్యగర్భుని చెలిమికలిమి కుపాయంబు గావించుకొని వేషభాషల నచ్చికవుట్టున ట్లటమటించుచు, నందుఁ జనవరివై యుండి, యాను

కూల్యప్రాతికూల్యంబుల తెఱం గెఱింగి, మనకార్యసిద్ధి యెవ్విధంబున
నగు నవ్విధంబున సంఘటించి, కార్యనిర్వాహకుండ వగుము. నీ వచ్చట
ఱేనికడనుండు నేనికనయిన దోమనయిన నెడసి పోనాడుకొక, కూడఁ
గట్టుకొని, వారివారిమనసు కనిపట్టి తిరుగవలయును. వారి కించుక
వెగటు దోఁచెనేని, దగునవసరంబున నీమీఁద నేమేనియు నావగింజలు
తాటికాయలుగా నేలికచెవులం బోసి, యెగపోసి, నీవలన నొక్కకొఱ
గామిఁ గల్పించి, నిన్నాతనిమది కెడఁజేయుదురు. దానంజేసి, సకలో
ద్యమభగ్నంబు లగువిఘ్నంబులు దొట్టి, మనప్రయత్నమెల్ల నాఱడి
పోవును. కార్యము మించినవెనుక, నేమనుకొంటిమి పో యేమి
కార్యము ? రాజులచిత్తంబులును క్షణక్షణంబులు; ఎప్పు డెప్పగిది
నుండునో తెలిసి మెలఁగుట కడువ్రేఁగు. కావున నయ్యా జియ్యాలు
పెట్టుచు, నైనదానికిఁ గానిదానికి నడ్డమువచ్చి పైఁబూసికొనక,
వాలుపయి నడచునట్లు మెలఁకువ గలిగి మెలఁగవలయును. రాజుదయ
గలిగినన్నాళ్ళు ననందఱు మిత్రులే యగుదురుగాని, యది యింత
గొఱఁత పడిన మిత్రులే యమిత్రు లగుదురు. వనంబులు దహించు
దహనునకు మిత్రుఁడగు మారుతుండ, దీపంబున నన్నువయయి
యున్నప్పుడు మారుతుండు గాఁడే ? కావున, నీవేవారికి వేఁడిదాఁకు
నట్లుగాఁ జరింపక, రాజు క న్నెఱింగినవాఁడవై, యాతనిచిత్తవృత్తి
ననువర్తింపవలయును. ఎందును నీవెఱుఁగని నయానయంబులు లేవు.
అచట నీమనసుగూడినవారికైన, హృదయము మీకుము; మఱచియైన
నిచ్చటమాట లచ్చట వాక్రువ్వకుము; నీవు బుద్ధిమంతుఁడవు. ఒరుల
చేతఁ జెప్పించుకొనునర్థంబు లేదు. పొమ్ము. మేము నిత్యము నీరాకయే
కాచి యుందుము. వెనుక మఱచెదవు సుమీ." అని పనిచి, చిత్ర
వర్ణుండు స్వకార్యంబునం బ్రవర్తించుచుండె.

అంత నిచ్చట దీర్ఘముఖుండు కొలువు దాఁటినపిమ్మటఁ, గొక్క మిస్సిఁచుక హసించి హంసప్రకాండునితో నిట్లనియె. "చిత్తగించితిరా! మనబాలిశుండు పరదేశ మరిగి యేమి కొనివచ్చెనో! 'తాఁజెడ్డకోఁతి వనమెల్లఁ జెఱిచిన' దన్నట్లు, దుర్జనుండు తానుజెడుట చాలక, తన వారికింగూడ కీడనిక్కడు దెచ్చిపెట్టును. అందున క్రిముక్కడి కొక్కరమె తాకార్యణంబయి కానఁబడుచున్నది. కారణము లేకయే కలహమునకుఁ గాలుద్రవ్వుట క్షుద్రునిలక్షణము. పండినవృక్షంబుచందంబున, సజ్జనుండు వంగి యుండును. మూర్ఖుండు, శుష్కకాష్ఠంబుంబలె, భేద్యుం డగుంగాని, నమ్రుండు గానేరఁడు. పండితమాన్యు లెఱుక లోకపదివే లుపచరించినను, వారినిబట్టిన నైజదోషంబు లీసన్మాత్రంబును విడువవు. మాఱుమాఱులు నీరంబులం గడిగిన, నంగారంబులమలినత్వంబు వాయదు." అని మఱియుందూఱుచుండ, వారించి కలహంసనాయకుండు నిజామాత్యున కిట్లనియె. "ఇప్పు డీయుపాలంభనవచనంబులతోడఁ బ్రయోజన మేమి? ఇదియంతయుఁ గాలప్రాప్తంబుకాని. హితకార్యధూర్వహుం డీతనియెడ నీఁగ కాలంతయు నవకార్యంబులేదు. లేనిది పైఁబెట్టరాదు; కాలవిపర్యయమ్ముల నుద్యమమ్ము లెల్లఁ బ్రతికూలంబు లగును. ఈ తండు మననదయ వాక్యసంభావనకుఁ బ్రాతుండుగాని గర్హ్యాణార్హుండు గాఁడు. నీవును బహువిలోకివి; లోకంబున నీకుఁ దెలియనిది లేదు; పోయిన దాని మరలఁ ద్రవ్వుట చర్విత చర్వణంబు; దాన సారంబేమియుఁ గనుపట్టదు; అందులకయి వందురుటయు గతజలసేతు బంధనంబు. కాన, దానిమాని, ప్రస్తుత కార్యవిచారంబునకు గోచరంబగునంతయు గార్యమాత్ర మెఱిఁగింపుము." అనిన నాజక్కవలరాయుం డారాయంచ దొర కిట్లనియె.

"బుద్ధిమంతు లగువారు వర్ణాకారప్రతిధ్వానంబుల వలనను, నేత్రవక్త్రాది వికారంబుల వలనను, బరులమనోగతంబు లూహింప సమర్థు లయి యుందురు కావున, మంత్రరక్షణం బత్యంతావశ్యకంబు. అభిగుప్త మంత్రులకు సర్వార్థసిద్ధులును సుకరంబు లగును." అనుచు, నమ్మాటల వెంబడినె యొడయనిచూపు దీప్తి తైకాంత కాంక్షంబయి, నలుగడల నిగిడిన, నాచూడ్కిదోడన యాయొడకుం గదునెడ గలుగ నడుచు నందలి మానసీయుల వెంట నంటి, తక్కటివారును దూర దూరముల కేగిరి. అంత మంత్రి మఱింత చెంతకు జరిగి, యేలిక మోమునకు జూపు మోపి, యిట్లనియె. 'దేవా! యవధరింపుము. నాబుద్ధికింజూడ, నిప్పటి కవ్వగవానిపాలికి ప్రణిధి నొక్కని బనుచుట యుచితంబుగా దోచుచున్నది. పదింబదిగ విమర్శింపక, పదరికర్జంబు పూనుట కార్యజ్ఞునిలక్షణంబు గాదు. వైద్యకర్మంబున కనాలస్యంబు నట్లు కార్యనిశ్చయంబున కాలస్యంబకరంబు శ్రేయంబు. ఒకానొకచో నల్పకార్యంబు సాహసారబ్ధంబైనం గావచ్చుంగాని, మహాకార్యంబు సాహసక్రియాసాధ్యంబు గాదు. సువిచారపూర్వారబ్ధ కార్యంబునకు, దైవంబును ననుకూలం బగును. అంతియగాక. యెదిరితలంపుం బదిలం బుగా నెఱుంగక, యొక సాహసంబునకుం జొచ్చుటయుం గానిపనియె. క్షితితలాధ్యక్షుం డాత్మచ్ఛిద్రంబుల బయలంబడకుండం గాపాడుచు, విపక్షవక్షచ్ఛిద్రంబుల భద్రంబుగా మున్మున్న చారదృష్టిని వీక్షింప వలయును. దూరస్థు లయ్యును, గార్యంబు లనిశంబును గొట్టికాండ్రచే గనుచుంటంబట్టియే, పృథ్వీకాంతులు చారచక్షు లనం బరగుదురు. స్వపర రాష్ట్రమ్ముల కార్యాకార్యమ్ముల నవలోకింప రాచవారికి వేగులెకదా లోచనములు! ఎవ్వని కాలోచనంబులు పూజ్యంబులో, యామానవనాథుం డనయంబును నయనంబుబుండియు, నంధ కల్పుం

వగునని కొన్ని సరగువగునితోడఁ గూడ, సరియో పాయజ్ఞుఁడును, విశ్వాసపాత్రుఁడును, నగు వేఁగొక్కనిఁ గూడఁ బుచ్చ వలయును. అతఁడు సర్వథా నప్రమత్తుఁడయి, విరోధిపీటఁ బుట్టు విశేషంబు లెప్పటి కప్పుడు మన చెవ్వుల వేసి, వేసఱక గుప్తప్రకారంబునఁ జను చుండవలయును. ఇట్టి మహాకార్యంబు నిర్వహింప మన దీర్ఘముఖుండ శక్తుఁడగు. అతండు స్థలజలస చరణ చణుండు; ఆకార వికారాదులఁ బరులభావంబు లూహింపఁ జతురుండు; నీటిలోఁ జాడలు దీయు నేర్పున నీతినిఁ జెప్పి వేఁగొక్కనిఁ జెప్పవలెను; ఈతనితోడ నీడగువాని నీసభ నొం డొక్కనిం గానము. ఎల్లభంగులఁ జరకృత్యంబున కీతండ యర్హుండు. ఈతనికి బానటయైన నీతని యనుజుండు ధవళాంగుండు గలవాఁడు. అతండును బరేంగితజ్ఞానచతురుండు. పరులు తెలియ రాదు గాన, నిది యంతయు గుప్తంబుగాఁ గావించుట శ్రేయోదాయకము. పిసుగు పడుతేఱినయెఱుకవడునట్లు, రాజకృత్యంబును ఫలకాలముననె యెఱుక పడవలయును. మఱియు, సూరాతుం జేరువ నునిచి కొని, యేమఱియుండు నాతండు ప్రమత్తత్వంబు దీర్ఘవృక్షంబు కొన కొమ్మను శయనించి కనుమోడ్చువానికెనయగును. కావునఁ, బరివారంబునెల్ల రాజద్వారంబుననుండ శాసింపవలయును. ఇట్టిసమయంబుల భూపాలుండెట్టివారిని నమ్మక, వైరినివారణంబునకుపాయంబు రోయుచు నెల్లప్రొద్దు నాత్మరక్షాపరుండయి, జాగరూకత కలిగి యుండవలెను. మంత్రరహస్యంబును బయలఁబడరాదు గాన, నిజరక్షాయత్న మెట్లట్లు, మంత్రరక్షా యత్నము నేమఱకుండునది. మంత్రంబు మూడవ నోటంబడిన, సర్వకార్యంబులు భగ్నంబులయి పొలియును. ఇదియంతయు నెఱింగి, ధరావరుం డాత్మమంత్రిద్వితీయుండై, యెంతవారికిం గర్ణగోచరంబు గాకుండ మంత్రకార్యంబు నిర్వహింప వలయు,

అదియు, రాజులకు విజయమూలంబు. అట్లుగాక తక్కిన రహస్యంబు కర్ణపరంపరం బ్రకటంబగుచో, మంత్రభేదంబునం జేసి కలుగు నిక్కట్టులు చక్కఁబడుట మిక్కిలి యక్కజ మని సర్వజ్ఞులు పలుకుదురు. నాకుఁ దోఁచినంతవట్టును స్వామికి విన్నవించితిని. సర్వజ్ఞుఁడు, దేవర యెఱుంగనిధర్మంబులు లోకంబున లేవు; ధర్మతత్త్వమ్ము లెల్ల స్వామికిఁ గరతలామలకమ్ములు. దేవర దివ్యచిత్తంబునకు వచ్చిన పని ననుష్ఠింతము.'' అనినఁ గృపావలోకమందహాసమందిరవదనుం డయి, వరటాధినాథుం డిట్లనియె. "బాపురే! నీవు నామానసంబునం గలయదియె, చెట్టునంబుడికినట్లు వచించితివి! నీవు దీర్ఘాయుష్మంతుండవయి మందువుగాక! నీవలన నెంతయు సంతసిల్లితి. నీవాక్యములయందు గ్రాహ్యంబులు కానివియుఁ గలవే? మనకుఁ బ్రణిధియు నుత్తముండు దొరికెను. నిశ్చితకార్యమునకు జాగేల? శుభస్య శీఘ్రం'' మ్మనిన, సవినయముగా మంత్రి యిట్లనియె. "దేవా! యిట్లప్రయత్నముగ సర్వానుకూలుం డగు చారుండు లభ్యమగుట, భావిజన్యవిజయ సూచకంబయి కానఁబడుచున్నది. సంకల్పసిద్ధులగు దేవరకే యుద్ధంబున జయంబు నిశ్చయంబు.'' అని ప్రశంసించు నవసరంబునఁ, బ్రతీహారుం డొక్కరుండు ప్రవేశించి, ప్రణామంబు గావించి, యిట్లనియె. "దేవా! దేవర దర్శనార్థంబు జంబూద్వీపము నుండి యొండొక శుకంబు వచ్చి, తలవాకిట నిలచి యున్నది. లోనికిం గొనిరా సెలవే?'' అనిన, దొర మంత్రివలనికిం జూడ్కి నిగిడించుచుఁ, దదభిప్రాయం బెఱింగి, చక్రవాక వల్లభుం డిట్లనియె. "నీవిప్పు డేగి, యుచ్చిలుకం దగుచోటఁ గూరుచుండఁ బెట్టుము. జేనియానతి యైనప్పుడు లోనికిం గొంచురమ్ము. పొమ్ము.'' అనిన, మనంబున భయభక్తులు పెనంగొన వెనుక వెనుకం జని, కీరంబును

గని యిట్లనియె, "మాదొరవారిత్తఱిఁ దమాధీనవిప్రులతో మంత్రా వాసంబున నేకతమ యుండి, కార్యపర్యాలోచనము సేయుచున్నారు. వారిప్పుడ వచ్చి బయలికొలు విత్తురు. అప్పుడు పోయి వారిచరణములు సందర్శింపవచ్చును. అందాఁక నిందు వసియింపుము" అని యుచితాస నంబు వెట్టిన, నది యందు వసించి యుండె. అంత, సముపసర్పోల్లా సంబు మొగంబునకు వికాసంబు నింప, మంత్రిమోముఁ జూచి మరాళేంద్రుం డిట్లనియె. "ఆహా! సుభటనికాయముదావహంబును, భీరు భయావహంబును, నగు నాహవంబు సంప్రాప్తమైనది. దూరంబునఁ బిఱిందికి నడుగువెట్టని బిరుదుమగలకుఁ; దమగాత్రంబుల సాఫల్య పాత్రంబులఁ గావించుకొనను, జిరంతన మగు కీర్తి గాంచను, మంచి యవసరం బొదఁగూడినది. శాణవిఘృష్టమణియును, నర్థిసాత్కృత ధను లగు దానఘనులును, రణనిహతు లగు శూరవితతులును, గృశ త్వంబునంగాదె కడుశోభింతురు. కావునఁ బిఱికికండ లేని దండిమగల నెల్ల భండనమున కాయితం బయి యుండ నియమింపుము. ఉత్సా హంబు వాటింపుము." అనిన, మందహాసరోచుల మొగంబునఁ దెలివి దొలంకాడ, నాజక్కవయొకిమిఁ డిట్లనియె. "దేవర వాక్రు చ్చిన దంతయు శూరజనశ్లాఘనీయంబ కాని, వేఱుగాదు, అయినను స్వామిసగ్గర నాకుం గల చనవతిశయం బొక్కహితంబ విన్నవింప నుల్లంబును బెల్లుగఁ బీడించుచున్నది. దేవరమాట కడ్డమాడెనని వేఁడిమి సేయక, లెస్సగా దివ్యచిత్తమున నవధరింప వలయును. తొలుదొల్తఁ గలహమునకుఁ గాలుద్రవ్వుట, యెవ్వారికి ననర్థదాయ కంబు. ఇట్టి యార్యగర్హితం బగు పనిని, మిముబోఁటి మేటిమగ లేటికిఁ బాటింతురు! ఉపాయములలో నెల్ల దండోపాయం బధమోపాయం బని, యనయమును నయవిదులు పలుకుచుందురు. ఏమిసేయఁ

బోయిన నేమగునో! జయాపజయంబులు నిర్ణయింప నెవ్వఁడుసమర్థుఁ?
విద్వేషివిజిగీషు లగు మనీషు లాహవంబు శుభావహంబుగామి, సామ
దానభేదముల నేదాన నేని దమకార్యముల సాధింపఁ బాటుపడుదురు.
ఇంతెందుకుఁ దీఱకున్నఁ దుదకుఁ గడయుపాయమునకుం గడంగు
దురు, కడంట నేమియో నెటువచ్చునో యని, యుప్పొంగును సంప్రాప్త
మనోరథు లగుదనుకఁ, బాలలోఁబడ్డ బల్లివిధంబునఁ దల్లడిల్లుచుందురు.
ఇందలి మన వారలందఱు శూరాగ్రేసరు లని మఱియు రాదు. బవర
మొదవక మున్నె మదిమది నిండ్లకడ నుండ నెల్లవారును శూరులే
యౌదురుగాని, సమరమున మద మొదవ నెవరెదిరినతెఱి; జెదరి
చెదరక మది కుదురఁ బెట్టుట యెట్టిదిట్టలకుం గట్టిది. పరాక్రమ
క్రమాసాధ్యములగునట్టి కర్జములు పెక్కు లల్పోపాయసాధ్యములయి
యుండును. అనితరసాధనోత్థాప్యంబు లగుమహోపలముల మహో
న్నతపదముల కెక్కించుట యుపాయము చేతనకాదే? యుక్తకాలకృ
తోద్యోగమువలనఁ గృషి సఫలం బగునట్లు, ప్రయత్న మల్పమయి
నను, సముచితసమయం బౌదవుదనుక వేచి యాచరించిన నయవ్యవ
సాయమును, సహస్రగుణాధికం బయిన ఫలము నిచ్చును. అట్లు కాని
నాఁడు, పడ్డపాటంతయు నిష్ఫలంబయి వృథావస్థయగును. దూరభీరు
తయు, నాసన్నశూరతయు, మహాత్ములకు సహజగుణములు. అల్ప
లయం దీగుణములు విపరీతము లయి యుండును. వేమఱుశపథములు
పలుకుటయు, నంజలులు, నభివాదనములు, సామప్రియవాక్యములు,
గాపురుషులకుస్వభావసిద్ధములు. ఇంక మిథ్యావచనములన్న, వెన్నతోడఁ
బెట్టినవె. మహాత్ములు విపత్కాలములయందును దమధీరత్వము విడు
వరు. ఆపత్కాలముల ధైర్యమును, సంపదలయందుఁ దాలిమియు, రాజ
సభలయందు సరసవచనరచనాచాతుర్యమును, రణరంగముల విక్ర

మంబునకు, మహానుభావులకుఁ బ్రకృతిసిద్ధములు కావె? మఱియుఁ జిత్రవర్ణుండు మహాబలవంతుఁడును బలవత్సహాయసంపన్నుఁడును నగుట, మన మిప్పు డాతనిఁ దొడరఁ గడంగుట గహనదహనము పయి మిడుత లురుకడి నుఱుక నడరుట. ఎట్టిబెట్టిమండుగాని తన్ను డీకొను వానిమీఁకఁ బోకార్పఁ దొడంగుఁగాని, యొడఁగియుండువానిపయిఁ దన వడి నిగిడింపఁ దొడఁగఁడు. నదీవయంబు నిలిచిపోలుచు నిలాజంబుల ననూన్మూలింపఁ బూనుఁగాని, వంగి యొదుగంటి యున్నపిల్లుఁ బెల్లగింపం బూనదు. క్షమాసమానంబు లగునవోపాయంబు లొండు లేవు కావున వేగిరపాటు చేటు వాటిల్లుటకు మూలం బగును. మన కిప్పుడు దుర్గనిర్మాణోద్యమం బత్యంతావశ్యకంబు. దుర్గస్థుం డగునొక్కనికి, వెలివారి నూఱువుర నైన నోరువ నుకరంబయి యుండును. దుర్గవిష యుం డగుగోత్రావరుండు, శాత్రవాసాధ్యుండయి, పరిభవాస్పదుండు కాకుండును. ఇంక నదుర్గవిషయుం డగుధరావల్లభుండో, ధరచ్యుతి మనుష్యప్రతిముండయి, పరాభవంబు నకుఁ దావలంబగును. మనము నిర్మింపఁబోవుదుర్గంబును నరాతివర్గంబునకు దుర్గమం బయి, యప్ర భేద్యం బయి, లోపల నిర్మలజలసమృద్ధం బగుకొలంకు నొక్కటిఁ గలిగి యుండవలయును. వచనీయంబు సర్వంబును వచియించితి. ఇంక దేవర సర్వక్రియాకలాపనిర్వహణధురీణులు కావలయును. దుర్గంబు సంసిద్ధం బగువఱకు, దూత ని-చ్చోటికి రప్పింప నొప్పదు. కావున, దడవుసేయక ముందఱ నీపనికిం బనుపవలయును.” అనిన, హిరణ్యగర్భుండును మంత్రివదనంబుఁ జూచి, “కాలయాపనంబు సేయక దుర్గనిర్మాణపరిణతుం డగువాని రావించి, యాజ్ఞాపింపు” మనవుఁడు, ‘నాఁగా’ కని యాకోకనాయకుండు తత్క్షణంబ యొకపరి చారకు నంపి సకలానల్పశిల్పకలాకుశలు నీరవరాశిఖాననసారసప్రశస్తు

నామెడకుం బిలిపించి, సగౌరవంబుగా నిట్లనియె. "ఓయీ! సారస వరా! ఈయవసరంబున నీవలన మాకొక యవసరంబు గలిగి, పిలి పించితిమి. మాకు నీయందు తఱచిగాఁ దుండు గలుగుటకు నీచేతైన యుకార్యంబున కక్కఱవచ్చుటయే ఫలంబు. మన కిత్తఱి నొకదుర్గంబు కావలసివచ్చినది. ఈపని యనితరసాధ్యం బగుటంజేసి, యీభారంబు నీవయినను మోవవలసి వచ్చెను. ఇది నీకుఁ బరమప్రయోజనంబు. స్వామికార్యానతి యాదలం దాలిచి, యతిత్వరితంబుగ నొక దుర్గంబు నిర్మింపుమా. నీనేరిమిపేరిమి చూతము." అనిన వగ్గలం బగువినయంబు తోఁపఁ బ్రణామంబుఁ గావించి, యాబెగ్గురుపక్షి యిట్లనియె. "దేవరకు నామెడఁ గలవత్సలత్వంబున నీమాననీయ వాక్యంబు లానతిచ్చితిరుగాని, నే నంతటిశక్తియుక్తుండను గాను. నా కొండొకపని యనుగ్రహింపుఁడు. నేను మీపాదచ్ఛాయం బడియుండి, మిమ్ముఁ జూపట్టుకొని, చాటునఁ బొట్టఁబోసికొన వలసినవాఁడనుగాని, స్వతంత్రించి యొకపని వయి వ్రేసికొని సంబాళింపఁ జాలినవాఁడను గాను" అనుచో మరాళతల్లజుండు కించిదుల్లసితవదనుం డగుచు, సారసపతి కిట్లనియె. "నీప్రజ్ఞావిశేషంబు సర్వంబును, మాసర్వజ్ఞుండు వాక్రువ్వ విన్నవారము. నీకిప్పని త్రోఁచివచ్చినం బోవదు. ఇది యనన్యవిషయం బయిన కార్యంబు. మాకడ నున్న యీయందఱిలో నీవు సమర్థతముండ వని నిశ్చయించి, పని పంచితిమి. ఇఁక వృథాకథ లెన్నక, క్రియాపరుండవు గమ్ము" అనిన, తేనిమాటకు మాఱాడ నోడినట్లు మొత్తన నియ్యకొని చని, చయ్యనఁ జనుదెంచి, నమస్క రించి పీఠవరుం డేలిక కిట్లనియె. "స్వామీ! భవత్ప్రసాదంబున, మనకు వలయు దుర్గం బొక్కటి యారసివచ్చినాఁడను. మననగరోప కంఠంబున, నొకయుహార్యగహ్వరం బున్నయది. అయ్యది విశాలాంత

రాళంబయి, ప్రత్యర్థిజనదుస్సాధ్యంబయి, యత్యంత రమణీయంబై యుండును. అందు నయనానందకరంబైన విమల కమలపూర్ణ కమలాకరంబొక్కటి మిక్కుటముగఁ గ్రాలుచుండును. ఆయది దేవరచిత్తమునకు వచ్చెనేనిఁ జెచ్చెర నాయత్తం బొనరించెదను." అనిన, మెచ్చి వసదనంబు లొసంగి, యారాయంచదొర పలుమాఱు ప్రెగ్గడ విన నాబెగ్గురు నగ్గించి, యిట్లనియె. "మాకు నీవంటిబంటు గలుగుట మాభాగ్యముగాదె? నీవలనం గడుం బ్రమోదించినారము. దుర్గపాలనాధికారంబును, నీకె యొసంగినవారము. మన్ని యోగంబులందు లేశంబును బ్రమాదంబునం బొరయక, స్వకృత్యం బేమఱక కనుగలిగి కాచుకొని యుండునది. నీకు శుభ మగుంగాత పోయిరమ్ము." అని సెలవొసంగిన, నుదీర్ణపూర్ణ హర్షుండయి 'మహాప్రసాదం' బనిచని, వీరవరుండు తన్ని యోగ ప్రకారంబున నాహారనిద్రల కెడము లేక, రేయింబవలును దుర్గరక్షణంబె నిత్యకృత్యముగాఁ గనిపెట్టుకొని యుండెను.

అనిన, రాచకొమారులు తదనంతర వృత్తాంతశ్రవణకుతూహలాయత్తచిత్తులై, విష్ణుశర్మంగని, యనంతరవృత్తాంతం బెట్లు నడచెఁ జెప్పుమని యడుగుటయు,—

ప్ర థ మ భా గ ము.

సమాప్తము.

---

# నీతిచంద్రిక, విగ్రహము



## ద్వితీయ భాగము

పరమదయాపరుండైన విష్ణుశర్మ, యాదరశీతలేక్షణంబులం గాంచుచు, వీరవరుండు కొలువు విడిచి చనిన యనంతరమునం జెల్లిన వృత్తాంతంబంతయు, నృపతిసుతులకు నిట్లు చెప్పం దొడంగెను.

అంతలో ద్వారపాలకుం డొక్కండు క్రమ్మఱ నరుదెంచి, యంజలి ఘటియించి నిలిచి యిట్లనియె. "దేవా! యేలినవారిపాద సందర్శనాభిలాషంబున, సింహళ ద్వీపమునుండి నీలవర్ణనామక వాయస నాయకుండు వచ్చి, బహిర్ద్వారంబున నిలిచి యున్నవాఁడు. ముదలయేని, సన్నిధానంబునకుం దోడుకొని వచ్చెద." అనిన, మనంబున నలరి, చక్రాంగపుంగవుం డంగంబు వొంగ మంత్రి కిట్లనియె. "కాకంబు కరంబు ప్రాజ్ఞంబు, శక్తిసంపన్నంబు, రాజు మందప్రజ్ఞుల వేవురం జేర్చుట కంటెం, బ్రాజ్ఞు నొక్కని గడించు కొంట లాభంబు. సింహంబును గాదని, కాలేయకంబుల వేయింటిం గూర్చుకొన్న నేమి ప్రయోజనము? మనవారిలో, నీగుమికానికి సమానుండు బలవంతుం డుండెను, వ్రేలుమడంచి యొక్కని నెఱింగింపుము. యుద్ధోద్యోగసమయంబుల శూరసంగ్రహం బవశ్యకర్తవ్యంబు. కాన, సర్వప్రయత్నంబుల మన కీతనితోడుపాటభ్యర్థనీయము. మనకిట్టి యపిజేయుని సహాయం బొదవిన, నెవ్వం డయిన మనలం బట్టనవ్రేలం జూప నోపునే! నీవును విచారించి చెప్పుము."

అనిన, మందహాస విద్యోతవదనుండయి, సర్వజ్ఞుం డిట్లనియె, "మనోవాక్కాయకర్మంబుల నేనెప్పుడు స్వామికి హితంబె కాంక్షించుచుండుటంగాన, కొంకుమాని నాకుం దోఁచినది విన్నవించెద. దేవర చిత్తంబున వేఱుగా భావింపఁబోకుండు. కార్యవేగం జేలినవారిచిత్తంబున నుచితకార్యవివేకంబు దోఁపనీకున్న ట్టున్నయది. శ్రోత్రవాని సాహాయ్యంబునఁ బ్రత్యయంబు నిడి కడిఁదిమార్తురఁ బరిమార్తుమంట, శునకవాలంబు పట్టుకొని కడలిఁగడవఁ గడఁగుట. అదియునుం గాక, కాకంబు స్థలచరంబు; మనము జలచరంబులము. ఈతండు మనతోడం గలియువాఁడు కాఁడు. సమానుఁడు గానివానితోడిపొత్తు విపత్తునకుఁ గారణం బగును. కావున, మన మీయరిష్టమును జేకొనుట యరిష్టమును గైకొంట గాని, వేఱు గాదు. దేవర యిఁక నీతలఁపు వేసి పెట్టవలయును. తనవారి మాని లాతివారిఁ గోరుట, యమృతంబు దిరస్కరించి కాలకూటంబుఁ గ్రోలఁ దలంపుగొంట. ఈప్రత్యక్షవిపక్షపక్షి యెట్లు సంగ్రాహ్యం బగునో. దేవరయే చక్కఁగా విచారింపవలయును. ఎవ్వఁ డాత్మపక్షంబుఁ బరిత్యజించి పరపక్షం బపేక్షించునో వాఁడు నీలవర్ణ సృగాలంబుపోలికఁ గాలధర్మంబు నొందును. ఏలిక కాకథ విన్నవించెద నవధరింపుఁడు."

ఒక్కతామసీనిశీథంబున శవకబళనలోలం బయి, సృగాలం బొక్కటి నగరోపాంతంబున విచ్చలవిడిఁ జెఱలాడుచుఁ, జీకువాలు కతంబునఁ బ్రమాదంపడి, నీలపాచనభాండంబునంబడి, వెడలనేరక నిరంతరచింతం బనివివనివి, కొంతవడికి డెందంబు కుందు డిందువఱిచి కొని, మాఱుచింత లేక వేగువఱకు విచారించి, వెరవొండరసి యొడఁదకు పరివఱచుకొని, తెల్లవాఱి భాండస్వామి యేతెంచునంతకు, నూర్ధ్వచరణంబును విస్ఫారితాననంబును నిష్కాసితదంతంబును నయి,

కన్నుల తేలగిలవైచి, యూపిరి బిగఁబట్టి, గిట్టినయట్టుల పడియుండెను. అంత, నాసీలిశాఁపు వచ్చి చూచి, విస్మయగోచరుండై, యావంచకంబు పంచత్వంబు నొందెనకాఁదలంచి, వడివడిం గూడ వెడలించి, ఫేరువు నూరికి దూరంబుగఁ బాఱవైచె అంత నామానిసి యచ్చోటు వాసి చనినవెనుక, మూసినకన్ను లల్లన విచ్చి, యచ్చెరువడి యాపాదమస్తకము తన మేనినీలిడాలు విలోకించుకొనుచు, జంబుకంబు తనలోఁ దా నిట్లుచింతించెను. 'నాయదృష్ట మెంతయు మంచిది కాఁబట్టి, నేఁడు నాకు యాదృచ్ఛికంబుగ నేతాదృశం బగునుత్తమవర్ణంబు లభ్యమైనది; నాకోలంబులోన మాన్యుఁడ నైతిని. ఇంకను, జ్ఞానహీనుని చందంబునఁ బ్రాభవశూన్యుండనై, నిరర్థకజీవుండనై యుండనేల: ఇట్టిసర్వోత్కృష్టవర్ణంబు సమకూరినప్పుడే మేలుం బడయంజాలకుంటినే, నింక నాక్రచ్చులు సాధించుకొనుట యెన్నఁడు? నా యాత్మోత్కృష్ట్యంబు లోకంబులకుం బ్రకటింప నిదియ యదను.' అని విచారించి, కార్యంబు బారసి, తోడిఫేరవంబులఁ జేరఁజీరి యిట్లనియె. "విన్నారా? నిన్నరేయి నన్నొకదివ్యపురుషుండు స్వర్గంబునకుం గొంపోయి, ప్రసాదమందస్మితవళక్షం బగుకటాక్షంబు నాపయింబొలయించుచుఁ, దనయనుకంపపెంపున సర్వగీర్వాణసమక్షంబునఁ బూజ్యం బగుప్రాజ్యారణ్యరాజ్యంబునకు సర్వంబునకు నన్నధ్యక్షునిఁగాఁ జేసి, యీ యుత్తమవర్ణంబు నాకుఁ బ్రసాదించె. సంశయంబువాయ నా యొడలు వొడగాంచితిరిగదా? ఇఁక వినవలసినది విస్పష్టముగా వినుండు. ఇది మొదలు, మీరందఱు మదీయాజ్ఞానుసారంబుగఁ గింకర్వాణులై ప్రవర్తింపవలయును. మఱియు నేఁడునుత్, యీశాసనంగల జంతుసంతానంబెల్ల నాయానకు లోనై మెలంగవలయును. మీరిప్పుడ వెడలి, యీమేటివార్త సకలాటవులం జాటపడంజాటుడని." అనివీడుకోలిచ్చిన,

సృగాలజాలంబులు దానిమేనివిశిష్టవర్ణం బవలోకించి, రోమాంచకం చుకితగాత్రములయి, యింతుకయు ననుమానింపక, యాచరిత్రము, విస్రంభపాత్రముగా నగచి, వినయభయసంభ్రమంబు లుల్లంబుల నల్లడిగొన సాగిలంబడి మ్రొక్కి, చని యక్కాననంబు దశదిశలంగల సకలజంతుజాతంబున కాతనివృత్తాంతంబు చిత్తంబుల కెక్కునట్లు పౌనఃపున్యంబుగ వాక్రుచ్చి, వచ్చి, నిర్వ్యాజవినయంబున నహర్నిశం బును భక్తి సేయుచుం, బ్రదక్షిణప్రాప్తానాంగంబు లయి, వంచనలేక యవంచకంబు నజస్రంబును సేవించుచుండెను. అది మొదలుకొని, యంధపరంపరా వ్యవహారంబున భ్రమియించి, వనంబున వసియించు సింహశార్దూలాదిమృగజాలంబు లాసృగాలంబున కాజ్ఞానువర్తులై, మహోపహారంబులు నమర్పించుచు, నాతనిమన సెక్కడ నొచ్చునో యని యనుసరించి సంచరించుచుండెను. ఇట్లాగోమాయువు, హార్య త్వాద్యుత్తమసత్త్వంబులు పరిజనపదమునం గుదిరి యవిరతమును దనమాటలలో మెలంగుచుం గొలుచుచుంటంబట్టి, తొట్టిన గర్వాతిరేకం బునం దనజాతి మొగంబుల మొగంబైనం జూడనొల్లక, వానియం దెల్ల నతిమాత్రనిరాదరంబై యుండె. అందుచే, నాశివాసముదయ ములు విషణ్ణహృదయములయి తమ ప్రమాదమునకు నిర్వేదము నొందుచు, వేలు మొగములువడి తమలోం దలపోంతలకుం జొచ్చి, రహస్యముగ నొక్కనాం డొక్కచక్కిం గూడుకొనియుండ, నందొక్క వృద్ధక్రోష్టువు తనవారినెల్లం గలయం గనుంగొని యిట్లనియె. "ఇది యంతయు స్వయంకృతాపరాధము. కాలకర్మవశులమై బుద్ధిమాంద్యం బున మనమే యీతని కీప్రభుత్వసంపదం గలుగంజేసితిమి. అందుచే నీతనికిం గాకియుం గోకిలమును నొక్కటిగా నున్నవి. ఎంత మేలుచేసి నను, మనమీతని కేమైన హితులమైతిమే? మత్తచిత్తవృత్తులకుం జేసిన

మేలు వమ్మగుటయేకాక, చేసినవారికి గోరంతములును ప్రాప్తము లగును. విమర్శ దూర మైనవానికడ నిలుచుట, మఱది నేరము. ఇంత కాల మొద్దనున్న తప్పునకు, ననిశము వీనిచే నవమానవాక్యములం బడిపడి యెమ్మెలెల్లఁ జిల్లులు పడ్డవి. ఇప్పుడు కార్యము తప్పినది. వీని నిన్నాళ్ళును భాండంబునట్ల తల మోచితిమి. ఇంకఁ దఱి వేచి, కటికి నేలం గూలవైవకున్న, మనకుఁ బ్రాణాంతంబువచ్చు. ఆసత్పురి హారార్థముగా నేనొక్క యుపమ సెప్పెద. అని మీఁదుదులం బట్టు కొలిపి, యీపుట్టిన కలంకఁ దొలంగఁబెట్టుఁడు. ఈమృగధూర్త కాథ ముందు రాజ్య మదాంధ కారంబు కన్నులం గప్పుకొని, క్రింమును మీఁదునుం దెలియఁ జాలకున్న వాఁడు! ఒద్ద నున్న వారి నైనఁ గనఁడు. మన మెల్ల వీనిమృషావచనమ్ములు నిక్కమ్ములని నమ్మి, తెలివిలేక మోసపోతిమి. నక్కయెక్కడ నాకలోకమెక్కడ? రాజ్యం బునకుఁ బట్టంబు గట్టు టెక్కడ? ఇది యంతయు నదృష్ట శ్రుత పూర్వము. ఏలాగుననో దీనికీసిరిరం గలవడిన, నిట్టిన్ని మాయలీటక్కరి నక్కయే పన్నినది. దీనికి మూలం బెఱుఁగమిని, మన మిట్లు వితాకు గదిరియుంటిమి. ఈమతకరిబూమెలు చెవి నిడి మానంబుఁ గోలుపోయి తిమి. ఒక్కమనమే యన నేల? పంచాస్యాదులును నీముక్కిడి నక్కచేత నవమానితంబు లయ్యెను. ఇంత వఱకు మనమే వివేకుల మనుకొంటిమి; మన మృగేంద్రాదు లంతకు ముందే వివేకులు. కడచినగాథల ప్రవ్వనేల? మన చిత్తమాంద్యమే మనల నింతకుఁ దెచ్చినది. ఇఁకను మేలుకొనకున్న, దానిచేష్ట లెప్పుడు నప్రతిహతంబు లయి సాగుచుండును. ఇప్పు డాతండు పట్టిన దెల్ల బంగార మగుచున్నదని, మన మాతని నంత పెద్ద సేయవలదు. అగుకాలంబున నర్థంబులు దుర్బుద్ధులకైన సిద్ధించును. కాని కాలంబున సుబుద్ధులకును సిద్ధింపవు

అయినను, ఋజుమార్గులై యాపదలం బొరయక, చిరకాలబహు సౌఖ్య భాగు లగుదురు. తనకుఁ గాలంబు నిండి, యాతండాత్మవినాశ హేతు వగు దౌరాత్మ్యంబున, హర్యక్ష ప్రముఖుల యెడఁ గుటిలవర్తనుం డయ్యెను. 'చెట్టుచెడుకాలంబునఁ గుక్క మూతిపిందె' యన్నట్లు చేటుకాలంబు కడు నికటంబైన, వీని కీదుర్బుద్ధి ఘటిల్లెఁ గాఁబోలు! 'వినాశకాలే విపరీతబుద్ధి' యను నార్యులవచన మేల వృథ వోవును? పొత్తి పురువు తెఱఁగున, నీఫేరువును దన్నుఁగట్టఁ ద్రాళ్ళు తాన తెచ్చుకొన్నది. మఱియు హరులు గిరులు దీనిఁ గొలుచు చున్నవని యును మనకు వెఱవఁ బనిలేదు. మర్మజ్ఞులయెడ మానావమానంబు లెంతవారికి శుభాశుభంబుల నాపహింపక మానవు. కావున మర్మ జ్ఞులమైనమన కీయొప్పనివానిఁ బరాభవించుట యఱచేతిలోని పనియై యుండును. మన మనోవేదనాపనోదార్థంబుగా దీని కొక మందు చెప్పెద. మీరెల్లరు దత్తావధానులరై వినుండు. ఇప్పుడు మనమెల్లను గూడి, వీని కభిముఖుల మయి కూసిన, జాతిస్వభావంబునంజేసి తానును గూసెడును. ఆసన్న యించుక యెఱింగెనేని, యప్పు డిప్పుండరీకాదు లలో నెద్దియైన నిద్దుష్టుని దిష్టాంతంబు నొందింపక పోదు. ఈశ్వర సంకల్పమును ననుకూలంబై వచ్చిన, శత్రునిరాసం బనాయాసంబుగఁ జేకూఱును. ఇంతకన్న నిరపాయంబైన పరమోపాయం బొక్కటి లేదు." అనిన, నావాక్యములు వీనుల కమృతోపమానము లయిన నిర్భరప్రమదంబునం బొదలి కదలి, దివసావసాన సమయంబున నాభూరి మాయువుదిక్కు మొగంబయి, తదీయరాజ్యావసాన సామీప్య సూచ కంబుగా వఱడులఱచెడునో నా, నానక్కలెల్ల నెదురువడి కూయఁ జొచ్చెను. ఆకూఁత చెవిసోకుఁడు, నక్కలరాయండును దురతిక్రమం బగు జాతిధర్మంబుఁ గడవ నేరక, విధి చోదితుండయి, శ్రవణ విదారణ

దారుణారావంబుఁ గావించె. ఆరొద చెవిఁబడ్డతోడనె, తత్పూర్వ్రం బున నున్నయొక్క బెబ్బులి యది నక్కయొకదా యని యెఱింగి, కోపా వేశంబున దంతసందష్టదారుణాననం బయి లేచి, మెఱుంగుమెఱసిన తెఱంగునఁ జెంగునమీఁదికుఱికి నఖంబులు వాఁటి గొంతుక్రోవి యుట్టకుంబాపి, తనదారిం బోయెను. అంతకుమున్న నిలువలేక పరు వెత్తుదానిమేనిప్రాణంబులతోడనె, బంధుజనమ్ములమనమ్ముల యుమ్మ లమ్ములును బరుగువాఱె.

"కావునఁ, బరపక్షం బెందును భయావహంబు. ఈకాకమును జేరఁదీయుట నామతముగాదు. ఇంతకుం గార్యంబు భవద్భావాధీనం బయి నడుచును." అని పలుకు మంత్రివాక్యము లాకర్ణించి, హంస స్వామి యిట్లనియె. "మనకు నేఁటజేపట దారుణరణంబు నంప్రా ప్తంబు కాఁగలదు. అప్పుడు శూరజనసంగ్రహణంబు సమధికాపేక్ష్యం బయి యుండును. రోయఁబోవుతీవియ దైవయోగంబునఁ గాళ్ళంబెనఁ గొన్నతీరున, నీశూరవరుండు కోరినకోరికగా మనకు లభ్య మయ్యెను. సిరిరా, మోఁగా లొడ్డ నేల? మనపాలిటిపుణ్యస్వరూపంబు సన్ని హితంబైన ట్లీతనిప్రాపు దొరకినది. అశుభము లట్ల శుభములు నప్ర యత్న సిద్ధంబులు. 'అయాచితోప పన్నంబగు మేలుఁ బరిహరింపఁ గూడదు. మనము జలచరంబుల మీఁతండు స్థలచరుం డందువేని, వజ్రమును భేదింపఁ దలంపు గొన్నవాఁ డనన్య భేద్యంబగు నద్దాని వేఱొండు వజ్రంబుచేతనె భేదింపవలసి యుండుంగాన, స్థలచరుండగు చిత్రవర్ణుని దోరింపఁగోరు మనకోరిక స్థలచరుండగు నీనీలవర్ణు తోడ్పాటులేక చేకూఱ నేరదు. మనము వెకలులమై యీబలియుని చెలిమి కీనొల్లక పీడనాడితిమేని, యలుక రొులసి యల్ల శిఖ తొల్లఱం గలసిన నవల వలవని వానిం గలనం గెలుచుట, కరంబు

భరం బగును. వాంఛితార్థంబును గడంబట్ట నేరదు. పిమ్మటం జేయించిన కార్యంబునకు వగగొంట నిర్వాణదీపతైలదానం బయి, యత్నవైఫల్యంబె కాక మనోవేదనానర్థమును నగును. కాంబట్టి, సర్వవిధంబుల మన కీకరటంబు పరిగ్రాహ్యంబు. ఇంక లేనిపోనిశంకలు మాని, యీప్రయోజనం బంగీకరింపుము." అనిన, మంత్రియు నించుక యనుమానించి, మిక్కిలి విన్నవించిన జేనిమనను నొచ్చునో యని హృదయానురంజకంబుగా నిట్లనియె. "సర్వధర్మమర్మజ్ఞానమాన నీయులు, దేవరకుం దెలియనికృత్యాకృత్యంబులు లేవు. కార్యగతుల తెలంగులు దేవరనారికన్న మిన్నగా నారయువారును లేరు. లెస్సగా విచారించి, కార్యంబు దేవరచిత్తవృత్తి యెత్తెఱంగున వర్తించు నత్తె రున నాచరింపవచ్చును. నాయెఱింగినంతవట్టును నేనువిన్నవించితి. ఈ వఱకే ప్రణిధి నిర్ణయింపంబడియె; దుర్గంబును సంసిద్ధం బయినది. ఇంక జంపు నడపక, దూతను రావించి, యేతెంచినప్రయోజనంబు విమ ర్శించి పంపఁజను." అనిన తేఁడు 'నట్లకాని' మ్మనుచుం, జక్రవాకంబు బయలికొలువుం బ్రవేశించె. అంతకుమున్న యెకిమీఁడును జనుదెంచి, యాస్థానం బలంకరించి యుంటంజేసి, పరిజనంబు లల్లనల్లనం బర తెంచి, యధ్యక్షుండు యథాప్రధానంబుగా నంభావింపఁ, దమతమ నెలవులం బొలిచిరి. అప్పుడు ప్రెగ్గడ ప్రతిహారిగ నొక్కనిం జీరి, "నీవేగి వేగిర మాకీరంబును గాకంబును నేలికచెంతకుం గొనిరమ్ము." అనుడు, 'మహాప్రసాదం' బనిచని, పణిహారి తెలుపుడుచేసినం, గాకకీరంబులు కొలువు సొత్తెంచి, హిరణ్యగర్భకరనిర్దిష్టాసనంబులం గూర్చుండె. అంతం గుశలప్రశ్నంబుఁ గావించి నిజాగమనప్రయోజనం బడిగిన రొయిడయని కభిముఖుండై, దరవిరహితంబుగా శుకం బిట్లనియె. "దేవా! నావచ్చినకార్యం బవధరింపుము. "జంబూద్వీపాధినాథుం

డగు చిత్రవర్ణ నామబర్హీంద్రుండనువ, మీతోడ ముచ్చటలాడఁ బని గలిగివచ్చితి. ప్రయోజనాంశంబు తిరుఁడవై యాకర్ణింపుము. అవసరం బగునేని విన్నవించెద; హృదయం బేకాగ్రంబు కావించి, యాతం డాజ్ఞాపించినపలుకులకుం జెవి యొగ్గుము. 'మీకప్పురపుదీవి లోనుగాఁ గలచిఱుదీవులెల్ల నీనేరేడుదీవిక్రింది యులంతిదీవు లగుటం జేసి, యీసు మాని వానియేలిక లందఱు మాకుఁ గరం బర్పింప నర్హులు. కావున, నీవును మానప్రాణంబుల కాసింతువేని, యీసు గాదను వివాదంబు మాని, మానేలకు వేళమవచ్చి, యస్మచ్చరణంబుల శరణు వేఁడి, నేఁ డాదిగా నేఁడేఁడును దప్పక కప్పం బప్పనము చేయుచుండునది. సామవచనంబుల నీమనంబు కూడియాడుట కొడంబడదేని, నేనిదె కదనంబున నీమదంబు సదమదంబు చేసి పుడమి వడయ నడతెంచు చున్నవాఁడ. వాఁడిమగండవై నిగుడునది.' అని మీకెఱింగించి, మీ వాక్యంబుల తెఱం గెఱింగిరమ్మని నన్నిచ్చటికిం బుచ్చె. నాకిక్కడఁ గడుండడయఁ దీఱదు. సత్వరంబుగఁ బ్రత్యుత్తరం బొసంగి, సెల వొసంగుము. ఆ కేకిలోకాధ్యక్షుండు దుర్వారవైరివారగర్వనిర్వాప ణాఖర్వశౌర్యధుర్యుండు; నిగ్రహానుగ్రహసమర్థుండు. కాన, నాశిఖి వరుమఱువు సొరుము. ఆతనిబుద్ధిఁ గైకొనక నిరాకరించితేని, నీకీర్తి కల్పకాలంబునను సమాప్తియొదవును." అనినం దోఁకత్రొక్కిన త్రాఁచుచందంబున సముత్థితుండయి, వళక్షపక్షీంద్రుండు, రోషా వేశంబునఁ బెదవు లదర, నద్భుతరసాక్రాంతం బగుస్వాంతంబుతో, మేఘగంభీరభాషణంబుల నిట్లనియె. "ఎట్టెట్టూ! నేఁ డేమేమో క్రొత్తలు వింటిమి!" అని కొలువు కలయంజూచి "ఆహా! వింటిరే? నేఁ డెట్టిచిట్టలు పుట్టెనో! ఒక్కకూళనెమ్మిపిట్టకు, సవ్యాజతేజోవిరాజ మానంబయి క్రాలుజాలపాదోత్తమంబు పాదాక్రాంతంబయి యురి

వెట్టవలయునఁట! ఔరా! ప్రతాపోక్తులు! అట్లులైన, సింగంబులు ప్లవంగంబుల యడుగులం బడి, శాశ్వతపరిచర్య చేయవలయుం గాఁబోలు! చిత్రవర్ణుఁ డలవి యెఱుఁగలేక, చుట్టుకొన్న యజ్ఞానతిమిరంబున, నశక్యవిధానంబునకుఁ బాటుపడుచున్నవాఁడు. తొల్లి వాండ్రను వీండ్రను గొందఱ జయించితినని తలక్రొవ్వి, యిక్కడ నక్కాలందినె పోవు నని తలంచెంగాని, హిరణ్యగర్భునిప్రతాపాగ్నికిఁ దనప్రాణములు వెచ్చపెట్టక బ్రతికిపోలేమి యింతయుఁ జింతింపఁ డయ్యె." అని, యనివార్యక్రోధభీషణుం డయి పలుకుచున్న జేనివంకఁ జూడఁజాలక, భయార్తమూర్తులై సభాసదులెల్లఁ బరస్పరముఖావలోకనంబులు సేయుచుండ, నామరాశనేత యనుభావంబున కనురూపముగా రిత్తకోపంబు తెచ్చుకొని, దండ నుండుబలిభుజుండు కోపంబు రూపంబు దాలిచినపోలిక లేచి, యాచిలుకకై వెలలుచు, సవినయముగా దొర కిట్లనియె. "కాలపాశబద్ధుండై, యీపాలసుం డోలగంబున దేవరం దన్నును విచారింపక, మందెమేలంబున నోరికి వచ్చినట్లెల్ల గర్ణకఠోరంబుగఁ బ్రేలుచున్నవాఁడు. ఎంతగుండెగలవాఁడు గాకున్న, నిట్లు మొఱకడమ్ములు పచరింప నోపునే! వీనిం దూతయని దయఁ జూడఁగూడదు. ఈయధముం డత్యంతంబు వధార్హుండు. ఏను దేవరసేవకుండ నుండ, నేలినవారికి శ్రమయేల! మాఱు పలుకకుఁడు; నేఁ గడఁగి యీచెడుగు నిప్పుడ కడముట్టించెద; మదీయవిజ్ఞాపనము వృథాకరింపక, ముదల యీవలయును." అనుచుం గదలి, ఫలాశనముకడ నిగుడుచు, నెడసొచ్చి యచ్చక్రవాకవల్లభుం డిట్లనియె. "నిలునిలుము; సాహసోద్యోగంబు వలదు: ధర్మంబుఁ బదటఁ గలవకుము. దూతప్రాణంబుల కలుగుట పాడిగాదు. పాడి విడిచిన పుడమిఱేఁడయనికడ నోడమె వెడలునని, నెఱి నెఱి నెఱిఁగిన

గఱువలవలన వీడుదుము. త్రికరణశుద్ధిగా భూతజాతంబులయెడ నెగ్గు దలంపమి శీలంబు నాఁబడు; సమస్తంబునకు శీలంబు మూలంబు; శీలంబువలన ధర్మంబు నెగడును ; ధర్మంబువలన సత్యంబు గలుగును ; సత్యంబువలన వృత్తంబు చొప్పడును ; వృత్తంబువలన బలంబొలయును ; బలంబువలన సిరి యొదవును; దానివలన సర్వకార్యసిద్ధులును సంఘటిల్లును. ఆవు నావును గ్రుమ్ములాడి, నడిమిలేఁబెయ్యకాళ్ళు విఱిచినట్టు, రాజును, రాజును బోట్లాడి దూత కెగ్గుసేయ దగ్గదు నరే? ఏతఱి నేతఱికి సర్వానర్థంబులును సిద్ధంబు లగును. దూత యెప్పుడు నవధ్యుండు. ఆతండు తనయవధ్యభావంబుఁ దలంచి, పలుకవలసినట్టెల్ల వారెడక పలుకుంగాని యెన్నఁడైన మోమోడి స్వాపకర్షంబును బరోత్కర్షంబును బ్రకటింపఁజూచునె? ఈతనిమాటలు తప్పుగాఁ బట్టఁబోకు. దూతపలుకుల కలుకఁ బూనుటకంటె నవివేకము లేదు, కోపము మూర్ఖులకు ముక్కునను యుండు; క్రోధి, కార్యాకార్యజ్ఞతఁ గోలుపోయి, యవధ్యులనైన వధియించును ; తుదకాత్మఘాతమునకైన శంకింపఁడు. కోపము పాపముల కెల్లను మూలము. కావున, క్షమాజలములం జేసి మతిమంతుఁడు క్రోధానలము నార్పవలయునని, సూక్ష్మదృక్కులైనమహాత్ములు పలుకుదురు. క్షమయే సర్వకార్యములకు సమృద్ధి కారణము. కోపము కొనియాడుట లగ్గుగాదు. క్రూరకర్మము మోహధర్మం బగునే!" అని మందలించి, నీలవర్ణునిఁ గొంత ప్రశాంతస్వాంతుం జేసి, సంరంభం బుడిపిన నుదీర్ణతరనిశ్వాసుండై, యాతండు కుంభనిక్షిప్తభుజంగంబు భంగి రోఁజుచు, నిలువంబడి యుండె. అంతఁ దద్వచనామృతాస్వాదనంబునం దేఱి, ప్రశమితక్రోధుండయి యున్న రాజునకు మంత్రి యిట్లనియె. "దేవా! తడవయ్యె. ఈశుకోత్తముండు ప్రత్యుత్తరము

వాచ్చియున్నవాఁడు. ఇఁక నిలువఁగూడదు. మీ మనోనిశ్చయము చందం బానతిచ్చి, చెచ్చెరఁ బుచ్చవలయు.” అనినఁ, గలహంసావతంసుండు శుకంబువంక మరలి యిట్లనియె. “ఓరీ! యగుణముఖా! వినుము వాక్యం బస్మదీయంబు. నీ వేగి నీ రాజును బొడగన్నతోడనె, నోరోడక సభామండపమున నందఱు విన నాపలుకులుగా నిట్లనుము. ‘నీవు రాజ్యమదంబు ముదిరి మా దేశం బొక్కట నాపోశనము గొనఁ దలఁపు గొన్నవాఁడవు. హిరణ్యగర్భునిముక్కున నూర్పు గలుగ, నీ నేల నేలఁగలుగుట నీకు కా దల్ల నొసటఁగన్నున్నవాని కైన మెయి మెయిం గలుగ నేరదు. నీవు నాబల శౌర్యములకు మారొడ్డుట, ఖద్యోతంబు ఖద్యోతమండల ప్రభాపటలంబుఁ గడవఁగడఁగుట. ఒక్కచిత్రవర్ణుండె కాఁడు, కోటిచిత్రవర్ణు లొక్కట నెత్తివచ్చినను, సంవర్తమార్తాండమండలము మెండున విపక్షదురధిక్షేపం బయినప్రతాపంబున వెలుంగు హిరణ్యగర్భుని రణాంగణంబునఁ దేఱిచూడ శక్యంబు గాదు. నీవు నిక్కంపుఁబౌరుషశాలి వేని, యాలంబు చేసి మా నేల నొడిచికొనుటయే మగతనంబు. అప్పుడుగా నీమగంటిమి మెచ్చుకొందుము! ఎందును నినుబోఁటి శూరమానులమాటలె కోటలు దాఁటుంగాని, కాలు గడపదాఁటదు. పనికిరాని యీ శిరజపుంబీరంబులు గట్టిపెట్టి, పోటుబంటవై పోరితంబునకు డాయుము. మృత్యువుం గృతకృత్యుఁ జేసెద. లేనా నీపడుచుమాట లపలఁబెట్టి, జితోస్మి యనుము. అనిన న్విడిచెద.’ అని తెగనాడి, యివి యన్నియు మీయేలికపాల నళుకుమాని వాక్రువ్వవలయుం జుమీ.” అని మఱిమఱి చెప్పి, “మీరాజు నాజికిం గొనిరమ్ము, పొమ్ము.” అని పసదనం బొసంగి, స్వాదుఫలదానంబున సంతృప్తుఁ జేసి, వీడుకోలిచ్చిన, నచ్చిలుకయు రాజున కున్ముఖంబయి, “మీకడ నేమియుఁ

దప్పు ండ కదా ? నా వాక్యంబులం గలచచస్ఖాలిత్యంబులెల్ల మఱవ వలయు; నాపల్లఁ జాల శ్రమం బయ్యెను. పోయివచ్చెద; నాతోడ నింకేమేనియుఁ జెప్పవలయునది గలదే?'' అని సవినయంబుగా వీడ్కొని, పని వినియెను.

అట్లా కీరంబు బయలుదేఱి, కతిపయప్రయాణంబున నిజ దేశంబుఁజేరి, దుర్గమార్గపరిశ్రాంతికొంత శాంతించిన వెనుకఁ గొలువు కూటంబునకుం బోయి, పేరోలగం బున్న మయూరరాజుం గాంచి, ప్రణామంబు గావించుడు, నాతండు కరుణాతరంగితంబులగునపాం గంబు లరుణముఖునివయిం బొలయించుచు, సాదరంబుగా నిట్లనియె. "ఓయరుణముఖా! కర్పూరద్వీపమునకుం బోయి యొకయొచ్చెంబుఁ దొరయక మరలి సేమంబున వచ్చితివా? నీవచ్చుటనే కదలనికంబంబ వైతి వదియేమొకో యని, మనస్సు తామరపాకునీరుక్రియఁ దల్లడిల్ల ననిశంబు నీమార్గమె చూచుచు, నిమిషంబొక్క కల్పంబుగా దినములు పుచ్చుచున్నారము. మాచేసినభాగ్యంబుకతంబున, నేడుతిన్నఁగా నిన్నుఁజూడఁగాంచి మాకన్నులు చల్లనయినవి. అచ్చటి వార్తావిశే షంబు లేవియుఁ గడమపడకుండఁ దెలుపుము'' అనినశుకంబిట్లనియె. "నాఁడుస్వామియానతిపకాళిఁదాలిచి, హిరణ్యగర్భుపాలి కేగి, మాట లాడి, యాతఁ డనుప నివ్వాడ వచ్చితి. ఆదీవిమానోజ్జ్వలం బేమని విన్న వింతును? ఎక్కడఁజూచిన నప్పరస్సమన్వితంబును సుమనోవిరాజితం బును నయి, మాఱటస్వర్గంబునాఁ జూడ్కికి వేడ్కఁగొలుపుచున్నది. హిరణ్యగర్భుండును నాత్మరక్షయం దప్రమాదుండయి, యభిమాతుల వేయుకన్నులంజూచుచుండును. ఆలంకంగలవిహంగంబులెల్ల, ననూనం బగునభిజాతాభిమానంబు గలవయి, తమరాజు నవ్యాజానురాగమునం గొలుచుచుండును. అస్మదాదు లాయొప్పులో శతాంశంబును జెప్ప

శక్తులుగారు. నేర్చినవఱకుం జెప్పుదునన్నను, అందులకుం బెక్కుదినం బులు పట్టును. ఆకథ దవ్వుల నుండనిండు. నే నేగినప్పుడు, హిరణ్య గర్భుండు లోపలికొలువులో నిజామాత్యద్వితీయుండై మంతనం బుండి యుంటంజేసి, మదాగమనాభిధానంబులు విజ్ఞాపనంబు సేయుండవి దౌవారికుల నెందఱ నెన్నివిధంబుల నర్థించిన, 'మంచిది చెప్పెద ముండు' మనుచుంటయె కాని, యెవ్వరుం గాలుకదల్పం జాలినవారు గారు. తరువాతం గొంత సేపున కొక రెండువిదుతలు కొందఱు లోనికిం బోయివచ్చి, 'యిపుడు సమయంబు గాదు. కొంచెము తాళు' మనుచుం జాగు చేసిచేసి, యొం దొక్కరుండు లోపలినుండి వచ్చి, 'యేలిక సెలవైనది ర' మ్మని నన్నుం బిలుచుకొనిపోయెను. అయ్యవసరంబున నయ్యేకిమీఁదు సంతత సేవాసమాయాతశకుంతజాతంబులవరవుడంబు లంగీకరించుచు, నాంతరంగికులమనవికిం జెవి యొగ్గుచునుండి, యాలో నన్నుం జూచి, సముచితాసనంబునం గూరుచుండ నియమించి యాగ మనకారణం బడిగెను." అని, తాం గొలువు సొచ్చు టాదిగా హిరణ్య గర్భుం డాడ నియోగించినమాటలు తుదిగా నడచినసర్వవృత్తాంతం బును నానుపూర్వంబుగా విన్నవించి, మఱియు నిట్లనియె. "ఆతండు నన్నిచ్చటికంపుచో, నన్నలవోకగాం జూచుచు, నవసానంబున 'నీరాజు నాజికిఁగొనిరమ్ము పో' మ్మని వేగిరించె. ఆతం డరాతుల కసాధ్యుండు; అనుపోష్యులును భటులును యుద్ధశౌండులు. అయినను మనకొదవ లన్నియు దీర్చి గెలు పొసంగ, మనమేఘవర్ణుండు గలఁడు. అవసరోచితంబు లగువర్తనంబుల తేనిమనసున కెక్కం బ్రవర్తిం చుచుం, బ్రసాదంబునకుం బాత్రభూతుండై, యాతం డచ్చట నీలవ ర్ణాహ్వయంబున రాజునకు విస్రంభభాజనంబై యున్నవాఁడు. వెఱవ నేలి? భారంబు దైవంబుమీఁదం బెట్టి, 'ధర్మోజయతి' యని యుద్ధం

బున కుద్యోగింపుఁడు." అనినఁ, గొలువు కలయం గనుంగొని, చిత్ర వర్ణుం డిట్లనియె. "వింటిరే? చెవులార మీ రెల్లరు. హిరణ్యగర్భుని గరువపుంబలుకులచందంబు. తా నట! జితోస్మి యనిన, నన్ను విడుచు వాఁడఁట, ఈ వాక్యం బొక్కటియె నాహృదయంబునకు శల్యభూతంబై నొవ్వ దనికించు చున్నది. ఏనాఁడైన మదకుంభికుంభవిదళనపటిష్ఠ నిష్ఠురనఖముఖుం బగు కేసరి ఘాసంబు గ్రాసంబు సేయఁ బాలువడునె? చిత్రవర్ణుం డొరున కొక్కనికి, నీపుణ్యమని దోసిలి యొగ్గి మనుట కల నైనం గలుగనేర్చునే? ఇత్తఱి సమరంబుకంటె నుత్తమకృత్యంబు నామది కొక్కటి చూపట్టదు. పరరాజ్యజిగీషుత్వంబు కన్నను, నన్నాతం డాడిన తులువమాటలు కలనికి మిక్కిలి త్వరపెట్టు చున్నవి. నాపేరు విన్న, బాలుపామైనం గదల వెఱచు. అట్టి నన్నా తెలిపిట్టల మన్నీఁ డారివేరంబున వీఁని వారినింబోలె వెఱపింపఁజొచ్చె. ఆహా! అంత్యకాలం బాసన్నం బయి, దుష్ప్రలాపంబులు సేయుచున్న వాఁడు! ఎవ్వాఁడు వైరంబు తుదముట్ట సాధింపఁజాలఁడో వాని జన్మంబు నిరర్థకంబు. పౌరుష శాలికిఁ దనంత వాఁడు పగవాఁ డుండినఁ, బగ తెగునంతవఱకుం గంటికి నిద్దుర రాదు; నోరిఁ కోరెం బింపుగాదు; ఇతరసౌఖ్యంబులు మనసునం జొరమి వేర చెప్పనేల? కావున, మనమిప్పుడ జైత్రయాత్ర వెడలి, పగవాని నిర్జించుట కర్జంబు. మీవంటి సహాయ సంపన్నత్వము గలుగ, నాకొక్క హిరణ్య గర్భుం డెంతవాఁడు? ముల్లోకంబులు నొక్కట నెత్తివచ్చినను, సరకుగొనను. అతం డింటనుండిఁ దలముతప్పిన గర్వమున మనల మాటలం గెలుచుచున్నవాఁడు. మన మాయుధముని బ్రధనంబున నిధనంబు నొందించి, నోర డంతము. సరివాఁడొకఁడు కొలువులో ఝులుకులవంటి తులువమాటలు పెక్కులు ప్రేలెనన

విని ప్రతిక్రియఁ గావింపక యాలువుగలవాని కెటులు తాళ మనసు వచ్చు? మన మొకవేళ దయఁ దలఁచి యోరిచి యూరకుందుముపో, లోకులు మానలఁ జాలనివారన రే? లోకాపవాదము వడశక్యమగునె? ఆహవంబు శుభావహంబు గాదనియు జయాపజయంబులు దైవాధీనంబు లనియుఁ దలంచితిరేని, వినుండు. ఈదేహంబులు బుద్బుద ప్రతిమంబులు; మృత్యువుకృత్య మిదమిత్థ మని నిశ్చయింప రాదు? పుట్టినవాఁ డవశ్యము గిట్టవలయును? సదనమునఁ గదలని గదములంబడి యొడలు విడువక, పగతుండు వెగడుపడునట్టి దిట్ట తనంబు వాటించి, యాలంబునం గూలు మేలు పురాతన జననకృత సుకృత పరిపాకమునంగాని చేకూఱ నేరదు. బహూక్తు లేల? కలనం బొలియఁగనుట స్వర్గమార్గంబుఁ గనుట. ప్రసంగ వశంబున నింతయుఁ బలుకవలసి వచ్చెంగాని, వివేకధనుల రగుమీకు ధర్మంబు లుపదేశించు పాటివాఁడంగాను. తద్దయుం బ్రొద్దుపోయెడు జాగేల? మీమీసైన్యంబుల నాయితంబు చేసికొని రండు; పొండు. అని చేసి, మనమూదాయసిరిహరింతము విత్తములుపురుషారంభాయత్తములు.”

అన, మంత్రిదూరదర్శియిట్లనియె. “దేవా! యింటగెలిచిమఱిరచ్చగెలువ వలయును. మనలోనిమాట విచారింతము. ఇప్పుడు మనయరుణ ముఖుండు చెప్పినవాక్యములచొప్పు పరికింప, సంగ్రామం బుత్తమ కర్మంబుగా నాబుద్ధికిం దోఁపదు. మిత్రామాత్యసుహృద్వర్గంబులు దృఢభక్తియుక్తులయి యుండి, విపక్షునికడవారు విపరీతులై యుండి రేని, భండనం బప్పుడు కర్తవ్యంబు. మఱియు విగ్రహంబునకు ధర ణియు హిరణ్యంబును నను రెండును ముఖ్యఫలంబులు. అవి తద్దయు నిశ్చితంబు లైనపిదపఁగదా, కదనంబునకుఁ గడంగవలయును? అంతియకాక, వడివడిం దొడర ననన్యసామాన్యపరాక్రమమాన్యం

డై నహిరణ్యగర్భుండంత యుగ్రశమసాధ్యుండె ? మనకథయందు ట్లాతఁ డలంతులఁ బోవువాఁడు గాఁడు. అతఁడు పెద్దయు. ప్రజారంజకుండై యున్నవాఁడు. నేపనులును గేవల హీనవ్రతశ్రాంతులు. వైరిబలంబు విచారింపక, మూఢుండు సాహసంబునకుం జొచ్చి, హానిబొంది బహు హరిణంబుకరణి మరణంబు నొందును. కావున, నీసాహసికత్వంబు మానవలయు" అన, మంత్రిమాట చెవిఁ దూఱక, నకులకవాడమి రయుడయుండిట్లనియె. "నీవాక్యంబులు చూడఁ జిత్రాతిచిత్రంబులుగా నున్నవి. నీవు కేవల వయోవృద్ధుఁడవు. తల తెల్లనైనంతనె మోక్షక కలుగు నెట్లు? ముదుసళ్లులు దమ కనుకూలంబుగాఁ జనువుకొనుటఁ దక్క, వేఱొక్కటిఁ గానరు. జ్ఞానవృద్ధులబుద్ధులు గదా, సభ్యుల కెక్కును? నే నెట్లును బరరాజ్యాక్రమణంబునకుం గృతనిశ్చయుండనై యున్నవాఁడ. ఇఁక మదీయోత్సాహభంగంబుగా మాకడ నీ నేర్చిన పెల్లను పల్లింపకుము. ఓపితివేని, విజయానురూపంబులగుసల్లాపంబులు పలుకుము. అట్లు పలికినను, నీవు మాకు మహోపకారంబు చేసిన వాఁడ వగుదువు." అనుచు నెఱకుదూఱఁ బలికిన, విపణ్ణుం డయ్యుఁ బ్రసన్నుండుంబోలె, దుర్వారం బగుపరిభవవికారం బేమియు వెలిఁ దోఁపకుండ నవ్వుమునుంగు పెట్టి, మానసంబున లేనియుత్సాహంబు తెచ్చుకొని, దాక్షాయ్యనాయకుం డిట్లనియె. "మాకెల్లరకు దేవర మూలకంద మగుటం జేసి, దేవర మేలు గోరి యింతపట్టును నిష్కపట ముగా నచియించితిని, చెవికిఁ జేదుగా నున్నను, స్వామిహితం బిదఁ గోరుభృత్యుండు తనకుఁ దోఁచినహితము నిశ్శంకముగ వాక్రువ్వవల యును. అట్లుగాక, కొందఱు యథాజాతులు స్వామిచిత్తము నొప్పింప నేల యని, మెచ్చఁగినదానినైన నడచిపుచ్చి, మనసుకెక్కుఱితి నిచ్చక ముగాఁ బెదవులు గదలువ కూరకుందురు. అట్టివారు తప్పక స్వామి

ద్రోహులై, యిహపరలోకదూరు లగుదురు. సర్వధర్మజ్ఞులు, దేవర యెఱుంగరా నీతిపర్తితుల తెఱంగు? మే మెల్లరము స్వామితోటిసుఖ దుఃఖముల కియ్యకొని, యనన్యశరణ్యులమై స్వామియాజ్ఞయందున్న వారము. దేవరని రోగంబన్న, మాకలంఘ్యంబు. సత్యసంకల్పులు, దేవర కెన్నండును నొక్కకొఱంత రాదు. స్వామియానతింజేసి, చమూసమూహంబు లాహవదోహలంబు లయి యేతెంచి యున్నవి. దండయాత్ర కిది సంచితసమయము. శత్రువు ద్రుక్కడియని ప్రయత్న మల్పము చేయరాదు. చిన్నపామునైనం బెద్దకఱ్ఱతోడనె కొట్టవల యును. కాఁబట్టి, సర్వసైన్యసమేతముగా నడచి, యాకస్మికముగఁ బోయి, యేమఱించి పయింబడితిమేని, బగఱబలంబుల నేలఁ గలు పుట మనకుఁ గరము సుకరం బగును. కాలయాపనము చేసిన, వా రందఱుం గూడుకొని, నెయ్యురతోడుపాటుంగూడఁ బడయుదురు. అప్పుడు వారి దోరించుట కరంబు దుష్కరంబగును. కావున, వేవేగ నమిత్రసంత్రాసనమును మిత్రసముల్లాసమునుగా దండు వెడలుదము. కార్యము తఱిదప్పక చేయుట లగ్గు. 'ఆలస్యా దమృతం విష' మ్మని కదా, యుష్మాదృశు లైనపెద్దలు పలుకుదురు." అనుడుఁ బ్రెగ్గడ మాటలు కలరి, దండములు నడపింప మొనగాండ్రకు నాజ్ఞయిచ్చి, నెమ్మి సామి సేనాసమేతముగా దాడి వెడలి, నిత్యప్రయాణముల మల యంబుం జేరి, యాచేరువఁ బాళెంబు దిగి యుండె.

పదపడి హిరణ్యగర్భుండు కొలువున్నయెడ, మున్ను చిత్రవర్ణు పాలి కేగినదీర్ఘముఖుండు చనుదెంచి, పథశ్రమమునదూఁగాడుచు నిలువంబడి, జోహారు వొనరించి, తేనియనుమతిని దాపునకుఁ జని, వక్తవ్యాంశము విన్నవింప సంశోధించి, నలువంకలుఁ బాఱఁజూచుచుఁ, దలం పెఱింగి యచ్చటి మేఘవర్ణాదు లవలికిం జనిన, తేనియానసమ్ము

నని చూపు నిలిపి, మఱికొంత చెంత జరిగి మెల్లన నిట్లనియె. "ఓసుక్షి కులసార్వభౌమా! చిత్రవర్ణునిసభం బుట్టిన విశేషములు విన్నవించెద; పరాకులేక యాకర్ణింపుఁడు. కడ కక్కడ నీయెడఁ దాడి వెడలుట నిశ్చయింపఁబడె, చిత్రవర్ణుండు సముజ్జ్వలన్నిజతేజమున మలయాధరా ధరోపత్యకన్యాసలతోడ వీడు విడిసి యున్నవాఁడు. ప్రతిక్షణమును దుర్గం బేమఱకుండునది. మఱియు నొక్కయాశ్చర్యం బవధరింపుఁడు. మున్నా రాజుచేతఁ బ్రత్యాఖ్యాతం బైన యొకకపోతముతోడఁ జెలి కారంబు వాటించి, రాజమంత్రతంత్రము సమస్తము నాకళించినాఁ డను. చెప్పిన సమ్మోదరో నమ్మరో కాని, మనవీట నెవ్వఁడో చిత్ర వర్ణ ప్రేషితగూఢపురుషుం డొక్కరుఁడుం డున్నవాఁడని విన్నవాఁడను. ఇప్పలుకు చెప్పునంతలో నప్పారావతంబు కార్యాంతరవ్యాసంగ మున నొండెడ కేగుటం బట్టి, దిఙ్మాత్రంబె కాని, సవిస్తరముగా నాతఁ డెవఁడో యెట్టివాఁడో యడిగి తెలిసికొనం జాలనైతి. అతనితోడి ప్రసంగానుప్రసంగముల వేఱొకప్పుడు మఱికొక రహ స్యంబును నెఱిఁగినవాఁడను. తదీయమంత్రి, రాజు తనమంత్రంబు దెస ననాదరంబు సేయుటం జేసి, యుపేక్షాపరుండయి, యున్నవాఁ డఁట! ఇదియు మన ఫలావాప్తికిఁ గొంత యనుకూలంబుగాఁ దోఁచు చున్నది. నావాక్యములయం దేది యయిన, దేవరకార్యంబునకుం బ్రయోజనకారి యగునేనిఁ, గైకొనునది. మొన్నరాత్రి చిత్ర వర్ణుని పరిచరులు కొందఱు చీఁకటిచాటున నన్నుఁ దారసించి, పూర్వపరిచయంబున, నావలుకుబడియు మొగముచాయయుఁ దలంచి, యీతండల్లనాఁటి దీర్ఘముఖుండౌను నాఁటను సంశయంబుతో గొంతవడి పొట్టుపోరలయి, గుజలు గుజలువోయి దాయఁ జూచిన, నేనా కీ లెఱింగి, తడసినఁ గార్యపాకంబు తప్పునని యెంచి, యపుచటఁ

గాలుసలుపక మేను నిడువెంబడుక పెట్ట లేచి యదె యే మని యడుగుకలకంబులతో నేమియులే దిప్పుడ మరలి వచ్చెద నని పులిమిపుచ్చి, పక్కనవారిం గనుమూసి, యిచ్చటి కొక్క యంజను జపదోచితి, మనధనళాంగుల దచ్చటనే యున్నవాడను" అని తావిన్నదియు గన్నదియు సవిశల్యముగా వినిపించి యూరకున్న, క్షణమాత్ర నిమీలిత నేత్రుండై కొంత చింతించి, కుశాగ్రబుద్ధి గావున నహితకృతద్రోహం బూహించి, మంత్రి రాజున కిట్లనియె.
"అవధరింపుము రాజా! మన దీర్ఘముఖుని వచనంబులు, నెవ్వడో నెమ్మితేని దూతవేషధారి యొక్కరుం డిందున్నవాడని, యథార్థముగా నెఱుక పడుచున్నది. ఒకవిధంబున నాగూఢ పురుషుండీ నీలవర్ణుండే యైనం గావచ్చును. ఆకారపూజ్యుం డగు నీపలుకాకి కాకి నీకడ నునిచికొనుట యనుచితంబు. దీనిని నిపుణంబుగా బరికించి వేగ వెళ్ళవలయు. ఈతనిరాకకు మూలము చాలఁ గలిగియుండును. అదియుంకయు మీకడ నాకు వాదనేల? తుదమాట చెప్పెద వినుండు. ఈతని మనము చేపట్టి డోప్పరికించిన, నుపేక్షితం బయిన యామయముంటుపగిదిఁ బ్రాణంబుపయి వచ్చును. వేఱొకవిచారంబు మాని, నామాట చెవిఁదూర్చుఁడు. పరులఁజెఱుప వేడి, యకులు పలుపోకలం బోవుదురు: వారాత్మైకకార్యాయత్తులు; మాయా శీలురు. వారిమాటల కెల్లఁ జోటిచ్చినఁ, జేటు వాటిల్లును. ఈతండు వట్టి కలపనగంప. ఈతనిమాట లేమియు నిజము సేయకుఁడు. నిక్కముగా నీతండు సింహళద్వీపమునుండి వచ్చినవాఁడు గాఁడు. చిచ్చొడి గట్టుకొన్నట్టు లీతని నొద్దఁ బెట్టుకొననేల? స్వకార్యార్థము శాత్రవుం డెంతయు నిచ్చకం బచ్చుపడ ముచ్చట లాడి, మచ్చిక చేసికొని, నచ్చికపుట్టించి, కడకుం బ్రబలారించి ద్రోహించును. అట్టివానిపొత్తున

కిచ్ఛగించుట, దండధరుపొత్తు చిత్తంబునం గోరుట. అట్టిఁడు, గోముఖ వ్యాఘ్రంబులాగున, సమస్తవ్యవహారంబుల సాధువర్తనుండుంబోలెఁ జూపట్టును. అజ్ఞనసఖ్యము ముఖ్యముగా సజ్జనుం దుజ్జగింపంజను. కానినాఁడు చిరంజీవి యను కాకమ్మును నమ్మి నిహతమ్మైన ఘూకమ్మ్రులట్లు, కడలేని హానిఁ జెందును. దేవర కాకథ వివరించెద నవధరింపుఁడు."

పుండరీక గండకవేదండాది నిఖిలమృగకులశరణ్యం బగు దండ కారణ్యంబున, బహువిధఫలదళవిలసితం బగు వటవిటపి యొక్కటి గలదు. అయ్యది పరిసరతరునికరంబుల తోడి పెచ్చుపెరిగిన మచ్చ రంబున మిన్నుముట్టఁ బన్నిదంబు నటిచి, యోడిన తోడివ్రాఁకుల నాలోకించి కిలకిల నగుంగినిని శాఖలాకిసం బోలుచుఁ, బలుదెఱం గుల పులుంగుల కలకలంబులు సెలంగ, గరం బభిరామం బయియుండు. ఆభూజరాజంబున, లోకభీకరంబు లగుకాకిమూఁక లనేకంబులు దన్నుఁ గొలువ, సత్వనిర్జితసువర్ణుం డగు మేఘవర్ణాభిధానుండు బలిభు గ్వల్లభుండు కాఁపురం బుండును. వాయసావాసం బగు వటకుటంబు నకుఁ గొంతచెంత, నులూకమందిరం బగు సుందరవసుంధరాధరకంద రంబుదనరును. ఆగహ్వరంబున, దుర్దమరిపుమర్దనుండగు నుపమర్దనుం డను నులూకలోకాధ్యక్షుండొక్కరుండు, తనకొలంపుఁబులుంగు మొత్తం బులుపెక్కులు దన్ను సేవింప, నివసించి యుండును. ఆపతంగపుంగవుం డొక్కనాఁటి నిశీథంబున నమాత్యాదులతోడ మంతనంబు సలిపి, యప్పుడ సేనాని రప్పించి, యుత్సాహపోషణంబు లగు భాషణంబుల వీరావేశ మెసకొల్పి, మున నేర్పఱించి, యనేకంబు లగునసీకంబు లతో ఘూకఘూంకృతులు పొదలఁ గదలి, విరోధులు కాకులు వసి యించు మఱ్ఱిచెట్టుఁ జుట్టుముట్టి, నిద్రాముద్రితనేత్రంబులై గాత్రం

బులు మఱచి కూరికియున్న వాయసంబులఁ గాంచి, సంతసించి, మించిన కోపాతిరేకంబున ఘూకంబుల డీకొల్పుఁడు, నవియు శాఖోపశాఖలవెదకి, శాతముఖంబు లగునఖంబుల నడచియు మహోగ్రంబు లగుచండతుండాగ్రంబులఁ బొడిచియు నచంచలంబు లగుగరుడంచలంబులఁ జఱచియుఁ గొన్నింటి తెక్కలు మొక్కవఱచి, కొన్నింటిఁ బ్రక్కలు వ్రక్కలించి, కొన్నిటి ముక్కులు చెక్కలు వాపి వివిధంబు లగువధంబులఁ గుటికాలంబులోన, ననేక కాకలోకంబును యమలోకంబున కనిచిన, సమూవృతాంతరిక్షం బగునావటవృక్షంబు విగతధ్వాంక్షంబగుట వీక్షించి, కృతార్థీకృతలోచనుండై, యుపమర్దనుండు సంతోషపుళకాంకురాలంకృతసర్వావయవంబులతో, నిజపరిజనకోలాహలనినదబధిరీభూతకోదోంతరాళంబుగాఁ గ్రమ్మరి, పింగళేక్షణంబుల మెఱుంగులు తుఱఁగలింప నిజనివాసంబునకుం జనియె. అంతఁ బ్రభాతం బగుడు, రేయి వాయసారాతులరాయిడిం బడక యొక్కెడ నొడ లోముకొనిన మేఘవర్ణుండు లేచివచ్చి, రాత్రి కలాయాంతరనిద్రాణకరటకులంబునకు సంభవించిన యకాలప్రళయంబు చూచి, గుండెలు వగిలి కొంతవడి చింతాసాగరంబున మ్మునింగియుండి, కొంత నివ్వెఱ తొలఁగి, లోకాంతరగతు లయినతనతనయులం బేరుపేరువరుసలం దలంచి నిట్టూర్పు నిడిగించుచుఁ, గడుపుశోకమునఁ దలంబగుకొందలంబునం గుందుచుండ రాతిరి గూబలపాలు గాక చిక్కినప్రెగ్గడ లొక్కచక్కిం గూడుకొని, తమమందభాగ్యత్వంబులకుం దూర వగచుచు, రాజునుం బ్రాణంబులు తప్పించుకొంట విని యాతనిసరన కరుదెంచి, దీనంబు లగునాననంబులతోడ నడుగులంద్రెళ్ళి, కంటికినేలకు నేకధారగా రోదనంబుసేయుచు నిట్లనిరి. "దేవా! తెల్లవాఱిమరల నేలినవారి చరణంబులీతీరున సందర్శింపం

బడసికదా, మాయందఱ నయనంబులు భాగ్యంబులు చేసె. మా ప్రాక్తన
పుణ్యంబు ఫలించె; నేఁడుగా దైవము గలుగుట పరిజనంబులు వేవురు
గలిగియు, రాజులేని రాష్ట్రం బరాజకంబగు కతంబునఁ జిక్కులు పెక్కుం
డియుఁ దేజంబుం గాంచని సోమవిహీనయామిని కైవడిఁ, దమోవృతంబయి
కన్పట్టును. ప్రధానులు లేని యధినాథుండును బ్రాణంబులఁ బాసిన
బొందిచందంబునఁ, గాంతి దఱిగియుండును. దైవవశంబున స్వామియు
నేమును నీరే యొకబన్నమునకు లోనుగాక, సప్రాణులమై మగుడఁ
బుడమిపై నడుగిడఁ గలిగితిమి. పగవారిం గూడి దైవంబును మనకుఁ
గీడుఁ దలంచె. ఇది యవశ్యభావి యైనయర్థం బెట్లు తప్పింపనగును?
నిష్కారణముగా నీయట్టిసధర్మునకుఁ జేసినయపకారం బాక్రూరకర్మ
లకుఁ దోడనే చూపకపోదు. ఇప్పుడు మనప్రాణములు దక్కినవంతియ
చాలును. ఇఁకఁ బగ నెన్నటికైన, మెల్లఁగా సాధింపవచ్చును. కాలంబు
మన కీవేళ మేలు కాకున్నయది. కాలము మీఱి నడప నెవరి తర
మగును? ఆయుః ప్రమాణము నిండి, మనవారు పేరు గలవారు
పెక్కండ్రి ట్లనామధేయంబులగు దివాంధంబులచే నిద్రావశాత్ములై
మానప్రాణంబులు గోలుపోయిరి. దైవవైపరీత్యం బయినప్పుడు వగవఁ
బనిలేదు. మే మప్పుడ యలసి కన్నొకింత మూసితిమి. అంతలో నాక
స్మికముగ గణనాతీతము లగుపగఱబారు లరుదెంచి, కనుమూయుగా
వీరిగొంతుకలు కోసిపోయెను. మేమే మేలుకనియున్న, నొక్కఁడు
మీబంట్ల నిట్లువఱచి నామ మడఁగ కుండెనే? ఇప్పుడేమో మా దుర
దృష్టంబునఁ బరాభవంబు నొందితిమి కాని, దేవరకటాక్ష లవంబు
గలుగ, మున్నెన్నఁడు నిట్లయిన వారము గాము. దేవరయంత
వానికిం బరాభవము సంభవించెను. ఇది మాచేసికొన్న భాగ్యము
గాఁబోలు! పగతురు మనల మిగిలి నోగిలించుట కంతరంగంబున

నెగు లొందకుము. 'అత్యుచ్ఛ్రయః పతనహేతు' వని యార్యులు వచియింతురు గావున, బెరిగెడివాఁడే విఱిగెడివాఁడు. నేఁడు శత్రు నిరాసంబున 'ధన్యోఽస్మి' యనుకొని విఱ్ఱవీఁగు దాయ ఱేపేమి యూఁడ నున్నాఁడో, యెఱుఁగుదురు? సతతము గంటికి ఱెప్పవలెఁ గాచుచుఁ బ్రోచుచుండ దేవరబుద్ధి విని, స్వామియే కనువెలుఁగుగా వెంటఁ జరియించు తలంపున, మేముందఱము మీకడకుం జనుదెంచినారము. నీయట్టి ఘనుని కరుణారసవృష్టి కలిగినంగదా, మాహృదయ తాపము చల్లారును. ఇన్నినాళ్ళును నందఱౌనానన బ్రదికి, తుదకుఁ బౌరుషము చెడినప్పుడు శరీరధారణార్థం బొక్కనీచవృత్తికి లోనయి, రోఁతల కాలయము కానేల? ఈఁతకు మిక్కిలిలోఁతు లేదు. కానసాహసించి, యనపాయము శూరులమై, జనులు మనమీఁదఁ జాలమివెట్టఁ జోటు లేకుండ, నాయురవసానపర్యంతమును బోరి, యధ్రువంబులగు దేహం బులచే ధ్రువం బగుకీర్తి నార్జింతము. మనకాలము మంచి దయి నప్పుడు నిగిడి మగుడ నాచెడుగులఁ గడముట్టింతము. విమతుండు బలవంతుండు గావున, నింతే మనభాగ్య మనుకొని, యాతని నాశ్ర యించి బ్రదుకుదము. ఇప్పటికి విప్రకృష్టదేశం బరిగి, యణఁగి యుండి, పదంపడి పోలినట్లు చూచుకొందము. ప్రత్యర్థుల కసాధ్యం బగుదుర్గంబు నాశ్రయింతము. బల్లిదు నొక్కనిఁ జేరి, వైరి నిరాసం బనాయాసముగఁ గావింతము." అని తమకుఁ దోఁచినట్లనేకు లనేక వాక్యములు పలుకుచుండ, వారికలకలంబులు వారించి, చిరంజీవియను మంత్రి యిట్లనియె. "దేవా! దేవరయమాత్యు లెల్లఁ బెల్లుసమర్థులు; ఒక రొకర తమధీబలమున లోకము లెల్ల నఱచేతిలోనికిం దేఁజాలిన వారు; నీతిశాస్త్రమున వారిని మీఱినవా రెవరును లేరు. ఇంక స్వామి సామర్థ్యాతిశయంబో, నమక్షంబున వాక్రువ్వవలసినది కాదు. నంతా

పంబుపోయెను, మనమునకు సమాధానము లేక యుక్తసాహాయ్యంబు
నెఱుంగకుంట సహజ దేమోకాని, యింతమాత్ర ... మనకెట్టి
యాలోచించిన, దేవరకుం బోవనికార్యాంశంబులు లేవు. ఎట్టిబుద్ధి
శాలులును దేవరగారి సహస్రాంశంబును బోలంజాలరన్న? ఇది మా
కెల్లరకు ననుభవగోచరంబు. అది యట్లుండె, స్వామి యన్నను నొక
మానిసిగా నెంచి మిగుల మన్నింపుచుండగా, మిన్నకుండంబట్టక చిత్త
చాపల్యంబున నాకుం దోచినయర్థంబు నేను విన్నవింపం గోరెద
ను. భవదీయ మతి సతి విశదంబుగా నొకరించి, ...
దురంబున నగారి నయిన మఱనిశాచర వారంబునెల్లం జంపుకొని,
కోఱలు వెఱికిన భుజంగంబులభంగి భంగపడి యున్నవారము ఇత్తఱి
మన మొత్తువడి యుంటంజేసి, యహితుం బొడిచి యోడం గొడుట
చాలదు. సమయ మొదవగూడుదాక లాతిమీదం గన్పడి నిశ్చం
చలముగ నుండి, తఱివేచి, బకముపోలిక నరి నొక్కట గ్రుక్కం
గొందము. నాబుద్ధి కిప్పటికి సమాశ్రయం బొక్కటియే యుత్తమ
కార్యముగాం గనుపట్టుచున్నది. పగవాడు మిగులం బొగరు గలిసి
యున్నవాడు కాన, దీనదశనొంది డిందుపడియున్న మన కాతని
పొందెట్లు సంఘటిల్లు నని చింతిలవలదు. తాన నాజ్ఞాబలమునను,
వీరికెల్ల నాదెసం గల యనుకంపవలనను, దైవానుకూల్యమును గూడ
నొరంత కలిగెనే నెంతదుష్కరకార్యము నైన వ్రేల్మిడి సఫలంబు
గావించుకొనివచ్చెద. నన్నుం బనిగొనుండు. ఓపితిరేని, మీరెల్ల నా
కొక్కసాయము చేయుండు. ఈక్షణంబ మీరందఱు నెందయినం జని,
యల్లనల్లంగొనివచ్చి, నామేను రక్తసిక్తంబు గావించి, తడయక
ఋష్యశృంగంబునకు వెడలి, యచ్చోట నప్రమత్తులరయి యుండుడు.
తక్కిన కార్యభారం బంతయు నాపయిం బెట్టి, మీరు నిర్విచారంబుగ

సుఖియింపుఁడు. ఎల్లవిధంబుల శోభం బాపాదించెద." అని మృదుమధుర భాషణంబుల స్వాభిలాషంబు తెఱంగెఱింగించిన, మొగంబులం జెలి వొంది, వాయసంబు లప్పుడ కడలకు వెడలి, సందుల గొందుల నెమకి, మూషిక ప్రముఖక్షుద్రజంతుసంతానముల దారుణత్రోటీ విదారణముల మారణము గావించి, వలయునంత క్రొత్తనెత్తురు గొంచు వచ్చి, యచ్చిరంజీవిశరీరంబునం బూసి, నీవు సిద్ధసంకల్పుండవు. నీ కసాధ్యం బెందును లేదు పొమ్మని సాగనంపి, యాచోటు వాసి చనియె. అంత నాచిరంజీవియు 'డాఁగఁబోయినఁ దలారియి ల్లగు నాకో' యని ప్రాణంబులు పిడికిటం బట్టుకొని, మెల్లఁగా నడచి ప్రొద్దు గ్రుంకునంతకు దివాభీతంబు లుండుకొండగుహఁ జేరి, వైరికి వినంబడున ట్లీరెలుంగు గద్గదకం దగుల, గుహాముఖంబునఁ గూసె. ఆకూఁత చెవి సోకుఁడు నదిరిపడి, కోటఁ డొక్కఁ డాచక్కికిం బఱతెంచి, కాకిం బట్టి కొనిపోయి, యుపమర్దనుముందఱఁ బెట్టిన, నాతండును విస్మయవికచ విలోచనంబులం జూచుచు 'నీ వెవ్వనివాఁడ వేల యిట్లయితి' వని యడి గినఁ జిరంజీవియు దైన్యం బాననంబున నటించుచు, మాయ యుచ్చు పడ, డగ్గుత్తిక వెట్టి యిట్లనియె. "చెప్పనోరాడ దేమని చెప్పుదు నావార్త? నేను మేఘవర్ణుని ప్రధానమంత్రిని; చిరంజీవి యనువాఁ డను. నేఁటి వేఁబోక, మేఘవర్ణుండు నిజప్రధానులం బిలిచి కార్యాలో చనం బడిగిన, నేనాతని దుర్నయం బెఱింగియుఁ దోఁచినహితంబు చెప్పి చూతముగాక యని, యిట్లంటిని. "ఉపమర్దనుఁడు లావు గల వాఁడు గావున భక్త్యేకసాధ్యుండు: ఆతని పాదంబులు వట్టి మనుట లగ్గు. నీవు రాజ ననుమదభిమానంబు మాని, యవశ్యంబుగఁ దద్దర్శ నంబు చేసి, నామాట విని యక్కరుణాకరుశరణంబు సొరుము." అను నప్పు డేమిచెప్పు! నావలుకు లాపాలసునికోపానలంబున కాజ్యధారా

ప్రవాహోపమంబు లైన, భగ్గున మండిపడి, యుక్తివిక్షేపబున ననాదరంబు సూపుచు, మంత్రుల నాలోకించి 'వీఁడు విపక్షపక్షపాతియై యొప లెఱుంగక యున్మత్తప్రలాపంబులు సేయుచున్న వాఁడు: దయఁ జూడక వీనిం బొరివి విధియింపుఁడు.' అనిన, వారును గుక్కలట్ల నాపయిం గవిసి, యుక్కుఁబంబొడిచి, కాళ్ళంగ్రుమ్మి, నెత్తురుబందొప్పఁదోఁగి సొమ్మవోయి యున్న నన్ను మృతుంగా వగచి, దిగవిడిచి తమయిచ్చం బోయిరి. పుడమిపై నిట్టిరాజోత్తము లుండఁ బట్టియేకదా, 'రాజ్యాంతే నరకం ధ్రువ' మనుపండితోక్తి యెల్లెడలను బెల్లుగ విలసిల్లెడును. నేనును గొండొక పడికిం దెలిసి, నలువలంకులుఁ గలయ విలోకించి యెందు నెవ్వరిం బొడగానక, చెదరినమదితుదకుం బదిలించుకొని, విసృష్టస్వజనబంధుజనుండ నగుటం జేసి, యీ యవస్థ సర్వంబును దేవరకుం గానిపించి మాఱి ప్రాణంబులు విడుతు ననుతలంపు వాఁడమ, గళద్రక్తసిక్తాంగంబులతో నిట్లరుగు దెంచితిని. ఇంక నాకు దేవరయే యెడుగడ. శ్రద్ధాధానునకు విద్యాదానంబును, క్షుధార్తున కన్నదానంబును, వ్యాధిమధితున కౌషధ దానంబును, భీతున కభయదానంబును, దానంబుల నుత్తమదానంబు లని యార్యులందురు. రాజుల కార్తరక్షణంబును బోలుధర్మంబు నొండు లేవు. 'దుర్బలస్య బలం రాజా' యన వినవే! దేహ మాకల్పము స్థిరము గాదు: అట్టి యస్థిరం బగుకాయంబుకొఱకుఁ, బరకృతావమాన నిపీడ్యమానమానసుండనై యుదాసీనం బుజ్జగించి, యెట్లు సరివారిలో మరలఁ దల యెత్తుకొని మెలంగ నేర్తును? ఎవరిని రక్షింపఁగోరి నే నీబ్రతుకు బ్రతుక వాంఛింతును? నేను సర్వసంగవిముక్తుండ నయి యున్న వాఁడను. స్వమాత్రపోషకుండ నగు నాకీక నీమేనితోడిపొత్తు వలదు. ఇంతవఱకును మేఘవర్ణుని కొఱగాని స్వామికి నివేదింపఁ

ప్రాణంబులు పట్టుకొని యున్నవాఁడను. నాకిం బాటిల్లిన యవస్థ యంతయు దేవర కెఱింగింపఁ గలుగుటంబట్టి, చరితార్థుండ నైతిని. ఇంక నెట్లయినను సరియే. నే నిఁక బ్రాణమాత్రావశిష్టుండనై, పగ నీఁగుశక్తి లేక, కాలంబున కెదురుచూచుచు, జీవచ్ఛవంబనయి యున్నవాఁడను. ఆపాపకర్ములవ్వారు నాప్రాణంబులు గొనక కొంత కొఱంత వెట్టి పోయిరి. మీరైనఁ దక్కిన కొఱంతఁ దీర్చి, పుణ్యంబు గట్టుకొనుఁడు—సుకృతి నయ్యెదను. తొల్లి నే నెప్పుడును భవత్సందర్శనంబు దొరకునొకో యనియే కోరుచుందును. ఎంత వారలైనను, దైవానుకూల్యంబు లేనికార్యంబులు సిద్ధింపఁబోవుగదా? నేఁటి కది యీవిధంబున నైన సిద్ధించినది, మహాభాగ్యవంతులకుఁ గొందఱకుఁ గాక, మీవంటి వారిసేవ యందఱకుం దొరకొనునె? మునుపు నే ననవరతము దేవర చరిత్రమే యాతని యోలగంబున వేనోళ్ళ సంస్తవ మొనరించుచుందును. అందుల కాతండు కటకటంపడి, మిమ్ముఁ గడవనాడుచుందును. ఆకథలు త్రవ్వినకొలఁదిని, పెక్కు లూరుచుండును — పోయినవి పోనిండు. నే నాతనికి నేఁటివఱకుం జేసినమే లంతయు నొక్కపూఁటలో వఱదఁ గలసిపోయెను. అందు దేవరకుం గోటితమాంశం బైన నాచరించిన, నింతకు నామనోరథంబు నిండదే? అని కర్ణకలాపంబులుగాఁ గరటంబాడు దయనీయాలాపంబుల మెత్తనైన రాజుచిత్తంబు నారసి, మంత్రు లిట్లనిరి 'సామీ! యేమో పలుకుచున్నాఁ డని యనాదరంబు సేయక, మామనవి చేకొనుఁడు. ముందఱఁ గీడెంచి మేలెంచవలెను. వైరంబు లామరణాంతంబులు గాని, యింతటఁ బంతటం దెగునవి కావు. ఈతనిచరితంబు ప్రత్యక్ష పరిచితం బయినది ప్రావడిపోయెనే? రాజు తనవంక వారినే నమ్మా నమ్మక యుండవలెనన, లాఁతివారిఁ జెప్ప నేల? ఈతండు తృణ

చ్చున్న సూనంబు వంటి వాఁడు; వీనిని విశ్వసింపఁ గూడదు. ఎంతయు మతిఁ జెప్పి విశ్వసింపవలదని సూచి. వీనిం జేర్చుటఫలం బనర్థంబునకు, వంశ ఫలంబునకెల్ల సమూలవినాశంబు సేయుటకే యగుదు. సందియంబు లేదు; వీఁడు మనలం జెఱుపవేఁడి, వైరులకుఁ బాపి గాఁడయి వచ్చి, యెంతయు లేనిపోని యుపాయములు పచరించుచున్న వాఁడు వీని న్నన కడ నునుచుకొనుట, దూడెం జిచ్చు దాఁచినయట్లయ్యెడు కొండంత దూదికిం గొఱవితే నిప్పేల? మనల నేలపాలు సేయుటకు వీఁడొక్కఁడ చాలును. విపత్కుంబు క్షుద్రుం డయ్యును గాలక్రమంబునం బెరిఁగి, వృక్షమూలమునందలి వామలూరువు వృక్షంబుం బోలెఁ, జెఱుప సమర్థుం డగును." అని మంత్రు లెంద ఱెత్తెఱంగున నాతనిపొత్తు హత్తించుకొనుట విపత్తునకే మూలం బని యొత్తిచెప్పినను, వానిం దనచిత్తంబున హత్తింపక, వధి మూఁడి, యుపమర్ధనుండు తసపట్టిన చలంబు విడువక, శరణాగతపరిత్రాణంబున కెనయనుత్కృష్ట ధర్మంబు లే దుడుగుం డని వారల వారించి, యాబలిభుజరక్షణ కరణంబునం గృతనిశ్చయుం డయి, వారల కిట్లనియె. "జాతిమాత్రంబు చేతనె యాతని లాతిఁగాఁ దలంపవలదు. ఈతండు సాధుజనాగ్రగణ్యుఁడు; కలనైనం బరుల కాపదఁదలఁచువాఁడుగాఁడు; సత్యంబు కానివాక్యం బీతనిరసనతుదకు రాదు; జగంబున నీతనికిసమానుండు మానధనుండు లేఁడు. ఈతని వాక్యంబులే యీతనిగుణమ్ముల నెఱింగించుచున్నవి. మన పుణ్యపరిపాకంబున నీచిరంజీవితోడి పరమసౌహార్దలాభంబు దొరకినది. మన కీతండు కడువిశ్వసనీయుండు; ఇందు నందు ననక మనమందిరంబున నెందైన నడ్డంకిలేక తిరుగఁదగినవాఁడు. నేఁడు మొదలు పూర్వవైరంబు విచారింపక, మీరెల్లరు నీతని నతిమాత్ర గౌరవంబునం జూచుచుండునది." అని యానతిచ్చి, తనకభయప్రదా

నం బొసంగి ప్రశంసించు చున్నరాజున కభిముఖుం డయి, భయ భక్తులు మెఱయఁ జిరంజీవి యిట్లనియె. "సాధు! సాధు! పరదోషకథా విముఖుల రగు దేవర గుణంబులు గొనియాడ నే నెంతవాఁడ? భవ త్సందర్శనమాత్రంబున, మామకవిలోచనంబులు భాగ్యంబులు వహించె; భవదీయవచనామృతాస్వాదనంబున, శ్రుతిద్వయంబును దృప్తివహించినది. స్వామిసందర్శనంబు దొరకొనని వానిజన్మ మేల? సర్వజగజ్జైత్రులరు మిత్రులగుటంబట్టి, నాజన్మంబు కృతార్థత్వంబు నొందె. మీ కారుణ్యంబు గలిగినం, దృణమయిన మేరు వగును. పగ వారినైన నొచ్చిననోరం బలుకనొల్లవు. అది దేవరబోఁటిగుణగ్రహ ణైకపారీణు లగుధరాభాంధారేయులకుఁ గొందఱకుం జెల్లెఁగాక యుందఱకుం జెల్లునె? స్వామివంటిదయాళువు కొందఱు గలుగంబట్టి కదా, యీస్థిర తిరంబై నెగడుచున్నది. అక్కడక్కడ రాజ్యపరిపాల నంబు సేయువారు లెక్కకుఁ బెక్కురుగలరు; దేవరం జూచి, మఱి వారిం దలపెట్ట సిగ్గు వొడముచున్నది. మత్స్వరూపస్వభావంబులు దెలియక, వీరందఱు నాపై నింద గడించెదరు. హితాహితనిర్ణయంబు సేయ మహాప్రబుద్ధులకుఁ గాక, సామాన్యముగ నందఱకుం బయి పయి నున్నదియే? నావల్ల కల్ల గోరంత కలిగెనే, నిప్పుడకా దెప్పు డయిన నేలిక చిత్తంబునకు వచ్చినట్లు చేయవచ్చును. నిఖలహేయ భాజనం బయి క్షణభంగురం బయినయీకాయంబుఁ గల్పస్థాయిఁగా నమ్మి, యెట్టి కష్టాత్ముండయిన విశ్వాసఘాతుకత్వంబున నొడిగట్టు కొనునే? దైవంబు దయమాలి నలువురిలో నన్నిట్లు తల వంచుకొనం జేసెఁగావున, నీరీతి నిన్నికఱకుమాటలకు వీను లొప్పగింపవలసి వచ్చెను. ఆబాల్యము నేఁ గాంచినగౌరవంబంతయు, నిప్పుడు స్వప్న లబ్ధపదార్థంబుచందం బయ్యె. పన్నివ్వ రెట్లనుకొన్నను, దేవర

యాజ్ఞ కడుగుదాఁట నోఁడుగ[illegible]ాన, నేలికపాలఁ దల దాఁచుకొని యిచ్చట భవద్గర్భవాసగుప్తిం [illegible]ములు ప[illegible]చ్చెదను." అని యిచ్చకంబు లాడుచు, నిమిషంబును జేని నెడబాయక, యాతనిచూపు లేచాయ నిగుడునో యని సర్వ మేషంబుగ సమ్ముఖమ్మున గొలిచి యుండుచు, దినదినంబును వింతవింతగా నవనవోచితంబు లగువినోదంబుల బ్రమోదంబు రెట్టించి, యంతకంతకు మొదలింటికంటె శతగుణంబుగా రిత్తయుపచారంబుల నుపమర్దను మనమున కెక్కు-నడవడిం బ్రవర్తించుచుఁ, గరమ్ము నమ్మకము పుట్టించి, యెల్లెడల నడ్డు లేక క్రుమ్మరుచుఁ, జిరపరిచయంబునఁ జిరంజీవి తత్తద్రహస్యవర్తనమ్ములును దుర్గబలాబలమ్ములును నిమ్ముగా నెఱింగి, తఱి యారసి, యొక్కనాఁటి పగటిపూఁట బహుస్వనమ్ము లాద మఱచి సుఖసుప్తంబు లయి యుండ గుహావాకిలి వెడలి వచ్చి, యచ్చేరువ మొదవుపదువులు గలతావుల కరిగి, యొరువు గొంత చరణంబుల నిఱికియుఁ గొంత ముక్కునం గఱచికొనియుఁ గొనివచ్చి, గుహాముఖంబునం దాపి, రెండవకంటివాఁ డెఱుఁగకుండ మేఘవర్ణుపాలికిం బోయి నమస్కరించి యిట్లనియె. "దేవా! మనము సేయునధ్యవసాయంబంతయు నేఁడు ఫలితంబునకు వచ్చినది. అంతకంతకుం బొసఁగు దేవర మన్ననఋణంబు నేఁటికిం దీర్పఁ గంటిని. స్వామిమనోరథపూరణంబాపాదింపఁ బడసి, నాయొడలెత్తిన ఫలంబుఁ గాంచఁ గలిగితిని. మీఱందఱు నేకనిశ్చయు లయి, నాకుఁ జేదోడై నడవవలయును. నేనాయుపమర్దనునిచెలిమి కలిగించుకొంటకై పడరానిపాట్లెల్లం బడితి. కట్టా! దాయలపంచం బడి యేఁ బడినయిడుమ లిన్నియన్నియని యెన్నఁదీఱునె? ఉపమర్దనుండు తనపాపంబు పండి, సులభంబుగ నావలం దగులువడి, నా కన్నపానాదు లిడి పరామర్శింపఁ దనవారి

నియమించె. నా కెల్లం దొలుత నాతోడ కనుపడినప్పు డెల్ల నన్ను
గుటుకు మనకుండ మ్రింగవలయు నని యుండెను. అప్పుడు వారిచెప్పిన
వోఁతలకు లోఁబడి, నా రెండ మని యిచ్చినదే భుజించుచు, నోరు
కట్టుకొని శరీరశోషణంబునకయిన నోర్చి, యసంభవం బయినవాఁడు
జలప్రాశనంబె చేయుచు రాజుతోడనైనఁ జెప్పక కాలంబు ప్రతీక్షించు
చుండి, కడకు వారియనుగ్రహంబునకు సహింపను పాత్రుఁడ నయితిని.
ఎందును గార్యంబు సఫల మయిన, నేపూర్వప్రయాసంబును నేల
గణనకు వచ్చు? కాలుచేతిత్రొక్కులంబడి, యిప్పు డుపనుగ్గనుంచు
రాజ్యానుసంధానం జేసుటి, నాతోడిదలోకం బని యున్నవాఁడు.
నాపొందు వలదని, యమాత్యు లెందఱో నోరఁ గాయ లిడక
బోధించిరి. వారి హితవచనంబు లన్నియు, రోగికిఁ బథ్యాహారంబు
లట్లు, యాతనికి రుచింప వయ్యెను. వేయేల? కడమాట నుడివెద;
వినుండు. వారి సంతోషకాలము నేఁడు ముఁగిసివచ్చినది. ఇప్పుడు
మీతోడ నూరక మాటలాడుచుం గూరుచుండుటకు నాకు లేశమును
నవకాశము లేదు. వారినందఱఁ గనుఁబ్రామి, నే నిటు చనుదెంచితి.
నాతినీళ్లు వెల్లువపోవు. తక్కిన నాయక్కడిగాథ లన్నియు సవిస్తర
ముగా ముందు విన్నవించెద. ప్రస్తుతకరణీయంబువినుండి. గుహ
లోపల నులూకంబు లీలోకంబు మఱచి, నిద్రావివశంబులై యుండ
నాకుం గనుమొగుడక లేచి వచ్చి, యచ్చ్యోటిపట్టుల నుండుతొఱ్ఱి
పట్టుల కేగి వసులపెంటఁ బట్టుకొని వచ్చి, గవినాతం బెట్టి, మిమ్ముం
బిలుచుకొనిపో నచ్చితిని. అందగ్నిరగిల్చి కాల్చి, నిద్దురపోవు కాశి
కంబులఁ జిద్దనిద్దుర పుచ్చ వలయు. ఇప్పుడె మననా రందఱుం
గదలి, గవ్వలుకొఱకచ్చులు చంచువులం గరచికొని, నాపిఱుంద నగు
దేరవలయు." అని కఱపి, తా నొక్క మందుకాష్ఠంబు ముక్కునం

జిక్కఁబట్టి, పురోయాయి యయి త్రోవవెట్టినఁ, జెఱిప్పిలును నట్టు
లాతనివెంట నింట ననుగమించె. అంత నాశకుంతంబు లనంతాధ
రంబుం దఱిసి, దరివాతం దార్చినయొకుప్పనకుం గొఱవులు దరికొల్పి
యొఱకల విసరుచు, సర్పిష్మంతుండు కరటవిసరపక్షపవమానజాజ్వల్య
మానకీలాజాలంబుల నాభీలంబుగఁ గవియించి, ధూమస్తోమంబు లెస
కొల్ప గుహయెల్లఁ దామసమై పేర్చినయచ్చులవేఁడి కోడి, లేచి పేచ
కంబులు నిదురమంపున నఱచుచు వెఱచఱచి పఱచి, యెట్లును
గుహవెడలువెరవు దొరకక, రాజుకడం జేరి, ప్రభు వని చూడక
యిట్లనియె "దేవా! వైరి యగునీచిరంజీవిం జేరఁ దీయవలదు;
కీడుమూఁడు" నని మే మెల్లఁ బలుదెఱంగులఁ జెవి నిల్లుకట్టుకొని పోరిన
మామాటలు పాటిగాఁ గొనక, పెడచెవులం బెట్టి, నీమదిఁ బట్టుకొన్న
యున్మాదంబు మానవైతివి. అనన్యాధిష్ఠితం బగు పదమున నిష్కం
టకముగా నుండి, యనపహార్యం బగు నైశ్వర్యంబుఁ గుడువ నేరక,
నిర్హేతుకముగఁ గూలఁ దన్నుకొంటివి. మఱియుఁ గానక కన్నసంతా
నంబును, నెందునుం బడయరానిబంధుజనంబును, ప్రాణసమానం
బగుమిత్రవర్గంబును, నూరక త్రుంగుకొంటివి. మాపలుకు వినక,
విరోధికిఁ దా విచ్చినఫలము చేసేత ననుభూతం బయ్యె. ఇప్పు డయిన,
నహంకారవంక మింకెఁగా?" అని యుపమర్దనం దూఱుచు, మూల.
మూలలు దూఱుచు, మంట లోఁడ ళ్ళంటినఁ గమరి, ఘుర్ఘికంబు
లెల్ల నిలువున విగతాసువు లయి, కాళ్ళు కుప్పవడ నేలఁగూలి, వేఁడి
వేలుపుచే భక్షింపఁబడియె. ఇట్లహితులెల్ల నిహతు లయి, నిమేష
మాత్రంబున గుహాయతయు నేనుఁగు తిన్న వెలఁగపంటివలె నైన
వళిరి, హృదయంబుల ముదంబు వదనంబుల వెల్లివిరియఁ, గరటంబు
లెల్లఁ గూడఁబడి, చిరంజీవిని జుట్టుకొని యిట్లనియె. 'ఓయీ! చిరం

జీవీ! నీవు కలుగఁబట్టి కదా, యిబ్బారిం గడవఁగాంచితిమి. అక్కడ నుండి నీవు క్రమ్మఱ వచ్చి మాకంటఁ బడుపర్యంతము, మమ్ము మే మెఱుంగము. మాయందఱిప్రాణంబులును నీవ; నీవులేకిక్కడ మా కొక్కనిమిషమయిన వేగునె? నీ మేధావిశేషంబునంగదా, నిశాదగ్ని యొక్కఁడయినఁ గడనుపడకుండఁ గడతేఱె. ఇపుడు మామనంబులం గలవెఁగు లాఱె. అనన్యాదృశసుకృతంబున మాకు నీవంటి చెలిమి కాఁడు దొరకె. ఇఁక మాకేమికొఱఁత?” అని శ్రవణానందంబుగాఁ జిరంజీవిం బ్రస్తుతించి, యాతనిచేఁ బ్రతినందింపఁబడి, కొంతసేపు వాయసంబు లెల్ల సల్లాపసౌఖ్య మనుభవించుచుండె. అనంతరము వాయసేంద్రుఁడును బరమానందభరితుఁడయి వైరిపీడెల్లఁ జూఱాడి, కాకకాకారవముఖరిత హరిదంతరంబుగా నిజనివాసంబునకుం జని, సుఖం బుండె.—

కాఁబట్టి గిట్టనివాని నొద్దఁ బెట్టుకొంట బెట్టిదంపుంజేటుఁబుట్టిం చును. దేవరయేకన్నులం జూచెదరో కాని, నాకీకాకమ్మును నమ్ముట సర్వవిధమ్ముల ననర్థదాయకమ్ముగాఁ గన్పట్టుచున్నది. దేవర యీతని తేనెమాటలకు మోసపోయి, యీతని తోడ్పాటున కువ్విళ్ళూరు చున్నట్టు తోఁచుచున్నది. సత్యమారయ, నితఁడు చక్కెరపూఁత పూసిన విషముగాని వేఱుగాదు; శీతలప్రవాహంబు కూలసాలనిర్మూల నానుకూలంబగుట దేవరచిత్తంబున భావింపవలయును. ఏవిధమునఁ జూచిన, నీనీలవర్ణుండు గర్హణీయుండయగుంగాని సంభావనీయుండుగాఁ గానిపింపఁడు. ఈయన సేయుసాయంబుపేరు దైవం బెఱుంగు; అపా యంబు సేయకున్నం జాలును. విన నేర్చితి రేని, నాకుఁ దోఁచినహితం బొక్కటి చెప్పెదఁ జిత్తంబున జేర్పుఁడు. ఆవల విననీ వినకపోనీ హితంబుగోరి యాఁడుమాట కీశ్వరుం డయిన మెచ్చుఁగదా? క్రూర

కర్మం బనిచూడక వీని నీయెడ నమ్ముట యెట్టులు; వీనిం దెగిన మన
మనఃపీడ యుండకయుండ దెట్లు. అని పలుకు మంత్రిప్రాంశులతోఁ జెలు
నవ్వు నవ్వి రా జిట్లనియె "నీ వాడినదంతయు సత్యము. అయినను
గ్రొత్తగా వచ్చినంతమాత్రముననె విశ్వాసపాత్రుండు గాఁడని నిశ్చ
యించుట తగదు. ఈతఁ డింతవఱకును మనకుఁ గించిద్ద్రోహంబైనఁ
జేయఁడు. ఒక్కని గుణంబు లెట్టివని గుణవ్యాపారంబుల నెఱుంగ
వలయుంగాని, జాతిమాత్రంబునసె నిర్ణయింపరాదు. ఒకానొకవేళ
నాగంతుకులును హితు లగుదురు; సన్నిహితులే యహితు లగుదురు.
శరీరజం బగురుజ యహితమగుటయుఁ గాటఁ గలిగి యౌషధంబు
హితమగుటయుఁ జూపింపవలదే? కొందఱు తొలుత హితులయట్ల
కనఁబడి, కడపట నహితు లగుదురు. మఱికొందఱు మొదల నహితుల
మాడ్కిఁ గాన్పట్టియుఁ, గార్యావసరంబున హితు లగుదురు. ఈతఁడు మన
కొక్కకీడు చేయువాఁడుగా నాబుద్ధికిం బొడకట్టఁడు. మనకపకారంబె
తలంచినవాఁడేని, నాఁడట్లు కొలువులోఁ బలుకంబలుకు నూర్పుఁ దలఁపడు
నెట్లు? మనదెసం గలవాత్సల్యంబె కారణంబుగా మన కుపకారంబు చేయ
వచ్చినవాఁడుగాని, వేఱొక్కపాపం బెఱిఁగినవాఁడు గాఁడు; పరమ
ధార్మికుఁడు; సత్యసంధుఁడు. పరీక్షాపూర్వకంబుగాఁ గొన్నాళ్ళీతని
మనకడ నునిచికొని, యీలోపల నెద్దియైన నీతనియెడ నీమెన్నిన
యవగుణం బించుక గాననైన, నేమి చేసినను లోకంబు మెచ్చుం
గాని, వేగిరపడి ధర్మంబు కట్టిపెట్టి యకారణంబుగ నితని నొకకీడు
నకు లోఁబఱిచితిమేని, లోకులు మనల నీ యనరే? మఱియు మనకుఁ
బ్రత్యుత విపక్షువాఁ డని కదా, యీపక్షిని నమ్మఁగూడ దనుట.
కార్యార్థియగువాఁ డొక్కొకతఱి శత్రువునైనం గలపికొని మెలంగ
వలయును. ఆవల లావరియగు దాయ మనమీఁద దాడి వెడలి యున్న

వాఁడు. మన మిప్పు డీతనిం బోనాడునవసరంబు గాదు. మన ప్రయోజనంబు తీఱుదనుక మన మీతని నేస్తంబున గొడంబడవల యును. వినుతులకు హితులైనవారిం గని మతిమంతుండు వికసన్ముఖుండై, పల్కునవనీతకోమలంబును హృదయం బాయసనిష్ఠురంబునునై, మాట లాడవలయును. 'చెలిమి నైనఁ జేఁదు మేపింపవచ్చుంగాని, బలిమిమొయిం బాలు ద్రావింపరాదు.' అనులోకోక్తి వినలేదా? విపక్షునియెడఁ గార్యంబుపొంటె మిత్రభావంబు నెఱపియు, మనమ్మున నమ్మక, యప్రమత్తుండయి యుంట బుద్ధిమంతులలక్షణం బని మేధావులగు వినికి గలవారు చెప్పుదురు. మనకెలసంబు తీఱునందాఁక నీనీలవర్ణుని విశ్వసించినట్లు నటించి, లోన నమ్మక యుందము. కంటకంబునఁ గంటకోన్మూలనంబు చేసి యామింటిఁ గూడఁ బరిహరించులాగున, నీతనిద్రావున నావిరోధిని మర్దించి మన కార్యంబు గడపికొని, పిమ్మట నీతని విడనాడుదము. పూర్వ మొకమూషికంబు తనకర్జంబుకొరకుఁ గేవలము విపక్షపక్షమువానితోడ మార్జాలనాథుని తోడఁ జెలిమి కలిగించుకొని, కార్యాంతంబున విసర్జించెను. నీకాకథ వినిపించెద, వినుము.

పంచవటంబుప్రాంతంబున, నొక్క మఱ్ఱివృక్షము తొఱ్ఱలో రోమశుం డనుబిడాలము వాసము చేయుచుండును. ఆచెట్టుక్రిందిలాఁగ లోఁగిలిగాఁ జేసికొని, పలితుం డను నెలు కొక్కఁడు వసించుచుండును. ఒక్కనాఁటిరాతిరి కిరాతుం డొక్కఁ డక్కడ కరుదెంచి, యాచెట్టు చుట్టు నుఱులొడ్డి పోయెను. ఆయొడ్డు తెఱుంగమింబట్టి, వేగుజామునఁ గనుచీఁకటి యుండ, మార్జాలం బాహారంబునకుఁ జనబోయి యా యుఱిం దగులుకొనియె. అదికాంచి సంతోషించి, మూషికంబు తోడును నా సెఁ గదా యని నిర్ధరంబుగఁ గలుఁగు వెడలివచ్చి, యచ్చో

రువం జెఱలాడుచుండఁ, జంద్రకుం డనుకౌశికంబొక్కటి యాచక్కటి
కే తెంచి నిలిచెను. దానిపొడ వవలోకించి, కాళ్ళు గుదివడ, నొడలు
వడవడవడంక, నల్లంబు జల్లనఁ, బుల్లవడి యొల్లంబోయి, యల్లనఁ
గొంతవడికిం దెలివి తెచ్చుకొని, బిలేశయంబు తనలోఁ దా నిట్లనియె.
'హా! ఏమి సేయుదును? ఈదేహ మిన్నినాళ్ళును బెంచి, కడ
కీక్రించుగూబపొట్టఁ బెట్టవలసి వచ్చెను! దైవమా! నీకంటికిం జేఁ
గింజయుఁ బెద్ద దయ్యెనె? ప్రాణంబులు గొనందలంచి, నాపాలివిధి
నన్నిటకుం దెచ్చెఁగాఁబోలు! తప్పింప నెవ్వనికి శక్యమగును?
అడవిలోపల ఫలమూలమాత్రంబున దేహయాత్ర నడపుచు, నొరుల
కెన్నఁడు సెరగు తలఁచి యెఱుఁగని నాకును, ముదిసినముప్పకాలంబున
నపాత్రపుఁజావు చావ విధి లిఖియించెనె! ఆహాలదైవముచేఁతలకు
మేరగలదే! నిమిషంబుక్రింద నీపిల్లిపీడ నేఁటితో విరుగడయాఁగదా
యని, హాయిగా నుండఁ జింతింప, నింతలో నా కీయకాలమృత్యు
వెక్కడనుండి యాసన్న మాయెను? దీని కేమిసేయుదు? ఎందుఁ
జొత్తు? అని విలపించి, గుండియ లవిసి బెండువడి, మగుడ ధైర్యం
బవలంబించి, యిట్లు చింతించెను. 'బుద్ధిమంతుఁ డగువాఁ డప్పు డుప్ప
తిల్లిన ముప్పు తప్పించుకొనఁదగిన వెర వరయవలయుంగాని, యధీర
త్వంబున నోరు దెఱచి, యుప్పరంబు విలోకించుచుఁ గలఁత నొంద
రాదు. ఇప్పుడు నాకీమార్జాలనాయకుం డొక్కఁడేయాశ్రమణీయుం
డయి కనుపట్టుచున్నవాఁడు. ఏదో యొకమాయోపాయంబు పన్ని,
యాతనియనుగ్రహంబు నకుఁ బాత్రుండ నయ్యెద. అని కొంతసే పూరక
కుండి, యించుక కార్యం బూహించి, నఖరాయుధంబున కభిముఖం
బయి నడచుచు మూషకం బిట్లనియె. ఓబిడాలకులోత్తమా! నీకిదె
నమస్కారము. తడవులనుండి మన మిద్దరము నీవృక్షము నాశ్ర

యించి యేకోదరులవలె నున్నవారము. అట్టిమనలో మనకు భేద భావంబు వహించి యుండుట కార్యంబు గాదు. నాకు నీవుగాని, నీకు నేనుగాని, యేకాలమును నొకయుపకారంబుఁ దలంచి యెఱుఁగము. నీకు నాకు నితరేతర ద్వేష హేతువు వే తేదియును లేదు మనము కల కాలము బ్రతుకఁబోము. ఉన్నట్లుండ నెప్పుడో కాలుఁడు నోర వ్రేసి కొని పోవును. ఈగున్న రెన్నాళ్ళయిన, మన మన్యోన్య మిత్రభావం బునఁ బొదలుచు, నొకరికార్యంబుల కొక రవుట యుచితంబు. నీ వీయురిం దగులుకోలు నాలోచనగోచరం బయినంతనుండియు, సహ వాసదోషంబేమి చెప్పుదును? నిప్పులం బొరలించినట్లు నా యుల్లం బెరియుచున్నది. ఇచ్చకంబు గాదు. ఈమనశ్శుద్ధి యీశ్వరుం డెఱుఁ గును. వేయేల? నిన్నీమృత్యుపాశంబువలనం దలఁగువరకును, నాహృదయంబు కుదుటఁ బడియుండదు. అయినను, బుణ్యమునకుఁ బోవఁ బాప మెదు రయ్యె' నన్నట్లు, నీబ్రతుకునకై కడంగ నాబ్రతు కున కెక్కడ మోన మెదవునో యని, నాయుల్లం బొకపట్టునఁ దెగు వకుం జొరఁ బాఱఁ జాలకున్నయది. అది యట్లుండ, నదిగో నొక పాపిష్ఠఘూకము నన్ను వాత వ్రేసికొన నుంకించి, నట్టాడుచు మ్రోలఁ గొండవలె నిన్నుఁ బొడగాంచి, కదియ శంకించి, శిరఃకంపంబు చేసి, చిత్తం బురియాడ వెచ్చనూర్పుచున్నది. నీకారుణ్యంబు గలిగిన, నా యాపద నిస్తరించి నీకీవిపత్పయోధి కవధిఁ జూపుదును. ఎరవుగాఁ జూడక, నన్ను నీవానిఁగా మన్నింపుము." అనుడు, నుల్లంబునఁ బెల్లు సంతసిల్లి, హస్తాచ్ఛాదితశ్రోత్రుండయి వృషదంశకోత్తముం డిట్లనియె. "హా! కారుణికోత్తమా! నీబ్రతుకునకు మోస మెదవునం చెంత మాటాడితివి! ఊరక యుపకారంబు సేయవచ్చిన నీవంటినోరుమాలిన జంతువుం బొట్టకై పాలియించి, నే నేమి కట్టుకొందును? దేనికి వెఱవ

కున్నను, పాపంబునకైన నోడవలదే! నేనిప్పుడు నిరాశ్రయుతా దశను గ్రుగ్గి, కాటికిఁ గాళ్ళు సాఁచుకొని యున్నాఁడను. ఇట్టిచో నెట్టికట్టిఁడి యైన, ధర్మేతరుఁడయి నీతిబాహ్యం బైన కార్యంబున కొడఁబడునె? ఒరు లేయువి యొనరించినఁ దనమనమున కప్రియ మగునో, యాయువి తానొరులకుఁ జేయకునికియే, సర్వశాస్త్రసారం బైన పరమధర్మము. నేనును బాల్యమునుండియు నిసుమోఁటియొటుక గలవారిశిక్షలనె పెరిఁగినవాఁడనుగాని, తెలితకువమూలిన నడవడిం బ్రవర్తించినవాఁడఁ గాను. మిత్రుఁడా! నీయాలోకంబున నాతమో నిచయంబులు పటాపంచ లయ్యెను. నే నెప్పుడు నీపొందునకే మున్నను గ్రుక్కిళ్ళు ద్రింగు చుందును. నేఁటికది యీనిమిత్తంబున సిద్ధించినది. నీచెలిమి యబ్బిన ధన్యుండు సర్వజనమూర్ధన్యుఁడు గాఁడె! భవత్సందర్శనంబున దేవు రాప్పులువచ్చి మ్రోల నిలిచిన ట్లున్నది. లోకంబున మంచివారికి సజ్జనదర్శనంబునకంటెఁ బరమలాభంబు గలదె? నీపరోపకారబుద్ధికి నాస్వాంతం బెంతయు సంతసించె. ఎవఁడు చేసినధర్మంబు వానిఁ గాచును. కావున, మతిమంతులు కాలుచె య్యాడుతతినే ధర్మమునందు బుద్ధి నిలుపవలయును. ఆవల జవసత్వంబు లుడిగి, యస్థిచర్మావశేషావయవంబులతో ముదిమి గదిరి యున్నప్పుడేమి సేయుటకును బురుషుండు సమర్థుండు గాఁడు. అంతియ కాక యాయువును, వాయుచలితదీపకళికయుంబోలె, క్షణభంగురంబై యుండును. అది విచారించి, ధర్మకార్యం బెల్లి చేయవలయునది నేఁడును, మాపు చేయవలయు నది తేపును, జేయుచుండవలయును. 'ధర్మస్యత్వరితాగతి' యను పురాణవచనమును బాటింపవలదే! దుఃఖ సముద్రంబున మునుంగఁబాఱి, నిరాధారంబుగ నున్ననాకు నీవొక తెప్పగాఁ దారసించితివి. ఆహా! యేమి నాభాగ్యము! అడఁబోవుతీర్థ

మొదు రమ్యోను! నేను నీతోడు వేడికొన వేగిరవడుచుండ, నింతలో నయాచితంబుగ నీవే నన్నుఁదరింపఁ దలంపుఁగొంటివి. నీవంటిపుణ్య కర్ముండు లోకంబున నొండొక్కరుండు గలఁడె? నీకీషూకమాత్రం బున కీలాగున భయపడ నేల? నాప్రాణము రక్షించితేఁ జాలును. భవదిష్టంబే నవశ్యంబుగఁ గావించెద. గుండెబెదరు దీఱి నాసరస కరుదెమ్ము. నాప్రాపు గలిగి యుండ, నిన్నీనీచపేచకంబు చెనకి మయిమయింబోవ నోపునె? నీకొక్కరియావద రాకుండ నాప్రాణ మడ్డము వైచెద: చెచ్చెరవచ్చి, యీయుచ్చ్వ్రచ్చ్వవనీఁ బూనుము. అనిన, నాయుందురువు డెందంబున నానందించి. వల్లెయని, మెల్లన నాచీలి సమీపంబునకుం జనియె. అదిచూచి, మనను నిరాశ చేసికొని, యులూకంబు తనవచ్చినత్రోవఁ బట్టి తిరిగిచూడక మరల తన యిరవున కరిగెను. అంతఁ బోయయు జాగిలమ్ములు పెక్కులు ప్రక్కలంబలసి చనుదేర, జముదూతవలె నేతెంచుచుండెను. మార్జాలం బాయెలుకను దూరమునుండి కాంచి, గుండియ రాయివడి, యుంగ మాకంపింప, నెలుక కిట్లనియె. "చెలికాఁడా! మనము మాటల సందడిని మఱచి, యేమఱి యుంటిమి. చూడు మదిగో — నావథంబున వ్యాధుండు దండహస్తుండై రెండవ దండధరునోజం జనుదెంచు చున్నవాఁడు. ఆక్రూరకర్ముండు నాకంటఁ బడ్డప్పటినుండియు, నాప్రాణంబులు నా మేనలేవు; చిత్తంబు స్వాయత్తంబు గాక తత్తరించుచున్నది. ఇంక నాబదుకెల్లను నీచేతిలోనిదయి యున్నయది. పుట్టి బుద్ధియెఱుఁగుట మొదలెన్నఁడును మున్నిట్టి కష్టములకు లోనైనవాఁడఁ గాను. కాలవిలంబనాసహిష్ణుత్వంబున జలదరించుచున్న నన్ను భయవివ్హలు నానృశంసునిబాదిం బడకుండ వేగ విడుగర చేయుము.' అనిన, మూషకంబును నురిచేరులు కొఱుకుట నటించుచు, 'నోడ

కొడుకు మిదె విడిపించెద' నని లుబ్ధకుండు సహాసన్నుఁడగు నంతకుం
గడపి, వాఁడును గడువికటం బగుడు, వడివడిం బ్రాఁకు తెగఁ గోఁతికి,
రొక్క పరుగునం బోయి, తనబొరియం జొరఁబాఱె. లబ్ధ మనోరథం
బగునోతువును ముంగలఁ జెంచుంగాంచి, దరమర్దితం బగు హృదయం
బున, నాక్షణంబ వృక్షసమారోహణం బాచరించె. శిథిలప్రయత్నుం
డయి నిషాదుండు, విషాదనంబున నురి పారిపోవుటకు నాసికా శిఖా
గ్రంబునఁ గరతర్జని మోపి యుబ్బురపడుచుఁ దనయిచ్చం జనియెం.
అంత నావృషదంశకంబు బ్రమాను దిగివచ్చి, యెలుకం జేరుకొని
యిట్లనియె. మిత్రుఁడా! పరోపకార కారణంబున, నన్నిట్లన్నిటం
జాలియున్న సంగడికానిం బడసియు, సౌహార్దసౌఖ్యం బనుభవింప
నొల్లక, యేల బేలతనంబున ఫలవిముఖుండ వయ్యెదవు? ఇంకొక
తడవ నీవచోమృతంబు నాచెవులకుం జవి చూపుము. నేఁడు మొద
లుగా నాసిరి యనుభవింప నీవును భాజనంబ వైతివి. నీవు వెలిగా
నొక మంచిపదార్థంబు గుడువ నామన సొగ్గకున్నయది. నా కెల్ల
చుట్టంబులును బక్కంబులును నీవ. నాయిల్లు నీయిల్లుగా భావించు
కొని, నేఁడును జేవును నీవవశ్యము మద్గృహంబున నన్నపా
నాదిపూజనంబులు గయికొని, నా భవనమ్ము పావనమ్ము చేయు
నది. ఇదిగో మదీయంబు లగు నర్థంబును జీవితంబును భవదధీనం
బులు. ఇంక నన్ను నీవానిఁగా నెంచుకొనుము. ప్రాణరక్షణం
బొనరించి మించిన మహోపకారిం బ్రియపూర్వకంబగు గాఢాలింగనం
బున నయిన గారవింపక, కృతజ్ఞతాలేశం బెట్టికట్టెఁడి నయిన మది
కుదిరియుండ నిచ్చునే! ఇప్పుడు నీగాఢ పరిష్వంగసౌఖ్యం బొనంగక
వేఱు సేయుట, నెయ్యునిదెస కూర్మి కలుసేయుటగాని యెందుగాదు;
వేవేగ వివరంబు వెడలివచ్చి, నన్నక్కునం గదియించి మన్నింపుము."

అనిన బిలంబులోనుండి మూషకం బిట్లనియె. ఒకప్పుడు ప్రయోజనం బపేక్షించి విపక్షుని తోడి సఖ్యం బంగీకరించియు, బుద్ధిమంతుఁ డేమఱి యుండఁడు. ఇప్పుడు నీవొనరించు తఱితీపునకుం జిక్కి, చొక్కి, యుండుట నాకు బ్రదుకు తెరువు గాదు. నీవింతదనుకం బాశంబునఁ జిక్కికొని మిక్కిలిబడలి పేరాఁకలి గొనియున్న వాఁడవు; ఉదరంబు వెన్నంటు కొని యున్నది; కన్నులు గుంటలు పడ్డవి; నీ కిప్పుడు చలిది వలపి నెయ్యంబు కరంబు నెఱపు చున్నాఁడవు. నీమాయ మాటలకు లోఁబడి, ప్రాణంబులు గోలుపోదునే; నీ నెయ్యంబునకును నీకును వేయినమస్కృతులు. ఇంక నీవిక్కడ మఱేమియుఁ జదివి చంపక, యీవట్టిభ్రమలు మాని నీదారిం దలయెత్తక పొమ్ము. ఇంతకుముంద యీవాలుబ్ధకుపాశంబువలన వెలువడియు, మరల నింతలో నీను రాశాపాశంబులఁ గట్టువడఁ గోరెదేల!" అని తెగనాడి, కలుఁగు వదలక యెలుక నుఖం బుండె. అంత నామాటల మనసు విఱిగి, చీలియు హస్తగతం బగు ధనంబు నోనాడుకొన్నకరణి సంతాపించుచుఁ జనియె.

"కాఁబట్టి శత్రువుతోడఁ గూడి మనవలసిన యవసరంబు నుండును. అప్పు డేమఱి యుంటమాత్రము కానిపని. ఈప్రయోజనంబునకు మఱేమియు విచారింపఁ బనిలేదు. ఇఁక నీవు మాఱాడకు, మీాతని చేరిక కీకొమ్ము" అని, మఱియుం గలశంకలన్నిటికిం బరిహారంబులు సెప్పి మఱియు నిట్లనియె. "విరోధి వరూధినితోడఁ గూడి, మలయపర్వతమ్ము నెత్తమ్మున విడిసియున్న వాఁడు. ఇట్టియెడ మనలో మనము త్రొక్కులాడుట పగతుని కార్యసిద్ధికి నుపకారంబు. కావున నీచెనఁటి వివాదంబు మాని, కార్యైకతత్పరుండ వయి, ముందుగాఁ బస్తుత కరణీయంబు విచారింపుము." అనినఁ బక్షాంచలంబులు

వాల్చి తనలోఁ జా నింత సేపు చింతించి, రాజునకు మంత్రి యిట్లనియె. "చిత్రవర్ణునిచేఁ బ్రత్యాఖ్యాతుం డయి, యాతనిమంత్రి యుపేక్షాపరుం డయియున్నవాఁ డని వినియున్నాము గదా? ఇది యొక్కటియె మనకార్యసిద్ధి కత్యంతప్రయోజనకారి. అంతియకాక, పరవశుండును, బ్రమాదియు, యోధావమంతయుఁ బగతురకు సుఖభేద్యు లగుదురు. ఈచెప్పిన లక్షణంబు లన్నియు నిప్పుడు చిత్రవర్ణుని యందుఁ గన్పట్టుచున్నవి. ఆతనివాహినీనాథులును మార్గాయాసపరవశులై, ప్రమాదు లయి యుందురు. దీర్ఘవర్త్మపరిశ్రాంతంబును క్షుత్పిపాసార్దితంబును నయి, సైన్యంబు దైన్యంబు గదిరి యుండును. ఆబర్హిప్రకాండుం డింతవఱకు నస్మద్దుర్గావరోధంబు గావింపం బ్రమత్తుండయి, తన్నుఁదా నెఱుఁగకున్నవాఁడు. కావున, నభియాతులఁ బరాభూతులఁ జేయు నిది మంచిసమయంబు. సహ్యాద్రివనమార్గంబు లవరోధించి, విరోధివరూథిని వధియింప మనసారసాదుల వేగ నియమింప వలయు. మీకు బుద్ధి యేమి? అనిన, నమ్మాటలకుం బ్రముదితాంతరంగుం డయి, కార్యత్వరాసముత్సాహదోహలిత హృదయంబున రా జిట్లనియె. "మనవా రిత్తఱి వైరిం దాసించి బీరంబులు తోరంబులుగాఁ బోరిన వచ్చు నా గౌరవముగానియందులకుంగాని యీయాకారగౌరవంబు గౌరవముగాదు. దురంబున నరవాయిగొనక, మీరందఱుఁ బ్రాణాత్యయపర్యంతంబుఁ బోరునది. కాలవిలంబనంబు సేయక యందఱిమన సొక్కటై నడువుండు." అని యానతిచ్చె. ఆమాటలాడుటయె తడవుగా, సేనాపతియు మహోత్సాహంబునఁ బృతనాపుంజంబులతోడ నడచి, కడునడచినబడలిక నొడళ్ళు తూఁగాడఁ బోడిమి చెడియున్న పరబలంబులపయి నేమఱుపాటునం బడి, వేఁడిమిఁ జూపి, పక్షహాసనంబులఁ దూలించి, శాతనఖ

చంచుపాతనంబుల నొంచి, వాలికలన నెత్తురుమడుగులు గట్టించి, పటువృంద్ర రూపునూపినం జిత్రవర్ణుండు విపక్షపక్షపక్షిపక్షనఖతుండా ఘాతమ్ముల నేలం గూలి కీలెడపిన జంత్రపుబొమ్మలుంబోలెం గాలు కాలం బెనంచికొని చాంపకట్టువడి యున్న నిజసైనిక నికరంబుల విలోకించి, నిర్విణ్ణుండయి, బహిర్లిఖిత చిత్రాకారంబు పగిదిం గొంతవడి చేష్టలు దక్కి యుండి, మగుడ నెట్టకేలకుం బరిజనప్రయత్నంబునం దెలిసి, దారుణరణకరణస్మరణంబు చిత్తంబు నుత్తలపెట్ట, దూరదర్శిం గాంచి, సవిషాదంబుగా నిట్లనియె. “ఇప్పగిది నొప్పనివారివలన మన దళంబులకుం దెప్పరంపుముప్పు వాటిల్లుచుండం, గానివానియొప్పున నొప్పరికించి చూచుచుండుట నీయట్టిదిట్ట కుచితంబే? నీయుపేక్షా నిర్ఘాతంబె వీరిపరిక్షయంబునకు హేతుభూతం బయినది. మనసైన మన సైనికనికాయంబులోం గాయంబు గాయంబు గానివాండు మందునకైనం గానరాం డయ్యెడును. మా యదృష్ట మిట్లుండ, ని న్నిట్టట్టనుట నేరము. అయినను, మన మొన కొక చెట్ట పుట్టిన, నిందుం బ్రసిద్ధులరు. మీకావున నది మీతలనె నిలుచుంగాని, మీ రప్పుడు తప్పించుకొందమన్నం బోవునది కాదు. కృతమతి వగు నీమంత్రము పెడ చెవులం బెట్టి, వాక్పారుష్యంబు చూపిన నాపాప ఫలము తోడనె కట్టి కుడిపినది. భవదంతఃకరణంబునం గరుణం జొనిపి, యింతదనుక నానోర వెడలినప్రల్లదంబు లెల్ల మఱచి నన్నుం జల్లనిచూపునం జూడుము. లేదా, యీదండులం దోడుకొని వింజపుంగొండకు మార్గంబు వెట్టుము. నాగతిదైవంబెట్టు కావింపం దలంచె నట్లయ్యెడు —నామే నున్నది, ఈవింధ్యాటవి యున్నది. అంతే కాని, రాజనసి యీబలంబులు వ్రాలియుండం జూచి సహింపంజాల. అకారణంబ, దిదె తూటుపడ సందడించునలఘులం బిప్పు డలబలంబు

లేక, సద్దడఁగియున్నది; నాయూరంతయు బలగంబును స్వల్పావశిష్టం బయి, కాడుపడియున్నది. వీరింగూడ, నెట్లు చూచిచూచి వైరుల వాతఁ ద్రోయుదును? ఇదె పుణ్యమును పాపమును నీవయిం బెట్టి తిని. ఇఁక, నేతెచ్చినను నేఱకున్నను గూర్చికొని రావలయును. నన్ని యపారవిపత్పారావారంబున ముంచినం దరిఁజేర్చిన నీదె భారము." అని న్యాయనిష్ఠురంబు లాడి, కరుణ పుట్టునట్లు మడిసినదండంబుల దడవి తడవి కురరివలె విలపించిన, మనము కరఁగి దూరదర్శియుఁ దొంటికోపం బెల్ల దిగఁ ద్రావి, ప్రసన్నముఖుం డయి రాజున కి ట్లనియె. "దేవా! దేవరయవార్యశౌర్య విజృంభణంబున దుర్గం బాక్రమించి, లబ్ధవిజయులమై సమస్తవస్తువులం జూఱగొని, యచిర కాలంబునకు భవదుక్తప్రకారంబుగా వింధ్యాటవికే చనుదము. సుఖదుఃఖంబు లెంతవారికి ననుభావ్యంబులు కావే! ప్రాగ్జన్మకృత కర్మాధీనంబులైన వీని నెవరు పొందకుండఁగలరు? ఆయువు మూఁడి యీచన్నవారికై శోకంబు మాని, కార్యపరుండవు గమ్ము. ఈహతశేషపరిమిత బలంబులతోడ నపరిమితపృతనావృతుం డగు నహితు నెట్టు నిహతుం గావింపఁ దలకూడు నని చింతిలవలవదు. లోకంబున నుపాయశాలికి, లోఁకువగానియర్థంబు లేదు. దేవర నిజ ముగాఁ దలఁచినఁ గలన నీయులఁతిమూఁకల గెలువ నెంతసేపుపట్టును? నాసామర్థ్యంబు నేఁ జెప్పవచ్చిన, హాస్యాస్పదంబై చూపట్టును. మఱియు నాత్మప్రశంస యనర్థంబు; నన్ను నే నెన్ననేల? నా బారిం బడ్డవారు ముందఱ నాచే నెంద ఱె ట్లయ్యెదరో, నీవ యెఱింగె దవు. తక్కినసీలెంకల బలశౌర్యంబులును దలంప లోకసామాన్య ములు గావు. వసుంగుంబోలె నీబలము నీవెఱుంగవు. నీ వించుక యలిగిచూచిన, నీముందఱ హంసలుగింసలు నిలువఁ గలవె? మన

మందఱను గూడి తెరువు లరికట్టి, యెట్టివారికిఁ జొరవ యీక, లోనివారిం గడుపుచిచ్చున లోపలన దరికొనునట్లు సేయవలయు. మన వారిం దోలుత దుర్గద్వారం బవరోధింప విధింపుము. దీర్ఘసూత్రత విజయసిద్ధికి హేతువుగా వివేకిలోకంబుచే గణియింపంబడు. అభ్యు దియు నిద్యోడ సిద్ధం బయ్యెను. ఇంకఁ గార్యసిద్ధికిఁ సందియం బెట్యది? సముత్సాహంబు నాటించి, దళవాయిని రణవిహరణ క్రీడకుం దీవరింపుము. జయశ్రీ వరింపుము.” అని యాతని యనుభా వంబునకుఁ బ్రోద్బలంబుగాఁ బలికిన, ఱేఁడును నంతరంగంబునం బొంగి నింగిముట్టె.

అంతట మున్ను వంపఁబడిన రెండవప్రణిధి ధవళాంగుండు రయంబునం బఱతెంచి, హిరణ్యగర్భుం గానిపించుకొని, నమస్కరించి యిట్లనియె. “స్వామీ! యవధారు. ఆపాఁపమేఁపరిదొర యొఱకల మొఱుంగులు తుఱుంగలిగొనం దనచేరువకో నీచేరువం జనుదెంచు చున్నవాఁడు. భగ్నమనోరథుండయి యాతండు తనమంత్రికడకుం బోయి వేలాగుల బతిమాలి, యతిప్రయత్నంబున నాతనిం బ్రసన్నుం గావించుకొని, తనమంత్రోపష్టంభంబున విజృంభించి, యాతనివచ నంబులె మహాబలంబంబుగా నస్మద్దుర్గావరోధంబు సేయ నిశ్చయించె. ఇఁక నవశ్యానుష్ఠేయం బైన కృత్యంబుపయిం దలఁపు నిలుపుము.” అనవుఁడు, జక్రాంగపుంగవుండు రథాంగంబు మొగంబుఁ జూచి, “సర్వజ్ఞా! మీఁదఁ జేయవలయుపని యేమి? చెప్పుము.” అనిన నాజక్కవల మేలుబంతి యిట్లనియె.

“మనవీరుల సారాసారంబులు విమర్శించి, తత్తదర్హసంభావ నంబుల గారవింపవలయు. దానంజేసి, యుత్సాహసాహసంబు లినుమ డించి ప్రాణము లైన నాఁపక పోరుదురు. దానముకంటెను సన్మా

నంబె వేయిమడుంగు లెక్కుడు; ప్రజ్ఞానంబె సర్వార్థసాధకము. దక్షు
లగు భృత్యుల యథార్థసంభాషణములందనుపమికంటె రాజులకొవ్వమి
వేఱు లేదు. కాఁబట్టి నాపలుకల నడ్డచేయక, యాదరింపవలయును.”
అనిన, హిరణ్యగర్భుండును మనమున గడునలరి నిజసైనిక నికరముల
రావించి, బహూకరించి, యుత్సాహం బెక్కించి, దురమునకుం బురి
కొల్పె. అంత దూరదృశ్యమాన వైరివాహినీసందోహముం గాంచి,
మించిపోయినట్లు వలతెంచి, నీలవర్ణుండు రాజునకు నమస్కరించి,
యిట్లనియె. “దేవా! సేవకునిఁ గృపాకింకరం బగు కటాక్షాంకురంబున
నీక్షించి, యీచిన్నవిన్నపం బవధరింపవలయు. నామాట యనదుగాఁ
జూడ వలదు. అల్లదె ప్రత్యర్థి యుద్ధార్థియై దుర్గద్వారమువలనికిం
డాయుచున్నవాఁడు. ఆతండు మనదుర్గనిర్గమమార్గం బవరోధించెనేని,
మనమెల్లఁ గాళ్ళు తెగినపగిది నిందుండి పేరులేక క్రుందవలసి వచ్చును.
పనుపవచ్చును రాఁడనుశంక మాని, నన్ను నీయిచ్చవచ్చినపనికిం
బుచ్చుము. స్వామియాదేశం బయ్యెనేనిఁ, బోరికిం దారసించిన యీ
శారికావారమ్ములను గీరమ్ములను నే నొకచీరికిం గొనను. ఇవి గరు
వమున నాడు కండకావరపుమాట లని తలంపకుము. నేఁ బ్రథనము
నకుం జొచ్చినఁ, జచ్చియు విచ్చియు నరాతు లెట్లు యథాయథ
లయ్యెదరో కనుంగొనుము. స్వామి నాకింతవట్టు మన్నన యీవలయు,
దేవరఋణంబెల్ల వడ్డితోడఁగూడ నేఁడయామ్రుక్కడులచేఁ గ్రక్కించి,
స్వామిఋణమువలన విముక్తుండ నయ్యెద. అంగీకారసూచక
ముగా నొకమాఱు భ్రూవల్లరి నించుక యల్లార్చుము.” అనిన,
మొగంబుననవ్వుగానినవ్వు నవ్వి, కోకలోకాధ్యక్షుండు రూక్షేక్షణం
బుల నధిక్షేపించుచుఁ, గాకి కిట్లనియె. ‘ఛీ నాను: నీవన్ని
టికిం జాలుదువు. ఆయాన ముడిగి, యింతటితో మిన్నకుండుము.

కృత్యాకృత్యపరిజ్ఞానంబు లేక, యూరక త్రుళ్ళుటయె కాని, బుద్ధి యూవంతయు నెఱుఁగవు. నీ వెప్పుడుం బోరు పోరనియే పలువరించుచుండుదువు. నేఁటి కది తలకూడినది. నీవే నిష్కారణముగా నీవైరంబుఁ బెనిచితివి. దీన మాకందఱకుంగూడఁ బ్రళయంబు సంభవించుంగాని, నీయొక్కనితోడం బోవదు. అయోధ లగు మానును లిండ్లకడ నెన్నియైన బీరంబులు నఱకుదురుగాని, మాఱుతుండు దారసంబై యీరసంబున ం బోరునప్పుడు వారి నక్కిళ్ళువడును. నాహితవచనంబు లవజ్ఞతగా నెక్కించుకోక, నీపోకడనూలినతనంబుఁ గట్టిపెట్టి, సాధుసమ్మతుండ వగుము.'' అని, రాజువంక మరలి "స్వామీ! యీాజ్ఞులాని వృథాజల్పంబులు నిక్కంబులుగా వగచి, మానప్రాణంబులఁ గోలుపోవుట మేలుగాదు. వీఁడు గడుఁగ్రొవ్వి, నోరికివచ్చిన ల్లెల్ల వెడయఱవు లఱచుచున్నవాఁడు గాని, లేశంబును గార్యంబుఁ గానఁడు. కర మూరసిచూడ, వీఁడు మిత్రవ్యవదేశంబునం బరఁగు శత్రుండు. నీకుఁ గల వివేక మంతయు నిపు డేయూరికిఁ బోయె! మాయికుల కెందును మాయపుభంగులే మందు గాని, ఋజుమార్గంబులు కొఱగావు. నీవార్యవృత్తంబునకుం జొచ్చి, యీతని శుష్కోపచారంబులు కడుతీపులుగా నభివర్ణించెదవు. ఈదురాత్ముని దార్మంత్ర్యంబు చెవి నిడఁగూడ దను తలం పించుకయు నీబుద్ధికిం బుట్టదయ్యెను. మనయోధలు దుర్గంబు నిర్గమింతురేని, దుర్గాశ్రయణం బెల్ల నిష్ప్రయోజనంబై చెల్లును. అందులకై మనపడ్డప్రయాసపాటును నిష్ఫలం బగును. నీళ్ళలోనుండి యేనుంగుఁ బీనుఁగు గానిం పంజాలు నక్రంబు, బయటిభషకంబుచే భంగపడుట స్థానభ్రంశదౌర్బల్యంబునంగాదే? దుర్గంబు వెలువడునేనిం జివ్వలో మనగువ్వలు గవ్వకుం గొఱగావు: అనుకూలశత్రుం డగు నీలవర్ణుని చెడుఁ గఱవులు

నీనీతుల కమృతకల్పంబులయి, మతికి హితంబులుగాఁ దోఁచు చున్నవి. మనవారికిం గాలంబు చేరు వాటం గాఁబోలు, నీమొద కిబూటకపుమాటలు వాటంబులుగా నాటుకొనియెడిని'' అని మఱియు నేమో యనఁబోవుమంత్రిమాటల కడ్డంబు వచ్చి, హిరణ్యగర్భుండు తన నమ్మకపుటురిం దగులుట భావించి, వర్ధిష్యమాణరోషుం డయి కరటేంద్రుం డిట్లనియె. "ఓమహారాజా! నామాటలు బోటు సేయక, దేవర దివ్యచిత్తంబున నవధరింపవలయు. ఈసర్వజ్ఞుండు మేఁకవన్నెపులి. మన కవమానంబు వాటిల్లినను, దనప్రాణముల దాచికొనవేఁడి, యిప్పు డిన్నిపోకలం బోవుచున్నవాఁడు. ఈకేఁడు మనకడ, నుత్సంగంబున నాశీవిషం బున్నట్టున్నవాఁడు. స్వకార్యైక ధురంధరు లగు నీతాదృశమిత్రుల దూరంబున విసర్జించుట కర్జంబు. ఈతండు పోరికి రాకుండుటయె యుఱవు. ఈతం డొక్కఁడు లేకున్నను, మన కొక్కకొఱఁత రాఁబోదు. సన్నికలు దాఁచినంతనె పెండ్లి చిక్కునా? దేవర ముందఱ బంతెంబులు పలుకరాదుగాని, యెవ్వరు నేల? నీకుం గెలుపొసంగ నే నొక్కరుండఁ జాలుదును. నాయుత్కర్షంబు చూడఁజాలక, మీఁదుమిక్కిలి నాపై నొక్క దూషమి నారోపించి, దూఱనాడుచున్నవాఁడు. ఓహో! పీనుల కెంత రోఁత విలవలసి వచ్చెను! నిక్కంబు విచారింప, నివి యన్నియు నన్నాప్తుఁ డని మన్నించుదేవర నంట గాక, నన్ననుటయె? ఈతని బోఁటిబంట్లు కోట్లయిన నగుంగాని, శరీరంబునఁ బిఱికిగండ లేనిబిరుదు మగలకుఁ బ్రాణంబు మానంబుకంటెను బెద్దకాదు; మానమే ప్రాణాధికంబు. కావున, లోకమున మానధనులు మానహీనమయిన బ్రదుకు నొల్లరు. ప్రాణంబులనైన విడువనోపుదుంగాని, మానంబు వీఁటిబుచ్చి లోకంబున భీరు వను పడి వడంజాలను. కుండ మూఁడు

మూఁకుడు గలదుగాని యెవ్వని నోరుమూయ మూఁకుడు లేదు. తత్ర వచ్చినప్పుడు ప్రాణంబులు దాఁచుకొని, యాబ్రహ్మకల్పాంతంబు నీవుండ నే మననిమ్ము" అని, మఱియు ననాదరసూచకం బగుచిఱు నవ్వుతో "అహాహా! యీతనిమాటలు మెచ్చవచ్చును. మనగువ్వ లఁట! దుర్గంబు వెలువడిన, గవ్వకుం గొఱగానఁట! ఇట్లు చెప్పెడు వారు చెప్పినను జెవియొగ్గి వినువా రయిన నవ్వకపోరు. అప్పుడ ట్లనంత నాలుగు పగరబలంబులు బలిసిమొయిం దొడఁగె. నేలఁగలసిన మనబలుసేన లిప్పటి వలపలనిమూఁకల కోపవంటకంబుఁ బరిహాసా స్పదం బగునర్థంబు లేదు. పనికిమాలినయాశంకలఁ జాలించి, సేనల తోడ వెడలి, ఈ అకేయుఱ చచ్చియున్నయాకొంచెపు మూఁకలం జొదివి, నదమడంబు సేయుము. నీవు నిమిత్తమాత్రుండవు: అంతియ కాని, దైవోపహతం బయి యాపరి రూపవిగియే యున్నది." అని మఱియుఁ బెక్కులు శూరాలాపంబులు పలికి, యామురాళరాజునకు నుత్సాహం బెక్కించెను. ఇట్లు నీలవర్ణునితోడ విధియును దన్నుఁ బ్రేరేప, "ఇది నీళ్ళలోని ముల్లు; ఇది యుచితయని కార్యనిశ్చయంబు సేయరాదు." అని యొక్కింతసేపు త్రొక్కటపడుచుండియు, నీల వర్ణునిమాటకు మాఱాడలేక, యాకలహంసపతియును దూరకుండెను. అంత నీలవర్ణుండును నెట్టకేల కొడయని యర్థాంగీకారంబె వడసి, దడంబులఁ దోడుకొని, దుర్గంబు వెడలి యరిగి, పరబలంబులం దల పడియె.

అందుల నచ్చటివా రందఱు గుంపులుగూడి, రహస్యముగఁ దమలో గుజగుజలు వోవుచుండ, మంత్రి సేనానితోడ నిట్లనియె. "నీలవర్ణునితోడినేస్తంబు మానించుటకై, నేఁబొరలంగలయంతయుఁ బొరలితి. ఇఁకఁ బతితో నతివివాదంబు కూడదు; 'అతిసర్వత్రగర్హితే'

మ్మని పెద్దలు చెప్పుదురు. ఎంత చెప్పినం, జనమార్గంబు మానక, మన తేఁడు తాను బట్టినపిట్టకు నాలుగుకాళ్ళే యనుచున్నవాఁడు. మన కొండిక రాకుండఁ, జేతికయినంతవఱకు మనము నిలిపిచూచితిమి. మీఁద నీశ్వరసంఘటనం బెటులుండె నటుల కాకమానదు. మనకుఁ గాలంబును గర్మంబును బ్రతికూలంబు లయియుండ, నాతనికి మంచి బుద్ధి యెట్టుపుట్టును! మనరాజునకుఁ గ్రొత్తవారే పెద్దయిష్టులు; మనమే లాఁతివారము." అనుచుండి, యనతిదూరవర్తి యగుచక్రాంగ చక్రవర్తిం గాంచి, యొండొరుల నవలోకసంజ్ఞల వారించుకొనుచు, రణసంభ్రమంబునం బరిభ్రమించుచుండిరి. అంత మహాశకులాధ్యక్షుండు, నిజవిలక్షపక్షవిక్షేపణ జాతవాతవేగసముద్ధూత పాంసుజాతంబు భూనభోంతరాళంబుం దిరోహించి యంతరిక్షంబలక్షితంబుగాఁ జేయ దురాగ్రహాగ్రహావేశంబున నొడ లెఱుంగక, సమగ్రసన్నాహంబున నుత్సాహం బెసంగఁ జనుదెంచి, యింగలమ్ము లొలుకునపాంగమ్ముల వైరివీరుల నీక్షించుచు, మొనవెనుకం బొలిచి నిలిచె. అప్పుడు హిరణ్యగర్భవాహిని సందోహంబు లన్యోన్యాహ్వాన వాదంబులును సింహనాదంబులును రోదసీకుహరంబులు నిండ వైరివీరులం దలపడి, ఘోరాఘోరిం బోరిన, సంగ్రామం బుద్దామంబుగాఁ జెల్లె. అందు దీర్ఘముఖాదులు తొంటిపగకై ప్రాణంబులకుఁ దెగించి, రోషావేశవివశు లయి రిపుసేనఁ బాయువడం జొచ్చి, దారుణంబు లగుత్రోటీవిదారణంబులను, నత్యంతకఠినపాతంబు లగు చరణనఖాఘాతంబులను, నభియాతుల నొప్పించి, యద్భుతరసావహంబుగా మహాహవం బొనరించినఁ గించిదవశిష్టంబుగా నరాతిచమూసమూహంబు నష్టంబునొందె. అప్పు డవ్విహంగకులదారుణ మరణంబుఁ (దానును బతుకుండెకాన) జూడ నోపక యాచోటు వాసి చనియెనో యనఁ బ్రభా

కరుండు ప్రభ మొదలి పడమటికడలికడకు నడచి, మఱుంగువడియె. ఆమునిమాపున నిరువాగుల వడవాళ్లును నాఁటికి బవరంబు చాలించి, తమతమబలంబులం ఉవిచికొని వీళ్ళు సేరిరి.

అట్లరిగి, యారాత్రి సుఖనిద్ర చేసి, మఱునాఁడు రేపకడ నుభయవాహినీపతులును నహర్ముఖోచితకృత్యంబులు నిర్వర్తించిన పిమ్మటఁ దమతమబలంబులఁ గలని కాయిత్తంబు చేసి, పురికొల్పిన, నవి యనల్పక్రోధంబున నశ్యర్ణపూర్ణ చంద్రోదయ ఘూర్ణమానార్ణ వంబులభంగిఁ బొంగి, యొండొంటిం దలకడచి తాఁకి, ఘోరంబుగాఁ బోరుచుండె. ఆభీమసంగ్రామంబునఁ బ్రొద్దు పొడవకమున్న వచ్చి యున్న మేఘవర్ణుండు, హిరణ్యగర్భరాజ్యగర్వాంధకారవినాశనూచకోల్క నానొక్కజ్వాలత్కాష్ఠంబు ముక్కునం గఱచికొని కపటపలాయనంబు నటించుచుఁ, దనవారు వేవురు వెంటనంటిరా దుర్గం బనర్గళ రయంబునం జొచ్చి, చిచ్చింటింటం దరికొల్పి, చుట్టుపల విసరుచుం బ్రజ్వలితశిఖుం డగుసమీరణసఖుండు, కరాళజ్వాలికాజాలంబుల దశ దిశలం బఱపి, దుర్గంబెల్ల నాక్రమించిన, బహువిహంగంబులు విహాయ సంబున కెగసి, పక్షంబులు కమలిన సుడివడుచు ముడింగిపడి, హుతాశనున కశనంబు లయ్యె. కల్పాంతకల్పం బగుననలవిహారంబునకుఁ దలంకి, హతశేషము లయినపక్షు లంతరిక్షంబున కెగయ గమకింపఁ, బోనీక కాకులెల్లం బొదివి త్రోటీఘాతమ్ములఁ జరణప్రహారణమ్ములఁ దద్విహంగఝూటమ్ముల నిరాఘాటమ్ముగఁ గొడవి, పుడమికిం బలిచేసి 'దుర్గంబుపట్టువడెఁబట్టువడె' నని యార్చి పేర్చిన కోలాహలము రోదోం తరాళము నిండెన, బెండువడి విమతకృతం బగుపావకోపప్లవంబునకు వగచి; లోనినగౌకములు కాందిశీకము లయి, యాహావమున కోహ టించిపాఱి, కంఠగతజీవనము లగుచు జలంబులంబడి, తమప్రాణముల

దక్కించుకొనియె. తక్కిన కొన్ని స్వభావమునకు భయము తోడ్పడ గుండియలు జల్లుమని, కళ్లువడి, యేగఁ గాళ్లురాక, పగతురచరణ నఖాఘాతనిపాతితములై, స్రవన్నిర్ఝరము లగుగోత్రములుం బోలె, నెత్తురుపఱపలు వాఱుగాత్రములు మెఱయ, నిశ్చేతనము లయ్యెను. అట్లు తృణమాత్రమున దుర్గం బెల్ల మల్లెపట్టినపొలముచందం బగుట విని, బయటివాఱును వెఱవేఁకిఁగొని, కాలుచేయాడక, పిడు గడిచిన వడుపునఁ గూలఁబడి బిమ్మిటిగొనియుండ, నేమఱుపాటునం జుట్టుముట్టి, పరబలము లసంఖ్యములు నిశితముఖము లగు నఖములం గ్రుచ్చి, నిర్ఘాతపాతములంబోని తుండాఘాతముల నొప్పించిన, నిలువున విగతాసువులై రక్తసిక్తాంగంబులతో రణాంగణం బలంకరించిరి. కొందఱు రణభీరువులు రాజుం బగవాఱినదుము దిగవిడచి, నిలిచినచోట నిలువక, మఱచినవంకం జూడక, కొళవుల కుఱికి, యొకఁడు పోయిన త్రోవ నొకఁడు పోవక, చెట్టొకఁడుగా నొదిఁగిరి. మఱికొందఱు కాలుతక్కువవారు పాఱంజాలక వెనుకచిక్కి, విరోధియోధచరణ ప్రహారమూర్ఛాపరవశులై, త్రోటిభేదనముల సంధులు ప్రిదుల మురిసి వ్రాలిరి.

ఇట్లు నిహన్యమానము లగుసైన్యములు నిలువఁజాలక, దైన్యమునఁ జెల్లాచెదరై పఱచిన, నాయాపత్కాలమున రాజహంసము స్వభావమందగతి యగుట నబ్బారి గడవనేరక, సారసద్వితీయంబై యుండి, పొరలి పొరలి వచ్చుకన్నీటివఱదం దనధైర్యసేతువున నుడువుచు, సేనానిదిక్కు మొగం బయి యిట్లనియె. “వీరవరా! చూచితివిగదా, నానిమిత్తమున మనవారల కెందఱ కిట్లు ప్రాణాంతకారియైన యాపద సంప్రాప్తమయ్యెనో! వారందఱివిక్రమము లిఁక జనము లద్భుతములుగఁ జెప్పుకొందురు. ఈగడియకు నీవును

నేనును నూపిరితో నున్నారము. ఉత్తరక్షణమున నెట్లయ్యెదమో తెలియదు. నాకై యంతలేసివార లట్లు కాఁగా, నింక నీపాడుశరీరమా నన్ను రక్షించునది? ఈనీలపర్ణుని నమ్ముటఁగదా, కార్యమింత మోస మయ్యెను. ఆమాయమాటలు చూచి, యీతఁడేమో విశ్వాసపాత్రుం డని భ్రాంతిపడి, తప్పుచేసి యీఁగతిఁ దెచ్చుకొంటిని. కడ కీదురాత్ముండు నన్ను ముంచి భంగపఱిచెను. అప్పుడీశనిఁ జేరదీయవలదని మీరెంద ఱెందఱెన్నెన్నివిధములనో నూఱిపోసితిరి. ఏమికాలకర్మదోషమో యప్పు డావచనము లేమియు నాచెవికిం జవి గావయ్యెను. అప్పటి నాడెందంబు చందంబు తలంప, నిపుడు నాకే విస్మయ మగుచున్నది. విధి మూఁడిన వానికి హితులవాక్యము లెట్టు రుచించును? మీరెల్లరు వలదువలదని వేవిధములఁ జెప్పినఁ, జెవిని బెట్టక యీకట్టిడికాకిని గోరి తెచ్చుకొన్న నాపాపఫలం బనుభవింపకతీఱునె? ఇంతకును దైవసంకల్పం బిట్లుండఁ, బౌరుషం బేమి సేయనోపును? హా! దైవకృత మేమనవచ్చును! నాఁడట్లు వేవు రెప్పుడు నొలసి కొలువ వెలయునాకుఁ, బిలిచిన నో యనువాఁడును లేకుండఁ జేసె. వారందఱు ముందుగాఁ ద్రోవ తీసిరి; క్షణ మెక్కువ తక్కువగా మనము నాదారినే వారిఁ జేర నున్నారము. మనసర్వజ్ఞుం డాడినమాట లన్నియు నేఁడు తథ్యంబు లయినవి. అతండు తలంప నీలోకములోనివాఁడే? ఇఁక నాతనివిషయమై యెట్టి పాపపుమాట చెవిని బడునో? నీవు నాకుం గూర్తువేని, యాలోచన చని, యొక్కయుపకారము చేయుము. దైవోపహతుండ నగునన్ను రక్షింపఁ బూను నీయొత్తికో లెట్లును సఫలము గానేరదు. నేఁటితో నాయూస విడిచిపెట్టి, నాకడంక కడ్డకా ల్వేయక, మదీప్సితంబుఁ దుద ముట్టించి, కృతకృత్యుండ వగుము. నీవు వేగము పోను చొచ్చి, సర్వ

జ్ఞానమతంబున మత్పుత్రుఁ జూడాకర్ణు విహంగరాజ్యంబున కభిషిక్తుం గావించి, యీశుభవార్త దెల్పి నాచెవిని వేయుము. అతఁడైనఁ బ్రాణములతోడ నుండి లేకున్న నీవా మనయీపగ నెన్నటికైన నీఁగఁ గలవాఁడు. దైవంబు మనలసిద్ధులఁ దిన్నఁగాఁ జూచినఁ, బునర్దర్శనం బయ్యెడును. లేదా, యింతే మనయదృష్ట మనుకొని, యిదే కడసారి చూపనుకొమ్ము; పొమ్ము" అను తేనివచనములు కర్ణశూలాయమానంబులయి హృదయంబుఁ గలంచినఁ, గొంతవడి దిగ్భ్రాంతి పడి, యతిప్రయత్నంబునం దెలిసి, గ్రుడ్లనీరు గ్రుక్కుకొనుచు, నెలుంగు గద్గదికం దగులువడ నిట్లనియె. "దేవా! యిట్టి దుస్సహవచనంబులు దేవరనోర వెడలందగవు. 'చూడాకర్ణుని విహంగరాజ్యంబున కభిషిక్తుం జేయుమని' యెంతమాటనతిచ్చిరి! ఆచంద్రతారార్కంబుగ నీసర్వంసహాచక్రంబు సర్వంబును దేవరవారే యేలవలెను. నేను సేనానినై యుండ, దేవర నెవ్వరైనఁ, జుట్టనవ్రేలఁ జూపనోపుదురే! వేయేల! మదీయ మాంసాసృగ్విలిప్తమార్గంబునంగాని, దాయ కేలినవారి డాయఁదలకూడదు. క్షమావంతుండును, దాతయు, గుణగ్రాహియు నగుదొర దొరకుట, మహాభాగ్యంబునంగాని గలుగదు. శుచియు, దక్షుండును, ననురక్తుండును నగుభృత్యుఁ డొదవుటయు దుర్లభంబె. అట్లు భాగ్యవశంబున లభ్యం బైనప్రభురత్నంబు నెట్టి మందభాగ్యుఁడైనఁ బెడవాయఁ జూచునె? నాకు స్వామితోడిద లోకంబు; దేవరచరణంబు లెడవాసి క్షణంబును మననేర. ఎంతటి వాఁడును మృత్యువుఁ గనుఁబ్రామలేఁడు. ఎన్నటికైన నీదేహంబు నేలపాలు గావలసినదే. అస్థిరం బగుశరీరంబునకై సుస్థిరం బగుకీర్తిం గోలుపోనేల? భృత్యుఁడు స్వామికార్యహతప్రాణుఁ డయ్యెనేని, బుణ్యలోకంబులు చూరగొనునని యార్యు లందురు. ఎప్పుడైన

విడువవలయునీశరీరంబు, నిప్పుడు విడుచుటయేమి భారము? స్వామ్యర్థ పరిత్యక్తజీవుఁడనై సుకృతి నగుదును. సంపదలు గజకర్ణాంతవిలోలంబులు ; తనువులో, శరన్మేఘశకటి త్తరళంబులు ; ఇంకఁ దారుణ్యమందుమా, వారితరంగచంచలంబు; నిన్నఁ జూచినవాఁడు నేఁడు గానరాఁడు. ఉన్నను జన్నను, జేసుమాత్రము పోక నిలుచును. దేవర వారు సర్వథా రక్షణీయులు; సప్తాంగములలోఁ బ్రధానాంగము రాజు; ప్రకృతివర్గం బెంత బలవంతం బయ్యు, రాజవిహీనంబై జీవింపనేరదు. ధన్వంతరి వైద్యుఁడైన, నాయువు మూఁడినవాని నేమి సేయనోపును? అంభోజంబుంబోలె, నినునియభ్యుదయసంక్షయంబుల లోకంబంతయు వికాససంకోచంబులం బొరయుచుండును.” అనునంతలోఁ జిత్రవర్ణుని సేనాపతి తామ్రచూడుఁడు తనపుంజుపోఁజుతో రాజహంసనుహింసించు తలంపునం దారసించె.

అప్పుడు కుక్కుటమరాళంబులకు దారుణప్రవిదారణం బొదవి, పోదలుమదంబులం బొదివి పరస్పరజయకాంక్షలం బోరుచుఁ, బిఱిఁది కిం జరగి మరల నురుదెంచి యెగిరి చరణంబుల నొండొరుల నదరంటం జఱచుచు, నఱచుచుం బఱతెంచి చంచువు చంచువునం బెనఁచి యితరేతరాకర్షణంబుల మించి మేనులు చించుచు, వాఁడిగోళ్ళోడళ్ళు గాఁడఁ దాఁచుచు, నెత్తురులం జొత్తిల్లి, ఱెక్కలుగల మలలమాడ్కి నింగి కెగసి వక్షంబులు ప్రక్షతంబులు చేసిన బోరనం గారుధారాళరుధిరాసారపూరంబు ధారాధరనిపతితపయోబిందుసందోహంబు ననుకరింప, నొండొరువులకు వట్రపడక పెద్దతడవు పెనంగి, ధరణీతలంబునకు లంఘించి కొంతసే పీడంబోక పోరాడి యంతకంతకుఁ బరిశ్రాంతసత్త్వుండగుచు వచ్చునంచలఱేనిం గని సత్త్వాధికుం డగుకృకవాకువల్లభుండు మేలు చేయియయి, మెఱుఁగు మెరసిన తెఱఁగున హిరణ్య

గర్భమీఁది కుటికి మొఱకల శిరమ్ము మోఁదిన, నమ్మోఁమకంబైన ముంగలి వారిన గవుశిఖివోలె మనం బెరియింప, నటాసముత్పాటన కుపితం బగుకంఠీరవంబు నేపునఁ గోపంబు ముప్పిరిగొనఁ దఱివారిఁ గొందఱిం బొరిగొని, యంతలోఁ జరణాయుధంబు క్రమ్మఱఁ దన్నిన మ్రొగ్గతిలి, దిగ్గన సంబళించుకొని లేచి, భ్రుకుటీప్రకటీకృతరోషుం డయి, కడంకలు నుడివడఁ గడిమిపెంపు వోనాడి, దండతాడితదర్వీ కరంబునోజ రోఁజుచు, శ్రమంబునం డీలుపడియుండ, వీక్షించి సార సాధ్వత్కుండు వీరవరుండు రోషానూయావిలమానసుండై కడంగి, యుదరు లుమిసెడుచూడ్కు లాతనిపై నిగిడించుచుం గవిసి నిజఖరతర నఖరప్రహారంబులఁ జరణాయుధంబు నెట్టకేలకు ధరణికెరఁ జేసి, బాసట యై దారిచేసినఁ దెఱపిగాంచి యాఁచుంచలరాయుండు వెఱపెల్లునం ప్రాణార్తుండయి పాఱి, నీరంబులం దూఱె. అట్లు తమయుద్యమం బెల్ల వీసరపోవుటయుఁ, బృతనాపతి నిహతుం డగుటయు, నీక్షించి విపక్షిపక్షులెల్లఁ గోపాటోపంబునం జుట్టుముట్టిన, సరకుసేయక యాసారసతల్లజుండు సంవర్తవేళాప్రవర్తిత దారుణసంహారవిహారుం డగుమాఱట సమవర్తియుంబలె నుదగ్రమహాగ్రహావ్యగ్రుండయి, యనేక శకుంతంబుల నంతకాంతికంబున కనిచి, చూప ఱగ్గింపఁ జిత్ర వర్ణవాహిని నేటి కెదు రీఁదినట్లు వీరవిహారంబు సలిపి, విపక్షదుర్ని రీక్షుండయి, రణక్షోణియెల్ల నిపతితవసామాంసభారంబు లగు శోణిత పూరంబులు వఱపి, మఱియు బిఱువోవక జముఁ డాడించు జంత్రపు బొమ్మలట్లు పయివయిం గవియు పింగళి బలంబులఁ బీనుఁగుపెంటలు గావించి, మాఱులేక మలయుచుండ, హతశేషపక్షికులంబు వికలం బయి విఱిగి సురిఁగి తనమఱుఁగుఁ జొచ్చుటయుఁ, గేకినాయకుం డెల్లె డలం బెల్లుగఁ ద్రెళ్ళి మృతంబులు మృతకల్పంబులు నైయున్న స్వకీ

యానీకినీజనంబులకు విచారపడి, సేనలం బురికొల్పి, యొక్కపెట్టఁ దానును సహాత్యుండును బెగ్గురుపలుం బడి బడలించినఁ, జేవపట్టఁ గియుఁ బౌరుషంబు వాటించి, శాత్రవసహస్రంబులం దునిమి, విగతసత్త్వుం డయి తూఁగాడుచు నరగన్ను వెట్టి, కొఱప్రాణంబులతో వీరవరుం డుండ, శిఖండీంద్రుండు పురివిచ్చి వచ్చి యాత్మపక్షత్రోటీప్రహారణమ్ముల మొత్తిన, విస్మృతంబుగా నొఱలుచు విగతజీవుండయి వీరశయనంబున శయినించె. అది చూచి చిత్రవర్ణుం డమందానందమునం బొదలి, సింహనాదంబు చేసె.

ఇట్లు చిత్రవర్ణుండు విజయోల్లాసభాసురుండయి, యరిదుర్గంబుఁ బ్రవేశించి, రాచనగరులెల్లఁ గొల్లగొని, యుల్లంబుల వెల్లివిరియు సంతసంబు మొగంబునం బబ్బి యుబ్బి, జయజయశబ్దంబులు భూనభోంతరంబు నిండ, నిజామాత్యభృత్యవర్గంబులం దోడుకొని, నిత్యప్రయాణంబుల నిజరాజధానిం జేరి, యత్యంతయత్నలబ్ధం బయిన విజయంబు సార్థకంబుగా నపారసంతోషంబున వసుంధరాపాలనంబు సేయుచు సుఖముండె.

అని విష్ణుశర్మ విగ్రహంబు సమగ్రముగా ననుగ్రహించి, ప్రజాక్షయకారణం బగు రణంబునకుఁ గాలు ద్రవ్వక, నొవ్వక, మీరును నేమిమీఱఁ బ్రజాపాలనంబు సలుపుం డనిన, రాజపుత్రు లింతంతనరాని సంతసంబునం బొదలి విష్ణుశర్మను బహుభంగులం గొనియాడిరి.

ద్వితీయభాగము ముగిసెను.

విగ్రహము సంపూర్ణము.

TO

# Edward Parr Metcalfe, Esq., M. A.,

*PRINCIPAL, PROVINCIAL COLLEGE,*

*RAJAHMUNDYR.*

THIS LITTLE VOLUME

IS

**MOST RESPECTFULLY DEDICATED**

BY

# THE AUTHOR

**AS A SLIGHT MEMORIAL OF SINCERE ESTEEM.**

# పీ ఠి క.

## చ ం ప క ము.

శ్రీకరు నవ్యయు నాద్యున్
లోకచయావనశీలున్
శోకవిశోషణు నీశున్
బ్రాకటభక్తిని గొల్తున్.

## తే ట గీ త ము.

ఆంధ్రభాషను బద్యకావ్యములు పెక్కు-
మున్న లోకోపకారకంబుగ రచించి
నట్టి నన్నయాదుల నెదయందుఁ గొలిచి
వచనకావ్యంబులను వ్రాయువారిఁ దలఁతు.

## ఉ త్ప ల మా ల.

ఇంతకుమున్న నేను రచియించినవిగ్రహతంత్ర మెల్లచో
నెంతయుఁ గష్టశైలి రచియింపఁగఁబడ్డ దటంచుఁ బల్మఱున్
వింతగనాకు లేఖలను వెక్కురు వ్రాయుచునుంటఁ జేసి య
త్యంతము వ్రాసితిన్ సులభమాగతి దీనిని సంధితంత్రమున్.

## తే ట గీ త ము.

పలుమఱు హితోపదేశంబు భారతమును
బంచతంత్రంబుఁ బరికించి, వానిలోన
వలయుకథలను గొని దీని వ్రాసినాఁడఁ
గ్రొత్తగాఁ గొంత యందందుఁ గూదురుపఱిచి.

## చి త్ర ప ద ము.

పెద్దల వేఁడెద దీనన్
దిద్దఁగ దోషము లున్నన్
విద్దియ చాలనినన్నున్
దద్దయుఁ గూర్మిక్షమింపన్.

---

# నీతిచంద్రిక



## సంధి



తదనంతరము మానవవరకుమారులు భూసురప్రవరున కిట్లనిరి. "స్వామీ! మీ యనుగ్రహంబు కతంబున, విగ్రహమును సమగ్రముగా గ్రహించితిమి. దయచేసి యింక సంధిని సవిశేషముగా ప్రసాదించి మాకుం గర్ణరసాయనంబు గావింపుండు." అప్పుడు సభ్యస్తసమస్త నీతిశాస్త్రమర్ముం డగు విష్ణుశర్మం డిట్లని చెప్పందొడంగెః—

అమ్మహాభీమసంగ్రామంబున నిహతానేకసైనిక లోకంబు లగు మయూర మానసౌకంబులకు గృధ్రచక్రవాకంబులచే క్షణమాత్రంబున సంధి చేయంబడియె. ఆవిధంబు వివరించెద వినుండు.

ఆరీతిని దారుణం బగు ప్రవిదారణంబున వీరవారం బెల్ల మారణంబు నొందినం జింతాక్రాంత స్వాంతుండై మరాళకాంతుండు మంత్రిం జూచి "సర్వజ్ఞా! ఎవ్వడు మనదుర్గంబున నగ్గి పెట్టిన దుష్టాత్ముండు? పగవారిచే బంపంబడి యెవ్వరయినం బ్రచ్ఛన్నవేషు లయి మనదుర్గంబు నివాసంబుగా నుండి మనల మోసపుచ్చి, చిచ్చుంటించి పోరుగదా!" అనిన వినయావనతుం డయి చక్రవాక ప్రశస్తుం డిట్లనియె.

"దేవా! దేవరవారికి నిష్కారణబంధువై యుండు నీలవర్ణుం డిప్పు డేమొకో సపరివారంబుగాం గానరాకున్నాండు. నాకుం జూడ నిది యంతయు నావిశ్వాసఘాతకుని దుశ్చేష్టితమ యని తోంచుచున్నది. దేవర యమాయకత్వమే దేవర నింతకుం దెచ్చినది. పుట్టుపూర్వ

ములను విచారింపక యవిశ్వసనీయు లగు నభినవాగతులయెడ హృద యంబు సదయుంబు గావించి నమ్మినపాపఫల మనుభవింప నేఁడు కాలము వచ్చినది.” అనిన రాజును క్షణమాత్రంబు స్వాంతంబునఁ జింతించి—“ఇది యంతయు మా దురదృష్టము. మా యదృష్ట మిట్లుండఁగా నెవరి నన వలసిన పని యేమున్నది. ఈవిషయంబున దైవప్రాతికూల్య మొక్కటియె కాని మంత్రులదోషంబు లేశంబును లేదు. మనుష్యప్రయత్నముచేఁ గార్య మెంత చక్కఁగా సంఘటింపఁ బడినను, దైవయోగము చేతం జెడిపోవును. నిటలలిఖి తాక్షరంబులు తుడిచివేయ నెవ్వరిచే నగును.” అని యూరకుండెను.

అపుడు సవినయంబుగా మంత్రి యిట్లనియె—“లోకములోఁ బండితులు కానివారు తమ కొక్కవిషమదశ ప్రాప్త మయినప్పుడు, దైవమును గర్హింతురు; కాని యాత్మకర్మదోషంబుల నెఱుంగఁ జాలరు. అపథ్యానురాగు లగురోగుల లాగున నృపాలురును హిత తంత్రు లగు మంత్రులమతి నతిక్రమించి యాత్మవంచకు లయి యభి నవప్రియులం బురస్కరించుకొని కార్యంబు ముగిసినవెనుక గర్వము సర్వముం దూలి యప్పు డదృష్టముం బేరుకొందురు. సుహృదులును హితకాములును నగుసచివుల వాక్యంబులాదరింపనివారు సహవాసి హితోపదేశంబు వినక చెడినదీర్ఘసూత్రుండను విసారంబుతీరున వినా శంబు నొందుదురు. అకథ వక్కాణించెద నవధరింపుండు.”

ఒక్కయేటిమడువున దీర్ఘకాలమునుండి, దీర్ఘదర్శి, ప్రాప్తకాల జ్ఞుఁడు, దీర్ఘసూత్రుఁడు, నని మత్స్యంబులు మూడు కూడి వసియించు చుండును. అట్లుండఁ గొండొకకాలంబునకు వేసవి సమీపించుడు, దీర్ఘదర్శి తక్కటిమీల రెంటిని జేరఁజీరి యిట్లనియె — “మిత్రు లారా! మీరునుం జూచు చున్నారుగదా! అదినమున కాదినము

వేసఁగి మిగుల నాసన్న మగుచున్నది. ముందు నిక్కముగా నీళ్ళింకఁ బాఱెడితఱిని మన కొండొకచోటికిం బోవ శక్యము కాదు. కాఁబట్టి యిప్పుడే యీయేటం బడి వెడలి యగాధజలంబును జలచర బహుళంబును నగు మఱియొక్క మడువుం జేరుదము. అనినఁ బ్రాప్త కాలజ్ఞుం డిట్లనియె. భవిష్యదర్థంబునందుఁ బ్రమాణముం గానము; కాఁబట్టియె బుద్ధిమంతు లగువా రెప్పటి కేది ప్రాప్తమగునో యప్పటికి దానికిం దగినట్లు కార్యము ననుష్ఠింపఁ జూతురు; కాని ముం దెప్పుడో యొప్పమి రాఁబోవు నని యిప్పుడే చిత్తంబున రిత్తవిచారంబు పెట్టుకొని కుందరు. ఇట్టిమడువు మహార్ణవంబువడువున నుండఁగా నిప్పుడే యింతవంత యేల! అంత పుట్టినప్పుడు పోలినతెఱంగు చూచుకొందము." అనిన దీర్ఘసూత్రుఁ డేమియు నాలోచన పాలువోవక యూరకుండె. అంతయు న్విచారించి దీర్ఘదర్శి యింక నిందు నిలుచుట కార్యంబు కాదని మున్ముందఱ మెలంకువ పడి జలసమృద్ధం బగు మఱియొక్క మడువుం బ్రవేశించె. ఆవెనుకం గొన్నాళ్ళు గడచిన నెండలు మెం డగుటఁ బూఁట పూఁటకు జలంబు లింకఁ జొచ్చిన, జాలరులు వచ్చి యాఁతలు, చిక్కములు, మీలపుట్టికలు మొదలగు వానితోడ నీరంబులఁ జొచ్చి, విషంబులం గలుషంబుల నెల్లఁ బట్టి త్రాళ్ళం గ్రుచ్చు చుండఁ బ్రాప్తకాలజ్ఞుం డొక్కవెర వూహించి యం దొక్కత్రాడు నోరం గఱచికొని గ్రుచ్చినట్టు లంటిపట్టుకొని గ్రుక్కుమిక్కనక యుండెను. అప్పుడు దీర్ఘసూత్రుం డబ్బారిం గడచునుపాయంబుఁ గానక "యేమి చేయుదు నెందుఁ జొత్తు" నని తత్తఱించుచు నిందు నందు మిట్టిమిట్టి పడుచు దుముకు లాడుచుండం జూచి యాకైవర్తు లావాలుగను లగుడంబున నడిచి మడియించిరి. అంత నాధీవరులు మీలవేఁటఁ జాలించి వారిచరంబులమొదళ్ళ

నంటినయంతటికిఁ గనుక మీనాదులు జలంబుల జాలించుచున్నారు ఆ సం బులనందున నిగూఢాడలం ద్రాడు గఱచి పట్టుకొని గిట్టినట్లుండు కొనల మొదల కున్న ప్రాప్తకాలజ్ఞుఁడు మెల్లఁగాఁ ద్రాడు విడిచి గంభీరవారిం బ్రవేశించి ప్రాణత్రాణంబు గావించుకొనియె. కాఁబట్టి మిత్రులహిత వచనంబులు వినని వాఁడు దీర్ఘసూత్రునివిధంబున నంతంబుఁ జెందును. మఱియు దీనం గొంకవిశేషంబుకూడఁ గలదు. ముందుగా ననాగ తము లగుకార్యంబుల నూహించి మెలఁకువ వడువాఁడు దీర్ఘదర్శి విధంబున నాపదం బొరయక సుఖించును; అప్పటికిం దోఁచినట్టు వెరవు పరికించి ధైర్యముతోఁ గార్యము నిర్వర్తింపఁ జూచువాఁడు ప్రాప్తకాలజ్ఞుని తెఱంగునఁ బరమసంశయాస్పదం బయినబ్రతుకుం గాంచును; భవిష్యద్దుఃఖమునుఁ గానక సమయోచితం బగునుపా యంబునుఁ దోఁచక యూరకుండువాఁడు దీర్ఘసూత్రునికైవడిఁ దప్పక యుపద్రవ ముప్పుఁ జెందును.

అనునప్పు డొక్కరివారిపీటం బుట్టువింతల నారసి రాఁ గ్రమ్మఱఁ బంపఁబడిన ధవళాంగుండు చనుదెంచి యంచలరాయనిం గాంచి నమస్కరించి యిట్లనియె. "స్వామీ! ప్రతిక్షణంబును దుర్గశోధనంబు కర్తవ్యంబని మున్నే విన్నవించుకొని యున్నాఁడనుగదా? దేవర నావచనంబులయెడ ననాదరంబు చేసి యూపవనిం గావింపరైతిరి. అట్లేమఱి యుండుటవలనిఫల మిప్పు డనుభూతం బయినది. గృధ్రానీతం బయిన మేఘవర్ణుం డను వాయసముచేతనే మనదుర్గదాహంబు చేయఁబడినది. అతఁడే మీపాల నీలవర్ణుం డనఁ జనవరియై యుండిన వాఁడు. ఆప్రకారము—అనునంతలో నాతనిమాట కడ్డము వచ్చి తల యూఁచి నిశ్వసించి మరాళవల్లభుం డిట్లనియె. "ఔనౌను; ఉప కారంబువలనంగాని ప్రణయంబువలనంగాని కానివాని విశ్వసించి

నాతండు పృష్ఠాగ్రమున నిద్రించువానివలెనే యధఃపతితుం డగును. సందియము లేదు. పదనంతరోదంతము చెప్పుము." అనుచు బకం బిట్లనియె. "ఆప్రకారము దుర్గదాహంబు చేసి డాయవచ్చిన మేఘవర్ణుని జిత్రవర్ణుండు సగౌరవంబుగా బహూకరించి, ప్రసాదమేదురంబుగా మంత్రినంకం జూచి యిట్లనియె. — "కృతకృత్యుం డయిన భృత్యుం డుపేక్షింపం బూనక పోరాదు. అనేకము మనోవాక్కాల సంతోషించు ప్రతిఫల మవశ్యము కలుగవలయును. కావున నీ మేఘవర్ణునే కర్పూరద్వీపరాజ్యంబున కభిషిక్తునిం జేయుదము" అని చెప్పినప్పుడు పోరిచొచ్చి తలంపునం బాఱి పరధ్యానముతో విచారించుచున్న రాజుం జూచి మంత్రి చక్రవాకంబు: "ప్రణిధి యేమో ముఖ్యాంశంబు మనవి సేయింపం బోవుచున్నాండు. దేవర వరాకులేక సావకాశముగా నాకర్ణింపవలయును." అనుడు రాజు; "ధవళాంగా! మేము చిత్తగించుచునే యున్నారము. ఏదీ? తరువాతి వృత్తాంతమును వినిపింపుము." అనవుడుం బ్రణిధి యిట్లు విన్నవించుచున్నాండు.

అంత నామాటలకుం బ్రధానమంత్రి యైన దూరదర్శి యిట్లనియె: "దేవా! ఇప్పు డేలినవారు సెల విచ్చిన దంత యుచితం బని నేం దలంపను. ఈతనికి మీ లోంగరింపం దలంపుం గొంటిరేని, ప్రసాదాంతరము చేయుటయె యెంతయు నర్హ కార్యము. చూడామణి స్థానమునం బాదుకర నిడంగూడనట్లు, మహాత్ము లుండందగినపదంబునందు నీచుల నెప్పుడును నిలువరాదు. నీచస్థానయోగ్యునిం దెచ్చి యతిశయస్థానమునందు నిలిపినభూవిభుండు, కాళ్ళం దొడుగం దగిన పాదుకలం దల ధరించినవానివలెం బరిహాసపాత్రుం డగును. లోకములో దేవర యెఱుంగనిది మఱి యెవ్వ రెఱుంగుదురు? పూజించినను నవ

మానించిననుగూడ నపకారంబు చేయుచుండుట యల్పులకు నైజ గుణము; శిరంబున ధరించినను గాలం ద్రొక్కినను భుజగంబు బడలు పడం గఱచును గదా? నీచులు శ్లాఘ్యపదంబుం బొందుదురేని ఒకానొకప్పుడు మేలు చేసినవారికే ద్రోహంబు చేయం జింతింతురు. మున్నొక కాలసర్పము వణిజునిచేం బ్రతికింపంబడియు, నాతనికే యప కారంబు చేయం జూచెను. దేవర కాకథ వాక్రుచ్చెద నవధరింపుండు.

హిమవంతంబు ప్రాంతంబున నొక కాంతారంబునం గాలి తెరువున నొక బేహారి చనుచుండెను. ఆయెడ నాయడవియందు దావపావకుండు గడు నడరి నలుగడలుం జుట్టి యొక్కపట్టున నొక్కపెట్టునం బెక్కుచెట్లం గాల్చుచుండెను. అట్లు వెంటనె మంటలు మింట నంటంగా నానడుమ నొక్కకాలవ్యాళంబు చిక్కుకొని యెక్కడకుం బోవం ద్రోవం గానక యాకానం జను చున్న వాణిజునిం గని పేరెలుంగున నిట్లనియె. "ఓయార్తజనశరణ్యా! ఈయరణ్యంబు నలుదెసలుం గ్రమ్మి ముమ్మరమ్ముగం జుట్టుకొన్న యీయెరగలింబడి ప్రాణంబులు గోలుపోవలసి వచ్చెంగా యని రక్షణోపాయంబు తోంపక దైవంబుం బ్రార్థించుచుండంగా నాపాలిటిదైవంబు చందంబున సమయమున సన్నిహితుండయినాండవు. శరణాగతభరణంబున శిబిచక్రవర్తిని దలంపింపం దగు నీయంతటిలోకోత్తరుని శరణొందితిని. ఇంక నాకేమి కొదవ; జాగు సేయక వేగ వచ్చి ప్రాణదానంబు చేసి పుణ్యమునం బొమ్ము. నే విన్నవింపంగల దంతయు విన్నవించితిని. పిమ్మట దమచిత్తము నాభాగ్యము. అని మఱియు దీనాతిదీనంబు లగువచనంబులం బ్రార్థింప, నాతండు దుష్టజంతువు వంతసహితము చూడంజాలక యగణ్యకారుణ్యంబున డాయంబోయి లోపల మిలమిలమెదలుచు నరణ్యరోదనంబు చేయు చున్న ఉరగముం గనుగొని, తనచేతికఱ్ఱకొనకుం జేను

త్రాటితో నొకసంచిని త్రేలం గట్టి, యాగ్నిష్ఠ్రమొదలు చేతఁబట్టుకొని యుపాయముగా సంచిని బొరియలో జారఁ విడిచెను. తోడనే యాపన్నం బగు నాపన్నగంబు సంచిలోఁ దూఱి చుట్టచుట్టుకొని యుండెను. అంత నాపణ్యాజీవుండు మెల్లఁగా సంచిని బయటఁ దీసి యాశీవిషము నొకచోట విడిచి పెట్టెను. మ్రొక్కఁ బోయిన గుడి విఱిగి మీఁదఁబడినట్లు తోడనే యాత్రాఁచు బుసకొట్టుచు లేచి, మనుష్యులు పాములం గంటఁ బడినతోడనే చంపుచుందురు. కాఁబట్టి యట్టి మాకులంబున కెల్లను మృత్యుప్రాయు లైన వారిని దొరకినపుడు దొరింపక విడువ రాదని పలుకుచు, నాలుక లార్చుచుం గవిసి యాతనిపైఁ బడి కఱవఁ బోయెను. అందుల కాతం డడలు గడలుకొని వడఁకుచుఁ బరిసరధరాధరదరీద్వారంబులు మాఱుమ్రోయ నఱచుచు సంచి నొకమూలం బాఱవైచి దర్వీకరము వెనుకయుఁ దాను ముందును గాఁ బఱవఁ జొచ్చెను. ఆచేరువ పొదలో నిదు రించు చున్న గోమాయు వాయలుకుడు విని యులికి పడి లేచి వచ్చి, ఫణికిని వణిక్శిరోమణికిని నడుమ నిలిచి యిట్లనియె. "ఓయురగ రాజమా! ఏల యూరక రోఁజుచు నీపాఱుఁబోతువెంటం బడి పరు గెత్తుచున్నాఁడవు? ఇంచుక నీవు నిలిచి నీవార్త నాతోడఁ జెప్పుము. నాచేత నగు సాహాయ్యం బున్నం జేసెదను" అనినం గృష్ణాహి తన యాపద్వృత్తాంతంబును బూసగ్రుచ్చినరీతిని వినిపించెను. అది విని యక్కజం పడినట్లభినయించుచు నక్క యిట్లనియె: "ఓమిత్రమా! ఇప్పుడు నీవు చెప్పినచరిత్రము విస్రంభపాత్రముగా నేఁ జింతింపను. ఈసంచి యెక్కడ? నీదేహ మెక్కడ? దీనిలో నీవు దూఱుట యెక్కడ? నీవు చూడఁబోయిన బెద్దబారెఁడున్నావు; సంచియో పట్టుమన్న జేనేఁడు లేదు. నీవిందు మరలఁ జొచ్చి చూపువఱకును

నీమాట సత్యమని విశ్వసింపఁ జాలను." అనుచు నాకాకుఁబొమప్పుడ సంచిం బ్రవేశించి, తొల్లింటిమట్టుల చుట్టఁ జుట్టుకొని లోపల నిమిడి యుండెను. వెంటనే యాసృగాలము, మోమున వైవర్ణ్యంబు మిగులఁ బెదవులు తడుపుచు నిలుచున్న యావణిజునకుఁ జేసైఁగ చేసి యాసంచిమూతిని గట్టిగా దారముతో బిగింపు మని చెప్పెను. అతఁడాప్రకారము చేసి, తనచేతిబడితో సంచిమీఁద నాలుగుమోఁదులు మోఁది దండశూకమును స్వర్గలోకమునకుం బుచ్చి, జంబుకంబుం గూడి తనదారిం బోయెను.

కాఁబట్టి క్షుద్రులు తమ కుపకారంబు చూపినవారికే యపకారంబుఁ దలంతురు. అంతియ కాక, ముఖ్యులయెడం జేసిన యుపకారంబును నిసుకయందు రచించినచిత్రయుం బోలెఁ జాల కాలంబు నిలువదు. మూర్ఖాలంబును ధర్మకర్తఁగా భావించి సేవింపఁ బోయినశశకపింజలములకుం బోలెఁ దమకెప్పుడు కీడు మూఁడునో యని యెంచి, ప్రజలును నట్టివిం గొలిచి యుండ నొడఁబడరు. మీ కాకథ నాకుఁ జెప్పెద నాలింపుఁడు.

వింధ్యాటవిలో నొకవృక్షకోటరంబునఁ జిరకాలమునుండి కపింజలంబను పక్షియొకటి కాపురంబుండును. ఒకనాఁటి సూర్యాస్తమయసమయంబున మొయిలుమొత్తమ్ములు వియత్తల మెల్లఁ గాటుక్రమ్ముకొని కడవలం గ్రుమ్మరించిన ట్లొకజడివాన కురిసెను. ఆవర్షంబునం దడిసి తడసి యాపులుంగు వేళకుఁ దొట్టఁ జేర లేక పోయెను. అప్పుడు దీర్ఘకర్ణం బనుశశం బొక్కండు భృశంబును వానను నాని యాశకుంతం బుండుతరుకోటరంబు చేరి, నెమ్మదిగా నందు సుఖనిద్ర చేయుచుండెను. ఇంతలోఁ గపింజలము తననివాసస్థలి న్వెదకుకొనుచుఁ జిమ్మచీఁకటిలో వచ్చి లోన నిదురించు కుందేటిం గని

యవలించి కోపంబు గదుర నిట్లనియె. "ఛీ! మందభాగ్యురాలా! నే నింటలేనియెడ వచ్చి నీవు కావరంబున నా గృహంబు ప్రవేశించుకొని నిశ్శంకముగా శయనించుచున్నాఁడవు. ఇఁకనైన నాలస్యంబు చేయక నాయిల్లు నాకు విడిచి యవలికి లేచి పో. కూరకు పోకుంటివా నీప్రాణములు నీవి కావు." అనిన గరువంబున శశం బిట్లనియె. "చాలుఁ జాలు. నీబెదరింపుమాట లింకేటికిఁ గట్టి పెట్టుము. దీర్ఘకర్ణునిముందఱనా బీరంబులు పలుక వచ్చితివి? నావీడుపంబు లును, తటాకంబులును, దరువివరంబులును నెవ్వరు ముందుగా నాక్ర మించుకొందురో నాఁటికి వారివి గాని యెల్లకాలముఁ బ్రత్యేకముగా నొకరిసొత్తులు గావు. మూఁటాడక పో పో. పో నొల్ల వే నెయ్యాడే నైనం దగవునకు రా పోదము" అనిన "న్యాయవాదినగుచుఁ దప్పిన చో రానని వచ్చునా? ఈరాత్రి పుచ్చి వేగిరం బోదము. అందాఁక గొంచె మోపిక పెట్టుము." అని యాకొంచవరాత్రి నెట్లో వేఁగించి తూరుపు తెల్లవాఱుడు శశంబును లేపి, దానితోఁ దగవునకుం బోదము నడువు మని కాలుగదుగులువెట్టి, యాపిట్ట మావివాదంబుఁ దీర్పఁ గలవాఁ డెవ్వఁ డనిన దీర్ఘకర్ణుం డిట్లనియె "నర్మదాతీరంబున దధికర్ణుం డనుమార్జాలవల్లభుం డొకండు గలఁడు. అతఁడు బహుకాల వృద్ధుఁడు; బహువ్యవహారదర్శి; శాంతమూర్తి; సధర్ముఁడు. అతండే మనచిక్కు వదలింపఁ దగినవాఁడు." అనినఁ గాఁ బోలు నని యొడఁబడి యాకపింజలము కుందేటితోడఁ గూడఁ గాల్నడకపుం జని చని మిట్టమధ్యాహ్నమున నాజీర్ణోతు పుండు తావుం జేరెను. ఆహా! కాలంబు చేసు వయినఁ దల లుత్తరించుకొని పోవు చోటికే పాదంబు లెంతదూర మయిన, శరీరధారుల నీడ్చుకొని పోవును గదా; అ ట్లాశశకపింజలములు గమ్యస్థానంబుఁ జేరి, పురోభాగమున వృద్ధ

మార్జాలునిం గాంచి, కపటభార్గ్మికుఁడును కేవలజఠరపూరకుం డును నని యెఱుంగక యిట్లనియెను. "ఓ మార్జాలనాయకా! మాలో మాకు స్థలవివాదం బొక్కటి పుట్టె దానిని ధర్మస్వరూపుల రగుస్వామిసమ్ముఖమున్నను దీర్చుకోవలెనని బహుదూరము నుండి యాస పడి వచ్చినవారము. మమ్ముఁ దడవు కూర్చుండఁ బెట్టక నిష్పక్షపాతకముగా వేగిరము మాన్యవహారంబు తీర్చి మమ్ము మా నెలవులకు బంపివేయుము." అనిన నామునుసరిపిల్లి యిట్లనియె - 'అయ్యలారా! మీరేమో దూరమునుండి చెప్పుచున్నారు. జరాభరంబునకుఁ జాంద్రాయణాదివ్రతంబులు తోడుపడఁ గృశించి యింద్రియపటుత్వము తగ్గి యున్నవాఁడఁ గాన నాశ్రవణంబులు దూరమునుండి మీవాక్యంబులఁ జిన్నఁగా గ్రహింప నేరకున్నవి. మీరిరువురుం జేతియొక చెవి చెంతం జేరి మీమీవివాదాంశంబులఁ దేట పడ నుచ్చ స్వనంబునం దెలుపునది. మాకనుష్ఠానసమయంబు సమీపించు చున్నది; మాధ్యాహ్నికంబు లొనరించి దానధర్మములు చేకోవలెను. అయినను దగవు తీర్పఁ గలవా రెంద రుండఁగా యుండ మీరు వారి నేరింగాదని, నే నేమో నిష్పక్షపాతముగాఁ దీర్చువాఁడ నని విని కడుదవ్వులనుండి వచ్చియున్నవారు. అట్టి మిమ్మూరక పంపుట మము బోఁటితపస్సులకు ధర్మంబు గాదు. ఈలోకములోనే యెల్లకాలము నట్టె కట్టుకొని యూఁగు లాడఁ బోము. కాలధర్మము నొంది నప్పుడు ధర్మమొక్కటి దక్క నీలోకములోని వేవియుఁ గూడ రావు. కాఁబట్టి యట్టిధర్మమును మాత్రము వేయియాపదలు వచ్చినను జెడ నాడు కోక కాపాడుకొనుచు రావలెను. ఇది యెంతయు సత్యము. సత్య మెప్పుడును దప్పరాదు. సత్యమే సర్వశుభములకు మూలము. సత్యము నకుఁదోడు భూతదయయు నుండవలెను. భూతదయయే సమస్త ధర్మ

ములకు నలంకారము. తన దేహమున నొక్క కంటకము సోఁకినంతనె యెంతనొప్పి కలుగునో యెల్లదేహధారుల శరీరవేదనయు నట్టిదే కదా యని యెఱింగి తత్త్వజ్ఞు లెప్పుడును హింసకుం గడుదవ్వుగఁ జరియింపుచుందురు. క్రూరకర్ము లీయర్థం బెఱుంగక దయయను ధర్మంబును విడిచి దేహపోషణమాత్రమునకై పరోపతాపంబు చేయఁ బాలు పడుదురు "స్వాశ్రితావనసమోనహిధర్మః" యని వేదములు ఘోషించుచును గదా! కావున యాశ్రితరక్షణమునకు సమాన మయిన ధర్మము మఱియొకటి లేదు. విషాభం బగు లోభంబును మొట్ట మొదట మొదలంట నున్మూలింప వలయును. ఎంత సంపాదించినను బ్రాణావసాన సమయంబున లోకములోని దేదైనఁ దాఁ గట్టుకొని పోవునే? ఓమార్జాలా! పాపభూయిష్ఠం బయిన యీ కలికాలంబున నీవెందఱ వశవర్తులం గావించుకొని యెందఱచే నెన్ని దుష్కార్యములఁ జేయించుచున్నావు? ఓహో! నీపేరు తలంపునఁ బాఱినంతనె నాగుండెలు పగులుచున్నవి! అని యవ్వగ్గుఁబిల్లి చల్లని మాటలతో నల్లన ధర్మోపన్యాసంబులు సేయుచుండ నా శశకపింజలములు విశ్వాసముతో బిడాలమును డాయం బోయి రెండును రెండు చెవులలోను దనతన వ్యవహారమ్మును జెప్పుకొనుచుండ, పిట్టకగవు పిల్లి తీర్చె నన్న ట్లాజరఠమార్జాలంబు కాళ్ళతో నారెంటిని జిక్కంబట్టి యొక్కట మెడలు కొఱికి చిత్రవధం బొనరించెను. ప్రాణప్రయాణ వేళ న్నశశకపింజలములు: "అయ్యో! ఒక్కరాత్రి కివ్వాసు పరున్న నేమి యని యూరకుండక లేనిపోని వివాదంబు పెట్టుకొని తగవునకుం బోవుదమనుదుర్బుద్ధి యొకటి పుట్టె సుఖముగా బ్రదుకలేక వేకువ జామునఁ బడిపోయినట్లు లేచి యింతదూరము పరుగెత్తుకొని వచ్చి, యీ ఖలుని నాశ్రయించి వీనిమిథ్యా వాదములు విని వృథా భ్రమ

నడి దుస్స్వరంబుఁ జెప్పుకొంటిని. పోరు నష్టి పొందు లాభము నన్న లోకోక్తికి యెన్నఁడైన వ్యర్థమగునా? వినాశకాలము సమీపించినప్పు డెవ్వరియాలోచనలు నేల పనికి వచ్చును? తానొకటి తలఁచిన దైవ మొకటి తలఁచును. 'లలాటలేఖా నపునః ప్రయాతి' యను వినమే!" అని చింతించుచుఁ బ్రాణములు విడిచెను. మార్జాలమును యథేష్టం బుగ రెండుమూఁడు దినములు లాహారంబు వెదకికొనక్కఱలేక వానిని భక్షించుచుండెను.

అప్పుడు చిత్రవర్ణుండు దూరదర్శిం జూచి, "మంత్రివరా! నీవు చెప్పినట్లు మేఘవర్ణుని తవ కారాంతకమునే చేయుదము. కాని ముఖ్యంబు చేయవలసినపని నొకదానిం జెప్పెదను వినుము. మనచే నశ్రమంబున జయింపఁబడిన కర్పూరద్వీపమునకు మరల నీమేఘ వర్ణునినే పంపుదము. అతండు చని యారాజ్యమునం గల యుత్తమ పదార్థముల నెల్ల నిరాయాసంబున నిచ్చటికిం గొనిరాఁ గలఁడు. అప్పుడా తెచ్చినవానిలోఁ గొన్ని యపూర్వవస్తువుల మనయాప్తులకుం బుత్తము; కొన్ని మేలి వస్తువులు ప్రకృతివర్గంబున కొసఁగుదుము; మిగిలిన వానిని యథేచ్ఛముగా మన మనుభవింపఁగలము. ఆవయిని నిష్కంటకముగా మనమీ యెల్లకాలము జలనంబు లేకుండ నాదీవి దొరతనంబు జెల్లింపఁ గలము." అను రాజువచనంబులు విని నవ్వి దూరదర్శి వినయ విధేయత్వంబులు కాన్పింప మెల్లఁగా నిట్లనియె. "దేవా! అనాగత కార్యంబులం దలఁచి సంతోషింపరాదని నయ విదులు పలుకుదురు. మనోరథ రాజ్యపాలనంబున నానందించువాఁడు కడపటఁ జేలసిందికుండం బగులఁ గొట్టుకొన్న మేదినీ దివిజునివలెనే విషాదంబునొందును. ఆకథ వినిపించెదను. వినుండి.

అయోధ్యానగరంబున దేవశర్మ యను బ్రాహ్మణుఁ డొకఁడు గలఁడు. ఆమహీసురుఁడు మహావిషువత్సంక్రాంతినాఁడు మఱియొక విప్రునియింట శ్రాద్ధమునందు నిమంత్రితుఁడై, యొక సక్తుపూర్ణశరావమును దానముగాఁ బరిగ్రహించెను. అందున కాతఁడు డెందంబున సమందానందము నొంది, యాసక్తు ఘటముఁ గొని యుబ్బున నేతెంచుచుఁ గడుపునిండ శ్రాద్ధభోజనంబు చేసి యుండుటఁజేసి నడవఁజాలక యాయాసపడుచు బొజ్జ నిమురుకొనుచు మెల్లన మార్గంబున నొకకుంభకారుని గృహంబు చేరి యరుగు మీఁద వెంటిరంబుగా నిడిన కడవలకడఁ దననీరుకావిదోవతిం బఱిచి, తలకుఁ జుట్టిన యంగవస్త్రము తీసి చుట్టకుదురుగాఁ జేసి దానిపయిని సక్తుభాండంబు నిడి, సక్తురక్షణార్థంబు దక్షిణహస్తంబున దండంబు నొకదానిని ధరించి, యెడమచేయి తలగడగా నిడుకొని యావంచె మీఁద శయనించి, కన్నులర మోడ్చి మితిమీఱిన కోరికలు కోరుచు నిట్లు చింతించెను. "ఈసక్తువును మంచివెల వచ్చినప్పు డమ్మి యొక పాఁడిమేఁకను గొనియెదను. అది యేఁటేఁట రెండేసిపిల్లలఁ బెట్టుచుండును. అవియు వానికిఁ బుట్టినవియు సంవత్సరక్రమమున బెరిఁగి కొన్ని హాయనములలో బహుసహస్రము లగును. అప్పుడు వాని నన్నిటిని విక్రయించి నూఱు పాఁడిమొదవులం గొందును. ఆధేనుశతమును గతిపయాబ్దములలోఁ బెక్కుదూడల నీనును. అవి యన్నియుఁ గాలక్రమమున మందలుమందలుగా వర్ధిల్లి, దొడ్లునిండి పోవును. ఆవల వానిలోఁ గొన్నిటితో విరివిగా వ్యవసాయము సాగించి, పొలములలోఁ బండిన పంటలలోఁ గొంత విక్రయించి లక్ష సంఖ్యలధనము నార్జించెదను; మఱికొన్ని కోడెల నమ్మి సొమ్ము కూడఁ బెట్టెదను. ఆవిత్తముతో నత్తఱి నేను గోటీశ్వరుఁడ నగుదును.

ఆపిమ్మట మాయింట నేమూలఁ జూచినను రొక్కము వెక్కసముగా మూలుగుచుండుట నెఱింగి యెల్లవారును నాకు 'మేము కన్యనిచ్చెదము మేము కన్యనిచ్చెద' మని యింటిచుట్టును దిరిగి పోవుచుందురు. అందులోఁ గులగుణరూపసమన్విత యగు నొక్కతన్విం బెండ్లియాడెదను. ఆలలనవలన నాకు మారునిం బోలుకుమారుం డొకఁడు కలుగును. వానికి మాసోమశర్మపేరే తప్పక పెట్టెదను. గృహకృత్యనిర్వాహణాయత్తచిత్తంబున నాసుందరి నందను నెత్తుకోక నా ముందఱ విడిచి పోవఁ గోపంబు పట్టలేక వెసకపాటునఁ బోయి యా మగువ నీలగుడంబున నే నాలుగడవు లడఁచెదను." అను సమయమునఁ గొంచెము నిద్రవచ్చి తెప్పలు వాల్చి నిజముగా భార్యవచ్చి మ్రోలనిలుచున్నట్లు కలవరించి, యాగ్రహంబునఁ దనకుడిచేత నున్న దండముతో నాపిండికుండను భిన్నభిన్నములుగాఁ గొట్టెను. కట్టువిసరునప్పు డాదెబ్బలలోఁ గొన్ని యాచేరువ నున్న భాండపఙ్క్తులకుం దగిలి కొన్నికుండలు పగిలి పోయెను. ఆచప్పుడు విని యదరిపడి లోపలినుండి కుమ్మరివాఁడు పరుగెత్తుకొని వచ్చి యా వెడఁగుబాపనయ్యకు నాలుగుబహుమానంబు లర్పించి, వడివడి నావుడమివేల్పును జావడి వెడల నడఁచెను. కాఁబట్టి యెందును రాఁబోవు కార్యంబులం దడవికొని, సంతోషించువాఁడు మున్నున్న దానిం గూడఁ జెడఁగొట్టుకొనుటయె కాక, సరివారిలో దూఱు వడయును.

అప్పుడు మయూరసార్వభౌముండు మంత్రిం జూచి యిట్లనియె: "దూరదర్శీ! నీ వీవఱకును వచియించిన దంతయు నాదరణీయం బయి యున్నది. నీమాట చొప్పున మేఘవర్ణుని రాజ్యంబునకుఁ బట్టంబు కట్టఁ గూడమికి మేమును నొప్పుకొన్నారము.

ఇఁకఁ గర్పూరద్వీపపరిపాలనంబునకు మనవారిలో నేరి నియోగింప వలెనో వాక్రువ్వుఁడు." అనిన మందహాసంబు గావించి, సగౌరవముగా దూరదర్శి యిట్లనియె.

"దేవా! మన మిప్పు డాహిరణ్యగర్భునిఁ బరాజయంబు నొందింపఁ గలుగుట మాయోపాయముచేతఁ గాని, నిక్కంపుఁబౌరుషంబుచేతం గాదు. ఆతఁడు మహాసత్త్వసంపన్నుండు; ప్రజారంజకుండు; అసమానమానసహితుండు. కావున నీయుపమానంబున కోర్చి యాతం దూరకుండువాఁడు కాఁడు. ఉన్నట్టుండి యెప్పుడో యేమఱుపాటున మనపయిం బడి పగఁ దీర్చుకొను సమయంబుకొఱకుఁ బ్రతీక్షించుచుండును. అతనిమంత్రియు ననన్యసామాన్య శేముషీమంతుఁడు; సర్వాంకషప్రజ్ఞ గలవాఁడు; సౌజన్యధన్యుఁడు; ప్రతాపదీపితుఁడు. కాలచోదితుం డయి వెనుక నేఁ డాతనిమంత్రంబు దెస ననాదరంబు సేయుటంజేసి యీమేఘవర్ణున కందుఁ జేరంగలిగెను గాని, హిరణ్యగర్భుం డప్పు డాతనిమంత్రంబునే నమ్ముకొని ప్రవర్తించె నేని యింతకుముందు మన మెక్కడ నుండవలసినవారమో దేవరయే యూహింపఁ దగి యుండును. వెనుక నొకసారి నమ్మి భంగపడి యున్నవాఁ డవుటంజేసి తొంటియట్లేమఱి యుండక యిఁక జాగరూకతతో మంత్రివాక్యములనే వేదవాక్యములనుగా మన్నించుఁ గాన, ముందు మనయాట లేమియు నాతనికడ సాగవు. ఇంతియ కాక రాఁబోవునది వర్షాకాలము. జలపక్షు లగుటంజేసి యాతనిసైనిక నికాయంబుల కది యాలంబున కనుకూలకాలంబై చూపట్టును. స్థలపక్షు లగుమనపక్షము వారికో వర్షాకాలదినంబులు దుర్దినంబులె యయి కానఁబడును. కాఁబట్టి హిరణ్యగర్భునితోడ సంధి గావించుకొని యాతనిరాజ్యం బాతని కొసంగుట సముచితకార్యము. హిరణ్య

గర్భుని సంగరంబున జయించితి మన్న ప్రతిష్ఠ యీావఱకే వచ్చి యున్నది. దానంజేసి యిఁక దేవరకీర్తి లోకంబున శాశ్వతంబుగ నెల కొనఁ గలదు. అంతకన్న మనకుఁ గావలసిన దేమి? హిరణ్యగర్భుండు దేశకాలానుకూలంబు తెలిసి గెలిచిగి మరల సంగరంబునకు రాక తక్కఁడు. పరమర్మభేదనోపాయధౌరేయుం డగుసర్వజ్ఞునిబుద్ధిసంప దకుఁ దోడు సహాయసంపదంగూడఁ బడసి దపంబుతోడ నాడి వెడలి మనలం దొడరు సురాళి రాజున కాజ యిచ్చి నొచ్చి మోసి, దిగ్దేశ ముల వ్యాపించిన యశస్సును గోలుపోక నిలుపుకొనుట యుక్తము; నేఁ జెప్పవలసినది చెప్పితిని. ఇంక దేవరయిష్టము." అనిన బకపక్షి నర్వ బలదర్పంబున నాతనిమాటలు పాటింపక శిఖుఁడీంద్రుం డిట్లనియె.

నీవేమో లోకములో లేనియూహాలనెల్ల నల్లి నేర్పు మెయి న్నిరాధారముగా నా కాశహర్మ్యము నిర్మించుచున్నాఁడవు, కాని యది యుక్తిమారుతంబు తాఁకునకుం గదలక, నిలువ నేరదు. సంగ్రామంబున సర్వంబును బోఁగొట్టుకొని ప్రాణమాత్రావశిష్టుం డై మోడి పాఱినహిరణ్యగర్భుం డెక్కడ? సంగ్రామవిజయగర్వో న్నతి నాకు లేక మలయుచున్న చిత్రవర్ణుని నాతండు భండనంబుం దాఁకి మానప్రాణంబులు గోలుపోక నిలిచి గెలుచు టెక్కడ? ఈమాట లెవ్వరయిన విన్న నవ్వెదురు. బాహుబలంబున నార్జించు కొన్న నేల నాఁచికో లేక నిష్కారణముగాఁ జేవిడుచుట వీరధర్మంబు గాదు. రణవిజితుం డగుహిరణ్యగర్భుం డిప్పుడు నాచేతిలోనివాఁడ. అతని నాతనిరాజ్యంబును నాయిచ్చవచ్చినట్లు చేయఁగలవాఁడను. నీ వింక వేయి చెప్పినను రాజ్యంబు విడువఁగలవాఁడను గాను. ఇంక నీవిషయమున నీవు నాతోడ నేమియుఁ జెప్ప వలదు." అని, వీర గర్వంబునఁ గొలువు విడిచి లోపలిమందిరంబునకుం జనియెను. అంత

మంత్రి మొదలగువారును దమతమ నెలవులకు నరిగిరి. నేను దేవరకు వార్తావిశేషంబులు విన్నవింపఁ గ్రన్ననఁ జనుదెంచితిని, అని ధవళాంగుండు సర్వంబును నివేదింప, రాజానుమతంబున సర్వజ్ఞుం డాతని కిట్లనియె "ధవళాంగా! నీవు మార్గాయాసంబునఁ గడు బడలి యున్నవాఁడవు. ఇప్పుడు గృహంబునకుం బోయి యలసట దీర్చికొని, పిమ్మట నెమ్మదిగా మఱియొకసారి దొరవారిని సందర్శించుకొమ్ము. నీకు మేము మిక్కిలి శ్రమ యిచ్చినారము. నీస్వామిభక్తికిని గార్యనిర్వాహకత్వంబునకును స్వామియు నేమును స్వాంతంబున నెంతయు సంతసించినారము. నీ వింకఁ బోయి రమ్ము." అని వీడుకో లిచ్చిన, నాబకంబును మనంబునఁ గరంబు నయంబును భయంబును గదుర ఱేనికిని మంత్రికిని మ్రొక్కి తనయిక్కకుం జనియెను.

ధవళాంగుండు నిజమందిరంబున కరిగిన యనంతరంబు హిరణ్యగర్భుండు మంత్రితోడ నేకత ముండి, కార్యాలోచనం బొనరింపఁ బ్రెగ్గడ యిట్లనియె. మన మీవఱకే బవరంబున నోటువడి వాసి చెడియున్నవార మగుటం జేసి, యిప్పు డావిరోధి పయోధివీచీజాలంబు నొక్కటిం దాఁకి వీఁక చెడక నిలువఁజాలము. బలశాలి యగు విరోధిని సాధింపఁ దలఁపు గొన్నవాఁడు. అంతకంటె బలవంతునితోడ జెలికారంబు నాటించి యామేటిమగనిం దనవైరిమీఁదికిం బ్రేరేపవలయునని నీతి విద్యావిదులు పలుకుదురు. గంధగజం బుబ్బలిలోఁ దగులుకొన్నప్పుడు గంధగజంబే లేవనెత్తవలెనుగాని యాపని యొక్కముక్కడిమృగంబు చేతఁ గానేరదు. సింహళద్వీపాధినాథుం డగు మహాబలాభిధానసారసకులపవిత్రుండు మనకుం బరమమిత్రుండు గలండు. అతనిపాలి కిప్పుడ దూతను బంపి, జంబూద్వీపంబుపయి దండు వెడలి మనకుఁ దోడు నూప వేఁడుకొనవలయును. ఇప్పటి కిదియ నాకుం జూడ నవశ్యకర్త

సత్యంబుగాఁ దోఁచుచున్నది." అనిన రేఁడునుఁ గడు నలరి మంత్రిం గొనియాడి, తదుక్త ప్రకారంబున వేగంబ సుగుప్తంబుగా నొకలేఖ లిఖియించి, పదిలంబుగా ముద్రవైచి, విచిత్రుండను బకంబును రహస్యంబుగాఁ బిలిపించి, యాలేఖ నతనిచేత నిచ్చి సింహళద్వీపంబునకుం బుచ్చెను.

అంత నచ్చటఁ జిత్రవర్ణుఁడును మంత్రియొకనాఁడు నిండుకొలువుండి నానావిషయంబులు ముచ్చటించుచుఁ, బ్రసంగవశంబునఁ గర్పూరద్వీపముమాట వచ్చి మేఘవర్ణునితో నిట్లనియె. "ఓయీ, మేఘవర్ణా! నీవు బహువారములు కర్పూరద్వీపమునుండి వచ్చితివి గదా? హిరణ్యగర్భుఁ డెట్టిగుణములు గలవాఁడో యాతనిమంత్రి చరిత్ర మెట్టిదో నీవు చక్కఁగా గ్రహించి యుందువు కాఁబట్టి వాని నెల్ల నాకడ వివరింపుమా చూతము." అనినఁ గాకంబి ట్లనియె: "హిరణ్యగర్భమహారాజు మహాశయుఁడు; సత్యసంధుఁడు; జాగరూకుఁడు మంత్రి సర్వజ్ఞుఁడును సర్వవిధంబుల సమర్థుఁడు; ప్రెగ్గడతనంబున నాతనితోడ నీడగు ప్రయోజకుని నొండొకనిం గానము." అనినఁ జిత్రవర్ణుండు తల యూఁచి మందహాసపూర్వకంబుగా నిట్లనియె. "అంతటి మహాశయుం డగుటచేత నాహిరణ్యగర్భుండు నీచేత నతిసులభముగా వంచితుఁ డయ్యెను? ఏదీ! ఇఁకఁ గొంత చెప్పుమా!" అనిన వాయసముఖ్యుం డిట్లనియె. "విశ్వాసముకతంబున నేమఱి యున్నవానిని వంచించుట యొక ఘనకార్యము కాదు. నమ్మికముచేతఁ దొడమీఁదఁ దల నిడుకొని సుఖముగా నిదురించుచున్నవానిని గొంతు కోయుట యొక పౌరుష మగునా? నల్లని వెల్ల నీళ్ళును దెల్లని వెల్లఁ బాలును ననుకొను నమాయికులు తమవలెనే లోకములో నెల్లవారును సత్యవాదులును

సన్మార్గవర్తులను నిష్కపటులను ననుకొందురు. లోపల నుండు మాయలును మర్మములును నెఱుంగ రాకుండ నేయుపుమెయి దుర్జనులు చెప్పు తేనెమాటలకు మోస పోయి ప్రథమమున వారివలం దగులుకొందురు. ఒకటి రెండుమాఱు లనుభవము యినమీఁదటఁ దరువాతివిషయములలో మిక్కిలి జాగ్రత్త గలిగి యుందురు. ఎవ్వరైనఁ గ్రొత్తగా వచ్చినవానిగుణంబు లిట్టి వని వానిమాటలనుబట్టి నిశ్చయించుకోవలెను గాని మనసులో నే మున్నదో లోపలఁ జొచ్చి చూడ లేరు గదా ? పూర్వ మొకయుర్వీసురుఁడు కొందఱు ధూర్తుల చేత మోస పుచ్చఁబడ లేదా ? దేవర కాకథ, వినిపించెదను వినుండు.

బ్రాహ్మణుఁడు పరమఛాందసుఁ డొకఁడు తన యధ్వరార్థంబు నల్ల మేక నొకదానిం గొని మెడకుఁ బగ్గ మగ్గలముగా బిగించి మించువేడుకతోడ నింటి కీడ్చుకొని పోవు చుండెను. త్రోవలో నొక చెఱువుగట్టుమీఁదఁ గూర్చుండి చూచి దుర్నయంబునఁ గొందఱు దుర్మార్గు లాయజంబును గాఁజేయువలెనని తలంచి తమలోఁ దామిట్లు చింతించిరి. ఈధరామరుం డదె బలిసిన మేక పోతుం గొనిపోవుచున్నవాఁడు. ఒక్కనిమ్మ మిచ్చి కొంద మన్నను మం కిట్టి క్రొవ్విన దది సాధారణముగా దొరకదు. ఈవైదికశిఖామణి నేలాగుననైన వంచించి యాఛాగంబు నిప్పు డపహరించితిమేని వారముదినములవఱకుఁ బుష్కలముగా మన మనస్యాపేక్షంబుగ మాంసభక్షణంబు సేయవచ్చును. అనునెడ నొకధూర్తుఁడు నడుమ నడ్డము వచ్చి యిట్లనియె. "ఈబ్రాహ్మణుఁడు పిశాచమువలెఁ బట్టుకొని యేమఱిక యీ మేకం గొంతున కురి పోసి ధరాపరాగంబు రేఁగ లాగుకొని పోవుచుండఁ, బట్టపగలు నట్టనడుపిథిలో మన మిట్లు దీని నెత్తుకొని

పోయి ప్రజలకెల్లను గష్టఁ గలము? రాజభటులును భయంకరు లయి యసికినుంతములతో దండహస్తులై యూర నెల్లెడఁ దిరుగులాడు చున్నారు. మనల నొకవేళ దొంగల మని పట్టుకొనిపోయి, చండ శాసనుఁ డనురాజునెదుర౦ బెట్టినఁ గ్రూరశిక్షలకుం గురికావలసి వచ్చును. నైన మిచ్చినమాత్రమను సుఖముగఁ గుడిచి కూర్చుండ లేక తల ద్రొవ్వి యకార్యకరణంబునకుం జొచ్చితిమేని, మన కందఱకు నేకకాలంబునఁ గాలంబు చేరు వగును. ఈవ్యర్థప్రయత్నముచే మన కవమానం బగుట దక్క నభిమతకార్యసిద్ధి యొదవ నేరదు. నాబుద్ధి విని యింక నీప్రయత్నంబు మానుము." అనినం బకపక నవ్వి బాల్యమునుండియు మోసపుఁబనుల నాఱితేఱిన యొకవృద్ధవంచకుం డిట్లనియె.— నీకు లోకానుభవంబు చాలమింజేసి. బేలతనంబున బాల వాక్యంబులు పలుకుచున్నాఁడవు. నిజముగా నావంటి ప్రౌఢుఁడు దలఁచుకొన్న నీయల్పకార్యంబు సాధించుట యెంత పని? ఫాలాక్షు నైనను మోసపుచ్చి యభిమతంబు తుదముట్టించును. చూడు మే నిదె నీవు చూచుచుండ నాశక్తిచేత నీమేకపోతును గుక్కను జేసి తీసుకొని వచ్చి మీకందఱకుఁ గాంక్షలు దీఱ దీనిమాంసమున విందు చేసి మీచేత నిప్పుడె మెప్పించుకొందును. తొల్లింటికాలంబున నొకమర్కటంబు మకరంబును మోసపుచ్చి కాదే తనప్రాణంబులఁ గాపాడు కొనెను. మీకకథ వక్కాణించెదఁ జక్కఁగా వినుండి.

పశ్చిమసముద్రతీరంబున నుండునడవియందు బలవర్ధనుఁ డను ప్లవంగపుంగవుం డొకండు వసియించుచుండును. అతండు వార్ధక్యంబున హీనసత్త్వుం డగుట చూచి జ్ఞాతులు సర్వముం దోఁచుకొని యాతని నిల్లు వెడలనడఁచిరి. బలవర్ధనుండును నడవులపాలయి పోయి పోయి, దపతీనదంబుతీరంబున ఫలభరితంబై యున్న యొక్క మేడిచెట్టు

నాశ్రయించి, తత్ఫలాహారంబున శరీరధారణంబు గావించుకొను చుండెను. ఇట్లు ఫలమాత్రమునఁ బ్రాణభరణము జేసికొనుచు నా యుదుంబరవృక్షముమీఁదఁ జిరకాలము నిర్విచారముగా నుండి, యొకనాఁడు పండ్లం దినుచుండ వలకేలం బట్టుకొన్నపండు ప్రమాద వశంబునం జాఱి నీరంబులం బడ బుడబుడశబ్దం బొక్కటి పుట్టెను. వానరమున కా నినదము శ్రవణానందకరంబుగా నున్నఁ దనమర్కట చేష్టలు బయల్పడ బలవర్ధనుం డవారిగ వారిలోపల ఫలములఁ బడ వేయఁ జొచ్చెను. దైవవశంబున నావేళనె ఛాయకయి వచ్చి చెట్టు క్రింద నీడం బండుకొని యున్న క్రకచం బను మకరం బా పండు గొని చప్పరించి జిహ్వా కింపుగా భక్షించి రుచి మరగి మఱియు నోరూర వానరము రాల్చుఫలములనెల్ల మెల్ల మెల్లఁగా నాలుక త్రుప్పుడుల్ల నారగింపసాగెను. ఇట్లు ఫలాపేక్షంజేసి యా మొసలి మునలి కోఁతితో మైత్రి చేసికొని, యిల్లును వాకిలియు మఱచి యాలుబిడ్డలం దలపెట్టక నెలలకొలంది నిచ్చటనే కాలక్షేపము చేయుచుండెను. అంత గృహం బున నాతనిగృహిణి దుస్సహం బగుపతివిరహంబునకుం దాళఁ జాలక పెనిమిటిం దలఁచుకొని యహోరాత్రములు నేత్రముల నీరు సంతత ధారగాఁ గాఱ నేడ్చుచు, నొక్కదూతిం బిలిచి ప్రాణనాయకుని విలంబనకారణం బారసి యాతని సుఖవార్తను జెవుల వేసి మేనం బ్రాణంబుల నిలుపు మని బహువిధంబులఁ బ్రార్థించెను. ఆదూతికయు నతిరయంబునం గదలి వెదకుచు వచ్చి యామేడిచెట్టునీడను గోఁతి తోడఁ గూడ నుండి వేడుకమాట లాడుచున్న క్రకచునింజూచి పోయి దీనాననంబుతో నామానిని యడుగులఁ బడి, "మగువా! నీమగఁ డొకకోఁతిముగుదం దగులుకొని మగుడ నెలవునకు రాఁజాలకున్నాఁ" డని, యున్నవి కొన్నియు లేనివి కొన్నియుఁ గల్పించి గ్రుడ్లనీరు గ్రుక్కు

కొనుచు వినిపించెను. పతి యొండొకసతిం దవిలి యున్నాఁ డన్న పలుకులు ములుకులవలెఁ జెవిని బడినమాత్రమున నల్లము నల్లన నొల్లఁబోయి యల్లనఁ దెలివి వొంది యామొసలి చెలువ చెలువుని నడతం దడవి మన మెరియ వెచ్చ నూర్చుచుండెను. ఇచటఁ గ్రకచుండును దూతిక యేతెంచి దవ్వుల న్నిగిడి పోవుట దూరము నుండి పొడగని గుండెలు తటతటం గొట్టుకొన, అది సదనంబునకుం జని తనమీఁదఁ గామినితో నేమి నేరములు చెప్పునో యని యచట నిమిషమయినఁ గాలు నిలువక, వడివడి న్నింగతి గాని వీడుకొని, యింటికేగు నప్పుడు శూన్య హస్తములతోఁ బోఁగూడ దని చేడి యకు నూడిదగా నిడఁ గొన్ని మధురతరపరిపక్వ ఫలంబులం గొని హుటాహుటిఁ జనియెను. ఈలో నామకరాంగన తన చెలుల వలనం బతిరాక మున్ముందె యెఱింగి, చెలికత్తెయలు నూఱేలం జేరి విలపించు చుండ, మూసినకన్నులు తెఱవక పడి యుండి మూలుగుచుండెను. క్రకచుండును దార జారసించి కాంచి హృదయంబు పగిలి నోరుగద్గదికం దగులు వడఁ బడఁతిం బిలిచి యులబ్ధ ప్రతివచనుండయి, తత్తరంబున నిదియేమని చెలికత్తియల నడిగిన నత్తరుణు లిట్లనిరి. "నీవు వెనుక మఱచి, పోయినపోకగాఁ బోయి యింటిమొద్దఁ బెండ్ల మేమయి నను సరేయనుకొని నెలదినములనుండి బొత్తిగా నిల్లు త్రొక్కి చూడకుంటివి. నీవరిగినమఱుసటిదినము మొదలుకొని నీభార్యకుఁ దీఱనివ్యాధి పట్టుకొని దినదినక్రమమున రోగము ప్రబలి నేటియుదయము నుండి మాట పడిపోయినది. తెవులు కనఁబడినది మొదలుకొని రాత్రియనక పగలనక తిరిగి, కన్నకన్నవారి కాళ్లెల్లం బట్టుకొని సొమ్మునకు వెనుక ముందులు చూడక మేము మాచేత నయినపని లోకములో లేనిసిద్ధౌషధముల నెల్ల నొకటి కాదని యొకటిఁ బోయించితిమి. ఆఁడువార

మింతకంటె నేమిచేయఁ గలము? చేసిన మందులెల్ల నేమూలఁ బడు చున్నవో కాని లేశ మయినను గుణ మగపడలేదు. మందులు పోసి పోసి విసిగి వైద్యులు కడచికిత్స యొకటి చెప్పిరి. కోఁతిగుండెకాయ నేయత్నముచేతనైన సంపాదించి దానిం బాలతోనాలుగుదినములు ప్రాయంసమయమున సేవించుచు వచ్చిన రోగము నిశ్శేష మయి యీామదిత బ్రతుకఁ గలదనియు, లేకున్న జీవితాశ వదలుకోవలసిన దనియుఁ దెలియఁ జెప్పిరి. చెడఁగాఁ జెడఁగాఁ గాఁపురములు గావు. మేము చెప్పవలసినది చెప్పితిమి. ఇంక నేపాట్లుపడి వానరహృదయము తెచ్చి భార్యం బ్రతికించుకొనెదవో మీాద నీయిష్టము.” అనినం గొంతతడవు నిశ్చేష్టితుఁ డయి వితాకు గదిగి యుండి, యేమియుం బాలుపోక యాకసమువంకఁ దిలకించి పరిపరివిధంబులఁ జింతించి తల పంకించి, యెట్లును బోవలెఁ దని నిశ్చయించి, వారికడ నోరు మెదల్పలేక కదలి చనుచు మార్గంబున నిట్లుచింతించెను. ఇంట భార్య చూడఁ బోయిన వచ్చెను ప్రాణముతోను బోయెను ప్రాణముతోను నున్నది. వైద్యులో యసాధ్య మయిన యౌషధముం జెప్పిరి. సాధ్య మయ్యెఁబో నెయ్యునిం బొలియించునంతటిపని పుట్టును. బలవర్ధనుండు దక్క నాకు మఱియొక్క కోఁతి యెక్కడ జిక్కును? వానర హృదయ మెత్తెఱంగునఁ దెత్తును? లేక యీాయవస్థలో నున్న నన్ను దాంగి నెట్లు మందు వేయక బలవంతముగాఁ జంపుకో నేర్తును? భార్య నిమిత్తము మిత్రద్రోహము చేయుట తగ వగునా? కాదని యొప్పరికించిన నిష్కారణముగాఁ బండువంటి కాఁపురము కూలి పోవు చున్నది. మిత్రవధంబు దురితంబులలో నెల్ల దురితంబు; జాయ తన కాయంబులో నర్ధం బగుటం జేసి యాలిం గోలుపోవుట యాత్మవధంబు కంటెను బాతకంబు. లోకములోఁ దన్ను మాలినధర్మము లేదు

గదా! సూక్ష్మదృష్టి న్విచారింప మిత్రునిప్రాణంబులు గొని నైనం బ్రాణేశ్వరీప్రాణత్రాణంబుగావించి యిల్లు నిలువం బెట్టుకొనుటయే యుచితము." అని కృతనిశ్చయుం డయి పదియడుగులు నడచి యం తటిపావంబున గొడిగట్టు నొకవట్టున మన సాప్పక డోలాందోళనంబు నొందం గ్రమ్మఱం గొంతవడి విచారించుచు నిలువంబడి, కడకుం బాపనిశ్చయుండై, బలవర్ధనవధోద్యోగంబున నేగుదెంచిన చెలిగాని గని యావనచరవల్లభుం డిట్లనియె. "మిత్రమా! చిత్ర మయ్యెడును. కళత్రముం జూడ వేడుక వడి గసియ క్రింపటునె చని యింతలోనే యేల తిరిగి వచ్చినాఁడవు? నీరాకకుం గలకారణము తెలుపుము." అనిన నాసక్రంబు వక్రంబుగా నవ్వి యిట్లనియె. "నీచేత ననుజ్ఞా తుండ నయి మందిరంబునకుంజని నాను దరిం గని యమందానందం బున నీవిచ్చిన స్వాదుఫలంబుల నొసంగిన నంతరంగంబునం బొంగి యాయంగన కొన్ని మెసంగి, వానిరుచి కచ్చెరు పడి "యీపండ్లెక్క- డివి? వీని నీకిచ్చిన పుణ్యాత్ముం డెవ్వఁడు? నీవిన్నాళ్ళుగాఁక నెక్కడ మసలితివి? చెప్పు" మనిన, నేనిట్లు చెప్పితిని: 'తపతీనదిసెుద్దున నుండు మేడిచెట్టుమీఁద బలవర్ధనుం డను తరుచరసత్తముం డొకఁడు కలఁడు. ఆతఁ డనింద్యచరితుండు; స్నేహపాత్రుఁడు; నాకుం బరమమిత్రుఁడు. అదయాళుని యాదరణంబున సమస్తము మఱచి యాతనికడ సపూర్వ సుఖం బనుభవించుచు నిందాఁక వదలి రాలేకుంటిని. ఆమహామహుండు నన్ను సాంత్వనవచనంబుల వీడుకొలుపి యమృతోపమానంబు లగు నీఫలంబుల నిచ్చి నీయొద్దకుం బుచ్చెను." అని నీ యుపకారకృత్యంబులు స్తుతిపాతకుగతిం బొగడి నీసుగుణసంపదను సహస్రముఖంబులం గొని యాడితిని. నీచెలియ లావలుకులు విని నన్నుఁ గినిసి 'ఓయి! కృతఘ్నుఁ డా! సుహృత్తముఁ డైన యావనచరోత్తముని నీతోడఁగూడ మన

భవనమునకుం గొని వచ్చి మనపాలిటి వేలుపుం బోలెఁ బూజించి జన్మసాఫల్యంబు గాంచక యీచెట్టుమీఁద నొంటిం దిగ విడిచి వచ్చితివే? ఇప్పుడ పోయి యాకపికుల గ్రామణికి నామ్రొక్కని మ్రొక్కి యిక్కడకుం దోడితెచ్చి మఱి నాతోడ మాటాడుము." అని పదరి నన్నిచటికిఁ బంపిన నిన్ను వెంటఁ బెట్టుకొని పోవచ్చితిని. నాప్రార్థనం బంగీకరించి వేగమ మదీయాగారంబునకు విచ్చేయుము. పోదము!" అని యాకపటాత్ముండు మిథ్యావినయంబునఁ బలికిన నావానర వరుండు నెయ్యునిమాట కడ్డ మాడలేక యియ్యకొని యిట్లనియె: "క్రకచా! నాకు నీయిల్లు లాఁతియిల్లు కాదు; నీయాగారంబున కరుదెంచి నీవలని సత్కారంబులం బడయుటకు నాకేమియు నడ్డంకి లేదు. కాని, యొక్క ప్రతిబంధము మాత్రము కనఁబడుచున్నది. నేను వనచరుండనయ్యును నీవనంబులనె చరియింపఁ గలను గాని మీ రుండు వనంబులఁ జరింపఁ జాలను. మీగృహంబున కెట్లు రాఁ గలుగుదునో చెప్పుము." అనిన మకరంబు కరంబును మింటివంకఁ జూచి యాలోచించి యిట్లనియె. "నే నంత విచారింపక నిన్నుఁ బిలుచుకొని పోఁదలచినాఁడను గాను. నాయిల్లు నీకు గా రాని చోటు గాదు. మేముండినది యీయేటిలంకలోని యొకసుందర మందిరము. దానిచుట్టుపట్టుల ఫలవృక్షము లనేకంబులు గలవు. ఆదివిమానోజ్జ్వకం బేమని చెప్పుదును? అది భూతలస్వర్గంబు నాఁ జూడ్కికి వేడ్క గొలుపుచుండును. తేవును మావును మామందిరంబున సపర్య గొనుచు సిచ్చ వచ్చినప్పుడెల్ల నందు విహారంబు సలుపుచుండవచ్చును. మార్గంబున నీకొక్క యుపాయంబు గలుగకుండ నిన్ను నావీఁపుమీఁద నెక్కించుకొని యుపాయముగాఁ గొని పోయి మాయావాసంబుం జేర్చి నీచెలియు లత్యంతతాత్పర్యంబున

నావహించినశాకపాకంబులతోడి భక్ష్యంబుల నుపాయనంబు చేసెద.
నీసోదరి మనరాక కెదురు చూచుచుండును. రమ్మా పోయివత్తము."
అనిన మాటలు మాటాడక యాకీశలోకేశుండు వృక్షావతీర్ణుం డయి
క్రకచునివీఁపునందూఁకెను. దూఁకుటయె తడవుగా మకరంబు సుక
రంబుగా వానరంబును వెన్నున నిడుకొని చనుచుఁ దెన్నునఁ
దనలోఁ దానిట్లు పలుకఁ జొచ్చెను. "అయ్యయో! ఎంతదారుణ
కర్మంబు గావింపఁ జూచుచున్నాఁడను! ఒక్క యాఁడుదాని నిమి
త్తము మిత్రముం దోరించి ఘోరపాతకంబు కట్టుకోవలసి వచ్చెఁ
గా! ఇఁక నేదుర్గతికిఁ బోదునో యెఱుంగను. నను వంటిదుష్టాత్ము
లెవ్వైన నుందురే? దైవమా! నే నేమినిందలపాలు గావల
యునో" అని యీరెలుంగున ననుకొనుచు ఖిన్నహృదయుండై
చనుచుండఁ గపివరుం డించుక గ్రహించి, "మిత్రుఁడా! ఇప్పుడు
నీమోముజాడఁ జూడ నొండొకవిధంబుగా దోఁచుచున్నది. నీ
యందు మున్నున్న యుత్సాహంబు గానరాదు. చిత్తంబు విచారా
యత్తం బయి తత్తఱించుచున్నట్టు కనుపట్టుచున్నది. దేహము
లాధివ్యాధిజరాన్వితములు; గృహమున నాసహోదరి సేమమున
నున్నది గదా?" యనెను. క్రకచుండు పలుకులఁ దడఁబాటు
పడుచు 'నీచెల్లెలు కొంచెము వ్యాధిబాధిత యయి యున్న' దనెను.
అంతటి యల్పరోగమునకా నీమొగ మింత చిన్నవోయినది? చీటికి
మాటికిఁ దాలిమి దిగనాడుట మగవాడి గాదు గదా యని బలవర్ధ
నుండు పలికెను. 'ప్రబల వ్యాధిపీడిత యయియే యున్న' దని
క్రకచుండు సందేహించుచుఁ బలికెను. అంత నశ్రుమిశ్రితాక్షుం
డయి వానరాధ్యక్షుండు; 'వైద్యులం బిలిపించి వేగిరము దివ్యౌషధ
ప్రయోగము చేయించినావు కావా?' యని యడిగెను. 'ఏమి

మాయరో యెఱుఁగను; వైద్యు లెంతమంది యెన్నిమందులను వేసినను గుణ మియ్య లేదు — నిన్నట్లు వీడ్కొని పోయి చూచునప్పటికి నీచెలియలు యమయాతన పడుచున్నది; నాకుం జూడ నీ రోగము కుదిరి జీవించుటయె కష్టముగాఁ దోఁచుచున్నది' అని క్రకచుఁడు బదులు చెప్పెను. విని వనచరుఁడు 'ఇది యేమి? మిత్రుఁడా! ఇంత వెఱ్ఱిపని చేసితివి! ఇంట భార్య యిట్టియవస్థయం దుండఁగా మందును మాకును విచారింపక యొంటి న్విడిచి మిత్రుని యొద్దకు రాఁ జిత్త మెట్లొప్పెను? విందునకుంబిలువ నోరెట్లాడెను?' అని మందలించెను. 'ఘనవైద్యులు కొందఱు కోఁతిగుండెకాయతో మం దీయవలెనని చెప్పుచున్నారు. అందునిమిత్తమయి వచ్చితి' నని యాక్రకచుండు శోకవ్యాకులితహృదయుం డగుకతంబున మఱి పోయి తనగుట్టుబయలఁ బెట్టెను. ఆమాట విన్నతోడనె ప్రాణములు గలఁగఁ బాఱి మేను చెమర్పఁ గొంతవడి యామర్కటంబు దిగ్భ్రాంతినొంది యుండి యింతలో డెందంబుకుందు డిందుపఱిచికొని "అయ్యో! ఖర్వాటుఁడు సూర్యాతపమునకు సహింపలేక తాళవృక్షచ్ఛాయకుం బోవఁ దాఁటిపండు పడి తల పగిలినట్టు దైవోపహతుం డగువాఁ డెందుఁ బోయినను నాపదలు వెంట వచ్చును గదా! అడవిని విడిచి మృగసంచారము సహితము లేని సముద్రతీరముం జేరియు, మృత్యుముఖప్రవిష్టుండ నైతిఁ గదా' యని వగచుచుఁ దెచ్చికోల్బిరంబున నిట్లనియె: "క్రకచా! యెంతపిచ్చిపని చేసితివి! వానరహృదయంబు కొఱకు వచ్చినవాఁడ వామాట నించుక మిత్రునిచెవిని వేయవలదా? ముందె చెప్పిన ముదిమి గదిరి యుంట నోర్మియలేక మేడిచెట్టునం దవిలించి యుంచిన నాగుండెకాయ నప్పుడె కూడఁ గొని వత్తును గదా? నీమనోగతంబు నెయ్యునికడ న్దాఁచుఁగొపఱిచి పని చెఱిచితివి.

ఇట్టి నీవు నీకశత్రువునకు శత్రుఁడవుగాక మిత్రుఁడ వే? మన కింత వఱకు నడిచిన దంతయు వృథా త్రిప్పట యయ్యెను. అయిన నేమి? శీఘ్రంబ మరలి మేడిపొంత కరుదెమ్ము. గుండెకాయుంగొనివత్తము.” అను మాయమాటలు నమ్మి మకర మావానరమ్మును గ్రమ్మఱ మేడికడకుం గొని తెచ్చి విడిచెను. ఇఁకఁ బ్రాణములు దక్కిన వని యామర్కట మొక్కవడి భూరుహంబు నెక్కి వెక్కిరించుచు, హృదయమును లేదు గిదయుమును లేదు పో పొ మ్మని క్రకచుని గద్దించెను. అది చూచి మొసలి మోసముం దెలిసికొని యేవలనను మోస మెట్టిదో యెఱుఁగని నన్నును నీముసలికోఁతి యిట్టె మోసపుచ్చెఁగా యని వగచుచుండఁ బ్లవంగ మిట్లనియె. “నీవు ప్రసాదపురస్సరము గా నన్నెన్నియో యుపచారవాక్యంబులు పలికి నిటల తటఘటి తాంజలివై నీయింటికి రమ్మని దేవురించుటం జేసి, పాపపుమోమోటమి నోరునొక్క రా నన లేక మోస పోయితిని గాక నన్నుఁ బ్రతారింప నీతర మగునే? ఓరి మూర్ఖాత్మా? మాటదాఁటక వచ్చి చేపడిన వాఁడే తప్పించుకొనిపోయెనుగదా యని సంతాపంబునొందక యీపాటి నీదారిం బొమ్ము. ఒకకూర్మముచేత నక్క యంతటిది మోసపోయినది. ఇక నీవనంగా నెంతవాఁడవు? వినవలతువే నాకథఁ జెప్పెద వినుము.”

కర్ణాటక దేశమునందుఁ గావేరియను నదియొక్కటి ప్రవహించు చుండును. సాగరసంగమునకు సమీపంబునఁ దత్తీరంబున నొక్క వటమహీరుహము గలదు. ఒకనాఁటిమధ్యాహ్న సమయంబున నొక కమఠంబు జలంబులు వెడలి వచ్చి యచ్చెట్టునీడను సుఖముగా నిద్రించు చుండెను. అప్పుడు తత్ప్రాంతకాంతారంబున నుండు ఫేరవం బొక్కటి యాచేట నీరుపట్టు మాన్పుకొనం జనుదెంచి తీయుసిపాసి

యంబు లాప్యాయనంబుగఁ బానంబు చేసి యాసమీపపాదపచ్ఛాయం బవళించి యున్న తాఁబేలుం గాంచి పరమసంతోషంబున మెల్లమెల్లఁగాఁ దారుచుం బఱతెంచి యేమఱుపాటున దానివీఁపుమీఁదఁ దనపాదంబు మోఁది త్రొక్కెను. అంత నాతాఁబేలు మేలుకని కీలెఱింగి కాలుసుం గేలుసుం దటాలున ముడుచుకొని తల పొట్టలో నిముడుచుకొని కదలకుండెను. క్షుధార్తం బగుమృగధూర్తంబును బడంబున దాని నదిమి పట్టి యిట్టట్టు పొరలించుచుఁ గోఱలు మొఱకలు వాఁడిఁ గొఱుకుచుఁ గూర్మంబు నర్మంబులు భేదింపఁజాలక చాలసేపు విడిచిపోవను మనను రాక క్రిందనుమీఁదనుం బడుచుండెను. అక్కరణి నది మిక్కిలి చిక్కులు పడుచుండ నక్కూర్మం బెక్కరణినైన నీముక్కడినక్కను డక్కువెట్టి ప్రాణంబులు దక్కించుకొనఁదఁగాకని తలఁచి యించుక యాలోచించి మాయ యచ్చుపడ నిట్లనియె. “ఓజంబుకోత్తమా! తత్త్వం బెఱుంగంజాలక యేల యీలాగున వృథాప్రయాసంబు పడియెదవు? నీవీకైవడి వేయేఁడులు కొఱికినను నాయొడలు నీకుఁ గొఱుకుడు పడఁగలదే? నీవేవిధంబునను నను వధించి యాపోవ నామాంసంబు మెసవక యవలఁ బోవని తలపోసి యీమనుగడ పయి నాసను గోసి యనాయాసమరణంబు నొంద నిశ్చయించుకొన్నాఁడను. విషములోనిబ్రదుకు; మాకెప్పుడును మృత్యువు శిరసుపై నాడు చుండును. కాఁబట్టి యాఁకొన్న మహానుభావునకు నీకొక్కచక్కనియుపాయం బుపదేశించెదను. వినుము: నన్నుఁ గ్రన్నన గొనిపోయి నీరంబులం జేర్చి కొంతతడ వందు నాననిచ్చిన, నామేను వెన్నవలె మెత్తనయి నిమిషములో నీచిత్తమువచ్చినట్లగును. అప్పుడు కడుపార నామాంసంబుతో సుఖపారణ చేసి నీవలసినచోటికిఁ బోవచ్చును. అట్లు చేయుము.” అనిన గోమాయువును మాయావాగురం

జిక్కుకొని యక్కపటవచనంబులు వేదవచనంబులని నమ్మి యదియు కార్యమ్మనుకొని యాఁబేటిని జేఁబోయి జలంబులం బడియె నదియుఁ, గొంత మెలఁకువ గలిగి పట్టు విడువక గట్టిగాఁ దనముంగాళ్లు దాని వీఁపున నొత్తిపి వండ్లయూటలు ద్రావుచు దానిమీఁదనె కన్నిడి ముహూర్తమాత్రంబు నిలిచి మరలఁ గొఱికి చూచి దానిబోగును వండ్లకు సాధ్యముగాకున్నఁ గమఠంబున కిట్లనియె: "తడ వాయెను: నిన్ను జలంబుల నిడి యొడలు మెత్తపడినఁ గడుపడిం గుడిచి నడవ వలెనని కాచుకొని యున్నాఁడను. ఏవేళకును నీమేను నానుజాడ గానరాకున్నది. ఏమి చెప్పెదవు?" అనినఁ గచ్ఛపం బిట్లనియె: "మిత్రుఁడా! నీవు నావచనంబులయందు గుఱి యుంచక వెన్నుమీఁద రెండుపాదములును దిట్టముగాఁ బెట్టియున్నవాఁడవు. నీరంట వలను పడకుండ వెన్నునకెల్ల సరిపోవ దారుణముగాఁ జరణంబుల నిలిపి యుండ, నామే నెట్లు నానఁగలదు? నీకోరిక యెట్లీడేఱఁ గలదు? ఇందు నాదోసంబు వీసంబును లేదు. నోటిశనిచేత నీవే యింతతడవు నవనమ్మిక పడి చెడితివి. అయిన నిప్పు డేమాయెను? ఇంకనైన నామాట నమ్మి వెన్నుమీఁదిపాదంబు లెత్తి క్షణమాత్రము చేరువం గూరుచుండి చూచుచుండుము. ఇప్పుడ పులకండంబులఁ బోలునా వల ఖండంబులతో విం దారగించి యనాయాసంబుగాఁ బోవచ్చును." అనిన నా సృగాలంబు కూర్మంబువాఙ్నిచయంబులు నిశ్చయంబులుగా వగచి తదీయోపదిష్టప్రకారంబున వెన్ను వయి నిడియున్న యడుగు దోయిని మెల్లఁగాఁ దీసెను. దీసినతోడనే ప్రాణంబుల దక్కించుకొని యక్కమఠంబు శరవేగమునం బఱచి లోతునీళ్ళం బడియెను.

అని చెప్పి యామర్కటము మఱియు నిట్లనియె. "ఓరీ! మకరాధమా! మోసములకెల్ల నిధి యగువంచకమే యిటు వంచింపఁ

బడఁగా, నీవంటిపుట్టుగ్రుడ్డు మోసపోవుట యొక యక్కజమా! చాలుఁ జాలు, నీతోడ మైత్రి చేసినందునకు ఫలము తోడనే కలిగినది. ఇంక నీమైత్రిని నీయొద్దనె యుంచుకొమ్ము. లోకవిఖ్యాతసత్త్వుండనయ్యు దైవవంచనచేత రాజ్యంబు గోలుపోయి త్రాణ చెడి రిపులతోఁ బడలేక కళత్రప్రముఖజన్యసుఖవిముఖుండనై లేచివచ్చి నిలువ నీడయుఁ ద్రాగ నీరును గానక యేకాకినై యడవులు పట్టి తిరిగి తిరిగి కడ కీవృక్షంబుఁ జేరి స్వచ్ఛందాహారంబున నుదరపూరణంబు గావించుకొనుచుఁ గులగోత్రనామంబులు దాఁచుకొని మొన్నటిదాఁక కాలము గడుపుచుండి, నీపెద్దతనంబు చూచి బుద్ధి భ్రమసి మిత్రవంచకుఁడవని తెలియంజాలక నీతోడిసఖిత్వం బంగీకరించితిని. నీవును బాపాత్మురా లైన నీభార్యదుర్బోధచేతఁ జెడుబుద్ధి పుట్టి, కుటిలోపాయంబున నన్ను మట్టుపెట్టఁ దలఁచి, మాయింట విం దారగింతువు గాని రమ్మని నచ్చికబుచ్చిక లాడిన నేనామర్మ మెఱుంగక నీమందిరమ్మునఁ దిరమ్ముగాఁ దల దాఁచుకొన నిశ్చయకుఁడ నయి నితాంత సంతోషంబున బయలుదేఱి మధ్యమార్గంబున నాకారవికారాదులచే భవదీయం బగుమనోవ్యవసాయం బూహించి పూర్వపుణ్యవశంబున నీయుపాయంబు తోఁచఁబట్టి బ్రతికి, పులి నాకి విడిచినవానిఁగా భావించుకొను చున్నాఁడను. ఆఁడువారు మంచి యెఱుఁగరు; చెడ్డ యెఱుఁగరు; పట్టికుత్సితములు పన్ని తమపట్టినపట్టు సాధించుకొనఁ జూతురు. నీవు నాతోడి చెలిమిం జేసి యిల్లు పట్టుకున్న నన్నే లాగుననైనఁ జంపింపఁ దలఁచి యిది యంతయు నీభార్య పన్నిన పన్నుగడ యయి యుండును. దేహములు బుద్బుదప్రతిమంబులు; పరువము ఫేనసదృశంబు; సంపదలు తటిచ్చంచలంబులు; అలంకారంబులు భిత్తిచిత్రంబులు; దారపుత్రాదులా శ్మశానగమనులుగాని యా

పయిని వచ్చువారు కారు ; ధర్మ మొక్కటియే తోడ వచ్చి తన్నుఁ గాచునది. అట్లయ్యును నీవు తగవును ధర్మంబును దలపోయక సద్యఃపాతి యగు తనువును నమ్ముకొని కీర్తిశరీరము నీడిచి నిత్యం బగు నపఖ్యాతి గడియించుకొంటివి. ప్రాణాధికుఁ డయిన మిత్రునినే యిట్లు చేసిన పరమసాహసికునకు నీకు నితరులు తృణకణంబులు. మీఁద నీ వేమిగతిఁ బోవువాఁడవో! నీయట్టిమిత్రద్రోహిం జూచుచున్న నఘం బొదవును. ఇఁక నీవు నాముందఱ నిలిచి నన్నుఁ గనలింపక, వేవేగ నీయింటిత్రోవఁ బట్టి పొమ్ము" అని ముక్కును మొగమును జూడక దూరనాడి, నిరుత్తరుం జేసి యామొసలి తేని నక్కడనుండి సాగనంపెను. క్రకచుండును నిష్ప్రహుండై దిక్కును చూచుచు దోయిడిచేతుల న్మగిడి నిజనివాసంబునకుం జనియెను.

కాఁబట్టి మోసముచే నెట్టిపని నైన సాధింపవచ్చును. నాయం దనుగ్రహించి మీరందఱు నాకొక్క సాహాయ్యమును మాత్రము చేయుఁడు. మీరందఱును ముందుగాఁ బోయి బ్రాహ్మణుఁడు చను మార్గమునందు దూరదూరముల నిలిచి, అతఁడు మీసమీపమున నుండి పోవునప్పుడు 'విప్రోత్తమా! కఱికుక్క నేల కొనిపోవు చున్నా' రని ప్రశ్న చేయుఁడు. ఇంతమాత్రము మీరు తోడు పడితి రా, మిగిలినకార్యమును నేను జక్కఁ బెట్టెదను. అని యావృద్ధవంచకుఁడు పలికెను. మంచి దని యాపనికి సమ్మతించి, తక్కినవా రందఱును బ్రాహ్మణున కగపడకుండఁ జని యాతఁడు వచ్చుదారిలో నందందుఁ గూరుచుండి, యాతనిరాకం బ్రతీక్షించుచుండిరి. ఇంతలో బ్రాహ్మణుఁడును మేఁకపోతు నీడ్చుకొని, మొదటివంచకుఁ డున్న తావునుండి పోవుచుండెను. అప్పుడు వాఁడు "అయ్యో! మీరు చూడఁ బోయిన బ్రాహ్మణోత్తములుగా నున్నారు. ఈకఱికుక్క నేల ముట్టుకొని తీసి

కొని పోవుచున్నారు?" అని యడిగెను. అందున కా బ్రాహ్మణుండు
నేత్రాంతంబులఁ గెంపు గదుర, "ఛీ ఛీ! త్రాగుఁబోతా! దురాగత
భాషలు ప్రేలకుము. నే నధ్వరార్థము కొనిపోవుచున్న యీపవిత్ర
మయిన ఛాగము నపవిత్ర మయిన శునకమునుగాఁ బలుక నీకు నోరెట్లు
వచ్చినది? పో పో" మ్మని, యామాటలను లక్ష్యము చేయక తన
త్రోవం బోవుచుండెను. మఱి నాలు గడుగులు సాగినతరువాత
రెండవధూర్తుఁ డెదురువచ్చి మస్తకన్యస్తహస్తుఁ డయి నమస్కరించి,
బ్రాహ్మణునివంకఁ జూచి, "స్వామీ! మీరు సర్వముం దెలిసిన వారు
గదా? ఈనల్లకుక్క నెగ్గు లేక ముట్టుకొనుచున్నా రే" మని పలికి
పోయెను. అందున కావిప్రుండు డెందములో నించుక సందేహించి,
వానిమాటకు మాఱు చెప్పక మేఁకం గొనిపోవుచుండెను. ఇంతలో
మూఁడవవాఁ డెదురుపడి, "ఇది యేమి; బావఁడా! ఇంత యక్ర
మమునకు లోఁబడినావు. నీవెత్తినది బ్రాహ్మణజన్మము గదా! అట్టి
యుత్తమం గులశీలముల నేటఁ గలిపి లోకు లెల్ల నవ్వఁ బట్ట పగలు
రాజవీథిం బడి యీయపవిత్ర మయిన వేఁపి నెచటికి దీసుకొని పోయె
దవు? ఈరాజ్య మేమిపాపము చేసెనో కాని కులాచార ధర్మములు
నిర్మూలము లయి పోవుచున్నవి." అని పదరెను. అంత నాయనంతా
సురుండు మతి వికలత్వంబు నొంద శంకా మగ్నుండయి, "ఒకరు
కారిద్దఱు గారు; కన్నవారెల్లరు దీనిని వేఁపి యనుచున్నారు. నాకొక
వేళ మతిభ్రమ జనియింపఁ బోలు" నని చింతించుచు, ఉల్ల ముయ్యాల
లాగున నూఁగ నిటునటుఁ జనఁ దోఁచక యనుమానించుచు నిలు
చుండెను. మొదటినుండియు బ్రాహ్మణు నెడఁ బాయక వెంబడించి
వచ్చుచున్న యావృద్ధవంచకుఁడు, తనప్రయత్నము ఫలోన్ముఖము
నకు వచ్చెఁగదా యని సంతోషించి, బ్రాహ్మణునకు వినఁబడునట్లు

గాఁ జేయుచున్న తోడు దొంగతో నిట్లనియె. "పాప మీ ముగ్ధ బ్రాహ్మణుని వెఱ్ఱివానిం జేసి యెవ్వఁడో యిట్లు కుక్క నొకదానిం గట్టి పెట్టెను. చూచితివా యీతనిదురవస్థ?" అని, విప్రుని యకార్య కరణమునకు వ్యసన పడునట్లు పలికి పక పక నవ్వెను. బ్రాహ్మణుఁ డామాటలు విని, యింద ఱేకవాక్యముగాఁ జెప్పిన దబద్ధము కానేర దని నిశ్చయించి, తన ప్రమాదమునకు లోపల నొచ్చుకొనుచు యజన భాగము నచటనే విడిచి పెట్టి, మరల వెనుకకుం బోయి ధూర్తు లందఱుఁ గొలంకు కెలంకునఁ జేరి నవ్వఁ దటాకములో స్నానము చేసి శుచియై తడిబట్టలతో నింటికిఁ బోయి, పాపపరిహారార్థము గాయత్రి జపించు కొనుచుండెను. ధూర్తు లా మేకపోతుంగొని పోయి, చంపుకొని తినిరి,

అని మేఘవర్ణుండు చెప్పిన విని, చిత్రవర్ణుండు మఱియు నిట్లనియె. "కొంచెకాలము శత్రువుతోఁ గలసి యుండుట యెంతో ప్రాణాంతకముగ నుండును. అట్టి స్థితిలో, నీవంతకాలము హిరణ్యగర్భునిపీట నిర్బాధముగా నుండఁ గలుగుట చూడ నత్యద్భుతముగా నున్నది. శత్రుమధ్యమునఁ జిరకాలము నీవెట్లు గుండె గుదిరి యున్నవాఁడవో తెలుపుము." అనిన, మేఘవర్ణుండు సవినయంబుగా నిట్లనియె. "స్వామీ! కార్యార్థి యయి యున్నవాఁడు స్వప్రయోజనమును ముఖ్యముగాఁ జూచుకొనక యెవ్వ రెన్ని బాధలు పెట్టిన నోర్చుకొని శత్రువును స్కంధమున వహించి మోచి యైన స్వకార్యము నుద్ధరించు కొనును. పూర్వ మొక వృద్ధసర్పము తనకార్యము నిమిత్తము కప్పలను మూఁపువయిం బెట్టుకొని మోసి, కడపటఁ దనమనోరథ మీడేర్చుకొన లేదా? దేవర కాకథఁ జెప్పెదను చిత్తగింపుఁడు.

కాంచీపురసమీపంబున నుండుజీర్ణోద్యానంబునఁ దడవుల నుండి మందవిషుఁడను విషధరవల్లభుం డొకఁడు నానము చేయుచుండును. ఆతఁ డొక్కనాఁ డహర్ముఖంబున నాహారాన్వేషణార్థంబు సంచారంబు వెడలి యొక్కచోట భేకకలకలంబులు మిన్నుముట్ట గంభీరజలంబుల నలరారుసరోవరంబు పొడగాంచి యందుఁ బ్రవేశించి యామండూకంబుల నెల్ల భక్షించుమార్గము దొరకక, కొండొకవడి చింతించి యొక్కయుపాయం బూహించి తత్తీరంబున నేలపై ఫణంబు వాల్చి వ్యాధిగ్రస్తునివిధంబున మూల్గుచుఁ బడి యుండెను. అది చూచి జలపాదుం డనుమండుకస్వామి చేర వచ్చి యిట్లనియె; "ఓనాగకులావతంసమా! నీవు తలఁచుకొన్న మహాబలునంత వాని నయిన నొక్కగ్రుక్కను వాత వ్రేసికోఁగలవు. అట్టినీ విత్తరిఁ గప్పలు కుప్పతిప్పలుగా మ్రోల దుముకు లాడుచున్నను భక్షింప నొల్లక, ప్రాణములు కంటికొలుకులలోఁ బెట్టుకొని వస్తు వడియుండుట యెంత యు వింతగా నున్నది. ఇందులకుఁ గతం బెఱిఁగింపు" మనినఁగాలాహి యిట్లనియె: "నాకుఁ బ్రాపించినదుర్దశ మీతోడ నేమనిచెప్పుకొందును? నేనీవఱ కెన్నఁడును బొట్టకొఱకుఁ బరులను దేహి యని యాచించిన వాఁడను గాను. నేఁటికాలమునకు నాకు మీవంటివారి ననుసరించి పొట్ట పోసికోవలసినదినములు వచ్చినవి. వే యేల? ఇక ముందు మీ రనుగ్రహించి భోజన మిడిన భుజింప వలసినవాఁడను, లే కున్నఁ బస్తుండ వలసినవాఁడను, నయినాఁడను. నిన్నటిదిన మర్ధరాత్రంబున నే నాహారేచ్ఛం ద్రిమ్మరు చుండ, నొకభూసురకుమారుఁ డాత్రో వను జనుచు దురదృష్టవశంబున నాతలమీఁద నడుగు వైచెను. అతని పాదమును సహింపఁజాలక నేనును బుస్సుమని పడగెత్తి లెమ్మిదముగ దక్షిణాంఘ్రి యావిప్రనందనుని కాలాడిసి కఱచితిని. ఆకాటు తిని విప్రార్భ

కొఁను భయాతిరేకంబున గృహంబులోనికి బోటిం తండ్రికంతయుం దెలిపి పులుకుపులుకున నేడ్చుచు విష మెక్కి మూర్ఛిల్లి నోర నురుఁగులు గ్రక్కుచు నేలఁ బడి తెప్పలు దేలవైచెను. బ్రాహ్మణుఁడును గొడుకుం దొడలమీఁదనిడుకొని యస్తోక శోకమగ్నుఁడయి పరిపరివిధముల విలపింపఁ జొచ్చెను. అప్పు డాతని బాంధవులు పలు దెఱంగుల దుఃఖశోషణంబు లగుభాషణంబుల నాతనికి ధైర్యము చెప్పి మరలింప, ఆయర్ధరాత్రపువేళఁ జిమ్మచీకటిలో నురిమీఁద వెన్కకు నీడ్చు పాదములతోఁ బోయి విషవైద్యునిఁ బిలుచుకొనివచ్చి యాచిన్నవానిని వీఁడు మీవాఁడు గాని మావాఁడు కాఁడని వారిపాదముల మీఁదఁ బడవైచి, తదనుగ్రహంబున విషముక్తుఁడయి లేచి కూర్చున్న కొడుకును జూచి యంతరంగంబు హర్షోత్తరంగంబయిన 'వీఁడు మీరు పెట్టిన చెట్టని జీవనము లిచ్చినయాఘనుని వేనోళ్ళఁబొగడి వీడుకొలిపి, నామీఁదియాగ్రహం బుడుగక యాబ్రాహ్మణుఁడు న న్నుద్దేశించి యిట్లనియె: "ఓపన్నగమా! పున్నమచందమామను బోలునీ యర్భకుని మోము చూచి, దయ పుట్టక నిర్హేతుకముగాఁ గాటు వేయ నీకు నో రెట్లాడెను? సదా రంధ్రాన్వేషణమే పనిగాఁ గుటిలగతిన్వర్తించు పాపజాతికి నీ కెట్లు దయ పుట్టును? నిష్కారణము గా విప్రబాలకుం గఱచినయీదురితంబు నీదేహ మెల్లం జుట్టుకొని, నీయహంకారపంక మింకున ట్లెంతవరకును నీ కాహారముగా నున్నభేకముల నీతలను మోపించి దయామతి నవి యొసఁగిన యాహారము నే నీచేతం గుడిపించుఁ గావుత' మని రోషావేశంబున ఘోరశాపంబిచ్చెను. పాముల బాముల నే మందును? ఆశాపాతకంబు లశనిపాతంబువోలె నాకర్ణంబులఁ జూడి హృదయ భేదనంబు గావింప, నాయొడలు నావశము గాక కాళ్ళు లేనివానివలెఁ గదల లేక మెల్లమెల్లఁగాఁ బ్రాకుచు

మీకృప నాశ్రయింప వచ్చితిని. దైవోపహతుండ నయి మీపాలం బడిననన్నుం జేయి విడువక, మీవాహనముంగాం జేకొని యాహారదానంబు చేయుచు రక్షింపుచుండిన, ఎప్పుడును మీపాదములకొలువు సేయుచుండుదు." అనుడు జలపాదుం డుప్పొంగి యారోహణకౌతూహలంబు తన్నవివేకిం జేయ దుష్టోరగంబుమాయావాగురం దగులుకొని దానియనుకువ కీకొనియెను. అంత నమ్మందవిషుండును జలపాదుని నిజభోగమున వహించి, కొండొకవడి చిత్రప్రచారంబున నిందు నందుం ద్రిప్పి లేనిబడలిక తెచ్చుకొని రోంజుచుం దల వ్రేలవైచి యూరకుండెను. జలపాదుం డంతయుం జూచి, నీవేల యిట్లు నడవంజాల కున్నావని యడిగెను. మందవిషుండు: "స్వామీ! నిన్నటి నుండి కబళమాత్రం బయిన నాహారంబు లభింపమింజేసి, శుష్కోపవాసంబున న్మాడుచు జవసత్త్వంబు లుడిగి జీవచ్ఛవంబనై యున్నవాండను. కటికియాంకట నకనకం బడునా కిప్పు డాహారంబు దయచేసినంగాక, వాహనకృత్యం బెట్లు నిర్వహింపం గలుగుదును? కడుపు నిండినమీందట మఱి నాచిత్రపదక్రమంబు దేవర చిత్తగింప వలయు." అనిన, నావాక్యంబులు నిజమ్ములని నమ్మి, యంతరంగంబు గరంగినవాండయి జలపాదుం డిట్లనియె: "ఓభుజంగపుంగవా! నే నొక్కమాట చెప్పెదను వినుము. మధ్యమధ్య నీవు నన్నడుగవలసిన పనిలేదు. కడుపుంజిచ్చు దరికొనునప్పుడెల్ల వలసినన్ని మండూకంబుల భక్షింప నొక్కసారిగా నీకిదె యాజ్ఞయొసంగినాండను. ప్రతిదినంబును నీయిచ్చ వచ్చినన్నిటిం గొన వచ్చును. ఇప్పుడు పోయి యథేప్సితంబుగ నాహారంబు గైకొనివచ్చి, మరల వాహనకార్యంబునం బ్రవర్తిల్లుము." అనిన మహాప్రసాదం బని జలమధ్యంబునం బ్రవేశించి, కడుపు దీఱం జిఱుకప్పలం గొన్నిటిం గిటుకు రన మ్రింగి జఠరానలం బార్చుకొని

మండూకరాజు నెదుర నిలిచెను. ఈప్రకారము యథేచ్ఛను బ్రతిదిన మును వలసినన్నిటిని దిగ మ్రింగుచుఁ, దొలుత సన్నగాండ్రను బిదప బలవంతులను దదనంతరము మంత్రులనుగా దిన క్రమమున జలపాదావ శేషంబుగా హ్రదంబు నిర్మండూకంబు గావించి, కట్టకడపట నాకప్పల ఱేనిని సహితము కూయిడం బట్టుకొని మేనిమాంసం బాప్యాయనంబుగ మెక్కి, యిప్పటికి నావ్రతసమాప్తి యయ్యెఁగా యని సంతోషించుచు, ఆకొలను వెడలి యొండొకచోటికిం జనియెను.

నేనును మందవిషునిచందంబుననే యవమానంబున కోర్చుకొని, ప్రతిపక్ష కార్యవిఘాతం బొనరించి స్వకార్య ముద్ధరించితిని. బగ్గున మండుదవానలంబు వృక్షాగ్రంబులం గాల్చి విడుచుం గాని, వానిని నిర్మూలము గావింపఁ జాలదు; శైత్యశీల మయ్యును నదీ జలంబు తటస్థితవసుమతీజంబుల మూలంబులతోడఁ బెల్లగించును. కాఁబట్టి మంచిమాటలతో సాధింప వచ్చువానిని బరాక్రమశతంబుచే నైన సాధింపరాదు. అయినను హిరణ్యగర్భుఁడు సంధికిం దగినవాఁ డనియె నామతము. అని చెప్పి మేఘవర్ణుండు మిన్నకుండెను.

అంత మంత్రి దూరదర్శి చిత్రవర్ణునివంకఁ దిరిగి యిట్లనియె. "దేవా! సర్వవిధంబుల నిప్పుడు హిరణ్యగర్భునితో సంధి చేసికొని యాతని రాజ్యంబున నాతనినె యథాపూర్వముగా నిలుపుట శ్రేయస్కరము. మొన్న నీనడుమఁ గర్పూరద్వీపమున నుండి యొకబకంబు సింహళద్వీపాధినాథుం డగు మహాబలునికడకుం బంపఁబడియె నని చారులవలన నేఁటి యుదయమునను విన్నాఁడను. విచారించి చూడ హిరణ్యగర్భుం డచ్చటికి దూత నంపుట, మనతో యుద్ధము చేయ సారసరాజును సహాయుంబు వేఁడుటకై యుండును. మన యుపాహతో

నిజమయ్యె నేని, మహాబలుండును బూర్వ మొకసారి మనచే నవమానితుం డయి యున్నవాఁడె కావున మహాసంతోషముతో హిరణ్యగర్భునకుఁ దోడుపడు ననుటకు సందియము లేదు. వారిరువురుం గలిసికొని మనమీఁద దండు వెడలుట పొసంగునేని, ప్రస్తుతస్థితిని బట్టి విచారింప మనము వారిని గెలువఁ గలుగుట దుర్ఘటము. కాఁబట్టి హిరణ్యగర్భునితో సంధి చేసికొనుటయె యుత్తమపక్ష మని నాకుఁ దోఁచుచున్నది."

అనిన మందహాససుందరాననుం డయి చిత్రవర్ణుం డిట్లనియె. "హిరణ్యగర్భుఁ డెప్పు డాల మిచ్చి మనచేఁ బరాజితుఁ డయ్యెనో యప్పుడె రాజ్యాధికారపూజ్యతం గోలుపోయి మనకు సేవక ప్రాయుఁ డయ్యెను. అట్టివానిం బూజించి తెచ్చి మరల రాజ్యపీఠంబునం బ్రతిష్ఠింప వలసినంత యక్కఱ మన కిప్పు డేమి కలిగినది? అంత కలిగినప్పుడు పోలినట్లు చూచుకొందము. 'ఈనఁ గాచి, పొలమును నక్కలకుఁ బెట్టినట్లు, బాహుబలాధిక్యంబు పేరిమిని గష్ట పడి రణంబునం గెలుచుకొన్న రాజ్యంబును ఫలకాలంబున నొరునిపాలు సేయ నేల? ఈవిషయమున నక్రమముగాఁ బూనుకొని మహాబలుండు మనమీఁద ధ్వజ మెత్తినను నెత్తనిమ్ము. నాప్రతాపాలనంబు వేసిమి నాతఁ డింకొకసారి బాగుగఁ జవి చూచెడుంగాక!" అనుచుండ నొకశుకంబు రోఁజుచుఁ గొలువుఁగూటంబుదిక్కునకుం బఱతెంచుచు దూరమున నుండి "దేవా! సింహళద్వీపరా జనేకానీకంబులతోడ న్వాడలి వచ్చి మనపట్టణ మాక్రమింప నూరిబయల న్విడియుచున్నాఁడు." అని కేక వేసెను. రా జావాక్యము విని యులికిపడి 'యేమి యేమి' యని యాత్రముతో నడిగెను. కొలువువారును ససంభ్రమములై రి. అంతఁ జిలుకయు సమీపమునకు వచ్చి రాజుదిక్కు మొగము చేసి నమస్క-

రించి "దేవా! సింహళద్వీపరాజగు మహాబలుఁ డాకస్మికముగాఁ గోప కారణ మేమియు లేకయె మనమీఁద దండు వెడలివచ్చి, తనసేనల న్నగరంబువఱగడ న్విడియించు చున్నాఁడు. అతండు మనరాజధాని స్సమీపించువఱకును, మనవారి కెవ్వరికి నాతని రాక తెలియ దయ్యెను. వారిం జూచి యిప్పుడూరికావలివారలు రణసంభ్రమంబు నం బరిభ్రమించుచున్నవారు. నేను ఫలంబులు తేర వనంబునకుం జని ఫలంబులుకోయుచుఁ దోలుదోలుత నొక్కవృక్షాగ్రమునుండి దూరమునమిన్నను మన్నను నేకము సేయుచు లేచినధూళిం బొడ గాంచితిని; డోలాందోళితమానసుండనయి దానికారణంబు యోచించు చుండ నింతలో గూఁతవేటుదూరమ్మున సైన్యకలకలంబు వినవచ్చె: పదంపడి బారులుతీరి మనప్రోలిదెసంజను దెంచుపక్షి వారంబులనాలో కించితిని; తదనంతరము పురోయాయి యయివచ్చినయొక బకంబు వలన నది మనవీ డాక్రమింప వచ్చినసారసాధ్యత్తుని సైన్య మగుటం దెలిసికొని, దేవర కాసమాచారమును నివేదింప వాయువేగమునం బఱతెంచితిని.' అని మరలఁ జెప్పెను.

అప్పు డమ్మయూరరాజు రౌద్రరసమూర్తియై లేచి, కొలువు కలయంజూచి యిట్లనియె — "దూరదర్శీ! నిన్ననో మొన్ననోకదా మహాబలుండు మనమీఁద దాడి వెడలి వచ్చి బవరంబునం బరాభ వంబు నొంది సేనల నేలపాలు చేసికొని తాను మాత్రము ప్రాణంబు లతో నవ్వులఁ బడి నిజదేశముం జొచ్చినవాఁడు. దానినంతను నింత లోనే మఱచి తాను నొకమానిసి ననుకొని ప్రబలత్వాదుర్బలత్వంబులు తలంపక తగరువచ్చి కొండను దాఁకినట్లు మరల మనమీఁద నే మొగంబున వచ్చి దండు వెడలినాఁడు! చూచితివా యాతనికండ కావరము! మన మిప్పుడపోయి యీమత్తునిజన్యంబు చేసి నసై

స్యంబుగా యమపురి కతిథిం గావింతము. అవార్యశౌర్యధుర్యుండ నగునాముందఱఁ దృణకల్పుఁ డగునీపక్షి యెంతటివాఁడు? ఈతని సైన్య మెంత? మున్ముంద యీవచ్చినవీరవారంబు నెల్ల ఫేరవంబుల కాహారంబు కావించి వచ్చి, పిదప సింహళద్వీపమునకుం గూడ దాడి వెడలి యీసారి తప్పక యాతనిరాజధానిం గూఁకటివేళ్ళతోఁ బెల్లగించి పేరు లేకుండ నేలమట్టము కావింతము.” అనిన సవినయంబుగా మంత్రి యిట్లనియె.

“ఇన్నాళ్ళవలెఁ గాదు. మొన్నటిపోరునఁ బేరు గలవారు పలువు రంతరించుటం జేసి మనసైన్య మిప్పుడు శూరశూన్యమై యున్నది. తామ్రచూడుండు పోయినతరువాత మనసేనలస్థితిగతుల నెఱిగి నడపి కార్యావసరంబున ధైర్యంబును శౌర్యంబును బాహువీర్యంబును మెఱయించి దళవాయితనంబు పూన సమర్థుం డగునూహాపోహవిచక్షణుఁ డొక్కఁడును నాకంటికిం గనఁబడకున్నాఁడు. అందుచే మన సైనికనికరంబులు బహునాయకత్వంబు గలిగి యున్నవి. ఎల్లకాలంబును సాహసంబు సాగిరాదు. శత్రు వొకప్పుడు లోఁబడినవాఁడె కదా యని తలంపం బనిలేదు; శిఖిశిఖాతప్తం బగుజలంబె పొంగివడి యాయగ్నిం జల్లార్చుచుండుట లోకధర్మము. శకటగతచక్రంబు తెఱంగునఁ గాలగతులం గ్రిందు మీఁదును మీఁదు గ్రిందును నగుచుండును. కరనిహతకందుకంబునకుం బోలె భూమిపయిం బడినదేహధారుల కందఱకును బడుచుండుటయు లేచుచుండుటయు నైసర్గికము. నేనింతదూరము చెప్పుట నాప్రాణములు వంచించి కాదు. శరదంబుం బోలె ఘనగర్జితము చేయుటవలనం గార్య మెప్పుడును గానేరదు: మహాత్ములు సావధానముగా సాధకబాధకమ్ముల సమ్మంత్రిముఖంబునఁ జక్కఁగా నాలోచించి, యర్థానర్థంబుల నూహించి,

రించి "దేవా! సింహళద్వీపరాజగు మహాబలుఁ డాకస్మికముగాఁ గోప
కారణ మేమియు లేకయె మనమీఁద దండు వెడలివచ్చి, తనసేనల
న్నగరంబుపఱిగడ న్విడియించు చున్నాఁడు. అతండు మనరాజధాని
న్సమీపించువఱకును, మనవారి కెవ్వరికి నాతని రాక తెలియ
దయ్యెను. వారిం జూచి యిప్పుడూరికావలివారలు రణసంభ్రమంబు
నం బరిభ్రమించుచున్నవారు. నేను ఫలంబులు తేర వనంబునకుం
జని ఫలంబులుకోయుచుఁ దొలుదొలుత నొక్కవృక్షాగ్రమునుండి
దూరమునమిన్నును మన్నును నేకము సేయుచు లేచినధూళిం బొడ
గాంచితిని; డోలాందోళితమానసుండనయి దానికారణంబు యోచించు
చుండ నింతలో గూఁతవేటుదూరమ్మున సైన్యకలకలంబు వినవచ్చె:
వడంపడి బారులుతీరి మనప్రోలిదెసంజనుదెంచువక్షివారంబులనాలో
కించితిని; తదనంతరము పురోయాయి యయివచ్చినయొక బకంబు
వలన నది మనవీ డాక్రమింప వచ్చినసారసాధ్యక్షునిసైన్య మగుటం
దెలిసికొని, దేవర కాసమాచారమును నివేదింప వాయువేగమునం
బఱతెంచితిని.' అని మరలఁ జెప్పెను.

అప్పు డమ్మయూరరాజు రౌద్రరసమూర్తియై లేచి, కొలువు
కలయంజూచి యిట్లనియె — "దూరదర్శీ! నిన్ననో మొన్ననోకదా
మహాబలుండు మనమీఁద దాడి వెడలి వచ్చి బవరంబునం బరాభ
వంబు నొంది సేనల నేలపాలు చేసికొని తాను మాత్రము ప్రాణంబు
లతో వప్రులఁ బడి నిజదేశముం జొచ్చినవాఁడు. దానినంతను నింత
లోనే మఱచి తాను నొకమానిసి ననుకొని ప్రబలత్వదుర్బలత్వంబులు
తలంపక తగరువచ్చి కొండను దాఁకినట్లు మరల మనమీఁద నే
మొగంబున వచ్చి దండు వెడలినాఁడు? చూచితివా యాతనికండ
కావరము? మన మిప్పుడపోయి యీమత్తునిజన్యంబు చేసి న్సై

న్యంబుగా యమపురి కతిథిం గావింతము. అవార్యశౌర్యధుర్యుండ నగునాముందఱఁ దృణకల్పుఁ డగునీపక్షి యెంతటివాఁడు? ఈతని సైన్య మెంత? మున్ముందఱ యీవచ్చినవీరవారంబునెల్ల ఘోరవంబుల కాహారంబు కావించి వచ్చి, పిదప సింహళద్వీపమునకుం గూడ దాడి వెడలి యీసారి తప్పక యాతనిరాజధానిం గూఁకటివేళ్ళతోఁ బెల్లగించి పేరు లేకుండ నేలమట్టము కావింతము.” అనిన సవినయంబుగా మంత్రి యిట్లనియె.

“ఇన్నాళ్ళవలెఁ గాదు. మొన్నటిపోరునఁ బేరు గలవారు పలువు రంతరించుటంజేసి మనసైన్య మిప్పుడు శూరశూన్యమై యున్నది. తామ్రచూడుండు పోయినతరువాత మనసేనలస్థితిగతుల నెఱిగి నడపి కార్యావసరంబున ధైర్యంబును శౌర్యంబును బాహువీర్యంబును మెఱయించి దళవాయితనంబు పూన నర్హుం డగునూహాపోహావిచక్షణుఁ డొక్కఁడును నాకంటికిం గనఁబడకున్నాఁడు. అందుచే మన సైనికనికరంబులు బహునాయకత్వంబు గలిగి యున్నవి. ఎల్లకాలంబును సాహసంబు సాగిరాదు. శత్రు వొకప్పుడు లోఁబడినవాఁడె కదా యని తలంపం బనిలేదు; శిఖిశిఖాతప్తం బగుజలంబె పొంగిపడి యాయగ్నిం జల్లార్చుచుండుట లోకధర్మము. శకటగతచక్రంబు తెఱంగునఁ గాలగతులం గ్రిందు మీఁదును మీఁదు గ్రిందును నగుచుండును. కరనిహతకందుకంబునకుం బోలె భూమిపయిం బడినదేహధారుల కందఱకును బడు చుండుటయు లేచుచుండుటయు నైసర్గికము. నేనింతదూరము చెప్పుట నాప్రాణములు వంచించి కాదు. శరదంబుం బోలె ఘనగర్జితము చేయుటవలనం గార్య మెప్పుడును గానేరదు: మహాత్ములు సావధానముగా సాధకబాధకముల న్మంత్రిముఖంబునఁ జక్కఁగా నాలోచించి, యర్థానర్థంబుల నూహించి,

మఱి కార్యనిశ్చయమ్ము చేయుదురు. రాజు తానెంత బలవంతుఁడయినను, బలువురురాజులతో వివాదము పెట్టుకొనరాదు; పెట్టుకొనెనేని, నిశ్చయముగా దురంతము నొందును. సర్ప మెంత బలవంతమయ్యును, చలిచీమలచేతం జిక్కి యుక్కడుచుండ మనము చూచుచుండ లేదా? నిరర్థకవిరోధంబు సమర్థింపం జూడక దేవర యిప్పుడు నన్ననుగ్రహించి విగ్రహంబు మానవలయును. ఎవఁడు కార్యాకార్యవిచారమును మాని, క్రోధమునే ప్రధానము చేసికొని యొక పనికిఁ బూనుకొనునో వాఁడు మొదల విచారింపక నకులమును జంపుకొని పిదప విషాదము నొందినబ్రాహ్మణునివలెనే కడపటఁ బశ్చాత్తప్తుఁ డగును. దేవర యాకథ చెప్పెద నవధరింపుఁడు.

గౌడదేశమునందలి యొకయగ్రహారమున దేవశర్మ యనుపేరుగల వేదజ్ఞుఁ డగువిప్రుఁ డొకఁడు గలఁడు. అతనికిఁ గొంతకాలము సంతానము లేనికొఱఁత యొక్కటియే కాని వేఱుకొఱఁత లేక యుండెను. అతనిభార్య యగుయజ్ఞసేని సంతానము లేని దయి, పుత్త్రులం గని పెంచు తనయీడుచేడియలం గని ముచ్చట పడుచు, బిడ్డలనిమిత్తము యోగులని వేషములు వేసికొనువారినెల్లఁ గాళ్ళుఁ గడుపులుం బట్టుకొని యాశ్రయించి వారిచే వేళ్ళు వెల్లంకులు గట్టించుకొనుచు, ఱాయి గన్న ఱాతికి గుడి గన్న గుడికి మ్రొక్కుచు, ఎవ్వరేతీర్థము పేరు చెప్పిన నచ్చటికిఁ బోయి మునిఁగి వచ్చుచు, లోకములో లేనినోములు వ్రతములు పట్టుచుండును. ఇట్లు కొంతకాలము గడిచినపిమ్మట, నాయింతి యీశ్వరానుగ్రహమువలన, గర్భవతియై యొక్కపుత్త్రకుం గనియెను. లేక లేక కలిగినసంతాన మగుటం జేసి, తల్లిదండ్రు లాచిన్నవానిని భూమిమీఁదికాలు నేలఁ బెట్టనీక ప్రాణములకంటె నెక్కువగా గారాబమునఁ బెంచుకొను చుండిరి. ఒకనాఁ డాబిడ్డను బా

లిచ్చి నిదుర పుచ్చి, యుయ్యలలోఁ బరుండఁబెట్టి మగనిని గావలి యుంచి యాజ్ఞసేని పొరుగువీధి నున్న తనపుట్టినింటికిఁ జూడఁబోయెను. నాఁడు పర్వదిన మగుటంజేసి రాజుదగ్గఱనుండి పార్వణశ్రాద్ధదాన మిచ్చుటకొఱకయి యాబ్రాహ్మణున కాహ్వానము వచ్చెను. సహజ దరిద్రుఁ డయిన యాశుద్ధశ్రోత్రియుఁ డప్పు డిట్లు చింతించెను. "రాక రాక నేఁటికాలమునకు భూపతికి నాయం దనుగ్రహము వచ్చి, సాహిత్యపరు లనేకు లుండ వారిం గాదని నాకే దాన మియ్యఁ దలఁచి వర్తమాన మంపెను. నన్ను భాగ్యవంతునిఁ జేయవలె నను తలంపుతో నేలిక పిలువనంపినపుడే, నాపాలిటి యభాగ్యదేవత సమయమున కీయసందర్భము తెచ్చి పెట్టినది. ఇఁకఁ బుట్టినింటనుండి నాభార్య వచ్చు టెప్పుడు? నేఁ బోయి దానము పట్టు టెప్పుడు? రాకున్న నేమి పోవుదు నన్న నిందాఁకఁ గంటికి ఱెప్పవలెనుండి కాపాడుకొనుచున్న పిల్లవానికడం గాపుండువారు లేరు; పోక మానెద నన్న భూపాలుఁ డాదానము నన్యుల కిచ్చివేయును. నాకొక్క యుపాయము తోఁచుచు చున్నది. బహుదినములనుండి కన్నబిడ్డవలెఁ బెంచుచున్న ముంగి యున్నదిగదా? ఈపెంపుడుముంగిని నాముద్దుఁబట్టికి రక్షక యుంచి కదిలిపోయి దానమును స్వీకరించి యింట నున్నట్టె పరుగెత్తుకొని వచ్చెదను." అని నిశ్చయించి, ముంగిసకు సనుకేతముగాఁ జెప్పి యాయర్భకునకుఁ గావలి పెట్టి, రాజమందిరమునకుం బోయెను. దానమునిమిత్త మేగిన రెండుగడియలును బ్రాహ్మణునకు శరీర మొక్కటియె రాజమందిరమున నుండెను గాని చిత్త మంతయు నింటిమీఁదను గొమారునిమీఁదనె యుండెను. ఇంతలో నొకకృష్ణ సర్పము మిద్దెమీఁదినుండి యుయ్యాలచేరులగుండ బాలుఁడు నిద్ర పోవుచున్న పాన్పుమీఁదికిఁ బ్రాఁకి వచ్చుచుండెను. దానిని

ముంగిస చూచి యొక్కయెగు రెగిరి మెడపట్టుకొని కొఱికి ముక్కలు చేసి క్రిందఁ బడ వైచెను. అంత నాబ్రాహ్మణుఁడును రాచనగరం గానుపీసములు గ్రహించి, కొడుకుమీఁదిప్రేమ తన్నుఁ ద్వరపెట్ట నేలమీఁద నడుగులు మోపక డోలాయమాన మానసుం డయి మహావేగముతో వచ్చుచుండెను. ప్రభువుసుం దన స్వామియడుగులచప్పుడు విని, పాము నెత్తు రంటికొన్న నోటితో మార్గము పొడుగున రక్తబిందువులం జాఱ వీధిగుమ్మముదగ్గఱ కెదు రేగి, సంతోషముతో నాబాపనికాళ్ళవ్రేళ్ళం బడి పెనఁగఁ జొచ్చెను. రక్తవిలిప్తముఖం బగునకులంబును జూచి గుండెలు తటతటఁ గొట్టుకొన, భీతిపరీతచేతస్కుం డయి యాపాఱుఁడు తనకొమారునినె యా నకులంబు చంపి వచ్చెనని యెంచుకొని, పెంచిన విశ్వాసమయిన లేక నాముద్దుఁ బట్టి నెత్తురుఁగందు నట్లు గఱచితి వని దురహంకారంబున జేరువ నున్న దుడ్డుకఱ్ఱను హస్తమున నంకించి నకులమును మోఁదెను. ఆమోఁదు శిరంబునం దగుల గ్రుడ్లు వెడలఁ బెట్టి, నేలం బడి విలవిలఁ దన్నుకొనుచు నొక్కపెద్దయఱ పఱచి నకులము ప్రాణము విడిచెను. అట్లాముంగియుసుఱుఁ గొని యాభూసురుఁడు నందనుని కయి ప్రలాపించుచు లోనికిం జని తలిమంబునఁ జెక్కుచెమర్పకుండ నిదురించుచున్న బాలకునిఁ గని, ప్రమోదమానమానసుం డయి, పదంపడి డోలాసమీపంబున ఖండఖండము లయి పడి యున్న నల్లత్రాఁచును జూచి చోద్యపడి, కలరూపు తెలిసికొని శోకోద్రేకమ్మున నురమ్మును శిరమ్మును హస్తతలమ్ములను మోఁదుకొనుచు నెందు నెవ్వరికిఁ గలుఁగని కలుషము తన కొదవెంగా యని పెద్దతడవు రోదనము చేయఁ దొడఁగెను. కాఁబట్టి యేకార్యమును సాహసముగా విమర్శింపక త్వరపడి చేయరాదు.

అని దూరదర్శి చెప్పిన విని యించుక యనుమానించి, శిఖండి ప్రకారుం డిట్లనియె. 'మంత్రివరా! నీవిప్పుడు చెప్పిన దంతయు నాదరణీయముగనే కానవచ్చుచున్నది. కాని శత్రు వొక్కఁడు మనపట్టణముమీఁద దండు వెడలి వచ్చి దాని నాక్రమింప నుపక్రమించు చుండఁగా దీర్ఘాలోచన చేసి కార్యనిశ్చయంబు చేయువలయు నని జాగు చేయు చుండుట పాడిగాఁ గనుపట్టదు. మన యాలోచన కుదురు నప్పటికిఁ బురము దొద్దఁ బోవచ్చును. కాఁబట్టి ముందుగా నేరీతి నయిన నాతనిం బాఱఁదోలు సాధనము చూచుట ముఖ్యకర్తవ్యము. ఇప్పుడు వచ్చినయాపదను దొలఁగించుకొన్న తరువాత హిరణ్యగర్భుని సంగతి చూచుకొందము. నాకుంజూడ వీరవారంబుం గూరుచుకొని పోయి వైరిం దారసించి పౌరుషంబు నెఱపుటకన్న వైరవారణంబునకుం దగినయుపాయం బన్యం బున్నట్టు కనుపట్టదు. అయినను నీబుద్ధిప్రచారంబునకు గోచరమయిన దేమయినం గలిగినఁ దెలుపుము. ఆలోచించి సర్వసమ్మతమయిన పక్షము నవలంబింతము.' అనిన దాక్షాయ్యనాయకుం డిట్లనియె.

"మనము హిరణ్యగర్భునితోడం బోరి గెలుపు గొన్నవార మయ్యును, మన గెలు పోక గెలు పని సంతోషింప రాదు. ఏల యనిన—మనపాలం గల యోధవారంబులోఁ బేరు గలవారు పెక్కండ్రాలము చేసి స్వర్గస్థు లయిరి; ఉన్న వారిలోను బలువురు కాయంబుల నిండ గాయంబులు గలవా రయి పోరికిం బనికి రానివా రయిరి. ఇట్టి యశక్తులను వెంటఁ బెట్టుకొని పోయి, మేమే శూరుల మని సాహసంబున వైరిం దలపడుదు మేని మనవారు శరీరంబు కాన పడక యోపినంతవట్టు పోరాడినను దుదను బరాభవంబు నిశ్చయము. ఈ మహాబలుం డిప్పుడు మనమీఁద దాడి వెడలుట, హిరణ్యగర్భుని

మంత్రి యైన సర్వజ్ఞుని ప్రేరణము చేతం గాని స్వబుద్ధిచేతం గాదు. తనతోంటి విరోధంబు సాధించు కొనవలయు ననను ద్దేశంబును దానికిం గొంత తోడుపడి యుండ వచ్చును. అయినను దనమిత్ర మనోరథం బీడేఱు నేని యీతండు సంతుష్టుం డయి తనపురికి మరలఁ గలవాఁ డగుట సందియము లేదు. మన మిప్పుడు హిరణ్యగర్భుని సమాధాన పఱుచు కొనుయత్నంబు చేయుటయె ప్రధానామపేయ మయిన కార్యము. కాఁబట్టి మున్ముందు యాహంసస్వామిపాలికి మనదూత యరుగవలయును; అట్లరుగుదూత కార్యసంఘటనం బొనర్చుకొని మరల మనలం జేరుటకు లోపలనె యీమహాబలుని దళముల వలన నొకటి పుట్టకుండ నీక్షణంబ సారసరాజు నొద్ద కొక రాయబారిఁ బంపుదము. ఇట్లు చేసిన సకలము ననుకూలముగా నడచును.” అనిన రాజును నానని యీకొనియెను. అప్పుడే రాజానుమతంబున మంత్రి యరుణముఖుని రప్పించి మహాబలునితోడం బలుక వలయు పలుకుల నెల్లం దేటపడఁ గఱపి, కార్యంబు పొత్తు పఱుచుకొనిరమ్మని పంచిన, నాతండును వినయవేషంబునం జని నగరంబు పఱగడ నొక్క వనంబున నున్నస్కంధావారంబుం దఱిసి, సేనారక్షకులకుం దనవచ్చిన కార్యంబు చెప్పి యెల్ల సైనికులును మూఁకలు గట్టి తన్నుఁ జూచు చుండఁ దన్మధ్యంబున నొక్కచోఁ జందనతరు సమీపంబున లతాగృహంబున వసియించి యున్న మహాబలునిన్ ద్వారపాలకుల వెంబడిం బోయి సందర్శించి నమస్కరించి, యాతనియాజ్ఞానుసారముగా సమీపంబున గూరుచుండి చేతులు జోడించి యిట్లనియె.

“దేవా! జంబూద్వీపాధినాథు లగుచిత్రవర్ణ మహారాజుల వారు తాముగ దేవరివారితోడ నాడు మన్నమాటల విన్నవించెద; అవధానముతోఁ జిత్తగింపుఁడు. ఇరుగు పొరుగుల దేశముల కెలికల మయిన

మనము మనలో నిట్లు దుర్మాత్సర్యంబు వాటించి మానవధర్మమును మఱచి లోకులు మనలం దల లెత్తి చూడ జగడము లాడు చుండుట యుచితము గాదు. మన మైకమత్యంబువేర్మిని సోదరభావంబు గూర్చి యుందు మేని, ముల్లోకము లొక్కటట నెత్తి వచ్చినను గలన మ్మనలఁ జేఱి చూడఁ గలవే? పూర్వమే వేళావిశేషముననో మనమనసులలోఁ గ్రోధాగ్ని పొడచూపి, మెల్ల మెల్లఁగా రాఁజి ప్రజ్వరిల్లి యుద్ధరూపమునం బయ ల్వెడలి యుభయపక్షములవారిం గొందఱ దహించి యప్పటి కాఱినది; ఆఱి పోయినదాని న్మరల మండఁ జేయుచు మన మనస్సీమలఁ గోపంబులు గాపురం బుండ నిచ్చుట యుభయులకును క్షేమకరము గాదు. ఇకముందు మనమనోన్యోన్యస్నేహము నవలంబించి మీమాట మేమును మామాట మీరును జెల్లించుచుఁ గూడి మనుట మాయభిమతము. కర్పూరద్వీపాధీశ్వరుం డగు హిరణ్యగర్భుఁడు మన కిరువురకుఁ బ్రాణమిత్రుఁడుగా నుండఁ దగినవాఁడు. అతనిరాజ్యం బాతని కిచ్చితి మని తెలిపి, మాతోడ సంఖ్యంబు నెఱప నాతనినడుగ నేఁడె దూతను బంపు చున్నారము."

అని చెప్పి యూరకున్నఁ మహాబలుండును గొంతవడి చింతించి, తనబలంబులు మార్గాయాసంబునం బడలి యుంటఁజేసియుఁ దనవచ్చిన కార్యం బనుకూలముగా ముగియుచిహ్నములు కానఁబడు చుంటం జేసియు సంధిచేసికొనుటయే యప్పటికుచిత మని నిశ్చయించి, పూర్వ వైరంబు మాని సంధి కియ్యకొనియెను. అప్పుడు మహాబలచిత్రవర్ణులకుఁ గపాలసంధి యయ్యెను.

తరువాతఁ జిత్రవర్ణుండు తనమంత్రితో నాలోచించి, యుచిత గతిని హిరణ్యగర్భునివేర నొకలేఖ వ్రాసి, తల్లేఖం గొని పోయి హంసస్వామితో యుక్తక్రమంబున సంభాషించి కార్యంబు పొందు

పటుచుకొని రా నరుణముఖుండె తగినవాఁ డని యెంచి, అతనినె పయి నంబుచేసి క్రమ్మఱఁ గర్పూరద్వీపంబునకుఁ బంపి యాతనిపునరాగ మనంబున కెదురు చూచుచు దినము లెన్ను చుండెను. అతండును, గతిపయప్రయాణంబులఁ గప్పూరపుదీవిం జేరి, రాజధానిం బ్రవేశించి, ముందుగా మంత్రిసందర్శనంబు చేసి నిజాగమనకారణంబు తెలిపి, యాతండు తన్ను వెంటఁ బెట్టుకొని పోవ హిరణ్యగర్భుని రహస్య వాసంబుఁ జొచ్చి, యచ్చట నాప్తవర్గంబుతో నిష్టకథాప్రసంగంబులఁ గాలక్షేపంబు చేయు చున్న హంసాధ్యక్షుని వీక్షించి, నమస్కార పూర్వకంబుగాఁ దన్నెఱిఁగించుకొని, మితహితోక్తుల నిట్లనియె. "జంబూద్వీపాధినాథుండు చిత్రవర్ణుండు దేవర సుగుణసంపదను బలు వురు ప్రశంసింపఁ బూర్ణమనంబుతో నాకర్ణించి, దేవరతోడిమైత్రి నపేక్షించి నన్నిటకుం బుత్తెంచెను. నేఁడు మొదలుకొని యథాపూర్వ ముగా దేవరవారు కర్పూరద్వీపరాజ్యాధికారంబు మరల వహియించి, లోకోత్తరముగాఁ బ్రజాపాలనంబు గావించుచు మయూరస్వామి తోడి సౌహార్ద సౌఖ్యం బనుభవింప నర్హులు," అని లేఖం జేతి కిచ్చెను. దానిం బుచ్చుకొని హిరణ్యగర్భుండు మంత్రితో నాలోచించి తగిన ప్రత్యుత్తరంబు వ్రాసి ధవళాంగునిచేత నిచ్చి, 'నీవీయరుణ ముఖునితోడ జంబూద్వీపంబున కరిగి చిత్రవర్ణుని సందర్శించి యర్హ సంభాషణంబుల నాతని నలరించి యాజ్ఞ బిచ్చి రమ్మ'ని యానతి యొసఁగి, యరుణముఖుని నర్హసత్కారంబుల గారవించి చెప్పవలయు పలుకు లెల్లం జెప్పి, వీడుకొలిపెను.

అంత ధవళాంగుండును నరుణముఖుండును బయలు వెడలి, పరసపసంభాషణంబుల మార్గాయాసంబు వీసంబును గాన రాకుండ నడచి, కతిపయదినంబులకు జంబూద్వీపంబు చేరి చిత్రవర్ణుండు నిండు

గొలు వుండి యుండ నాతనిపాదసందర్శనంబు చేసికొని, సందేశంబు సమస్తంబును నివేదించి, కృతకృత్యు లయిరి. మహాబలుండును మిత్త్ర కార్యంబు సాధించుకొని చిత్త్రవర్ణుని మన్ననఁ బడసి, పరమానందభరి తుండయి సైన్యసమేతంబుగా నిజదేశంబునకుం జనియెను. నాఁడు మొదలుకొని మహాబలచిత్త్రవర్ణహిరణ్యగర్భు లన్యోన్యమైత్త్రిం బొడ లుచుఁ, బరస్పరక్షేమలాభంబులఁ బ్రతికాముఖంబులఁ దెలిసికొనుచుఁ జిరకాలము సుఖముగా రాజ్యపాలనంబు గావించిరి.

అని విష్ణుశర్మ సంధితంత్త్రమును ససాకల్యముగా వచియించి, మీరును సర్వసర్వంసహాపతులతోను సంధి కావించుకొని, మైత్త్రి మత్త్యంబు పెంపున సకలసౌఖ్యంబుల ననుభవింపుఁడనిన, రాజపుత్త్రు లెంతయు సంతసించి 'దేవరమూలమున నజ్ఞానాంధకారంబునుండి వెలువడి జ్ఞానభాను నందర్శింపఁ గంటి' మని విష్ణుశర్మను నుతియించిరి. అంత సనయు లయిన నృపతనయులఁ దనవెంటఁ దోడ్కొని పోయి, సుదర్శనున కర్పించి, విష్ణుశర్మ యాతనిచే సకలసన్మానంబులం బొంది, యొకయగ్రహారము బహుమానంబు వడసెను.

సంధితంత్త్రము, సంపూర్ణము.

---

# తర్కసంగ్రహము



క. శ్రీకళ్యాణగుణా
కరుఁడును సర్వజ్ఞ ♦ నార్తిహరుండున్,
శ్రీకరుఁడును నగు దేవునిఁ
బ్రాకటతాత్పర్యయుక్తి ♦ భజియింతు మదిన్.

---

౧. — ద్రవ్యము, గుణము, కర్మము, సామాన్యము, విశేషము, సమవాయము, అభావము, అని పదార్థము లేడు.

౨. — పృథివి, అప్పు (నీరు,) తేజస్సు, వాయువు, ఆకాశము, కాలము, దిక్కు, ఆత్మ, మనస్సు, అని ద్రవ్యములు తొమ్మిది.

౩. — రూపము, రసము, గంధము, స్పర్శము, సంఖ్య, పరిమాణము, ప్రథక్త్వము (వేఱుపాటు,) సంయోగము, విభాగము, పరత్వము (దూరత్వము,) అపరత్వము, (సామీప్యము,) గురుత్వము, ద్రవత్వము, స్నేహము, శబ్దము, బుద్ధి, సుఖము, దుఃఖము, ఇచ్ఛ, ద్వేషము, ప్రయత్నము, ధర్మము, అధర్మము, సంస్కారము. అని గుణము లిరువది నాలుగు.

౪. — ఉత్క్షేపణము (ఎగఁజిమ్ముట,) అవక్షేపణము (దిగఁద్రోయుట,) కుంచనము (ముడుచుట,) ప్రసారము (చాఁచుట,) గమనము (నడక,) అని కర్మము లయిదు.

౫. — పరము, అపరము, అని సామాన్యము ద్వివిధము.

౬. — నిత్యద్రవ్యములయం దుండు విశేషము లనంతములు.

౭. — సమవాయ మేకవిధము.

౮. — ప్రాగభావము (పూర్వమున లేకుండుట,) ప్రధ్వంసాభావము (నశించుటచే లేకుండుట,) అత్యంతాభావము (అసలే లేకుండుట,) అన్యోన్యాభావము, అని యభావము చతుర్విధము.

౯. — ద్రవ్యములలో గంధముకలది పృథివి. అది నిత్య, అనిత్య, అనిద్వివిధము. పరమాణురూపమయినదినిత్య; కార్యరూపమయినది యనిత్య. శరీర, ఇంద్రియ, విషయ, భేదములవలన ననిత్య మరలఁ ద్రివిధము. మనుష్యులు మొదలగువారిది శరీరము; నాసాగ్రవర్తియయి, గంధగ్రాహక మయిన ఘ్రాణ మింద్రియము; మృత్పాషాణాదికము విషయము.

౧౦. — శీతస్పర్శముగలది యప్పు (జలము.) అది నిత్య, అనిత్య, అని ద్వివిధము. పరమాణురూప మయినది నిత్య; కార్యరూప మయినది యనిత్య. శరీరము, ఇంద్రియము, విషయము, అనుభేదములవలన ననిత్య మరలఁ ద్రివిధము. శరీరము వరుణలోకమునం దుండును; జిహ్వాగ్రవర్తియయి, రసగ్రాహక మయిన రసన యింద్రియము; నదీ సముద్రాదికము విషయము.

౧౧. — ఉష్ణస్పర్శముగలది తేజస్సు. అది నిత్యము, అనిత్యము, అని ద్వివిధము. నిత్యము పరమాణురూప మయినది; అనిత్యము కార్యరూప మయినది. శరీరము, ఇంద్రియము, విషయము, అను భేదములవలన ననిత్యము త్రివిధము. శరీర మాదిత్యలోకమునం దుండును; కృష్ణతారాగ్రవర్తియయి, రూపగ్రాహక మయిన చక్షు రింద్రియము; భౌమము, దివ్యము, ఔదర్యము, ఆకరజము, అను భేదముల వలన విషయము చతుర్విధము, వహ్న్యాదికము భౌమము, విద్యు (మెఱుపు) దాదికము దివ్యము, తిన్న దానిని జీర్ణముచేయుటకు హేతు

వయి యుదరమునం దుండునది యౌదర్యము; సువర్ణాదిక మాకరజము.

౧౨. — రూపరహిత మయి స్పర్శముకలది వాయువు. అది నిత్యము, అనిత్యము, అని ద్వివిధము. పరమాణురూప మయినది నిత్యము; కార్యరూప మయిన దనిత్యము. శరీరము, ఇంద్రియము, విషయము, అనుభేదములవలన ననిత్యము త్రివిధము. శరీరము వాయులోకమునం దుండును; సర్వశరీరవర్తి యయి, స్పర్శగ్రాహక మైనత్వక్కు ఇంద్రియము; వృక్షాదికంపనహేతువు విషయము.

౧౩. — శరీరములోపల సంచరించువాయువు ప్రాణము; అది యొక్కటియే యయినను, ఉపాధిభేదములవలనఁ బ్రాణాపానాది సంజ్ఞలను బొందుచున్నది. [ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము. అను పంచవాయువులును పంచప్రాణము లనఁబడును.]

౧౪. — శబ్దగుణము కలది యాకాశము, అదియొక్కటి యయి, అంతటను వ్యాపించి నిత్య మయి యుండును.

౧౫. — అతీతము (భూతము) మొదలయిన వ్యవహారమునకు హేతు వయినది కాలము. అది యేక మయి సర్వవ్యాప్త మయి, నిత్య మయి యుండును (భూతము, భవిష్యత్తు, వర్తమానము, ఇవి యతీతము మొదలయినవి.)

౧౬. — తూర్పు మొదలయినవ్యవహారమునకు యోగ్య మయి నది దిక్కు. అది యేకమయి, సర్వవ్యాప్తమయి, నిత్యమయి యుండును, (తూర్పు, పడమర, ఉత్తరము, దక్షిణము, ఇవి తూర్పు మొదలయినవి.)

౧౭. — జ్ఞానాధికరణ (ఆధార) మయిన దాత్మ, అది పరమాత్మ, జీవాత్మ, అని ద్వివిధము. అం దీశ్వరుఁడును సర్వజ్ఞుఁడు నయినపర

మాత్మ యొక్కటియే; జీవాత్మ ప్రతిశరీరము నందును భిన్నమయి యుండును; అది సర్వత్ర వ్యాపించి నిత్యమయి యుండును.

౧౯. — సుఖదుఃఖాదులను బొందుటకు సాధన మైనయింద్రియము మనస్సు. అది ప్రత్యాత్మయందు నుండుటచేత ననంత మయి పరమాణురూపమై నిత్యమై యుండును.

౧౯. — చక్షు (కన్ను) ర్మాత్రముచే గ్రహింపఁ దగినగుణము రూపము. అది శుక్లము, నీలము, పీతము, రక్తము, హరితము (ఆకుపచ్చ), కపిశము (కోతివన్నె), చిత్రము, అనుభేదములవలన సప్త విధము. అది పృథివియందును, జలమునందును, తేజస్సునందును, ఉండును. వానిలోఁ బృథివి యందు సప్తవిధముల నుండును; జలమునం దభాస్వరశుక్ల మయి యుండును; తేజస్సునందు భాస్వరశుక్ల మయి యుండును.

౨౦. — రసన (నాలుక) చే గ్రహింపఁ దగినగుణము రసము. అది మధురము, ఆమ్లము (పులుసు), లవణము, కటువు (కారము), కషాయము (ఒగరు), తిక్తము (చేదు), అనుభేదములవలన షడ్విధము. అది భూమియందును, జలమునందును, ఉండును. అందు భూమియందు షడ్విధము; జలమునందు మధురముమాత్రము.

౨౧. — ఘ్రాణము (ముక్కు) చే గ్రహింప, దగినగుణము గంధము. అది సురభి (పరిమళము), అసురభి (కంపు), అని ద్వివిధము. అది పృథివియందుమాత్ర ముండును.

౨౨. — త్వగింద్రియమాత్రముచే గ్రహింపఁ దగినగుణము స్పర్శము. అది శీతము, ఉష్ణము, అనుష్ణాశీతము, అనుభేదమువలనఁ ద్రివిధము. అది పృథివియందును, అప్పునందును, తేజస్సునందును,

వాయువునందును, అందు శీతము జలమునందును, ఉష్ణము తేజస్సునందును, అనుష్ణాశీతము పృథివీవాయువుల యందును నుండును.

౨౩. — పృథివియందు పాకజనిత మైన రూపాదిచతుష్టయము (రూప, రస, గంధ, స్పర్శములు) అనిత్యము. ఇతరస్థలములయందపాకజనిత మయినది నిత్యానిత్యభేదమును గలిగి యుండును. నిత్యగత మైనది నిత్యము; అనిత్యగత మైన దనిత్యము.

౨౪. — ఏకాదివ్యవహారహేతువయినది సంఖ్య. అది తొమ్మిది ద్రవ్యములయందుండి, యేకత్వము మొదలు పరార్ధముపఱకు నుండును. ఏకత్వము నిత్యమును, అనిత్యమును అయి యుండును. నిత్యగత మయినది నిత్యము; అనిత్యగత మయినది యనిత్యము. ద్విత్వాదిక మంతట నిత్యము.

౨౫. — మానవ్యవహారకారణ మయినది పరిమాణము. అది తొమ్మిదిద్రవ్యములయందు నుండును. అది, అణువు, మహత్త్వ, దీర్ఘము, హ్రస్వము, అని చతుర్విధము.

౨౬. — పృథగ్వ్యవహారకారణము పృథక్త్వము. అది సర్వద్రవ్యములయందు నుండును.

౨౭. — సంయుక్తవ్యవహారమునకు హేతు వయినది సంయోగము. అది సర్వద్రవ్యములయందు నుండును.

౨౮. — సంయోగనాశకగుణము విభాగము. అది సర్వద్రవ్యములయందు నుండును.

౨౯. — పరాపరవ్యవహారాసాధారణకారణము పరాపరత్వము. అది పృథివ్యాదిచతుష్టయమునందును, మనస్సునందును, ఉండును. అది దిక్కృతము, కాలకృతము, అని ద్వివిధము. దిక్కృత మయిన పరత్వము దూరస్థ మయిన వస్తువునం దుండును; దిక్కృత మయిన

యపరత్వము సన్నిహితవస్తువునం దుండును. కాలకృత మయిన పర త్వము జ్యేష్ఠవస్తువునం దుండును; కాలకృత మయిన యపరత్వము కనిష్ఠవస్తువునం దుండును.

30.—ఆద్యపతనమున కసమవాయికారణ మయినది గురుత్వము. అది పృథివీజలములయం దుండును.

31.—ఆద్యస్యందనము (కారుట) న కసమవాయికారణ మయి నది ద్రవత్వము. అది పృథివీజల తేజస్సులయం దుండును. అది సాంసిద్ధికము, నైమిత్తికము, అని ద్వివిధము. సాంసిద్ధికము జలమునం దుండును. నైమిత్తికము పృథివీతేజస్సులయం దుండును. పృథివీ సంబంధు లయిన ఘృతాదులయందు ద్రవత్వ మగ్నిసంయోగజము; తేజస్సంబంధు లైన బంగారము మొదలైనవాని యందును ద్రవత్వ మగ్నిసంయోగజము.

32.—చూర్ణాదులు ముద్ద యగుటకు హేతు వయిన గుణము స్నేహము. అది జలమునందుమాత్ర ముండును.

33.—శ్రోత్రము (చెవి) చేత గ్రహింపఁ దగిన గుణము శబ్దము. అది యాకాశమునందు మాత్ర ముండును. అది ధ్వన్యాత్మకము, వర్ణాత్మకము, అని ద్వివిధము. ధ్వన్యాత్మకము భేర్యాదులయం దుండును; వర్ణాత్మకము సంస్కృతభాషాదిరూప మయినది.

34.—సర్వవ్యవహార హేతు వైన జ్ఞానము బుద్ధి. అది స్మృతి, అనుభవము, అని ద్వివిధము. సంస్కారమాత్రజన్య మయిన జ్ఞానము స్మృతి; తద్భిన్న మయిన జ్ఞాన మనుభవము. యథార్థము, అయథా ర్థము అని యనుభవజ్ఞానము ద్వివిధము. ఆయాగుణములు కలదాని యం దాప్రకార మయిన (ఆయాగుణములు కలవనెడి) యనుభవము యథార్థము—రజతమునందు రజతజ్ఞానము యథార్థము; ఇది యే

భ్రమ యనఁబడును. ఆయా గుణములు లేని వానియందు నాప్రకారమయిన (ఆయా గుణములు కల దనెడి) జ్ఞానము అయథార్థము — శుక్తియందు రజతజ్ఞాన మయథార్థము; ఇదియే భ్రమ యనఁబడును.

౩౭.—ప్రత్యక్షము, అనుమితి, ఉపమితి, శాబ్దము, అను భేదములవలన యథార్థానుభవము చతుర్విధము. ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, శబ్దము, అను భేదములవలనఁ దత్కరణము సహితము చతుర్విధము.

౩౮.—వ్యాపారవంతమైన యసాధారణకారణము కరణము. అనన్యథాసిద్ధకార్యనియతపూర్వవృత్తి కారణము; ప్రాగభావప్రతియోగి కార్యము.

౩౯.—సమవాయి, అసమవాయి, నిమిత్తము, అను భేదములవలన కారణము త్రివిధము. పటమునకు తంతువులవలెను, స్వగతరూపాదులకు పటము (బట్ట) వలెను, దేనినుండి సమవేత (సమవాయ సంబంధముగల) కార్యము పుట్టునో యది సమవాయి కారణము. పటమునకు తంతు (దారముల) సంయోగమువలెను, పటగతరూపమునకు తంతురూపమువలెను, కార్యముతోఁగాని కారణముతోఁగాని యేకార్థమునందు సమవేతమైన కారణ మసమవాయికారణము; పటమునకు కుంచెవలెను, మగ్గమువలెను, తదుభయభిన్నమైన కారణము నిమిత్తకారణము. ఈ త్రివిధకారణములలో నసాధారణమైన కారణ మేదో యదియే కరణము.

౪౦.—అందుఁ బ్రత్యక్షజ్ఞానకరణము ప్రత్యక్షము. ఇంద్రియార్థసన్నికర్షజన్యమైన జ్ఞానము ప్రత్యక్షము. అది నిర్వికల్పకము, సవికల్పకము, అని ద్వివిధము. ఇది యేదో యొకటి యనునట్లు నిష్ప్రకారక మైన

జ్ఞానము నిర్వికల్పకము; ఇతఁడు డిత్థుఁడు, ఇతఁడు బ్రాహ్మణుఁడు, ఇది నలుపు, అనునట్లు సప్రకారక మైన జ్ఞానము సవికల్పకము.

౪౨.—సంయోగము, సంయుక్తసమవాయము, సంయుక్తసమవేత సమవాయము, సమవాయము, సమవేతసమవాయము, విశేషణవిశేష్యభావము, అని ప్రత్యక్షజ్ఞానహేతు వయిన యింద్రియార్థసన్నికర్షము షడ్విధము. కంటికి ఘటము ప్రత్యక్ష మయినప్పుడు సంయోగసన్నికర్షము; చక్షుస్సంయుక్త మైన ఘటమునందు రూపముయొక్క సమవాయమువలన ఘటరూప ప్రత్యక్షమునందు సంయుక్తసమవాయసన్నికర్షము; చక్షుస్సంయుక్త మైన ఘటమునందు సమవేత మయిన రూపము రూపత్వమునకు సమవాయ మగుటవలన రూపత్వసామాన్య ప్రత్యక్షమునందు సంయుక్తసమవేత సమవాయ సన్నికర్షము; కర్ణరంధ్రమునం దుండెడియాకాశముయొక్క శ్రోత్రత్వమువలనను, శబ్దముయొక్క యాకాశగుణత్వమువలనను, గుణిగుణముల యొక్క సమవాయమువలనను శ్రోత్రమునకు శబ్దసాక్షాత్కార మయినప్పుడు సమవాయసన్నికర్షము; శ్రోత్రసమవేత మైన శబ్దమునందు శబ్దత్వముయొక్క సమవాయమువలన, శబ్దత్వసాక్షాత్కారమునందు సమవేతసమవాయసన్నికర్షము; భూతలము ఘటాభావమును గల దనుచో చక్షుస్సంయుక్త మైన భూతలమునందు ఘటాభావముయొక్క విశేషణత్వమువలన, అభావప్రత్యక్షమునందు విశేషణవిశేష్యభావసన్నికర్షము. ఈసన్నికర్షములవలనఁ గలిగినజ్ఞానము ప్రత్యక్షము. దీని కింద్రియము కరణము కాఁబట్టి యింద్రియము ప్రత్యక్షప్రమాణ మనుట సిద్ధము.

౪౩.—అనుమితియొక్క కరణ మనుమానము. పరామర్శజన్య మైన జ్ఞాన మనుమితి. వ్యాప్తివిశిష్ట పక్షధర్మతాజ్ఞానము పరా

మర్శము—ఎట్లనఁగా, ఆపర్వతము వహ్నివ్యాప్యమైన ధూమమును కలది యనుజ్ఞానము పరామర్శము; దానివలనఁ గలిగిన పర్వతము వహ్నిమంత మనుజ్ఞాన మనుమితి: ఎక్కడ ధూమ ముండునో యక్కడ వహ్ని యుండు నను సాహచర్య నియమము వ్యాప్తి వ్యాప్యముయొక్క పర్వతాదివృత్తిత్వము పక్షధర్మత.

౪౧—స్వార్థము, పరార్థము, అని యనుమానము ద్వివిధము. స్వానుమితి హేతువు స్వార్థము-ఎట్లనఁగా, తానే పలుమాఱు చూచుట చేత వంటయిల్లు మొదలైనవాని యం దెక్కడ ధూమ ముండునో యక్కడ నగ్ని యుండు నని వ్యాప్తిని గ్రహించి, పర్వతసమీపము నకుఁ బోయినవాఁడయి పర్వతమునందలి పొగను జూచి దానియం దగ్ని యుండునా యనిసందేహపడి, ఎచ్చటధూమముండునో యచ్చట నగ్నియుండు నన్నవ్యాప్తిని స్మరణకుఁ దెచ్చుకొనుచున్నాఁడు; తదనంతరము పర్వతము వహ్నివ్యాప్యధూమవంత మని జ్ఞానము కలుగుచున్నది; దీనినే లింగపరామర్శ మందురు; అందువలనఁ బర్వతము వహ్నిమంత మనెడు ననుమితి పుట్టుచున్నది; అది స్వార్థానుమానము ధూమమువలన నగ్నిని దానే యనుమానించి, పరులకు బోధించుట కొఱకుఁ బంచావయవమైనవాక్యమును బ్రయోగించినప్పు డది పరార్థానుమాన మగును—ఎట్లనఁగా,

(౧) పర్వతము వహ్నిమంతము;

(౨) ధూమవత్త్వమువలన;

(3) మహానసము (వంటయిల్లు) వలెనే యేది ధూమవంతమో యది యగ్నిమంతము;

(౪) ఇదియు నాలాగుననే;

(౫) కాఁబట్టి యిది (పర్వతము) యటువంటిదే (వహ్నిమంతము).

ఈవాక్యముచేఁ బ్రతిపాదిత మయినలింగమువలన రెండవదియు నగ్నిని ప్రతిపాదించుచున్నది.

౪౨. — ప్రతిజ్ఞ, హేతువు, ఉదాహరణము, ఉపనయము, నిగమనము, అనునయిదును పంచావయవములు. (౧) "పర్వతము వహ్నిమంత" మనునది ప్రతిజ్ఞ: (౨) "ధూమవత్త్వము వలన" ననునది హేతువు; (3) "మహానసమువలెనే యేది ధూమవంతమో యది యగ్నిమంత" మనునది యుదాహరణము; (౪) "ఇదియు నాలాగు ననే" యనునది యుపనయము; (౫) "కాఁబట్టి యిది యటువంటిదే" యనునది నిగమనము.

౪౩. — స్వార్థానుమితియందును పరార్థానుమితియందును లింగపరామర్శమే కరణము; కాఁబట్టి లింగపరామర్శ మనుమానము.

౪౪. — అన్వయవ్యతిరేకి, కేవలాన్వయి, కేవలవ్యతిరేకి, అని లింగము త్రివిధము. వహ్ని (నిప్పు) ని సాధింపఁదగినప్పుడు ధూమవత్త్వము (పొగ గలిగి యుండుట) వలెనే, అన్వయముచేతను వ్యతిరేకముచేతను వ్యాప్తికలది యన్వయవ్యతిరేకి—మహానసము వలెనే యెచ్చట ధూమ ముండునో యచ్చట నగ్ని యుండు ననుచోటనన్వయవ్యాప్తి; మహాహ్రదమువలెనే యెచ్చట నగ్ని లేదో యచ్చట ధూమము లేదనుచోట వ్యతిరేకవ్యాప్తి, అన్వయమాత్రవ్యాప్తిని గలది కేవలాన్వయి; ఎట్లనఁగా, పటమువలెనే ప్రమేయత్వము (తెలిసికోఁదగుట) వలన ఘటము పేరు పెట్టఁదగినదనుచోట, సర్వమునకును ప్రమేయత్వమును నభిధేయత్వమును (పేరు పెట్టఁదగుట) నుండుట

వలన ప్రమేయత్వాభిధేయత్వాదులకు వ్యతిరేకవ్యాప్తి లేదు. వ్యతిరేకమాత్రవ్యాప్తిని గలది కేవల వ్యతిరేకి; ఎట్లనఁగా,

(౧) పృథివి యితరములకంటె భిన్నమయినది;

(౨) గంధవత్త్వము (వాసనను గలిగి యుండుట) వలన;

(3) ఏది యితరములకంటె భిన్నము కాదో యది జలము వలెనే గంధవత్తు (గంధము కలది) కాదు;

(౪) ఇది (పృథివి) యాలాగున (గంధము లేనిదిగా) లేదు;

(౫) కాఁబట్టి యిది వాని (ఇతరముల) వంటిది కాదు.

గంధవత్త్వము పృథివీమాత్రవక్షమగుటవలన, ఏది గంధవత్తో యది తదితరములకంటె భిన్నమయిన దనుచో నన్వయదృష్టాంతము లేదు.

౪౫. — (అగ్ని నూహించుటకు) ధూమవత్త్వము హేతువయినప్పుడు పర్వతమువలె సందిగ్ధసాధ్యవంతము పక్షము, అందు (అదృష్టాంతమునందు) మహానసమువలె నిశ్చితసాధ్యవంతము సపక్షము; అందు మహాహ్రదమువలె నిశ్చితసాధ్యభావవంతము విపక్షము.

౪౬. — సవ్యభిచారము, విరుద్ధము, సత్ప్రతిపక్షము, అసిద్ధము, బాధితము, అని హేత్వాభాసము లయిదు. ఏకాంతికము (ఒకేయూహా గలది) కానిది సవ్యభిచారము. అది సాధారణము, అసాధారణము, అనుపసంహారి, అని భేదమువలన త్రివిధము. అందు, సాధ్యాభావవద్వృత్తి (సాధింపఁ దగినది లేకుండుట) సాధారణము; ఎట్లనఁగా, 'ప్రమేయత్వమువలన పర్వతమువహ్నిమంతము' అనుచో ప్రమేయత్వమువహ్న్యభావమును గలదియైనహ్రదమునందును గలదు (గాన సాధారణము). సర్వసపక్షవిపక్షవ్యావృత్తము (సపక్షమునకును విపక్షమునకును చెందనిది) అసాధారణము; ఎట్లనఁగా, 'శబ్దత్వమువలన

శబ్దము నిత్యము' అనుచో సమస్తనిత్యములయందును, అనిత్యముల యందును వ్యావృత్త మయిన (ఉండని) శబ్దత్వము శబ్దమునందు మాత్రమే యుండునది (గాన నసాధారణము). అన్వయవ్యతిరేక దృష్టాంతరహితము (అన్వయదృష్టాంతముగాని వ్యతిరేకదృష్టాంత మునగాని లేనిది) అనుపసంహారి; ఎట్లనఁగా, 'ప్రమేయత్వము వలన సర్వమును ననిత్యము' అనుచో సర్వమునకును వస్తుత్వము కలుగుటవలన దృష్టాంతమే లేదు (గాన ననుపసంహారి). సాధ్యాభావ (సాధింపఁ దగినదానిలేమి) వ్యాప్య మయిన హేతువు విరుద్ధము; ఎట్లనఁగా, 'కృతకత్వమువలన శబ్దమునిత్యము' అనుచోకృతకత్వమే (చేయబడుటయే) నిత్యత్వాభావ మగుటచేత ననిత్యత్వమునందు వ్యాప్త మగును. సాధ్యాభావసాధక మయినహేత్వంతర మెచ్చటఁ గలదో యది సత్ప్రతిపక్షము; ఎట్లనఁగా, 'శ్రవణసంబంధిత్వమువలన శబ్దము నిత్యము' అనుచో 'కార్యత్వమువలన ఘటమువలె శబ్ద మనిత్యము' (అనవచ్చును). ఆశ్రయాసిద్ధము, స్వరూపాసిద్ధము, వ్యాప్యత్వాసిద్ధము, అని యసిద్ధము త్రివిధము. 'అరవిందత్వమువలన సరోజారవిందమువలెనే గగనారవిందము పరిమళము గలది' అనుచో నాశ్రయాసిద్ధము. ఇచట గగనారవింద మాశ్రయము; అది లేనేలేదు. 'చాక్షుషత్వమువలన శబ్దము గుణము' అనుచో స్వరూపాసిద్ధము. ఇచట శబ్దమునకు శ్రావణత్వము (కర్ణగోచరత్వము) కలుగుటవలన శబ్దమునందు చాక్షుషత్వము (నేత్రగోచరత్వము) లేదు. సోపాధిక (ఉపాధిని గలది) మైన హేతువు వ్యాప్యత్వాసిద్ధము; సాధ్యవ్యాపకత్వ ముండఁగా సాధనవ్యాపకత్వము లేకుండుట యుపాధి. సాధ్యసమానాధికరణాత్యంతాభావా ప్రతియోగిత్వము (సాధింపఁ దగినదానితో సమాన మయిన యాశ్రయము గల యత్యంతాభావమునకు విరోధి

కాకుండుట) సాధ్యవ్యాపకత్వము, సాధనవన్నిష్ఠాత్యంతాభావప్రతి యోగిత్వము (సాధనవత్తునందున్న యత్యంతాభావమునకు విరోధి యగుట) సాధనవ్యాపకత్వము. వహ్నిమత్త్వమువలన పర్వతము ధూమవంతమనుచోట పచ్చికట్టెల సంయోగ ముపాధి; ఎక్కడ ధూమముండునో యెక్కడ నార్ద్రేంధన (పచ్చికట్టెల) సంయోగమనుట సాధ్యవ్యాపకత్వము; అయోగోళము (ఇనుపగుండు) నం దార్ద్రేంధన సంయోగము లేమింజేసి యెక్కడ వహ్నియుండునో యెక్కడనార్ద్రేంధనసంయోగ ముపాధి; సోపాధికత్వము వలన వహ్నిమత్త్వము వ్యాప్యత్వాసిద్ధము. దేనికి సాధ్యాభావము ప్రమాణాంతరముచేత నిశ్చితమగునో యది బాధితము; ద్రవ్యత్వమువలన వహ్ని యనుష్ణమనుచో అనుష్ణత్వము (చల్లదనము) సాధ్యము (సాధింపదగినది); తదభావమయిన యుష్ణత్వము (త్వక్) స్పర్శనప్రత్యక్షముచేత గ్రహింపఁబడును గనుక బాధిత మయినది.

౪౭. — ఉపమితికరణ ముపమానము. సంజ్ఞా (పేరు) సంజ్ఞి (పేరుగలది) సంబంధజ్ఞాన ముపమితి; సాదృశ్యజ్ఞానము దానికరణము. అతిదేశ* వాక్యార్థముయొక్కస్మరణ మవాంతరవ్యాపారము. ఎట్లనఁగా, ఒకఁడు గవయశబ్దార్థ మెఱుఁగనివాఁడయి, ఒకానొక యారణ్యక పురుషునివలన గవయమ్మృగము గోవునలె నుండుననివిని, వనమునకుఁబోయి వాక్యార్థమును స్మరించుకొని, గోసదృశ మయినరూపమును జూచుచున్నాఁడు; అటుతరువాత నిదిగవయశబ్దవాచ్యమయినదని యుపమితి పుట్టుచున్నది.

---

* ఒకచోటఁ జెప్పఁబడినదానిని సామ్యమునుబట్టి మతియొకచోట నుపయోగపఱుచుట యతిదేశము.

౭౮. — ఆప్తవాక్యము శబ్దము. యథార్థవక్త యాప్తుఁడు. పదసమూహము వాక్యము:— "గోవును తెమ్ము" శక్తికలది పదము; ఈ పదమువలన నీయర్థము బోధింపఁదగిన దనియెడి యీశ్వరసంకేతము శక్తి.

౭౯. — ఆకాంక్ష, యోగ్యత, సన్నిధి, ఇవి వాక్యార్థజ్ఞానహేతువులు. పదమునకు పదాంతరవ్యతిరేక ప్రయుక్తాన్వయాననుభావకత్వము (పదాంతరములేక యుద్దేశింపఁబడిన యర్థము నిచ్చుశక్తి లేకుండుట) ఆకాంక్ష; అర్థాబాధము యోగ్యత; పదముల నవిలంబనముగా (జాగులేకుండ) నుచ్చరించుట సన్నిధి.

౮౦. — ఆకాంక్షాదిరహితమయిన వాక్యము ప్రమాణము కాదు. ఆకాంక్ష లేకపోవుటవలన, "గోవు, అశ్వము, పురుషుఁడు, హస్తి." అనువాక్యము ప్రమాణము కాదు; యోగ్యత లేకపోవుటవలన, "అగ్నిచేత తడుపుచున్నాఁడు" అనువాక్యము ప్రమాణము కాదు; సాన్నిధ్యాభావమువలన, జామున కొకసారి "గోవును—తెమ్ము" అను సహోచ్చరితములు కానిపదములు ప్రమాణము కాదు.

౮౧. — వైదికము, లౌకికము, అని వాక్యము ద్వివిధము. ఈశ్వరోక్తమువలన వైదికము సర్వమును ప్రమాణము; లౌకికమైన యాప్తవాక్యము ప్రమాణము; ఇతర మప్రమాణము.

౮౨. — వాక్యార్థజ్ఞానము శాబ్దజ్ఞానము: తత్కారణము శబ్దము.

౮౩. — సంశయము, విపర్యయము, తర్కము, అను భేదమువలన, అయథార్థానుభవము త్రివిధము. ఒకధర్మియందు విరుద్ధనానాధర్మవైశిష్ట్యజ్ఞానము సంశయము:— (ఒకవస్తువును జూచి) స్థాణువుకాని పురుషుఁడు కాని (అనుకొనుట). మిథ్యాజ్ఞానము విపర్యయము:— శుక్తిని (ముత్యపుచిప్పను) జూచి రజతము (వెండి) అను

గొనుట. వ్యాప్యారోపముచేత వ్యాపకారోపము తర్కము :— వహ్ని లేకపోయెనని, అప్పుడు ధూమమును లేకపోవును ( అనుకొనుట ).

౫౪. — యథార్థము, అయథార్థము, అని స్మృతియు ద్వివిధము. ప్రమాజన్యమయినది యథార్థము; అప్రమాజన్య మయథార్థము.

౫౫. — అందఱిచేత ననుకూలముగాఁ దెలిసికోఁ దగినదిసుఖము.

౫౬. — ప్రతికూలముగాఁ దెలిసికోఁదగినది దుఃఖము.

౫౭. — కామ మిచ్ఛ.

౫౮. — ద్వేషము క్రోధము.

౫౯. — కృతి ప్రయత్నము.

౬౦. — విహితకర్మజన్యము ధర్మము.

౬౧. — నిషిద్ధకర్మజన్య మధర్మము.

౬౨. — బుద్ధ్యాదు లెనిమిదియు (బుద్ధి, సుఖము, దుఃఖము, ఇచ్ఛ, క్రోధము, ప్రయత్నము, ధర్మము, అధర్మము) ఆత్మమాత్ర విశేషగుణములు.

౬౩. — బుద్ధీచ్ఛాప్రయత్నములు నిత్యములు, అనిత్యములు, అని ద్వివిధములు. ఈశ్వరునివి నిత్యములు; జీవునివి యనిత్యములు.

౬౪: — వేగము, భావన, స్థితిస్థాపకము, అని సంస్కారము త్రివిధము. వేగము పృథివ్యాది చతుష్టయమునందును (పృథివి, జలము, తేజము, వాయువు,) మనస్సునందును, ఉండును. అనుభవజన్యయు స్మృతిహేతువు నయినభావన యాత్మయందు మాత్ర ముండును. మఱియొకవిధముగాఁ జేయఁబడినవానికి మరల తదవస్థాపాదకము స్థితిస్థాపకము — ఇది చాపలు మొదలయిన పృథివీమాత్ర మునం దుండును.

౭౫. — చలనాత్మక మయినదికర్మము. ఊర్ధ్వదేశసంయోగ హేతు వుత్క్షేపణము; అథోదేశసంయోగ హేతు వపక్షేపణము; శరీర సన్నికృష్టసంయోగహేతు వాకుంచనము; విప్రకృష్టసంయోగహేతువు ప్రసారణము; అన్యమునర్వముగమనము. ఇది (చలనము) పృథివ్యాది చతుష్టయమునందును మనస్సునందునుమాత్ర ముండును.

౭౬. — నిత్య మయి యేక మయి యనేకములయం దుండు నది సామాన్యము. అది, ద్రవ్య, గుణ, కర్మలయం దుండును. అది పరము, అపరము, అను భేదమువలన ద్వివిధము. పరము సత్త; అపరము జాతిద్రవ్యత్వాది.

౭౭. — నిత్య ద్రవ్యములయం దుండు వ్యావర్తకములు విశేషములు.

౭౮. — నిత్యసంబంధము సమవాయము. అది యయుతసిద్ధములయం దుండును; ఏరెంటిలో నొకటి రెండవదాని నాశ్రయించియే యుండునో యవి యయుతసిద్ధములు; ఎట్లనఁగా — అవయవావయవులు, గుణగుణులు, క్రియాక్రియావంతులు, జాతివ్యక్తులు, విశేష నిత్యద్రవ్యములు, మొదలయినవి.

౭౯. — అనాదియు సాంతము నైనది ప్రాగభావము — ఉత్పత్తికంటెఁ బూర్వము కార్యమున కిది యుండును. సాదియు ననంతము నైనది ప్రధ్వంసాభావము — ఉత్పత్తికంటె ననంతరము కార్యమున కిది యుండును. త్రైకాలికసంసర్గాభావ మత్యంతాభావము — ఎట్లనఁగా భూతలమునందు ఘటము లేదు. తాదాత్మ్యసంబంధావచ్ఛిన్నప్రతియో గిక: (తాదాత్మ్యసంబంధముచే వేఱుపఱుపఁబడిన విరో

ధముకలది) అన్యోన్యాభావము:— ఎట్లనఁగా, ఘటము పటము కాదు.

౭౦. — సమస్త పదార్థములును వయిని చెప్పఁబడినవానిలోనే చేరియుండుటవలన పదార్థము లేడే యని సిద్ధ మయినది.

క. అన్నంభట్ట కృతంబయి
సన్నుతి గన్నట్టితర్క సంగ్రహమును దీ
ని న్నతి బాలురకొఱకున్
గ్రన్నన వీరేశలింగకవి తెనిఁగించెన్.

---

# పీఠిక

ఈపుస్తకము 1887వ సంవత్సరమునందు రాజమహేంద్రవరమునందలి రాజకీయశాస్త్రపాఠశాలలోని పట్టపరీక్షతరగతి విద్యార్థులకొఱకు రచియింపఁబడినది. అప్పటికి తెలుఁగుభాషలో వచనరూపమున రచియింపఁబడిన యలంకారగ్రంథములు లేవు. దీనిని వృద్ధిపఱిచి పూర్వకవివిరచితము లైనప్రౌఢకావ్యములనుండి లక్ష్యములను జేర్చి ప్రచురింపవలెనని యింతకాలము ముద్రింపింపక నిలిపియుంచితినిగాని నావ్రాఁతప్రతి శిథిలము కా నారంభించినందున నిప్పుడు మార్పులు చేయక యున్నదియున్నట్టుగా నచ్చొత్తింపవలసినవాఁడ నయితిని. ఉపకారవేతనము నొందినతరువాత నొక గొప్పలక్షణగ్రంథమును వ్రాయఁ దలఁచి యున్నాఁడను గాన నప్పు డందు దీనిని జేర్చి పెంపు చెందించెదను.

1—6—03. కం. వీ.



# అలంకారసంగ్రహము.



## అర్థాలంకారములు.

౧. ఉపమాలంకారము — ఉపమానమునకును*, ఉపమేయమునకును*, రసికజనహృదయాహ్లాదకరమయి మనోహరమైనసాదృశ్యము వ్యంగ్యరీతినిగాక స్పష్టముగాఁ జెప్పినపక్షమున, ఉపమాలంకారమగును. అది పూర్ణోపమ యనియు, లుప్తోపమ యనియు, రెండువిధములు గలది. ఉపమానము, ఉపమేయము, సాధారణధర్మము, ఉపమావాచకము, ఈనాలిగింటిని గలిగియున్నచో పూర్ణోపమ:— ఆమెముఖము చంద్రునివలె నందముగ నున్నది. ఈనాలిగింటిలో నొకటి రెండుమూడు లోపించిన లుప్తోపమ:— ఆమెముఖము చంద్రునివలె నున్నది. పోల్చుటకయి గ్రహించెడు గుణాధిక్యము గల చంద్రాదిక ముపమానము, వర్ణింపఁదగినదై న్యూనగుణము గల ముఖాదిక ముపమేయము; ఉపమానోపమేయములకు రెంటికిని సామాన్యమయిన అందము మొదలగునది సాధారణధర్మము; పోలికను దెలుపు వలె మొదలగునది యుపమావాచకము. పయివాక్యములలో, మొదటిదానియందు చంద్రుఁ డనునుపమానమును ముఖ మనునుపమేయమును, అంద మనుసాధారణధర్మమును, వలె యనునుపమావాచక

---

* ఉపమేయము వర్ణ్యము, ప్రస్తుతము, ప్రకృతము, విషయము, అను నామములతోను; ఉపమానము అవర్ణ్యము, అప్రస్తుతము, అప్రకృతము, విషయి, అను నామములతోను; వ్యవహరింపఁ బడుటయుఁ గలదు.

మును, ఉండుటచేత అవి పూర్ణోపమ యనియు, రెండవదానియందు అందమను సాధారణధర్మము లేకుండుటచేత అది లుప్తోపమ యనియు, గ్రహింపవలెను. వాచకలుప్త, ధర్మలుప్త, ధర్మవాచకలుప్త, వాచకోపమేయలుప్త, ఉపమానలుప్త, వాచకోపమానలుప్త, ధర్మోపమానలుప్త, ధర్మోపమానవాచకలుప్త, అని లుప్తోపమ యెనిమిదివిధములు గల దని పెద్దలు చెప్పుదురు.

౨. అనన్వయాలంకారము — ఒకవస్తువునే యుపమానముగాను, ఉపమేయముగాను కూడ చెప్పినచో అనన్వయము:— శోభయం దామెముఖమున కామెముఖమే సమానము. ఇక్కడ వర్ణ్యమైన ముఖమే యుపమానముగాను ఉపమేయముగాను చెప్పఁబడుటచేత అనన్వయ మయినది. ఆమెముఖము సాటి లేని దని తాత్పర్యము.

3. ఉపమేయోపమాలంకారము — రెండువస్తువులలో నొకదాని నుపమేయముగాను మఱియొకదాని నుపమానముగాను జెప్పి, మరల వానినే మార్చి యుపమానము నుపమేయముగాను ఉపమేయము నుపమానముగాను చెప్పినచో ఉపమేయోపమ; ఆమెముఖమునకు చంద్రుఁడు సాటి, చంద్రునకామెముఖము సాటి. ఇక్కడ ముఖము నుపమేయముగాను చంద్రుని నుపమానముగాను మొదట చెప్పి, వానినే మరల మార్చి యుపమేయముగాఁ జెప్పిన ముఖము నుపమానముగాను ఉపమానముగాఁ జెప్పిన చంద్రుని నుపమేయముగాను రెండవసారి చెప్పుటచే నుపమేయోపమ యయినది.

ర. ప్రతీపాలంకారము — (క) ప్రసిద్ధోపమానమున కుపమేయత్వము కల్పించినను, (చ) ఉపమానము లభించుటచే నుపమేయమును తిరస్కరించినను, (ట) ఉపమేయప్రాశస్త్యమునుబట్టి యుపమానమును తిరస్కరించినను, (త) ఉపమానమువలని ప్రయోజన

ముపమేయము వలననే కలుగుటచేత నుపమానముతో పనిలేదని చెప్పి నను, (ప) ఉపమేయమున కుపమానము సాటి కాదన్నను, ప్రతీపము.

(క) ప్రసిద్ధోపమానమున కుపమేయత్వము కల్పించుట:- ఆమె ముఖముతో చంద్రుండు సమానుండు. ఇచట ముఖము చంద్రునితో సమాన మనుటకు మారుగా ప్రసిద్ధోపమాన మయిన చంద్రునే యుపమేయము చేసి చంద్రుండే ముఖముతో సమానముగా నున్నాఁ డని చెప్పుటచే మొదటి ప్రతీప మయినది.

(చ) ఉపమానము లభించుటచే నుపమేయమును తిరస్కరించుట :— ఓ ముఖమా! గర్వపడకుము. నీతో సమానుఁడు చంద్రుఁ డున్నాఁడు. ఇక్కడ నుపమాన మయినచంద్రుఁడు లభించుటచేత నుపమేయ మగుముఖము తిరస్కరింపఁ బడినది గనుక రెండవ ప్రతీప మయినది.

(ట) ఉపమేయప్రాశస్త్యమును బట్టి యుపమానమును తిరస్కరించుట :— ఓచంద్రుఁడా! నేనె కాంతిమంతుఁడ నని యేల గర్వ పడెదవు? నిన్ను మించిన దామె ముఖ మున్నది. ఇక్కడ నుపమేయ మయినముఖముయొక్క యుత్కృష్టతను బట్టి యుపమాన మయిన చంద్రుఁడు తిరస్కరింపఁబడినందున మూఁడవప్రతీప మయినది.

(త) ఉపమానమువలన ప్రయోజన ముపమేయమువలననే కలుగుటచేత నుపమానముతో పని లేదని చెప్పుట:- ఓరమణీ! నీ ముఖదర్శన మగుచుండగా చంద్రుఁ డేల యుదయింపఁ వలెను? ఇక్కడ నుపమాన మయినచంద్రుని యుదయము వలని ఫల ముప మేయ మయినముఖముయొక్క దర్శనముచేతనే కలుగుచుండుటచేత నుపమాన మయిన చంద్రునితో పని లేదని చెప్పఁబడినందున నాలవ ప్రతీప మయినది.

(ప) ఉపమేయమున కుపమానము సాటి కాదనుట :— ఓ కాంతా! తెలియనివారు నీ ముఖముతో చంద్రుఁడు సాటి వచ్చు నని చెప్పుట యసత్యమే సుమా. ఇక్కడ నుపమేయమైనముఖముతో నుపమాన మగుచంద్రుఁడు సాటి కాఁ డని చెప్పఁబడినందున నయి దవప్రతీప మయినది.

౫. రూపకాలంకారము—ఉపమేయమునందు హృదయరంజక ముగా నుపమానముయొక్క రూపము నారోపించినయెడల రూపకము :— ముఖచంద్రుఁడు మందహాసచంద్రికలను గాయుచున్నాఁడు. ఇక్కడ నుపమేయము లగుముఖమందహాసములయందు వరుసగా ఉపమానము లగుచంద్రచంద్రికారూపము లారోపింపఁబడినవి గనుక రూపక మయినది. అభేదరూపకము, తాద్రూప్యరూపకము, అని రూపకము రెండువిధములు కలది. ఉపమానోపమేయములకు భేదము లేనట్లు చెప్పినచో నభేదరూపకము; ఈరాజు పురసంహారకుఁ డగు నీశ్వరుఁడు. ఇక్కడ నుపమేయ మైనరాజే యుపమాన మయిన యీశ్వరుఁ డైనట్లు చెప్పఁబడుటచే నభేదరూపకము. ఉపమానోప మేయములకు భేద మగుపడుచున్నను, ఉపమానరూపముచేత నుపమే యమునకు రంజనము కలిగించినచో తాద్రూప్యరూపకము. ఈరాజు పురసంహారకుఁ డగురెండవయీశ్వరుఁడు. ఇక్కడ నుపమేయ మగు రాజునకును నుపమాన మగునీశ్వరునకును భేదము చెప్పినను, ఈశ్వర రూపముచే రాజునకు రంజనము కలుగఁజేసినందున తాద్రూప్య రూపకము. న్యూన, అధిక, అనుభయభేదములచే వరుసగా అభేద తాద్రూప్యరూపకములు మరల మూడేసివిధములుగా భాగింపఁ బడినవి.

(య) న్యూనాభేదరూపకము - అభేదరూపకమునం దుపమానముకంటె నుపమేయమునందు న్యూనత చెప్పినచో న్యూనాభేదరూపకము:— ఈరాజు మూడవకన్ను లేనియీశ్వరుఁడు. ఇక్కడ నుపమాన మగునీశ్వరున కున్నమూడవకన్ను లేదని యుపమేయ మగురాజునందు న్యూనత్వము చెప్పఁబడుటచే న్యూనాభేదరూపకము.

(ర) అధికాభేదరూపకము - అభేదరూపకమునం దుపమానముకంటె నుపమేయమునం దధికత చెప్పినచో నధికాభేదరూపకము:— ఈరాజు నిండు పౌరుషము గలయీశ్వరుఁడు. ఇక్కడ నుపమాన మగునీశ్వరునికి లేని నిండుపౌరుషము కలదని యుపమేయ మగురాజునం దధికత్వము చెప్పఁబడుటచేత నధికాభేదరూపకము. (వామార్ధము పార్వతి గనుక నర్ధనారీత్వముచే శివునకు నిండుపౌరుషము లేదని తాత్పర్యము).

(ల) అనుభయాభేదరూపకము - అభేదరూపకమునం దుపమానముకంటె నుపమేయమునందు న్యూనత్వాధికత్వములను జెప్పక యుపమానముతోడ సమత్వమును జెప్పినచో ననుభయాభేదరూపకము:— ఈరాజు పురసంహారకుఁ డగునీశ్వరుఁడు. ఇక్కడ నుపమాన మగునీశ్వరునికిని నుపమేయ మగురాజునకును పురసంహారకత్వము సామాన్యముగాఁ జెప్పుటచే ననుభయాభేదరూపకము.

(శ) న్యూనతాద్రూప్యరూపకము - తాద్రూప్యరూపకమునం దుపమానముకంటె నుపమేయమునందు న్యూనతను జెప్పినచో న్యూనతాద్రూప్యరూపకము:— ఈరాజపరమేశ్వరుఁడు మూడవకన్ను లేక ప్రకాశించుచున్నాఁడు. ఇక్కడ నుపమాన మగుపరమేశ్వరున కున్న మూడవకన్ను లేదని యుపమేయ మగురాజునందు న్యూనత చెప్పుటచే న్యూనతాద్రూప్యరూపకము.

(వ) అధికతాద్రూప్యరూపకము - తాద్రూప్యరూపకమునం దుపమానముకంటె నుపమేయమునం దధికతను జెప్పినచో నధిక తాద్రూప్యరూపకము:—ఈరాజపరమేశ్వరుఁడు నిందు పౌరుషము కలిగి వెలయు చున్నాఁడు. ఇక్కడ నుపమాన మగుపరమేశ్వరునికి లేనినిందుపౌరుషము కలదని యుపమేయ మగురాజునం దధికత్వము చెప్పఁబడుటచే నధిక తాద్రూప్యరూపకము.

(ప) అనుభయతాద్రూప్యరూపకము - తాద్రూప్యరూపకము నం దుపమానోపమేయములకు న్యూనత్వాధికత్వములను జెప్పక సమ త్వమును జెప్పినచో ననుభయతాద్రూప్యరూపకము:—ఈరాజు పుర సంహారకుఁ డగురెండవయీశ్వరుఁడు. ఇక్కడ నుపమాన మగునీశ్వ రునికిని నుపమేయ మగురాజునకును పురసంహారకత్వము సామాన్య ముగాఁ జెప్పుటచేత ననుభయతాద్రూప్యరూపకము.

౬. పరిణామాలంకారము — ఉపమేయైక్యముచేత నుపమా నమే ప్రకృతకార్యోపయుక్తమైనదని చెప్పినచో పరిణామ మగును:— ఆమె వికాసము నొందిన నేత్రపద్మములతో వల్లభుని జూచెను. ఇక్కడ పద్మ మనెడియుపమానము నేత్ర మనెడియుపమేయముతోఁ జేరి కన్నులు చేయవలసిన ప్రకృతమైన వీక్షణకార్యమును పద్మములే చేసి నట్టు చెప్పబడినందున పరిణామమయినది.

౭. ఉల్లేఖాలంకారము—వివిధధర్మములు కలుగుటనుబట్టి యొకపదార్థమును పలువురు పలువిధములుగాఁ దలఁచినను, ఒకఁడే యనేకవిధములుగాఁ దలఁచినను, ఉల్లేఖము:—ఆరాజును స్త్రీలు మన్మథునిగాను, యాచకులు కల్పవృక్షముగాను, శత్రువులు యముని గాను, తలఁచుచున్నారు; దానమునఁ గర్ణునిగాను, కీర్తిని నర్జునుని గాను, బుద్ధిని బృహస్పతినిగాను, నేను భావించెదను. ఇందు మొదటి

వాక్యమున సౌందర్యము, త్యాగము, వీరత్వము, అనుగుణములను బట్టి రాజనెడి యొక్క పదార్థమునె స్త్రీలు, యాచకులు, శత్రువులు, అను పలువుగ పలువిధములుగాఁ దలఁచుటచేతను, రెండవవాక్యమున నేనొక్కఁడనే యీరాజును దాన, కీర్తి, బుద్ధులనుబట్టి పలువిధములుగాఁ దలఁచుటచేతను, ఉల్లేఖ మయినది.

౮. స్మృతిమదలంకారము :— ఉపమానోపమేయములలో నొకదానిని జూచినప్పుడు సాదృశ్యముచేత మఱియొకటి స్మరణకు వచ్చినయెడల స్మృతిమంతము:—చంద్రబింబమును జూచినప్పు డెల్ల నాకా మెముఖము స్మరణకు వచ్చుచున్నది. ఇక్కడ నుపమాన మగు చంద్రబింబమును జూచినప్పుడు సాదృశ్యమునుబట్టి యుపమేయ మగుముఖము తలఁపునకు వచ్చినట్లు చెప్పఁబడినందున స్మృతిమంత మయినది.

౯. భ్రాంతిమదలంకారము:— ఒకవస్తువును జూచినప్పుడు సాదృశ్యమునుబట్టి యది మఱియొకవస్తువుగా భ్రమ కలిగెనేని భ్రాంతిమంతము:—తుమ్మెద లా మెముఖము పద్మ మనుకొని వ్రాలఁ బోవుచున్నవి. ఇక్కడ నుపమేయ మైన ముఖమును జూచి తత్సదృశ మైన పద్మ మని భ్రాంతి పడినట్లు చెప్పఁబడినందున భ్రాంతిమంత మయినది.

౧౦. సందేహాలంకారము:— ఒకవస్తువును జూచినప్పుడు సామాన్యధర్మమును బట్టి యది రెండుమూఁడు వస్తువులలో నదియో యిదియో యని సంశయము కలిగినచో సందేహము:— అతడు వసంతుఁడో కంతుఁడో! ఇక్కడ నొక పురుషుని జూచినప్పు డుభయ సామాన్య మయిన సౌందర్యమును బట్టి వసంతుఁడో కంతుఁడో యని సంశయము కలిగినందున సందేహ మయినది.

౧౧. అపహ్నుత్యలంకారము:— శుద్ధాపహ్నుతి, హేత్వపహ్నుతి, పర్యస్తాపహ్నుతి, భ్రాంతాపహ్నుతి, ఛేకాపహ్నుతి, కైతవాపహ్నుతి, అని యపహ్నుతి యాఱు విధములు గలది.

(౧). శుద్ధాపహ్నుతి:—వర్ణ్యమునం దితరవస్తుధర్మము నారోపించుటకయి యుపమేయముయొక్క ధర్మమును మఱుఁగుపఱచినచో శుద్ధాపహ్నుతి:—ఆప్రకాశించునది చంద్రబింబము గాదు; ఆకాశగంగలోని సువర్ణకమలము. ఇక్కడ నుపమేయ మయిన చంద్రబింబమునం దుపమాన మయిన యాకాశగంగాకమలత్వము నారోపించుటకయి చంద్రబింబము కాదని వర్ణ్యము మఱుఁగుపఱుపఁబడినందున శుద్ధాపహ్నుతి.

(౨) హేత్వపహ్నుతి:—అన్యముయొక్క ధర్మము నారోపించుటకయి వర్ణ్యముయొక్క ధర్మమును హేతుపూర్వకముగా మాటు పఱిచినచో హేత్వపహ్నుతి:— వేఁడి చూపుచున్నది గాన నిది చంద్రబింబము కాదు; రాత్రి ప్రకాశించుచున్నది గాన సూర్యబింబమును గాదు; విరహిణులను బాధించుటకయి సముద్రమునందు పుట్టిన బడబానలము. ఇక్కడ వర్ణ్యమయిన చంద్రబింబమునందు బడబానల ధర్మము నారోపించుటకయి వేఁడి చూపుట రాత్రి ప్రకాశించుట యను హేతువులు చూపఁబడి చంద్రత్వము మఱుఁగుపఱుపఁబడినందున హేత్వపహ్నుతి.

(3) పర్యస్తాపహ్నుతి:— ఉపమానమునం దుపమేయవస్తు ధర్మము నారోపించుటకయి యుపమానముయొక్క ధర్మమును మఱుఁగు పఱిచినచో పర్యస్తాపహ్నుతి:— ఆ కనఁబడునది చంద్రబింబము గాదు కామినీముఖచంద్రబింబము. ఇక్కడ నవర్ణ్య మయిన చంద్రబింబమునం దుపమేయ మయిన కామినీముఖ ధర్మము నారో

పించుటకయి చంద్రబింబము కాదని యుపమానము మఱుగు పఱుపఁబడినందున పర్యస్తాపహ్నుతి.

(౪) భ్రాంతాపహ్నుతి :— అన్యునకు శంక కలిగినప్పుడు సత్యము చెప్పి భ్రాంతి నివారణముచేసినయెడల భ్రాంతాపహ్నుతి:— సఖి! శరీరమునకు కంపమును తాపమును పుట్టించెడును. ఓ చెలీ! జ్వరమా యేమి! సఖి! కాదుకాదు మన్మథుఁడు. ఇక్కడ నొక విరహిణి తనదేహమునకుఁ గంపమును దాపమును పుట్టించెడు నని చెప్పి నప్పుడు చెలికత్తెకు శంక తోఁచి యట్లు కంపతాపములను బుట్టించెడు నది జ్వరమా యని యడుగఁగా మన్మథుఁ డని చెప్పి యాచెలి సందేహము నివారణము చేసినందున భ్రాంతాపహ్నుతి.

(౫) ఛేకాపహ్నుతి:— అన్యునకు శంక తోఁచినప్పుడు, నిజమును మఱుఁగు పెట్టి బొంకినచో ఛేకాపహ్నుతి:— ఓకాంతా! అంతట మొఱపెట్టుచు నాపాదములను బడెను. ఓచెలీ! యెవరు? నీకాంతుఁడా యేమి? ఓసఖి కాంతుఁడు కాఁడు. అందము. ఇక్కడ నొక కాంత తనకాంతుని విషయము నర్మసఖితో మాటాడుచు మొఱపెట్టుచు పాదములఁ బడె నని రహస్యముగా చెప్పుచుండఁగా మఱియొక చెలికత్తె విని కాంతుఁడా యని యడిగినప్పుడు సత్యమును దాఁచి యందము యని బొంకినందున ఛేకాపహ్నుతి.

(౬) కైతవాపహ్నుతి:— కైతవము, ఛలము, వ్యాజము, మిష, నెపము మొదలగు పదములచే సత్యమును మాటుపెట్టిన యెడల కైతవాపహ్నుతి:— ఆకాంతయొక్క దృక్పాతము లనుమిష చేత మన్మథబాణములు వెడలుచున్నవి. ఇక్కడ మిషయను పదముచేత దృక్పాతము లను సత్యమును మఱుఁగు పఱిచినందున కైతవాపహ్నుతి.

౧౭. ఉత్ప్రేక్షాలంకారము :— అన్యధర్మసంబంధమును బట్టి యొక వస్తువుయొక్క ప్రసిద్ధగుణాదులకు విశేషతాత్పర్యము కల్పించుట ఉత్ప్రేక్ష. అది వస్తూత్ప్రేక్షయనియు, హేతూత్ప్రేక్షయనియు, ఫలోత్ప్రేక్షయనియు మూడువిధములు గలది. ఉక్తవిషయ, అనుక్తవిషయ, అని వస్తూత్ప్రేక్ష రెండువిధములుగాను; సిద్ధవిషయ, అసిద్ధవిషయ, అని హేతుఫలోత్ప్రేక్షలు రెండేసివిధములుగాను; భాగింపఁబడి యున్నవి. వస్తూత్ప్రేక్షకుస్వరూపోత్ప్రేక్షయనియు నామము కలదు.

(౧) ఉక్తవిషయవస్తూత్ప్రేక్ష :— ఉపమానధర్మసంబంధము కలుగుటనుబట్టి యుపమేయమున కుపమాన తాదాత్మ్యము నూహించినచో వస్తూత్ప్రేక్ష. అందు విషయము చెప్పఁబడినచో నుక్తవిషయ :— ఈచీఁకటి చక్రవాకీవిరహాగ్ని జనితధూమ మని నేనెంచెదను. ఇక్కడ నుపమేయ మగుచీఁకటికి నలుపు మొదలయినధర్మసంబంధము కలుగుటను బట్టి యుపమాన మగుపొగయొక్క తాదాత్మ్య మూహింపఁబడినందున వస్తూత్ప్రేక్షయు, విషయ మగుచీఁకటి చెప్పఁబడినందున నుక్తవిషయయు, అయినది. తాదాత్మ్యమనఁగా నదే యిది యనుట.

( ౨.) అనుక్తవిషయ వస్తూత్ప్రేక్ష :— వస్తూత్ప్రేక్షయందు విషయముచెప్పఁబడని పక్షమున, అనుక్తవిషయవస్తూత్ప్రేక్ష:— ఇప్పు డాకాశము నీలిమైపూఁత పూసికొన్న దేమో యని యూహించెదను. ఇక్కడ విషయమగుచీఁకటి చెప్పఁబడనందున, అనుక్తవిషయ.

(౩.) సిద్ధవిషయహేతూత్ప్రేక్ష:— హేతువుకానిదానిని హేతువునుగా నూహించినచో హేతూత్ప్రేక్ష. అందుఁ బ్రసిద్ధమైన విషయముకలిగెనేని సిద్ధవిషయ యనఁ బడును:— ఓయింతీ! నీమృదుపాదములు కఠినమయిన భూమిమీఁద మోపుటవలన నెఱ్ఱపడిన వని నేను తలఁచెదను. ఇక్కడ స్త్రీపాదములయందలి సహజారుణకాంతికి భూమి

మీఁద మోపుట హేతువు కానిదే హేతువునుగా సంభావించుటచేత హేతూత్ప్రేక్షయు కఠినమయినభూమిమీఁద మోపినప్పుడు పాదము లెఱ్ఱపడుట ప్రసిద్ధము గనుక సిద్ధవిషయయు, అయినది.

(౪.) అసిద్ధవిషయ హేతూత్ప్రేక్ష — హేతూత్ప్రేక్ష యందు విషయ మప్రసిద్ధమగునేని, అసిద్ధవిషయ హేతూత్ప్రేక్ష—ఓకాంతా! నీముఖాభను జెందఁ గోరి చంద్రుఁడు పద్మములతో వైరము పూనె నని నేనూహించెదను. చంద్రునకుఁ బద్మములతోడి వైరమునకు ముఖాభనుజెందఁ గోరుట హేతువుకాకపోవుటచేత హేతూత్ప్రేక్షయు, చంద్రుఁడు ముఖాభనుజెందఁ గోరుట యప్రసిద్ధ మగుటచేత నసిద్ధ విషయయు, అయినది.

(౫.) సిద్ధవిషయ ఫలోత్ప్రేక్ష — ఫలము గానిదానిని ఫలము నుగా నూహించినచో ఫలోత్ప్రేక్ష. అందుఁ బ్రసిద్ధవిషయము కలిగె నేని, సిద్ధవిషయ యనఁబడును — స్తనభారమును భరించుటకో యన నామె నడుము బంగరు మొలనూలిచేఁ గట్టబడినది. నడుముయొక్కకుచ ధారణమునకు బంగరు మొలనూలు కట్టుట ఫలము కానిదే ఫలమని యుత్ప్రేక్షించుటచే ఫలోత్ప్రేక్షయు, నడుము స్తనభారమును వహించుట ప్రసిద్ధ మగుటచేత సిద్ధవిషయయు, అయినది.

(౬.) అసిద్ధవిషయఫలోత్ప్రేక్ష—ఫలోత్ప్రేక్షయందు విషయ మప్రసిద్ధ మగునేని, అసిద్ధ విషయ ఫలోత్ప్రేక్ష — పద్మము నీ చరణై క్యము పొందుటకో యన నీటిలో తపస్సు చేయుచున్నది. పద్మములు నీటియందుండుటకు చరణైక్యము పొందుట ఫలముకానిదే ఫలముగాఁ జెప్పఁబడినందున ఫలోత్ప్రేక్షయు, పద్మములు చరణైక్యము పొందుట యప్రసిద్ధ మయినందున అసిద్ధవిషయయు, అయినది.

౧౩. జటిలరూపోక్త్యలంకారము — రూపకాతిశయోక్తి, శ్లేష

కాతిశయోక్తి, సంబంధాతిశయోక్తి, అసంబంధాతిశయోక్తి, అక్రమాతిశయోక్తి, చపలాతిశయోక్తి, అత్యంతాతిశయోక్తి, అని యతిశయోక్తి యేడువిధములు గలది. అందు రూపకాతిశయోక్తి, శుద్ధ, సాపహ్నవ, అని మరల ద్వివిధము.

(౧.) శుద్ధరూపకాతిశయోక్తి — ఉపమేయమును తద్వాచక శబ్దముచేఁ జెప్పక యుపమాన రూపముచేత నిశ్చయించినచో శుద్ధ రూపకాతిశయోక్తి — నీలోత్పలద్వంద్వమునుండి తీక్ష్ణబాణము లెట్లు వెడలు చున్నవో చూడు. ఇక్కడ నుపమేయము లగు నేత్రములను కటాక్షవీక్షణములను తద్వాచక పదములచేతఁ జెప్పక యుపమానము లగునీలోత్పలద్వంద్వతీక్ష్ణ బాణములచే నిశ్చయించుటచేత శుద్ధాతిశయోక్తి.

(౨.) సాపహ్నవ రూపకాతిశయోక్తి — రూపకాతిశయోక్తి యే యపహ్నవ సహితమైనచో సాపహ్నవ రూపకాతిశయోక్తి — ఓరాజా! నీమృదూక్తి యందలి సుధను మూర్ఖులు భ్రాంతు లయి చంద్రునియందు వర్ణింతురు. ఇక్కడ మృదూక్తి మాధుర్యమే యమృత మని యతిశయోక్తిని జెప్పి చంద్రునియందలి దమృతము కాదని దానిని మఱుఁగు పఱుచుటచే సాపహ్నవ రూపకాతిశయోక్తి యైనది.

(3) భేదకాతిశయోక్తి — లోకసాధారణమయిన దానికి భేద మయినదానినిగాఁ జెప్పినచో, భేదకాతిశయోక్తి — ఓ రామా! నీధైర్యము వేఱు; ఇతర రాజులధైర్యము వేఱు. రాముని ధైర్యమితర రాజులధైర్యమువంటిదే యయినను దానిని భిన్నమయినదానినిగాఁ జెప్పుటచేత భేదకాతిశయోక్తి యయినది.

(౪) సంబంధాతిశయోక్తి — సంబంధము లేనిదానికి సంబంధ

మున్నట్లు చెప్పినచో సంబంధాతిశయోక్తి:—ఆవుర సౌధములు చంద్ర బింబమును స్పృశించుచున్నవి. సౌధములకును చంద్రబింబమునకును సంబంధ మేమియు లేకపోయినను మేడలు చంద్రబింబము నంటు చున్నవని సంబంధము కల్పించినందున సంబంధాతిశయోక్తి యయినది.

(౫.) అసంబంధాతిశయోక్తి — సంబంధ మున్నదానికి సంబంధము లేనట్లు చెప్పినచో నసంబంధాతిశయోక్తి:—నీవు దాతవయి యుండఁగా మేఘముల నెవ్వరు నాదరింపకున్నారు. అనఁగను మేఘ ముల నాదరించుసంబంధ మున్నను లేదని చెప్పినందున నసంబంధాతి శయోక్తి యయినది.

(౬.) అక్రమాతిశయోక్తి — కారణకార్యము లొక్కమాత్రే సంభవించినట్లు చెప్పినచో నక్రమాతిశయోక్తి:— నీశరములు వింటిని జేరుటయు శత్రుశిరస్సులు మంటిని జేరుటయు నొక్కమాత్రే కలుగు చున్నవి. ఇక్కడ ముందుగాఁ బుట్టి కార్య మయిన బాణప్రయోగ మును వెనుకఁ బుట్టిన కార్య మయిన శిరఃపాతమును ఒక్కసారియే కలిగినట్లు చెప్పినందున నక్రమాతిశయోక్తి యయినది.

(౭.) చపలాతిశయోక్తి — కారణమును ప్రసంగించినంతమాత్రముననే కార్యము కలిగినట్లు చెప్పినచో చపలాతిశయోక్తి:—భర్త గ్రామాంతరము పోయెదనని చెప్పఁగానే భార్య కుంగరములు కంక ణము లయ్యెను. భర్త గ్రామాంతరము పోకయే కారణ మయిన ప్రయాణముయొక్క నామోచ్చారణము చేయుటచేతనే భార్యయందుఁ గార్య మయిన కృశత్వ మనఁగా వ్రేళ్ళకు పెట్టుకోఁదగిన యుంగరములే చేతులకుఁ బట్టినంత చిక్కుట చెప్పఁబడినందున చపలాతిశయోక్తి యయినది.

(ర.) అత్యంతాతిశయోక్తి:— కారణము కంటె కార్యమే ముందుగా జరిగినట్లు చెప్పినచో నత్యంతాతిశయోక్తి. ఆయింతికి మొదటనే ప్రణయకోపము పోయెను; తరువాత భర్తవచ్చి బతిమాలెను. భర్తప్రార్థించుటయే తడవుగా కోపము పోయెనని చెప్పుటకు కార్యమయిన కోపశాంతియే ముందుగాఁ గలిగి కోపశాంతికిఁ గారణ మయిన బతిమాలుటయే తరువాత జరిగినట్లు చెప్పఁబడినందున నత్యంతాతిశయోక్తి యయినది.

౧౪. తుల్యయోగితాలంకారము— (౧) ప్రకృతములకుఁగాని, అప్రకృతములకుఁగాని, ఏకధర్మమును జెప్పినచో మొదటి తుల్యయోగిత. ప్రకృతతుల్యయోగిత:— చంద్రుఁ డుదయించఁగానే పద్మములును జారిణుల ముఖపద్మములును ముడుచుకొని పోవుచున్నవి. చంద్రోదయసమయమునందు వర్ణింపఁ దగిన ప్రకృతము లగు పద్మములకును జారిణుల ముఖములకును ముడుచుకొని పోవుట యను నేకధర్మము చెప్పఁబడినందున ప్రకృతతుల్యయోగిత యయినది. అప్రకృతతుల్యయోగిత:— ఆమె శరీరమార్దవమును జూడఁగా మాలతీకుసుమములందును రసాలపల్లవములందును కాఠిన్యముతోఁచుచున్నది. ప్రకృతమైనకామినీశరీరవర్ణనమునం దప్రకృతము లయినమాలతీపువ్వులకును మామిడిచిగుళ్ళకును కఠినత్వ మనునేకధర్మము చెప్పఁబడినందున నప్రకృతతుల్యయోగిత యైనది.

(౨). హితాహితవస్తువులయం దేకక్రియను వర్ణించినచో రెండవతుల్యయోగిత:— ఆరాజు శత్రుగృహములయందును మిత్రగృహములయందును కాంచనవృద్ధియే కలిగించెను. ఇక్కడ నహితుల యిండ్లలోను హితులయిండ్లలోను కాంచనవృద్ధి యనెడి యేకక్రియయే

వర్ణింపఁబడినందున రెండవతుల్యయోగిత యైనది. కాంచన మనఁగా బంగారమును, ఉమ్మెత్తయును.

(3) ఉత్కృష్టగుణము గలపదార్థములతో వర్ణ్యమును సమ పఱిచి యేకధర్మము చెప్పినచో మూఁడవతుల్యయోగిత :— ఓరాజా! ఇంద్రుఁడును కుబేరుడును నీవును లోకపాలురు. ఇక్కడ నుత్కృష్ట గుణము గల యింద్రకుబేరులకును వర్ణ్యుఁ డైన రాజునకును జేర్చి లోక పాలత్వ మనెడి యేకధర్మము చెప్పఁబడినందున మూఁడవతుల్యయోగిత యైనది.

౧౫. దీపకాలంకారము — ప్రకృతములకును అప్రకృతములకును నేకధర్మమును జెప్పినచో దీపకము:—ఓరాజా! తాపముచే సూర్యుఁడును ప్రతాపముచే నీవును దుర్నిరీక్ష్యు లగుచున్నారు. ఇక్కడ వర్ణ్య మైన రాజునకును అవర్ణ్య మైన సూర్యునకును దుర్నిరీక్ష్యత యను నేకధర్మము చెప్పఁబడినందున దీపకమయినది.

౧౬. ఆవృత్తిదీపకాలంకారము — దీపమున కావృత్తి కలిగినచో నావృత్తిదీపకము. ఇది పదావృత్తి, అర్థావృత్తి, పదార్థావృత్తి, అని త్రివిధము.

(౧) పదావృత్తిదీపకము — వచ్చినపదమే మరల వచ్చినచో పదావృత్తిదీపకము కామినియు వలపు గొలుపు చున్నది; పూవులును వలపు గొలుపు చున్నవి. ఇక్కడ నర్థము వేఱైనను వలపుగొలు పను పదమే మరలఁ బ్రయోగింపఁబడినందున పదావృత్తి యయినది.

(౨) అర్థావృత్తిదీపకము —వచ్చినయర్థమే మరల వచ్చినచో నర్థావృత్తిదీపకము :— మల్లికలును పూచుచున్నవి; కదంబములును పుష్పించుచున్నవి. ఇక్కడ పూచు పుష్పించు పదములు భిన్నము

లయినను వానియర్థ మొక్కటియే యయి వచ్చినయర్థమే మరల వచ్చినందున నర్థావృత్తిదీపక మయినది.

(౩) ఉభయావృత్తి (పదార్థావృత్తి) దీపకము — పదార్థముల రెంటిని గూడ నావృత్తిగలిగినచో పదార్థావృత్తి దీపకము :— వర్ష యోగము వలన నెమళ్ళును మోదించినవి; చాతకములును మోదించినవి. ఇక్కడ మోదించె ననుపదము రెండుమార్లు వచ్చుటయే కాక యర్థముకూడ రెండుచోట్ల సంతోషించె నని యొక్కటియే యయినందున నుభయావృత్తిదీపక మయినది.

౧౭. ప్రతివస్తూప మాలంకారము — ఒక సామాన్యధర్మమును రెండువాక్యములయందు భిన్నపదములచేఁ జెప్పినచో ప్రతివస్తూపమ :— సూరుఁడు తాపముచేత రాజిల్లును; శూరుఁడు చాపముచేత భ్రాజిల్లును. ఇక్కడ రెండు వాక్యములయందు సూరునకును శూరునకును ప్రకాశించుట యను సామాన్యధర్మము వరుసగా రాజిల్లు భ్రాజిల్లు ననుభిన్నపదములచేఁ జెప్పబడినందునఁ బ్రతివస్తూపమ యయినది.

౧౮. దృష్టాంతాలంకారము — రెండు వాక్యములయందు భిన్నధర్మములను బింబప్రతిబింబభావముచేతఁ జెప్పినచో, దృష్టాంతము:— లోకములో నీవే కీర్తిమంతుఁడవు; చంద్రుఁడే కాంతిమంతుఁడు. ఇక్కడ రెండువాక్యములయందు రాజునకును చంద్రునకును భిన్నధర్మము లయినకీర్తిమత్త్వమును కాంతిమత్త్వమును బింబప్రతిబింబభావముచేఁ జెప్పఁబడినందున దృష్టాంత మయినది. బింబప్రతిబింబభావ మనఁగా నుపమానోపమేయములయొక్క ధర్మములను వేఱువాక్యములయందు వేఱుగాఁ జెప్పినను వాని రెంటికిని పరస్పర సామ్యము గమ్యమయి యుండుట.

౧౯. నిదర్శనాలంకారము — వాక్యార్థవృత్తినిదర్శన, పదార్థవృత్తినిదర్శన, పదసదర్థబోధనరూపనిదర్శన, అని నిదర్శన త్రివిధము.

(౧) వాక్యార్థవృత్తినిదర్శన— సదృశములయిన వాక్యార్థముల కైక్యము నారోపించినచో, వాక్యార్థవృత్తినిదర్శన:— దాతకు పారుష్యము లేకపోవుట చంద్రునకుఁ గళంకము లేకపోవుటయే. ఇక్కడ నుపమానోపమేయ ప్రాయము లయినసదృశవాక్యములయందు దాతయొక్క పారుష్యాభావము చంద్రునికళంకరాహిత్యమే యని యైక్యము నారోపించుటచేత వాక్యార్థవృత్తినిదర్శన మైనది.

(౨) పదార్థవృత్తినిదర్శన — ఒకపదార్థమున కన్యధర్మము నారోపించి వర్ణించినచో పదార్థవృత్తినిదర్శన:— ఓకాంతా! నీనేత్రయుగళము నీలాంబుజద్వయవిలాసమును ధరించినది. ఇక్కడ నేత్రయుగళ మనుపదార్థమునకు నీలాబ్జములయందే యుండెడు నీలాబ్జవిలాస మనెడియన్యధర్మ మారోపింపఁబడినందున పదార్థవృత్తినిదర్శన యయినది.

(3) సదసదర్థబోధనరూపనిదర్శన — (క) ఒక రొక కార్యమును జేసి దృష్టాంతభూత మయినయాకార్యముచే నితరుల కసదర్థమును బోధించినచో, అసదర్థబోధనరూపనిదర్శన:— రాజవిరోధి నశించు నని తెలుపుచుఁ జంద్రోదయమునఁ జీఁకటి నశించుచున్నది. ఇచ్చట రాజవిరోధముచేత నశించుచున్న చీఁకటి స్వనాశన మను కార్యముచే రాజవిరోధి తనవలెనే నశించు నని యను కసదర్థమును బోధించునట్లు వర్ణింపఁబడినందున, అసదర్థబోధనరూపనిదర్శనయయినది. (చ) పయియట్లే సదర్థమును బోధించినచో సదర్థబోధనరూపనిదర్శన:— సంపదలకు సుహృదనుగ్రహము ఫలమని బోధించుచు సూర్యుఁ డుదయించుచు నీ పద్మములకు శ్రీ నిచ్చుచున్నాఁడు. ఇచ్చట కమలములకు

శోభ నిచ్చుచున్న సూర్యుఁడు స్వకార్యముచేఁ బద్మములకు సిరుల నిచ్చుచున్న తీరుగనే యభ్యుదయకాలమున సుహృదులకు సిరులు కలిగింపవలె నని యితరులకు సదర్థమును బోధించునట్లు వర్ణింపఁబడి నందున, సదర్థబోధనరూపనిదర్శన యయినది.

౨౦. వ్యతిరేకాలంకారము — ఉపమానోపమేయములకు సామాన్యమయిన ధర్మమును జెప్పక వ్యతిరేకముగా నుండు ధర్మమును జెప్పినచో వ్యతిరేకము :— సత్పురుషులు శైలములవలె మహోన్నతులయినను ప్రకృతికోమలులు గదా. ఇక్కడ నుపమేయ మగు సత్పురుషులకు నుపమాన మగు పర్వతములకును గలసామాన్యకాఠిన్యము, చెప్పఁబడక వ్యతిరేక మయిన కోమలత్వము చెప్పఁబడినందున వ్యతిరేక మయినది.

౨౧. సహోక్త్యలంకారము — హృదయరంజకముగా సహార్థకమును (తోడను) గూర్చి చెప్పినచో, సహోక్తి :— నీకీర్తి నీశత్రువులతోడఁగూడ దిగంతముల కేగినది. ఇక్కడ పాఱిపోయి దిగంతములను జేరెడు శత్రువులతోఁ గూడఁ జేర్చి దిగంతములవఱకును వ్యాపించిన కీర్తిని జెప్పుటచేత సహోక్తి యయినది.

౨౨. వినోక్త్యలంకారము — వినోక్తి రమ్యస్వరూపయునియు హేయస్వరూపయునియు, ద్వివిధము. (౧) ఒకవస్తువు లేకపోవుటచేత వర్ణ్యము రమ్య మగు నని వర్ణించినచో రమ్యస్వరూప :— ఓరాజా! నీసభ దుష్టులులేక ప్రకాశించుచున్నది. ఇక్కడ దుష్టులను పదార్థము లేకపోవుటచేత వర్ణ్య మగుసభ రమ్యముగా నున్నదని వర్ణించుటచే రమ్యస్వరూప యయినది. (౨) ఒకవస్తువు లేకపోవుటచేత వర్ణ్యము రమ్య మగు నని వర్ణించినచో హేయస్వరూప :— విద్యాహృద్యయయినను వినయము లేక ప్రకాశింపకున్నది. ఇక్కడ వినయ మనుపదార్థము

లేకపోవుటచేత వర్ణ్యమగు విద్య యుపమానముగా నున్నదని వర్ణించుటచే హేతుస్వరూప మయినది. దీనికి వరుసగా చారుతావినోక్తి, అచారుతావినోక్తి అని పేళ్ళు.

౨౩. సమాసోక్త్యలంకారము—ప్రస్తుతవృత్తాంతమును వర్ణించుచుండఁగా, అప్రస్తుతవృత్తాంతము స్ఫురించినయెడల సమాసోక్తి:— చంద్రుఁడు రక్తుఁడయి ప్రాచీముఖమును నానుచున్నాఁడు. ఇక్కడ చంద్రుఁ డెఱ్ఱనయి తూరుపుదిక్కు యొక్క యగ్రమునందుఁ గానఁబడుచున్నాఁడని ప్రస్తుతవృత్తాంతము వర్ణింపఁబడుచుండఁగా, చంద్రుఁడని పుంలింగపద ముండుటచేతను ప్రాచీ యని స్త్రీలింగపద ముండుటచేతను రక్తుఁడు ముఖము నను పదముల కనురాగము గలవాఁడు మోము నని యర్థము లుండుటచేతను కాముకుఁడు కామినీముఖమును చుంబించుచున్నాఁ డని యప్రస్తుతవృత్తాంతము స్ఫురించుటచేత సమాసోక్తి యయినది. సమాస మనఁగా సంక్షేపము. ప్రకృతాప్రకృతవృత్తాంతములు సంక్షేపముగా నిందు చెప్పఁబడును గాన దీనికి సమాసోక్తి యని పేరువచ్చినది.

౨౪. పరికరాలంకారము:—సాభిప్రాయవిశేషము లున్నచో పరికరము:—శీతాంశుధరుఁ డైనహరుఁడునా తాపమును బోఁగొట్టును గాక! ఇక్కడ శీతాంశుధరుఁ డనువిశేషణము తాపనివారణసామర్థ్యాభిప్రాయగర్భితముగనుక పరికరాలంకార మయినది. ప్రకృతార్థమునకు విశేషతాత్పర్యమును గలిగించు విశేషణములు సాభిప్రాయవిశేషణములు.

౨౫. పరికరాంకురాలంకారము—సాభిప్రాయ విశేష్యమున్నచో పరికరాంకురము:—చతుర్భుజుఁడు మీకు బురుషార్థచతుష్టయము నిచ్చును గాక! ఇక్కడఁ జతుర్భుజుఁ డను విశేష్యము చేత నాలుగు

చేతులు గల విష్ణువే నాలుగుపురుషార్థముల నీయ సమర్థుఁడని బోధించు చుండుటచేతఁ బరికరాంకుర మయినది.

౨౬. శ్లేషాలంకారము—అనేకార్థములు గలుగునట్లు చెప్పినచో శ్లేషము:—అది ప్రకృతశ్లేష మనియు, అప్రకృతశ్లేష మనియు, ప్రకృతాప్రకృతశ్లేష మనియు, త్రివిధము.

(౧) ప్రకృతశ్లేషము—అనేకార్థములు కేవలవర్ణ్యములయందే యిచ్చినచోఁ బ్రకృతశ్లేషము:— శంకరుఁడు మాధవుండు మాకు విజయ మిచ్చుఁగాక! ఇక్కడ సుఖము నిచ్చువాఁ డైన లక్ష్మీవల్లభుఁ డైన శంకరుం డనియు, శంకరుఁడు మాధవుం డను పదముల కర్థ మయి కేవల ప్రకృతభూతు లయిన హరిహరులకు శ్లేషచే నర్థ మగుటవలన ప్రకృతశ్లేష మయినది. శివపరమున ఉమాధవుఁ డని పదవిభాగము.

(౨) అప్రకృతశ్లేషము—అనేకార్థములు కేవలావర్ణ్యముల యందే యిచ్చినచో నప్రకృతశ్లేషము:—ఓకాంతా! నీముఖము శంబర సంగతాబ్జతుల్య మయి యున్నది. ఇక్కడ శంబర సంగతాబ్జ మయిన ప్రకృతమునకే హరిణయుక్తుఁ డయిన చంద్రుఁ డనియు నీటిని పొందిన పద్మ మనియు రెండర్థములు కలిగియున్నందున నప్రకృతశ్లేష మయినది.

(౩) ప్రకృతాప్రకృతశ్లేషము—ఒక యర్థము ప్రకృతపరము గాను మఱియొక్క యర్థ మప్రకృతపరముగాను నున్నచో ప్రకృతాప్రకృతశ్లేషము—పద్మాకర మూర్మికాకంకణాదులచే శోభిల్లుచున్నది. ఇక్కడ పద్మాకర మూర్మికాకాంకణాదు లనుదానికి కొలఁకు తరంగములచేతను జలబిందువులచేతను నని యొకప్పుడు ప్రకృతవర్ణ్యపరము గాను లక్ష్మియొక్క హస్త ముంగరములచేతను కడియములచేతను

నని వైనప్పు డప్రకృత మైన పక్షిమహా స్తపరముగాను అర్థద్వయము కలిగినందున ప్రకృతాప్రకృత మైనది.

౨౭. అప్రస్తుతప్రశంసాలంకారము — ప్రస్తుతాంశము తోఁచు నట్లుగా నప్రస్తుతాంశమును ప్రశంసించినచో నప్రస్తుతప్రశంస:— ఇంద్రునిఁదప్ప వేఱొకని యాచింపని యాచాతకపక్షియే పక్షులలో నెల్ల సుకృతి. ఇక్కడ నింద్రుని దక్క వేఱొక్కని చాతకపక్షి యాచింప దని యప్రస్తుతవిషయమును జెప్పుటవలన క్షుద్రులను యాచింపఁబోవక గుణాఢ్యు నాశ్రయించినవాఁడే సుకృతి యను ప్రస్తుతాంశము తోఁచుచున్నది గనుక, అప్రస్తుతప్రశంస యయినది.

౨౮. ప్రస్తుతాంకురాలంకారము — ఒక ప్రస్తుతవిషయము ద్యోతక మగునట్లుగా మఱియొక ప్రస్తుతవిషయమును వర్ణించినచో ప్రస్తుతాంకురము. దీనినే యన్యాదేశ మందురు. ఓభృంగరాజా! చక్కని మాలతీకుసుమమును విడిచి కంటకములతోఁ గూడిన మొగలి పూవు మీఁదికిఁ బోయెద వేమి? ఇక్కడ నొక కులకాంత యొక తోఁటలో బరాంగనాసంగమార్థియై వల్లభుఁడు పోవుచుండఁగాఁ బ్రస్తుత మగపడుచు మాలతీపుష్పము నుండి మొగలిపూవు మీఁదికిఁ బోవుచున్న తుమ్మెదను గూర్చి యన్న పయివాక్యము వలన సుఖప్రద మయిన కులాంగనా సంగమును విడిచి యపాయబహుళ మయిన పరాంగనాసంగమున కేలపోయెద వని భర్త నుద్దేశించి పలుకుట యను మఱియొక ప్రస్తుతాంశము బోధపడుచున్నది గనుక ప్రస్తుతాంకుర మయినది.

౨౯. పర్యాయోక్త్యలంకారము—(1) ఏవస్తువు నేప్రకారముగా వర్ణించిన సుబోధ మగునో యాప్రకారముగా వర్ణింపక భంగ్యంతరముచేఁ జెప్పినచో మొదటిపర్యాయోక్తి రాహువధూయౌవన

మును వ్యర్థపఱిచిన దేవుని గొలిచెదను. ఇక్కడ విష్ణువును లక్ష్మీవల్ల భాదిప్రసిద్ధవిశేషణములచే సుబోధ మగునట్లు చెప్పక రావణుని శిరోమాత్రావశిష్టునిగాఁ జేసి యాలింగనాది క్రియాశక్తి లేకపోవుటచే నాతనిభార్యయొక్క యౌవనమును వ్యర్థపఱిచినవాఁ డను విశేషణమును వాడుటచే మొదటిపర్యాయోక్తి యయినది. (2) తన యభీష్టకార్యమును కార్యాంతరమిషచేత సాధించుకొనినట్లు వర్ణించినచో రెండవపర్యాయోక్తి — ఓదంపతులారా! మీరీపొదరింట నుండుఁడు. నే నాచూతలతను చూచి వచ్చెదను. మామిడిచెట్టును చూచివచ్చెద ననుమిషచేతఁ దొలఁగి తనయభీష్ట మయిన వధూవరుల యథేష్టావిహారమును కూర్చినట్లు వర్ణింపఁబడినందున రెండవపర్యాయోక్తి యయినది.

౩౦. వ్యాజస్తుత్యలంకారము — (1) నిందావ్యాజమున స్తుతి చేసినచో మొదటివ్యాజస్తుతి — ఓగంగా! మహాపాపులను స్వర్గమునకుఁ బంపుచున్న నీకు వివేక మెక్కడిది? ఇక్కడ బయికి నిందవలెఁ గనఁబఱిచినను నీవు పాపులను సహితము పావనులను జేసి స్వర్గసుఖమున కర్హులను జేయుచున్నా వను స్తుతియే యుద్దేశింపఁ బడినందున మొదటివ్యాజస్తుతి యయినది. (2) స్తుతివ్యాజమున నింద చేసినచో రెండవవ్యాజస్తుతి — ఓదూతీ! నాపెనిమిటిని బిలువఁబోయి నానిమిత్త మయి యాతని దంతక్షతనఖక్షతములకు లోనయి శ్రమ నొందితివి గదా? నీ వెంత మంచిదానవు? ఇక్కడ బయికి స్తుతివలెఁ గనఁబఱిచినను నానిమిత్త మయి పోయి దుష్టురాల వయి నాపతితోనే సంభోగించి వచ్చితి వను దూషణమే యుద్దేశింపఁబడినందున నిందాగర్భిత మయిన రెండవవ్యాజస్తుతి యయినది.

౩౧. వ్యాజనిందాలంకారము — ఒక వస్తువును నిందించుటచే మఱియొక వస్తువు యొక్క నింద తోఁచు నెడల వ్యాజనింద — నన్నిట్లు దుఃఖము లనుభవింపు మని లిఖించిన బ్రహ్మ నింద్యుఁడు కాఁడు; ఆతని శిర మొక్కటి మాత్రమే ఖండించిన శివుఁడు నింద్యుఁడు. బ్రహ్మదేవుని నైదు తలలును దునుమక యొక్కతలను మాత్రమే తుని మిన శివుఁడు దూష్యుఁ డను శివనిందవలన బ్రహ్మవధార్హుఁడని బ్రహ్మ నింద తోఁచుటచేత వ్యాజనింద యైనది.

౩౨. ఆక్షేపాలంకారము — ఉక్తప్రతిషేధ రూపము, నిషేధాభాస రూపము, తిరోహితనిషేధవిధివ్యక్త రూపము, అని యిది త్రివిధము.

(౧) ఉక్తప్రతిషేధ రూపము: — ఒకవస్తువును ముందుగాఁ గోరి, తరువాత, వస్త్వంతరము కలుగుటనుబట్టి విచారణమీఁద దానిని నిషేధించినచో నుక్తప్రతిషేధ రూపాక్షేపము — ఓచంద్రా! నీ వొక్కసారి దర్శన మిమ్ము. అక్కఱ లేదు. నాప్రియురాలి ముఖ చంద్రబింబ మున్నది. ఇక్కడ మొదటఁ జంద్రబింబమును గోరి, తరువాత నాహ్లాదకర మైన కాంతా ముఖ చంద్రబింబమును దలఁచుకొని చంద్రుని నిషేధించుటచేత నుక్తప్రతిషేధరూప మయినది.

(౨) నిషేధాభాసరూపము — నిషేధము బాధింపఁబడినదయి యర్థాంతరమునందుఁ బర్యవసించుచు నొక విశేషార్థము నుదెచ్చినచో నిషేధాభాస రూపాక్షేపము — ఓరాజా! నేను దూతిని గాను. నీప్రియురాలిని దహించుచున్న యగ్నిసమ మగు విరహతాపమునుజూడ లేక వచ్చినదానను. ఇక్కడ దూతియే తాను దూతిని కానని చెప్పుటచే నిషేధ మాభాసమయి నేను సామాన్యముగాఁ గార్యార్థమయి సమయోచితముగా మృషావాక్యములు పలుకు దూతిని కానను

నర్థాంతరమునందుఁ బర్యవసించుచు నీవు వచ్చి యిప్పుడే ప్రియురాలి ప్రాణములు కాపాడుకోవలె నను విశేషార్థమును దెచ్చినందున నిషేధాభాసరూప మయినది.

(౩) తిరోహిత నిషేధవిధివ్యక్తరూపము — తన కిష్ట మయిన నిషేధమును జెప్పక తన కిష్టములేని విధిని జెప్పుచు స్వాభిమతనిషేధము గర్భీకృత మగునట్లు చేసినచో తిరోహిత నిషేధవిధివ్యక్తరూపాక్షేపము:—ఓప్రియవల్లభా! నన్నిందు విడిచి దేశాంతరము పొమ్ము. నీవేగిన యుత్తరక్షణముననే నే నాదేశమునఁ బుట్టి మరల నీపాదసేవ చేసెదను. ఇక్కడఁ దన కిష్ట మయినప్రియు దేశాంతర గమన నిషేధమును జెప్పక, తన కిష్టము లేని దేశాంతరగమనవిధినే చెప్పుచు తన మరణమును సూచించు వాక్యములతోఁ దనబ్రతుకు గోరినయెడలఁ బోవలదను నిషేధము గమ్య మగునట్లు చేయఁబడినందున తిరోహిత నిషేధవిధివ్యక్తరూప మయినది.

౩౩. విరోధాభాసాలంకారము — రెండు వాక్యములు పైకన్యోన్యవిరుద్ధార్థములుగాఁ గనఁబడు చున్నను, అర్థాంతరముచేత విరోధము పరిహార మయినచో విరోధాభాసము—ఆరాజు నీతిమంతుఁడయ్యును ననీతిని ప్రజా పాలనము చేసెను. ఇక్కడ నీతిమంతుఁడయ్యు నీతిమాలి ప్రజాపాలనము చేసె నన్నయర్థము పైకి స్ఫురించుచున్నను, అనీతి యనుదాని కీతిబాధలు లేకుండ నని యర్థాంతర మయి పయివిరోధము పరిహార మయినందున విరోధాభాస మయినది.

౩౪. విభావనాలంకారము — విభావనాలంకార మాఱువిధములు గలది.

(౧) కారణము లేకయే కార్యము పుట్టినట్లు చెప్పినచో మొదటివిభావన — ఓకాంతా! నీపాదములు లత్తుక పెట్టక పోయినను

నెట్టి నగు చున్నవి. ఇక్కడ లత్తుకపూఁత యను కారణము లేకయే రక్తిమ యను కార్యోత్పత్తి కలిగినట్లు సహజదారుణము లైనచరణములు వర్ణింపఁబడినందున మొదటివిభావన యైనది.

(౨) సంపూర్ణకారణము లేకయే కార్యము పుట్టినట్లు చెప్పినచో రెండవవిభావన — మన్మథుఁడతిమృదులాస్త్రములచేతనే ముల్లోకములను జయించెను. లోకముల గెలుచుటకు సంపూర్ణకారణము లైనకఠినబాణములు లేకయే కోమలపుష్పబాణము లనెడి యసంపూర్ణకారణముచేతనే లోకవిజయకార్యము నిర్వహించినట్లు చెప్పఁబడినందున రెండవవిభావన యైనది.

(౩) ప్రతిబంధక మున్నను కార్యము కలిగినట్లు చెప్పినచో మూఁడవవిభావన — ఓరాజా! నీఖడ్గాహి పరనరేంద్రప్రాణానిలము లనే పానము చేయుచున్నది. నరేంద్రు లనఁగా రాజులును విషవైద్యులును గనుక, ఖడ్గ మనెడిసర్పము విషవైద్యప్రతిబంధ మున్నను నరేంద్రప్రాణములు గొనుట యనుకార్యము కలిగినట్లు చెప్పఁబడినందున మూఁడవవిభావన యైనది.

(౪) కారణము కానిదానివలనఁ గార్యము కలిగినట్లు చెప్పినచో నాలవవిభావన — ఆహా! ఇక్కడ శంఖమునందు వీణానినాదము కలుగుచున్నది! వీణానినాదము పట్టుటకు శంఖము కారణము కాకపోయినను, కామినీకంఠమును శంఖముగాను గళస్వరమును వీణానినాదముగాను నుద్దేశించి కారణము గానిశంఖమువలన వీణానినాదకార్యము కలిగినట్టు చెప్పఁబడినందున నాలవవిభావన యైనది.

(౫) విరుద్ధకారణమువలనఁ గార్యము కలిగినట్లు చెప్పినచో నైదవవిభావన — ప్రియురాలి నెడఁబాసిన నన్ను శీతాంశుకిరణములే సంతాప పెట్టుచున్నవి. ఇక్కడ తలంప గొలుపవలసినశీతాంశుకిరణము

లను నిరుద్ధకారణమువలన సంతాపమను కార్యము పుట్టినట్లు చెప్పఁబడి నందున నైదవవిభావన యైనది.

(౬). కార్యమువలననే కారణము పుట్టినట్లు చెప్పినచో నాఱవవిభావన — ఓరాజా! నీకరకల్పవృక్షమువలననే కీర్తిపయఃసముద్రము పుట్టుచున్నది. కల్పవృక్షములు పుట్టుటకు పాలసముద్రము కారణ మైనట్లు జగత్ప్రసిద్ధమయి యుండఁగా నిక్కడ కరకల్పక మనెడి కార్యమువలననే యశఃపయోనిధి యను కారణము కలిగినట్లు చెప్పఁబడినందున నాఱవవిభావన యైనది.

3౫. విశేషోక్త్యలంకారము:-సంపూర్ణమయిన కారణమున్నను కార్యము పుట్టలే దని చెప్పినచో విశేషోక్తి :— అమెహృదయములో స్మరదీపము పూర్ణముగా వెలుఁగుచున్నను స్నేహమావంతయు తగ్గ లేదు. లోకములో దీపము వెలుఁగుటచేత చమురు తగ్గుట ధర్మ మయి యుండఁగా నిక్కడ స్మరదీపము వెలుఁగుట యనుసంపూర్ణ కారణమున్నను స్నేహ మనుచమురు తగ్గుట యనుకార్యము పుట్ట నట్లు చెప్పఁబడినందున విశేషోక్తి యైనది. స్నేహమనఁగా చమురును ప్రేమమును.

3౬. అసంభవాలంకారము:— జరిగినకార్యము విస్మయమయి యట్లు జరుగు నని యెవ్వరికి నూహించుటకే శక్యము కాదని వర్ణించినచో నసంభవము:— ఒకగొల్ల శిశువు కొండ నెత్తె నని యెవ్వఁ డనుకొనును? ఇక్కడ గోపాలబాలుఁడైన కృష్ణుఁడు గోవర్ధన పర్వత మెత్తె నని యెవ్వరు ననుకోరే దని వర్ణింపఁబడినందున నసంభవ మైనది.

3౭. అసంగత్యలంకారము;—ఇది మూఁడువిధములు గలది.

(౧.) కారణ మొకచోటఁ గలుగఁగాఁ గార్యము మఱియొక చోటఁ గలిగె నని చెప్పినచో మొదటి యసంగతి:— దుష్టులు రాజు చెవి కొఱుకఁగా భృత్యజనులు చచ్చు చున్నారు. చెవి కొఱుకుట యనుకారణము రాజునందుఁ గలుగఁగా కార్య మయిన మరణ మచ్చటం గలుగక భృత్యులయందుఁ గలుగుచున్న దని చెప్పఁబడి నందున నసంగతి యైనది. చెవిగొఱుకుట యనఁగాఁ గొండెములు చెప్పుట గాని దుష్టులకొండెముల మూలమున ప్రకృతివర్గమునకు ప్రాణాపాయము వచ్చుచున్న దని తాత్పర్యము.

(౨.) ఒకచోటఁ జేయఁదగినపని మఱియొకచోట చేసినట్లు చెప్పినచో రెండవ యసంగతి:—ఓకాంతా! నీవు కంకణములు హస్తములందు ధరింపవలెనుగాని యిట్లు కన్నులందుఁ గంకణములు ధరింప వచ్చునా? ఇక్కడఁ జేతులయందు ధరింపవలసిన కంకణములు కన్నులయందుఁ ధరింపఁబడినట్లు చెప్పఁబడినందున నసంగతి యైనది. కంకణము లనఁగా హస్తాంగదము లనియు జలబిందువు లనియు నెఱుంగునది.

(౩.) ఒక కార్యమును జేయఁ దలఁచి తద్విరుద్ధమైన కార్యమును జేసినట్లు వర్ణించినచో మూడవయసంగతి:— దానవారిని మనస్సునందు నిలుప బూని యతఁడు దానవారిని విడిచెను. ఇక్కడ దానవారిని మనస్సునం దుంచుకొనఁ దలఁచి దానవారిని విడుచుట యను విరుద్ధకార్యము చెప్పినట్లు చెప్పఁబడినందున నసంగతియైనది. దానవారియనఁగా విష్ణుమూర్తి యనియు దానజల మనియుఁ దెలియునది.

౩౮. విషమాలంకారము—అననురూపఘటనారూప మనియు, విరూపకార్యోత్పత్తిరూప మనియు, అనిష్టావాప్తిరూపమనియు, విషమాలంకారము మూడువిధములు గలది.

(౧.) అననురూపఘటనారూపవిషమాలంకారము:— ఒకదాని కొకటి తగనిపదార్థముల సంఘటనమును వర్ణించినచో ననను రూప ఘటనారూపము:— ఈ శిరీషకుసుమ సుకుమారశరీర మెక్కడ? దుర్భర స్మరజ్వరపరితాప మెక్కడ? ఇక్కడ మెత్తనిమేని కననురూపమగు దుస్స్వరమన్మథతాపము ఘటిల్లుట వర్ణింపఁబడినందున ననను రూపఘట నారూప విషమాలంకార మయినది.

(౨.) విరూపకార్యోత్పత్తి రూపవిషమాలంకారము:— కారణ విరుద్ధమైన కార్యముత్పత్తియైనట్లు వర్ణించినచో విరూపకార్యోత్పత్తి రూపము:— ఓరాజా! నీఖడ్గము నల్లని దయ్యును దెల్లనికీర్తిని ఘటించు చున్నది. కారణ మెట్టిగుణము కలది యగునో కార్య మట్టిగుణము కలదియే కావలసినది ధర్మ మగుచుండఁగా నల్లనికత్తి యనుకారణము వలనఁ దెల్లనికీర్తి యనువిరూపకార్యము కలిగినట్లు చెప్పఁబడినందున విరూపకార్యోత్పత్తిరూపమయినది.

(౩.) అనిష్టావాప్తిరూపవిషమాలంకారము:— ఒకయిష్టకార్య ప్రాప్తికయి యత్నింపఁగా నిష్టలాభము కలుగక యనిష్టము కలిగినట్లు చెప్పినచో ననిష్టావాప్తిరూపము:— మూషక మహారాజు చేతఁ బెట్టెను గొఱికియందున్న పాముచే భక్షింపఁబడియె. ఇక్కడ నాహారమునిమిత్త మయి పెట్టెను గొఱికినయెలుక కాహారము లభింపక పోవుటయే కాక యనిష్ట మైనప్రాణహాని కూడ సంభవించినందున ననిష్టావాప్తిరూప మయినది.

౩౯. సమాలంకారము — అనురూపవర్ణనరూపము, కారణ సారూప్యవర్ణనరూపము, అక్లేశ కార్యసిద్ధివర్ణనరూపము, అని సమా లంకారము త్రివిధము.

(౧.) అనురూపవర్ణనరూపము — అనురూపము లగు రెండు వస్తువులకు సంఘటనము వర్ణించినచో మొదటిసమాలంకారము:— తనకుఁ దగినస్థల మని ముక్తాహార మామె కంఠము నాశ్రయించెను. ఇక్కడ ముక్తాహారమునకు గళప్రదేశ మనురూపస్థల మని వర్ణింపఁబడినందున ననురూపవర్ణనరూపసమాలంకార మయినది.

(౨.) కారణసారూప్యవర్ణనరూపము — కార్యమునకుఁ గారణముతోడ సమాన రూపత్వమును వర్ణించినచో రెండవసమాలంకారము:— ఓలక్ష్మీ! నీటఁ బుట్టిన నీకు నీచోపసర్పణము సహజమే కదా? కారణ మైన నీటికి నీచోపసర్పణము సహజ మైనట్లే కార్య మైన క్షీరసముద్రసంభూత యగు లక్ష్మికిని నీచోపసర్పణ మనుసరూపత్వము వర్ణింపఁబడినందున కారణసారూప్యవర్ణనిరూపసమాలంకార మైనది. నీచోపసర్పణ మనఁగా జలపక్షమునఁ బల్లములకుఁ బోవుట యనియు, లక్ష్మిపక్షమున నీచులను జేరుట యనియుఁ దెలియునది.

(3.) అక్లేశకార్యసిద్ధివర్ణనరూపము — ఒకఁడు చేయఁదలఁచిన కార్యముకష్టము లేకుండ సిద్ధించి నట్లు వర్ణించినచో మూడవసమాలంకార మగును:—ఓబావా! వారణమును కోరిన నీకు రాజద్వారమున వారణమే లభించినది గదా? ఇక్కడ వారణమును గోరినవాని కనాయాసముగా వారణమే లభించి నట్లు చెప్పఁబడినందున నక్లేశకార్యసిద్ధి వర్ణనరూపసమాలంకార మయినది. వారణ మనఁగా నేనుఁగును, ద్వారనిరోధమును గనుక, ఏనుఁగును బహుమానము పొందఁగోరి పోయినవానికి రాజభటుల వలన నిరోధము కలుగఁగా భావమఱఁది పరిహాసముగాఁ బలికిన వాక్యము.

౪౦. చిత్రాలంకారము — ఒకఁడు చేయఁబూనినవనికి విపరీత మయిన ఫలమును బొందుటకు యత్నించినట్లు వర్ణించినచోఁ

చిత్రము — సుజనుఁ డౌన్నత్యమును పొందఁగోరి నమ్రతను వహించును. ఇక్కడ సుజనుఁడు వంగియుండుట యనెడుపని చేసి దానికి విపరీతఫల మయిన యున్నతి పొందఁగోరినందున చిత్రాలంకార మయినది.

౪౧. అధికాలంకారము — అధికాలంకారము రెండువిధములు గలది.

(౧.) విస్తార మయిన యాధారముకంటె నాధేయమున కాధిక్యమును వర్ణించినచో మొదటి యధికాలంకారము:— ఓరాజా! బ్రహ్మాండములను బుడ్బుదములవలె ధరించిన యీమహాజలము నీగుణములు నిలుచుటకుఁ జాలకున్నది. ఇక్కడ రాజునకు గుణములు మహాజలమును దాఁటిపోయె నని మహాధారమగు మహాజలము కంటెను నాధేయ మగు సుగుణజాల మధిక మయినట్లు వర్ణింపఁబడినందున మొదటియధికాలంకార మయినది.

(౨.) విస్తార మయిన యాధేయమున కంటె నాధారమునం దాధిక్యవర్ణనము చేసినచో రెండవ యధికాలంకారము:— ఓరాజా! నీయనంతగుణములు విశ్రమించి యుండుటచేత వాగ్బ్రహ్మ మంత గొప్పదే యనవచ్చును. ఇక్కడ రాజుయొక్క గుణము లన్నియుఁ దదాశ్రితకవికృతానంతకావ్యములం దిమిడె నని యాధేయ మయిన గుణజాలము కంటె నాధారమయిన కవివాగ్బ్రహ్మమునం దాధిక్యము వర్ణింపబడినందున రెండవయధికాలంకార మయినది.

౪౨. అల్పాలంకారము — అల్ప మయిన యాధేయవస్తువున కంటె నాధార మతిసూక్ష్మ మయినట్లు వర్ణించినచో నల్పాలంకారము:— ఇప్పుడీకాంతకు మణియుంగరము జపమాల యగుచున్నది. వ్రేలికిముడ వలసినది గనుక సూక్ష్మ మయిన యుంగర మను

నాధేయము మణిబంధమునకే వదులయి మణిమూలముచె యుండి విర హావస్థవలన మణిబంధ మనునాధార మతిసూక్ష్మత్వము పొందినట్లు వర్ణింపఁబడినందున నల్పాలంకార మయినది.

౪౩. అన్యోన్యాలంకారము — రెండువస్తువుల కన్యోన్యోప కారమును వర్ణించినచో నన్యోన్యము:— కంకణముచే హస్తమును హస్తముచేఁ గంకణమును శోభిల్లుచున్నవి. ఇక్కడ హస్తకంకణము లొకదానివలన నొకటి శోభిల్లుచున్న వని రెంటికిని పరస్పరోప కారము వర్ణింపఁబడినందున నన్యోన్య మయినది.

౪౪. విశేషాలంకారము—ఆధారరహితాధేయవర్ణనరూపము, ఏకానేక గోచరత్వవర్ణనరూపము, అశక్యకార్యాంతరకరణత్వవర్ణన రూపము, అని విశేషాలంకారము త్రివిధము.

(౧). ఆధారరహితాధేయ వర్ణనరూపము— ప్రసిద్ధ మయిన యాధారము లేకున్నను నాధేయవస్తువు లుండి కార్యకరములగుచున్న వని వర్ణించినచో మొదటివిశేషము:— సూర్యుఁ డస్తమించినను నాతని కిరణములు దీపముల నాశ్రయించి రాత్రియందును జీకట్లను భేదించుచున్నవి. ఇక్కడఁ బ్రసిద్ధాధార మగుసూర్యుఁడు లేకపోయినను తదాధేయము లగు కిరణము లుండి తమపని చేయుచున్నట్లు చెప్పఁ బడినందున విశేష మయినది.

(౨) ఏకానేకగోచరత్వ వర్ణనరూపము—ఒకవస్తువే యేక కాలమునం దనేకస్థలములయం దున్నట్లు వర్ణించినచో రెండవవిశే షము:— ఓచెలీ! నాకిప్పుడు లోపలను వెలుపలను ముందును వెను కను సర్వత్ర ప్రియుఁడే తోఁచుచున్నాఁడు. విరహిణికిఁ బ్రియుఁడను నొక్కవస్తువే బహుస్థలములయందుఁ గానఁబడుచున్నట్లు వర్ణింపఁబడి నందున విశేష మయినది.

(3) అశక్యకార్యాంతరవికృతివర్ణనరూపము — ఒక కొంచెపుఁ గార్యసిద్ధి కయి ప్రయత్నింపఁగా నసాధ్యవస్త్వంతరకరణము లభించి నట్లు వర్ణించినచో మూఁడవవిశేషము:— ఓరాజా! నిన్నుఁ జూచుట చేత మా కిప్పుడు కల్పవృక్షదర్శనము లభించినది. ఇక్కడ రాజదర్శనమున కయి యత్నింపఁగా దానిచేతనే యసాధ్య మయిన కల్పవృక్ష దర్శనకార్యకరణము తటస్థించినట్లు చెప్పఁబడినందున విశేష మయినది. రాజు వితరణగరిమచేతఁ గల్పవృక్షమువంటి వాఁ డని భావము.

౮౫. వ్యాఘాతాలంకారము — తథాకార్యతథాకారిత్వక్రియ, కార్యనిబద్ధకార్య విరోధిక్రియ, అని వ్యాఘాతము ద్వివిధము.

(౧) తథాకార్యతథాకారిత్వక్రియ— ఒక కార్యమునకు సాధన మయినదానిని తద్విరుద్ధ మైన మఱియొక కార్యమునకు సాధన మయిన దానినిగా వర్ణించినచో వ్యాఘాతము:— లోకమునకుసంతోషకరము లయినపుష్పములతో మన్మథుఁడు లోకములకు బాధను జేయు చున్నాఁడు. జగత్ప్రీతికి సాధన మయిన పుష్పములను తద్విరుద్ధ మైన జగద్బాధకు సాధనముగాఁ జేసినట్లు వర్ణింపఁబడినందున వ్యాఘాత మయినది.

ఒకఁ డొకపనికి సాధనముగాఁ జేసికొన్నదానిని తత్ప్రతి భటుఁడు తద్విరుద్ధ మయిన పనికి సాధనముగాఁ జేసికొన్నట్లు వర్ణించి నను వ్యాఘాతమే యగును:— తన వాఁడిచూపునఁ జూచి మరుని రూపు మాపిన యాశివునిఁ దనవాఁడిచూపునఁ జూచి పార్వతి మరల మరుని బ్రతికించుచున్నది. మన్మథదహనమునకు చూపే సాధన మయినను శివునిజయించి మన్మథునిపాలు చేసిన పార్వతిచూపే మన్మ థుని బ్రదికించుట. యను తద్విరుద్ధకార్యమునకు సాధన మయినట్లు వర్ణింపఁబడినందున వ్యాఘాత మయినది.

(౨) సౌకర్యనిబద్ధకార్యవిరోధిక్రియ:—ఏసాధనము చేత నొక కార్యము నిశ్చయింపఁబడునో యాసాధనముచేతనే తద్విరుద్ధకార్యము సుకరముగా సమర్థింపఁబడినట్లు వర్ణించినచో వ్యాఘాతము:— ఓ కుమారా! బాలుఁడవు గనుక నిన్ను రాజ్యమందు నిలిపెదను. ఓజనకా! బాలుఁడ నగుటచేతనే నన్ను రాజ్యమునందు నిలుప వల దని ప్రార్థించెదను. ఇక్కడ తండ్రి కుమారుని పడుచువాఁ డను హేతువుచేత రాజ్యమునందు నిలుప నిశ్చయింపఁగా ననుభవము లేని పడుచువాఁ డనెడి యా హేతువుచేతనే తద్విరుద్ధ మగు నిలుపఁగూడక పోవుటను సుకరముగా సాధించినట్లు వర్ణింపఁబడినందున వ్యాఘాత మయినది.

౮౬. కారణమాలాలంకారము:—వరుసగా నుత్తరోత్తరము లకు పూర్వపూర్వములు కారణము లయినట్లు గాని, పూర్వపూర్వ ముల కుత్తరోత్తరములు కారణము లయినట్లు గాని, కొన్ని సంగతు లను జెప్పినచోఁ గారణమాల:—నీతిచేత ధనమును, ధనముచేత వితరణమును, వితరణముచేతఁ గీర్తియు, కీర్తిచేత స్వర్గమును గలు గును. ఇక్కడ నుత్తరోత్తరములకుఁ బూర్వపూర్వములు హేతువు లుగాఁ జెప్పఁబడినందున మొదటి కారణమాల మయినది. నరకము పాపమువలనను, పాపము దారిద్ర్యమువలనను, దారిద్ర్యము దాన హీనతవలనను గలుగునుగాన దానపరుఁడవు కమ్ము. ఇక్కడఁ బూర్వ పూర్వముల కుత్తరోత్తరములు హేతువులుగాఁ జెప్పఁబడినందున రెండవకారణమాల యైనది.

౮౭. ఏకావళ్యలంకారము:— ఉత్తరోత్తరపదమునకుఁ బూర్వ పూర్వపదము విశేషణ మగునట్లుగాఁ గాని, పూర్వపూర్వపదమున

కుత్తరోత్తరపదము విశేషణ మగునట్లుగాఁగాని, వర్ణించినచో, ఏకావళి:— కరేణుకోస్తలు కర్ణాంతరవిస్తారములు; కర్ణములు దోస్తంభ లంబమానములు; దోస్తంభములు జానుపర్యంతములు. ఇక్కడ పూర్వము లైనవన్నియు గ్రహించి యుత్తరము లయినకర్ణములకును, కర్ణములఁగూర్చి దోస్తంభములకును, దోస్తంభములనుగూర్చి జానువులకును విశేషణత్వము చెప్పఁబడినందున నేకావళి యైనది. ఈప్రకారముగానే రెండవది యూహించుకొనునది.

౨౮. మాలాదీపకాలంకారము:— దీపకాలంకార లక్షణమును, ఏకావళీలక్షణమును, రెండునుగూడఁ గలిగినచో మాలాదీపకము:— లక్ష్మి కరుణచే నీకటాక్షములయందును, నీకటాక్షములచేత విబుధులయందును జేరెను. ఇక్కడ వర్ణ్యమైనరాజకటాక్షములయందును అవర్ణ్యమైనవిబుధులయందును లక్ష్మీనివాసత్వ మనునేక ధర్మము చెప్పఁబడినందున దీపకలక్షణమును, విబుధు లనుత్తర పదమునకుఁ గటాక్షము లనుపూర్వపదము విశేషణముగునట్లుగాఁ జెప్పఁబడినందున నేకావళీలక్షణమును పట్టినవి.

౨౯. సారాలంకారము:— పూర్వపూర్వమునకంటె నుత్తరోత్తర ముత్కృష్ట మయినదిగా వర్ణించినచో సారము:— లోకములోఁ దేనె మధుర మయినది; అమృత మంతకంటెను మధుర మయినది; కవివాక్య మమృతముకంటె మధుర మైనది. ఇక్కడ తేనెకంటె నమృతమునకును, అమృతమునకంటెఁ గవివాక్యమునకును పూర్వపూర్వమునకంటె నుత్తరోత్తరమునకు గుణోత్కర్షము వర్ణించుటవలన సారాలంకార మయినది.

౩౦. యథాసంఖ్యాలంకారము:— క్రమసంఖ్య గలవానినీ వెనుకఁగూడ క్రమసంఖ్య గలవానితో నన్వయించునట్లు వర్ణించినచో

యథాసంఖ్యము:— ఓయీ! నీవు పుత్రులను మిత్రులను శత్రులను, బోషింపుము భూషింపుము దూషింపుము, ఇక్కడ "పుత్రులను బోషింపుము మిత్రులను భూషింపుము శత్రువులను దూషింపుము" అని యథాసంఖ్యముగా ననఁగా మొదటిది మొదటిదానితోను, రెండవది రెండవదానితోను మూఁడవది మూఁడవదానితోను అన్వయించునట్లు వర్ణింపఁబడినందున యథాసంఖ్య మయినది. క్రమాన్వయమును బట్టి దీనిని కొందఱు క్రమాలంకార మందురు.

౫౧. పర్యాయాలంకారము:— ఏకానేకాశ్రయరూపము, అనేకైకాశ్రయరూపము, అని పర్యాయాలంకారము ద్వివిధము.

(౧). ఒకవస్తువునకుఁ గ్రమముగా ననేకాధారములను వర్ణించినచో మొదటిపర్యాయాలంకారము:— ఆమెముఖకాంతి పద్మమును విడిచి యిప్పుడు చంద్రుని జేరుచున్నది. ఇక్కడ ముఖకాంతికి మొదట బగలు పద్మాశ్రయమును తరువాత రాత్రి చంద్రాశ్రయమునుగా, ననేకాశ్రయములు చెప్పుటవలనఁ బర్యాయాలంకార మైనది.

(౨). ఒకవస్తువునందుఁ గ్రమముగా ననేకాధేయములను వర్ణించిన రెండవపర్యాయాలంకారము:— పూర్వము ప్రవాహమున్నచోట నిప్పు డిసుకతిన్నె కానఁబడుచున్నది. ఇక్కడ నాధారమగునొక్కస్థలమునందే ప్రవాహమును పులినము ననెడియనేకాధేయవస్తువు లున్నట్లు వర్ణింపఁబడినందున రెండవపర్యాయాలంకారమయినది.

౫౨. పరివృత్త్యలంకారము:— ఒకదాని నిచ్చి మఱియొకదానినిఁ బుచ్చుకొన్నట్లు వర్ణించినచోఁ బరివృత్తి. అల్పము నిచ్చి యధికమును స్వీకరించినట్టుగాని, అధికము నిచ్చి యల్పమును స్వీకరించినట్లుగాని, సమవ్యయముచే సమస్వీకరణము చేసినట్టుగాని,

మూఁడువిధములుగాఁ జెప్పవచ్చును:— రాజు తానొక్క బాణమును విడిచి శత్రువుల యపార రాజ్యాంగమ్ములను గ్రహించుచున్నాఁడు. ఇక్కడ రాజు బాణ మనే నొక్కవస్తువు నిచ్చి యనేకము లయిన రాజ్యాంగమ్ములను స్వీకరించినట్లు చెప్పఁబడినందున నొకటి పరివృత్తి యయినది.

౧౬౩. పరిసంఖ్యాలంకారము:—ఒకవస్తువు నొకచోట నిషేధించి మఱియొకచోట విధించిన యెడలఁ బరిసంఖ్య:— స్నేహక్షయము దీపములఁ గలుగవలెను గాని కామినుల మనస్సులందుఁ గలుగ రాదు. ఇక్కడ స్నేహక్షయము స్త్రీలమనస్సులయం దుండఁగూడ దని నిషేధింపఁబడి దీపములయం దుండవలెనని విధింపఁబడినందునఁ బరిసంఖ్యాలంకారమయినది. స్నేహక్షయ మనఁగా ప్రేమ తగ్గుటయు, చమురు తగ్గుటయు, నని తెలియవలెను.

౧౬౪. వికల్పాలంకారము:— సమబలము గలరెండువిరోధకార్యములలో నేదైన నొకటి చేయవలె నని వర్ణించినచో వికల్పము:— ఇప్పుడు నీవు శిరస్సు నైనను ధనుస్సునైనను వంచుకొని శత్రున కభిముఖముగాఁ బోవలెను. ఇక్కడ యుద్ధమును సంధియునను సమాన బలము గలరెండువిరోధకార్యములలోఁ దలవంచుకొని సంధి కయినను విల్లు వంచుకొని యుద్ధమున కయినను నేదో యొకదానికిఁ బోవుట చేయవలె నని వర్ణించుట వలన వికల్ప మయినది.

౧౬౫. సముచ్చయాలంకారము:— అది ద్వివిధము.

(౧) విరుద్ధములు కానిబహుకార్యము లేక కాలమునందుఁ బ్రాప్తించినట్లు వర్ణించినచో మొదటిసముచ్చయము:— యుద్ధభూమి యందు నీశత్రువులు నొచ్చియు విచ్చియుఁ జచ్చియుఁ బలుతెఱగులఁ బా

రయిరి. ఇక్కడఁ బరస్పరవిరుద్ధములు కాని నోచ్చుట విచ్చుట చచ్చుట యనుకార్యము లేక కాలమునందు సంప్రాప్త మయినట్లు చెప్పఁబడినందున సముచ్చయాలంకార మయినది.

(౨). ఒక కార్యమున కొక్క కారణమే చాలి యున్నను ననేక కారణములను జెప్పినచో రెండవసముచ్చయము — అతని మదము నకు ధనమును యౌవనమును కులమును రూపును విద్యయు హేతువు లయినవి. ఇక్కడ మదమును జేయుటకు ధనయౌవనాదులలో నొక్క కారణమే చాలియున్నను ధనాదికారణములను బెక్కింటిని జెప్పుట చేత సముచ్చయ మయినది.

౫౬. కారకదీపకాలంకారము:—క్రమముగా ననేకక్రియల కేక కర్తృకారకాన్వయము కలుగునట్లు వర్ణించినచోఁ గారకదీపకము:— అతఁడు తన యింటికి విడువ లేక నాలుగడుగులు నడుచును దిరిగి చూచును మరల వచ్చును నిట్టూర్పులను విడుచును. ఇక్కడ నడుచు చూచు వచ్చు విడుచు ననుబహుక్రియ లేకకర్తతో నన్వయించునట్లు చెప్పఁబడినందున కారకదీపక మయినది.

౫౭. సమాధ్యలంకారము:—ఒకకారణముచేతనే కార్యారంభ మగుచున్నను మఱియొక్క కారణముచే నారబ్ధకార్యమునకు సౌలభ్య మగుచున్నట్లు వర్ణించినచో సమాధి:— చోరుఁడును వేగిరపడుచుండె నింతలో సూర్యుడు నస్తమించెను. ఇక్కడ చౌర్యకార్యా రంభము నకు దొంగయొక్క వేగిరపాటే చాలి యున్నను సూర్యాస్తమాన మను కారణాంతర మాకార్యమునకు సౌకర్యము కలిగించినట్లు వర్ణిం చినందున సమాధి యయినది.

౫౮. ప్రత్యనీకాలంకారము :— బలవంతుఁ డగు శత్రువును జయింప లేక తత్పక్షమువానిని దిరస్కరించెనని వర్ణించినచోఁ బ్రత్య

నీకము:—ఇందీవరము తన్ను మించిన కన్నుల గెలువ లేక కన్నుల చెంత నున్న చెవులఁ గ్రిందు పఱుచుచున్నది. కలువ తన్ను జయించు నేత్రమును జయింప శక్తిలేక నేత్రముల దాపుచేరిన కర్ణములను లాఘవపఱిచినట్టు చెప్పబడినందున ప్రత్యనీక మయినది. నల్లగలువ కర్ణభూషణ మయి చెవిపయి నున్నందునఁ జెవిని క్రిందుపఱిచి నట్లు చెప్పఁబడినది.

౫౯. కావ్యార్థాపత్త్యలంకారము:— ఒక యుత్కృష్టవస్తువే సాధింపఁబడు చున్నప్పుడు తక్కువవస్తువును సాధించుట యెంత యని వర్ణించినచోఁ గావ్యార్థాపత్తి:—ఓకాంతా! నీముఖముచేతఁ జంద్రుఁడే జయింపఁబడుచుండఁగా నింకఁ బద్మ మెంత? ఇక్కడ దుర్జయుఁ డగు చంద్రుఁడే ముఖముచే జయింపఁ బడుచుండఁగా కైముతికన్యాయమున నుకర మైనపద్మవిజయ మెంతటికార్య మని చెప్పఁబడినందున కావ్యార్థాపత్తి యైనది.

౬౦. కావ్యలింగాలంకారము:— మొదట నొకదుష్కరమయిన యర్థము నుపపాదించి, అది సంభవింపఁ దగని దయి సమర్థింప వలసి యుండఁగా, వాక్యార్థమును గాని పదార్థమునుగాని హేతువునుగాఁ జేసి దానిని సమర్థించినచో గావ్యలింగము. దుష్కరార్థమును వాక్యార్థముచే సమర్థించినయెడల వాక్యార్థహేతుకము:— ఓకాముఁడా! నేను నిన్ను జయింపఁగలను; నామనస్సులో ఫాలాక్షుఁ డున్నాఁడు. ఇక్కడ దుష్కరమయిన కామజయ ముపపాదింపఁబడి, (మన్మథదేహ దాహము చేసిన) ఫాలాక్షుఁడు మనస్సులో నున్నాఁడను వాక్యార్థముచే నది సమర్థింపఁబడినందున వాక్యార్థహేతుక కావ్యలింగ మయినది. దుష్కరార్థమును బదార్థముచే సమర్థించినయెడల, పదార్థహేతుకము:— శమాన్వితుఁడ నయి క్రోధనిగ్రహము చేసెదను. ఇక్కడ దుష్కర

మయిన క్రోధనిగ్రహ మాపాదింపఁబడి, అది శమాన్వితుఁ డను పదార్థముచే సమర్థింపఁబడినందున నర్థహేతుక కావ్యలింగ మయినది.

౭౧. అర్థాంతరన్యాసాలంకారము — ప్రస్తుత మయినవిశేష మును సమర్థించుటకయి యప్రస్తుత మయినసామాన్యమును జెప్పి నను, ప్రస్తుత మయినసామాన్యమును సమర్థించుటకయి యప్రస్తుత మయినవిశేషమును జెప్పినను, అర్థాంతరన్యాసము. విశేషమును సామాన్యముచే సమర్థించుట :- రామకార్యమునకయి హనుమంతుఁడు సముద్రమును లంఘించెను; మహాత్ములకు దుష్కర మేమి యున్నది? హనుమంతుఁడు సముద్రమును దాఁటె నను ప్రస్తుత విశేషాంశమును జెప్పి దానిని సాధించుటకయి మహాత్ములకు దుష్కర మేమి యున్న దనుసామాన్యాంశమును జెప్పినందున మొదటి యర్థాంతరన్యాస మయినది. సామాన్యమును విశేషముచే సమర్థించుట — మహాత్ము లను జేరిన యల్పులును గౌరవము నొందుదురు. పుష్పమును గూడి దారము తల కెక్కదా? ఇక్కడ మహాత్ములను జేరినయల్పులు గౌరవము నొందుదు రనుసామన్యాంశము చెప్పఁబడి, దానిని సాధించుటకయి పుష్పమును గూడి దారము తల కెక్కదా యను విశేషాంశము చెప్పబడినందున రెండవ యర్థాంతరన్యాస మయినది.

౭౨. వికస్వరాలంకారము—ఒకవిశేషార్థమును సమర్థించుట కయి సామాన్యము గ్రహింపఁబడి మరల నాసామాన్యమును సమర్థించు టకు మఱియొకవిశేషము చెప్పఁబడినచో వికస్వరము :— ఆ రాజు నెవ్వరును జయింప లేరు. మహాత్ములు సముద్రమువలె నసాధ్యులు సుమా. ఇక్కడ రాజు నెవ్వరును జయింపలే రనువిశేషము గ్రహింపఁ బడి దానిని సమర్థించుటకయి మహాత్ము లసాధ్యులను సామాన్యము

చెప్పఁబడి యాసామాన్యమును మరల సాధించుటకయి సముద్రము వలె నను నుపమానరూపమైన విశేషము చెప్పఁబడినందున వికస్వర మయినది.

౬౩. ప్రౌఢోక్త్యలంకారము — క్రియాధిక్యమునిమిత్త మయి హేతువు కాని దానియందు హేతుత్వమును గల్పించినచో ప్రౌఢోక్తి :— ఆ మెశిరోజములు యమునాతీరతమాలవల్లికలవలె నీలములుగా నున్నవి. తమాలవల్లికలనీలత్వమునకు యమునాతీరమునం దుండుట కారణము కాకపోయినను తమాలవల్లికలయందు నీలత్వాతిశయమును జెప్పుటకయి నల్లనినీరు గలయమునాతీరమునం దుండుట హేతువుగాఁ జెప్పఁబడినందున ప్రౌఢోక్తి యయినది.

౬౪. సంభావనాలంకారము— ఈలాగున నయిన పక్షమున నిట్లగునని ప్రకృతకార్యసిద్ధికొఱ కూహించినచో సంభావన :— ఓ రాజా! వర్ణించెడువాఁడు శేషుఁ డయ్యెనా నీగుణములను పూర్ణముగా వర్ణింపఁ గలుగును. ప్రకృతకార్య మైన గుణవర్ణనముకొఱకు వర్ణించెడువాఁడు శేషుఁ డయ్యెడుపక్షమునఁ గార్యసిద్ధి యగు నని యూహింపఁబడినందున సంభావన యైనది.

౬౫. మిథ్యాధ్యవసిత్యలంకారము — ప్రకృతమునకు మిథ్యాత్వమును సూచించుటకయి మిథ్యాభూత మైన దానిని కల్పించినచో మిథ్యాధ్యవసితి :— ఆకాశపుష్పమును ధరించినవాఁడు వేశ్యను వశ్యనుగాఁ జేసికొనును. ఇక్కడ వేశ్యను వశ్యురాలినిగాఁ జేసికోఁ గలుగుట మిథ్యయని చూపుటకయి మిథ్య యైనయాకాశ పుష్పధారణము కల్పింపఁబడినందున మిథ్యాధ్యవసితి యైనది.

౬౬. లలితాలంకారము— ప్రకృత మైన నాయకాదిధర్మియం దున్నప్రస్తుతవృత్తాంతమును జెప్పక తత్సదృశాప్రస్తుతవృత్తాంత

మును వర్ణించినచో లలితము:—ఆసుందరి జలము పోయినతరువాత సేతువు గట్టఁ దలఁచు చున్నది. తన్ను బతిమాలి వచ్చిననాయకునిఁ గసరి పోనాడుకొని యతఁడు పోయినతరువాత ప్రార్థించి తెచ్చుట కయి ప్రయత్నించు చున్నదన్న ప్రకృతవృత్తాంతమును వర్ణింపక తత్సదృశ మైనగతజలసేతుబంధనవృత్తాంతమును వర్ణించినందున లలిత మయినది.

౬౭. ప్రహర్షణాలంకారము — సర్వేంద్రియసుఖానుభవము కలిగించెడు భావము ప్రహర్షము. అట్టి హర్షప్రద మయిన యర్థము యొక్కసిద్ధి ప్రయత్నము లేకయే సంభవించినట్లు వర్ణించినచో మొదటిప్రహర్షణము: – ఆతఁ డేసుందరిని గోరి పిలిపింపఁ దలఁచి యుండెనో యాసుందరియే దూతికగా వచ్చెను. ఒకపురుషుఁడు కోరిన సుందరి ప్రయత్న మక్కఱ లేకయే దూతికగా వచ్చి లభించునట్లు చెప్పఁబడినందున మొదటిప్రహర్షణ మైనది. కోరినయర్థమునకంటె నధి కార్థము సిద్ధించెనని వర్ణించినచో రెండవప్రహర్షణము:—వెలుతురు నిమిత్తము దీప మెగఁద్రోయఁగానే సూర్యోదయ మాయెను. ఇక్కడ పదార్థప్రకాశనముకొఱకు దీప మెగఁద్రోయఁగా దీపముకంటె నధిక ప్రకాశము గల సూర్యుఁడు దైవవశమున నుదయించెనని చెప్పుటచేత రెండవప్రహర్షణ మయినది. అర్థసిద్ధికొఱ కుపాయాన్వేషణము చేయు చుండఁగానే తదర్థసిద్ధి యయ్యెనని వర్ణించినచో మూడవప్రహర్ష ణము:—అతఁడు పెన్నిధిని గోరి నిధ్యంజనౌషధీమూలమును ద్రవ్వు చుండఁగాఁ బెన్నిధియే కానఁబడెను. ఇక్కడ నొకపురుషుఁడు ధన నిక్షేపమును గోరి దానిని పొందుటకు సాధన మయినద్రవ్యాంజనౌషధి యొక్క వేరును త్రవ్వుచుండఁగా నక్కడ ధననిక్షేపమే లభించెనని చెప్పబడినందున మూడవప్రహర్షణ మయినది.

౯౭. విషాదనాలంకారము—ఈప్సితార్థసిద్ధికొఱకు యత్నము చేయుచుండఁగా దైవవశముచేతఁ దద్విరుద్ధ మయిన యనిష్టార్థప్రాప్తి యైనట్లు వర్ణించినచో విషాదనము:—దీప మెగసనద్రోయ యత్నించు చుండఁగా దీప మాఱిపోయెను. ఇక్కడ దీప మెగసనద్రోచి యెక్కువ వెలుతురును కలిగింప యత్నించు చుండఁగా దీప మాఱిపోయి మును వున్న వెలుతురుకూడఁ బోయి యనిష్టప్రాప్తి యయినట్లు వర్ణింపబడి నందున విషాదన మయినది.

౯౮. ఉల్లాసాలంకారము— ఒకరిగుణదోషములచే నితరులకు గుణదోషములు కలిగినట్లుచెప్పినచో నుల్లాసము. అది నాలుగు భేద ములుగలది.

(౧) ఒకరిగుణముచేత మఱియొకరికి గుణోత్పత్తిని వర్ణించి నచో మొదటి యుల్లాసము:— ఆపతివ్రత తననీట స్నానముచేసి తన్నుఁ బవిత్రురాలినిగాఁ జేయు నని గంగానది తలఁచుచున్నది. ఇక్కడ పతివ్రతగుణముచేత గంగకు గుణోత్పత్తి యైనట్లు చెప్పఁబడి నందున మొదటియుల్లాస మయినది.

(౨) ఒకరిదోషము చేత మఱియొకరికి దోషోత్పత్తిని వర్ణించినచో రెండవయుల్లాసము:—ఓ రాజా! అరణ్యమార్గముల నడిచెడు నీశత్రుకాంతలు తమ కుచములయం దుంచిన కాఠిన్యమును పాదము లయం దుంచ లే దని బ్రహ్మను నిందింతురు. ఇక్కడ స్త్రీలచరణ ములయందలి యకాఠిన్యదోషముచేత బ్రహ్మకు నిందాదోషము చెప్పఁబడినందున రెండవయుల్లాస మయినది.

(౩) ఒకరి గుణముచేత మఱియొకరికి దోషోత్పత్తిని వర్ణించి నచో మూడవయుల్లాసము:—త్యాగశీలుఁ డయినసజ్జనుని బొందకుం డుట ధనముయొక్క యభాగ్యము గాని సజ్జనునిదోషము గాదు.

ఇక్కడ సజ్జనునిగుణముచేత ధనమునకు దోషము చెప్పఁబడినందున మూడవయుల్లాస మయినది.

(౪) ఒకరిదోషముచేత మఱియొకరికి గుణోత్పత్తిని వర్ణించినచో నాలవ యుల్లాసము:— ఆదుష్టరాజు సేవకులను జంపకుండుటయే వారికిఁ బరమలాభము. ఇక్కడ రాజుయొక్క దుష్టత్వదోషము చేత పరిజనులకు చావు లేకుండుటయే గుణముగాఁ జెప్పఁబడినందున నాలవయుల్లాసమయినది.

౭౦. అవజ్ఞాలంకారము—అవజ్ఞాలంకారము ద్వివిధము.

(౧) ఒకరియొక్క గుణముచే మఱియొకరికి గుణము కలుగనట్లు వర్ణించినచో మొదటియవజ్ఞ:— బొక్కెన సముద్రమున మునిఁగినను కుండెడు నీటినే గ్రహించుచున్నది. బొక్కెనకు బహుజలసమృద్ధమయిన సముద్రమును జేరినను దానిగుణము కలుగక యల్పజలమే వచ్చిన దని చెప్పుటచేత మొదటియవజ్ఞ యయినది.

(౨) ఒకరియొక్కదోషముచేత మఱియొకరికి దోషము కలుగనట్లు వర్ణించినచో రెండవయవజ్ఞ:— కమలము ముడుచుకొన్నమాత్రముచేతఁ బూర్ణిమాచంద్రునకు లోపమేమి? ఇక్కడ పద్మముయొక్క దోషముచేతఁ జంద్రునకు దోషము కలుగనట్లు చెప్పఁబడినందున రెండవయవజ్ఞ యయినది.

౭౧. అనుజ్ఞాలంకారము — దోషమునం దేదో గుణ మున్నదను హేతువుచేత నాదోషమునే కోరినట్లు వర్ణించినచో ననుజ్ఞ:— ఈశ్వరభక్తిని కలిగించు గుణమందుండుటచేత నేనాపదలనే కోరెదను. ఇక్కడ నాపద లనుదోషమునం దీశ్వరుని మఱువకుండఁ జేయుగుణముండుటనుబట్టి యాయాపదలనే కోరినట్లు వర్ణింపఁబడినందున నవజ్ఞ యైనది.

౭౨. లేశాలంకారము:— అనుకూల్య మగుటనుబట్టి దోషమును గుణమునుగాఁ జెప్పినను, ప్రతికూల మగుటనుబట్టి గుణమును దోషమునుగాఁ జెప్పినను, లేశము:— మధుర వాక్యములు లేని సకలపక్షుల కును స్వచ్ఛందవిహారము కలుగుచుండఁగా, ఓచిలుకా! నీ కీపంజర బంధముకలుగుట నీవాఙ్మాధుర్యముయొక్క ఫలమే కదా? ఇక్కడ మొదటివాక్యమునందు స్వచ్ఛందవిహారానుకూల్యమునుబట్టి దోష మయిన వాఙ్మాధుర్య రాహిత్యమును గుణమునుగాఁ జెప్పుటచేతను, రెండవవాక్యమునందు స్వేచ్ఛావిహారాభావ ప్రాతికూల్యమును బట్టి గుణ మయిన వాఙ్మధురిమమును దోషమునుగాఁ జెప్పుటచేతను రెండువాక్యములును వరుసగా ద్వివిధ మయిన లేశాలంకారమునకు నుదాహరణము లయినవి.

౭౩. ముద్రాలంకారము — ప్రకృతార్థబోధకము లయిన పదములచేతనే ప్రకృత మయిన సూచ్యార్థసూచనమును వర్ణించినచో ముద్ర:— ఆటవెలఁది గీతి మందంబుగాఁ జేసె, మృదుపదాళితోడ మెచ్చువుట్ట. ఆటవెలఁది యనఁగా వేశ్యయు నాటవెలఁది యను గీత పద్యమును గనుక, ఆటవెలఁది (వేశ్య) మృదుపదములతో గీతము (పాట) ను మెచ్చువుట్టున ట్లందముగాఁ జేసె నను ప్రకృతార్థ ప్రతిపాదకము లయిన పదములచేతనే ప్రకృతమందు సూచ్యమయినయాట వెలఁది యను గీతపదమును మృదుపదములతో మెచ్చువుట్టున ట్లందముగాఁ జేసె నన్న యర్థముయొక్క సూచనగూడ వర్ణింపఁబడినందున ముద్రాలంకార మయినది.

౭౪. రత్నావళ్యలంకారము — ప్రకృతార్థమున కప్రకృతార్థతాదాత్మ్యము తోఁచుటకయి ప్రకృతార్థబోధకపదముల చేతనే ప్రసిద్ధక్రమమును వదలకుండ నప్రకృతార్థమును నిర్దేశించినచో

రత్నావళి:—నీవు చతురాస్యుఁడవును పురుషోత్తముఁడవును సర్వజ్ఞుఁడవును నయి వెలయుచున్నావు. ఇక్కడ వర్ణ్యమయిన రాజున కప్రకృతము లయిన బ్రహ్మాదులతాదాత్మ్యము తోఁచుటకు నేర్పుగలమాటలు గలవాఁడవును పురుషశ్రేష్ఠుఁడవును సమస్తమును దెలిసినవాఁడవు నను ప్రకృతార్థములను బోధించెడు చతురాస్య పురుషోత్తమసర్వజ్ఞపదములచేతనే క్రమముగా బ్రహ్మవిష్ణు మహేశ్వరు లను నప్రకృతార్థము నిర్దేశింపఁబడినందున రత్నావళి యయినది.

౭౫. తద్గుణాలంకారము — ఒకవస్తువు స్వగుణమును విడిచి యన్యగుణమును పొందినట్లు వర్ణించినచో తద్గుణము — ఓకాంతా! అధరకాంతిచే నీముక్కు ముత్యము పద్మరాగమణి యగుచున్నది. ఇక్కడ నాసామౌక్తికము తనధవళకాంతిని విడిచి యధరోష్ఠము యొక్క రక్తకాంతిని పొందినట్లు వర్ణింపఁబడినందున తద్గుణ మయినది.

౭౬. పూర్వరూపాలంకారము—ఇది ద్వివిధము.

(౧) స్వగుణమును విడిచి యన్యగుణమును స్వీకరించినవస్తువునకుఁ గారణాంతరముచే మరల స్వగుణము వచ్చినట్లు వర్ణించినచో నొకపూర్వరూపము:—ఓరాజా! శివుని గళకాంతిచే నల్లపడిన శేషుఁడు మరల నీశుద్ధకీర్తిచేఁ దెల్లపడుచున్నాఁడు. ఇక్కడ శేషుఁడు స్వకీయమైన ధావళ్యమును విడిచి శివునికంఠ నీలిమను పొందినవాఁడై మరల రాజుయొక్క యశఃకాంతిచే ధవళిమ నొందినట్లు చెప్పఁబడి నందున పూర్వరూపమైనది.

౨. వస్తువునకు నాశనము కలిగించిన తరువాతను పూర్వస్థితియే యున్నట్లు వర్ణించినచో రెండవపూర్వరూపము: — ఆకాంత రతివేళ సిగ్గుచే దీపము నార్పినను కాంచికారత్నములచేత వెలుతురట్టె యుండెను. ఇక్కడ కాంతికారణ మయిన దీప మార్పఁబడినను

గాంతి పోక యొడ్డాణమునందలి రత్నములచేత దీప్తి పూర్వ రూపము నసే వెలుఁగుచున్నట్లు చెప్పఁబడినందున పూర్వరూప మయినది.

౭౭. అతద్గుణాలంకారము — అన్యవస్తువుయొక్క గుణమును పొందఁ దగిన కారణ ముండియుఁ బొందనట్లు వర్ణించినచో నతద్గుణము:—ఓ రాజా! నీకీర్తిధావళ్యముచేత శివునికంఠ మైనను దెల్ల నగునుగాని నీశత్రుల దుష్కీర్తి తెలుపు గాదు. ఇక్కడ శత్రుల దుష్కీర్తి రాజుయొక్క యశోధావళ్యమును జేరి తెల్లపడఁ దగియుండియు తద్గుణమును పొందనట్లు వర్ణించినందున నతద్గుణ మైనది.

౭౮. అనుగుణాలంకారము — పూర్వము స్వతస్సిద్ధముగా నున్నగుణమునకు మఱియొకవస్తువు యొక్కసంయోగము వలన గుణాధిక్యము కలిగినట్లు వర్ణించినచో ననుగుణము:— చెవులఁ జేర్చిన నీలోత్పలములు తత్కటాక్షులబ్ధిచే మఱింత నైల్యమును పొందుచున్నవి.ఇక్కడ నల్లగలువలయొక్క స్వతస్సిద్ధనీలగుణమునకు కడకంటి చూపులచే మఱింత నలుపు కలిగినట్లు చెప్పఁబడినందున ననుగుణ మైనది.

౭౯. మీలితాలంకారము—గుణాదిసామాన్యముచేత భేదము కనఁబడనట్లు వర్ణించినచో మీలితము: — నీసహజారుణము లైన చరణములందు లత్తుకపూఁత కానరాకున్నది. ఇక్కడ నరుణగుణ సామాన్యముచేత పాదములయందు లాక్షారసాలంకారము భేదముగాఁ గానఁబడునట్లు వర్ణింపఁబడినందున మీలిత మైనది.

౮౦. సామాన్యాలంకారము — సమానధర్మము గలరెండు వస్తువులలో నేది యేవస్తువో తెలిసికొనుభేదము లేనట్లు వర్ణించినచో సామాన్యము:— తామరకొలఁకులోఁ జొచ్చిన యాకాంతల ముఖములే తెలియరాకున్నవి. ఇక్కడ సమానధర్మమునుబట్టి యుపమానోప

మేఘము లయిన పద్మముఖములకు భేదమే కానరానట్లు చెప్పఁబడి నందున సామాన్య మయినది.

౮౧. ఉన్మీలితాలంకారము — రెండువస్తువులకు సాదృశ్యము వలన భేదము గనపడనప్పుడు కారణాంతరముచే భేదము తెలియ వచ్చినట్లు వర్ణించినచో నున్మీలితము — ఓ రాజా! నీకీర్తిమగ్న మైన హిమవద్గిరిని దేవతలు శైత్యముచేతఁ దెలియుచున్నారు. ఇక్కడ యశోధావళ్యముచేత నభిన్న మయినహిమవత్పర్వతము వే ఱయిన శైత్యధర్మముచేఁ దెలిసికోఁబడ్డట్టు వర్ణింపఁబడినందున నున్మీలిత మయినది.

౮౨. విశేషాలంకారము — సమానధర్మము గల రెండువస్తువులలో నొకదాని కొకానొకకారణముచేత విశేషము కలిగినట్లు చెప్పినచో విశేషము:— తమ్మికొలఁకులో నోలలాడు స్త్రీలముఖములును పద్మములును జంద్రోదయము కాఁగానే తెలియ నయ్యెను. ఇక్కడ భేదము కానరాకుండు పద్మముఖములలో నొకటైన పద్మములకుఁ జంద్రోదయకారణమున ముకుళన మను విశేషము కలిగినట్లు వర్ణింపబడినందున విశేషాలంకారమయినది.

౮౩. గూఢోత్తరాలంకారము — ఒక రడిగిన ప్రశ్నకు మఱి యొకరు స్వాభిప్రాయగర్భితముగా నుత్తరము చెప్పినట్లు వర్ణించినచో గూఢోత్తరము — ఓకాంతా! ఈనది నిక్కడ దాఁటవచ్చునా? ఓపథికుఁడా! ఇక్కడ గాదు. ఆవేతసనికుంజ మున్నచోటికిఁ బొమ్ము. నేను జూఁపెదను. ఇక్కడ నది యెక్కడ దాటవచ్చు నని పథికుఁ డడిగిన ప్రశ్న కొక యువతి మన కచ్చట సంగమానుకూలస్థల మనుస్వాభిప్రాయము గర్భమం దుండునట్టుగా బ్రచ్ఛన్నపాదకడ దాఁటవచ్చు నని యుత్తర మిచ్చినట్లు వర్ణింపఁబడినందున గూఢోత్తర మయినది.

౨౭౪. చిత్రోత్తరాలంకారము — ప్రశ్నాభిన్నోత్తర రూప మనియు, ఉత్తరాంతరాభిన్నోత్తరరూప మనియు, చిత్రాలంకారము ద్వివిధము.

(౧) ఒక రడిగినప్రశ్న కాప్రశ్న చేసిన వాక్యముచేతనే యుత్తరము చెప్పినట్లు వర్ణించినచో ప్రశ్నాభిన్నోత్తరరూపము:— నాతి! దూరమే యిల్లు? అడుగు లాతెత. నాతి దూరమేయిల్లు; అడుగులాతెత. ఇక్కడ "నోనాతీ యిల్లుదూరమా కాళ్ళు కాలుచున్న" వని యర్థమిచ్చెడుప్రశ్న కావాక్యముచేతనే "యిల్లు నాతిదూరమే (సమీపమే) ఆ అడుగులే" యని యుత్తర మిచ్చినట్లు చెప్పఁబడినందున ప్రశ్నాభిన్నోత్తర రూపచిత్రోత్తర మయినది.

(౨) భిన్నవిషయకము లయిన రెండు ప్రశ్నల కొక్కవాక్యము చేతనే యుత్తరము చెప్పినట్లు వర్ణించినచో నుత్తరాంతరాభిన్నోత్తర రూపము:— సోమయాజులు స్వర్గమున నెవ్వతెను గలయఁ గోరుదురు? శుభకార్యములయందు స్తంభముల కేమి గట్టుదురు? రంభను. ఇక్కడ భిన్నవిషయకము లగు నయి రెండు ప్రశ్నలకును వరుసగా దేవవేశ్యయు కదళీస్తంభము నను నర్థ మిచ్చెడు రంభ నను నొక్క యుత్తరమే చెప్పఁబడినందున నుత్తరాంతరాభిన్నోత్తర రూపచిత్రోత్తర మయినది.

౨౭౫. సూక్ష్మాలంకారము— ఒకరు నేత్రాది చేష్టచేత స్వాభీష్టమును దెలుపఁగా మఱియొక రది తెలిసికొని తదనుగుణస్వాభిప్రాయ సూచకచేష్టా విశేషమును జూపినట్లు వర్ణించినచో సూక్ష్మము:— నాయకుఁ డొకసుందరిని ప్రేమతోడిచూడ్కిని జూడఁగా నాకాంత సీమంతమణిని దనకురులచేఁ గప్పెను. ఇక్కడ నాయకుఁడు తా నాకాంత నభిలషించిన యభిప్రాయమును కన్నులతోఁ దెలుపఁగా

నాకాంత పాపటయందు దున్నరత్నములు తనళిరోజములతోఁ గప్పి సూర్యుఁ డస్తమించి చీఁకటి పడినతరువాత దమ్మని నిజాభిప్రాయము చేష్టచేత సూచించినట్లు వర్ణింపఁబడినందున సూక్ష్మాలంకార మయినది.

౮౫. పిహితాలంకారము — పరునివ్యాపారమును తదీయలక్షణములచేఁ దెలిసికొని తెలిసినట్లు చెప్పక సాభిప్రాయచేష్ట చేసినట్లు వర్ణించినచో పిహితము:— పతి ప్రాతఃకాలమున నింటికి రాఁగా భార్య పరుండుటకయి పాన్పు వేసెను. ఇక్కడ రాత్రియంతయు భర్త పర సతిని గలసి మేలుకొని యుండెనన్నవృత్తాంతమును తచ్ఛరీరమందలి కుంకుమాదిచిహ్నములచేఁ దెలిసికొని దానిని బయలఁ బుచ్చక రతి శ్రమచే నలసి రాత్రినిద్ర లేకుంటివి గాన సుఖనిద్ర చేయు మనెడి యభిప్రాయము స్పష్ట మగునట్టుగా శయ్య యమర్చినట్లు వర్ణింపఁబడి నందునఁ బిహిత మయినది.

౮౬. వ్యాజోక్త్యలంకారము—ఆకారచిహ్నములయొక్క కారణము చెప్పఁదగి యుండనిచో గారణాంతరమును గల్పించి చెప్పి నిజ మయినకారణమును దాఁచినచో వ్యాజోక్తి— ఓచెలీ! గృహారామము నందుఁ దిరుగుటచేత నామేనఁ బరాగ మెట్లు నిండెనో చూచితివా? ఇక్కడ నొకయువతికిఁ జోరరతివలన దేహమున దుమ్మంటుకొనఁగా నిజ మయినయాకారణము చెప్పఁదగినది కానందున తోఁటలోఁ దిరు గుటచే నొడలధూళి గ్రమ్మె నని కారణాంతరమును గల్పించి నిజ మయిన హేతువును మఱుఁగుపఱిచినట్లు వర్ణింపఁబడినందున వ్యాజోక్తి యయినది.

౮౭. గూఢోక్త్యలంకారము — ఒకరినిగూర్చి పలుకఁదగిన వాక్యమును బరులకుఁ దెలియకుండుటకయి మఱియొకరినిగూర్చి పలికి

నట్లు వర్ణించినచో గూఢోక్తి — ఓవృషభమా! క్షేత్రస్వామి వచ్చుచున్నాఁడు. ఈక్షేత్రము విడిచి వేగముగాఁ బొమ్ము. క్షేత్రమనఁగా భార్యయు పొలమును నగుట పొలములో నన్యసతితో సంభోగించుచున్న పురుషునిగూర్చి భర్తవచ్చుచున్నప్పుడు కావలియున్నదూతి పలికిన వాక్యమును బరులకుఁ దెలియకుండుటకయి పొలమున మేయుచున్న యెద్దునుగూర్చి క్షేత్రస్వామి వచ్చుచున్నాఁడు గాన శీఘ్రముగా క్షేత్రమును విడిచి పొమ్మని చెప్పినట్లు వర్ణింపఁబడినందున గూఢోక్తి యయినది.

౮౯. వివృతోక్త్యలంకారము — శ్లేషచే గోపనము చేయఁబడిన గూఢార్థము కవిచేఁ గంఠోక్తిగా వివరణము చేయఁబడినచో వివృతోక్తి:— ఓవృషభమా! పరక్షేత్రమును వేగవిడిచి పొమ్మని సఖున కొకచెలికాఁడు సూచనగాఁ జెప్పెను. ఇక్కడ పరక్షేత్రమును విడువు మనుచోటఁ గల శ్లేషగుప్తమయిన గూఢార్థము సూచనఁగాఁ గవిచే వివరింపఁబడినట్లు వర్ణింపఁ బడినందున వివృతోక్తి యయినది.

౯౦. యుక్త్యలంకారము — ఒకరహస్యమయినపనిని జేయుచున్నప్పుడు కానివారువచ్చినప్పు డా రహస్యము వారికిఁ దెలియకుండుటకయి యొకానొకక్రియచే వారికి భ్రాంతికలుగఁజేసి వంచించినట్లు వర్ణించినచో యుక్తి:— ఒక యువతి చిత్రపటమునఁ బ్రియుని వ్రాయుచుననాప్తురా లొకతె రాఁగా నాతనిహస్తమునఁ జెఱకువిల్లు వ్రాసెను. ఇక్కడ నొకానొక యువతి రహస్యముగాఁ దన ప్రియునిరూపము వ్రాయుచు నింతలో నాప్తురాలు కానిదొకతె యచ్చటికి రాఁగాఁ దన రహస్యమా యనాప్తురాలికిఁ దెలియకుండ వంచించుటకయి చేతియందు ధనుస్సు వ్రాసి చిత్రలిఖితుఁడు మన్మథుఁ డనుభ్రాంతి కలిగించినట్లు వర్ణింపఁబడినందున యుక్తి యయినది.

౯౧. లోకోక్త్యలంకారము — లోకప్రవాదము ననుకరించిన మాటలను గూర్చి వర్ణించినచో లోకోక్తి:— ఓచెలీ! నాలుగయిదు దినములు కన్నులుమూసికొని గడపుము; నీభర్త సుఖముగావచ్చును. భర్త గ్రామాంతరము పోయినసఖిని గూర్చి యొక చెలికత్తె నాలుగయిదుదినములు కన్నులుమూసికొని గడపుమను లోకోక్తి నమర్చి చెప్పినందున లోకోక్తి యయినది.

౯౨. ఛేకోక్త్యలంకారము — లోకోక్తి యర్థాంతరగర్భిత మగునట్లుగాఁ గూర్చి వర్ణించినచో ఛేకోక్తి:— పాముకాళ్ళు పామునకే తెలియును. ఇక్కడ పాముకాళ్ళు పామునకే తెలియు నన్న లోకోక్తి ప్రియునిగూర్చి నాయికచే నీమాయలు నీకే తెలియునుగాని యన్యులకుఁ దెలియ వనునభిప్రాయము గర్భిత మగునట్లుగాఁ జెప్పఁబడినందున ఛేకోక్తి యయినది.

౯౩. వక్రోక్త్యలంకారము — ఒకఁ డొకవాక్యమును ఋజుబుద్ధిచేతనే పలుకఁగా మఱియొకఁ డావాక్యమునకుఁ గోపాదికారణములనుబట్టి శ్లేషచేతఁగాని కాకుస్వరము చేతఁగాని యర్థాంతరమును గల్పించి వంకరమాట యాడినట్లు వర్ణించినచో వక్రోక్తి:— ఓకాంతా! కాకులు కూయుచున్నవి. యిప్పుడు పగలగును జుమా. ఓనాథా! కోటి నోములునోచిన నాకుఁ బగలు గాక స్నేహ మెట్లగును? ఇక్కడ పగలనుమాట ఋజుబుద్ధితో దివాభాగ మను నర్థమునందే నాయకునిచే నుపయోగింపఁబడినను కోపముచేత నాయిక దానికి విరోధము లను నర్థాంతరమును కల్పించి వక్రభాషణ మాడినట్లు వర్ణింపఁ బడినందున వక్రోక్తి యయినది.

౯౪. స్వభావోక్త్యలంకారము — జాత్యాదులయం దున్న యథార్థధర్మములను రసికజనహృదయరంజకముగా నున్నవి యున్నట్లు

వర్ణించినచో స్వభావోక్తి:— ఆలేడి చెవులు నిక్కించి బెదరిబెదరి చూచుచు గొరిసెలతోఁ దల గోఁకుకొనుచున్నది. ఇక్కడ లేడియొక్క స్వభావచేష్ట లున్నవి యున్నట్లు వర్ణింపఁబడినవి గనుక స్వభావోక్తి యయినది.

౯౫. భావికాలంకారము — వెనుక జరిగినవృత్తాంతమునుగాని ముందు జరగఁబోవువృత్తాంతమునుగాని మహాశ్చర్యకరము లగుటచేఁ బ్రత్యక్షముగా నిప్పుడు జరుగుచున్నట్టు వర్ణించినచో భావికము:— దేవాసురు లిప్పుడు నాకన్నులయెదుర యుద్ధము చేయుచున్నారు. ఇక్కడ భూతకాలమునం దెప్పుడో జరిగిన దేవదానవయుద్ధము తన కిప్పుడు కన్నులఁ గట్టిన ట్లున్న దనునర్థమునఁ బ్రత్యక్షముగా నిప్పుడే జరుగుచున్నట్లు చెప్పఁబడినందున భావిక మయినది.

౯౬. ఉదాత్తాలంకారము — శ్లాఘ్య మైనట్టిగాని శౌర్యాది సంపత్సమృద్ధిమంత మయినట్టిగాని చరిత్ర మన్యమున కుపలక్షణము గాఁ జెప్పినచో నుదాత్తము:— ఆకిరాతార్జునులు పోరాడిన కొండచఱి యను జూచినాఁడను. ఇక్కడ నుపలక్షణ మనఁగా నానవాలు. ఈయుదాహరణమునందు శ్లాఘ్యమై శౌర్యాదిసమృద్ధిమంత మయిన శివార్జునయుద్ధచరితము కొండచఱియ కుపలక్షణముగా ననఁగా నాన వాలుగాఁ జెప్పఁబడినందున నుదాత్త మయినది.

౯౭. అత్యుక్త్యలంకారము — అత్యద్భుతమును నసత్యమును నగుశౌర్యౌదార్యాదులను వర్ణించినచో నత్యుక్తి:— ఓరాజా! నీవు దాతవై యుండఁగా యాచకులు కల్పవృక్షము లయినారు. ఇక్కడ రా జిచ్చిన యపరిమితధనముచేత యాచకు లెల్ల ధనాఢ్యులయి యడిగిన వారి కెల్లఁ గల్పవృక్షములవలె నిచ్చువా రైనారని యత్యద్భుతము

గా మిథ్యాభూత మయినయౌదార్యము వర్ణింపఁబడినందున సత్యోక్తి యయినది.

౯౮. నిరుక్త్యలంకారము— యౌగికార్థము గలశబ్దముల కవయవార్థమువలన నర్థాంతరకల్పనము చేసి వర్ణించినచో నిరుక్తి:— ఓచంద్రా! మమ్మిట్లు బాధించు చుండుటచేత నీవు దోషాకరుఁడ వగుట నిశ్చయమే. ఇక్కడ విరహబాధచే వెన్నెలకాఁకకుఁ దాళ లేని యొకసతి రాత్రిని జేయువాఁ డనుయౌగికార్థము గలదోషాకరశబ్దమున కవయవార్థమునుబట్టి దోషములకు స్థానభూతుఁడ వనునర్థాంతరమును గల్పించినట్లు వర్ణింపబడినందున నిరుక్తి యయినది.

౯౯. ప్రతిషేధాలంకారము — చెప్పఁబడిననిషేధము ప్రసిద్ధమైన దయియుండి యర్థాంతరగర్భితముగా ననువదింపఁబడినచోఁ బ్రతిషేధము:— ఓశకునీ! ఇది నీవు నాఁడు పాచికలతో నాడినజూదము కాదు; ఇప్పుడు వాఁడిబాణములతో నాడెడుజూదము సుమీ. ఇక్కడ యుద్ధము జూదము కాదన్ననిషేధము ప్రసిద్ధముగాఁ దెలిసినదే యైనను శకునికి జూదమునందే కాని యుద్ధమునందు నేర్పు లేదను నర్థాంతరమును సూచించుటకు నకులునిచేఁ జమత్కారముగా ననువదింపఁబడి నిషేధింపఁబడినందునఁ బ్రతిషేధ మయినది.

౧౦౦. విధ్యలంకారము—అర్థాంతరగర్భిత మయి చమత్కారహేతు వగునట్లుగా సిద్ధమైన వస్తువును దిరిగి విధించినచో విధి:— ఈవసంతకాలమునఁ బంచమస్వరముతో నొప్పుచుండుటచేతఁగోకిల కోకిల యయినది. ఇక్కడ కోకిలకు కోకిలత్వము సిద్ధమయియుండఁగా బంచమస్వరశాలిత్వముచే సర్వజనమనోహర మగుచున్నదన్న యర్థము గర్భీకృతమయి చమత్కారజనక మగునట్లుగా మరల కోకిల కోకిల యగునని విధించుటవలన విధియైనది.

౧౦౧. హేత్వలంకారము — (౧) కార్యముతోడఁ గారణము నకు సంబంధమును వర్ణించినచో హేతువు:— ఆచంద్రుఁడు విరహిణీ జనులను భయభ్రాంతలనుగాఁ జేయుటకే యుదయించెను. ఇక్కడ చంద్రోదయ మనుకారణమునకును విరహిణీభయ మనుకార్యమున కును సంబంధము వర్ణింపఁబడినందున హేతు వైనది.

(౨) కార్యశీఘ్రత్వాదిసూచనకై కార్యకారణముల కభే దము వర్ణించినచో (రెండవ) హేతువు:—ఓరాజేంద్రా! నీకటాక్షములే కవీంద్రులకు లక్ష్మీవిలాసములు. ఇక్కడ రాజుయొక్క కటాక్ష మాత్రముచేతనే కవులకు సంపత్సమృద్ధు లగుచున్న వని చెప్పఁ దగి యుండఁగాఁ గార్యశీఘ్రతా సూచనమునకై కటాక్షములే సంపద్విలా సము లని కార్యకారణముల కభేదవర్ణనము చేయఁబడినందున హేతు వైనది.

# సత్యవాదిని



## THE FATHERHOOD OF GOD, AND THE BROTHERHOOD OF MAN.

### ఈశ్వరుని పితృభావము, మనుష్యుని భ్రాతృభావము.*

ఓ భ్రాతృవరులారా!

సమస్త సంస్కారములలోను మతసంస్కారము ప్రధానమైన దనియు, మతము పరిశుద్ధమయినచో సమస్తసంస్కారములును దాని వెంబడినే యనాయాసముగా జరుగు ననియు, గతభానువారమునాఁడు చెప్పి యుంటినిగదా. తనకంటె నధికశక్తిసంపన్నత గల దేవుఁడుగాని దేవతలుగాని యున్నా రనియు, తదుపాసనము చేయుచు తత్ప్రీతికరముగాఁ దాను వర్తింప వలయుననియు, తలఁచెడి మనుష్యుని యభిప్రాయము మత మనఁబడును. అనాగరికదశలో సృష్టిలోని స్వాభావిక పదార్థములనే పూజించుటయు, అల్పనాగరికదశలో తమ దేవతల పేర ప్రతిమలనుగూడఁ గల్పించి వాని నర్చించుటయు, అధిక నాగరికదశలో నీశ్వరుఁ డొక్కఁడని యెఱిఁగి యాతని మానసికముగా నుపాసించుటయు, సాధారణముగా తటస్థించు చున్నది. ఏకేశ్వరోపాసకు లైన పరిశుద్ధాస్తికమతస్థులు దేవుఁడు సృష్టికర్త యనియు లోకరక్షకుఁ డనియు, నిరాకారుఁ డనియు, సత్యస్వరూపుఁ డనియు, పరిశుద్ధుఁ డనియు, దయాస్వరూపుఁ డనియు, విశ్వసించి సర్వ విషయముల

* ఇది 190౦ వ సంవత్సరము ఏప్రిల్ నెల మొదటి తేదిని రాజమహేంద్రవర ప్రార్థనాసమాజమునఁ జదువఁబడినది.

యందును తదాజ్ఞానుసారముగాఁ బ్రవర్తించుట పరమకర్తవ్య మని భావింతురు. దయామయస్వరూపుఁ డయిన సర్వకర్త యగుటచే నీశ్వరుఁడు లోకపిత యగుచున్నాఁడు; ఈశ్వరసృష్టిలోనివారై తద్దయాపాత్రులైన సమస్త మానవులును నీశ్వరకుటుంబమయి పరస్పరభ్రాతలగుచున్నారు. కాఁబట్టి సత్యమైన పరిశుద్ధాస్తిక మతమునందు దేవుని పితృభావమును మానవుల పరస్పరభ్రాతృభావమును ముఖ్యసిద్ధాంతములు. ఈరెండుసిద్ధాంతములను గూర్చియు నే నీ సాయంకాలమునఁ గొన్నిమాటలు చెప్పఁబోవుచున్నాను.

పూర్వాచారము నొక్కపట్టున విడువలేకుండుట మానుష స్వభావ మయియున్నది. అందుచేతనే జను లనేకవిషయములలో నాగరికాగ్రగణ్యులయి యేకేశ్వరారాధనమే పరమకర్తవ్య మని యెఱిఁగినవా రయ్యును ఆనాగరికదశలో వచ్చిన స్వాభావిక వస్తుపూజనమును నల్పనాగరికదశలో వచ్చిన ప్రతిమార్చనమును పలువురు పూర్వాచారబలముచేత పూర్ణముగా విడువఁజాలకున్నారు. కాఁబట్టి మనమును పరిశుద్ధము చేయువలె నన్నచో నేతద్విషయమున సంస్కార మవశ్యముగాఁ జేసికొనవలయును. మతసంస్కారము జరగనియెడల నీతివిషయములోను సంఘవిషయములోను తక్కిన సమస్తవిషయములలోను మితిమీఱినదురాచారము లుద్భవిల్లి ప్రజాసౌఖ్యమునకును దేశాభివృద్ధికిని భంగము కలిగించును. సమస్తమానవధర్మ శాఖోపశాఖలకును సంతోషరసమును బ్రవహింపఁ జేయుటకు మూలమైన మతజలాశయమే కలుషమయి యనర్థదాయక మయినపక్షమున సంసారవృక్షమునందే శాఖ యారోగ్యస్థితిలో వర్ధిల్లి సుఖప్రదము కాఁ గలుగును? మనుష్యుని కాయమునకు మతమే ప్రాణము; మతము నిర్దుష్టస్థితిలో నుండనప్పుడు సంఘము జీవచిహ్నము లేనిబొందివంటిదిగా నుండును. సంఘ

శరీరములతోఁ బ్రాణ మయిన మతము పరిశుద్ధ మయి యాత్మాహవంతము కాదేని, సాంఘిక సంస్కారాదు లేవియు సఫలము లయి దేశక్షేమకరములు కానేరవు. కాఁబట్టి దేశాభిమాన మాననీయు లగు మాన్యులారా! మీరు నిజముగా దేశక్షేమమును గోరెడువా రయిన పక్షమున, ఈశ్వరునిపితృభావమును వాక్కుచేతను మనస్సు చేతను క్రియల చేతను పూర్ణముగా నంగీకరించి యాతని నొక్కనినే ప్రీతిపూర్వకముగా భజించుచు తదితరారాధనమును విడిచి పెట్టుఁడు. ఈశ్వరైకారాధనమునకును, ఈశ్వర పితృత్వ భావనకును, మన దేశములో గర్భశత్రువుగా నున్నది విగ్రహారాధనము. సర్వానర్థమూలమయిన విగ్రహారాధనమును మూలముట్టుగ నశింపఁజేసినఁగాని మన కీశ్వరపితృత్వసిద్ధి యలవడ నేరదు. కాఁబట్టి యేరూపమున నున్నను విగ్రహారాధనమును మనము విషసర్పమును జూచినట్టు చూచి ద్వేషించుచు సర్వవిధముల చేతను దాని నంతము నొందింప మన శక్తియుక్తులను వినియోగించి పాటు పడవలయును. మనుజుఁ డేదినమున విగ్రహారాధనపిశాచపీడనుండి విడివడునో యాదినమే యాతని జీవిత కాలములో నెల్ల మహాసుదినము; ఆదినమే యతఁడు పాపబంధములనుండి విముక్తుఁ డగుటకు కృతి ప్రారంభుఁ డయిన పుణ్య దినము; ఆదినమే యతఁడు సర్వేశ్వరసాంగత్యభాగ్యము నపహరించుచుండిన పీడని వీడను వదల్చుకొని తాను సుఖియయి యొక మహారిష్టమును రూపుమాపి దేశమును సుఖింపఁజేయ దీక్షవహించిన పర్వదినము. సత్యైకాదర పరాయణులారా! మీరీదినమునుండి ఈశ్వర రాజ్యాక్రమణ ద్రోహమున కొడిగట్టిన విగ్రహ రూపరిపులపయి ధ్వజమెత్తి నీచాతినీచమయిన తద్దాస్యమునుండి మీయాత్మలను రక్షించుకొని యీశ్వరసేవాపరాయత్త చిత్తులరయి మీసహోదరు లయిన యన్య

ద్దేశీయుల యాత్మోన్నత్తోత్తమమయిన యీశ్వరసేవకుఁ బురి కొల్పుటకు సర్వవిధములఁ బ్రయత్నింపుఁడు. ఈవిగ్రహ పిశాచములు మిమ్మీశ్వర దూరులనుగా మాత్రమే కాక నీతిదూరులను గాను సౌభ్రాత్ర దూరులనుగాను మానుషస్వభావ దూరులనుగాను జేయు చున్నవి. వల్లభవైష్ణవధర్మము పేర జరగు వ్యభిచారములును, ఆగమోక్తధర్మము పేర జరగుసురాపానాదులును, గంగార్చనముపేర జరగుశిశుహత్యలును, కాళికాపూజపేర జరగుజంతుహింసలును, విగ్రహ పిశాచముల దుర్బోధనవలనఁగాక మఱి దేనివలనఁ గలిగినవి? ఇంత కంటెను నీతిమాలినపను లేవి యుండును? శైవవైష్ణవ ధర్మముల పేర నొండొరుల ద్వేషించి దూషించుకొనుటయు ద్వైతాద్వైతధర్మముల పేర నొండొరులను పొడగన్నపాపమునకై చాంద్రాయణ భూప్రదక్షిణాది ప్రాయశ్చిత్తములు చేసికోవలె ననుటయు విగ్రహ పిశాచముల దుర్బోధనలవలనఁ గాక మఱి దేనివలనఁ గలిగినవి? ఇంతకంటెను సౌభ్రాత్రరాహిత్యము మఱి యేముండును? వరాహ భైరవ నామములచే మనుష్యులను పందులకును కుక్కలకును మ్రొక్కునట్లు చేయుట విగ్రహపిశాచముల దుర్బోధనలవలనఁ గాక మఱి దేనివలనఁ గలిగినది? ఇంతకంటెను మానుషస్వభావమునకు విరుద్ధములైన పనులు మఱి యేముండును? మాటాడుటకు నోరు లేకయే యిటువంటి దుర్బోధనలం జేసి లోకమును వంచించు చున్నవిగ్రహపిశాచములు నోరు తెఱచి మాటాడఁ గలిగినచో నెంత యెక్కువహాని చేయఁగలుగును! ఓనువివేకులారా! అపవిత్రమును ననర్థదాయకమును నయినవిగ్రహ పిశాచసేవను విడనాడి పవిత్రమును శ్రేయోదాయకమును నయిన యేకేశ్వరసేవ నంగీకరింపుఁడు. ఉత్తరక్షణముననే మీరు నీతియుక్తులును సౌభ్రాత్రమహితులును మానుషస్వభావ భూషితులును నగు

దురు. అప్పుడు లోకమం దంతట నీశ్వరరాజ్య మేర్పడును; లోకము లోనివారెల్లరును భ్రాతలయి పరస్పరానురాగము కలవా రగుదురు; ఎల్లమానవులును జాతిమతవైషమ్యవిరహితులయి దేవతుల్యు లగుదురు. "కాష్ఠలోష్టేషు మూఢానాం యుక్తస్యాత్మని దేవతా" యనున్యాయమునుబట్టి దేవుఁడు మూఢులకు కట్టెలలోను మట్టిగడ్డల లోను జ్ఞానుల కాత్మలోను నుండునని చెప్పి, మూఢజనబహుళమయినలోకమునకెల్లను విగ్రహారాధన ముండవలయునని కొందఱు మిమ్ము భ్రమపెట్టఁ జూతురు. ఆమాట లణుమాత్రమును విశ్వసింపఁ బోకుఁడు. మనదేశమున కజ్ఞ జనబహుళ మన్నయపఖ్యాతిని బోఁగొట్టి ప్రాజ్ఞజనబహుళమన్న ఖ్యాతిని తెచ్చుటకయి నిరంతరకృషి చేయుఁడు. విగ్రహారాధనము నవలంబించి యజ్ఞులతోడ సద్గోగతికి మీరు దిగక విగ్రహారాధనపాశములనుండి విడిపించి యజ్ఞులను విజ్ఞులను జేసి మీతోడ నూర్ధ్వగతికి వారి నెక్కింపఁ బ్రయత్నింపుఁడు. సామాన్యముగా విగ్రహారాధనము నుపదేశించెడు శైవవైష్ణవపురాణములు సహిత మీవిషయమున విశేషముగా నేమి బోధించు చున్నవో వినుఁడు——

శ్లో॥ "ఆత్మసంస్థం శివం త్యక్త్వా బహిస్థం యజతే శివం
హస్తస్థం పిండ ముత్సృజ్య లిహేత్కూర్పరమాత్మనః".

తనలోపల నున్న శివుని విడిచి వెలుపల (గుళ్ళలో) నున్న శివుని పూజించువాఁడు చేతిలోనున్న ముద్దను పాఱవేసి మోచేతిని నాకువాఁడగునని శైవపురాణ మైనస్కాందము ఘోషించు చున్నది.

శ్లో॥ "యో మాం సర్వేషు భూతేషు సంత మాత్మాన మీశ్వరం
హిత్వార్చాం భజతే మౌఢ్యాత్ భస్మ న్యేవ జుహోతిసః".

సకలభూతములయందు నాత్మస్వరూపుఁడనయి యున్న యీశ్వరుని నన్ను విడిచి మూఢత్వమువలన విగ్రహార్చన సేయువాఁడు బూడిదలో హోమము చేసినవాఁడగు నని వైష్ణవపురాణ మైన శ్రీమద్భాగవతము ఘోషించు చున్నది.

ఈశ్వరుని కళ్యాణగుణములలో నొక్కొక్కదానిని దెలుపుటకయి యొక్కొక్కవిగ్రహము ప్రతిష్ఠింపఁబడె నని విగ్రహారాధనపక్షమవలంబించి పలుక సాహసించెడు ధీమంతులమాట వట్టిబూటకముల మాట. ఏనుఁగుమోమును బానకడుపును గల గణనాథవిగ్రహముగాని కరచరణాదులు లేని జగన్నాథవిగ్రహముగాని యీశ్వరుని యేకళ్యాణగుణమును దెలుపును?

ఆస్తికమతముఖ్యసిద్ధాంతములలో మొదటి దయిన యీశ్వరపితృభావమునకు విగ్రహారాధనవిషవృక్షము గర్భశత్రు వనియు దానిని మూలచ్ఛేదము చేయుట పరమకర్తవ్య మనియు నింతవఱకుఁ గొంత చెప్పి యున్నానుగదా! ఇఁక రెండవ దయినమనుష్యభ్రాతృభావమునకును గర్భశత్రు వయినది మనదేశములో వర్ణపిశాచము మఱియొకటి యున్నది. విగ్రహారాధనపిశాచమును రూపుమాపుటకు మనమెంత పట్టుదలతో పాటుపడవలయునో యంతపట్టుదలతోనే వర్ణపిశాచమును రూపుమాపుటకును మనము పాటుపడవలెను. ఈవర్ణపిశాచమిప్పు డీదేశమున సంఘముయొక్క ప్రాణవాయువులను పీల్చివేయుచున్నభయంకరకాలసర్పమై యున్నది. ఈపెనుభూతము భరతఖండవాసులలో నైకమత్యమును స్నేహభావమును పూర్ణముగా చెడఁగొట్టి బహుశతసంవత్సరములనుండి దేశాభివృద్ధికి భంగము కలిగించుచున్నది. ఇది యన్యోన్యసోదరభావము గలిగి యుండవలసిన హిందూమహాజనులలో వైషమ్యమును పుట్టించి దేశక్షేమాభివృద్ధులకు భంగ

కరము లయిన సమస్తానర్థములకును మూలమయి యున్నది. పూర్వకాలమునందువలె వర్ణాధిక్యము సత్ప్రవర్తనమునుబట్టి వచ్చునది గాక యిప్పుడు జాతిమాత్రముచేతనే కలుగునది యయి యున్నది. జ్ఞానగుణసంపన్నుఁ డయి లోకోపకారపరాయణుఁ డయి భగవద్భక్తుఁ డయిన యుత్తమశూద్రునికంటె జ్ఞానహీనుఁ డయి యవగుణపరిపూర్ణుఁ డయి యీశ్వరవిద్వేషి యయిన నికృష్టబ్రాహ్మణజాతుఁ డధికగౌరవనీయుఁడుగా పరిగణింపఁబడు చున్నాఁడు. ఆహా! ఏమి యీకాల మహిమ! ఏమి యీవర్ణప్రభావము! ఏమి యీయన్యాయధన్యత! బ్రాహ్మణుఁడు కూరుచున్న చాపమీఁదఁ గూరుచున్న శూద్రునిపిఱ్ఱను కోసివేయువలెనఁట! ఇది స్మృత్యుక్త మయిన మహాధర్మమఁట! ధర్మశాస్త్రములలోనెల్ల నుత్కృష్ట మయినదని యెంచఁబడుచున్న మనుస్మృతి యీవిషయమున విధించిన పరమధర్మమును తెల్పు తనియున్నట్టుగా వినుఁడు—

శ్లో॥ సహాసన మభిప్రేప్సు రుత్కృష్టస్యాపకృష్టజః
కట్యాం కృతాంకో నిర్వాస్యః స్ఫిచం వాస్యావకర్తయేత్॥

బ్రాహ్మణునితో సహాసనమును గోరు శూద్రుని తుంటిమీఁద వాఁతవేసిగాని పిఱ్ఱకోసిగాని వెడలఁగొట్టవలయునని ధర్మశాస్త్రము విధించు చున్నది. బ్రాహ్మణపక్షపాతమునుబట్టి యెంతటి యధర్మమును మహాధర్మమని ఘోషించుటకు ధర్మశాస్త్రము లజ్జింపకున్నది. ఇటువంటి ధర్మశాస్త్రవచనములు పరమప్రమాణములుగా భావింపఁబడుచున్న యీదేశ మన్యాక్రాంత మగుటలోను పరస్పరద్వేషపూరిత మగుటలోను వింత యేమున్నది? వర్ణభేద మిప్పటివలె లేని పూర్వకాలమునందు దానివలన దేశమునకుఁ గొన్ని యల్పలాభములు గలిగె

నను, ఇప్పు డట్టిలాభము లేవియు లేక యనంతము లైనయనర్థములు మాత్రమే కలుగుచున్నవి. ఇప్పటివర్ణభేదమువలన దేశమునకు కలుగుచున్నయనర్థములలో నొకటి యీశ్వరకుటుంబములోనివా రగుటచే నన్యోన్యసౌభ్రాత్రము కలిగి యుండవలసిన సోదరునకును సోదరునకును వేఱుపాటు గలిగి పంక్తిభోజనములును సంబంధబాంధవ్యములును లేక పరస్పరద్వేషము ప్రబలి మానుషస్వభావము చెడుట. రెండవది జాతికట్టుబాటులే పరమధర్మము లయి నీతిగౌరవము చెడి మనుష్యులు దయాదాక్షిణ్యశూన్యులయిన రాక్షసతుల్యులగుట! జన్మమును బట్టివచ్చిన దురభిమానగర్వితుఁడగు బ్రాహ్మణసంజాతుఁడు తనసోదరుఁడవఁదగిన యధమవర్ణమువానిపై గోడవిఱిగి కూలినను సాయము చేయఁజూడక తాను మైలపడుదు నని యంటనొల్లకుండుటకు సిగ్గుపడుటకు మాఱుగా గర్వపడుచుండుట రాక్షసకృత్యము గాక మఱి యేమగును! రాజసభలో నప్రమాణములుచేయుటకును కూటసాక్ష్యములు పలుకుటకును శంకింపనివాఁ డయినను తాను బ్రాహ్మణుఁడ ననియో వైశ్వదేవపరుఁడ ననియో గర్వపడుచు భోజనసమయమునందు పాపభీతి కలవాఁడయి సత్యసంధుఁ డయిన యుత్తమశూద్రుఁడు తనకంట బడినంతమాత్రముచేత నాతని శపించుచు ముందరియన్నమును విడిచి లేచిపోవుటకంటె రాక్షసకృత్యము మఱి యే ముండును! అతిబాల్యవివాహములు, స్త్రీవిద్యాభావము, వితంతువివాహనిరోధము, దేశాంతరగమన నిషేధము, మొదలయిన సమస్త సాంఘిక దురాచారములకును వర్ణభేదమే పట్టుకొమ్మ యైయున్నది. శాఖోపశాఖలుగాఁ బెరిగిన యీవర్ణవైషమ్యవిషవృక్షమును వ్రేళ్ళతోఁ బెల్లగించి వేసినంగాని దానిఛాయ వ్యాపించినంతదూరము మనదేశమునం దేసంస్కారబీజమును నాటుకొని మొలకయెత్తి వృద్ధినొంద నేరదు.

మనదేశమునందు వర్ణభేదము పూర్వకాలమునం దిప్పటివలె నుండినది కాదు. అప్పుడు, మనపూర్వులు పుట్టుకచేతఁగాక నీతిచేతనే గౌరవపాత్రు లగుచుండిరి. శ్రీ మహాభారతములో

శ్లో॥ నయోని ర్నాపి సంస్కారో నశ్రుతం నచసంతతిః
కారణాని ద్విజత్వస్య వృత్తమేవతు కారణమ్.

"పుట్టుక, ఉపనయనాదిసంస్కారము, వేదాధ్యయనము, సంతతి, ద్విజత్వమునకు కారణములు కావు; మంచినడత యొక్కటియే కారణము" అని యానుశాసనిక పర్వమునందును,—

శ్లో॥ నకులేన నజాత్యా వా క్రియాభి ర్బ్రాహ్మణోభవేత్
చండాలోపిహి వృత్తస్థో బ్రాహ్మణస్స యుధిష్ఠిర॥
శూద్రోపి శీలసంపన్నో గుణవాన్ బ్రాహ్మణోభవేత్
బ్రాహ్మణోపి క్రియాహీనః శూద్రాత్ప్రత్యవరోభవేత్॥

"కులము చేతను జాతిచేతనుగాక కార్యములచేతనే బ్రాహ్మణుఁ డగుచున్నాఁడు. ఓయుధిష్ఠిరా! మంచినడవడి గలవాఁడు చండాలుఁ డయినను వాఁడే బ్రాహ్మణుఁడు. శూద్రుఁ డైనను సదాచార సంపన్నుఁ డయి గుణవంతుఁ డయినవాఁడు బ్రాహ్మణుఁ డగును; బ్రాహ్మణుఁ డయినను. క్రియాహీనుఁడు శూద్రునికంటె తక్కువవాఁ డగును" అని యారణ్యపర్వమునందును, శ్రీమద్భాగవతములో

శ్లో॥ శమోదమ స్తపశ్శౌచం సంతోషః క్షాంతి రార్జవమ్
జ్ఞానం దయా చ్యుతాత్మత్వం సత్యంచ బ్రహ్మలక్షణమ్॥

"శమము, దమము, తపస్సు, శౌచము, సంతోషము, క్షాంతి, ఆర్జవము, జ్ఞానము, దయ, స్వార్థపరిత్యాగము, సత్యము బ్రాహ్మణ లక్షణములు" అని సప్తమస్కంధమునందును, జెప్పఁబడి యున్నవి. ఓబ్రాహ్మణనామధారకులారా! ఈలక్షణములు మీయందుఁ గలిగిన

బ్రాహ్మణుఁడనని చెప్పుకొని గర్వపడుఁడు. ఈలక్షణములేవియు లేక పుట్టుబ్రాహ్మణుఁ డని మాత్రము వృథా గర్వపడఁ బోకుఁడు. పూర్వోక్త లక్షణములుగల అధమవర్ణసంజాతులనయినను బ్రాహ్మణులనుగాను మహాజన్ములనుగాను భావించి గౌరవింపుఁడు. నిజమైన బ్రాహ్మణత్వము గుణములలో నున్నదిగాని పొట్టలోనుపుట్టుకలోను లేదు. పుట్టుకనుబట్టి మేము వసిష్ఠాదిగోత్రజుల మని విఱ్ఱవీఁగెదు వెఱ్ఱులారా! మీపూర్వులఁ బుట్టుకను విచారింపుఁడు.

శ్లో॥ గణికాగర్భసంభూతో వసిష్ఠశ్చమహామునిః॥

బ్రహ్మర్షులలో నెల్ల నగ్రగణ్యుఁడయి శ్రీరామప్రముఖ సూర్యవంశరాజులకెల్లఁ బురోహితుఁ డయిన వసిష్ఠుఁడు వేశ్యకు పుట్టినవాఁడు.

శ్లో॥ జాతో వ్యాసస్తు కైవర్త్యా శ్వపాక్యాస్తు పరాశరః॥

అని భారతారణ్యపర్వమునఁ జెప్పబడియున్నది. వేదవిభాగము చేసి వేదవ్యాసుఁ డని పేరొంది, ప్రస్థానత్రయములో నొక్కటియైన బ్రహ్మసూత్రములను రచించిన సాత్యవతేయుఁడు పల్లెదానికొడుకు; వ్యాసునితండ్రియయి కలియుగమునకు బరమప్రమాణ మయిన స్మృతిరత్నమును రచించిన పరాశరుఁడు మాలదానికొడుకు. ఈమహానుభావులందఱును పుట్టుకచేతఁగాక గుణముచేతనే మహర్షులయి పూజనీయులయిరి. వారివలెనే మీరును గుణసంపదను గడించుటకయి పాటుపడుఁడు. మన యాధిక్యమంతయు సద్వర్తనములో నున్నదికాని భోజనములోను జన్మములోను లేదు. జాతికంటె గుణము శ్లాఘ్యతరమని మీకెప్పుడు దృఢనిశ్చయము గలుగునో యప్పటినుండి దేశాభివృద్ధి యారంభమగును.

ఓభాతృవరులారా! మీరు తోడివారి హీనస్థితికి దిగక వారి నున్నతస్థితి కెక్కించుటకయి ప్రయత్నింపుఁడు పూర్వోక్తములయిన

బ్రాహ్మణాధిక్యాభిమానము విడ్వారుగదా! మీరు బ్రాహ్మణలక్షణము లను విడువక బ్రాహ్మణేతరులయిన శూద్రాదులను బ్రాహ్మణపదమెక్కించుటకు కృషిచేయుఁడు శుష్కోపదేశములచేతఁగాక కార్యములచేత "మేము నడుచునట్లు నడువు" డని లోకమునకుఁ బోధింపుఁడు. అప్పుడు మాత్రమే మీయాభిజాత్యము లోకమునకుఁ దెలిసి మీమాటలయందువిశ్వాసము కుదురును. మన యీశ్వరునకును మన యాత్మలకును గర్భశత్రువు లయినవిగ్రహారాధనమును వర్ణవైషమ్యమును నశించువఱకును పోరాటమును మానక యీశ్వరభక్తులై నిలువుఁడు. ఈశ్వరుఁడు మీకు తగినయుత్సాహమును బలమును ప్రసాదించుగాక!

---

## ప రి శు ద్ధా స్తి క మ త ము.*



భ్రాతృవరులారా!

నేఁ డీపట్టణమున జరుగుచున్న యీయాంధ్రదేశాస్తికమహాసభకు నన్నధ్యక్షునిగా నియమించినందున కయి మీకుఁ గృతజ్ఞతాపూర్వకములైన వందనముల సమర్పించుచున్నాఁడను. మీరు నన్నుంచిన యీఘనపదమునకు నేనర్హుఁడనుగానని యెఱిఁగిన వాడనయ్యును, నామీఁదియాదరముచేత నన్నీసభాధ్యక్షత వహింపవలసినదని యాహ్వానసభాకార్యదర్శిగారు పునరుక్తముగాఁ గోరినప్పుడు నే నాయనమాటనతిక్రమింపఁజాలక యంగీకరింప వలసినవాఁడ నయితిని.

---

* ఇది 1906వ సంవత్సరము ఏప్రియల్ నెల 15వ తేదీని గుంటూరులో జరిగిన యాంధ్రదేశాస్తిక సభలోఁ జదువఁబడినది.

సభారంజకముగాఁ బ్రసంగింపవలసిన యిట్టి సమయమునందుఁ గొప్ప పరీక్షలయందుఁ గృతార్థుఁడయి నాకంటె సమర్థతరుఁడైన మంచి వక్తను సభాధ్యక్షునిగా నేర్పఱుచుకొని యుండినయెడల సభోద్దేశము లధికజయప్రదముగా నెఱవేఱుట కవకాశము కలిగియుండును. నేటి సభ కట్టిభాగ్యము పట్టినదికాదు. కార్యము మించినతరువాత వగచిన ప్రయోజనము లేదు. మీరు పొందిన ప్రమాదముయొక్క ఫలము నేర్పుతోను తృప్తితోను మీరనుభవించితీఱవలెను. కాఁబట్టి నేనేమో హృదయాహ్లాదకర మైనగొప్పధర్మోపదేశమును జేయుదు నని భ్రమ పెట్టుకొనక యాశాభంగమునకై మీరందఱు సంసిద్ధులయి యుండ వలెను. సభాధ్యక్షత వహించినవా రేదో కొంతసంభాషించుట యాచారమయి యుండుటచేత నేనిప్పు డాస్తికసమాజ ధర్మములను గూర్చి నాయప్రౌఢవాక్యములతోనే యించుక సంభాషించి మీకు శ్రమకలిగించుచున్నాను. నాయుపదేశ కౌశలమునుబట్టి కాకపోయి నను నావృద్ధత్వమును దయనీయమైన శరీరదౌర్బల్యమును విచారించి యైనను సహించి నేఁ జెప్పఁ బోవుదానిని దయతో నాలకింపుఁడు.

పరిశుద్ధాస్తికమతము నాంధ్రదేశములో నెట్లు వ్యాపింపఁ జేయ వలయునో యాలోచించుటకును తన్మతసిద్ధాంతములనుగూర్చి సంభాషించుటకును తెలుఁగు దేశముయొక్క బహుభాగములనుండి పరిశుద్ధాస్తిక మతావలంబులును తదభిమానులు నైన సోదరు లిప్పు డింతమంది వచ్చి యిచ్చట సమావేశమగుట దేశముయొక్క పురో వృద్ధికి శుభసూచకముగా నున్నది. పరిశుద్ధాస్తికమతము మన భరత ఖండమునందుఁ గొన్నిచోట్ల బ్రహ్మసమాజ మనియుఁ గొన్నిచోట్లఁ బ్రార్థనసమాజ మనియు నామద్వయముతో వ్యవహరింపఁ బడు చున్నది. దేవుఁ డున్నాఁడని యంగీకరించు నవి యెల్లను ఆస్తికమత

ములే యయినను, జనుల యజ్ఞానము మొదలయిన కారణములచేత బహుమతములయందు దేవునిగూర్చియు, దేవునకును మనుష్యునకును గల సంబంధమును గూర్చియు దేవుని విషయమున మనుష్యుఁడు నడుచుకోవలసిన ధర్మములను గూర్చియు నపరిశుద్ధములైన యభిప్రాయములును దురాచారములును వ్యాపించియున్నవి. ఇహపర సుఖభంజకము లైన యట్టియపరిశుద్ధశీలనెల్లఁ దొలఁగించుకొని మతమును నిర్మల మైనదానినిగాఁ జేయుటచే దీనికి పరిశుద్ధాస్తిక మతమని పేరు వచ్చినది. ఆర్యులపవిత్రగ్రంథము లయినయుపనిషత్తులయం దీశ్వరుఁడు బ్రహ్మ మనునామముతో వ్యవహరింపఁబడుటచేత శుద్ధపరబ్రహ్మము నుపాసించువారి యామతమునకు బ్రహ్మమత మనియు, వారి సంఘమునకు బ్రహ్మసమాజ మనియు, ఈసమాజమునకు మానసికప్రార్థనము ప్రధాన మయినందున ప్రార్థనసమాజ మనియు, పేరులు కలిగినవి. బ్రహ్మసమాజ మను పేరుచేతనే యిది యార్యమతవృక్షమునుండి పుట్టిన పరిశుద్ధశాఖ యనిస్పష్టపడుచున్నది. పరబ్రహ్మమునుగూర్చి,—

"యః సర్వజ్ఞః సర్వవిద్ యస్యైష మహిమాభువి దివ్యే
తద్విజ్ఞానేన పరిపశ్యన్తిధీరాఆనందరూప మమృతం యద్విభాతి."

ఎవ్వఁడు సర్వజ్ఞుఁడో సర్వవిదుఁడో భువియందును దివియందును గలవి రెవ్వని మహిమలో యెవ్వఁ డానందరూపుఁడును నిత్యుఁడు నయి ప్రకాశించుచున్నాఁడో యతనిని పండితులు జ్ఞానముచేత నంతటఁ జూచుచున్నారని ముండకోపనిషత్తును,—

"స పర్యగాచ్ఛుక్ర మకాయ మవ్రణ
మస్నావిరగ్ శుద్ధమపాపవిద్ధమ్."

అతఁడు సర్వవ్యాపి, తేజోమయుఁడు, నిరాకారుఁడు, నిరామయుఁడు, అస్నావిరుఁడు, శుద్ధుఁడు, పాపరహితుఁడు, అని యీశావాస్యోపనిషత్తును చెప్పుచున్నది. ఇటువంటి వాక్యములే యితరవిశేషములతోడ పెక్కు లితరోపనిషత్తు లందును గానఁ బడుచున్నవి. ఇట్టి యుపనిషద్వాక్యములను బట్టి దేవుఁడు నిత్యుఁడు, నిరాకారుఁడు, సర్వవ్యాపి, సర్వజ్ఞుఁడు, సర్వశక్తుఁడు, సర్వకారుణ్యుఁడు ఆనందస్వరూపుఁడు, పరిశుద్ధుఁడు, పాపరహితుఁడు, అని విస్పష్ట మగుచున్నది, పరిశుద్ధాస్తికు లయినమనవా రుపాసించు దేవుఁడీ పరమాత్మయే;—

"యతో వా ఇమానిభూతాని జాయంతే యేనజాతాని జీవంతి
యత్ప్రయం త్యభిసంవిశంతి తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మ"

దేనివలన నీచరాచరభూతములు పుట్టుచున్నవో, దేనివలన పుట్టినవి జీవించుచున్నవో, ఆత్మలు దేనినిగూర్చి పొలుపొందుచున్నవో, అది బ్రహ్మమని తెలిసికొమ్మని తైత్తిరీయోపనిషత్తులోని భృగువల్లి యందుఁ జెప్పఁబడియున్నది. ఇత్యాదివాక్యములను బట్టి చరాచరము లయినసమస్త పదార్థములును దేవునివలననే కలుగుచున్న వనియు, సమస్తజీవకోటులును దేవునివలననే జీవించుచున్న వనియు, సమస్తాత్మలును మరణానంతరమున దేవునియొద్దకే పోయి చేరుచున్న వనియు విశద మగుచున్నది. పై వాక్యములవలన నీశ్వరుఁడు సృష్టిస్థితిలయములకు కారణుఁడనుటయే గాక మనయాత్మలు సయితము నిత్యములయి మరణానంతరమున నుండు ననుటయుఁ దేలుచున్నది. ఈయుపరిషదర్థములే పరిశుద్ధాస్తికమతముయొక్క సిద్ధాంతములు. ఈసిద్ధాంతములను బట్టి సృష్టికర్త యగుటచే నీశ్వరుఁడు లోకపిత యనియు ఆయనచేఁ బుట్టింపఁబడిన మానవుల మయిన మనమందఱమును తత్పుత్ర సదృశుల మనియు అందుచేత పరస్పరభ్రాతల మనియు, పితృభక్తి

కలవారమయి యీశ్వరుని సేవించుచు సద్వినయములతోను, తదాజ్ఞానుసారముగా వర్తించుటయు తోడిమానవులయెడల సోదరభావము కలవారమయి వారిని ప్రేమించుచు వారి క్షేమమునకై పాటుపడుటయు మనకు ధర్మములనియు, నేర్పుచున్నది. ఇందువలన నీశ్వరపితృత్వమును, మనుష్యభ్రాతృత్వమును పరిశుద్ధాస్తిక మతమునకు మూలతత్త్వములుగాఁ బరిగణింపఁబడినట్లు తెలిసికొనుచున్నను. లోకములో మనకు ప్రియతమములయినపదార్థము లన్నిటికంటెను ప్రియతమునిగా భావించి తదాజ్ఞ ననుమాత్రమును మీఱక యేపని చేసినను పరమేశ్వర ప్రీత్యర్థముగానే చేయుచు భక్తిచూపుచున్నపుడే మనకీశ్వరపితృత్వము లభించినట్లగును.

> "తదేతత్ ప్రేయఃపుత్రాత్ ప్రేయోవిత్తాత్ ప్రేయోऽన్యస్మాత్
> సర్వస్మాత్ అంతరతరం యదయమాత్మా"

ఏది యన్నిటికంటె నంతరతరమో యట్టిపరమాత్మ పుత్రునికంటెను ప్రియతరమయినది, విత్తముకంటెను ప్రియతరమైనది, యితరములైన యన్నిటికంటెను ప్రియతర మైనది, అని బృహదారణ్యకోపనిషత్తు బోధించుచున్నది. ఈశ్వరునియందు పితృభావము కుదురుటకు భక్తిపూర్వకమయిన మానసికారాధన మావశ్యకము. కుమారుడు తండ్రిని సమీపించునట్లు నిర్మలాంతఃకరణముతో పరమాత్మను సమీపించి తన లోపములను వాంఛలను నిష్కపటముగా నివేదించి, తన దురాచారములకు పశ్చాత్తాపపడి క్షమింపవేఁడుచు, తనకు ధర్మబుద్ధిని ధర్మాచరణస్థైర్యమును బ్రసాదింపఁ బ్రార్థించుటయే యీశ్వరారాధనము. ఇట్టి మానసికారాధనమే పరిశుద్ధాస్తికుల కీశ్వరసాంగత్య సంధాయకమగు సత్యవ్రతము. విగ్రహారాధన మీశ్వరపితృభావసిద్ధికి విఘ్నభూతము. ఈశ్వరసాంగత్య సౌఖ్యామృతము ననుభవింప నపేక్షించు

ప్రతిపురుషుండును నోరుచెటిపి హృదయమును కలుషపఱిచి భక్తిబీజమును చంపి కేసెను ప్రతిమూర్చనాత్మకవివ ఫలమును రూపుమాప దీక్ష వహింపవలెను. ప్రతిమారాధనము నుపేక్షించినయెడల మన మసత్య సముద్రములోను, అజ్ఞానాంధకారములోను, మునిగి నిత్యపదవిని బోగొట్టుకొందుము.

"అసతోమా సద్గమయ తమసోమా జ్యోతిర్గమయ మృత్యోర్మామృతంగమయ."

అసత్యమునుండి నన్ను సత్యమును పొందింపుము, అంధకారమునుండి నన్ను తేజస్సును పొందింపుము. మృత్యువునుండి నన్ను నిత్యపదవిని పొందింపుము' అని బృహదారణ్యకోపనిషత్తు నున్నట్లు మనల నసత్యమునకును తమస్సునకును మృత్యువునకును నీడ్చెడువిగ్రహపూజా పిశాచహస్తములనుండి విడిపించి రక్షించుటకయి సత్యస్వరూపుడును, స్వప్రకాశుడును, నిత్యుడును నయిన యీశ్వరుని ప్రార్థింతము.

మన కీశ్వరపితృత్వసిద్ధి యెప్పు డగునో యప్పుడే మానవ సామాన్యభ్రాతృభావమును కలుగును. ఈశ్వరునిబిడ్డల మగుటచేత మన కెల్లపురుషులు నన్నదమ్ములును, ఎల్లస్త్రీలును అక్కచెల్లెండ్రును అగుదురు. అప్పుడు లోక మంతయు నేకకుటుంబమయి, యందలివారందఱును స్వప్రయోజనపరత్వమును మాని, పరార్థపరత్వమును బూని యన్యోన్యక్షేమాభివృద్ధికయి పాటుపడువా రగుదురు. ఇట్టి స్థితిని గలిగించుటకై పాటుపడుట పరిశుద్ధాస్తికుల పరమధర్మము. పరస్పరసోదరభావమునకు మనదేశములో నిప్పుడు గర్భశత్రువయి యున్నది వైషమ్యము. ఈయస్వాభావికవైషమ్యము మనలో విశేష భాగము మానుషస్వభావమునే మార్చివేసి, మనుష్యులను మృగతుల్యులనుగాను మృగములకంటెను హీనులనుగాను జేసినది. అధమ

వర్ణములవారివిషయమున నన్యవర్ణములవారు చేసెడి యన్యాయ ములుండనిచ్చి యేకవర్ణము వారిలోనే నడచెడు పశుప్రాయ మగు దుర్న యమును జూడుడు. ఏకవేదమునే నమస్కారము నేకధర్మశాస్త్రమునే యంగీకరించుచు నేకదేశముననే వసించుచు బ్రాహ్మణోత్తములమని గొప్ప చెప్పుకొనువారిలోనే వైశ్వదేవపరుడయి శుద్ధశ్రోత్రియుం డయినస్మార్తుడు కాకి చూచుచున్నను కుక్క చూచుచున్నను భుజించునుగాని వైష్ణవ బ్రాహ్మణుడు చూచినంతమాత్రముచేత తన యన్నము మైల పడినదని భుజింప నొల్లక విస్తరి విడిచి లేచిపోవును గదా? మేమందఱము హిందూమతావలంబులమే యని ప్రజ్ఞలు పలుకుచు దురభిమానదూషితులగుచున్న మహానుభావులీద్విజులు మ్లేచ్ఛునియెడలం జేసెడిదానికంటె స్వకులజునియెడలం జేసిన ఘనకార్య మేమో చెప్పుడు. యాత్రావరులైన బ్రాహ్మణులే మార్గమధ్యమున వ్యాధిబాధలచేత గ్రామము వీధులప్రక్కలను బడియుండి కులగోత్ర ములు తెలియమిచే నెవ్వరు నంటిముట్టి తోడ్పడకుండుటచేత కృశించి నక్కలచే జీవములతోనే యీడ్చుకొనిపోఁబడుచుండుటయుఁ గలదని చూచిన యన్యదేశీయులు వ్రాసియున్నారు. హిందూమతమున కింత కంటెనవమానకరమైన హీనకృత్యము మఱేమున్నది? పశుకృత్యము సహిత మింతకంటె నీచమైన దుండునా? పరస్పరభ్రాతృత్వ కల్పతరు వును మూలచ్ఛేదము చేసెడు వేరుపురుగైన వర్ణవైషమ్యమును తాము విడుచుటయేకాక సకలవిధముల దాని స్వరూపనాశనమును జేయుటకయి పరిశుద్ధాస్తికులందఱును బద్ధకంకణులు కావలెను. ఓ భ్రాతృవరులారా! దయాదాక్షిణ్యములు మాని మీరీశ్వరకుటుంబ నాశనకారకుఁ డయినవర్ణవైషమ్యరాక్షసుని హతము చేయుటకయి కృతప్రతిజ్ఞులరు కండు. ఈశ్వరశక్తిం నిరాసాభిలాషచేత వక్తృత్వధర్మ

మార్గ మింతక తొలంగి వర్తించితిని. మన్నింపుఁడు. ఇఁక వక్తవ్యాంశ మునకు వత్తము.

ఈశ్వరసద్భావమును గూర్చియు, నాతని కళ్యాణగుణములను గూర్చియు మనుష్యుల యన్యోన్యసోదరభావమును గూర్చియు మన పూర్వుల సిద్ధాంతమును గూర్చియు నుపనిషద్వాక్యముల నుదాహరించుచుఁ బరిశుద్ధాస్తిక మతసిద్ధాంతములను సంక్షేపముగాఁ జెప్పియున్నాను. ఇఁక స్వధర్మములను గూర్చియు ధర్మనియమములకుఁ గల ప్రమాణములను గూర్చియు పుణ్యపాపములను గూర్చియు స్వర్గ నరకములను గూర్చియుకూడ నించుక వచించి విరమించెదను.

శ్లో॥ మాతృవ త్పరదారాంచ పరద్రవ్యాణి లోష్టవత్
ఆత్మవ త్సర్వభూతాని యః పశ్యతి సపశ్యతి.

పరదారను తల్లివలెను, పరద్రవ్యమును మట్టిగడ్డవలెను, సర్వభూతములను తనవలెను, ఎవఁడు చూచునో వాఁడే నిజముగాఁ జూచువాఁడని మనపూర్వులు చెప్పియున్నారు. ఈయవి మనుష్యధర్మములు. ఈవిషయమున నిట్లు చేయువలసిన దని విధించిన యీశ్వరాజ్ఞ లన్నియు మనకు ధర్మములు.

"సత్యంవద" "ధర్మంచర" అని తైత్తిరీయోపనిషత్తు శిక్షావల్లిలో గురువు శిష్యునకు 'సత్యము పలుకుము' 'ధర్మము నాచరింపుము' అని యుపదేశించు చున్నాఁడు. ఈరెండును పరిశుద్ధాస్తికుల పరమధర్మములు. లోకములో సత్యమును మించిన ధర్మము వేఱొకటి లేదు.

శ్లో॥ నాస్తి సత్యసమోధర్మః నాసత్యాత్పాతకం పరం
నహితీవ్రతరం కించి దనృతా దిహ విద్యతే.

సత్యమునతో సమానమయినధర్మము లేదు; సత్యమునకంటె శ్రేష్ఠ మయినది లేదు; అసత్యమునకంటె తీవ్రతర మయినది యీ లోకమున వేఱొకటి లేదు — అని పంచమవేద మనంబరగిన శ్రీమహాభారతము సత్యోత్కృష్టతను ఘోషించుచున్నది. ఈశ్వరుఁడే సత్యస్వరూపుఁ డగుటచే సత్యము ననుసరించుట యీశ్వరు ననుస రించుటయే. మన కెన్నికష్టములు వచ్చినను సత్యమును విడువరాదు. "నాన్నృతా త్పాతకంపర" మన్న యార్యోక్తి యసత్యమునకంటె నెక్కువపాతకము లేదని చాటుచున్నది. సత్యాదరము లేకున్న లోకములో నభివృద్ధియే కలుగదు. సత్య మెందున్నను గ్రహింప వలెను.

మాది మాపూర్వులు చేసినది యన్న దురభిమానమును విడిచి యసత్యము మన దయినను తెలియఁగానే త్యజించుచు సత్యము పరుల దయినను భజించుచుండవలెను. మనవన్న హేతువుచేత దురాచారము లను మూఢవిశ్వాసములను హేత్వాభాసములను కల్పించి పొగడు చుండుటయు పరుల దన్న హేతువుచేత సదాచారములను సదుపదేశ ములను యుక్త్యాభాసములు కల్పించి తెగడు చుండుటయు దేశమును పాడుచేసెడు దురభిమాన మగునుగాని దేశమును బాగుచేసెడు స్వదేశాభిమానము కాదు. తనవారి యభివృద్ధి గాంక్షించెడు ప్రతి దేశాభిమానియు తనవారిలోఁ గలలోపముల నెత్తి చూపి వానిని దిద్దుకొనునట్లు చేయుచు నితరులలోఁ గలగుణాంశముల నెత్తిచూపి వానిని గ్రహించునట్లు చేయుచు దేశాభివృద్ధ్యర్థము నిరంతరకృషి చేయుచుండవలెను. గుణాగుణవిచారము లేక తమలోఁ గలదురాచార దురుపదేశములను సహితము పామరజనరంజనముకొఱకు తమ విద్యా బుద్ధుల వినియోగించి భూషించుచు నభివృద్ధికి భంగమును సంస్కార

మునకు విఘాతము గలిగించెను. తెలిసినమూఢులే మన దేశమునకు గర్భశత్రువులు. సామాజికదూషణమును పాటిచేయక చెవికి చేదుగా నుండినను హితమును జూపి దురాచారదుర్నీతులను రూపుమాపి సంస్కారము వ్యాపింపఁ జేయుట కయి తమ కాలమును శక్తిని ధనమును వినియోగించువారు మాత్రమే దేశమునకు నిజమైనప్రాణమిత్రులు. సత్యసమాదరమే సర్వదా పరిశుద్ధాస్తికుల నిత్యకృత్యమయి యుండవలెను. తాలుత నెన్నియంతరాయములు వచ్చినను కడపట సత్యమే జయించును. "సత్యమేవజయతే" యని ముండకోపనిషత్తు మొఱ యిడుచున్నది.

శ్లో॥ ఏవఏవ సుహృ ద్ధర్మో నిధనే ప్యనుయాతి యః
శరీరేణ సమం నాశం సర్వ మన్యద్ధి గచ్ఛతి॥

తక్కినవి సమస్తమును శరీరనాశముతోనే పోవుచుండఁగా మరణానంతరమున సహితము వెంటవచ్చెడుధర్మ మొకటియే నిజమైన మిత్రుడనియు,—

శ్లో॥ ధర్మఏవ హతో హ న్తిధర్మో రక్షతి రక్షితః
తస్మాద్ధర్మో నహంతవ్యో మానోధర్మో హతోవధీత్ ॥

ధర్మము తన్ను హతము చేయువానిని హతముచేయుచు, తన్నురక్షించు వానిని రక్షించుచుండును, గనుక ధర్మమునుజెఱిచి తానుచెడకుండ వలెననియు పంచమవేదమైన భారతము ధర్మమును శ్లాఘించుచున్నది. ఈశ్వరాజ్ఞయే ధర్మమని యింతకుముందు చెప్పియున్నానుగదా! ధర్మాధర్మనిర్ణయ మెట్లు చేయునగును, ఇది యీశ్వరాజ్ఞయనిమన కెట్లు తెలియవచ్చును, కృత్యాకృత్య నిర్ధారణమునకు ప్రమాణమేమి, యని సందేహము తోఁచవచ్చును. కార్యాకార్య నిర్ణయమునకు మన యంతరాత్మయే పరమ ప్రమాణము.

ఈశ్వరుఁడు మనహృదయఫలకములందే మనధర్మశాస్త్రమును దివ్యాక్షరములతో లిఖించి యున్నాఁడు. మనయంతరాత్మ మంచిదని బోధించుదానిని జేయుచుండుటయే మనకు పరమధర్మము. అది యొక్కటియే పరమ కర్తవ్యము,—

శ్లో॥ యత్కర్మ కుర్వతోస్య స్యాత్ పరితోషోంతరాత్మనః
తత్ప్రయత్నేన కుర్వీత విపరీతంతు వర్జయేత్ ॥

ఏపని చేయుటవలన నంతరాత్మకు సంతోషము గునో యాపనిని ప్రయత్నముతోఁ జేసి దానికి విరోధమైనదానిని వర్జింపవలసినదని మనుధర్మశాస్త్రము విధించుచున్నది. అంతరాత్మ బోధించునట్లు సర్వదా చరించువాఁడే యీశ్వరాజ్ఞను జెల్లించువాఁడును స్వధర్మానుష్ఠానపరుఁడును సుకృతియు నగును. మనకోరికలెట్లున్నను మన యంతరాత్మ యిదిమంచి యిదిచెడ్డ యిది చేయఁదగినది యిది చేయఁదగనిది యని నిరూపించి సదా కర్తవ్యము నుపదేశించుచుండును. తదాచరణమువలన లాభముకలుగునా నష్టము కలుగునా యన్నవిచారమునుమాని యీశ్వరాజ్ఞయు ధర్మమగుటచేత నంతరాత్మ విధించుదానిని ఫలనిరపేక్షముగా ననుష్ఠింపవలెను. అట్టియనుష్ఠానపరుఁడే పయినుండి యనంతములైన యాపదలు బాధించుచున్నను మనశ్శాంతికలవాఁడయి యాత్మానందము ననుభవింపఁగలుగును. లోకములోని తక్కిన సమస్త విషయములలో నెట్లో యట్లే మతవిషయము నందును వృద్ధి స్వాభావికము. జ్ఞానాభివృద్ధియయి నూతనసత్యములు బయలఁబడుచుండు కొలదిని వానిని స్వీకరించుచుండవలయును. సత్యగ్రహణైక పరాయణున కపజయ మెప్పుడును గలుగదు. క్రమముగా నుపయోగింపక యుపేక్షచేసినచో కరచరణాద్యవయవములు లేప్రకారముగా దుర్బలములగుచువచ్చునో యాప్రకారముగానే మన యంత

రాత్మయొక్క సద్యుపదేశములను నిరాకరించుచు నుపేక్షచేయుచు వచ్చినకొలఁదిని దుర్బలమయి నిరుపయుక్తమగును. కాఁబట్టి మన యంతరాత్మ బోధనల ననాదరింపక యాచరణమునకుఁ దెచ్చుచు దానిని బలపఱుచు చుండవలెను. అప్పుడది తానుబలపడి సత్కార్యాచరణమున కయి మనకు బలమునిచ్చి మనల నీశ్వరప్రీతికరకర్తృ లయినవారినిగాఁ జేయును. నేను శ్రుతిస్మృతులనుండి పలువాఱు ప్రమాణవచనము లుదాహరించుచు వచ్చుటచేత నాయా గ్రంథములం దున్నవన్నియు నాచరణీయములగు నాయని కొందఱు దలఁచవచ్చును.—

"యాన్యస్మాకగ్ం సుచరితాని తానిత్వ యోపాస్యాని నో ఇతరాణి"

ఏవి మాసుచరితలో యవియే నీచేత ననుష్ఠింపఁదగినవి కాని యితరములు కావనియు, తైత్తిరీయోపనిషత్తునందు గురువు శిష్యున కుపదేశించి యున్నాఁడు. గ్రంథములలోని యుపదేశములు గాని గొప్పవారియొక్క వాక్యములును పనులును గాని యెంతవఱకు మంచివిగానుండి యంతరాత్మ బోధలకు వ్యతిరేకము కాకుండునో యంతవఱకే గ్రాహ్యములును ననుష్ఠేయములు నగునుగాని యటువయిని గావు. అంతరాత్మబోధన మొక్కటియే మనకుఁ బరమప్రమాణము. దానిముందు తక్కిన వన్నియు నధమ ప్రమాణములు.

ఈశ్వరాజ్ఞ యనఁగా ధర్మము నుల్లఘించుట పాపము; ధర్మానుసరణము పుణ్యము. శారీరధర్మములను మీఱినప్పుడు దేహమునకు రోగాదిక మగుబాధ కలుగునట్లే, ఆధ్యాత్మిక ధర్మములను మీఱినప్పుడు మనసునకు దుఃఖాదిక మగు వ్యధకలుగును. ఏధర్మము నతిక్రమించినను, ఆపాపమున కర్హ దండన మవశ్యముగా కలుగును.

ఈదండన మెప్పుడును మనలను పాపములనుండి మరలించి మనమేలు నకుతోడు పడునదిగా నుండును. శారీరధర్మముల ననుసరించినప్పుడు దేహమున కారోగ్యాదిక మగుసౌఖ్యము కలుగునట్లే ఆధ్యాత్మికధర్మముల ననుసరించి నప్పుడు మనస్సునకు సంతోషాదిక మగుసుఖము కలుగును. ఏధర్మము ననుసరించినను, అపుణ్యమున కర్మబహుమాన మవశ్యముగా కలుగును. ఈబహుమాన మెప్పుడును మనలను పుణ్యమునకు పురికొల్పి మనమేలునకు తోడుపడునదిగానుండును. పుణ్యము స్వాభావికము; పాప మస్వాభావికము. ఈశ్వరునకు పుణ్యము ప్రీతికరమయినది; పాప మప్రీతికరమయినది. మనకు పాపము పరమశత్రువు; పుణ్యము పరమమిత్రము. మన మెప్పుడును పాపముతో పోరాడి దానిని నాశముచేసి, హృదయ రాజ్యమున స్థిరముగా పుణ్యమును స్థాపింపఁ బ్రయత్నింపవలెను. మరణానంతరమున నాత్మసుఖస్థితియం దుండుట స్వర్గము; దుఃఖస్థితియందుండుట నరకము. ఆత్మ పాపముల నుండి విడిపింపఁబడుటముక్తి. మనుష్యుఁడు తాను చేసినపాపమునకు పరితాపపడి, యిఁకముం దట్టి పాపము నెప్పుడును జేయనని కృతనిశ్చయుఁడగుటచేత పాపవిముక్తి నొంది పవిత్రుఁ డగును.

శ్లో॥ కృత్వాపాపం హి సంతప్య తస్మాత్పాపాత్ప్రముచ్యతే
నైదం కుర్యాం పునరితి నివృత్త్యాపూయతే తు సః॥

"పాపముచేసి సంతాపపడి యాపాపమునుండి విడిపింపఁ బడుచున్నాఁడు; దానిని మరల చేయనని మళ్ళుకొని వాఁడు పూతుఁ డగుచున్నాఁడు" అని మనుస్మృతి చెప్పుచున్నది. పరిశుద్ధాస్తిక మత సిద్ధాంతములలో ముఖ్యమయినవానిని కొన్నింటిని గాన నింక మన సామాజికుల కొకచిన్న విన్నపముచేసి ముగించెదను.

సామాజికు లగు సహోదరులారా! మీామూలమున సంస్కారమునొంది బాగుపడవలెనని మనదేశ మాశపడుచున్నది. మీా యాశాభంగమును కలిగింపక దేశాభివృద్ధిని గలిగించుటకయి శక్తివంచన చేయక సర్వవిధముల పాటుపడుఁడు. సమాజప్రతిజ్ఞా పత్రమునందు చేవ్రాలుచేయుటచేతను, వారమున కొకసారి సమాజమునకు వచ్చి ప్రార్థనచేసిపోవుటచేతను, అప్పుడప్పుడు ధర్మోపన్యాసములుచేయుచు నచ్చుటచేతను, కృతార్థుల మయితి మని తలఁచుకొనకుఁడు. ఈపను లావశ్యకములే యైనను, మీారు చేయవలసినవి యింతకంటెను ముఖ్యము లయినవనేకము లున్నవి. ఇతరులను సంస్కరింపఁ బ్రయత్నించుటకు ముందు మీారు మిమ్ము సంస్కరించుకొనవలెను. సంస్కార మెప్పుడును తనతో నారంభము కావలెను. తన్నుఁదాను సంస్కరించుకోలేనివాఁడు లోకము నెట్లు సంస్కరింపఁ గలుగును? తన్ను సంస్కరించుకొనుట స్వాధీనమయినపని; ఇతరులను సంస్కరించుట పరాధీనమైనపని. పరాధీనమైనపని సాధ్యముకాక పోవచ్చును గాని స్వాధీనమైనపని యెవ్వరికిని సాధ్యముకాక పోదు. సత్యమిట్లు న్నను మనదేశములో నిప్పుడు తమయుపదేశము తమ కక్కఱకు రాని సంస్కర్తల సంఖ్య యంతకంత కధిక మగుచున్నది. ఎక్కడఁ జూచినను ప్రసంగములే; ఎక్కడఁజూచినను ధర్మోపన్యాసములే. ఉపదేశములలోఁ గొఱతలేదు; కొఱంత యంతయు నొక్క యనుష్ఠానమునందు మాత్రమే కనఁబడు చున్నది. అందుచేతనే వీరు శుష్కవాచాటులేకాని క్రియాశూన్యులని యిప్పటికి విద్యాధికుల మాటలయందు జనులకు విశ్వాసము తగ్గిపోవుచున్నది. మాటలుతక్కువచేసి కార్యము లెక్కువ చేసి చూపినప్పుడే ప్రజలకు మన మాటలయందు విశ్వాసము పుట్టును. జనులు సాధారణముగా మనము చెప్పినట్లు

చేయక చేసినట్లు చేయఁజూతురు. కాఁబట్టి లోకమును ధర్మమువంక నాకర్షించి మనమార్గమునకుఁ ద్రిప్పఁ దలఁచిన పక్షమున మనము వాక్శూరతతోడ కార్యశూరతను గూడఁ గనఁబఱుపవలెను. మిత్రులారా! మీకు మీమాటలయందును సత్యమునందును నిజమైన విశ్వాస మున్నయెడల మీరుపదేశించు సత్యమును మొదట స్వాచరణమునందుఁ జూపుఁడు; తరువాత నరుల కుపదేశింపుఁడు. "సత్యంచ స్వాధ్యాయ ప్రవచనేనచ" సత్యమును తాను ననుష్ఠించి యితరులకు ప్రవచనము చేయవలసినదని వేదము విధించుచున్నది. అట్లుచేసినచో లోకము మనయాచరణమును జూచి మనయట్ల తా నాచరించును. జనులకు సదుపదేశమును జేసి చేసిన యుపదేశమును స్వాచరణము నందుఁ బెట్టి తన్మూలమున వారి నందు నడపింపుఁడు. మీయుద్యమము సఫలము చేయవలసినదని నిర్మలహృదయముతో వినయపూర్వకముగా నీశ్వరుని వేఁడుఁడు. ఈశ్వరబలముచేత ప్రతిపక్షులనడుమ సత్యధ్వజ మెత్తుఁడు. ఈశ్వరభటులయి యజ్ఞానముతోను మూర్ఖత్వముతోను పోరాడి యంధకార బంధురములై యున్న హృదయ గుహాలలో నీశ్వర తేజస్సును ప్రవేశపెట్టుఁడు. ఈజ్ఞానాజ్ఞాన యుద్ధమునందు వెను కంజవేయక సదా ముందుకు నడుచుచు గాయములకు భయపడక మేనిలోఁ బ్రాణమున్నంతవఱకు జ్ఞానమునను సత్యపక్షమునను నిలిచి వీరభటులవలె విక్రమమును జూపుఁడు. శక్తియున్నంతవఱకును పోరాడి యలసి సొమ్మసిల్లినప్పుడు మీకుతోడయినిలిచి యీశ్వరుఁడు మిమ్ములేవనెత్తి మీకు నూతనబలమును ప్రసాదించి గెలుపొసఁగును. సమస్తమునకును సర్వరక్షకుఁడైన సర్వేశ్వరునినే నమ్మి కృతార్థుల రగుఁడు.

ఓదీనశరణ్యా! దీనులయిన మావయి దయచూపి ధర్మాచర

ణాయునకు మాకు ధైర్యమును బ్రసాదింపుము. నీవుతక్క మాకు వేఱుదిక్కు లేదు. దురాచార పంకములోఁ దగులుకొని దానినుండి వెలువడుటకు శక్తిచాలక దుర్బలులమయి యున్న మాకు బలము నొసఁగి మమ్ము గట్టెక్కింపుము. నీప్రేమజలముతో మాహృదయము లను పరిశుద్ధపఱుపుము. మాహృదయము లెప్పుడును సత్యమునే యభిలషించునట్లు చేసి సత్యమార్గానువర్తనమునందు మాకు నిరంత రోత్సాహమును గలిగింపుము.

---

## మతధర్మము. *

సకలచరాచరసృష్టికిని కర్త యైనపరమేశ్వరునకును సృష్టి వర్గములోనివార మైనమనకును గలసంబంధములు గూర్చిన యభి ప్రాయము మతమనఁబడును. అట్టి యనివార్యసంబంధమునుబట్టి ఈశ్వరుని యెడలను మానవకోటియెడలను మన మాచరింపవలసిన కర్తవ్యములు ధర్మములనఁబడును. మనలనుసృజించి రక్షించి శాసించు వాఁడగుటచేత నీశ్వరుఁడు మనకు పరమపిత; అద్వితీయుఁడయిన యీశ్వ రునిచే సృజింపఁబడి సంరక్షింపఁబడు వారగుటచే సమస్త మానవు లును పరస్పరభ్రాతలు. కాఁబట్టి యీశ్వరుని పితృభావమును మను ష్యుల భ్రాతృభావమును మతమునకు ప్రధానాంగములు. ఈరెండంగ ములనుబట్టియే సమస్తధర్మములు నేర్పడుచున్నవి. లోకములో వేఱువేఱునామములతో వ్యవహరింపఁబడుచున్నను మనుష్యుని కను

---

* ఇది 1903-వ సంవత్సరము ఏప్రియల్ నెల 18-వ తేదీని బందరుపురమున జరిగిన యాంధ్రపరశుద్ధాస్తిక మహాసభలోఁ జదువఁబడినది.

ష్ఠేయములయిన సమస్త ధర్మములును మతధర్మము లనియే చెప్ప వలసి యున్నవి. మన మేపనిని చేసినను పరమేశ్వరప్రీత్యర్థముగానే చేయుచుండవలెను. అట్లు చేయువాఁ డొక్కఁడే యీశ్వరపుత్రుఁడును భక్తుఁడు ననదగినవాఁడు; ఈశ్వర ప్రీత్యర్థముగా చేయక యన్యచింతతోఁ జేయువాఁ డీశ్వరశత్రుఁడును వంచకుఁడు నగును. తోడి మానవులయెడల భ్రాతృభావమును వహించి యన్యోన్య క్షేమాభివృద్ధుల కయి పాటుపడుచు నెవ్వరిని ద్వేషింపక యెవ్వరిని వంచింపక యెవ్వరికి నన్యాయము చేయక వర్తించుటయే యీశ్వరునకు ప్రీతికరము. ఈప్రకారముగా స్వార్థపరత్వము మాని పరోపకారపరాయణత్వమును పూని యీశ్వర ప్రీతికరముగా వర్తించుట కయి సత్యము న్యాయము ప్రేమము మొదలయినవి మన కీశ్వరుఁడు ప్రసాదించినపవిత్రపరమ సాధనములు. ఈదివ్యసాధనముల నాదరింపక యసత్యములాడుచు నన్యాయములుచేయుచు ద్వేషమును జూపుచు వర్తించువాఁ డీశ్వరప్రార్థన లెన్నిసారులు చేయువాఁడయినను ధర్మోపదేశము లెంత యెక్కువగా నొనరించువాఁ డయినను ఉపాసనమందిరముల కెంత తఱుచుగా నరుగువాఁ డయినను భక్తుఁడు గాక యీశ్వరద్రోహి యగును. కాఁబట్టి నిజముగా నీశ్వర భక్తుఁడు కావలె నన్నవాఁడు మొట్టమొదట సత్యమునం దాదరము గలవాఁడును న్యాయమార్గము ననువర్తించువాఁడును భూతదయాపరుఁడును కావలెను. అట్లయినవాఁడే యీశ్వరాజ్ఞానువర్తియు ధర్మరతుఁడు నయినభక్తుఁడు. లోకములో ధర్మబలమును మించిన బలము వేఱొకటి లేదు. "యతోధర్మస్తతోజయ" యని మనపెద్దలు పలికియున్నారు. జనులుసత్యసంధులయి దయాపరులయిన్యాయావలంబులయి ధర్మబలము గలవారయినంగాని యేదేశమును ముందుకురాదు.

దేశమును వృద్ధికిఁ దీసికొనిరావలె నన్నచో జనులను నీతిపరులనుగాఁ జేయువలెను. నీతిపరులు గానివా రీశ్వరభక్తులు కాఁజాలరు. నీతి యీశ్వరునకు పరమప్రీతికరము; నీతి మతధర్మములలో నుత్తమ ధర్మము. మనుష్యులను సత్కార్యనిష్ఠులను జేసి నీతిపరత్వమునందును సాంఘిక సదాచారవర్తనమునందును ధైర్యవంతులుగాఁ జేసెడిశక్తి ధర్మమునందే యున్నది; ఈశ్వరభక్తి లేనివానిని విభాగజ్ఞానముగాని కీర్తి కామత్వముగాని దేశోపకారకృత్యములలో కష్టకాలమునందు ధైర్యోత్సాహములతో నడుచునట్లు చేయుటకు సమర్థము కాదు; ఈశ్వరభక్తిలేక యంతరాత్మ దుర్బల మగును; ఈశ్వరబలవిశ్వాసము లేక సాంఘికదురాచారనివర్తన ప్రయత్నము తలయెత్తదు. జనులలో మతధర్మము దుర్బల మయినపక్షమున పాపభీతి యడుగంటి సమస్తా నర్థములును సంభవించును. మతధర్మము పరిశుద్ధము కానియెడల సమస్త స్వాతంత్ర్యములును చెడును. ఎవరిస్వాతంత్ర్యములు వారికుండు నట్లుచేసి యందఱిని సౌఖ్యసంతోషములను పొందునట్లుచేయుటయే మత ధర్మముయొక్క ముఖ్యకార్యము. పరోపకారము, న్యాయము మొదలైన వన్నియు స్వాతంత్ర్యసంరక్షణముయొక్క ఫలములే. మన స్వాతంత్ర్య ములనిమిత్తము మనముపోరాడి యితరుల స్వాతంత్ర్యములను మన్నింప కుండుట నిజమైన స్వాతంత్ర్యసంపాదనముకాదు. నిజమైన స్వాతంత్ర్యా భిలాషమనుష్యప్రకృతియందు గౌరవము కలిగించి యెంతయల్పునికి నన్యాయము సంభవించినను దానిని మాన్పుటకపేక్షించును. అన్యాయ నివారణమునకు మతధర్మ మమోఘసాధనము. అట్టి ధర్మబలము లేక పోయినపక్షమున స్వప్రయోజనపరత్వము ప్రబలి పరార్థపరత్వము క్షీణించి జనులను మృగతుల్యులనుగా మార్చును. మతధర్మబలము చేతననేగా నీశ్వరభక్తివిశ్వాసముచేతనే దేశాభిమాన బీజమంకురించి

యెల్లెడల నల్లుకొనును. ఈభక్తివిశ్వాసముచేతనే వివేకియైనవాఁడెల్ల
తాను తనయొక్కయు తనకుటుంబముయొక్కయు మేలుకొఱకే సృజింపఁ
బడ లేదనియు లోకముకొఱకుఁగూడ సృజియింపఁ బడితి ననియుఁ
దెలిసికొని పరోపకారార్థముగా పాటుపడఁ గడఁగును. అట్టివాఁడు
లోకమంతయు నేకకుటుంబ మని భావించి యీలోకకుటుంబములో
నెక్కడ నెవ్వరి కాపద వచ్చినను తనదానినిగా భావించుకొని నిజ
మైనదేశాభిమాని యయి దానిని వారించుటకయి తన సుఖమును
సహితము త్యజించును. పరోపకారరూపమైన యీదేశాభిమానమును
మనము బాల్యమునుండియు నభ్యాసము చేయవలెను. దేశాభివృద్ధిని
గోరెడు నిజమైన దేశాభిమాని తనదేశమునం దేమి చెడు గున్నను
దానిని రూపుమాపి దేశమును పరిశుద్ధపఱుచుటకయి ప్రయత్నింప
వలెను. అట్లుచేసినంగాని దేశముసుఖవంతమయి స్వాతంత్ర్యలాభము
ననుభవించుటకు శక్తముకాను. నిజమైన దేశాభిమానమునకు
మాఱుగా ననేకులలో మన దేశమునందు డప్పు డొక విధమైన దురభి
మానము వ్యాపించుచున్నది. ఈదురభిమానబలముచేత మన దేశము
నందలి దురాచారములు సహితము సదాచారములుగా పొగడఁబడు
చుండుటయు నితరదేశములవారి సదాచారములుకూడ దురాచారము
లుగా తెగడఁబడుచుండుటయుసంభవించి నిజమైన దేశాభివృద్ధికిభంగము
గలుగుచున్నది. ఈదురభిమానముపరదూషణమునకును ద్వేషమునకును
గారణమయి మతధర్మమునకు శత్రువయి దేశాభివృద్ధికి భంగకర
మయి యనర్థదాయక మగుచున్నది. ఈయపూర్వదేశాభిమానులు
మూఢజనుల మెప్పునకయి స్వదేశీయ మైనదానినెల్ల బట్టువలె
భూషించుచు విదేశీయ మైన దానినెల్ల ద్వేషించుచు, దేశాభివృద్ధి
కయి యాత్మశ్లాఘనలు గాక సత్యమును న్యాయమును ప్రేమమును

గావలెనని వలుకువారిని దేశద్రోహులనియు సత్కార్యభీరువులనియు దూషించుచున్నారు. ఇట్టివారు సత్యమతధర్మమునకు విరోధులు. ఇట్టి దురభిమానులవాగాడంబరమువలన మనదేశ మభివృద్ధి పొంది స్వస్వాతంత్ర్యలాభముల నొందఁజాలదు. దేశాభివృద్ధికి నిజ మైన యీశ్వరభక్తులు కావలెను. పరిశుద్ధమైన యీశ్వరభక్తి గలవారు మాత్రమే స్వార్థపరిత్యాగులయి కార్యశూరులయి సత్యన్యాయకారు ణ్యాదులైన యమోఘసాధనములను గొని యీశ్వరధర్మధ్వజమును దాల్చి పోరాడఁగలుగుదురు. ఈశ్వరభటుఁల మన్న నమ్మకము లేక దురభిమానపూరితులైనవాక్శూరులు స్వార్థత్యాగము కావలసి నప్పుడు మూలమూలల నొదుగుచు తమ పరదూషణ పాండిత్యము కష్ట సమయములయందు తమకు తోడుపడకపోఁగా భీరువులయి యదృశ్యు లగుదురు. ఇట్టివారి కార్యసాధకత్వ మంతయు పరదూషణములతోను దంభోక్తులతోను స్వశ్లాఘనలతోను ద్వేషప్రధానములైన పాటల తోను ధ్వజపటములతోడి యూరేగింపులతోను నిండి యుఱుముల తోను మెఱుములతోను పూర్ణమయి చినుకు లేనిశుష్కమేఘాడంబ రమువలె క్రియాశూన్యమయి పర్యవసించును. నిజమైన దేశాభి మానమును భక్తియుఁ గలవాఁడు జనులు తన్ను మెత్తురా యనున రింతురా యన్నచింతను మనస్సునందుఁ జొరనీక యిది దేశోపకార కమా యీశ్వరసమ్మతమా న్యాయానుకూలమా యనిమాత్రము విచారించి యీశ్వరప్రీతికరమును, ధర్మానుకూలమును, దేశక్షేమ కరమునని దృఢపడినతోడనే జనులు దూషించినను భూషించినను త్యజించినను భజించినను గణన చేయక న్యాయమార్గమున నడుచుచు దేశోపకారముకొఱకు తనధనమును దేహమును కావలసినచో ప్రాణ మునుసహిత మర్పింప వెనుకతీయకుండును. స్వార్థపరిత్యాగము లేని

వాక్శూరతను జూపువాఁడు నిజమైన దేశాభిమాని కానేరఁడు. తనకు సోదరతుల్యులైనజనసామాన్యముయొక్కఁ మేలుఁ గోరెడుదేశాభిమాన మాననీయుఁడు సమయము వచ్చినప్పుడు జనసామాన్యక్షేమమునకొఱకు సంశయింపక తనదేహము నైనను సంతోషపూర్వకముగా ధార పోయుటకు సంసిద్ధుఁడయి యుండవలెను. ఇట్టినిర్వ్యాజదేశాభిమాన మునకు దృష్టాంతముగా నొకచరిత్రాంశము నుదాహరించెద ననుజ్ఞ వేఁడెదను.

ఇంగ్లండుదేశమునకు రాజైన మూఁడవయెడ్వర్డు పూర్వము ఫ్రాన్సుదేశముమీఁద దండెత్తి యనేకయుద్ధములు చేసి కడపట కేలే నగరమును ముట్టడించెను. ఆపురవాసులు సాధ్యమయినంతవరకు స్వపురరక్షణార్థము బహుదినములు ధైర్యోత్సాహములతో పోరాడి తుద కాహారపదార్థభావమువలనఁ జేయునది లేక తమపట్టణమును శత్రురాజునకుఁ లోఁబఱుపవలసినంత దుస్థితికి వచ్చినవారయి కొన్ని పద్ధతుల కంగీకరించినయెడల పురమును స్వాధీనము చేసెదమని రాజునకు సందేశము నంపిరి. పురజనులు చూపినయసాధారణపౌరుష మునుబట్టి తనసేనలకుఁ గలిగిన వినాశమువలనను తనకుఁ గలిగిన యత్యంత వ్యయప్రయాసములవలనను రాజు దురాగ్రహావేశపరవశుఁ డయి పురజనులయెడల దయ దలఁపక యెల్లవారిని తుదముట్టింప నిశ్చయించుకొని యుండెను. అట్లు సర్వజనసంహారము చేయఁజూచుటకు క్రూరకృత్యమని మంత్రులు మొదలైనవారు ప్రార్థించి వాదించినపిమ్మట పురజనులలో ప్రముఖులుగా నున్నవా రాఱుగురు తమప్రాణముల నిచ్చుట కొప్పుకొనివచ్చి కోటతాళములు తనకు తెచ్చియిచ్చినపక్ష మున తక్కినవారిప్రాణములను గాపాడెద నని రాజు పౌరులకు వర్త మాన మంపెను. పిడుగువంటి యీయశుభవార్త రాఁగానే కోటలో

నున్న పౌరబృందములో గొప్పసంక్షోభ మారంభ మయ్యెను. మా ప్రాణసంరక్షణార్థమయి మీప్రాణములు విడువుఁడని పౌరులు తమ లోనివారి నెవ్వరి నాఱుగుర నడుగఁగలుగుదురు? తోడిపౌరులప్రాణములను కాపాడుటకయి తమప్రాణముల నిచ్చెద మని తమంత బైలు దేఱెడు పరోపకారు లెవ్వరుందురు? ఇట్లు క్షణకాలము దిగ్భ్రమ నొంది యేమిచేయుటకును పాలుపోక చింతించుచుండఁగా నాగుంపులో నుండి యొకమహానుభావుఁడు వెలువడివచ్చి పౌరరక్షణార్థము తన ప్రాణముల నిచ్చెదనని సంతోషపూర్వకముగా పలికెను. పరిశుద్ధ చింతతో పరోపకారార్థము స్వార్థపరిత్యాగమునకు పూనిన పుణ్య పురుషుఁడు చూపిన నిదర్శనము లోకములో నెప్పుడును నితరులను దనవంక కాకర్షింపక వ్యర్థముగా పోదు. అట్లు వెడలివచ్చి ముందు నిలిచిన యామహాత్ముని యసాధారణ దేశాభిమానమును జూచి తత్క్షణమే యింకొక కార్యశూరుఁడు తనప్రాణముల నిచ్చెద నని ముందుకు వచ్చెను. అతనిని జూచి వెంటనే యింకొకఁడును, అనంతర మింకొకడును, ఇంకొకఁడును, ఈప్రకారముగా పరోపకారార్థమయి యాత్మప్రాణత్యాగమున కంగీకరించినవా రాఱుగురును నిమిషకాలములో సంసిద్ధు లయిరి. అప్పు డాపౌరులలో ననేకులు తామే ముందుగా నచ్చి పరోపకారార్థ పరిత్యక్తదేహుల మయ్యెడుభాగ్యమును బొందలేకపోయితిమిగదాయని సిగ్గును విషాదమును గాంచ సాగిరి. దేశాభిమాన మన్న నిట్లుగదా యుండవలెను! ఇట్లాయాఱుగురు పుణ్యపురుషులును వినయవేషములతో రాజుకడకు వచ్చి తమ దుర్గముయొక్క తాళముల నర్పించిరి. తాను మొదట నుద్దేశించినట్లు రాజు వారిప్రాణములు తీయుటకు కృతనిశ్చయుఁడయి యుండెను; అట్లుచేయుట తగవు కాదని మంత్రులును యువరాజును జేసినహిత

బోధలన్నియు రాజుముందట బూడిదలో వ్రేల్చిన హోమములయ్యెను; ఇట్టి యవస్థలో గర్భవతియైయుండిన రాణి యింగ్లండునుండి భర్త వద్దకు వచ్చుట తటస్థించెను.

ఆమె స్త్రీజనస్వభావికమైన జాలిగుండెతో రాజు పాదముల మీఁదఁబడి, ఎవ్వరెన్ని విధములఁ జెప్పినను వినక తనపట్టును విడువకున్న యారాజుయొక్క కఠినచిత్తము కరఁగునట్లుగా సజ్జనాగ్రగణ్యులైన యాపౌంజనపట్కరుయొక్క ప్రాణప్రదానము నిమిత్తమయి దీనవచనములతో భర్తను వేఁడుచు నభయహస్త మిచ్చువఱకును పాదములపైనుండి లేవకుండెను. వజ్రకఠినహృదయుఁడయి పౌరపట్కర ప్రాణాపహరణదీక్ష వహించిన రాజుసహితము ప్రియకాంతా ప్రార్థనమువలన తన తొంటినిశ్చయమును విడువవలసినవాఁడయి యా యాఱుగురను భార్యావశమున నప్పగించెను. ఆసాధ్వీమణి తత్క్షణమే వారిని బంధమునుండి విముక్తులను చేసి వారికి నూతన వస్త్రములను కట్టనిచ్చి తనపంక్తిని విందుపెట్టి వారి నభినందించి పంపివేసెను. ఇందా పౌంజనపట్కరుయొక్క చరిత్ర మెంత శ్లాఘాపాత్రమైనదో రాణియొక్క సదయచరిత్ర మంత శ్లాఘాపాత్రమైనదే. నిజమైన యీశ్వరభక్తిగలవారందఱును శత్రుపక్షము వారినిసహితము ద్వేషింపక ప్రేమింపవలయును. అట్టి ప్రేమతోఁ గూడిన పరోపకారచింత గలవాఁడే నిజమైన భక్తుఁడును దేశాభిమానియు నగును.

ఇప్పుడీ దేశములో పరద్వేషసహితమైన దురభిమానమే కొందఱచే దేశాభిమానముగా పరిగణింపఁబడుచున్నదని యీవఱకే సూచించియున్నాను. ఈదురభిమానప్రభావముచేతనే తన దంతయు సర్వోత్తమమైనదని గర్వించుచుండుటయు నితరుల దంతయు హేయమైనదని గర్హించుచుండుటయు సంభవించుచున్నది. మనతప్పులను

మనము తెలిసికొని సంస్కరించుకొనుచున్నంగాని మన కభివృద్ధి కలుగదు. దేశాభివృద్ధికి గర్వమును మించిన గర్భశత్రువు వేఱొకటి లేదు. దేశాభివృద్ధి కలుగవలె నన్నచో మనదోషముల నెఱిఁగి సంస్కరించుకొనుచు నితరులగుణముల నెఱిఁగి గ్రహించుచు నుండవలెను. పరిశుద్ధాస్తిక మతావలంబుల మని చెప్పుకొనెడు మన మెప్పుడును దేశాభిమానము మెండు చెప్పికాని మఱి యేసత్క్రియ చేసి చెప్పికాని యన్యులను ద్వేషింపఁగూడదు. మనము ద్వేషింపవలసిన దొక్క-పాపము మాత్రమే. పరిశుద్ధాస్తిక మతానుసారముగా స్వదేశీయుని నైనను పరదేశీయు నైనను సోదరతుల్యునిగా భావించి యెల్ల వారిని సమబుద్ధితో ప్రేమించి మన మాదరము చూపవలెను. తనవా రనియు పరులనియు భేదభావమును వహించి సౌభ్రాత్రమును చూపక యుండుట మనస్వభావమునకును మనసిద్ధాంతములకును భగవదాజ్ఞకును విరోధము. కాఁబట్టి సౌభ్రాత్రమునకు భంగముకలిగించెడు ప్రతి ప్రతిబంధమును రూపుమాపుటకయి ప్రయత్నించుట సర్వవిధముల చేతను మనకు పరమకర్తవ్యము. ఐకమత్యమును చెఱిచి, వైషమ్యమును వృద్ధిపఱిచి, ద్వేషమును కలిగించి, సౌభ్రాత్రమును తొలఁగించెడు మహానర్థము మన దేశములోఁగల వర్ణభేదపిశాచము. ఈక్రూరపిశాచము మన దేశములో నిరంకుశముగా రాజ్యము చేయుచున్నంతకాలము స్వరాజ్యముగాని, ఈశ్వరరాజ్యముగాని, మఱి యేరాజ్యముగాని తలయెత్తదు. ఈపిశాచావేశబలముచేత మన దేశములో నైకమత్యము చచ్చినది; పరస్పరద్వేషము హెచ్చినది; సుగుణసంపద విచ్చినది; అనర్థపరంపర వచ్చినది. ఇట్లెన్ని యవగుణములు ప్రబలినప్పుడు మన దేశములో నీశ్వరరాజ్య మెట్లు వ్యాపించును? అమృత తుల్యము లైన పరిశుద్ధాస్తిక మత

దివ్యఫలము లెట్లు ప్రాపించును? ఈ పిశాచబలముచేత మత మిప్పుడు హృదయమును విడిచి పొట్టను దిగినది. అందుచేత మతధర్మము లైన కారుణ్యము మొదలైనవి హృదయమునుండి తొలగిపోయినవి; మతధర్మము లని పేరు పెట్టుకొని వచ్చి యొండొరులతో భుజింపఁగూడ దనెడు సోదరభావ భంజకము లైన విషకీటకము లు పొట్టకడ్డముగాఁ జొచ్చి కలఁగించు చున్నవి. కడుపే కైలాస మనెడు మహానుభావులు మత మంతయు భోజనములోనే యున్నదని చెప్పి మానవకోటిలోని పరస్పరభ్రాతృభావమును నామమాత్రావశేషము చేయఁ జూచుచున్నారు. సన్మతమహావృక్షమును మూలచ్ఛేదము చేయఁజాలిన యీయపసిద్ధాంతవిషబీజము తమలో మొలకయెత్తకుండ జ్ఞానజ్యోతిచేత మాడ్చివేయుట పరిశుద్ధాస్తిక మతావలంబులకు ప్రథమ ధర్మము. వర్ణభేద పిశాచము మన దేశమాత కాచరింపని చెఱుగులేదు. భారతపుత్రుల సమస్త విషయములలోను దాసులనుగాఁ జేసి సమస్తస్వాతంత్ర్యములను గోలుపోఁగొట్టినది యీ మొండిపిశాచమే. అన్యదేశప్రభుజాతివారు మనలను తిన్నగాఁ జూచుచుండలేదని మనవారు మొఱ్ఱపెట్టుచున్నారు. రాజ్యాధికారగర్వితు లయి వారిలో ననేకులు మనయెడల సర్వాగౌరవము చూపకుండుట సత్యమే. అయినను వర్ణపిశాచప్రేరణముచేత నగ్రవర్ణముల వార మనుకొని విఱ్ఱవీఁగెడుమనవా రధమవర్ణములవా రనఁబడెడి స్వమతమువారివిషయమునఁ జూపెడి యగౌరవమునుబట్టి చూడఁగా నన్యమతస్థులుచూపెడిది పర్వతములో పరమాణువంత యైన నుండునా యని సంశయింపవలసియున్నది. మనవారు స్వమతస్థులైన మాలమాదిగలయెడలఁ జూపెడి యన్యాయము మానవనామధారకుల కెల్ల నవమానకరముగా నున్నది. వాండ్రు మనవీథులలో నడవఁగూడదు;

వాండ్రబిడ్డలు మనబడులలో చదువఁగూడదు. గాడిద లైనను పంది యైనను మనదాపుననుండి పోవచ్చునుగాని మాలవాఁడుమాత్రము బారెడుదూరమునుండియైనను పోఁగూడదు. మనమతములో నున్నంత కాలము వానికెప్పుడును ముక్తి గలుగదు; గౌరవముకలుగదు. హిందు వైనమాలవాఁడు స్వమతమునువిడిచి బైలఁబడినఁగాని గౌరవపాత్రుఁడు కాఁడు. హిందువుగా నున్న మాలవాఁడు మాత్రమే యస్పృశ్యుఁడును అవాచ్యుఁడు నగుచుగాని యా చెప్పరానివాఁడే క్రైస్తవమతమునో మహమ్మదీయమతమునో యవలంబించి జానో ఖానో కాఁగానే తాఁకఁదగినవాఁడును మాటలాడఁదగినవాఁడును నగుచున్నాఁడు. మతములలో నెల్లఁ దనదే సర్వోత్కృష్ట మయిన దనిపొగడుకొనెడు హిందూమతస్థులకు స్వమతస్థు. లయినమాలమాదిగల యెడలఁ దాము చూపెడియనాదరమును దలఁచుకొన్నప్పటికంటె నెక్కువ సిగ్గుపడవలసిన యవసరము మఱియెప్పుడు తటస్థించును? కోట్లకొలఁదిగా మన దేశమునం దంతటను వ్యాపించియున్న యీమాలమాదిగలే మన పూర్వు లయినయార్యులచే జయింపఁబడి దాసులుగాఁ జేయఁబడిన మనదేశపు మొదటికాపు లని తెలిసినవారు చెప్పుచున్నారు. అదియే నిజ మయినచో నిజమైనహిందూ దేశస్వాములు వారే యనియు ఆర్యసంతతివార మయిన మనము వారిదేశము నపహరించి చిరకాలమునుండి యనుభవించుచున్న యపహర్తల మనియు స్పష్ట మగుచున్నది. పంచముల నిట్లు పలుతెఱఁగుల బాధించు మన మేన్యాయమును జెప్పి జేత లగు పరదేశీయుల నధికస్వాతంత్ర్యముల నిండని వేఁడఁగలము? జితులయినవారియెడల న్యాయముగా వర్తించిరదా విజితుల మయిన మనము మాయెడ న్యాయముగాఁ బ్రవర్తింపుడని యడుగఁగలము? ఇట్లు చెప్పుటచేత మనకర్హమైన స్వాతంత్ర్యములను మనము

పొందఁ బ్రయత్నింపరా దని నాయభిప్రాయ మెంతమాత్రమును గాదు. మనస్వాతంత్ర్యముల నిమిత్తమై పోరాడెడు మన మితరుల స్వాతంత్ర్యములను గూడ మన్నించి యితరులయెడ నన్యాయము చేయకుండుట ధర్మమని చూపుటకొఱ కే యింతనొక్కి చెప్పితినిగాని వేఱొకందునకుఁ గాదు. మన కర్హము లయినస్వాతంత్ర్యములను మనము పొందఁగోరినను మనకు యోగ్యమగు గౌరవమును మనము పొంద నపేక్షించినను పురుషులకుఁ గాని స్త్రీలకుఁ గాని యన్యులకుఁ గాని యగ్రజాతులవారికి గాని యధమజాతులవారికి గాని మన మియ్యవలసిన స్వాతంత్ర్యములను మనము చూపవలసిన గౌరవములను మనము చేయవలసిన న్యాయములను మనమిచ్చి చూపి చేయవలెను. అందఱిని సోదరభావముతోఁ జూచుచు నెవ్వరియెడల నన్యాయము చేయక సర్వసమభావముతో వర్తించుట పరిశుద్ధాస్తికమతావలంబుల మైన మన కీశ్వరాజ్ఞారూప మైన పరమధర్మము; జ్ఞానవిషయమునఁ గాని సాంఘికవిషయమునఁ గాని నీతివిషయమునఁగాని కళలవిషయమునఁ గాని కర్మలవిషయమునఁ గాని రాజ్యాంగవిషయములఁ గాని మానవకోటియొక్క సౌఖ్యాభివృద్ధులకు సహాకారు లయిన సమస్తకృత్యములును మన కీశ్వరప్రీతికరము లయిన మతధర్మములే. మన మిది యసది యనక మానవకోటి కేదేది యిహపరసుఖసాధక మో దానినెల్ల నభివృద్ధి చేయుటకయి యీశ్వరప్రీత్యర్థము పాటుపడవలెను. కార్యములచేతనే కాని క్రియ లేనిశుష్కవాక్యములచేత దేశ మెప్పుడును బాగుపడదు. ఉపన్యాసము లావశ్యకములే యయినను మన దేశాభివృద్ధి కయి యిప్పుడుపన్యాసములకంటె కార్యపరు లధికముగా కావలెను. సభాభవనములలో ప్రసంగములను ప్రతిజ్ఞలనుచేసి శపథములు పలుకువారు మాత్రమే కారు — కొందఱు సమస్తవిషయ

ములలోను సామాన్యజనులలో జ్ఞానాధిక్యము కలిగించుటకు బద్ధకంకణులు కావలెను; కొందఱు సాంఘికదురాచారములను వెల్లడించి సంఘసంస్కరణదీక్ష వహించినవారు కావలెను; కొందఱు సత్యసంధత్వాదులు బోధించుచు పరుల నధికనీతిపరులనుగాఁ జేయు కృతప్రతిజ్ఞులు కావలెను; కొంద ఱన్యదేశవిద్యాశిల్పయంత్రనిర్మాణాదులను నేర్చుకొని దేశములో నెలకొల్పి పాటుపడువారు కావలెను; కొందఱు మతధర్మోపదేశములు చేయుచు జనులలో పరిశుద్ధమతధర్మవ్యాపనముచేయ కృషిచేయువారు కావలెను. ఈవిధముగా నానాముఖములఁ బనిచేసిన గాని యొక్క విషయమున మాత్రమే కృషిచేసి తక్కినవిషయములయం దశ్రద్ధచూపిన నిజమయిన క్షేమలాభములు కలుగఁజాలవు. మొట్టమొదట సమస్తధర్మములకును నస్థిభారమైనమతమును పరిశుద్ధమైనదానినిగాఁ జేయవలెను. మతము పరిశుద్ధమైనచో జనులు నీతిపరులును సాంఘికదురాచారదూరులును నగుదురు. ఈవిషయములయందభివృద్ధిపొందినఁగాని ప్రజలు రాజ్యాంగస్వాతంత్ర్యఫలములను పూర్ణముగా ననుభవింప శక్తులుకారు. సంఘసంస్కరణాదులు మనచేతిలో నున్నవి; రాజ్యాంగసంస్కరణాదులు పరులచేతిలో నున్నవి; కృషిచేసినచో స్వాధీనము లయిన మొదటివానిలో జయ మొందఁగలుగుట నిశ్చయము; పరాధీనమైన కడపటివానిలో జయ మొందఁగలుగుట సంశయము. కాఁబట్టి మతసంఘసంస్కరణాదులయందుఁ గూడ శ్రద్ధవహించి పనిచేయ మన విద్యాధికుల నత్యంతవినయముతో వేఁడుచున్నాను. స్వభావముచేత మన భరతఖండము సమస్త వస్తుసంపూర్ణ మయినది. ఆవస్తువులయుపయోగ మెఱిఁగి వానిని వృద్ధిపఱిచి లాభకరములుగాఁ జేయుటకు మన వారిలో నేర్పు కావలెను; కష్టము కావలెను; ధైర్యసాహసములు కావలెను; నీతి

పరతంత్రము కావలెను; సకలవస్తుసమృద్ధి గల మనదేశములో నయి సాధనములు వృద్ధియయి జనులు కార్యనిర్వాహణకుశలులు కాఁగానే స్వదేశవస్తు సమాదరమును విదేశవస్తునిరాదరమును తమంతనే కలుగును. ఇట్టి కృషి జరుగక స్వదేశి విదేశి యని ఘోష మిడుచున్నంత మాత్రముచేత దేశమునకు నిజమయిన లాభము కలుగ నేరదు. జాతి మత ద్వేషములను మాని దురభిమానమును త్యజించి పరదేశయాత్రలు చేసి పశ్చిమఖండవాసులలోఁ గలగుణాంశములను గ్రహించి యంత్రనిర్మాణాది కౌశలమును సంగ్రహించి స్వదేశమున నెలకొల్పఁ గలిగినప్పుడే దేశమున కమూల్యప్రయోజనము కలుగఁగలదు. పరమదయాపరుఁ డయిన యీశ్వరుఁడు మనవారిని కార్యశూరులనుగాఁ జేయును గాక! ఓభక్తవత్సలా! భక్తుల మయిన మాప్రార్థనలాలించి మాకు దేశోద్ధారణవిషయమున కృషిచేయ ధైర్యోత్సాహములను గలిగింపుము. మే మెప్పుడు నీభక్తిని విడువకుండు నట్లును నీకు ప్రీతికరము లయిన సత్క్రియలయందే సదా మాకాలమును ధనమును దేహములను వినియోగించు చుండునట్లును సద్బుద్ధిని శక్తిని మాకు ప్రసాదింపుము.

---

## రాజమహేంద్రవర ప్రార్థనసమాజము.

---

ఈసమాజ మిక్కడ దాదాపుగా ముప్పదిసంవత్సరముల నుండి యుండియున్నది. అంత కాలమునుండి యుండఁగా నేఁటికాలమున కాసామాజికులలోఁ గొంద అనుష్ఠానపరు లగుట తటస్థించినది. అనుష్ఠానపరు లగుట యనఁగా తాము పరమప్రమాణము లని నమ్మిన

సిద్ధాంతముల ననుసరించి ప్రవర్తించువారగుట. అట్లయిన యనుష్ఠాన
పరులలో నేనొకఁడను. చెన్నపురిరాజధానియందుఁ గాని బొంబయి
రాజధానియందుఁ గాని కాళీఘట్ట రాజధానియందుఁ గాని భరత
ఖండము నంతటి మఱి యేయితర దేశమునందుఁగాని బ్రహ్మసమా
జము లనునామమునను ప్రార్థనసమాజము లనునామమునను బరఁగు
చున్న పునస్తసమాజముల యొక్కయు ముఖ్యసిద్ధాంతములు రెండని
చెప్పవచ్చును. అందొకటి సర్వలోకాధిపతి యైన యీశ్వరుఁడు
లోకైకపిత యన్నవిశ్వాసము; రెండవది జాతివర్ణమతభేదములులేక
యీశ్వర సృష్టిలోని వారయిన సర్వమానవులును సోదరతుల్యు లన్న
విశ్వాసము. ఈరెండును దాననుష్ఠానపరుఁడు కాఁగలిగినను కాఁజా
లకపోయినను పూర్వోక్తము లయిన సమాజములలోఁ జేరిన ప్రతి
సామాజికునియొక్కయు పరమభావనలు. కేవలశుష్కోప దేశమున
కంటెఁ గార్యాచరణము శ్లాఘ్యతరమనుట నిర్వివాదాంశము గదా!
తాను జేసిన యుపదేశము తనకే యాచరణమునకుఁ బనికిరాని పక్ష
మున మఱియెవ్వరికిఁ బనికివచ్చును? అట్టి వంచకుని మాటయం దెవ్వ
రికి విశ్వాసము కలుగును? పరోపదేశసమయమునం దెల్లవారును
పండితులేయయి యనుష్ఠానసమయము వచ్చినప్పు డాపాండిత్యమును
మూలఁబెట్టెడి యీకాలములో చెప్పినట్లు నడుచుకొనెడు సాహసికుఁ
డొక్కఁడు కలిగినను తదితరులు కాకపోయినప్పటికిని సామాజికు
లందఱైన నాతని గౌరవించి యాదరింప వలయునుగదా! అట్లుచేయక
వాక్శూరులైన కొందఱు బుద్ధిమంతు లాకార్యశూరులపై వేగిరపాటు
గలవారనియు దూరాలోచన లేనివారనియు దోషారోపణలు చేయుచు
సౌభ్రాత్రమును విడువఁజూచుట శోచనీయముగదా! ఒకవేళ వృద్ధత్వ
దోషమున మతితప్పి యున్నిటికి సాహసించి పరలోకమునకుఁ బ్రయా

ణముకట్టుకొని యున్న ట్లూహింపఁబడిన నావంటివాని విషయమున
నట్టి దోషారోపణము లొకవేళ నంతగా నింద్యములు కాకపోయినను
బుద్ధిపటుత్వము గలవిడుపయున్నలో నుండి విద్యాధిక్యముచే దూరా
లోచన గలవారనఁదగి యీలోకములో చిరకాలము వర్ధిల్ల నపే
క్షించియున్న క్రియాపరుల విషయమున నట్టి యారోపణములు గర్హ్యా
ములు కాకపోవునా? ఓసోదరులారా! మీలో నెవ్వరైన నట్టి యారో
పణములు చేసెడివా రున్నపక్షమున, ఈశ్వరు నొక్కసారి హృదయ
పూర్వకముగాఁ బ్రార్థించి మీపూర్వసిద్ధాంతములను స్మరణకుఁ దెచ్చు
కొని మీసోదరులయెడలఁ బూర్ణస్నేహమును గనఁబఱుపుఁడు. వ్యాధి
బాధచేతఁ గదలలేనివాఁడ నయి కూరుచుండి వ్రాయుటకుసహితము
శక్తుఁడనుగాక పరుండియే యీపంక్తులను వ్రాసి మిమ్ము వేఁడు
చున్నాను. మమ్మవివేకు లగు వేగిరపాటుగలవారినిగా భావింపక
సదయదృష్టితోఁ జూడుఁడు. సత్కార్యమునకుఁ బూనుటలోను
సత్యము ననుష్ఠించుటలోను వేగిరపాటన నెట్టిది? కాలముకొఱకు
వేచుటయన నెట్టిది? ఎప్పుడు సత్కార్యము తేటపడునో దానికిఁ
బూనుట కప్పుడే యుక్తసమయము; ఎప్పుడు సత్యము స్పష్టపడునో
దాని ననుష్ఠించుట కప్పుడే యుక్తకాలము. తమతప్పును కాలముపైఁ
ద్రోయుట యీశ్వరునియందును సత్యమునందును దమకుఁగలభక్తి
హీనతకును గౌరవాభావమునకును గుఱుతు. నిజమయిన భక్తిపరుఁ
డెప్పుడు నిట్టిమాటలనఁడు. కొందఱు మహానుభావులు సమయమువచ్చు
వఱకును తామేమో లోకోపకార ధురీణు లయినట్టును భక్తాగ్ర
గణ్యులయినట్టును నటించుచు లోకమును భ్రమింపఁజేయుచు శోధన
వచ్చినప్పుడు తెర వెడలిపెట్టి ప్రాపించిన నాట్యరంగమునఁ దమ స్వాభా
విక వికృతవేషములతోఁ గనుపట్టుదురు. పయిమాటలు కార్యభీరు

లయిన యట్టి వేషధారులనోట వెడలవలసినవిగాని భక్తిలేశభూషితు లైన నిష్కపట హృదయులనోట వెడలవలసినవి కావు. భక్తలోకా భీష్టప్రదాత యైనయీశ్వరుఁడు పరిశుద్ధాస్తికులయినభక్తుల హృద యములయం దట్టిశంకలు పొడమకుండఁజేసి, మానవదౌర్బల్యము చేత తాము ధర్మచరులు కాలేకపోయినను ధర్మచరుల నాదరించునట్టి సద్బుద్ధి వారి కందఱికిని పుట్టించునుగాక!

నేను వర్ణభేదమును పాటింపక సర్వవర్ణసమభావమును పూను టచే సామాన్యముగా సంఘసంస్కారమునకును ముఖ్యముగా వితంతు వివాహ సంస్కారమునకును నష్టము కలిగె నని కొందఱు భావించు చున్నారు అది యొంతమాత్రమును సరికాదు. ఎప్పుడును లోకములో నేసంస్కారమును తనయొక్క న్యాయబలమునుబట్టి నిలుచియుండును గాని యొక్క మానవమాత్రుని జీవితమునుబట్టి ప్రబలదు. ఈశ్వరేచ్ఛ చేత నావంటి దుర్బలుఁడు సహితఁ మొకానొకప్పుడు సంస్కార ప్రాబ ల్యమున కొకపనిముట్టుగా నుండవచ్చునుగాని యాతని తోడనే యా సంస్కారము నశింపదు. ఎప్పుడును బ్రతీక్షింపని స్థలములనుండి ప్రబలులైన సంస్కారపక్షావలంబు లనేకులు బైలుదేఱి సహస్ర గుణము లధికముగా దానిని కొనసాగింపవచ్చును. ఈశ్వరఘటనలు దురూహ్యములుగదా! ఇంతకును వర్ణ వైషమ్యమును విడుచుటచేత నేను సంస్కారపరాయణత్వము నెంతమాత్రమును విడిచిన వాఁడను గాను; ఈశ్వరపుత్రిక లయిన హిందూసుందరు లందరును నూతన సంబంధమునుబట్టి నాకు మఱింతదగ్గరవా రయిన తోడఁ బుట్టువు లగుటచేత వారిస్థితిని బాగుచేయుటకయి మఱింత యెక్కువ పూనికతో పాటుపడుట నాకుఁ బరమకర్తవ్యముగా నేర్పడియున్నది. సామాన్యముగా స్త్రీలస్థితిని ముఖ్యముగా వితంతువుల స్థితిని బాగు

పఱుచు ప్రయత్నములో నిఁకముందును నాశక్తిని యుక్తిని నాకాయ
మును ధనాదాయమును వలసినచో నాజీవితమును ధారపోయుట
కయి నేను సంసిద్ధుఁడ నయియున్నాను. వివాహమాడ నపేక్షించు
వారుగాని విద్యాలాభము పొందఁ గోరువారుగాని యథాపూర్వక
ముగా నేను గట్టించిన గృహమునందు వసించి స్వాభీష్టమును బడయు
చుండ వచ్చును. అట్టివారు నాతోఁగలసి భోజనము చేయక వంతుల
వరుసను స్వయంపాకమును గావించుకొని సుఖించుచు నాయాతిథ్య
సత్కారమును యథేచ్ఛముగా ననుభవింపవచ్చును. ఏకేశ్వరారాధ
నము నంగీకరించి విగ్రహారాధనమును త్యజించి జాతివైషమ్యభావ
మును భజించుటచే సంస్కారపక్షమునఁ బనిచేయుటకే నాకర్హతలే
దని యాస్తికశిఖామణు లయిన యపూర్వసంఘసంస్కార ప్రియులు
కొందఱు ఘోషించుచున్నారఁట! వారు ఘోషించునట్లు వారియాద
రణము క్రిందఁ బని చేయుటకును వారిసాంగత్య భాగ్యము ననుభ
వించుటకును నేనర్హుఁడను కాకపోవచ్చును. ఇటువంటి పరార్థపరులు
లక్షమంది నన్ను త్యజించినను నాసేవ నంగీకరించుట తమ గౌరవ
మున కర్హముకా దని భావించినను, ప్రభువులకెల్లను ప్రభు వయిన
సర్వేశ్వరుఁడు నన్ను త్యజింపక నాకభయహస్త మిచ్చి స్వదేశక్షేమా
ర్థముగా నాసేవ నర్పించుటకుఁ బురికొల్పుచు నాకుఁ బ్రాపయి
చెంత నిలిచియుండఁగా నాధర్మమును నిర్వహించుటకు నే నెట్లర్హుఁ
డను గాకపోదును; ఈశ్వరబలము లేక లోకములో నేసత్కార్య
మును సంపూర్ణసాఫల్యము నొందనేరదు. సర్వశక్తుఁ డయిన యీశ్వ
రుఁడే నాకు ముఖ్యబలమయి యుండఁగా నశక్త మానవులతోడ్పాటు
కొందఱిది లేకపోవుటవలన నాపని కేలభంగము వచ్చును? ఇప్పుడు
ప్రతాపోక్తులు పలికెడి యీ యసహాయవాక్శూరులవంటి వారియొక్క

యౌదార్యమును ధైర్యమును నేను ముప్పదిసంవత్సరములనుండి చూచుచున్నాను. బూటకపుమాటలబుంగ లైన మహావాక్యశూరులు పలువురు ప్రసంగములు కావలసివచ్చినప్పుడు సభాభవనములు మాఱుమ్రోయునట్లు మేఘగంభీరభాషణములతో మహాఘోషము చేసినను కార్యములు కావలసివచ్చినప్పు డేమూలను గానఁబడకున్నారు. ఇట్టి వాక్శూరులు కార్యశూరులయి సంన్యాసదీక్ష వహించి దేశమును శతాబ్దములనాటి యగాధదురాచార పంకమునుండి యుద్ధరించుచుఁ దమవీరత్వమును గనఁబఱుచునప్పుడు పైనుండి చూచుచు నాకంటె నెక్కువయానందమును బొందువా రింకొక రుండరు. ఈమహనీయుల కొకవేళ నాచేసెడియల్ప సేవకూడ నంగీకార్య మయినయెడల వద్ధుఁడను దుర్బలుఁడను నైన నేనును నాకీశ్వరుఁడు ప్రసాదించిన యల్పబలమును శక్తివంచనలేక వినియోగింప సంసిద్ధుఁడనయి యున్నాఁడను. మాటలకేమి? మూఢులముందఱను దురభిమానదూషితుల ముందఱను పోటుమాట లెన్నియైనను బలుకవచ్చును. ఈశూరాలాపముల సత్యమును కార్యమువచ్చినప్పుడు కనఁబఱచి నప్పుడుగదా యీవాగేకశూరులమగతనము తేట తెల్ల మగును! మూఢజనసమ్మతముగాని యొకసంస్కారమునకుఁ బూనినచోఁ భూషించుమిత్రులు దూషించునప్పుడును, సేవించుసేవకులు బాధలు గావించునప్పుడును, ఆహ్వానపత్రికలు పంపు మతాచార్యులు బహిష్కారపత్రికలు పంపునప్పుడును, ఈశ్వరభక్తివలనఁ గలిగెడి యసమానబల మొక్కటియే తోడు పడును గాని యదిలేనినాస్తికత్వాదు లేవియు తోడుపడవు. సంఘసంస్కారుల మయితిమని సంతోషపడెడి యోమిత్రులారా! వృథాగర్వాలాపములు పలుకక కార్యపరుల యెడల నించుక సహనము వహింపుఁడు. తమ సంస్కారము లేక సంఘ సంస్కారముగాని మఱియే యితరసంస్కా-

రముగాని జయప్రదముగా పోఁగ దని చిరకాలానుభవము వలన నేను దృఢముగా దలఁచుచున్నాను. మీరు పడుచున్న భ్రమలలోనే నేనును దగులుకొని యుండి మతవిషయము లయిన నావిశ్వాసములను గొన్నిటిని గార్యములలోఁ జూపక యాత్మవంచకుఁడ నయి వితంతువివాహ సంస్కారము చెడు నని కడచిన యిరువదియైదు సంవత్సరముల నుండి యీశ్వరవంచకుఁడ నయి ప్రవర్తించినాఁడను. ఇట్లు చేసినను వితంతువివాహ సంస్కార మిప్పు డింతమించుగా నారంభదశలో నున్నట్లే యున్నదిగాని యెక్కువయభివృద్ధిని బొందఁగలిగినది గాదు. ఇప్పుడును పట్టపరీక్షలం గృతార్థు లయిన విద్యావివేక సంపన్నులు వితంతువివాహములను సంస్కార కార్యపట్టికలో నుండి తీసివేయ వలయు ననుచున్నారు; వితంతువివాహము లాడినవారిలో భోజనము చేసినవారికి స్వాము లిప్పుడును బహిష్కారపత్రికల నంపుచున్నారు. శూరాలాపము లాడు సంస్కారప్రియు లిప్పుడును వెనుకటివలెనే భయపడుచున్నారు. ఇంతకాలము నా యౌవనమును బలమును ధనమును విద్యను బుద్ధిని వితంతువివాహపక్షమునఁ గొంత యుపయోగించియున్నాను. ఇఁకముందును నా దేహములో నూపిరియున్నంతకాల మీపనిని విడువను; నా కంత్యదినములు సమీపించుచున్నవి. దక్షిణ హిందూస్థాన బ్రహ్మసమాజమునకుఁ బ్రధానాధ్యక్షుఁడగా నుండి యీశ్వరునియొక్క పరస్పరభ్రాతృభావమును ఘోషించుచు నాత్మవంచకుఁడను లోకవంచకుఁడను భగవద్వంచకుఁడను నయి దేహము త్యజించుట కిష్టములేనివాఁడ నయి యీ లోకసామాన్యసౌభ్రాత్రమున కీవృద్ధదశలో సాహసించినాఁడను! ఇహలోకయాత్ర నాకు నేటితోనే ముగియవలసియున్నను పరవంచకత్వము విడిచి సత్యము ననుష్ఠించి యీశ్వరసామీప్యమును గొంతయెక్కువగాఁ బొందఁగలిగితిని

గదా యన్నంత సంతోషముతోను తృప్తితోను దేహమును చాలించె దను. ఈశ్వరుఁడు నాకు సంపూర్ణ మనశ్శాంతిని కలిగించునుగాక! నావంటివారి నిదర్శనమువలన లోకమునకు మేలుకలుగునట్లు చేయును గాక! నామిత్రులు నన్ను మన్నించి నాయందు తొంటిసుహృద్భావ మునే చూపుదురుగాక!

కం— వీరేశలింగము.

---

## స న్మ త ము. 1-4-08.

••••○••••

ఎల్లవారును తామవలంబించిన మతమే యుత్తమ మయిన దనియు దానివలననే ముక్తి కలుగు ననియు చెప్పుచున్నారు. ఎల్ల వారును తామనుసరించెడు మతము గాక యితరమతము లన్నియు హేయము లనియు నరక హేతువు లనియు ఘోషించుచున్నారు. గ్రామదేవతలయెదుట కోళ్ళయొక్కయు మేఁకలయొక్కయు గొంతు కలు కోసి యానందించు జీవహింసాపరుఁడును తనమూఢమతమే సన్మత మనుచున్నాఁడు. తులసిపూసలతావళములు ధరించి లలాటము నిండ తిరుమణినామములు తీర్చి శంఖచక్రముద్రలతో బుజములు కాల్చుకొను వీరవైష్ణవుఁడును తనదే యుత్తమమత మనుచున్నాఁడు; రుద్రాక్షమాలలు దాల్చి మొగమునిండ విభూతి పూసికొని నాలుక కును బుజములకును శూలములు గుచ్చుకొని నిప్పులుత్రొక్కు వీర శైవుఁడును తనదే సర్వోత్కృష్టమత మనుచున్నాఁడు; సూర్యోద యము మొదలుకొని సూర్యాస్తమానమువఱకును కర్మలలో మునిఁగి తేలుచు నుపవాసాదులచే బాధపడు పరమఛాందసుఁడును తనదే

శ్రేష్ఠమతి మనుచున్నాఁడు. ఇంత జీలాగున నెవనిది వారిది సన్మత మని సంస్తుతించుకొనుచున్నప్పుడు సత్యమైన సన్మత మేదో తెలిసికొనుసాధన మేమున్నది? ఒకవృక్షము మంచిదో చెడ్డదో దానిఫలములవలననే తెలిసికొనవలసినట్లు మతమహావృక్షమునుసయితము దాని ఫలములవలననే సంశోధించి నిశ్చయింపవలసి యుండును. వృక్షముయొక్క శ్రేష్ఠతను నిర్ణయించుట ఫలములయొక్క రంగును బట్టియు గొప్పతనమును బట్టియు మాత్రమే కాక వానివలన దేహమునకుఁ గలిగెడి యారోగ్యసౌఖ్యములనుబట్టి నిర్ధారణ చేయవలసి యుండును. పండు మంచిరంగును స్థౌల్యమును గలదయినను దేహమున కనారోగ్యకర మయి బాధను కలిగించునది యగునేని, అట్టిదుష్ఫలముల నిచ్చువృక్షమును వివేకి యయినవాఁడు సద్వృక్షమని చెప్పజాలఁడు గదా? అప్రకారముగానే మత మహావృక్షముయొక్క ఫలము లింద్రియాకర్షకములును బహుజనాదృతములు నయినంతమాత్రముచేత నాత్మ కానందదాయకములును పుష్టికరములును గానియెడల తన్మతమును సన్మత మని వివేకిలోకము పరిగణింప నేర్చునా? సన్మతకల్పతరు వెప్పుడును సర్వజనసంతతానందదాయకము లైన సత్ఫలముల నిచ్చునది యయి యుండును. సర్వజనానందకరము లయిన సత్ఫలములు సత్యము న్యాయము ప్రేమము మొదలయినవి. ఇట్టి యమూల్యసత్ఫలములను లోకమునకు వెదచల్లు మతమహాకల్పమహీరుహమునకు మూలము సత్యన్యాయదయాస్వరూపుఁ డైన పరమేశ్వరుఁడు. మధురఫలభరిత మయినమహావృక్షము నాశ్రయించి సుఖించుపక్షులవలె సమస్తకల్యాణగుణపరిపూర్ణుఁ డైన పరమేశ్వరునికారుణ్యాతిశయము చేత ననంతదివ్యఫలముల నొసఁగు సన్మతకల్పభూరుహము నాశ్రయించి నిత్యానందామృతరసపానసౌఖ్యము ననుభవించుచు కృతార్థులు

కావలసినవా రీశ్వరసంతతి యనఁదగిన మానవకోటి. సకలజనులను ప్రేమించుచు రక్షించుచు సమభావమున సౌఖ్యానందములఁ బ్రసాదించు పరమేశ్వరుఁడు మన పరమపిత. తదీయసంతతియైన మానవకోటి పరస్పరభ్రాతృభావముతో నన్యోన్యసుఖాభివృద్ధుల కయి పాటుపడుచు సమస్తవిషయములలోను లోకపితయొక్క యాజ్ఞ ననువర్తించుచు తదనుగ్రహమునఁ గలననే యానందము నొందవలసిన సోదరీసోదరబృందము. పరమపిత యైన యీశ్వరునితోడ తత్సంతతియైన మానవసంతతిని దృఢముగా బంధించెడు ధర్మానుబంధమే మతము కాఁబట్టి సత్యము నవలంబకులైనవారికి లోకమంతయు నేక కుటుంబము. పురుషు లందఱును సోదరరత్నములు; స్త్రీలందఱును సోదరీమణులు. జాతివర్ణ ద్వేషములను బూనక యెల్లవారియెడలను సౌభ్రాత్రము వహించి పరులను తనవలె భావించి ప్రేమించి స్వప్రయోజనపరత్వమును విడిచి పరార్థపరుఁడయి వర్తించుట మానవధర్మము. అదియే యీశ్వరప్రీతికరము; అదియే పుణ్యము; అదియే శాశ్వత సుఖదాయకము. దేశభేద మతభేదములనుబట్టి జాతివర్ణ ద్వేషములను వహించి జనులను పగవారివలె భావించి గర్హించుచు పరోపకారచింతను విడిచి స్వార్థపరుఁడయి వర్తించుట మనుష్యప్రకృతి కనర్హమైన యధర్మము; అదియే యీశ్వరద్రోహము; అదియే పాపము; అదియే శాశ్వత దుఃఖదాయకము. ఈశ్వరేచ్ఛనే తనయిచ్ఛనుగాఁ గైకొని భగవత్ప్రీతికర మగునట్లుగానే సమస్తకార్యముల నాచరించుచు సర్వప్రయత్నములచేతను పాపమార్గమును పరిహరించుచు పుణ్యమార్గముననే సంచరించుచు తాను సుఖించుచు లోకమును సుఖింపఁజేయునట్లు మనుష్యుని నడుపుటయే మతమువలనఁ గలుగవలసిన ప్రయోజనము. తాను సుఖించుటకును పరులను సుఖింపఁజేయుటకును సత్యము

న్యాయము కారుణ్యము మొదలయిన సుగుణరాజములే పరమసాధనములు. ఈసాధనకలాపమును సనవరతము ధరించి తదనుగుణముగా వర్తించు మహానుభావులే నిత్యసత్యవ్రతులును న్యాయైకావలంబులును భూతదయాపరులును నయి నీతిమంతు లనఁబడుదురు. నీతిని ప్రోత్సాహపఱుపని మతము సత్యమతము కాదు; నీతిబాహ్య మయిన మతము సర్వానర్థదాయక మయిన దుర్మతము. నీతిబలముచేతనే దేశమభివృద్ధి చెందవలెను; ఎప్పుడే దేశ మున్నతస్థితికి వచ్చినను దేశవాసులనీతిసంపద చేతనే కాని వేఱుకారణముచేతఁ గాదు. నీతిమంతుఁడొక్కఁడే నిక్కమైన యీశ్వరభక్తుఁడు, ఆనందబాష్పములు విడుచుచు దినమునకు నేయిప్రార్థనలు చేయువాఁ డయినను నీతిమాలిన వర్తనము గలవాఁ డగునేని, ఆ యీశ్వరవంచకుఁడు భక్తుఁడు గాక భ్రష్టుఁ డగును. నీతియే యీశ్వరగుణభూషణము; ఈగుణభూషణములలో కారుణ్యము శిరోభూషణము. పైని జెప్పినదానివలన సన్మతమునకు ప్రధానాంగములు రెండని యేర్పడుచున్నవి. అందు మొదటిది యీశ్వరపితృభావనయు తద్భక్తియు నయి యున్నది; రెండవది సర్వజనభ్రాతృభావనయు తదుపకారము నయి యున్నది.

సర్వాభివృద్ధులకును మతమే మూలాధారము. ఈశ్వరభక్తి లేక సత్కార్యాచరణబుద్ధి పుట్టదు; సర్వజనసౌభ్రాత్రము లేక సత్కార్యాచరణము కలుగదు. నిక్కమైన జనసౌఖ్యమునకు మొట్టమొదట మతము పరిశుద్ధమయి శుభదాయకము కావలెను. అది నీతిబాహ్యమయి కలుష మయినయెడల సమస్తాభివృద్ధి భంజక మయి యశుభదాయకమగును. కాఁబట్టి స్వాభివృద్ధిని దేశాభివృద్ధిని గాంక్షించెడు పుణ్యపురుషులు మతమునందుఁ బ్రవేశించిన యపరిశుద్ధతలను తొలఁగించి దానిని నిష్కళంకముగాఁ జేయ పాటుపడవలెను. జనులందఱు

జులు సత్యాదరము కలవారు కావలెను; ధర్మపరులు కావలెను; దయాళువులు కావలెను; సత్కార్యశూరులు కావలెను. మనము చేసెడి ప్రతిసత్క్రియయు ఫలనిరపేక్షముగా నసఁగా, ధర్మ మనియు నీశ్వర ప్రీతికర మనియుఁ జేయవలెనేకాని వానివలనఁ గలుగఁ బోవు లాభనష్టముల నాలోచించి కాదు. మనకు ధర్మమును కర్తవ్యమును నగుపనిని బాధలెన్ని వచ్చినను గణింపక పరమేశ్వరప్రీత్యర్థముగా చేసి తీఱవలెను. అట్లు చేసెడిమనుష్యుఁడే నిజ మయిన యాత్మగౌరవమును భగవద్భక్తియుఁ గలవాఁడుగాని తదితరులు గారు.

సత్యమునం దాదర మెట్లో యట్లే భగవద్భక్తి గలవారెల్ల న్యాయమునందు సహితమాదరముగలవారయియుండవలెను. మనదేశమునందగ్రవర్ణములవారధమవర్ణములవారియెడలను, పురుషులు స్త్రీల యెడలను, ఎన్నెన్నియో యన్యాయములను జేయుచున్నారు. మాల మాదిగ లయినపంచముల విషయ మటుండఁగా శూద్రులవిషయమున నడచుచున్నయన్యాయములను దలఁచుకొన్నను న్యాయదృష్టిగలభగవద్భక్తులకు తలవంపులుగా నుండును. సోదరులుగా నుండవలసిన మానవజాతిలో కొందఱు మఱికొందఱిని మృగములకంటెను హీనముగాఁ జూచుచు నవమానించుచుండుట మతమునకంతకు నవమానకరము. మానవజాతికంతకు నపకీర్తికర మయిన వర్ణవైషమ్య మహాకళంకము మతమునుండి తొలఁగింపఁబడువఱకును మనదేశము బాగుపడనేరదు; మనదేశస్థులు స్వాతంత్ర్యలాభముల ననుభవింపఁ జాలరు. మనదేశమందు స్త్రీలవిషయ మయి నడచెడి యన్యాయము లింతకంటెను ఘోరతరము లయి యున్నవి. పురుషుల కర్ధాంగులనఁ బడెడియబలలను విద్యావిహీనులనుగా జేసి, ఆడుకొనెడి దినములలోనే వివాహ మనెడి పేర దాస్యము పాలుపఱచి బాలవితంతువుల నాదరణమును దీఱనివ్యథ

కప్పగించి, పెట్టిపు కడగండ్లను దలచుకొన్న న్యాయబుద్ధియు నీశ్వర భక్తియుంగల వివేకుల హృదయములు కంప మొందవా? వారికంట వెంటలేచి యశ్రుజలము లొకచోటంజేర్పంగలిగితిమా యొక్క యో మహాసముద్రము లేర్పడకపోవు. స్త్రీలను తమస్థితికిం దీసికొనిరాక యజ్ఞానాంధకారమున ముంచి దుస్థ్సితిపాలు చేసెడి యపయశమును దొలగించుకొన్నంగాని మనవా రిప్పటికిని నాగరికు లనందగినవా రను భవించుచున్న శుభస్థితిని బొంద శక్తులు కారు. అబలలయిన, యాడు వారి నేడిపించి సుఖంపం గోరుపీరులు తాము బాగుపడ నేర్తురా? ఈశ్వరభక్తిలేశముగల పురుషనామధారు లందఱును శోచనీయమైన యీపాపపంక మింకువఱకును నిదురపోకుందురుగాక!

ఇటువంటి యనంతములైన యన్యాయములను రూపుమాపు టకును ప్రజలయభివృద్ధిని పెంపు చెందించి వారిని సుఖులనుగాం జేయుటకును కారుణ్య మమోఘసాధనము. ఈకారుణ్యమును వృద్ధి బొందించుకొనుచు పరోపకారకృత్యములయం దెంతయెక్కువగా వర్తించుచుండునో భక్తుం డంతయెక్కువగా నీశ్వరసామీప్యమును బొందుచు దేశమును పాపపంకమునుండి యుద్ధరించి విముక్తిమార్గ మున నడపింప శక్తుండగును. దేశారిష్టకరము లైన యిట్టికళంకముల వారింపంగలిగినంగాని మతము పరిశుద్ధమయి సన్మతమని పేరుపడుయు సర్హము కాదు. పరమదయాళుం డైనపరమేశ్వరుండు నిర్దుష్టమయిన సన్మతమును దేశమునం దంతటను వ్యాపింపంజేయునుగాక!

## గృహము — భూతలస్వర్గము. 1 - 4 - 08

ఆదికాలమునందు మనుష్యులు మృగప్రాయులయి, మృగముల తోడిపాటుగా నరణ్యములందు వసించుచు, కందమూల పర్ణఫలభక్షణము చేయుచు, చెట్లనీడనో గుహాలలోనో విశ్రమించుచు, భార్యాది బంధము లేక యిచ్చవచ్చినవారితోఁ గలియుచు, అనాగరికు లయి యుండెడివారు. కాలక్రమమున మృగప్రాయతతొలఁగి, సభ్యతకొంత గలిగి, వివాహానుబంధసంసారభారము మీఁద పడినతోడనే సుఖావాసమునకు గృహము కావలసిన యావశ్యకత సంభవించెను. గృహమేర్పడి గృహస్వామ్యము కలిగి నప్పుడు గృహము గలపురుషుఁడు గృహియు స్త్రీ గృహిణియు నయిరి; అప్పుడాపురుషుఁడు భరింపవలసినవాఁడగుటచేత భర్తయు స్త్రీ భరింపఁబడఁదగిన దగుటచేత భార్యయు నయిరి. అట్లు గృహసామ్రాజమాన్యము భార్యాభర్తలయందు సంక్రమించినందున పురుషుఁడు గృహపతియు స్త్రీ గృహపత్నియు నయి సంసారచక్రమున కుటుంబపాలనమునందు గృహమునకు వారిరువురును రాజును రాణియునయి సంసారసుఖము ననుభవించుచు నానందింపఁ గలవారయిరి. స్త్రీపురుషులలో నన్యోన్యమైత్రియు పరస్పరానుకూల్యమును గలిగి గృహపాలన మైకమత్యముతో నిర్వహింపఁబడునప్పుడు సంసార మమృతతుల్యమయి సమస్తసుఖావహ మయి సకలసద్గుణోత్తేజకమయి యత్యంతస్పృహణీయ మగును; అప్పుడు గృహము భూతలస్వర్గ మగు ననుటకు సందేహములేదు. అనిర్వాచ్యానందము గృహమునందే యుదయించును; శుద్ధవర్తనము గృహమునందే యారంభ మగును; స్వప్రయోజనత్యాగము గృహమునందే పుట్టును; ఈశ్వరభక్తి గృహమునందే యంకురించును; పరోపకారబుద్ధి గృహ

మునందే జనన మొందును. ఇవి యటు లుండనేల! మానవానంద సౌఖ్యఫలములకు మూలము లయినసమస్తసద్గుణలతలును గృహాల వాలములనే మొలకలెత్తి పెంపొంది బయలఁ బ్రాఁకి కాలక్రమమున లోకమెల్ల నల్లుకొనును. ఇట్టిగృహమునందు పురుషునిపాలిటి భాగ్య దేవతయు, అర్ధాంగి యగుటచే సమసుఖదుఃఖభాగినియు, ఆరోగ్య భాగ్యకారిణియు, దుఃఖనివారిణియు, నయిన యిల్లురాణి నిరంకుశాధి కారముతోఁ గాక యనురాగపూరితము లైన కటాక్షవీక్షణముల తోను ప్రేమాస్పదము లైన మృదుమధురవాక్యములతోను రాజ్యము చేయును. సహధర్మచారిణి ప్రేమానుపూర్వకముగాఁ జేసెడి యుప చారములును సరససల్లాపములును సమస్త శ్రమలును మఱచునట్లు చేసి యనిర్వాచ్యమైన హృదయానందమును గలిగించును; తప్పటడుగు లిడుచు వచ్చీరాని తొక్కుపలుకులు పలుకుచు వచ్చి పయిని బ్రక్కను బడి మురిపములు చూపు శిశువుల ముద్దుమోములును వారి మంద హాసములును నేత్రానందముచేయును; పగలెల్లను బయట పనిచేసి యలసిసొలసి సాయంకాల మిల్లు చేరవచ్చునప్పటి కెదురుగావచ్చి నవ్వుమొగముతో నిరువైపుల చేతులుపట్టుకొని లోపలికిఁ గొనిపోయి కిలకిలలాడు బిడ్డల గారాపుమాటలను, ఉల్లము చల్లచేసి మనఃక్లేశ మును బాపి సంతోష మొసఁగెడి ప్రియకాంతయొక్క సవినయోప చార వాక్యములును, సంగీతముకంటెను మధురతరముల శ్రావ్యము లయి శ్రవణరసాయనము లగును.

నిరంకుశబుద్ధిప్రచారులగు కవికుమారులువర్ణించిన స్వర్గమును పయినుండి క్రిందికిదించి మనభూలోకగృహములయందు పెట్టిరేమో యనునట్లు పయిప్రాఁతవలనఁ గనఁబడినను, పరీక్షించి చూడఁగా కవిశిఖామణులు కావ్యములయందు వర్ణించిన నరకమును క్రిందినుండి

పయికెత్తి యీభూలోక గృహములయందు పెట్టిరేమో యనునట్లు బహు గృహములు కానఁబడుచున్నవని కొంద ఱనుభవశాలులు వలుకవచ్చును. భూలోకనరకము లనఁదగిన గృహములు పెక్కులుగలవు గాని యవి యట్లుండుట స్వాభావిక గుణముచేతఁగాక యస్వాభావిక దోషముచేత తటస్థించినదని చెప్పవలసియున్నది. గృహముస్వర్గమువలె నుండక నరకమువలెనుండుటకుఁగల యస్వాభావికదోషమేది? నిజముగా గృహము భూలోకస్వర్గమువలె నుండుటకు గృహియు గృహిణియు నెట్టివారుగా నుండవలెను? అన్న యంశము విమర్శనీయముగానున్నది. లోకములో సుఖపడఁ దలఁచుకొన్న వారందఱు విద్యావివేకములు గలవారుగాను సత్యసంధులుగాను, ధర్మరతులుగాను, నీతిమంతులు గాను, భూతదయాపరులుగాను, ఈశ్వరభక్తి గలవారుగాను, సద్వర్తనులుగాను, ఉండుటచేత గృహస్థుఁ డట్టి సుగుణసంపద గలవాఁడుగా నుండవలెను. గృహి యట్టివాఁడు కావలసినచో నింక గృహిణి యెట్టిదిగా నుండవలెను?

భర్తతోడిపాటుగా మొట్టమొదట భార్యయు విద్యావతి యయి యుండవలెను. కొందఱు బుద్ధిమంతులు తాము విద్యావంతులయ్యును భార్యలను మూఢురాండ్రనుగానుంచి వారు గుణవంతురాండ్రు కావలెనని కోరుదురు. సదసద్వివేకము కలిగించెడు విద్యలేనియెడల సుగుణము లెక్కడినుండి వచ్చును? ఆవుకు మేఁత వేయక పాలీయవలె నన్న నెట్లు పొసఁగును? కొందఱుమహానుభావులు చదువుకొన్న భార్య పరపురుషుల కుత్తరములు వ్రాయఁగలుగునని వలుకుచు మూఢవనిత గుణములను మెచ్చుకొందురు. కుంటివాడు నృత్యముఁ జేయుచుండఁగా గ్రుడ్డివాఁడు సంతోషించినట్లు మూఢకాంతల కౌశలమును మూఢకాంతులు మెచ్చుకొని సంతోషపడనిండు. చదువుకొన్నవాఁడు

మాత్రము తన యర్ధాంగిని చదువుకొనిదానినిగా నుంచుకొందునా గాక! భార్యాభర్తల దిద్దఱిని యేకదేహ మనిచెప్పుటచేత నర్ధభాగ మయిన స్త్రీశరీరము విద్యాభావముచేత పశుశరీరముగాను, అర్ధభాగ మయిన పురుషశరీరము విద్యాప్రభావముచేత మనుష్య శరీరము గాను, ఉన్నయెడల నట్టిశరీరము పక్షవాతబాధితదేహమువలె బాధ పడక యెట్లు సుఖపడఁగలుగును? "విద్యావిహీనః పశుః" అన్న యార్యోక్తిని వినని వా రెవ్వరు? పశువాస మైనగృహము మహా రణ్యముగాక మనుష్యశరణ్య మెట్లగును? మూఢాంగనలతో నిండి యున్న గృహములు భూలోకనరకము లగుట యొకవింత కాదు. చదువుకొన్న భర్తకు చదువుకోనిభార్య బాధ గలయింటికంటె నుండుటంతే యసౌఖ్యము మఱియొక్కడ నుండదు. అట్టిభర్త కిల్లే నరకము. బయట ప్రసంగములలో సింహమువలె నసహాయ శూరుఁడుగా నుండు విద్యాధికుఁడు మూఢభార్యాపిశాచావాస మైనస్వనివాసమునకు రాఁగానే తనప్రసంగములను తన్నును మఱచి యిట్టికడ నసమాన భీరువయి భయముచే వడఁకుచు పిల్లిపిల్లవలె మూలమూలల నొదిగి యుండవలసినవాఁ డగును. సభాభవనములో నెత్తిననోరు స్వభవన ములో నెత్తినపక్షమున మఱునాఁటినుండి బ్రతుకులేదు. చదువు గల భర్తకును చదువులేని భార్యకును సద్విషయములయందు సంభా షణ ముండదు; సత్కార్యములయం దైకమత్య ముండదు.

సత్యమైనసౌఖ్య ముండదు; సంతోష ముండదు. ఏసౌఖ్యము లేకపోయినను తగవులాట లైనను లేకుండ బయలఁబడవలెనని కోరినా, యతఁ డింట నున్ననాలుగుగడియలును తన విద్యాధికవేష మును మార్చి మూఢవేషమును వేయవలెను. ఇట్టిగృహములు భూలోకనరకములుగాక స్వర్గము లెట్లు కాఁగలుగును?

విద్యావివేకకోవిదు లయినసుహృత్కులారా! మీగృహములు భూతలస్వర్గములు కావలెనన్నకోరిక మీకున్నపక్షమున మీతోసమానముగా మీవామాంగులను విద్యావతులనుగాఁ జేయ సర్వవిధములఁ బ్రయత్నింపుఁడు. వారిని మూఢత్వములో ముంచియుంచి మీ రెప్పుడును పైకి తేలఁజాలరు. అజ్ఞానసముద్రమునుండి విద్యాప్లవముచేత వారిని తేల్చిన మీరును తేలి దరిచేరఁగలుగుదురు; అట్లుచేయని యెడల మీరును వారితో మునిఁగి యడుగంటుదురు. మీరు బాగు పడఁ గోరితిరా వారిని బాగుచేయుఁడు. స్త్రీలబాగే పురుషుల బాగు; స్త్రీలయోగే పురుషులయోగు. వారి నజ్ఞానాంధకారమునుండి వెడలించి కన్నులు తెఱపించి వెలుతురులో పెట్టితిరా వారు మీతోడ నడచి యిహలోకయాత్రయందు సహాయురాండ్రయి మిమ్ము నిత్యానంద పదవికిఁ జేర్తురు. ఒక్క విద్యాదానమును మీరు వారికి పూర్ణముగాఁ జేసితిరా, విద్యాప్రభావముచేత వారు సమస్తయోగ్యతలనుబడసి గృహములను నిజమైన భూతలస్వర్గములనుగాఁ జేయ సమర్థురాండ్రగుదురు.

## పాపము — ఈశ్వరకారుణ్యము.

ఈ లోకము దుఃఖబహుళమైన దనియు దుఃఖముల కన్నిటికిని జన్మము కారణమగుటచేత జన్మము లేకుండఁ జేసికొనుటయే పరమార్థమనియు, అదియే ముక్తి యనియు, మనవారు చెప్పుచున్నారు. జరామరణరోగాదులవలనఁ గలుగు దుఃఖములు మనదేహముల నాశ్రయించి యుండుననుటకు లేశమాత్రమును సందేహము లేదు. సర్వకారుణ్యుఁ డయిన యీశ్వరుఁడే లోకమును పాలించుచున్న

యెడల సృష్టిలో నిట్టిదుఃఖము లుండుట యెట్లు పొసఁగునని భావించి సంశయించి నాస్తికులయిన వారును పలువురు గలరు. సర్వకారుణ్యుఁ డైన యీశ్వరుని రాజ్యములో నిట్టి దుఃఖము లుండుట పొసఁగునా యన్న యంశము విచారణీయ మైనదే. మనకు శరీరములు మాత్రమే యుండి శరీర సౌఖ్యములే పరమార్థము లయినపక్షమున మన సంసార దుఃఖములు నిజముగా నీశ్వరుఁడు సర్వకారుణ్యుఁ డగునా యన్న సందేహమును గలిగింపవచ్చును. మనకు క్షణ భంగురము లైన శరీరములుమాత్రమే గాక నిత్యము లైనయాత్మలుకూడ నున్నవి. అందుచేత శారీరిక సౌఖ్యము లనఁగా నింద్రియసుఖములు తుచ్ఛము లయి యనిత్యము లైనవిగాను, ఆధ్యాత్మిక సౌఖ్యములు శ్రేష్ఠము లయి నిత్యము లైనవిగాను, ఉన్నవి. ఈద్వివిధ సౌఖ్యముల లోను దేహసౌఖ్యముకంటె నాత్మానంద మధికాదరణీయ మయి పరమార్థముగా నేర్పడుచున్నది. కాఁబట్టి వివేకు లైన వారు నశ్వరము లైన దేహసౌఖ్యములను త్యజించియైనను, అనశ్వరము లైన యాత్మానందము నొందుటకయి సదా ప్రయత్నించుచుందురు. లోకములో సాధారణముగా దేహసంబంధ మయినట్టి గాని యాత్మసంబంధ మయి నట్టిగాని సౌఖ్యము లీశ్వరాజ్ఞననుసరించుటవలనను దుఃఖము లీశ్వ రాజ్ఞనతిక్రమించుట వలనను గలుగుచున్నవి. దేహారోగ్యధర్మముల మీఱుటవలన వ్యాధులు సంభవించును; ఆధ్యాత్మిక ధర్మములను మీఱుటవలన మనోవ్యథలు సంభవించును. కాఁబట్టి వ్యాధులును వ్యథలును అస్వాభావికములును నాగంతుకములు నయి యున్నవి. సౌఖ్యానందములు స్వాభావికములును సుస్థిరములు నయి యున్నవి. మనము స్వభావముచేత సౌఖ్యము ననుభవించునట్లు చేయుటయే యీశ్వరుఁడు సర్వకారుణ్యుఁ డగుటను సహస్రముఖముల ఘోషించు

చున్నవి. అయినను లోకములో మనకు కష్టములు పెక్కులు గలవు. ఈకష్టములు నొప్పులు, తెవుళ్లు, చావులు మొదలైనవానివలనం గలుగుచున్నవి. ఇట్టి బాధలు మనదేహములకు సంభవించెడు వ్యాధులు మొదలైనవానివలన మాత్రమే కాక మనకు ప్రేమాస్పదులైన భార్యాపుత్రాదులు బంధువులు మిత్రులు మొదలైనవారికి సంభవించెడు రోగములు నొప్పులు మొదలైన దుఃఖములవలనను కలుగుచున్నవి. ఈదుఃఖములు మనము బాధపడుటకు మాత్రమే యుద్దేశింపఁబడినవిగాక కడపట వానివలన మనకు మేలు కలుగుకొఱకే యుద్దేశింపఁబడిన వగుటచేత నీదుఃఖములవలన పరహిత మీశ్వరుని సదుద్దేశమును కరుణాళుత్వమును వెల్లడి యగుచున్నవి. నిప్పు త్రొక్కినప్పుడు గాని ముల్లుగ్రుచ్చుకొన్నప్పుడుగాని కలుగు నొప్పి ముందు జాగరూకులమయి చూచి నడుచుటకు తోడుపడుచున్నది; వ్యాధు లారోగ్యధర్మములను మీఱకుండునట్లు చేయుటకయి తోడు పడుచున్నవి; ఇతరుల యాపదలు జాలి కలిగించి పరోపకారమునకు పురికొల్పుటకయి తోడుపడుచున్నవి.

శరీరసుఖములకంటె నాధ్యాత్మికసుఖము లధికాభ్యర్థనీయము లనియు, స్థిరతరము లనియు, శరీరక్లేశములకంటె నాధ్యాత్మిక దుఃఖము లధిక హేయములనియు నధిక వేదనాకరము లనియు, తెలిపియున్నాము. ఈశ్వరాజ్ఞారూపములైన యాధ్యాత్మిక ధర్మములను మీఱుట పాపమనియు, అనుసరించుట పుణ్యమనియు, వ్యవహరింపఁబడుచున్నవి. ఇహపర సుఖముల నపేక్షించు ప్రతిపురుషుఁడును ప్రతిస్త్రీయును పాపమునకు భయపడుచు సర్వప్రయత్నముల చేతను దాని పొంతకుఁ బోకుండునట్లు పాటు పడుచుండ వలయును. ఈపాపముల మనోవాక్కాయ కర్మలచేత స్వవిషయమునను భగవం

తుసివిషయమునను చేసెడి యీశ్వరాజ్ఞోల్లంఘనములయి యున్నవి. శారీరక దుఃఖములకంటె పాపరూపము లయిన యాధ్యాత్మికదుఃఖములు ఘోరతరము లని సామాన్యజ్ఞానము గల యెల్లవారును నెఱిఁగి యున్నారు. అందుచేతనే యనేకు లెన్నిదేహబాధలకయినను సహింతురుగాని వానిని తప్పించుకొనుట కయి పాపకార్యమున కడుగిడఁజాలరు. అనేకులు తమవారు దుష్కార్యములు చేసి యపకీర్తిపాలగుటకంటె మృతినొందుట మే లని తలంతురు.

ఇది మంచిది, ఇది చెడ్డది, ఇది చేయఁదగినది, ఇది చేయఁగూడనిది, అనుజ్ఞానము మనలోనుండుటచేత పుణ్యపాపభేద మేర్పడినది. ఈజ్ఞానమే లేకయుండినయెడల పుణ్యపాపభేదమేయుండదు. మనుష్యుఁడొకబాలుని జంపినయెడల నెల్లవారును వానిని పాపాత్ముఁడని భావింతురుగాని, యాబాలునినే యొకతోడేలు మ్రింగిన నెవ్వారును అది పాపము చేసె నని తలంపరు. సర్వజంతువులలో మనుష్యుఁడు శ్రేష్ఠుఁడని భావింపఁబడుట కతనికిఁ గల పుణ్యపాపజ్ఞానమేముఖ్యకారణము. ఇటువంటి సదసద్వివేకమును ప్రసాదించుటయే యీశ్వరుఁడు మనకు చేసినమహోపకారములలోనెల్ల నగ్రగణ్య మయినది. దీని మహిమచేతనే మనము సమస్తజీవరాసులకంటెను మహోన్నతుల మయి తల యెత్తుకొని నిత్యానందము ననుభవింపగలుగుచున్నాము. ఈవిభాగజ్ఞానమే మనము పాపుల మనుచింతను మొట్టమొదట మనహృదయములలో నుదయింపఁజేయున దయినను, పాపచింతయే మనలను నీతిపరులను జేసి శాశ్వతానందప్రద మయిన ముక్తిసౌధము నెక్కించుటకు ప్రధానసోపాన మగుచున్నది. అందుచేత పాపచింత మన కెంతమాత్రము నపకారి గాక మనయుత్తమగమ్యస్థాన మైన పరమపదమును జేర్చుటకు సాయమయి మహోపకారి యగుచున్నది. మనము

పాపులమును పతితులమును కాసియెడల పుణ్యులమును పావనులమును కాఁగలుగుట సాధ్యముకాదు. పాపమనునది యొకటి యుండఁబట్టియే మనము పుణ్యపాపభేదములను దెలిసికొని, మనప్రయత్నముచేత పాపమును పరిత్యజించి పుణ్యపథమునుభజించి యానందింపగలుగుచున్నాము. ఒకఁడు పాపకార్యమును జేయుటకు శక్తుఁడు కాకుండుటలో ఘనత యేమియు లేదు. ఘనతయంతయు పాపమును జేయుటకు శక్తుఁడయి యుండియు తనకుఁగల స్వాతంత్ర్యముచే పాపమార్గమునుబట్టక చరించుటలో నున్నది. పాపపుణ్యవిభేదమును దెలిసినవారయి ఇచ్ఛవచ్చిన దారి ననుసరించు స్వాతంత్ర్యము గలవారమగుటచేతనే యీశ్వరభటుల మనఁదగిన మనము మోహాంధకారబంధురరిపువర్గకంటక దుశ్చింతావిషసర్పసమాన్వృతమైన పాపమహారణ్యమును ఛేదించి దారి చేసికొనుచు మహాపౌరుషముతో ముందుకునడిచి యీశ్వరసాన్నిధ్యము చేరి యనిర్వాచ్యనిరుపమానంద లాభమునొంది సుఖింపఁగలుగుచున్నాము. ఇటువంటి యసమానమోక్షసాధనమును మన కనుగ్రహించి నిత్యానందపదవికి దారియేర్పఱిచిన సదయహృదయుఁడు సర్వకారుణ్యుఁడు గాక మఱియెట్టివాఁడగును? పాపమను దానినొకటిని గలిగించిన పరమేశ్వరుని కరుణాళుత్వమువలననే మనము పాపభయమునుబట్టి యభయము వేఁడి యీశ్వరునియొద్దఁజేరి తద్దాసులమయి యీశ్వరప్రీతికొఱకు తత్ప్రియములైన నీతియందును సత్యమునందును దినాదినాభివృద్ధి నొందుచుఁ గడపట పరిపూర్ణపు శుద్ధతను గాంచి యీశ్వరసామీప్యమునొంది మోక్షసామ్రాజ్యమును చూఱగొనఁ గలుగుచున్నాము. పాపచింతలనుండియు పాపవాక్యులనుండియు పాపకర్మలనుండియు విముక్తులమయి ముక్తిపదము నొందుటయే మనము కోరఁదగిన పరమార్థము. దానిని బొందుటకు పాపపరిజ్ఞాన

మును యథేచ్ఛానువర్తన స్వాతంత్ర్యమును పరమసాధనములు. మనయెడలఁగల నిర్హేతుకజాయమాన కరుణావిశేషముచేతనే యీశ్వరుఁడు మనకట్టి యమూల్యామోఘసాధనముల దయచేసియున్నాఁడు. ఆయమోఘసాధనములను యుక్తరీతిని మన ముపయోగించుకొను చుండుమేని కాలక్రమమున పురోవృద్ధినొందుచు తుదను పరమార్థమును సాధించి యానందింతుము. అటువంటి నిత్యానందపదవిని బొందుటకు విశేషకాలము కావలసియుండును. ప్రతిపదార్థమును సూక్ష్మస్థితి నుండి యంతకంతకు వృద్ధినొంది కడపట పూర్ణదశను గాంచవలె ననుట యీశ్వరసంకల్పము. అత్యల్పబీజమునుండి యంకురించి కాల క్రమమున పెరిగి మహావృక్షమయి మఱ్ఱిచెట్టు వేలకొలఁది పక్షులకు పండ్లను, నూఱులకొలఁది మనుష్యులకు ఛాయను నియ్య సమర్థమగు చున్నది. మొట్టమొదట నొక చిన్నయూటనుండి యుదయించి యల్ప జలముతో కాలువపాఱి యేఱు కాలక్రమమున వృద్ధినొంది దేశదేశ ములవెంటఁ బ్రవహించి మహానదియై సస్యములపంటకును జంతువుల స్నానపానములకును మహోపయుక్తమగుచున్నది. ఈప్రకారము గానే మోక్షసామ్రాజ్యము నొందుటకును చిరకాలము పట్టును. ఒక్క కాలదీర్ఘత మాత్రమేకాక దానిని సాధించుటకు బహుకష్టము లును పడవలసియుండును. ఏవిషయములోను కష్టములేక ఫలము కలుగదు. ఎక్కువఫలము నపేక్షించువా రెక్కువకష్టములను పడ వలెను. కష్టములేక కలుగుఫలము సుఖదాయకము కాదు. నిత్యా నందపదవి మనుష్యునకు పరమార్థమయినందున దానిని సాధించి సుఖించుటకయి మనుష్యుఁ డెన్నిశ్రమల నయినను పడవలెను. ఎన్ని శ్రమలకైనను సహించి పరమార్థము సాధించు బుద్ధిని శక్తిని సాధన ములను ప్రసాదించిన పరమేశ్వరుఁడు పరమకృపాళుఁడు. లోకములో

పాపముండుటవలన నీశ్వరుని కరుణాభుక్యమున కెంతనూ|తమును కొఱంతగలుగదు. ఈశ్వరానుగ్రహముమువలన నెల్లవారును సత్యానంద పదవిని పొందుటకయి నిరంతరకృషిని చేయుదురు గాక!

## స్త్రీ వి ద్య.

### ప్ర హ స న ము.

[సుందరి, దమయంతి, సరస్వతి, అను బాలికలు ప్రవేశించుచున్నారు.]

దమ—సుందరీ! నీ విప్పుడు అలా విచారంగా వున్నావేమి? కళ్ళన్నీ వాచిపోయినవి. యేడిచినావా యేమిటి?

సుంద—సఖీ! దమయంతీ! యేమని చెప్పను? రేపటినుంచి బడికి పోవద్దని మాఅమ్మ నన్ను నిర్బంధపెడుతూ వున్నది. అందుచేత యేడ్చినాను.

దమ—చదువు మాన్పించవద్దని పెద్దాయన మీ తాతగారయినా కూతురిని కాస్త కూకలువేసినారు కారటే?

సుంద—తాతగా రెవరే? నాకు తాతగారు లేనేలేరు.

దమ—మొన్న నేను మీకోసం మీయింటికి వచ్చినప్పుడు మంచం మీాద కూర్చున్నాయన మీాతాతగారు కారటే? ఆయన మీా అమ్మతాతగారా యేమి?

సుంద—కారే.

దమ—యెవరూ కాకపోతే నీకాయన యేమవుతారే?

సుంద—(చిరాకుతో) యేమవుతారో నన్నడుగకు.

దమ—నిష్కారణంగా నామీద చిరాకుపడుతావేమే! — సరస్వతీ! నే నేమి తప్పుమాట అన్నాను? మీయింట్లో వున్న ముసలాయన యెవరంటే, సుందరి అలా చిరాకుపడుతుందేమే?

సర—ఆహాహాహా! నెల్లాళ్ళబట్టి సుందరితో స్నేహం చేస్తూ వున్నావు నీ కాసంగతి తెలియదా? ఆయన సుందరికి భర్తగా రవుతారే. ఆయనపోరు మూలంగానే తల్లిసుందరిని చదువు చాలించుకో మంటూవున్నది.

దమ—ఆహాహా! సుందరీ! యేమి నీపుణ్యం! ఇంత చిన్నతనంలోనే నీకు పెద్దలసేవచేసి తరించేభాగ్యం లభించింది! నీ యీడుకూ జోడుకూ తగినభర్తను వరించినావు. నీప్రాణవల్లభుఁడే చదువొద్దని నిన్ను ప్రాణాలు తీస్తూవున్నాఁడా?

సర—పాపం! దాన్ని ఆక్షేపించబోకే. అది యేమి చేస్తుంది? నీతండ్రిగారివలె దానితండ్రి దాన్ని అడిగి మరీ పెళ్ళిచేసినా డను కొన్నావా యేమిటి? ఋణాలు తీర్చుకోవడానికి వెయ్యిరూపాయలు పుచ్చుకొని దానితండ్రి సుందరిని సహస్రమాసజీవి కిచ్చి కన్యాదానం చేసినాఁడు. సుందరి బహుమంచిది. చదువుకున్నది కావడంచేత వినయమూ విధేయతా కలదయి యింకా పెద్దమనిషి కాకపోయినా పెద్దదానివలెనే యింటికాడ పెనిమిటికి సమస్తోపచారాలూ చేసి మరీ బడికి వస్తుంది.

దమ—అవును. సుందరి అందరివంటిదీ కాదు. బహు బుద్ధిమంతురాలు. తనవుపచారానికి లోపం లేకుండావున్నప్పుడు పిల్లది చదువుకుంటూ వుంటే ముసలాయనసొమ్మేమి పోయింది?

సర—సుందరిచదువు మాన్పించవద్దని మొన్న మాఅమ్మ వెళ్ళి దానితల్లితో చాలాదూరం చెప్పింది. తల్లి వట్టిమూర్ఖురాలు;

యెంతచెప్పినా వినకుండా వున్నది. "ఆడది చదివి చెడె మగవాడు చదవక చెడె" నని సామెతలు తెచ్చి, ఆడదానికి చదు వెందు కంటుంది? మాచిన్నతనంలో మేము యేమిచదువు చదివి మగడితో కాపురంచేసి బిడ్డలను కన్నామంటుంది. మరీమరీ చెప్పితే అల్లుడుగారికి యిష్టం లేనప్పుడు పిల్లను నేనెట్లాబడికి పంపుతా నంటుంది?

దమ—ముసలాయనతో కూడా చెప్పి చూడలేకపోయిందా?

సర—ఆపనీ జరిగింది. ఆడది చదువుకుంటే మగవాడిమాట వినదట! చదువు నేర్చిన ఆడుదానితోనూ వంట నేర్చిన మగవాడితోనూ యెవ్వరూ నోప లేరంట! నో రెరుగని చిన్నతనంలో పెళ్ళిచెయ్యబట్టి కాని యిప్పు డయినట్లయితే చదువుకొన్నందుకు తండ్రిమాట వినక పొయ్యేదే నట! ఆయనవ్యూహాలు యేమని చెప్పను?

దమ—భర్తకూ తల్లికీకూడా యిష్టంలేకపోతే మన సుందరి యింతకాలంనుంచి యేలా చదువుకుంటూ యున్నది?

సర—పెనిమిటి పుస్తెముడివేసి పునాసతారా వెళ్ళి నెల్లాళ్ళ క్రిందటనే తిరిగివచ్చినాడు. కాలేజిలో చదువుకుంటూవున్న అన్న గారి ప్రోద్బలంచేత సుందరియింతవఱకు చదువుకున్నది. చెల్లెలు చదువుమానడం అతనికి యిప్పుడూ యిష్టంలేదు. బావమరిదితో చెప్పించడానికి నిన్న మాతండ్రిగారినికూడా మనయింటికి తీసుకొని వెళ్ళినాడు. అప్పుడు వారి యిద్దరికీ పెద్దసంవాదం జరిగింది. పళ్ళూడి పోవడంచేతగాని లేకపోతే నమిలి మింగివేయవలె నన్నంతకోపము మాతండ్రిగారిమీద ముసలాయన కప్పుడు వచ్చింది. మాతండ్రి గారితోకూడా వెళ్ళడంచేత నేనాసంవాదమంతా విన్నాను.

దమ—ఆయన స్త్రీలకు విద్యకూడ దనడానికి యేమియుక్తులు చెప్పినారు?

సర — ఏమి క్రొత్తయుక్తు లున్నవి? అన్నీ మాతాతలనాటి పెడయుక్తులే, చదువుకుంటే పూర్తిగా స్త్రీస్వభావమే మాఱిపోతుం దట!

దమ — దానికి మీతండ్రిగారేమి బదులు చెప్పినారు?

సర — మాతండ్రిగారు పకపక నవ్వి "నాభార్య బాగా చదువు కున్నది, దానికి ముప్పయియేండ్లు వున్నవి. యిన్నేళ్ళువచ్చినప్పటికి దానికి మీరన్న స్త్రీస్వభావం చెడి మొగంమీఁద వక్కమీసమైనా మొలవలేదు. యిక ముందయినా గడ్డాలూ మీసాలూ వచ్చేజాడలు యేమీ కనపడడం లేదు. దానివద్ద వున్ననమ్రతా పరోపకారబుద్ధీ గర్వరాహిత్యమూ మొదలైనసుగుణాలు చదు వెరుగని మూఢురాళ్ళ వద్ద నాకెక్కడనూ కనపడడం లేదు. అది యెప్పుడూ నామాటకు వ్యతిరిక్తంగా నడవదు; పిల్లలను చక్కఁ బెట్టుకుంటూ వాళ్ళవిద్యా బుద్ధులు తానే చూస్తుంది; గృహకృత్యములన్నీ తీరుస్తుంది; జిహ్వా కింపుగా పాకంచేసి వేళ తప్పకుండా భోజనా లమరుస్తుంది; దాసదాసీ జనుల జీతబత్తెములూ యింటివెచ్చాలూ తానే విచారించి నాకు భారం లేకుండా చేస్తుంది; అందుచేత మాయిల్లు భూతల స్వర్గంలాగు సర్వసుఖప్రదంగా ఉంటుంది. నాభార్య చదువుకోవడంచేత బాగుపడ్డ దేకాని యెంతమాత్రమూ చెడిపోలేదే?" అని చెప్పినారు.

దమ — నిజం చెప్పినారు. అంతటితో ముసలాయన బుద్ధి తెచ్చుకొని వూరుకున్నాఁడా? యింకా యేమైనా సోది మొదలు పెట్టినాఁడా?

సర — ఎందుకు వూరుకుంటాఁడు? వూరుకుంటే యిక మూర్ఖత్వం యేమిటి? లోకంలో యేరోగానికైనా మందున్నది కాని మూర్ఖత్వరోగానికి మందు లేదు. చదువుకుంటే స్త్రీలకు స్వాతంత్ర్యం

వస్తుందనీ, స్త్రీలకు స్వాతంత్ర్యం కూడదని శాస్త్రాలు చెపుతూవున్న వనీ, స్త్రీలకు స్వాతంత్ర్యం యిస్తే వారు పురుషులనుకూడా చెడ గొడతారనీ, చదువుకున్న దన్నమాటేగాని మాతల్లివద్ద ఆచారవ్యవ హారాలే లేవనీ, మడీమయిలా లేవనీ, తనకు వచ్చిన వెఱ్ఱిమొఱ్ఱి చదు వంతా యేమేమో చదివినాడు.

దమ—ఆయనగారు ఆరునెలల నుంచి తడవకుండా చేతులు తుడుచుకొన్న నేతిజిడ్డుతో కుళ్ళుకంపు కొడుతూవుండే ధావళీగుడ్డ మాత్రమే మడి దనీ, తెల్లగా పువ్వులాగు చాకలిది వుతికి తెచ్చిన దోవతీ మయిల దనీ, అనుకున్నాడు కాబోలును! ఆయన చెప్పిన ఆచారవ్యవహారాలు యిది తగిలిం దనీ అది తగిలిం దనీ రోజుకు ముప్పయిసార్లు మురికినీళ్ళలో మునిగి తడిబట్టలతో వుండి రోగాలు తెచ్చుకోవడమూ, ఆవుపంచితాలు తాగడమూ, పేడముద్దలు మింగ డమూ, కాబోలును! మీతండ్రిగారేమన్నారు!

సర—మాతండ్రిగా రిట్లన్నారు—"తాతగారూ! కోపపడక వినండి – పురుషులు తామేమో స్వతంత్రులమని తెలియక మాటలలో విఱ్ఱవీగడమేకాని నిజానికి పురుషు డెప్పుడూ క్రియలలో స్త్రీలకు దాస ప్రాయుడే. స్త్రీ చదువుకొన్నదై మంచి దైన పక్షమున చెడ్డవా డయినా పురుషుడు సహవాసపుణ్యంచేత తానుకూడా బాగుపడుతాడు; స్త్రీ మూఢురాలై చెడ్డ దైన పక్షమున మంచివా డయినా పురుషుడు సహవాసదోషంచేత తానుకూడా చెడిపోతాడు. పురుషులను మనసు వచ్చిన ట్లాడించేశక్తి స్త్రీలచేతిలో వున్నది. పురుషు లెప్పుడూ స్త్రీలు చేసిన ట్లవుతారు. విద్యావంతులైనను విద్యావిహీన లైన స్త్రీలతో సహవాసము చేసేవారు తత్తుల్యులయి మూఢాచారపరా యణు లవుతారు; విద్యాగంధము లేనివా రయినను విద్యావతు లైన

స్త్రీలతో సహవాసము చేసేవారు శత్రువులయి సదాచారపరాయణులవుతారు. ఏ దేశ మెప్పుడు బాగుపడినా స్త్రీలమూలముననే బాగుపడవలెను. దేశముసంపతి స్త్రీలస్థితినిబట్టియే దేశముయొక్కస్థితి బోధపడుతుంది. కాబట్టి మన మెల్లప్పుడును విద్యామహిమచేత స్త్రీల నున్నతస్థితికి తెచ్చి తన్మూలమున మన మున్నతస్థితిని పొంద పాటుపడవలెను. స్త్రీకి విద్యచెప్పి బాగుపఱిచి పురుషుడు స్త్రీతో తానుగూడ నూర్ధ్వగతికైనను బోవలెను; లేదా స్త్రీకి విద్యమానిపి మూఢురాలినిజేసి దానితో తానుగూడ నధోగతికైనను బోవలెను. అంతేకాని స్త్రీని మూఢత్వసముద్రములో ముంచి తాను పయికితేలి సుఖించెడు మధ్యమార్గ మెప్పుడును నుండదు. కాబట్టి నాప్రార్థన చిత్తగించి మీరు మరికొంతకాలము మీభార్యను చదువుకోనియ్యండి.

శ్లో॥ పితా రక్షతి కౌమారే భర్తారక్షతి యౌవనే
రక్షంతి స్థావిరే పుత్రాః న స్త్రీ స్వాతంత్ర్యమర్హతి.

అన్న మనువచనము నేను విననిది కాదు. తండ్రీ భర్తా పుత్రులూ స్త్రీలను రక్షించేవారే కాని లోకానుభవమునుబట్టి చూడగా సాధారణముగా శాసించేవారుమాత్రము కారు. నిజముగా పురుషులను శాసించి నడుపువారెప్పుడును స్త్రీలే.

శ్లో॥ మాతా శాసతి కౌమారే భార్యా శాసతి యౌవనే
స్నుషా శాసతి వార్ధక్యే పుంసోనాస్తి స్వతంత్రతా.

అని శ్లోకం వున్నయెడల, సత్యాని కది యెక్కువచేరువగా వుంటుంది. ఈకడపటి శ్లోకార్థం వినండి—

గీ. మాత శాసించుచుండుఁ గౌమారమందు
భార్య శాసించుచుండు యౌవనమునందు

వచ్చి కోడలు శాసించు ...ర్థకగున
పురుషునకు లేదు స్వాతంత్ర్యగరిమ మెపుడు."

అని చెపుతూవుండగానే "హరిహరీ" అని చెవులు మూసుకొని తాతగారు చివాలున లేచిపోయినారు. బ్రహ్మ దిగివచ్చినా మూర్ఖులకు బోధించడం శక్యము కాదని నిరాశ చేసికొని మావాన్నగారూ నేనూ యింటికి వచ్చినాము.

దమ—చదువుమాట పోనీకాని తాతగా రేమైన డబ్బు గలవారేనా ?

నర—వున్నదికాస్తా పెళ్ళితో పోయింది. 'బ్రాహ్మణస్యధనం భిక్ష' మన్నట్టు యిప్పు డాయనకు "సీతారామాభ్యాంనమః" తప్ప వేరే ఆధారం లేదు.

దమ—అలాగైతే భార్యఅయినా చదువుకొని పదిరూపాయలు తెచ్చి మొగుణ్ణి పోషిస్తుందే. సుందరియిప్పు డారోక్లాసులో చదువు కుంటూవున్నది. చదువుమానిపిస్తారంటే వలవల యేడుస్తూవున్నది. ఇంకొక్క యేడాదిపాటు చదువుకొనిస్తే పరీక్ష ప్యాసవుతుంది.

నర—తాతగారికి మొదల భార్యచదువుకోవడమే అవమాన మట! అవతల వుద్యోగంచెయ్యడం అంతకంటేనూ తలవంపులట! వక్కముష్టియెత్తుకోవడమే మహాగౌరవమట! ఇంతటి బుద్ధిమంతులతో చెప్పవలసిన దేమున్నది? — సుందరీ! విచారించబోకు. నీ చదువుకు భంగం రాకుండా దేవుడు రక్షిస్తాడు. ఇంటికి పోదామురా.

(అందరు నిష్క్రమించు చున్నారు.)

---

## అద్వైతమత సంగ్రహము.

అద్వైతమనఁగా రెండవది లేదనుట; బ్రహ్మముతప్ప వేఱు పదార్థము లేదని యీమతసిద్ధాంతము. ఈమతస్థాపకుఁడు శంకరాచార్యుఁడు. ఆర్యావర్తములో లోకగురుఁ డని ప్రసిద్ధిగన్న యీమహానుభావుని వంశజన్మ కాలాదులను గూర్చి యింకను నిశ్చయముగాఁ దెలియదు. ఇతఁడు కేరళ (మళయాళ) దేశములోని కాలాది యనునగ్రహారములో జననమొందినట్లు పలువురు వ్రాయుచున్నారు. చిదంబరములో పుట్టిన ట్లానందగిరి తన శంకరవిజయములోఁ జెప్పియున్నాఁడు. గాని యీమాట విశ్వాసార్హ మయినదిగాఁ గనఁబడదు. ఆదిశంకరులవారు మళయాళదేశములోని నంబుదురి బ్రాహ్మణసంతతివారగుటకు సందేహము లేదు. ఈయనతండ్రి పేరు శివగురువు; తల్లి పేరు విశిష్ట. ఇతఁడు శివునియొక్క వరప్రసాదము వలన జననమొందినట్లు శంకరవిజయములలోఁ జెప్పఁబడి యున్నది; మధ్వవిజయమును మణిమంజరిని రచియించిన నారాయణాచార్యుఁడు తనమణిమంజరిలో శంకరుఁడు వితంతు వయినతల్లికి వ్యభిచారదోషము వలన సంభవ మయ్యెననియు కులమువా రామెను జాతిబహిష్కృతనుగాఁ జేసి రనియు వ్రాయుచున్నాఁడు. ఇది మతవైషమ్యము చేతఁ గల్పింపఁబడిన కథ యైనను గావచ్చును. అయినను తనయీడు చేడియలతోఁ గూడి యొక బాలవితంతువు శివాలయమునకుఁ బోయి వారు తమకు కొడుకుల నిమ్మని మ్రొక్కుకొనుచుండఁగాఁ దానును నట్లు చేసె ననియు, ఈశ్వరుఁడు భక్తిపూర్వక మయిన యీప్రార్థన నంగీకరించి పుత్రదానము చేసె ననియు, మళయాళ దేశములో నిప్పటికిని వాడుకగా నున్నది. వ్యాసాదుల జన్మములవలెనే మహాను

భావుల జన్మము లనేకములు దేవరహస్యము లయి యున్నవి. శంక రులవారు క్రీస్తుశకము 788-వ సంవత్సరమునందు జననమొందిన ట్లిప్పు డించుమించుగా నిశ్చయింపఁబడినది. ఈతని కేడవయేట నుపనయ నము చేయ యత్నించుచుండఁగా తండ్రి లోకాంతరగతుఁ డయ్యె నఁట. తల్లియే యుపనయనాదిసంస్కారములను జేయించి కొడుకు నకు వేదవేదాంగములను జెప్పించెను. ఈయనకు వివాహము కాలేదు. ఈతఁడు చిన్నప్పటినుండియు వైరాగ్యము కలవాఁడయి సన్యాసి కాఁగోరెనుగాని తల్లి యనుమతింపకుండెను. ఒకనాఁడు తల్లియు తన యుఁడును నదికి స్నానము చేయఁబోయినప్పు డతనిని మొసలి పట్టు కొనె ననియు, ప్రాణాపాయసమయమునం దాతుఁ డాతురసన్యాసాశ్రమ స్వీకారమునకుఁ దల్లిని వేడుకొనఁగా నామె యనుజ్ఞ యిచ్చెననియు, అంతట మొసలి యతనిని విడిచిపెట్టె ననియు, తరువాత విద్యారణ్యు లని ప్రసిద్ధిగన్న మాధవాచార్యులవారు తమశంకరవిజయములో వ్రాసియున్నారు. శంకరాచార్యులవారు నర్మదానదీతీరమునందలి యొక యాశ్రమములో నుండిన గోవింద భగవత్పాదుల వారివద్ద యత్యా శ్రమమును స్వీకరించి, యాయనవలననే వేదాంతశాస్త్రమును తది తరశాస్త్రములను గ్రహించెను.

అతఁడు గురుని యాజ్ఞానుసారముగా కాశీపురమునకుఁ బోయి యచ్చట సమస్తవిద్యాప్రవీణుఁ డయి ప్రసిద్ధినొంది, యనేక శిష్య బృందమును జేర్చెను. వారిలో ప్రధానుఁడు చోళదేశమునుండి వచ్చి చేరిన పద్మపాదుఁడు. ఈయన కాశీనగరమునం దుండిన కాలము లోనే యించుమించుగాఁ దనగ్రంథముల నన్నిటిని రచియించెను. శత కములు, అష్టకములు, ద్వాదశ మంజరులు మొదలయినవానిని విడిచి పెట్టెడు పక్షమున నీతఁడు రచియించినవానిలో ముఖ్యగ్రంథములు;

వేదాంతసూత్రభాష్యము, దశోపనిషద్భాష్యము, భగవద్గీతాభాష్యము — ఈశంకరు కాశీకాపురిలో నున్న కాలములో నొకసారి బదరికాశ్రమమునకుఁ బోయివచ్చెను. శంకరాచార్యులు కాశిలోఁ గొంతకాల మద్వైతమతబోధ చేసినతరువాత ప్రయాగమునకుఁ బోయెను. అక్కడ నున్నకాలములో నతఁడు మండనమిశ్రుని ప్రఖ్యాతిని విని యతనిని జయింపవలె నన్న యుద్దేశముతో నాతని వాసస్థానమైన (మగధదేశములోని) మాహిష్మతీ పురమునకుఁ బోయి, తానోడిపోయెదుపక్షమున సన్యాసాశ్రమమువిడిచి గృహస్థాశ్రమమును గ్రహించి మండనమిశ్రునకు శిష్యుఁ డగునట్లును, మండనమిశ్రుఁ డోడిపోయెదుపక్షమున గృహస్థాశ్రమమును విడిచి సన్యాసాశ్రమమును స్వీకరించి తనకు శిష్యుఁడగునట్లును పందెము వేసికొని బహుదినము లాతనితో వాదించి యాతని నోడించెనఁట! అంత నతనిభార్యయైన భారతి తాను మండనమిశ్రుని యర్ధాంగి యగుటచేతఁ దన్నుఁగూడ గెలిచినఁగాని పూర్ణజయము కాదనిపలికి శంకరునితో వాదించి కడపట నపజయము నొందెనఁట! అప్పుడు మండనమిశ్రుఁడు సురేశ్వరాచార్యుఁ డనుపేరితో శంకరునకు శిష్యుఁ డయ్యెను

శంకరుఁ డక్కడనుండి మహారాష్ట్రదేశముగుండ దక్షిణదేశయాత్రకు బైలువెడలెను. మహారాష్ట్రదేశములో కాపాలిక మతస్థు లాతనిఁ జంపఁ బ్రయత్నించిరిగాని యీశ్వరానుగ్రహము వలన నతఁడు తప్పించుకొనెను. శంకరుఁడు ప్రాణాయామమునుబట్టి యొంటిగా సమాధినిష్ఠుఁ డయి యున్నప్పు డొక కాపాలికుఁడు చేత ఖడ్గమును బూని యాతనిని భైరవునికి బలిపెట్టవలెనని సమీపింపఁగాఁ బద్మపాదుఁడు చూచి పరుగెత్తి వానిచేతిఖడ్గము నూడఁబెరికి దానితో వానితలను నఱికి గురువును రక్షించెనఁట! అతఁ డక్కడనుండి

తుంగభద్రాతీరమునకుఁ బోయి, రొక దేవాలయమును గట్టించి యందు శారదను బ్రతిష్ఠించి, యందొక మఠమును గట్టించి యాశృంగగిరిమఠములో సురేశ్వరాచార్యు లని పేరొందిన మండనమిశ్రుని నిలిపెను. మహారాష్ట్ర దేశయాత్రలో హస్తామలకుఁ డనఁబడెడి యానందగిరి శంకరాచార్యులకు శిష్యుఁ డయ్యెను.

శంకరాచార్యుఁడు తనశిష్యుల నెల్ల శృంగగిరియందు వదలి మాతృదర్శనార్థుఁడయి స్వగ్రామమునకుఁ బోయెను అతఁ డక్కడ నున్న సమయమునం దామె మరణ మొందుట తటస్థించెను. అప్పుడా యగ్రహారములో నున్న నంబూరిబ్రాహ్మణులు శవదహనాదికార్యములం దతనికి తోడుపడక పోవుటయే కాక స్మశానవాటికయందు దహనసంస్కారముకూడ చేయనీయక పోయిరి. అంతమాత్రముచేత శంకరుఁడు నిరుత్సాహి గాక, స్థూలకాయ యయిన తల్లి శవమును ముక్కలుగాఁ గోసి తనయింటి దొడ్డిలోనికిఁ గొనిపోయి యచ్చటనే యొకమూల దహనము చేసెను. మహానుభావు లనేకులు తమ జీవితకాలములో స్వదేశమున గౌరవింపఁబడక పోవుటకు దీని నొకదృష్టాంతముగాఁ జెప్పవచ్చును.

అతఁ డక్కడనుండి మరల శృంగగిరి కరిగి శిష్యవర్గమును వెంటఁ గొని పాదచారి యయి స్వమతసిద్ధాంతముల నెల్లయెడల బోధించుచు పూర్వసముద్రతీరప్రాంతము పొడుగునను యాత్రచేసెను. ఆకాలమునందు పాండ్య, చోళమండలములయందు వ్యాపించి యుండిన శాక్తేయులు గాణపతులు కాపాలికులు మొదలయినవారిమతములలోఁ గల క్రూరాచారములను వేదబాహ్యములని ఖండించుచు దుర్నీతిని తొలగింపఁ బాటుపడుచు మధుర మీనాక్షియొక్కయు కంచి కామాక్షియొక్కయు దేవాలయములలో నడచెడు దుష్టవామాచార

ములను మాన్పి జగన్నాథమని సాధారణముగాఁ జెప్పఁబడెడు పురుషోత్తమపట్టణమువఱకును బోయి యచ్చట గోవర్ధనమఠమును స్థాపించెను. తరువాత నతఁడు మరల నుత్తరహిందూస్థానమునకు బైలుదేఱి కాశికాపురద్వారమున నుజ్జయినికిఁ బోయి, యచ్చట నుండి ఘూర్జరదేశములోని ద్వారకకరిగి యచట శారదామఠమును స్థాపించి మరల నుత్తరమునకుఁ దిరిగి కాశ్మీరమువఱకును పోయి యచట బదరికాశ్రమమునందు బదరీనారాయణాలయమును గట్టించి వ్యాసమఠమును స్థాపించి, అస్సాములోని కామరూప (గౌహతి) మున శాక్తేయమతాచార్యుఁడైన యభినవగుప్తునితో వాదముచేసి యాతనినోడించి, యచ్చోటువిడిచి కేదారమునుజేరి కేదారనాథుని సేవించి యచటనే యతఁడు 828-వ సంవత్సరమునందు సిద్ధినొందెను. కైవల్యము పొందునప్పటికి ముప్పదిరెండు సంవత్సరముల ప్రాయమని పలువురు చెప్పియున్నను ముప్పదియెనిమిదేండ్లని యొకరు వ్రాసి యున్నారు. ఆయన సిద్ధిఁబొందిన సంవత్సర మిదియే యైనపక్షమున నలువది సంవత్సరములు జీవించి యుండవలెను. ఆయన క్రీస్తుశకము 798వ సంవత్సరమునఁ బుట్టి 830వ సంవత్సరమునందు శివసాయుజ్యము నొందెనని యింకొకరు వ్రాయుచున్నారు. తనకు సంభవించిన పరాభవమును సహింపఁజాలక పగతీర్చుకొనుటకయి యభినవగుప్తుఁడు శంకరాచార్యులపై క్షుద్రదేవతాప్రయోగము చేసెననియు, అందు చేత శంకరుని శరీరమునిండ పొక్కులులేచినను దానినెఱిఁగి పద్మపాదుఁ డాప్రయోగమును మరలించి ప్రతిక్రియ చేసినందున స్వస్థత కలిగెననియు, అటుతరువాత నతఁడు శీఘ్రకాలములోనే సిద్ధినొందె ననియు, వ్రాసి యున్నారు.

అద్వైతులు బ్రహ్మము, అవిద్య యను రెండుపదార్థములు కలవన్నను, తన్మతమున బ్రహ్మ మొక్కటియే సత్యపదార్థము. అద్వైతమును స్మార్తమత మనియు వాడుదురు. బ్రహ్మము సత్యజ్ఞానానందాత్మకము, నిర్వికారము, నిరవయవము, నిర్దోషము, విభువు. సత్యమనఁగా కాలత్రయముచే బాధింపఁబడఁదగినదిగాక నిత్యమైనది; జ్ఞానాత్మక మనఁగా తెలివి (జ్ఞానము) తో నిండినది; ఆనందాత్మక మనఁగా సంతోషస్వరూప మయినది; నిర్వికార మనఁగా మార్పులు చెందినది; నిరవయవ మనఁగా భాగములు లేక యఖండమయినది; నిర్దోష మనఁగా లోపములు లేక పరిశుద్ధమయినది; విభు వనఁగా సర్వత్ర వ్యాపించి యుండునది.

అవిద్య అపారమార్థికము, సదసద్విలక్షణము, జడము, సవికారము, సావయవము, అనాది, సాంతము. అపారమార్థిక మనఁగా మిథ్యాభూత మయినది, సదసద్విలక్షణ మనఁగా సత్తయిన బ్రహ్మము కంటెను, అసత్తయినగగనకుసుమాదికము కంటెను, వేఱయినది; జడ మనఁగా జ్ఞానశూన్యమయినది; సవికార మనఁగా రూపాంతరములు చెందునది; సావయవ మనఁగా అవయవసహిత మయినది; అనాదియనఁగా మొదలులేనిది; సాంత మనఁగా (బ్రహ్మజ్ఞానము కలిగినతోడనే) నశించునది. అద్వైతమతమునందు సత్యము పారమార్థిక మనియు, వ్యావహారిక మనియు, ప్రాతిభాసిక మనియు, త్రివిధము. త్రికాల బాధితముగాక యెప్పుడు నుండునది పారమార్థికము; వ్యవహారమునందు మాత్ర ముండి బ్రహ్మజ్ఞానముచేత నివర్తించునది వ్యావహారికము; త్రాటిని పామనుకొనునట్లు భ్రాంతి నివారణ మగునంతకును మాత్రము సత్యముగా తోఁచునది ప్రాతిభాసికము. అవిద్య పారమార్థమునందుఁ గాక వ్యావహారమునందు మాత్రమే సత్యమైనది.

ఈ యవిద్య సత్త్వరజస్తమోరూపగుణత్రయాత్మక మయినది. మాయ యనఁబడెడి యీయవిద్యకు ఆచ్ఛాదకశక్తి, విక్షేపకశక్తి, అను రెండు శక్తులు గలవు. చీఁకటిచే నావరింపఁబడిన మనుష్యున కెట్లు స్వరూపాజ్ఞానము చెడునో యట్లే యవిద్యయొక్క యాచ్ఛాదకశక్తిచే నావరింపఁబడిన బ్రహ్మమునకు స్వస్వరూపాజ్ఞానము చెడును; అప్పుడు దాని విక్షేపకశక్తి చేత బ్రహ్మమునకు దేవమనుష్యతిర్యగ్జడాది భేదజ్ఞానముకలుగును. ఈభేదభావములన్నియు బ్రహ్మమున కవిద్య వలనఁ గలుగునవికాని పారమార్థికములుకావు.

శుద్ధచైతన్యము, మాయావచ్ఛిన్నచైతన్యము, అంతఃకరణావచ్ఛిన్నచైతన్యము, వృత్త్యవచ్ఛిన్నచైతన్యము, విషయావచ్ఛిన్నచైతన్యము అనిబ్రహ్మరూపమయిన చైతన్యము పంచభేదములు కలదిగా నున్నది. శుద్ధచైతన్యముబ్రహ్మము; మాయావచ్ఛిన్నచైతన్యము ఈశ్వరుఁడు; అంతఃకరణావచ్ఛిన్నచైతన్యము జీవుఁడు; వృత్త్యవచ్ఛిన్నచైతన్యము జ్ఞానము; విషయావచ్ఛిన్న చైతన్యము ఘటపటాదికము. బ్రహ్మమునకు కడపటి నాలుగుభేదములును అవిద్యాదు లయిన యుపాధులచేతఁ గలుగుచున్నవి.

మాయావచ్ఛిన్నచైతన్య మయినయీశ్వరుఁడే జగత్సృష్ట్యాది కర్తయు సర్వాంతర్యామియు నయిన సగుణబ్రహ్మము. ఇతఁడు ప్రాణిజాలముయొక్క తారతమ్యమునకుఁ గారణము లయినకర్మములు తనకు సహాయపడఁగా, అపరిమితశక్తియుక్త మయినమాయను వశపఱచుకొని, నామరూపాత్మక మయిన సమస్తప్రపంచమును సృజింపఁ దలఁచుకొని పంచీకృతములుకాని యాకాశాది పంచభూతములను మొట్టమొదటఁబుట్టించెను. వానిలో నాకాశమునకు శబ్దమును, వాయువునకు శబ్దస్పర్శములును, తేజస్సునకు శబ్దస్పర్శరూప

ములును, అప్పునకు శబ్దస్పర్శరూపరసములును, పృథివికి శబ్దస్పర్శ రూపరసగంధములును, గుణములు. పృథివ్యాప స్తేజో వాయు రాకాశము లనెడి యీపంచభూతములను గుణత్రయాత్మక మయిన యవిద్యయొక్క కార్యములగుటచేత నివియు గుణత్రయాత్మకములే.

సత్వగుణయుక్తము లయిన యీపంచభూతములచేత త్వక్చ క్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణము లనఁబడెడి జ్ఞానేంద్రియపంచకమును, మనోబుద్ధ్యహంకారచిత్తము లనెడి యంతఃకరణచతుష్టయమును, కలుగుచున్నవి. రజోగుణయుక్తము లయిన యీ పంచభూతముల చేతను వాక్పాణి పాదపాయూపస్థము లనఁబడెడు కర్మేంద్రియ పంచకమును, ప్రాణాపాన వ్యానోదాన సమానము లనఁబడెడు పంచప్రాణములును, కలుగుచున్నవి. ఈపంచభూతముల చేతను జ్ఞానేంద్రియ కర్మేంద్రియముల చేతను పంచప్రాణ మనో బుద్ధులచేతను లింగశరీర మనఁబడెడి సూక్ష్మశరీరము పుట్టి, పర లోకయాత్ర కనుకూల మయి మోక్షపర్యంతము నుండును. తమో గుణయుక్తము లయిన యీపంచభూతముల చేతను పంచీకృతభూత ములును, వానిచేత బ్రహ్మాండములును, చతుర్దశభువనములును, జరాయుజాండజస్వేదజోద్భిజ్జములును, కలుగుచున్నవి.

పంచీకరణ మనఁగా నాకాశాది పంచభూతములను ప్రత్యే కముగా రెండేసిసమభాగములుగా భాగించి, అం దొక్కొక్క యర్ధ భాగమును మరల వేఱువేఱుగా నాలుగేసి సమాంశములుగా విభాగించి ఒక్కొక్కదాని యర్ధభాగముతో మిగిలినవానియొక్క యర్ధభాగ ములలోని యొక్కొక్క చతుర్థాంశము ననఁగా నష్టమాంశమును శేర్చుచు వచ్చినయెడల పంచీకృతభూతము లేర్పడును. ఆకాశము యొక్క యర్ధభాగముతో పృథివ్యాపస్తేజోవాయువులయొక్క

యొక్కొక్క యష్టమాంశమును జేర్చినచో పంచీకృతాకాశ మగును; వాయువుయొక్క యర్ధభాగముతో పృథివ్యాపస్తేజో కాశముల యొక్క యొక్కొక్కయష్టమాంశమును జేర్చినచో పంచీకృతవాయు వగును; తేజస్సుయొక్క యర్ధభాగముతో పృథివ్యాపోవాయురాకా శములయొక్క యొక్కొక్క యష్టమాంశమును జేర్చినచో పంచీ కృతతేజ స్సగును; ఆపస్సుయొక్క యర్ధభాగముతో పృథివీతేజో వాయురాకాశముల యొక్క యొక్కొక్క యష్టమాంశమును జేర్చి నచో పంచీకృతాపస్సగును; పృథివియొక్క యర్ధభాగముతో ఆప స్తేజో వాయురాకాశములయొక్క యొక్కొక్క యష్టమాంశమును జేర్చినచో పంచీకృతపృథివి యగును. జరాయుజము లనఁగా జరా యువు (మావి) వలనఁబుట్టుమనుష్యాదులు; అండజము లనఁగా నండము (గుడ్డు) వలనఁ బుట్టు పక్షిసర్పాదులు; స్వేదజము లనఁగా స్వేదము (చెమట) వలనఁ బుట్టు మత్కుణ యూకాదులు; ఉద్భిజ్జము లనఁగా భూమిని పెకల్చుకొని పుట్టు వృక్షలతాదులు.

ఆకాశస్థుఁడైన సూర్యుఁడు ఘటకటాకాదులయందుఁ బ్రతి బింబించునట్లుగానే తేజోమయ మయినబ్రహ్మ మవిద్యాపరిణామము లయిన యంతఃకరణములయందుఁ బ్రతిఫలింప నేర్పడునదియే యంతః కరణావచ్ఛిన్న చైతన్య మయిన జీవుఁడు. శుద్ధచైతన్య మయిన బ్రహ్మము బింబము; అంతఃకరణమునందు తోఁచునట్టి చైతన్యము లగుజీవులు ప్రతిబింబములు. సూర్యబింబమునకును జలఘటాదులయందు తోఁచు ప్రతిబింబములకును భేదము లేనట్లే, బ్రహ్మము నకును జీవునకును భేదము లేదు; అనఁగా బ్రహ్మచైతన్యమునకును ప్రతిబింబితజీవచైత న్యమునకును అంతఃకరణరూప మయిన యుపాధిభేదమే కాని స్వరూప భేదము లేదు. అంతఃకరణపరిణామరూపము లయిన వృత్తులయందు

ప్రతిఫలించు చైతన్య మగు జ్ఞానము ప్రత్యక్షానుమానశబ్దాది భేదములచే ననేకవిధములయినదిగా నుండును. అద్వైతులు నేకప్రమాణ మ్యాము నంగీకరించి, వేదవచనముల చేతమాత్రమే బ్రహ్మము తెలియఁగనగు నని చెప్పెదరు; వారికి శ్రుతిస్మృతిపురాణేతిహాసములన్నియుఁ బ్రమాణ ములే యయినను, ప్రస్థానత్రయ మనఁబడెడి యుపనిషత్తులును బ్రహ్మ సూత్రములును భగవద్గీతలును ముఖ్యప్రమాణములు.

ప్రపంచమునకు మూల ప్రకృతి ఘటమునకు మన్నువలె పరి ణామ్యుపాదానకారణము; బ్రహ్మము సర్ప మను భ్రాంతికి రజ్జువువలె వివర్తోపాదానకారణము. పరిణామి యనఁగా నొకరూపము నుండి వేఱొకరూపమును బొందునది. ప్రపంచరూపము లయిన కార్యముల నాశనము ప్రళయ మనఁబడును. అది నిత్యప్రళయము, నైమిత్తిక ప్రళయము, ప్రాకృతప్రళయము, ఆత్యంతిక ప్రళయము, అని నాలుగు విధములు గలది. అందులో నిత్యప్రళయము సుషుప్తి (నిద్ర) నైమి త్తికప్రళయము చతుర్ముఖబ్రహ్మయొక్క దినప్రళయము; ప్రాకృత ప్రళయము చతుర్ముఖ బ్రహ్మతోడ సర్వజగన్నాశనము; ఆత్యంతిక ప్రళయము బ్రహ్మసాక్షాత్కారముచేత నవిద్యారూప కారణసహిత ముగా లోకనివృత్తి. బ్రహ్మసాక్షాత్కార మనఁగాఁ దనకును బ్రహ్మ మునకును నైక్యప్రత్యక్షము. ఈయైక్య ప్రత్యక్షముచేత నానందమయ మగుస్వరూపప్రాప్తి కలుగును. బ్రహ్మజ్ఞానమువలనఁ బాపక్షయము కలుగఁగాఁ గైవల్యప్రాప్తి యగును.

బ్రహ్మైక్య జ్ఞానమునకు నిత్యానిత్యవస్తువివేకము, విషయఫల వైరాగ్యము, శమాదిషట్కము, ముముక్షుత్వము, అను నాలుగును సాధనములు. ఈనాలుగును సాధనచతుష్టయ మనఁబడును. బాహ్యాం తరదృశ్య మయినప్రపంచ మెల్ల ననిత్యమనియు, రూప నామ రహితమై

సర్వవిలక్షణమయి వెలుఁగుబ్రహ్మము నిత్యమనియు, ఎఱుఁగుట నిత్యానిత్యవస్తువివేకము. ఈవివేకము శ్రవణ మనన నిదిధ్యాసనములతోఁగూడిన వేదాంతవాక్యములచేతఁ గలుగుచున్నది. శ్రవణ మనఁగా నాచార్యునివలన న్యాయయుక్తము లయినయర్థములను వినుట; మనన మనఁగా విన్నయర్థములయందు విరోధశంకలు కలుగఁగా వానిని పోఁగొట్టుకొనెడు మానసికవిచారము; నిదిధ్యాసన మనఁగా ననాదివాసనచేత విషయములయందు ప్రవర్తించి యుండు మనస్సును విషయములనుండి మరలించి యాత్మయందు నిశ్చలముగా నిలుపుట. విషయఫలవైరాగ్య మనఁగా నిహలోక పరలోకసుఖముల యందపేక్ష లేకుండుట. శమము, దమము, ఉపరతి, తితిక్ష, సమాధానము, శ్రద్ధ — ఈయాఱును శమాదిషట్కము. శమ మనఁగా నంతరింద్రియనిగ్రహము; దమ మనఁగా బహిరింద్రియనిగ్రహము; ఉపరతి యనఁగా చిత్తమును చలింపనీక నిలుపుట; తితిక్ష యనఁగా ద్వంద్వము లేవి వచ్చినను దననిష్ఠను వదలక ఖేదమోదములను సహించి యుండుట; సమాధాన మనఁగా మనస్సు నేకాగ్రముగా నొకచోటనే నిలుపుట; శ్రద్ధ యనఁగా నాచార్యునియందును శాస్త్రములయందును విశ్వాస ముంచుట; ముముక్షుత్వ మనఁగా మోక్షము నం దిచ్ఛ.

ఈయివిధముగా నిర్గుణబ్రహ్మమును సాక్షాత్కరింపఁ జేసికో లేనివారు సగుణబ్రహ్మోపాసనము చేయవలయును. అట్టివారికి సగుణ బ్రహ్మోపాసనముచేత మనస్సు స్వాధీనపడఁగానే నిర్గుణబ్రహ్మము తానే తోఁచును. సగుణబ్రహ్మోపాసకు లర్చిరాదిమార్గమున బ్రహ్మలోకము నొంది, శ్రవణాదులచే బ్రహ్మసాక్షాత్కారమును బడసి, మోక్షము నొందుదురు. కర్మనిష్ఠులు ధూమాదిమార్గమున పితృలోక

మును జేరి, అక్కడ సుఖ మనుభవించి, పుణ్యాపాపానురూపముగా మరల మనుష్యాదిజన్మముల నెత్తుదురు. పాపకర్మముల నొనరించు వారు రౌరవాదినరకముల కేగి బాధ లనుభవించి, తిర్యగ్జడజన్మము లెత్తి నశింతురు. నిర్గుణబ్రహ్మోపాసకులు ప్రారబ్ధకర్మములను మాత్ర మనుభవించి, మిగిలినపుణ్యకర్మలను మిత్రులయందును పాపకర్మలను శత్రులయందును బెట్టి కైవల్యమును బొంది నిరతిశయానందము ననుభవింతురు.

---

## విశిష్టాద్వైతమతసంగ్రహము.

విశిష్టాద్వైతము మనదేశమునందు వ్యాపించి యున్నత్రిమతములలో రెండవది. ఇది శైవవిశిష్టాద్వైతము, వైష్ణవవిశిష్టాద్వైతము, అని ద్వివిధము. ఈయుభయమతావలంబులలో నొకరు శివుఁడు దేవుఁడనియు, ఇంకొకరు విష్ణుఁడు దేవుఁ డనియు, నామభేదమును జెప్పుటయేకాని వీరిసిద్ధాంతములలో భేదము లేదు. బ్రహ్మసూత్రములకు నీలకంఠభాష్య మనుపేరఁ బరఁగు భాష్య మొనర్చిన శ్రీకంఠశివాచార్యుఁడు శైవవిశిష్టాద్వైతమతస్థాపకుఁడు. బ్రహ్మసూత్రములకు శ్రీభాష్య మనుపేరఁ బరఁగుభాష్య మొనర్చిన రామానుజాచార్యుఁడు వైష్ణవవిశిష్టాద్వైతమతస్థాపకుఁడు. ఇప్పుడిందు వైష్ణవవిశిష్టాద్వైతమును గూర్చి తెలుపఁబడును. రామానుజాచార్యుఁడు చెన్నపట్టణమునకు పడమట నలుబదిమైళ్ళదూరములోనున్న శ్రీపెరంబూదూ రనుగ్రామమునందు యజుర్వేదియు స్మార్తుఁడు నైన కేశవసోమయాజికిని కాంతిమతీదేవికిని కలియుగాబ్దములు 4118 కి సరియైన క్రీస్తుశకము 1017 వ సంవత్సర పింగళనామ సంవత్సర చైత్రమాసమునందు జనన మొందెను.

ఇతఁడు తన పదునేనవ సంవత్సరమునందు తండ్రి పోవుపఱకును స్వగ్రామమునందే తండ్రివద్ద వేదవేదాంగములను చదువుకొని యనంతరమున విద్యాభ్యాసమునిమిత్తము కాంచీనగరమునకుఁ బోయి యాదవప్రకాశమిశ్రుఁ డను సన్యాసియొద్ద శాస్త్రములను జదువుకొనెను. యాదవప్రకాశుఁ డద్వైతియే యయినను శంకరాచార్యమతముతో నేకీభవింపక బ్రహ్మసూత్రములకు భాష్యాంతరమును జేసెను. శ్రీరామానుజాచార్యుఁడు తనగురువుయొక్క యభిప్రాయముతో నేకీభవింపక యాతని విడిచిపెట్టి, శ్రీరంగములో యామునాచార్యుఁ డను యతి విశిష్టాద్వైతమును బోధించుచున్నాఁ డని విని యాతనియొద్దఁ జదువుకొనుటకయి వెళ్ళెనుగాని యతఁడు శ్రీరంగమును జేరులోపలనే యామునాచార్యుఁడు పరమపదమును బొందినందునఁ దచ్ఛిష్యులలో సమర్థతముఁ డైన మహాపూర్ణాచార్యుని (పెరియనంబి) యొద్ద మధురాంతకములో వైష్ణవము పుచ్చుకొనెను. అంతట గురువును శిష్యుఁడును గలిసి కంచికిఁ బోయిరి. కాంచీనగరము నందు శ్రీరామానుజాచార్యుఁడు తనగురువువద్ద వశిష్టాద్వైతసిద్ధాంతములను నేర్చుకొనెను. రామానుజాచార్యుఁడు గృహస్థాశ్రమమును స్వీకరించినవాఁడే యయినను తన పదునెనిమిదవయేట భార్యను సంసారమును విడిచి కాంచీనగరమునందు త్రిదండిసన్యాసి యయ్యెను. శ్రీరామానుజుఁడు శేషుని యవతార మనియు, నూటయిరువది సంవత్సరములుజీవించి కలియుగాబ్దములు 4238 కి సరియైన 1137వ హూణాబ్దమునందు శ్రీరంగములో మృతినొందె ననియుఁ జెప్పుచున్నారు. సన్యాసి యైనతర్వాత రామానుజుఁడు స్వమతమును శిష్యులకు బోధించుచుఁ గొంతకాలము కాంచీనగరములో నుండి యక్కడినుండి తిరుపతికిఁ బోయి వేంకటేశ్వరుని సాలయములో వేదాంతప్రసంగము లనేకములు చేసి, తరువాత

దక్షిణహిందూస్థానమునందుఁ గల వైష్ణవదివ్యక్షేత్రముల నెల్ల సేవించి, కడపట శ్రీరంగమునకుఁ బోయి యచ్చట స్వమతసిద్ధాంతములను బోధించుచుండఁగా చోళదేశాధీశుఁ డయిన క్రిమికంఠ చోళుఁ డాతనిని బాధించినందున నతఁ డచ్చటనుండి శిష్యసహితముగా మైసూరిరాజ్యములోని ద్వారసముద్రమునకుఁ బారిపోవలసినవాఁ డయ్యెను. ఆదేశమును జైనమతస్థుఁ డైన బల్లాలుఁడు పాలించుచుండెను. జైనులతో జరిగిన వాదములలో రామానుజుఁడు జైనుల నోడించినందున, బల్లాలరాజు వైష్ణవమతము నవలంబించి విష్ణువర్ధనుఁ డను నామాంతరమును వహించెను. అనంతరము రామానుజుఁడు రాజుయొక్క సాహాయ్యముచేత తిరునారాయణపురము (మేలుకోట) నం దొక దేవాలయమును గట్టించి యందు నారాయణునిఁ బ్రతిష్ఠించి, చుట్టుపట్ల వైష్ణవాగ్రహారముల నేర్పఱిచెను. ఆతఁ డక్కడ పండ్రెండు సంవత్సరములుండి శ్రీకంఠచోళుఁడు స్వర్గస్థుఁ డగుట విని నిర్భయముగా మరల శ్రీరంగమునకుఁ బోయి, యక్కడ శ్రీరంగనాథునిపూజ వ్యాపింపఁ జేసెను. అటుపిమ్మట నతఁడు తిరుపతి, అహోబిలము మొదలగు దివ్యస్థలముల మీఁదుగా త్రోవపొడుగునను వైష్ణవమతబోధ చేయుచు మహారాష్ట్రదేశము చొచ్చి, యందుండి ద్వారకమీఁదుగా శిష్యబృందముతోడఁ గూడఁ బోయి ప్రయాగ, కాశి, మథుర, హరిద్వారము మొదలయినక్షేత్రములను సందర్శించి, హిమాలయపర్వతములలో నున్న బదరికాశ్రమమునకుఁ బోయి బదరీనాథుని సేవించి, అక్కడనుండి కాశ్మీరదేశములోని శ్రీనగరమున కరిగి యచ్చటి శారదాపీఠమునకుఁ దాను రచియించిన శ్రీభాష్యాదిపుస్తకములను సమర్పించెను. అక్కడిపండితులెంతో చర్చచేసి తుద కాపుస్తకములను శారదాపీఠపుస్తకనిలయమునం దుంచుట కంగీకరించిరి. అప్పటి

నందిచెను రామానుజులవారు శ్రీభాష్యకారు లనునామముతోఁ ప్రసిద్ధులయిరి. అతఁడు శారదాపీఠమును వీడ్కొని కురుక్షేత్రము, అయోధ్య, గయ మొదలగుప్రదేశములకుఁ బోయి చూచి, వంగదేశములో గంగాసాగరసమీపమునం దున్న కపిలాశ్రమమును జేరి, అక్కడనుండి దక్షిణమునకు మరలి జగన్నాథముపోయి, ఆంధ్రదేశముమీఁదుగా శ్రీరంగమునఁ బ్రవేశించెను. అతఁ డింకొకపర్యాయము కూడ భరతఖండమంతయు స్వమతబోధ చేయుచు సంచారము చేసి, అనేకుల నెల్లచోట్లను స్వమతావలంబులనుగాఁ జేసి, క్రమ్మఱ శ్రీరంగము చేరి యచ్చటనే వైకుంఠప్రాప్తి నొందెను. శ్రీనగరమునందలి శారదాపీఠమున కియ్యఁబడిన పుస్తకములు వ్యాసుని బ్రహ్మసూత్రములకుఁ జేయఁబడిన శ్రీభాష్యము, వేదార్థసంగ్రహము, గీతాభాష్యము అనుమూడు. ఇవిగాక వేదాంతదీపము, వేదాంతసారము, గద్యత్రయము, నిత్యగ్రంథము; అను మఱి నాలుగు గ్రంథములు కూడ రామానుజునిచేత రచియింపఁబడినవి. ఇతఁడు బోధచేసి వేలకొలఁది జనులను స్వమతమునఁ గలుపుకొనుటయేకాక విశిష్టాద్వైతమును బోధించుట కయి గృహస్థు లయినయాచార్యపురుషులను డెబ్బదినలువుర నేర్పాటుచేసెను. అంతేకాని యితఁడు శంకరాచార్యునివలెను, మధ్వాచార్యునివలెను మఠములను స్థాపింపలేదు.

ఈమతమునందు చిత్తు, అచిత్తు, ఈశ్వరుఁడు, అని పదార్థములుమూడు. శైవవిశిష్టాద్వైతు లీమూటిని వరుసగా పశువు, పాశము పతి, అనుపేరులతో వ్యవహరింతురు. చిత్తనఁగా జీవాత్మ. అది జ్ఞానేంద్రియ మనోబుద్ధివిలక్షణ మయి, అజడ మయి, ఆనందరూప మయి నిత్యమయి, అణువయి, నిరవయవమయి, నిర్వికారమయి, నానాశ్రమ మయి, ఈశ్వరునికి లోఁబడిన దయియుండును. జీవాత్ముఁడు బద్ధుఁడు,

ముక్తుఁడు, నిత్యుఁడు, అని మూఁడు భేదములను కలిగి యుండును. బద్ధుఁ డనఁగా జనన మరణాదిరూపసంసారము ననుభవించెడు మన వంటి జీవుఁడు; ముక్తుఁడనఁగా భగవద్భక్తిచే సంసారము విడిచి మోక్షము నొందినజీవుఁడు; నిత్యుఁ డనఁగా నెప్పుడును సంసారబంధమే లేని యనంతగరుడ విష్వక్సేనాదులవంటి జీవుఁడు. ఈ ముత్తెఱఁగు లయిన యాత్మలును వేని కవి వేఱు. అచిత్తనఁగా జ్ఞానశూన్య మయి వికారాస్పద మయి యుండునది. ఈయచిత్సంబంధము చేతనే బద్ధాత్మక విద్యాకర్మవాసనారుచులు కలుగుచున్నవి. శుద్ధసత్వము, మిశ్ర సత్త్వము, సత్త్వశూన్యము, అని యచిత్తు మూఁడు విధములు గల దందురు. శుద్ధసత్వ మనఁగా రజస్తత్వగుణములు లేక కేవలసత్వ గుణము కలదయి, భగవదిచ్ఛచే గోపురప్రాకారరూపముగా నుండు నది; మిశ్రసత్త్వ మనఁగా సత్త్వరజ స్తమోగుణము లను మూఁటిని గలది; సత్వశూన్య మనఁగా కాలము. ఇందలి మిశ్రసత్త్వము బద్ధు లను జ్ఞానానందములచేఁ గప్పుచు విపరీతజ్ఞానమును బుట్టించుచు నిత్య మయి మహదాదివికారములను బుట్టించునది యయి యీశ్వరు నకు క్రీడాసాధన మయి యున్నది. అచిత్తునకు ప్రకృతి, అవిద్య, మాయ, అనునవి నామాంతరములు. ఈశ్వరుఁడు నిఖిలహేయగుణ ప్రత్యనీకుఁ డయి, అనంతుఁ డయి, జ్ఞానానందస్వరూపుఁ డయి, కళ్యాణ గుణ పరిపూర్ణుఁ డయి, సర్వజగత్సృష్టిస్థితిలయకర్త యయి, నిత్యుఁ డయి, సత్యజ్ఞానస్వరూపుఁ డయి, విభువయి, సర్వజ్ఞుఁడయి, సర్వ శక్తుఁ డయి, జగత్తున కుపాదాననిమిత్త సహకారికారణుఁ డయి, యున్నాఁడు.

అహంకార మమకారము లవిద్య యనియు, పుణ్యపాపములు కర్మ యనియు, కర్మలచేతఁ గలిగెడు సంస్కారము వాసనయనియుఁ

విషయములయం దాసక్తి రుచియు నైయు, చెప్పఁబడును. హేయగుణ ప్రత్యనీకుఁ డనఁగా వికారాది దోషగుణములకు విరోధిగా నుండు వాఁడు. విభు వనఁగా సర్వవ్యాపి. ఉపాదానకారణ మనఁగా కుండలకు మన్నును నగలకు బంగారము నయినట్లు మూలాధార మయినది; నిమిత్తకారణ మనఁగా కుండలకు కుమ్మరివాఁడును నగలకు కంసలి వాఁడును నయినట్లు హేతు వయినది; సహకారికారణ మనఁగా కాలము.

విశిష్టాద్వైతమతమునందు బ్రహ్మ మొక్కటియే సత్య మయిన తత్త్వము. బ్రహ్మ మెప్పుడును చిదచిత్తులతోఁ గూడియుండును. అతఁ డాస్థితియందుమాత్రమే తెలియఁ దగినవాఁ డయినను, చిత్తుకంటెను అచిత్తుకంటెను భిన్నుఁ డయి జ్ఞానాత్మకుఁ డయి యున్నాఁడు. చిత్తును, అచిత్తును, కూడ సత్యములే. బ్రహ్మమునకును చిదచిత్తులకును శేష శేషీభావము కలదు. శేషశేషీభావ మనఁగా బ్రహ్మ స్వతంత్రుఁ డనియు, చిత్తును అచిత్తును బ్రహ్మమునకు లోఁబడిన వనియు, తాత్పర్యము. చిత్తును, అచిత్తును, బ్రహ్మమును మూఁడును నొండొంటిని విడువక యవినాభావ సంబంధము కలిగియున్న వగుటచేత చిదచిత్తులు శరీరమువంటి వనియు, బ్రహ్మము శరీరివంటి దనియుఁ జెప్పుచున్నారు. మనశరీరమున కాత్మ యెట్లో యట్లే యజడము లైన జీవాత్మలకును జడమయిన ప్రపంచమునకును గూడ నాత్మ యగుటచేత బ్రహ్మము పరమాత్మ యనఁబడును. విశిష్టాద్వైత మనుసమాసము విశిష్టము, అద్వైతము, అను రెండువ్యస్తపదములచేత నైనది. విశిష్ట మనఁగా కూడినది యని యర్థము; అద్వైత మనఁగా రెండవది లేనిది యని యర్థము. పరబ్రహ్మము చిదచిద్విశిష్ట మయిన యద్వితీయ పదార్థ

మని బోధించునది యగుటచేత నీమతమునకు విశిష్టాద్వైతమ‌ని పేరు కలిగినది.

ఉపనిషత్తులలోఁ గొన్నిచోట్ల బ్రహ్మ మొక్కటియే సత్య మను వాక్యములును కొన్నిచోట్ల చిదచిదీశ్వరులు మూఁడును సత్యము లను వాక్యములును, కొన్నిచోట్ల చిదచిత్తులు పరబ్రహ్మమునకు శరీరమను వాక్యములును, కనఁబడుచున్నందున నీశ్వరునకు విశేష ణము లనఁగా గుణములని చెప్పినంగాని పరస్పర విరుద్ధములుగా కనఁ బడెడి యన్ని వాక్యములను సమన్వయింపఁ జేసి సమర్థించుట సాధ్యము కాదని రామానుజాచార్యులు చెప్పుచున్నారు. అట్లయినచో నీశ్వ రుఁడు నిర్గుణుఁడని చెప్పెడి వాక్యములగతి యేమి కావలె నని శంక తెచ్చుకొని గుణములులేక పదార్థముండుట సంభవింప నేరదు గనుకను, బ్రహ్మము సత్పదార్థ మగుటచేత గుణములుండి తీఱవలయును గను కను, నిర్గుణుఁ డనుట కర్థము ప్రకృతికిఁ గలగుణము లనఁగా హేయ గుణములు లేనివాఁడని చెప్పిరి. సత్త్వరజస్తమస్సులు మూఁడును ప్రకృతి గుణములు; బ్రహ్మమున కీగుణములు లేవు. ఈశ్వరుఁడు రూపమును బొందునని విశిష్టాద్వైతమతము; అతఁ డరూపుఁ డనియు నిరాకారుఁ డనియు వేదములలో నున్నది. ఈశ్వరుఁడు స్వభావము చేత నిరాకారుఁడే యైనను, సర్వశక్తుఁడగుటచేత లోకరక్షణార్థము తనయిచ్ఛ వచ్చినరూపములను పొందునని రామానుజుఁడు సాధించు చున్నాఁడు. తన్మతానుసారముగా నీశ్వరుఁడు పొందెడు శుద్ధసత్వ స్వరూపము లయిదు—౧. శంఖచక్రగదాదులనుధరించి వైకుంఠము నందు సర్వదా యుండెడుపరవిగ్రహము; ౨. ఉపాసకులైన దేవతలచే సేవింపఁబడుచు, ఆమోద భువనప్రమోదములనెడు విష్ణులోకము లలో సంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధనామములతో నుండు వ్యూహా

విగ్రహము; 3. రామకృష్ణాద్యవతారరూపముల నుండెడు విభవవిగ్రహము; 4. మంత్రాది ప్రభావముచేత ప్రతిమలలోఁ బ్రవేశించెడి యర్చావిగ్రహము; 5. ధ్యానముచేసెడి భక్తులకు గోచరమయ్యెడి యంతర్యామి విగ్రహము. ఈరూపములలో నేరూపమున నున్నను లక్ష్మికూడ ననపాయినియై విష్ణువుతో నుండును. నిరాకారమయిన బ్రహ్మమునందు గుఱియుంచుట సాధ్యము కాకపోవుటచేత యోగుల ధ్యానమున కనుకూలపడుట కయి యీశ్వరుఁ డీరూపములను బొందు చున్నాఁడు.

అచిత్తు ప్రపంచమునకును జీవాత్మల శరీరములకును మృత్తు ఘటములకువలె నుపాదానకారణ మనియు, అది ప్రకృతి ప్రధాన అవ్యక్త మాయాదినామములచే వ్యవహరింపఁ బడుననియు, సత్వరజ స్తమోగుణములు ప్రకృతి ధర్మము లనియు, వయినే చెప్పఁబడెను గదా. ప్రకృతి (అచిత్తు) నుండి మొదట మహత్తు పుట్టెను; మహత్తు నుండి యహంకారము పుట్టెను. అహంకారము వైకారికము (సాత్వికాహంకారము), తైజసము (రాజసాహంకారము), భూతాది (తామసాహంకారము), అని త్రివిధము. సాత్వికాహంకారము వలన నంతఃకరణ మయిన మనస్సును, త్వక్చక్షుర్జిహ్వాఘ్రాణ శ్రోత్రము లనెడు జ్ఞానేంద్రియము లయిదును, వాక్పాణిపాదపాయూపస్థ లనెడి కర్మేంద్రియము లయిదును, పుట్టెను. తామసాహంకారము వలన పంచ మహాభూతముల యొక్క సూక్ష్మరూపము లయిన పంచ తన్మాత్రలు పుట్టును. శబ్దస్పర్శరూప రసగంధములు పంచ తన్మాత్రలు. ఈపంచ తన్మాత్రలవలన వరుసగా ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథివి, అను పంచభూతములు పుట్టినవి. రాజసాహంకార మీశ్వర సంకల్పమువలన సమస్తవస్తువులను గలిగించు

టకు స్వాత్వికతామసాహంకారములకు రెంటికిని తోడువడును. చిత్తనఁగా జీవాత్మ మోక్షపర్యంతము ప్రకృతితోడి సంబాధమును వీడక కర్మపాశ బద్ధమయి యీశ్వరునికి లోఁబడినదయి యుండును ప్రకృతి లోన ప్రత్యణువును జీవుని గలదయి, తనయందుండెడి జీవునకు శరీర మయి యుండును, ప్రతిజీవుఁడును పరమాత్మను శరీరిని (అంతర్యామిని) గాఁ గలిగి యుండును.

శుద్ధ శూన్యమునుండి వస్తు వెవ్వడును కలుగ నేరదుగనుక నిత్యమయిన ప్రకృతినుండియే యీశ్వరేచ్ఛ చేత సృష్టి కలుగు చున్నది. సమష్టిసృష్టి యనియు; వ్యష్టిసృష్టి యనియు, సృష్టి ద్వివిధము. పరబ్రహ్మముయొక్క సంకల్పానుసారముగా మహత్తు, అహంకారము మొదలయినవి కలుగుట సమష్టిసృష్టి. పంచతన్మాత్రలయొక్క కూడిక (పంచీకరణము) చేత కర్మానుసారము లయినరూపములు కలుగుట వ్యష్టిసృష్టి. సృష్టి (౧) సుర, (౨) నర, (౩) తిర్యక్, (౪) స్థావర రూపముల నాలుగు విధములుగా నుండును. సృష్టిని ప్రాకృత సృష్టి, దైనందినసృష్టి నిత్యసృష్టియని త్రివిధముగాఁ గూడఁ జెప్పుదురు. ప్రాకృతసృష్టి (మహదహంకారాదిరూప మయినసమష్టిసృష్టి) ప్రతి మహాకల్పము (బ్రహ్మజీవిత కాలము) నందును నొక్కసారి జరగు చుండును. దైనందినసృష్టి (వ్యష్టిసృష్టి) ప్రతిబ్రహ్మకల్పము (బ్రహ్మ దినము) యొక్కయారంభమునం దొకసారి కలుగు చుండును. నిత్య సృష్టి సమస్తస్థూల పదార్థముల యొక్కయు జన్మస్థితుల వలె కర్మఫలానుగుణముగా ప్రతిదినమును ప్రతినిమిషమును గలుగు చుండును. కల్ప మనఁగా కాలవిశేషము. బ్రహ్మకల్పము, మహాకల్పము, అని కల్పములు రెండు. ఒక్కొక్కకల్పములో ననేక మన్వంతరము లుండును; ఒక్కొక్కమన్వంతరములో డెబ్బదియొక్క మహాయుగము

లుండును. కృత, త్రేతా, ద్వాపర, కలియుగములు నాలుగును జేరి యొకమహాయుగ మగును — కలియుగము 432000 సంవత్సరములు ; ద్వాపరయుగము కలియుగమునకు ద్విగుణ మనఁగా 864000 సంవత్సరములు ; త్రేతాయుగము కలియుగమునకు త్రిగుణ మనఁగా 1296000 సంవత్సరములు ; కృతయుగము కలియుగమునకు చతుర్గుణ మనఁగా 1728000 సంవత్సరములు. ఒకమహాయుగములో 4320000 సంవత్సరము లుండును. మన్వంతర మనఁగా మనువు కాలము ; మన్వంతరములు పదునాలుగు. బ్రహ్మకొక్కదినమైన బ్రహ్మకల్పములో పదునాలుగు మన్వంతరము లనఁగా సంధులతోఁ గలుపుకొని నూఱు మహాయుగము లుండును. మున్నూటయఱువది బ్రహ్మకల్పములును, అంతే ప్రమాణము గలమున్నూటయఱువదిరాత్రులును గలిసి బ్రహ్మకొక్క సంవత్సర మగును; అటువంటి సంవత్సరములు నూఱు చేరి బ్రహ్మయుష్కాల మయినమహాకల్ప మగును.

ప్రాకృతప్రళయము, నైమిత్తిక ప్రళయము, నిత్యప్రళయము, ఆత్యంతికప్రళయము, అని ప్రళయము చతుర్విధము. ప్రాకృతప్రళయ మనఁగా ప్రపంచ మంతయు నిప్పు డున్నస్థూలరూపమునువిడిచి సూక్ష్మరూపమును బొంది నశించుట. ఈప్రళయము మహాకల్పాంతమున జరగును. నైమిత్తికప్రళయ మనఁగా త్రిలోకములును దమ యిప్పటి రూపమును విడిచి యుండలివస్తువు లన్నియు నాయాభూతములలోఁ గలియుట. ఇది ప్రతిబ్రహ్మకల్పాంతమునను జరగును. నిత్యప్రళయ మనఁగా ప్రతినిమిషమును మరణాదిరూపమున పదార్థములు నశించుచుండుట. ఆత్యంతికప్రళయ మనఁగా జీవునకు ప్రకృతితోడ సంబంధము విడిచిపోవుట. ఇది జీవుఁడు మోక్షము నొందినప్పుడు సంభవించును. ఈప్రకారముగా దృశ్యమంతయు నశ్యమగును. ఆయా

వస్తురూపములు నశించినను వానికి మూలాధారము లయిన సూక్ష్మాణువులు నశింపనంటి ప్రకృతి నిత్యమయినది జీవాత్మ దేహములోఁ బ్రవేశించుట జనన మనియు, దానిని విడుచుట మరణమనియు, చెప్పఁబడును. జీవాత్మ కొంతకాల మొక దేహములోనుండి తరువాత దానిని విడిచి యెప్పుడో యొకప్పుడు మఱియొక దేహములోఁ బ్రవేశించును. ఇట్లు ప్రవేశించుట జన్మాంతర మనఁబడును. జనన మరణ జన్మాంతరాదులు సవికార మయిన దేహమునకు సంబంధించినవే కాని నిర్వికార మయినజీవాత్మకు సంబంధించినవి కావు. స్వభావముచేత నిత్యుఁడును పరిశుద్ధుఁడు నయినజీవుఁడు కారణశరీరమును బొంది సుఖదుఃఖముల ననుభవించుటకు కర్మ కారణము. ఈకర్మమే జననమును మరణమును జన్మపరంపరను దేహధారణమును బొందుటకుఁ గారణ మగును. మంచిదికాని చెడ్డదికాని జీవుఁడు బుద్ధిపూర్వకముగాఁ జేయుపని కర్మ యనఁబడును. ఈశ్వరునకు ప్రీతికర మయిన కర్మము సుకృతము; ఈశ్వరునకు ప్రీతికరముకాని కర్మము దుష్కృతము.

అవిద్య యనఁబడెడి యజ్ఞానమువలన జీవుఁడు కర్మమును జేయును. అన్యథా జ్ఞానము, విపరీతజ్ఞానము, అని యవిద్య (అజ్ఞానము) ద్వివిధము. ఒకవస్తువుగుణముల నింకొకదాని వనుకొనుట యన్యథాజ్ఞానము; ఒకవస్తువును మఱియొకవస్తువనుకొనుట విపరీతజ్ఞానము. జీవాత్మ మొదట శరీరమే తాననుకొనును: పిమ్మట జననము, మరణము, మొదలయినశరీరగుణములు, తన వనుకొనును. అవిద్యవలన రాగద్వేష క్రోధాదులు కలుగును: వానివలన జీవుఁడు కర్మలకు వశుఁ డగును. ఒకకర్మవలన వేఱొకకర్మ పుట్టును. ఈప్రకారముగా ప్రకృతిసంబంధమునుబట్టి కర్మపరంపర యాద్యంతరహితము

లేని దయి చక్రపరిభ్రమణమువలె తిరిగితిరిగి వచ్చుచుండును. ఈ తెంపు లేని కర్మప్రవాహము ప్రళయకాలమునందు సహితము నశింపక జీవాత్మలతో నడఁగి యుండి సృష్టితోడఁగూడ మరల బయలు వెడలును. ఈశ్వరుఁడు తటస్థుఁడగుటచేత కర్మతో సంబంధము కలిగించుకొనక సాక్షియయి చూచుచుండును. అందుచేత జీవాత్మఁడు తాను జేసినకర్మఫలముల ననుభవించుచుండును. పాపకర్మయొక్క ఫల మీలోకములో దుఃఖమును పరలోకములో నరకమును; పుణ్యకర్మయొక్క ఫలమీలోకములో సుఖమును పరలోకములో స్వర్గమును. స్థూలదేహమునుండి వెలువడిన సూక్ష్మదేహమువలనఁ గలిగినయాతనాశరీరమును బొంది జీవుఁడు పాపఫల మయినయాతన ననుభవించెడు లోకము నరకము. దాని కధిపతి యముఁడు. సూక్ష్మదేహము వలనఁ గలిగినభోగశరీరము నొంది జీవుఁడు పుణ్యఫల మయిన యానందము ననుభవించెడిలోకముస్వర్గము. సాధారణముగా నూర్ధ్వలోకము లనెడి పుణ్యలోకము లాఱు: అవి భువర్లోకము, స్వర్లోకము, మహర్లోకము, జనలోకము, తపోలోకము, సత్యలోకము. నరకాదు లధోలోకము లనఁబడును. జీవుఁడు తన పుణ్యపాపఫలము లనుభవించువఱకును ఊర్ధ్వాధోలోకములయందుండును. అనంతర మతఁడు తన కర్మఫలానుసారముగా మనుష్యపశుపక్ష్యాది స్థూలశరీరమును ధరించి, జన్మరాహిత్యమును బొంది ముక్తి వడయువఱకును జన్మపరంపరను బొందుచుండును. సామీప్యము, సాలోక్యము, సారూప్యము, సాయుజ్యము, అని ముక్తి నాలుగు విధములు గలది. ఈశ్వరుని సమీపమం దుండుట సామీప్యము; సమానలోకమం దుండుట సాలోక్యము; సమానరూపమునొందుట సారూప్యము; ఈశ్వరునితోఁ గలిసి యానంద మనుభవించుట సాయుజ్యము. ముక్తి

నొంది, జీవుఁడు మరల బద్ధుఁడు కాఁడు కాని లోకోపకారార్థము భూమిపయి నవతరించి తనపని తీరినతరువాత మరల మోక్షమునకుఁ బోవును. వైష్ణవులకు పరమపద మనఁబడెడు వైకుంఠము ముక్తి స్థానము. ప్రకృతితోడిసంబంధమును విడిచి, పుణ్యాపాపకర్మలనుండి పూర్ణముగా విడివడుట మోక్షము. మోక్ష మనుపదమునకు కర్మ బంధములనుండి విడివడుట యని యర్థము. అన్నిజీవులును కర్మక్షయ మును జేసి మోక్షమును బొందవచ్చును. జీవుఁడు దేవాయన మనఁ బడెడి యర్చిరాదిమార్గమునఁ బరమపదమునకుఁ బోవును. అవసాన దశయందు జీవుఁడు సూక్ష్మ (లింగ) శరీరము నొంది, సుషుమ్నా నాడిద్వారమున బ్రహ్మరంధ్రములనుండి పైకి వెడలి, సూర్యమండ లము జొచ్చి, యచ్చటనుండి పరమపదమును జేరును. కర్మయోగము, జ్ఞానయోగము, భక్తియోగము, ప్రపత్తియోగము, అని మోక్ష మును బొందుట కుపాయములు నాలుగు. వేదాధ్యయనముచేత తత్త్వ జ్ఞానమును బడసి, కర్మఫలాపేక్ష లేక వేదవిహితకర్మలను జేయుచు, జపహోమయజ్ఞదాన తపఃప్రభృతులగు సర్వకర్మలను ఈశ్వరార్ప ణము చేయుట కర్మయోగము. యోగశాస్త్రమునందుఁ జెప్పఁబడిన యమనియమప్రాణాయామ ప్రత్యాహార ధ్యానధారణసమాధులనెడి యష్టాంగములచేతను మనస్సు నీశ్వరునియందునిలుపుట జ్ఞానయోగము. యథాశక్తిని సర్వకర్మలను జేయుచు, యావజ్జీవమును నిశ్చల భక్తితో దేవునిసమస్తకళ్యాణగుణములను దలఁచుచు నీశ్వరు నుపా సించుట భక్తియోగము. పయిని జెప్పఁబడిన మోక్షసాధనములను మూటిని ననుష్ఠించుటయందలి తనయశక్తతను దెలుపుచు, తన రక్ష ణమున కీశ్వరకృప నొక్కదానినే నమ్ముకొని మరణపర్యంతమును దేవుని కల్యాణగుణస్మరణము చేయుచుండుట ప్రపత్తియోగము.

జ్ఞానులుమాత్రమే యొకటి మోక్షమార్గములు ననుష్ఠించుట కర్హు లైనను, ఈకడపటిదైన ప్రపత్తిమోక్షము ననుష్ఠించుట కజ్ఞానులును చండాలురు మ్లేచ్ఛులు మొదలయిన యెల్లవారును నర్హులు. ఈచతుర్విధమోక్షసాధనములును కర్మను నశింపఁ జేయును.

సంచితము, ప్రారబ్ధము, ఆగామి అని కర్మ త్రివిధము. ఈవఱకనుభవింప నారంభింపక కూడఁబెట్టినది సంచితము, ఇప్పు డనుభవించుట కారంభింపఁబడినది ప్రారబ్ధము; భవిష్యత్కర్మల వలన ముందనుభవింపఁ బోయెడిది యాగామి. పయిసాధనముల చేత సంచిత కర్మ నశించిపోవును; ప్రారబ్ధకర్మ ఫలములనిచ్చి నిలిచిపోవును; ఆగామికర్మ ఫలకారి కాకుండును. తక్కినమార్గములచేత ప్రారబ్ధకర్మముయొక్క పరిమితినిబట్టి యాజన్మమునందో మఱికొన్ని జన్మములను బొందియో మోక్షమును బొందవచ్చునుగాని ప్రపత్తి మార్గముచేత నాజన్మమునందే కర్మక్షయమును జేసికొని మోక్షమును బడయవచ్చును.

శ్రీవైష్ణవులలో వడగలు లని, తెంగలు లని, రెండు తెగలవారున్నారు. వడగలివా రనఁగా నుత్తరదిక్కువారని యర్థము. వీరు సంస్కృత వేదములయం దధికవిశ్వాసము గలవా రయి, కాంచీనగరమునందలి వేదాంతాచార్యులవా రుపదేశించిన రహస్యములలోని సిద్ధాంతముల ననుసరింతురు. తెంగలివా రనఁగా దక్షిణదిక్కువారని యర్థము. వీరు ద్రవిడభాషలో రచియింపఁబడిన దివ్యప్రబంధ మనఁబడెడు ద్రావిడవేదమునం దధికవిశ్వాసము కలవా రయి, శ్రీరంగమునందలి లోకాచార్యులవా రుపదేశించిన రహస్యములలోని సిద్ధాంతముల ననుసరింతురు. వడగలివారు తిరుమణినామములో ముక్కుమీఁద పాదము పెట్టరు; తెంగలివారు ముక్కుమీఁద పాదము పెట్టు

దురు. రామానుజాచార్యులకుఁ బూర్వమునందు దక్షిణహిందూస్థానమునం దుండిన యాళ్వారులచే ద్రావిడమునందుఁ జేయఁబడిన గ్రంథములు దివ్యప్రబంధ మనఁబడును. దానియందు పాశురము లనఁబడెడు నాలుగువేల పద్యములు గలవు: ఆళ్వారులు పన్నిద్దఱు; వారిలో మాలలు మొదలుకొని సర్వజాతులవారు నున్నారు. ఈయిరుదేశీయుల వైష్ణవులలోను పంచసంస్కారములు ప్రధానములు. తాపము, పుండ్రము, నామము, మంత్రము; యాగము, ఇవి పంచసంస్కారములు. తాప మనఁగా నెఱ్ఱఁగాఁగాల్చిన యినుపముద్రలతో విష్ణుని శంఖ చక్రచిహ్నములను బుజములపై ముద్రించుట; పుండ్రమనఁగా లలాటమునందును శరీరముయొక్క మఱి పదునొక్కస్థలములయందునుమృత్తతో నామములు పెట్టి వానినడుమ శ్రీచూర్ణ రేఖ నుంచుట? నామమనఁగా వైష్ణవులకు విష్ణుని పేరులనే పెట్టుట; మంత్రమనఁగా గురూపదేశ సమయమునం దాచార్యుఁడు శిష్యులకు విష్ణునష్టాక్షరి, నారాయణాష్టాక్షరి, వాసుదేవద్వాదశాక్షరి, శరణాగతిమంత్రము, మొదలైనవాని నర్థసహితముగా నుపదేశించుట; యాగ మనఁగాఁ బరిగ్రించుట కేదో యొకవిగ్రహమును విధించుట. వైష్ణవులు పెట్టుకొనెడు నిలువుబొట్లు పండ్రెండును ద్వాదశోర్ధ్వపుండ్రము లనఁబడును.

---

## ద్వైతమత సంగ్రహము

••∘○∘••

ద్వైతమతము మన దేశమందు వ్యాపించియున్న త్రిమతము లలోఁగడపటిది. ఈద్వైతమతసిద్ధాంతమును స్థాపించినతఁడు మధ్వాచార్యుఁడు. అందుచేత నిది మాధ్వమతమనియుఁ జెప్పఁబడును. ఇతఁడు పరమాత్మ జీవాత్మలును, ఏకముగాక వేఱైనవని ద్విత్వమును

బోధించుటచే నీతనిమతమునకు ద్వైతమని పేరువచ్చినది. ఇతఁడు దక్షిణకర్ణాటక(South Canara District) మండలములోని తులువ దేశములో ఉడిపికి సమీపమునం దున్న అనంతేశ్వర మను గ్రామము నందు మధ్యగేహభట్టనెడు బ్రాహ్మణునకు పుత్రుఁడై 'శాలివాహన శకము 1040 సంవత్సరములో విలంబి సంవత్సరాషాఢబహుళ చతుర్థి నాఁడు జనన మొందెను. ఈ సంవత్సరము క్రైస్తవశకము 1119 తో సమాన మగును. ఇతఁడు శైశవమునుండియు మతాభినివేశము గల వాఁడయి, పండితులతో తత్త్వవిషయములను గూర్చి వాదించుచు అసామాన్య మేధావంతుఁడయి యుండెనఁట. ఇతఁ డుపనయన మయినతరువాతఁ దన తొమ్మిదవయేటనే యచ్యుత ప్రేక్షస్వామివలన సన్యాసాశ్రమమును స్వీకరించెను. పూర్వాశ్రమమునం దీతనిపేరు వాసుదేవాచార్యుఁడైనను సన్యాసి యయిన తరువాత నితఁడు మధ్వాచార్యుఁ డనియు, ఆనందతీర్థుఁ డనియు, నామములను వహించెను. ఇతఁ డధికప్రజ్ఞ గలవాఁడయి యుండుటచేత నీతనిని పూర్ణప్రజ్ఞుఁ డనియుఁ బిలుతురు. ఇతఁడు గంగాయాత్ర చేయవలె నని ప్రయత్నించఁగా గురుఁడు తన ప్రియశిష్యునియందుఁ గల ప్రేమాతిశయముచేత నాతనిని బోనీయక, తన యిష్టదైవత మయిన యనంతేశ్వరునిఁ బ్రార్థించి తదనుగ్రహమువలన గంగానది యంతర్వాహినిగా వచ్చి యుడిపిలో నున్న సరోవరమునఁ బ్రవేశించునట్లు చేసె ననియు, మధ్వాచార్యుఁడును సర్వజనులును దానిలో స్నానముచేసి కృతార్థులయి గంగాస్నానఫలములను బొంది రనియు చెప్పుచున్నారు. ఆతటాక మిప్పుడు మధ్వసరోవర మని చెప్పఁబడుచున్నది. గురువు జీవించియుండఁగానే మధ్వాచార్యుఁడు స్వమతమును జనులకు బోధించుచు, అతఁడు సిద్ధిపొందినతరువాత నాతని మఠమున కధిపతి

యున్నాను. ఇట్లు మఠాధిపతి యయినతరువాత నతఁడు తన వది నేడవ సంవత్సరమునందు హిమాలయ పర్వత ప్రాంత మందలి బదరీ వనమునం దున్న వేదవ్యాసాశ్రమమునకు యాత్ర వెడలెను. అతఁడక్కడ వేదవ్యాసులవారిచేత సత్కరింపఁబడి కొంతకాలముండి తత్త్వ విషయము నధికముగా నేర్చుకొని ననియు, వేదవ్యాసులవా రిచ్చిన యెనిమిది సాలగ్రామములను గైకొని యాతఁడా యాశ్రమమునుండి వెడలి నగరి యుడిపికి వచ్చె ననియు, చెప్పెదరు. నేపాళదేశము నందలి గండకీనదియందుఁ బుట్టెడి యొకవిధమైన నల్లని గుండ్రరాళ్ళు సాలగ్రామము లనఁబడును. ఆ సాలగ్రామములయందు మహా మహిమ గలదని నమ్మి హిందువులు వానిని దేవతార్చన పెట్టెలోఁ బెట్టి పూజించి, వానిని కడిగి సాలగ్రామతీర్థమును భక్తితో లోపలికిఁ బుచ్చుకొందురు.

మధ్వాచార్యులవారు బదరికాశ్రమమునుండి వచ్చి స్వస్థలమును జేరినతరువాతఁ దాను దెచ్చిన యష్టసాలగ్రామములలో నాల్గింటిని సుబ్రహ్మణ్యములోను, ఒకదానిని ఉడిపిలోను, ఒకదానిని మధ్యతలములోను గల దేవాలయములలోఁ బెట్టెను. అంతేకాక యతఁడు ద్వారకానగరమునుండి మలబారుతీరమునకు వచ్చిన యొక యోడలో గోపీచందన మను మట్టిలోఁ గలిసి తనకు లభించిన కృష్ణ విగ్రహమును ఉడిపిలోని యొక దేవాలయమునందుఁ బ్రతిష్ఠించి యా పట్టణము నందును దానిసమీపమునందును మఠముల నెనిమిదింటిని స్థాపించెను. అతఁడు తాను సాలగ్రామములను కృష్ణ విగ్రహమును బెట్టిన దేవాలయములలోను స్థాపించినమఠములలోను దనశిష్యులను నిలిపి, తాను రచియించిన ముప్పదియేడు గ్రంథములలోను గల ద్వైతమత సిద్ధాంతములను ప్రజలకు బోధింప నియమించెను. తద్విరచిత గ్రంథ

ములలో ఋగ్భాష్యమును, దశోపనిషద్భాష్యమును, గీతాభాష్యమును, బ్రహ్మసూత్రభాష్యమును, భారతతాత్పర్య నిర్ణయమును, భాగవతతాత్పర్య నిర్ణయమును, కృష్ణామృత మహార్ణవమును, తంత్రసారమును, ప్రధానము లయినవి. అతఁడు డెబ్బది తొమ్మిది సంవత్సరములు జీవించి క్రైస్తవశకము 1198 వ సంవత్సరముతో సరియైన శాలివాహనశకము 1120 పింగళ నామ సంవత్సర మాఘ మాసము నందు రెండవసారి బదరికాశ్రమమునకుఁ బోవలెనని బైలుదేఱి వెళ్లెనుగాని తరువాత నాతనిజాడ తెలియరాలేదు. అతఁ డిప్పటికిని బదరికావనమునందలి వేదవ్యాసాశ్రమమునం దున్నవాఁ డని మాధ్వమతస్థు లనుకొనుచున్నారు.

మాధ్వమతస్థులకు విష్ణువు ప్రధానదైవతము. అందుచేత వీరు వైష్ణవు లనియుఁ జెప్పఁబడుదురు. విష్ణువు ప్రపంచమును జడ ప్రకృతిలో నుండి పుట్టించె ననియు, అందుచేత సృష్టికి విష్ణుఁడు నిమిత్తకారణుఁడును జడప్రకృతి యుపాదానకారణము ననియు, విష్ణువును ప్రకృతియు జీవుఁడును ఈమూఁడును ఆద్యంతములు లేని నిత్య పదార్థము లనియు, అవి యన్యోన్యభేదభావము గల ప్రత్యేకపదార్థములే యైనను ప్రకృతియు జీవుఁడును స్వతంత్రమైనవి గాక విష్ణువునకుఁ బరతంత్రము లయి పూర్ణముగా లోఁబడి యుండునవి యనియు, జీవుఁడు ప్రకృతియొక్క సత్వరజస్తమోగుణములకు వశుఁ డయి వివిధకర్మలను జేయుచు జననమరణ జన్మపరంపరావస్థలను బొందుచుండు ననియు, జీవుఁడు కర్మక్షయమును జేసి ముక్తుఁడగు ననియు, ముక్తిని బొందుటకు విష్ణుభక్తి సాధన మనియు, భక్తివలన విష్ణుప్రసాదము లభించి తన్మూలమున మోక్షప్రాప్తి కలుగు ననియు. మోక్ష మనఁగా సంసారబంధములనుండి విముక్తి నొందుట

యనియు, మాధ్వులు చెప్పుచున్నారు. ఇవియే ముఖ్యము లయిన మాధ్వమతసిద్ధాంతములు. ఈమాధ్వులు ప్రత్యక్షానుమాన శబ్ద ప్రమాణములను మూటి నంగీకరింతురు. శబ్దప్రమాణములలో శ్రుతియు, స్మృతియు, పంచరాత్రమును, మూలరామాయణమును, మహాభారతమును, వానికి విరుద్ధముగా నుండని యితరగ్రంథములును, వీరిచేఁ బ్రమాణగ్రంథములుగా నంగీకరింపఁబడుచున్నవి.

విష్ణుఁ డొక్కఁడే దేవుఁడైనను, సృష్టిస్థితిలయార్థముగా నతఁ డప్పుడప్పుడు భూమిమీఁద నవతరించుచుండు ననియు, అతనియవతారములకును నాతనికిని నభేద మనియు, ద్వాపరయుగమునందు కృష్ణుఁడుగా నవతరించినట్లే విష్ణుఁ డీకలియుగమున బుద్ధదేవుఁడుగా నవతరించె ననియు, బుద్ధుఁడు బోధించిన బౌద్ధాగమముకూడ వేదవిహితధర్మములనే బోధించి ముక్తికి హేతు వగు ననియు, తెలియని వారు కొంద ఱపార్థములను యథేచ్ఛముగాఁ గల్పించి తన్మతదూషకు లయినను బుద్ధదేవుఁడు విష్ణునియవతార మగుటచేత నతఁడును నాతని సిద్ధాంతములు నాదరణపాత్రములే యనియు, వీరు చెప్పుచున్నారు. వీరికి ప్రధానదేవత లక్ష్మి.

"సత్యం జ్ఞాన మనంతంబ్రహ్మ" అను శ్రుత్యనుసారముగా దేవుఁడు సత్యజ్ఞానాంతస్వరూపుఁ డని మధ్వాచార్యుఁడు చెప్పియున్నాఁడు. జన్మనాశములు లేక శాశ్వతుఁడుగా నున్నందున సత్యస్వరూపుఁ డనియు, దేశకాలగుణబాధితుఁడు కానందున ననంతుఁ డనియు, వివరింపఁబడినది. సర్వవ్యాపి యగుటచేత దేశాబాధితుఁడు; ఆద్యంతములు లేకపోవుటచేత కాలాబాధితుఁడు; సర్వశక్తత్వసర్వజ్ఞత్వాదిగుణములు కలవాఁ డగుటచేత గుణాబాధితుఁడు. ఇతఁడు వేదప్రమాణము నంగీకరించినవాఁ డయినందున శ్రుతులయందుఁ జెప్పఁ

బడిన నిర్గుణత్వాదివిశేషణములు దేవున కున్నట్లొప్పుకొనవలసినవాఁ డయినను, వానికి సామాన్యార్థములను గ్రహింపక విశేషార్థములను గల్పించెను. ఎట్లనఁగా, నిర్గుణుఁ డనఁగా గుణములు లేనివాఁడని యర్థము కాదనియు, ప్రతిసత్పదార్థమునకును గుణము లుండి తీఱ వలసి యుండుటచేతను గుణము లేవియు లేనిచో సత్పదార్థమే యుండక పోవలసి వచ్చుటచేతను దేవుఁడు సత్పదార్థ మగుటచేతను నిర్గుణశబ్దమున కర్థము మనుష్యాదిజీవులకుఁ బ్రకృతిసంబంధముచేతఁ గలిగెడు హేయగుణములు లేవనియే కాని కళ్యాణగుణములు లేవని కాదనియు, సమర్థింపఁ జూచెను. ఈప్రకారముగానే యద్వైత మతా నుకూలముగా నున్న యితర విశేషణములకును విశేషార్థములు కల్పింపఁ బడినవి.

వీరిమతమునందు జీవులును జడప్రకృతియుఁ గూడ నీశ్వరు నితో సమానముగానే నిత్యములు. అందుచేత నవి యీశ్వరునిచే సృజింపఁబడినవి కావు. అయినను జీవులును జడప్రకృతియు నీశ్వరు నికి లోఁబడినవి. నగకు బంగార ముపాదానకారణ మయినట్టుగా సృష్టికి జడప్రకృతి యుపాదానకారణము; కంసాలి నిమిత్తకారణ మయినట్లుగా దేవుఁడు నిమిత్తకారణము; వస్తువు కానిదానినుండి వస్తువు కలుగదుగనుక బంగారము స్వర్ణకారునిచేతవలె జడప్రకృతి యీశ్వరుని చేత నూతనముగా సృజింపఁబడినది గాక యానాఁటికున్నదే యయి యున్నది. జడమయిన ప్రకృతి స్వయముగా సృజనచేయ శక్తికలది కానం దున దేవుఁడు పురుషరూపమున దానిలోఁ జొచ్చి సంక్షోభింపఁ జేయుట చేత సృష్టిలోని యనంతపదార్థములు కలిగినవి.

సృష్టిలో మొదట త్రిగుణాత్మక మైనమహత్తు కలిగినది; దానినుండి వైకారిక తైజసభూతాది యైనయహంకారము కలిగినది;

దానినుండి పృథివ్యాపస్తేజో వాయురాకాశతన్మాత్రలు కలిగినవి; అనంతరము జ్ఞానేంద్రియ కర్మేంద్రియములుకలిగినవి; పిదప దేవతలు కలిగిరి; అప్పుడు తమోమోహమహామోహతమిస్రాంధతమిస్రరూప మయి యవిద్య పుట్టినది; ఈయాఱును ప్రాకృతసర్గము లనఁబడును. ఏడవసృష్టి స్థావరములు; ఎనిమిదవది తిర్యక్ స్రోత స్సనఁగా జంతు సృజన; తొమ్మిదవది అర్వాక్ స్రోత స్సనగా మనుష్యసృజన: కడ పటిదగుపదవది యీశ్వరావతారములు.

జడపదార్థము చైతన్యరహితమైనది; ప్రకృతి యనఁబడెడు లక్ష్మి నుండి దానికి శక్తి కలుగుచున్నది. దేవునితోఁగూడ నది సర్వత్ర సర్వ కాలము నుండునదిగనుక దేవునివలెనే లక్ష్మియు నిత్యమైనదే. అది ప్రపంచమున కుపాదానకారణమయి జీవునకును సమస్త పదార్థముల కును దేహమయియుండు; అది యెప్పుడు సత్వరజస్తమోగుణములను గల దగును.

జీవుఁడు జడముగాక చేతనుఁడయి, నిత్యుఁడయి, దేవునికంటె వేఱయి, దేవునికి లోఁబడినవాఁడయి యుండును. ఒకశరీరమునం దుండుజీవుఁ డింకొకశరీరమునం దుండెడిజీవునికంటె భిన్నుఁడు. జీవుఁడు బద్ధుఁడయి యున్నప్పు డనఁగా శరీరమును దాల్చి యున్నప్పుడు జడ ప్రకృతియొక్క పూర్వోక్తగుణత్రయమును బొందును. జీవులు ముక్తి యోగ్యులు, తమోయోగ్యులు, నిత్యసంసారులు, అని త్రివిధములవారు.

ద్వైతులు పంచభేదములను చెప్పుదురు. జీవేశ్వరభేదజ్ఞానము, జీవపరస్పరభేదజ్ఞానము, జడజీవభేదజ్ఞానము, జడేశ్వరభేదజ్ఞానము, జడపరస్పరభేదజ్ఞానము, అను పంచభేదజ్ఞానము ముక్తి కావశ్యక మందురు. 1. దేవుఁడు జీవునికంటె వే ఱయినవాఁడు; 2. జీవు

లోకరక్షకరు వే అయినవారు; 3. జడము జీవునికంటె వే అయినది; 4. జడము దేవునికంటె వేఱయినది; 5. జడము లొండొంటికి వే అయినవి; ఇవి యన్నియు సత్యములు. ఘటపటాదిరూపముల నున్న స్థూలాంశములు నశించినను వానికి మూలము లయిన సూక్ష్మాంశము లగు తన్మాత్రలు నశింపనందున ప్రపంచము సత్యమయినది. జీవునకు జననమరణములు లనఁగా మనుష్యుఁ డొకయింటిని విడిచి వేఱొకయింటఁ బ్రవేశించునట్లుగా నొక దేహమును విడిచి వేఱొక దేహమునుబూని జన్మపరంపరను బొందుచుండుటయే కాని వేఱు గాదు. దేవుఁడు సర్వవ్యాపి యయి సర్వాంతర్యామిగా నున్నను, సర్వమునకు వే అయినవాఁడు. ఈశ్వరునకును జీవునకును, గలది వస్త్రముల కును పురుషునకును గల సంబంధమువంటిది కాక వృక్షమునకును తద్ర పమునకును గలిగినదానివంటి యవినాభావసంబంధ మయి యున్నది. కాఁబట్టి జీవేశ్వరుల కెప్పుడును వీడనిసంబంధ మున్నను, జీవాత్మ పరమాత్మ లేకము గాక వేఱయినవిగా నున్నవి.

జీవునకు పరమార్థము ముక్తి, అనఁగా ప్రకృతిసంబంధముల నుండి విడివడి యీశ్వరునితోఁ జేరుట. కర్మక్షయము, ఉత్క్రాంతి, అర్చిరాది, అని ముక్తిమార్గములు మూఁడు. ఈమూఁడింటిని గడచిన తరువాత జీవుఁడు భోగ మనబడెడు చతుర్థదశను బొందును. కర్మక్షయ మనఁగా కర్మఫలము నశించుట. మనోవాక్కాయరూపమున కర్మము త్రివిధముగా నుండును. జీవునకు దేహముతోడి సంబంధము చేత త్రిగుణాత్మకము లయిన ప్రకృతిధర్మములు గలుగును; ఆధర్మములవలన కర్మలను జేయును. జీవుఁడు పొందెడు సుఖదుఃఖములన్నియు కర్మఫలములు; కర్మఫలము జన్మాంతరములకును లోకాంతర వాసములకును గారణ మగును. కాఁబట్టి మోక్షమునకు కర్మ

క్షయము ప్రథమకర్తవ్యము. కర్మక్షయ మయినతోడనే జీవుఁడు శరీరమునందుఁ గలడెబ్బదిరెండువేల నాడులలోను బ్రధాన మయిన సుషుమ్నా నాడిద్వారమున దేహమునుండి వెలువడుట ఉత్క్రాంతి యనఁబడును; ఆత్మ సుషుమ్నానాడిలోఁ బ్రవేశించుట యుత్క్రాంతిలయ మనఁబడును. జీవుఁడు సుషుమ్ననుండి బ్రహ్మ రంధ్రములోఁ బ్రవేశించి యచ్చటనుండి యగ్ని లోకాదులనుండి పోవు మార్గ మర్చిరాదిమార్గ మనఁబడును; అగిస్పనఁగా సగిషలోకము. అర్చిరాదిమార్గమునఁ బోయి జీవుఁడు శాశ్వతానందము ననుభ వించుట భోగ మనఁబడును. జీవుఁడు యోగాభ్యాసమువలన దేహ బంధములనుండి ముక్తుఁడయి సుషుమ్నలోఁ బ్రవేశింప శక్తుఁడగును; కర్మక్షయ మయినఁ గాని యట్లు ప్రవేశించుట సంభవింపదు. కర్మ క్షయము భక్తివలనను విష్ణుప్రసాదమువలనను గలుగును. భక్తి యనఁగా నీశ్వరునియందు సంపూర్ణ విశ్వాస ముంచి వశమువిధేయుఁ డయి సర్వవిషయములలో నీశ్వరప్రీతికరముగా నడుచుకొనుట. భక్తి కలుగఁగానే యీశ్వరప్రసాదమును గలుగును గాన పురుషుఁడు మొట్ట మొదట భక్తుఁ డగుటకు నవదోషములను వరిహరింపవలయును. జీవేశ్వరులకు భేదము లేదనుట, దేవుఁడు నిర్గుణుఁ డనుట, దేవుఁడు దోషసహితుఁ డనుట, దేవునితో సమాను లితరులు కల రనుట, దేవునికంటె నధికులు కలరనుట, దేవుఁడు తన యవతారములకంటె వేఱనుట, అవతారపురుషులు దేవాంశకలవారు గాక నరమాత్రు లనుట, భాగవతాపచారము చేయుట, దేవుని ప్రాభవమును నిరాక రించుట—ఇవి నవదోషములు. ఈనవదోషములను త్యజించి గుణము లను భజించుటకు అంకనమును, నామకరణమును, భజనమును సాధ నములు.

అంకన మనఁగా నారాయణుని యాయుధములను దేహము మీఁద ముద్రించుకొనుట. అది రెండు విధములు. మొదటిది విష్ణుని పంచాయుధము లయిన శంఖచక్రాదులను స్నానము చేయునపు డెల్లను గోపీచందన మను మట్టిలోను జలములోను ముంచి లలాటము లోనుగా భుజములు మొదలయిన వానిమీఁద ప్రతిదినమును ముద్రలు వేసి కొనుట. రెండవది యాచార్యపురుషుఁడు వచ్చినపుడు భుజముల మీఁద తప్తముద్రాంకణము చేయించుకొనుట యనఁగా లోహ ముతోఁ జేయఁబడిన విష్ణు శంఖచక్రముల నెఱ్ఱగా కాల్చి వానితో రెండు భుజములమీఁదను ముద్రలు వేయించుకొనుట నామకరణ మనఁగా కొడుకులు మొదలయినవానికి విష్ణుని పేరులు పెట్టుట. భజన యనఁగా భగవంతుని సంపూర్ణభక్తితో పూజించుట. సత్యము, హింసము, ప్రియము, స్వాధ్యాయము, దానము, పరిత్రాణము, పరి రక్షణము, దయ, స్పృహా, శ్రద్ధ—ఈపదియు భజన కంగములు. వీని నన్నిఁటిని త్రికరణశుద్ధిగాఁ జెల్లించిన పక్షమున, జీవుఁ డన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయానందమయకోశములను విడు చుటకు శక్తుఁ డగును. ఈపంచకోశములలో మొదటిది స్థూలశరీరము తోను తక్కినవి సూక్ష్మ (లింగ) శరీరముతోను కారణశరీరముతోను సంబంధించినవి. ఆత్మ యొకదాని తరువాత నొకటిగా నీపంచకోశము లను విడిచి మోక్షమును బొందును. ఏదో ఒకవిధ మయిన దేహము లేక జీవుఁడు భోగము ననుభవింపనేరఁడు గనుక, ఈదేహముల నన్ని టిని విడిచినతరువాత చిన్మాత్ర దేహమును బొంది యీశ్వరునిలో శాశ్వతానందము ననుభవించును. జీవు లందఱును ఏకరీతిముక్తిని బొందరు. సారూప్యము, సాలోక్యము, సాన్నిధ్యము, సాయుజ్యము, అనెడు చతుర్విధ ముక్తులలో వారువారు తమతమ కర్మానుసార

ముగా సర్వ్వైసముక్తిని బొందుదురు. దీనిలో నొకదానికంటె నొకటి యుత్తరోత్తరము శ్రేష్ఠతరములు. సాయుజ్యమనఁగా జీవుఁడీశ్వరునిలోఁ గలిసి స్వరూపనాశనము నొందుట గాక స్వస్వరూప జ్ఞానముతో నీశ్వరునిలోఁ గలిసియుండి జననమరణాదిరహితుఁ డయి శాశ్వతానందము ననుభవించుచుండుట.

---

# ఉత్తమ స్త్రీ చరిత్రములు

## "WOMAN AS MOTHER."



### ఉత్తమమాత.

ఓ సోదరీమణులారా! నేఁటిసాయంకాలము "ఉత్తమమాత" ను గూర్చి కొంచెము చెప్పఁబోవుచున్నాను. "ఉత్తమమాత" యన్న పదమే మీలోఁ గొందఱిచెవులకు వింతగా వినఁబడవచ్చును. బిడ్డల తల్లు లయిన యిల్లాండ్రకు "మేముత్తమమాతలము కామా? ఈవిషయమున మేము క్రొత్తగా నేర్చుకొనవలసిన దేమున్నది?" అనియుఁ గొందఱకు తోఁచవచ్చును. అయినను తెలిసినవారికి సహితము ధర్మమును పలుమాఱు స్మరణకుఁ దెచ్చుట యావశ్యకమే. కాఁబట్టి నాయం దాదర ముంచి యీచిన్నయుపన్యాసమును సావధానముగా వినుఁడు.

"మాత" యన్నది రెండక్షరములు గలచిన్నపదమే యయినను దానియం దెంతో యర్థ మిమిడి యున్నది. అది స్త్రీవాచకము లయిన పదము లన్నిటిలోను మిక్కిలి గౌరవనీయ మయినది. మాతృదశకంటె మఱి యేదశలోను స్త్రీకెక్కువ గణ్యత కలుగదు. "అమ్మ" యను మాట సమస్తభాషలలోను మిక్కిలి శ్రావ్యతర మయినది; అంతకంటె మధుర మైన పదము వేఱొకటి లేదు. అదియే శిశువు మొట్టమొదట నేర్చుకొనునది; మరణమువఱకును మఱవకుండునది. తల్లియున్న చిన్నపేరున కర్హురాలు కాఁగానే యావఱకెన్నఁడును నెఱుఁగరాని సుగుణసంపద స్త్రీయందుఁ గానవచ్చును. తల్లియయిన తరువాత స్త్రీయొక్క ప్రేమ మఱింత యధికమును, పరిశుద్ధమును, ఫలసిర పేక్షు

మును అగును. పయికిఁ గానరాక లోపల నడఁగి యున్న యామె స్వాభావికసద్గుణము లన్నియు నప్పుడు వికాసము నొందును. నాఁడు మొదలుకొని స్త్రీజనస్వాభావిక మయిన యామెయబలత సుబలతగా మాఱును; ఆమె భీరుత్వము శూరత్వ మగును. నిర్మలప్రేమము, నిరంతరసహనము, నిరుపమానదృఢచిత్తత, బుద్ధివిశేషము, అప్పుడు ముందుకు వచ్చును. ఆమె మాతృవాత్సల్యము బయలుపఱుపని గుణ విశేష మేది యుండును! తల్లి శిశువునిమిత్త మెంత శ్రమము పడును! ఎన్నికష్టములు సహించును! ఎట్టి దుష్కరకార్యములకు సాహసించును! శిశువున కించుక రోగము వచ్చెనా తనసుఖమును పాటింపక రాత్రి యనక పగలనక దినములకొలఁది ప్రతినిమిషమును విసుగు లేక మంచమువద్ద గనుపెట్టుకొని యుండి యెంత శ్రద్ధతో శిశువును గాపాడును! తల్లి తనబిడ్డప్రాణమును గాపాడుట కయి తనప్రాణము నిచ్చుటకైనను వెనుకదీయదుగదా! శిశువువిషయ మయి యందఱును ఆశ వదలుకొన్నప్పుడును, ఆమె కాశపోదు; ఎవ్వరికిని భయము తోఁచనప్పుడు, ఆమెకు భయము తోఁచును. ఆహా! మాతృవాత్సల్య మెంతటి మహిమ గలది!

మంచి దయినపక్షమున కుటుంబమునందు తల్లియొక్క ప్రాబల్య మెంత యైనను మేలు చేయును. గృహమునకు శోభను, పరిశుద్ధతను, యశస్సును, శాంతిని తెచ్చునది తల్లి; గృహములోని యైకమత్యమునకును సంతోషమునకును మూల మగునది తల్లి. లోకములో మహానీయు లైన మహాపురుషులయొక్క గొప్పతన మంతయు తల్లిమూలముననే వచ్చుచున్నదని విద్వాంసు లభిప్రాయపడి యున్నారు. బిడ్డలయందలి ప్రేమకును, బంధువులయందలి ప్రీతికిని, బీదలవిషయ మయిన దానగుణమునకును, ఇటువంటివే యనేకము లయిన యితరసద్గుణములు

లకును, ఆదికాలమునుండియు మనదేశపుస్త్రీలు సుప్రసిద్ధురాం డ్రయి యున్నారు. నాకంటె సమర్థులయినవారు పలువురు వర్ణించి యుండిన దానికంటె నే నిప్పు డాసుగుణముల నెక్కువగా వర్ణింపఁ జాలను. కేవల గుణవర్ణనము చేసి పొగడుటయు నిచ్చట నాపని కాదు. పలుమారు పొగడుచుండుటవలన గర్వము కలుగుట మనుష్యులకు సంభావము. గర్వమువలన నభివృద్ధికి భంగము కలుగును. కాఁబట్టి నేనిక్కడ మనస్త్రీలలోఁ గల లోపములను సహితము గొన్నిటిని దెలిపి, వానిని దిద్దుకొని బాగుపడుటకుఁ దగిన మార్గములను నాబుద్ధికి తోఁచినంతవఱకు కొన్నిటిని జూపఁ బ్రయత్నించెదను. నేను చెప్పినదానిలో గుణాంశ మున్నచో గ్రహింపుఁడు. తమ లోపములను దాము తెలిసికొనుటయే వివేకుల లక్షణము. తాము తెలిసికొన్న లోపములను దిద్దుకొనుటయే తమ యభివృద్ధికిని లోకముయొక్క మేలునకును హేతు వగును. ఇప్పుడు మనదేశములో సాధారణముగా స్త్రీలలోఁ గల విద్యాభావమువలనఁ బయిని జేర్కొనిన సుగుణముల వలన సహితము కొన్ని యనర్థములు పుట్టుచున్నవి. బిడ్డలయందలి యతి ప్రేమచేత తిన్నఁగా నాజ్ఞ పెట్టకపోవుటవలన బాలు రనేకులు చెడుచున్నారు; బంధువులయందలి యతి ప్రేమచేత చుట్టములను జేర్చుటవలన ననేకులు పాటుపడక సోమరు లగుచున్నారు; బీదల విషయమునఁ గల యతిదానగుణముచేత పాత్రాపాత్ర విచారము మాని దానము లొనర్చుటవలన పలువురు దృఢకాయులు బిచ్చగాం డ్రగుచున్నారు. ఇటువంటి యనర్థము లనేకములకు మనకాంతలలోఁ గల విద్యాశూన్యతనే బుద్ధిమంతులు ప్రధానకారణముగాఁ జెప్పుచున్నారు. విద్యావివేకవతి యైనసన్మాతవలన బహుశుభములు గలుగునట్లే విద్యాగంధము లేని మూఢమాతవలన బహుదురవస్థలు సంభ

వించును. తల్లియేకదా గృహమునకు రాణి. అట్టితల్లియే విద్యావిహీనురా లయినపక్షమున గృహపరిపాలనమున కెట్లు సమర్థురా లగును? తనకు జ్ఞానము చాలని యిల్లాలు తనబిడ్డల నెట్లు జ్ఞానాధికులను జేయఁజాలును? బిడ్డలను మంచిస్థితికిఁ దెచ్చుటయే తల్లియొక్క ప్రధాన ధర్మము.

బిడ్డలను దృఢగాత్రులనుగాఁ జేయుట, సద్వర్తనము గలవారినిగాఁ జేయుట, జ్ఞానవంతులనుగాఁ జేయుట, ఈమూడును తల్లులకు ముఖ్యకర్తవ్యము లనిచెప్పవచ్చును. బిడ్డలు దృఢగాత్రులుగా నుండుటకయి వారిజననమునకు కారణభూతు లయిన జననీజనకులు మొట్టమొదట దృఢశరీరు లయి యుండవలెను. అతిబాల్యవివాహము లత్యంత ప్రబలముగా నున్నయీదేశములో నట్టి భాగ్య మింతట తటస్థింపనేరదు. అయినను తల్లు లితరవిధములచేత తమసంతతిని సాధ్యమైనంత బలప్రదముగాఁ జేయవచ్చును. వాసగృహమును శుచిగా నుంచుట, శుద్ధవాయుప్రసారము గలుగునట్లు చేయుట, స్నానపానములకు నిర్మలజలము నుపయోగించుట, ఆరోగ్యకర మయిన యుక్తాహారమును పెట్టుట, పరిశుభ్రమయిన వస్త్రములను గట్టనిచ్చుట, దేహపరిశ్రమము తగినంత గలిగించుట, మొదలయిన విషయములలో తగినంతశ్రద్ధ చేసినపక్షమున శిశువులు దృఢదేహు లగుటకు సందేహము లేదు. అన్యదేశములకంటె మనదేశములో శిశువు లెక్కువగా పురుటిదినములలోనే మరణము నొందుచున్నారు. అట్లుకాలమృత్యువువాతఁ బడక బ్రదికినవారును తఱుచుగా దృఢగాత్రులు గాక వ్యాధిపీడితు లయి దుర్బలశరీరు లగుచున్నారు. దీనికి ముఖ్యకారణము పురుటిండ్లలో మంచివాయువును చొరనీయకుండుటయే. ఇటువంటి పెద్దపట్టణములలోఁ గొంతవఱకు మంచిస్థితిలోనున్నను సామాన్యముగా నితరస్థలములలో

సూతికాగృహములు మిక్కిలి యిఱుకైన చిన్నగదులుగా నుండును; వానిలో ధారాళముగా గాలివచ్చుటకు చాలినన్ని గవాక్షములే యుండవు; ఉన్న తలుపులనైనను తెఱచి యుంచక ముసలమ్మలు మూసి వేయుదురు; చూడ వచ్చిన యమ్మలక్కలాచీఁకటిగదిలో గుంపుగుంపులుగా మూఁగియున్న గాలినిసహితము చెఱుపుదురు; ఆపయిని కుంపట్లు పెట్టెదరు. ఇట్లు శుద్ధవాయువునకు గర్భశత్రువు లిన్ని యొక్కచోటఁ గూడినప్పు డా ప్రసూతికాగృహములలోని మాతాశిశువులు బ్రతికి బయలఁబడుట వింతగాని మఱియొకవిధ మగుట వింతగాదు. దుర్గంధయుక్తమయిన యాగదిలో శిశువు గతించుట సంభవించెనా, నిజమయిన కారణమును కనుఁగొనలేక నొసటివ్రాఁత యట్లున్నదనియు, ఆయువులేదనియు, పూర్వజన్మపాపఫల మనియు ఎన్నఁడున్న నెత్తికొట్టిన దనియు, కల్పితకారణములను జెప్పికొని మనస్సమాధానము చేసికొందురు. దుర్గంధముచేత గదులలో పుట్టెడు పేడపురుగులను ఎన్నమ్మలని చెప్పుదురు. తల్లులు విద్యావతు లయినఁగాని యీయనర్థ మెట్లు తొలఁగును? విద్యనేరనివారు మంచితల్లు లెట్లగుదురు? మంచితల్లులు లేక దేశ మెట్లభివృద్ధి చెందును? దేశాభివృద్ధి కేమి కావలయునని యొకరు ప్రశ్న వేయఁగా, మంచితల్లులు కావలెనని పూర్వము నెపోలియన్ చక్రవర్తి యుత్తరము చెప్పెనఁట! విద్యావతులు గాని మూఢమాతలు తమబిడ్డలకు విలువబట్టలను దొడుగఁ జూతురు గాని విమల వస్త్రములను తొడుగఁజూడరు; బయల దిరిగిన వయిని పిట్టలు పాఱునని గదులలో మూసిపెట్టఁజూతురుగాని బిడ్డలను మంచిగాలిలోఁ ద్రిప్పఁజూడరు; ఆఱవనెలనన్న ప్రాశనము చేయింపఁజూతురుగాని పాలుత్రాగింపఁజూడరు. శిశువులకు రెండుసంవత్సరములు దాటుపర్యంతము ద్రవపదార్థముగా లఱుగునుగాని అన్నము మొదలయిన ఘనపదార్థములు జీర్ణ

ములు కావు ఆఱవనెలనే యన్నప్రాశనము చేసి పప్పు ముద్దలు బల వంతముగా మ్రింగించుటయే కాక తల్లి భోజనము చేయునప్పుడు తల్లి యొద్దను తండ్రి భోజనము చేయుచున్నప్పుడు తండ్రియొద్దను తాము తిను నదియెల్ల మ్రింగఁ బెట్టుచు వచ్చినచో తిన్నది యఱగించుకోలేని శిశువు లెట్లు దుర్బలులు కాకుండ నేర్తురు! ఇట్లు శిశువులు దుర్బలు లగుచున్నను విచారము నొందక విద్యావిహీన లైె మానినులు తమకునలెనే తమ బిడ్డలకును దేహములనిండ నాభరణముల నుంచఁ జూతురు. దేహమున కారోగ్యమే యమూల్యాలంకారము గాని లోహపుతొడవు లలంకారములు గావు. మూఢురాండ్రు మాత్రమే తమ నగలను జూచుకొని విశ్వము మఱచి గర్వపడుదురు. ఈవిష యమున మీకొక్కచిన్నకథ చెప్పెదను. ఇటలీదేశమునందు "కార్నీ లియా" అనుపేరు గల యొక యుత్తమమాత యుండెను. ఆమెను జూచుట కయి యొక ప్రభువుభార్య యొకనాఁ డామెయింటికిఁ బోయి తన నగలను జూచుకొని సంతోషించుచు గర్వముతో "ఏవీ? నీనగలు నాకు చూపుము" అని యడిగెను. "ఒకనిమిషము తాళుము. చూపె దను" అని పలికి, బడినుండి రాఁగానే దృఢసుందరగాత్రు లయిన తన యిరువురు బిడ్డలను గొనివచ్చి యామెముందు నిలిపి "ఇవిగో! నా యమూల్యాలంకారములు చూడుము." అని చూపెను. ఆప్రభు భార్య తన యవివేకమునకు సిగ్గుపడి యింటికిఁ బోయెను. ఈ దేశము నందలి సుందరీమతల్లు లయిన తల్లులెల్ల తా మిటువంటి యమూల్యా భరణములను లోకమునకుఁ జూపఁ బ్రయత్నింతురుగాక!

ఈవఱకును బిడ్డల నారోగ్యవంతులనుగాఁ జేయవలసిన ప్రథమ ధర్మములను గూర్చి కొంత చెప్పితిని. ఇఁక వారిని సద్వర్తనము గల వారినిగాఁ జేయవలసిన రెండవ మాతృధర్మమును గూర్చి కొంత

ముచ్చటించెదను. వసునుబట్టి దీనిని రెండవ ధర్మముగాఁ జెప్పి నను గుణగౌరవమునుబట్టి యిదియే ప్రథమధర్మ మని చెప్పవచ్చును. తల్లులు నడచినట్లు పిల్లలు నడుతురు. తల్లినిజూచి పిల్లను గ్రైకొనవలె నన్నసామెత మీరందఱును విన్నదేకదా? కాఁబట్టి పిల్లలను సద్వర్త నము గలవారినిగాఁ జేయుటకు ముందుగా తల్లులు తాము సద్వర్త నము కలవారు కావలెను. తల్లి శాంతస్వభావయు, మృదు భాషిణియు, సత్యవ్రతయు, అయినయెడల బిడ్డలు నట్లే యగుదురు. అట్లుగాక యామె కోపశీలయు, పరుషభాషిణియు. అసత్యవాదినియు, అయినచో బిడ్డలు సహితి మట్టివారే యగుదురు. తల్లియొక్క దినవర్త నమే బిడ్డలకు దినపాఠముగా నుండును. ఉపాధ్యాయులు నూఱుగురి కంటెను నొక్కతల్లి యెక్కువ విలువ చేయును. తల్లి యజ్ఞానము వలనను దుర్వర్తనమువలనను పాడయిన పుత్రుని వేవురుపాధ్యాయు లయినను బాగుపఱుపఁజాలరు. తల్లి దురాగ్రహము కలది యయిన బిడ్డలు కోపిష్టు లగుదురు; తల్లి దుర్భాషలాడునది యైన బిడ్డలు తిట్టుఁ బోతు లగుదురు; తల్లి కల్లలమారి యయిన బిడ్డలు కల్లరు లగుదురు; ఇవి యివి యని వేఱుఁగ జెప్పనేల? తల్లులయం దేయే యవలక్షణము లుండునో బిడ్డల కాయాయవలక్షణములు పట్టుపడును. కాఁబట్టి బిడ్డల మేలుగోరు మాత లందఱును స్వప్రవర్తనవిషయమున మిగుల జాగ రూకురాండ్రయి యుండవలెను.

జనని తన శిశువునకు నేర్పవలసిన మొదటి సుగుణము విధే యత. విధేయతలేనిచో నితరసుగుణములు పట్టుపడవు. శిశువులు ప్రతి విషయములోను తల్లి యాజ్ఞకు పరమవిధేయు లయి నడుచుకొను నట్లు చేయవలెను. తమ మనసు వచ్చునట్లు చేయఁగూడ దనియు, తా మెప్పుడును తల్లిదండ్రులకు లోఁబడి వారు చెప్పినట్లు చేయవలయు

సనియు, బిడ్డలు గ్రహించినట్లు చేయవలెను. ఆలోచన లేని బిడ్డ లొక ప్పుడు తల్లి చెప్పినట్లు చేయక తమ యిచ్ఛవచ్చినట్లు చేయఁజూతురు. అట్టి సమయములయందు పిల్లలపంతము గెలువనియ్యక, ఆవశ్యక మయినచో దండించియైనను జనని తన యాజ్ఞాప్రకారముగా వారు నడుచునట్లు జేయవలెను. ఒకసారి వారిమాట సాగనిచ్చిన పక్షమున పిల్లలు తల్లులమాట వినక తిరుగఁబాటు చేయుచుందురు. తమమాట సాగదని పిల్ల లొకసారి దృఢముగా తెలిసికొన్నయెడల తరువాత వా రెన్నఁడును తల్లిదండ్రుల యాజ్ఞను మీఱక విధేయులయి వర్తింతురు. కొందఱు తల్లులు బిడ్డలు తమమాట విన రని చెప్పుదురు. అట్లయి నచో నది స్వయంకృతాపరాధము కాని వేఱు కాదు. తల్లి శిశువుల కొకయాజ్ఞ యిచ్చు నప్పుడు వారది చేయఁ దగినదియు, చేయక నిరాకరించినప్పుడు తాను వారిచేత చేయింప నిశ్చయముగా తలఁచు కొన్నదియు, అయిన యాజ్ఞనే యియ్యవలయును. వా రది చేయనిచో నుపేక్షించి యూరకుండఁ దలఁచుకొన్న యాజ్ఞ నెప్పుడు నియ్యఁగూడదు. ఒకసారి చేయఁగూడ దన్న పని వారప్పుడు మానివేసి మఱియొక సారి చేసినను తల్లి యుపేక్షించి యూరకుండ గూడదు. అట్లూర కుండుటకంటె నవిధేయతను నేర్పుటకు బలవత్తర మయిన మార్గము లేదు. ఇట్టి యుపేక్షామూలమున నలవాటు పడినకార్యమును మాన్పు టకు తరువాత బతిమాలుకొనుట గాని బెదరించుటగాని పనిచేయదు. ఇచ్చినయాజ్ఞను బిడ్డలు వెంటనే చేయునట్లు చేయవలెను. ఎందుచేత చేయవలె నని వారి నడుగనియ్యఁ గూడదు; ఆయాజ్ఞను చెల్లించు టకు వారిని భయపెట్టుటగాని లంచమిచ్చుటగాని కూడదు; వారు తన్నేలక్ష్యము చేయునట్లు చేయవలెనుగాని, చేయక పోయినచో నాయనతోఁ జెప్పికొట్టించెద ననఁగూడదు. బిడ్డలు తల్లిదండ్రుల

కీర్దరకును పహూనపులగానే విధేయులు కావలెను. ఈవిధేయతను తల్లి శైశవమునుండియు నేర్పవలెనుగాని, తరువాత నేర్పుట సాధ్యము కాదు. బిడ్డలకు విధేయత నభ్యాసము చేయించినచో సమస్తసుగుణములను సులభముగా నేర్పవచ్చును.

ఉత్తములగా లయినమాత తా నసత్యము నెప్పుడును పలుకకుండవలెను. లోకములో నసత్యమును మించిన పాపకార్యము వేఱొకటి లేదు. తల్లి యెప్పుడును బిడ్డలను సత్యము పలుకునట్లు ప్రోత్సాహపఱుపవలెను. అమెరికాఖండములోని "యూనైటెడ్ స్టేట్సు" నకు మహోపకారముచేసి మహోన్నతస్థితిని బొందినజార్జి వాషింగ్టను నునాతఁడు పసివాఁడుగా నున్నప్పు డతని కొకరు పోటకత్తిని బహుమానము చేసిరి. ఆబాలుఁడు కత్తిదొరకిన దన్నసంతోషముచేత తోఁటచొచ్చి చెట్లకొమ్మలను నఱుకుచు, తనతండ్రి ప్రాణపదముగా పెంచుకొనుచుండిన రేగుపూల మొక్కను మొదలంట నఱికివేసెను. తండ్రి మఱునాఁడు వాడుకచొప్పున తోఁటకుఁ బోయి చూచునప్పటికి తనప్రియమైనచెట్టు ఖండింపఁబడి చచ్చి పడియుండెను. అది చూచి యాతఁడు ఖిన్నుఁడయి యాపని తన తోఁటవాండ్రెవ్వరో చేసియుందు రని వారిమీఁద కోపపడుచుండెను. ఆసమయమునందు కత్తి చేతఁ బట్టుకొని యాబాలుఁ డక్కడకు వచ్చెను "ఈచెట్టెవ్వరు నఱికినారో యెఱుఁగుదువా!" అని యతఁడు కుమారుని నడిగెను. ఆబాలుఁడు క్షణ మూరకుండి తండ్రికోపమును జూచియు భయపడక "నానోటినుండి యసత్యము రాదు. నేనే నఱికితిని." అని నిశ్శంకముగా పలికెను. అప్పుడు తండ్రి వెంటనే కోపమును శాంతి పఱచుకొని "వెండిపూవులును బంగారుపండ్లును గల వేయిచెట్లకంటెను సత్యమొక్కటవ విలువగలది" అని పలుకుచుఁ

బోయి కుమారుని కౌఁగిలించుకొనెను. ఆబాలుని తల్లియు సుగుణ సంపదయందు తండ్రికి తీసిపోవునది కాదు. తండ్రి బాల్యముననే లోకాంతరగతుఁడు కాఁగా తల్లియొక్క శిక్షవలననే యీబాలుఁడు మహనీయుఁడయి మహోన్నతదశనుబొందెనని చరిత్రకారులు వ్రాసి యున్నారు. ఇట్టితల్లిదండ్రులనేకులు కలిగినప్పుడుగదా దేశ మున్నత స్థితికి వచ్చును! బాలుఁడు తాను జేసిన తప్పిదము నొప్పుకొని పరి తాపపడినచో దండింపక క్షమించి సత్యమును ప్రోత్సాహపఱుప వలెను. విద్యావిహీనురాండ్రయిన యవివేకినులు కొందఱు తాము కల్లలాడి బిడ్డలకు కల్లలు నేర్పుదురు. బిడ్డలు తప్పు చేసినప్పుడు కప్పిపుచ్చఁ జూచుట, వారి తప్పులను మఱుఁగుపఱుపఁ జూచుట, నేరము చేయ నట్టితండ్రితోఁ జెప్పఁడని బోధించుట, వారిచే నొక కార్యమును జేయించుట కయి యసత్యములు పలు కుట, ఇవి బిడ్డలకు బొంకులు నేర్పెడుమార్గములు. ఇటువంటి పనికి మాలినప్రేమవలనను, బుజ్జగింపులవలనను, బిడ్డలు పాడగుదురు. ఇట్టి తల్లి బిడ్డలకు శత్రువుగాని ప్రేమ చూపునది కాదు. తప్పు చేసినప్పుడు దండించుటయే బిడ్డలయెడలఁ జూపవలసిన నిజ మయినప్రేమము; అదియే వారికి శ్రేయస్కరము. మందు మ్రింగించుటకయి చేదు మందు తీయమందని బొంకి యొకసారి వంచింపఁగలిగినను, బిడ్డఁడు తోడనే సత్యమును దెలిసికొని తల్లిమాటయెడ గౌరవము చెడినవాఁ డయి నిజముచెప్పినను నమ్మకుండును. శిశు వొకయద్దమును ముట్ట బోయినప్పుడు వలదని యాజ్ఞాపింపక ముట్టుకొన్నచో బూచి కఱచు నని వంచించి మాన్పించినచో వంచనమును శీఘ్రముగానే తెలిసికొని తల్లియెడల గౌరవము లేనివాఁడును అవిధేయుఁడును అగును. కాఁబట్టి యసత్యము లాడియు, వంచించియు, శిశువులచేత పని జేయించుటకు

తల్లు లెవ్వరును బ్రయత్నింపరాదు. లంచములు చవి చూపియు చెప్పినపనిని చేయునట్లు బిడ్డలనొడంబఱుపరాదు. ఒకపని చేయుట కయి యొకసారి పండో భక్ష్యమో యిచ్చినయెడల రుచిమరగినవా రయి యేపని చేయవలసి వచ్చినను లంచ మడుగుచు, ఇయ్యనిచో చేయక నిరాకరించి యేడ్చుచు, అవిధేయత కలవాటు పడుదురు.

కొందఱు మూఢవనితలు తమబిడ్డలు తప్పుచేసినప్పుడు ముద్దుచే దండింపక నవ్వుచు నూరకుందురు! కొంద అతిప్రేమచేత బిడ్డలను యథేచ్ఛముగా నడవనిచ్చి వారితప్పిదములనే గ్రహింపఁజాలరు; కొందఱు గ్రహించినను, అవి చిన్నతనపుచేష్టలని పలుకుచు నుపే క్షించి తప్పు చేసినవారినే నిందింతురు. ఇట్టివా రందఱును దయయుపేక్ష వలన బిడ్డలు చెడిపోయి పెద్దవారయి దుష్టు లయినప్పు డాఫలము ననుభవించుచు సంతాపపడవలసినవా రగుదురు. అనేకులు తమ బిడ్డలు చక్కనివా రయినప్పుడును, దుర్బలు లయినప్పుడును, పలు వురు పుట్టి చచ్చినప్పుడును, ఏకపుత్రుఁ డయినప్పుడును, గారాబము చేత నిట్టి యుపేక్ష చేయుదురు. కొంద ఱిట్టివి స్వల్పాంశము లను కొన్నను, వానివలనఁ గలుగు చెడుగు మాత్రము స్వల్పము కాదు. ఇట్టి స్వల్పాంశములే యభ్యాసము లయి కాలక్రమమున పెరిగి దుర్వృత్తికి దింపును. కాఁబట్టి స్వల్పాంశములలో సహితము జాగరూకత వహించి తప్పెంత చిన్నదిగానైనను ప్రారంభములోనే మాన్పఁ బ్రయత్నింప వలెను.

తప్పెప్పుడు చేసినను, ఎంత చిన్నతప్పయినను, తగినశిక్ష చేయవలెను. చేసినశిక్ష కఠిన మయినదిగా నుండక యపరాధనివార ణమునకుఁ జాలినంత యల్పమయినదిగా నుండవలెను. ఒకసారి బిడ్డ వంక కోపదృష్టితో చూచుటయే చాలి యుండును; ఒకప్పు డొక

చిన్నమాటయే చాలి యుండును; ఒకమాఱు కొంచెము మందలింపు చాలి యుండును; ఒకసమయమున నొకతిట్టు చాలియుండును; వీనిలో నేనివలనను ప్రయోజనములేక శిశువు చేసిననేరమునే మరలఁ జేసినప్పుడుమాత్రమే యొకదెబ్బ కావలసియుండును. చేసిననేరము బుద్ధిపూర్వము గాక ప్రమాదజనిత మయినపక్షమున దండింపనే కూడదు. బిడ్డలస్వభావమునుబట్టికూడ దండనము వేఱువేఱువిధములుగా నుండవలెను. సాధుస్వభావము గలవారికి మంచిమాటలే చాలును; దుష్టస్వభావము గలవారికి కొంచెము కఠినముగా ప్రవర్తింపవలసి యుండును. నేరముల స్వభావమునుబట్టియు దండనము మాఱుచుండ వలెను. బంతితో సోదరునిఁ గొట్టినయెడలఁ బంతిని లాగుకొనుటయే శిక్ష; అజాగ్రత్తవలన నొకవస్తువును పోఁగొట్టుకొన్న యెడల, మరల దానిని కొని యియ్యకుండుటయే శిక్ష; ఇంకొకరివస్తువును పాడు చేసినయెడల, వానివస్తువు నొరున కిప్పించుటయే శిక్ష; పిల్ల లొండొరులతో కలహ మాడినయెడల, మరలఁ గలసి యాడుకొకుండ దూరముగా తొలఁగించుటయే శిక్ష. అతిక్రూరతవలనను, అతిప్రేమము వలనను కూడ బిడ్డలు చెడుదురు గాన దండించుటలోను దయ చూపుటలోను హద్దు మీఱకుండవలెను. బిడ్డలను పలుమాఱు దూషించుచుండను గూడదు; భూషించుచుండను గూడదు; ప్రతి స్వల్పవిషయమునకును తిట్టుచున్నను మెచ్చుకొనుచున్నను వానివిలువ తగ్గిపోవును. అట్లని బిడ్డ లెంతటి శ్లాఘాపాత్ర మయినపని చేసినను మెచ్చుకొనఁగూడదని నాయభిప్రాయము కాదు. బిడ్డ లేదియైనను మెచ్చఁ దగినవిశేషకార్యమును జేసినప్పుడుమాత్రమే విశేషాదరమును జూపి శ్లాఘింపవలెను. అటువంటిసమయములలో జనని యొక్కసారి కౌఁగిలించుకొన్నను ముద్దు పెట్టుకొన్నను సత్కార్యాచరణమం దది

బిడ్డల కెంతో యుత్సాహకరముగాను సంతోషదాయకముగాను నుండును. ఒకసుప్రసిద్ధుఁ డయినచిత్రకారుఁడు తనతల్లిముద్దే తన్నంత వానిఁగాఁ జేసెనని వ్రాసి యున్నాఁడు. చదువు మొదలయినవాని యందు విశేషపరిశ్రమమును చాతుర్యమును జూపినపక్షమున బిడ్డలకు బొమ్మలు పుస్తకములు మొదలయినవి బహుమానము చేయుట మంచిదిగాని మధురాహారములు, ఫలములు, రొక్కము, ఇచ్చుట యంత మంచిది కాదు. లడ్డువలు మొదలయినవి తఱుచుగా నిచ్చుచు వచ్చినచో బిడ్డలు తిండిపోతు లగుటయేకాక యారోగ్యహీనులుసహిత మగుదురు.

ఎవ్వరియందును బక్షపాతము చూపక యందఱిని సమాన ముగాఁ జూచుచు తల్లి బిడ్డలకు న్యాయవర్తనము నేర్పవలెను. తమ వస్తువు లితరులు తీసికొన్నప్పుడు తమ కెంతదుఃఖము కలుగునో యట్లే యితరులవస్తువులు తాము తీసికొన్నప్పుడు వారికిని నంతదుఃఖము కలుగునని బోధించి బిడ్డ లితరులవస్తువుల కాసింపకుండునట్లు చేయ వలయును. బిడ్డ లొండొరులపై దయచూపునట్లును, స్వప్రయోజన పరత్వమును విడుచునట్లును జేసి శైశవమునందే పరోపకారబుద్ధిని బుట్టింపవలెను.

మూఢస్త్రీలలోఁ గలదుర్గుణ మొక్కటి యీసందర్భమునఁ జెప్పవలసి యున్నది. కొందఱు వేడుకకొఱకు బిడ్డలకు తిట్లు నేర్పి, వారిచే నితరులను దిట్టించి యానందింతురు. ఇది యెంతయు దూష్య మయిన పని. బిడ్డలకు అమ్మను తిట్టు, నాయనను కొట్టు, అని బదులు నేర్పు తండ్రియు తల్లియు తాము వహించిన యాపవిత్ర నామముల కగౌరవము తెచ్చువారని వేఱ చెప్పవలయునా? యోగ్యు

లయిన తల్లిదండ్రు లెప్పుడును మోటుమాట తమనోట వెడలనియ్య రాదు; నోటినుండి పరుషోక్తి వెడలినచో బిడ్డలను మందలించుచు బిందొరులను తిట్టుకొనకుండునట్లు చేయుచు, వా రాటలయందు సహితము మృదుత్వము తప్పినపట లాడుకొనకుండునట్లు చేయవలెను.

తన బిడ్డలను జ్ఞానవంతులనుగాఁ జేయుట తల్లియొక్క మూడవ ధర్మము. తల్లి విద్యావతియైనఁ గాని బిడ్డలను విద్యావంతులనుగాఁ జేయఁజాలదుగదా. మంచితల్లి బిడ్డల కుగ్గుపాలనుండియు సమస్తవిషయములలోను జ్ఞానమును గఱపుచుండును. బిడ్డల శ్రేయస్సు గోరిన తల్లి యీశ్వరభక్తియు పాపభీతియు మొదటినుండియు వారికిఁ గలిగించుచుండును. బిడ్డలను చనుబాలతోఁ గూడ భగవద్గుణామృతమును త్రాగింపవలె నని యొకానొకరు వ్రాసియున్నారు. బాలురకు విద్య కూడ దనవారు లేక పోయినను బాలికలకు విశేషవిద్య యక్కఱ లేదనువా రిప్పటికిని విద్యాధికులలోనే కొందఱందుఁ గానఁబడుచున్నారు. విద్యాగంధము లేనివారికిఁ బుట్టి వారిచేఁ బెంపఁబడిన వారికెంత చదువుకొన్నను చిన్ననాటివాసన పూర్తిగా పోనేరదు. పురుషులకు వలెనే స్త్రీలకును విద్య సర్వశుభప్రద మనుట నిర్వివాదాంశము గనుక స్త్రీలకువిద్య యావశ్యకమని యిచ్చటఁ జర్చింపవలసిన పనిలేదు. బాలురకువలెనే బాలికలకును విద్య సమానముగాఁ జెప్పింపవలెను. బాలునికి విద్య నేర్పుటవలన విద్యాసంపన్నుఁడొక్కఁడే కలుగుననియు, బాలికకు విద్యనేర్పుటవలన విద్యాసంపన్నమైన కుటుంబము కలుగు ననియు నొక బుద్ధిమంతుఁడు నుడివియున్నాఁడు. ఒకవిధమునఁ జూడఁగా పురుషులవిద్యకంటె స్త్రీల విద్యయే యెక్కువ యుపయోగకర మయినట్టు కనఁబడుచున్నది.

విద్యాభావములవలననే మనలోని స్త్రీ లిప్పుడు శిశువులను చక్కఁగా పెంచఁజాలకయు, సమయానుగుణముగా భర్తలకు హితము చెప్ప నేరకయు, సద్విషయములయందు కాలము పుచ్చఁ జేతఁగాకయు, జగడములతోను పరదోషకథలతోను పనికిమాలిన యుపవాసముల తోను, నోములతోను, వ్రతములతోను, మూఢవిశ్వాసములతోను కాలము గడుపుచున్నా రని తెలిసినవారు చెప్పుచున్నారు. స్త్రీలు విద్యావతు లయినచో నిట్టిదోషములన్నియు తొలఁగి దేశము బాగు పడుననుటకు సందేహము లేదు.

గృహమునకు తల్లియే రాణియనియు, అందుచేత నామె సాధ్య మైనంత యధిక విద్యావతిగా నుండవలె ననియు, ఈవఱకే చెప్పి యున్నాను. లోకములో నధిక విద్యావతు లైనతల్లులుమాత్రమే యుత్తమమాత లగుదురు. విద్యాగంధము లేనిమూఢురా లెట్లు గృహమునకు రాణియయి కుటుంబపరిపాలనము చేయఁగలుగును? శిశు పరిపాలనము ప్రజాపరిపాలనమునకంటె సులభమయిన పని కాదు. తల్లి శిశువులయొక్క గుణశక్తిసామర్థ్యములను గ్రహించి, వారిలో నేది ప్రబలమో యేది దుర్బలమో, వారి యాధిక్యము లేవో న్యూనత లేవో, వారి కేవిషయమున సాయము కావలెనో యేవిషయమున అసహాయకార్యనిర్వాహకశక్తిగలదో, తెలిసి తగినట్లు నడపుట విద్యా వతికిఁగాక యితరులకు సాధ్యమగునా? సన్మాత సాధుస్వభావము కల దయ్యును దృఢచిత్తత కలదిగా నుండవలెను; వాగ్మాధుర్యమును మృదువర్తనమును దయార్ద్రహృదయమును గల దయి బిడ్డలమనస్సు లను దనవంక కాకర్షింప శక్తి కలదిగా నుండవలెను; ధర్మమును సరిగా గ్రహించి యోర్పుతో ననుసరించునదిగా నుండవలెను; కా

నెప్పుడు లోఁబడవలెనో యెప్పుడు ప్రతిఘటింప వలెనో, ఎప్పుడు పట్టు విడువవలెనో యెప్పుడు బిగింపవలెనో యెఱిఁగిన దయి తాను నేర్పుట లోను నేర్చుకొనుటలోను శ్రద్ధకల దయి యుండవలెను; త్వరపడక కార్యాంశమును చక్కఁగా నాలోచింపఁ గలదిగాను, సునిశ్చిత మయిన కార్యమును యుక్తసమయమున నేర్పుతో నడుపఁగలదిగాను, కోపము నడఁచుకొని నిశ్చలచిత్త కాఁగలదిగాను, ఉండవలెను; బిడ్డల యాటలలో తానును శ్రద్ధ చూపుచు, ఆటలలోనే వినోదకరముగా పాటను నేర్పుచు, పాటను వారికి హృదయాకర్షకముగాఁ జేయ వలెను; కనుక బిడ్డలు చెప్పినదానినెల్ల సత్యాదరముతో విని తగిన యాలోచన చెప్పుచు, వారిని మంచికిఁ బ్రోత్సాహపఱుచుచు, పరోప కార బుద్ధికలవా రగునట్లు చేయువలెను; తన ముందట బిడ్డలు తమ మనస్సులను స్వేచ్ఛగా విప్పి చెప్పునట్లు దయతో వర్తించి వారి విశ్వాసమునకు పాత్రురాలు కావలెను; బిడ్డలు తనయందు పరిపూర్ణ విశ్వాస ముంచునట్లు నేర్పి, తాను వారివిశ్వాసమున కర్హురాలగు నట్లుగా వర్తింపవలెను; సమస్తవిషయములలోను బిడ్డల గౌరవమును వలెనే వారియనురాగమును సమాకర్షింపవలెను; అన్నిటికంటెను ముఖ్యముగా బిడ్డలయం దవ్యాజప్రేమను జూపుచుండవలెను. ప్రేమయే సమస్తమును పవిత్రముచేసి, సమస్త విషయములలోను విజయము కలిగించునది. తల్లియొక్క ప్రేమమే పిల్లలను సదా సుఖ వంతులనుగాఁ జేయునది.

# GRACE DARLING.

## గ్రేస్ డార్లింగు కన్య.



తీవ్రభంజనము క్రూరముగా వీచుచు తరంగములు తాళప్రమాణములుగా లేచుచు నల్లకల్లోలముగా నున్న సముద్రమున కంటె నధిక భయంకర మయినది వేరొకటి యేదియు లోకములో గనుపట్టదు. మహావాత్యలు విజృంభించి సముద్రతరంగముల నాకాశపథమున కెగయించుచుండఁగా, కాలమేఘములు కాఱుక్రమ్ముకొని

సూర్యరశ్మి నడఁచి యుఱుములతోను మెఱుపులతోను సంతత ధారగా జడివాన కురియుచుండఁగా, దారునిర్మితనగరము లననొప్పు మహాశాకలు సహితము స్వవశములు గాక ప్రచండమారుతాధీనము లయి పూరిపుడకలవలె మహార్ణవమధ్యమున నిటునటు సంచలించు చుండఁగా, బాల్యావస్థనుండియు సముద్రయాత్రలయం దాఱితేఱి గాలివానల కలవాటుపడి యోడలు గడవ సమర్థు లయిన ప్రౌఢ నావికులును సముద్రము పయి నడుగిడ భయపడుచుండఁగా, అటు వంటి సంక్షోభసమయమునం దల్పవయస్కురా లయిన యొక యబల స్వప్రాణములను సరకుగొనక పరప్రాణరక్షణార్థమై యొకచిన్నపడ వలో నెక్కి సముద్రసంచారమునకు వెడల సాహసించె ననుట యనే కుల కూహింపను విశ్వసింపను రాని యద్భుతకథగాఁ దోఁపవచ్చును. అయినను గ్రేస్‌డార్లిం గనెడుకన్యకామణి యొకతె నిజముగానే యిట్టి ఘనకార్యమును నిర్వహించినది.

మన కథానాయిక యైన గ్రేస్ డార్లింగు 1815 వ సంవత్స రము నవంబరు నెల 24 వ తేదీని జనన మొందినది. ఆమె తండ్రిపేరు విల్లియమ్ డార్లింగు. ఆమె యాతని కేడవబిడ్డ. ఆతఁ డింగ్లండు దేశములోని నార్తంబ్రియా మండలమునకు తూర్పువైపున నున్న సముద్రమునందలి ఫారన్ ద్వీపములలో నొకటియైన "లాంగుస్టోన్" ద్వీపమునందుఁ గట్టఁబడిన దీపగృహమునకు రక్షకుఁడుగా నుండెను. దీనిం జదువువారికిఁ గొందఱికిఁ దీపగృహ మన నేమో తెలిసియుండక పోవచ్చును. సముద్రమునం దోడలు నడపువారికి రేవుస్థలము లేవో, తాము తప్పించుకొని దూరముగాఁ దొలఁగవలసిన యపాయస్థలము లేవో, తెలుపుట కయి సముద్రతీర పట్టణములయందును ద్వీపముల యందును స్తంభములవలె రాతితో మహోన్నతముగా నిర్మింపఁ

బడి, శిఖరములయందు సముద్రముపైని బహుదూరము వరకును గనఁబడునట్లుగా దీపము లుంచుటకయి యున్నపుటిండ్లు కట్టఁబడిన గోపురములు దీపగృహము లనఁబడును. చెన్నపట్టణము, కాకినాడ మొదలయిన రేవుస్థలములకుఁ బోవఁ దటస్థించినవా రీ దీపగృహములను జూచియుండవచ్చును. దీపగృహముయొక్క స్వరూప మీక్రిందిపటమునఁ జూపఁబడి యున్నది.—



ఈఫారన్ ద్వీపములు నిర్మానుష్యము లయినవంధ్యప్రదేశములు; ఇవి శిలామయములై చెట్టుచేమలు లేనివిగా నున్నవి. ఈప్రాంతమునందలి సముద్రము మిక్కిలి యపాయకర మయినది. సముద్ర మిక్కడ సర్వదా తరంగాకుల మయి, పాటువేళ సంఖ్యయం దిరువదింటి కంటె నెక్కువగా నుండెడు యీద్వీపముల నడుమను వడిగాఁ బాఱుచుండెడి ప్రవాహములు గల దయి, యున్నది. అనేక నౌక

లిచ్చట మునిఁగిపోవుచు వచ్చినవి. నూఱుయేంబది సంవత్సరములకు మునుపు నలువది ఫిరంగులు గల డచ్చివారియోడ యొక్కటి యీదీవులలోఁ జిక్కుకొని నావికజనసహితముగా నడు గంటి నశించినది. 1782 వ సంవత్సరమునం దమెరికాఖండమునుండి తిరిగివచ్చుచుండిన వర్తకులయోడ యొక్కటి యిక్కడ ఖండఖండములుగా పగిలిపోయెను. 1823 వ సంవత్సరము జనవరిఫిబ్రవరి నెలలలో నాలుగైదోడ లీనమార్గమున సముద్రముపా లైనవి. ఇట్టియపాయములను బట్టి యిచ్చటదీపగృహము మిక్కిలి ముఖ్యమయినదయినందున, దానికి పాలకుఁడుగానుండువాఁడు సమర్థుఁడునుబుద్ధికుశలతయు జాగరూకతయుఁగలవాఁడును నయి యుండవలసి యుండెను. అట్టియోగ్యత లన్నియుఁ గలవాఁ డగుటచేత విల్లియమ్ డార్లింగు దీనికి రక్షకుఁడుగా నియమింపఁబడెను. ఇతఁడు స్వకృత్యనిర్వాహణమునందు నిపుణుఁ డయి జాగరూకుఁడయి యుండుటయే కాక యవకాశము చేసికొని తనబిడ్డల విద్యాబుద్ధులవిషయమునను శ్రద్ధాళువయి పాటుపడుచుండెను. అందుచేత నితనిబిడ్డ లందఱును సామాన్యముగా విద్యావంతులుగ యుండిరి. మనకథానాయికయైన గ్రేస్ డార్లింగు సదా శాంతస్వభావమును ముఖవికాసమును గలదయి మితభాషిణియు పరోపకారశీలయు నయి యుండెను. ఆమె మిక్కిలి సూక్ష్మబుద్ధి గలదయి చక్కఁగా వ్రాయుటకును చదువుటకును నేర్చినది; ఆమె యేవటి కెన్నఁడును పడవను నడుపుటలో తండ్రికి సాయముజేయ నలవాటు పడి యుండినది కాదు. గృహకృత్యము లన్నియు నీమెతల్లియే చక్కపెట్టుచుండెడిది. ఇట్లుండఁగా నీమె నాకస్మికముగా లోకప్రసిద్ధురాలినిగాఁ జేసినవృత్తము 1838 వ సంవత్సరము సెప్టెంబరునెల యేడవ తేదిని జరుగుట తటస్థించెను. అప్పటి కామెప్రాయము యిరువదిరెండు సంవత్సరములు.

1838 వ సంవత్సరము సెప్టెంబరునెల 5 వ తేది సాయంకాలము "ఫోర్ ఫార్ షైర్" అను ధూమనౌక హల్ నగరమును విడిచి స్కాట్లండునకుఁ బోవుచుండెను. 'జాన్ హాంబుల్' అను నతఁడు దానికి నాయకుఁడుగా నుండెను. ఆపోగయోడయందు విశేషముగా విలువగల వాణిజ్యపు సరకులును గదులు పుచ్చుకొన్నట్టియు వయినున్నట్టియు పథికులును నుండిరి. గదులలో నున్నవా రిరువదియిద్దరును పయినున్నవారు సుమారొక్కొండ్రును, పథికులు నలువది యొక్కరును, ఓడనాయకుఁడును భార్యయు నిరువురును, నావికులును యంత్రకారులును బొగ్గువేయు వారును గలసి యిరువండ్రును, అందఱును జేరి యున్నవాడా యోడలో నఱువదిమువ్వురు జను లుండిరి. రెండు సంవత్సరముల క్రిందటనే కట్టఁబడిన దగుటచేత నోడ క్రొత్తదే కాని దాని యావిరి నీటిఖానలును యంత్రములును మాత్రము మంచిస్థితిలో నుండలేదు. గురువారము నాఁటిరాత్రి యావిరినీటి యినుపఖానలనుండి నీరు కార నారంభించెను. గొట్టములతో నీరెక్కించి యెంతప్రయాసపడినను, నీ రంతు నిలువలేదు, నాటిరాత్రి 12 గంటలలోపలనే గాలి యధికమయి సముద్ర మెంతో యెత్తుగకు లేచెను; 12 గంట లగునప్పటికి కడు గొప్ప గాలి వాన యయ్యెను. ఆవిరి నీటిఖానలలోని నీరు కాఱిపోవుచుండఁగా యంత్రము పనిచేయక నిలిచిపోయి చక్రము లాడుట మాని వేసినందున ఓడ కర్ణధారునికి వశము గాక ప్రవాహమును గాలియు నీడ్చినట్లెల్లఁ బోవ దొడఁగెను. ఓడలోనుండిన యాత్రికుల యంతరంగములు భయాకులములయినందున నెల్లవారును దిగ్భ్రమనొంది ప్రాణములమీఁది యాశ వదలుకొని గొల్లున గోలపెట్టి యేడ్వఁగ మొదలుపెట్టిరి. ధూమనౌక గట్టునంకఁ గొట్టుకొనిపోవుచున్నట్టు పొడగట్టినందున నోడనాయకుఁడు మనసు సొదరనీయక ధైర్య మవలంబించి తెరచాప నెత్తించి మర

లింపఁ బనిచేసెను గాని యాతనికృషి విఫల మయ్యెను. ప్రవాహము దక్షిణమువైపునకు బలముగాఁ బాఱుచున్నందున నిరాధార మైన యా యోడ దానిలోఁ బడి కొట్టుకొనిపోయి తుదకు విఱిగెడి భంగములలోఁ బడెను. ఫారన్‌ద్వీపములలోని దీపగృహముయొక్క వెలుతు రెదుట స్పష్టముగాఁ గనఁబడుచుండెను. అందుచేతఁ దా మవ్వా డున్న స్థల మేదో యెంత యపాయకర మైనదో యెల్లవారికిని దెల్ల మయ్యెను. ఓడనాయకుఁ డైన హాంబుల్‌ద్వార యోడ నాద్వీపముల నడిమికి నడప వలెనని కడప్రయత్న మొకటి చేసి చూచెను గాని దానివలనను బ్రయోజనము లేకపోయెను. తెల్లవాఱుజామున నాలుగుగంటలవేళ భాగ్యహీన మైన యాయోడయొక్క ముందుభాగ మొక కొండమీఁదఁ దగులుకొనఁగా వెనుకటిభాగ మలలతాఁకున వెనుకకును ముందుకును నూఁగులాడుచుండెను. ఈసమయమునందు స్వప్రయోజనపరు లైన నావికులు కొంద ఱాత్మరక్షణార్థమయి యోడకు వ్రేలఁగట్టి యున్న పడవ నొకదానిని క్రిందికి దింపి దానిలో నెక్కి తప్పించుకొని తొలఁగి పోయిరి. ఓడను నేర్పుతోనడిపి యాపత్సమయమునందు యాత్రికుల ప్రాణములు కాపాడవలసినవా రయిననావికులు తమ్ము నమ్మి యాత్ర వెడలివచ్చిన యసహాయు లగు పథికులను సముద్రమధ్యమున నోటి యోడలో దిగవిడిచి తమ దేహములను నిలుపుకొనుట కయి పాఱి పోవుట యవమానకర మైనను లోకములో నెవరిప్రాణములు వారికి తీపి యగుట భావించి వారి నిప్పు డంతగా నిందింపవలసినపని లేదు. వారు పడవను దింపుచప్పుడు చెవినిబడఁగా నే గదిలోనున్న 'హూత్సన్ రిచ్చెచ్' యను పాంథుఁ డొకఁడు వేవేగ లేచి వస్త్రములు వేసికొని వచ్చి వెడలిపోవుచున్న యాపడవలో నెట్లో దుమికెను. గదులలో నుండిన పథికులలో బ్రతికి బయలఁబడినవాఁ డితఁ డొక్కఁడే. అతనిని

జూచి యాతని పినతండ్రియు పినతల్లియు నాతనివెంట బైలువెడలి వచ్చి పడవలోఁ బడవలెనని దుముకిరి గాని గురితప్పినందున సముద్రములోఁ బడి యాతని కన్నులయెదుటనే యుద్ధోగతులైరి! ఓడలోఁ బయినున్న పాంథులయొక్క దురవస్థ యిట్టిదట్టిదని వర్ణించుటకు భాష చాలదు. స్త్రీలయొక్కయు శిశువులయొక్కయు రోదనములును ప్రార్థనములును భంగములయొక్కయు ప్రభంజనములయొక్కయు ధ్వనులతోఁ గలిసి మిన్నుముట్టుచుండెను. ఇటువంటి వ్యాకులసమయములో మహాతరంగ మొకటివచ్చి యమాంతముగా నోడనంతను బైకెత్తి యాకొండమీఁద నురువడితోఁ గూలవేసెను. ఆదెబ్బతో నోడ నడిమికి రెండుప్రక్కలు కాఁగా వెనుకటిభాగము విశేషజనముతో మునిఁగి యదుగంటి యదృశ్య మయ్యెను. గదులన్నియు నీభాగములోనే యుండెను. ఓడనాయకుఁడును భార్యయు నిందే యుండి మడిసిరి.

చాపకోయ్యలును యంత్రములును చక్రములును గల ముందుభాగ మింకను కొండలలో చిక్కుకొని నిలిచియుండెను. ఈహతశేషపోతము నంటిపెట్టుకొని నిరాశు లయిన జీవులు తొమ్మండ్రుగురు ప్రాణములు చిక్కపెట్టుకొని నిలిచియుండిరి. వీరిలో నైదుగురు పాంథులు, నలుగురు నావికులు. ఆపాంథబృందములో సారా డాసన్ అను పేరుగల సుందరియు నొకతె యుండెను. ఆమె తన యిరువురు బిడ్డలను రెండుచేతులలోను బట్టుకొని అొమ్మున కదుముకొని యుండెను. సాయము వచ్చునప్పటి కామె దేహములో ప్రాణము గాలిలోని దీపమువలె సంచలించుచు నిలిచియుండెను గాని చేతులలోని బిడ్డ లిరువురును శవములై బిఱ్ఱబిగిసికొని యుండిరి. బొందిలో

ప్రాణములమీఁది యాశ వదలిపోదు గనుక, ఆపన్నులైన యాత్రికులప్పుడును నాత్మసంరక్షణాశ నూతఁగొని ప్రాణముల నఱచేతఁ బట్టుకొనియుండిరి. పయి నింకను ప్రచండవాయువులు వీచుచుండినను, గాలివాన కొంత తగ్గినట్లుండెను; సముద్రము మాత్రము భయంకరమయి యింకను మహోన్నతముగా లేచుచునే యుండెను. ఇంతలో ప్రభాతమయి నలువంకలు కనఁబడనారంభింపఁగా, ఏదిక్కునుండియు సాయము నప్పుట యసాధ్యమని తోఁచినందున మందభాగ్యులైన యాహతశేషుల కావలఁబున్న యల్పాశ క్షీణించి యడుగంటఁజొచ్చెను. అయినను వారెప్పుడును నెదురుచూడఁజాలని యొకదిక్కునుండి వారి కిప్పుడు సాయము రా సంసిద్ధమై యుండెను. ముఖ్యముగా నొక బీదబాలికయొక్క నిరుపమాన ధైర్యసాహసములచేత వారికి మరణోపద్రవమునుండి విముక్తి గలుగవలసినట్లుగా నేర్పడియుండెను. విపన్నులైనయాపాంథులయొక్క యార్తనాదములు తెల్లవాఱుజామున గ్రేస్‌డార్లింగుకన్యయొక్క చెవిని బడఁగా నామె వెంటనే పోయి తండ్రిని మేలుకొలిపెను. అయినను గాఢాంధకార బంధురముగానుండిన యాసమయ మేవిధమైన తోడ్పాటు చేయుటకును నసాధ్యమైనదిగా నుండెను. కాఁబట్టి వారు కొంతసేపు వేచియుండి ప్రభాతమగుచున్నప్పు డార్తనాదము వచ్చిన దిక్కునకు చూడ్కి నిగిడించి చూడఁగా, పగిలిపోయిన యోడభాగమొకటి వారికంటఁబడెను. వారు భూతదర్పణమును గొని నిపుణముగాఁ బరీక్షింపఁగా వారి కాభగ్నపోతమునం దింకను బ్రాణములతో నున్నవారు కొందఱున్నట్లు గోచరమయ్యెను. ఇఁక వారిని రక్షించుమార్గమెట్టు? గాలి కొంచెము తగ్గినట్లున్నను సముద్ర మింకను మహాతరంగాకులమయి యతిభయంకరముగానే యుండెను. ఆదినము మఱింత ప్రొద్దెక్కిన తరువాత

పగటిపూఁట "స్విడిక్" అను పెద్దమనుష్యుఁ డొకఁడు పౌనుల (75 రూపాయిల) నిచ్చెదనని చెప్పి ప్రార్థించి తీరమునుండి కొందఱు చేఁపలవాండ్రను పాయమునంపు సర్వప్రయత్నములు చేసినను, సముద్ర తరంగములను లక్ష్యముచేయక చిన్నదోనెలలో నెక్కి సదా చేఁపల వలె నీటిలోఁబడి మునిఁగి తేలుచు కొట్టుకొనుచుండెడు చేఁపలవాండ్రు సహితము మొన్నవారును ధనాశచేతనైనను పడవలలోఁ బోవఁ దెగింప లేనప్పు డప్పటి సముద్రపుస్థితి యెట్లుండెనో యితరు లట్టిపనికిఁ బూను కొనుట యెంత ప్రాణాపాయకరమో సులభముగా నూహించి తెలిసి కొనవచ్చును. ఇటువంటి ప్రతిబంధములను పరిగణింపక యిట్టియపాయ సమయమునం దొక చిన్నపడవలో సముద్రముపై వెడల సాహసిం చుట సముద్రయానకుశలు లైన ప్రౌఢనావికులకు సహితము ప్రతిష్ఠా వహమని చెప్పవలసియున్నప్పుడు ముగ్ధ యైన యొక్క యబలయే యట్టి సాహసికకార్యమున కడుగిడినచోఁ జెప్పవలసిన దేమున్నది? సముద్రసంక్షోభమును జూచి తెగువచేయుటకు మొట్టమొదట డార్లింగుదొర యింపక సంశయించె నఁట గాని తన కొమారిత ముందడుగిడఁ గానే యతఁడును ప్రయాణమునకు సంసిద్ధుఁడయ్యెను. తల్లి యొక్క తోడ్పాటుతో పడవయొకటి నీటిలోనికిఁ ద్రోయఁబడగానే కూఁతురును దండ్రియు చెఱియొక త్రెడ్డును చేతఁబట్టుకొని దాని లోనికి దుమికిరి. డార్లింగుకన్య యావఱ కెన్నఁడును తెడ్డుచేతఁబూని పడవనడిపి యెఱిఁగినదికా దని చదువరుల కీసందర్భమునఁ దెలుపవలసి యున్నది. ఏది యెట్లున్నను లోపల నెల్లఁ దానయయి యితర చింతల నెల్ల మఱపించిన యామె యొక్కదృఢమైన యార్తరక్షణపరాయత్త చిత్తమే యామె మృదుహస్తముల కసాధారణబలమును గలిగించి క్షుబ్ధసముద్రముమీఁద పడవను గడపు సామర్థ్యము నొసఁగెను.

వారిట్లు తెడ్లు వేసికొని కర్కశతరంగములతో లేచుచు క్రుంగుచు పడవ నడపుకొనుచుఁ బోయి యెన్నియో కష్టములు గడచి కొంత సేపటికి కెట్లో పగిలిన యోడ యున్న కొండను సమీపించిరి. కాని వారి కన్నుల కప్పుడు ముందు గడచిన కష్టము లన్నిటికంటెను గొప్పదైన కష్టమొకటి యనివార్యముగాఁ గానిపించెను. ఓడలోనున్న వారిని రక్షించుటకయి తాము ముందుగా కొండమీఁద దిగవలెను; తామెక్కి వచ్చిన పడవ నుపగులకుండ కాపాడవలెను. అయులలతాఁకున కొండకుతగిలినపక్షమున తమ పడవ ముక్కముక్క లగు ననుట నిశ్చయము. పడవ పగిలినపక్షమునఁ దా మావిపన్నులను రక్షింప లేకపోవుటయే కాక తామును నందు చిక్కుకొని చిక్కు పడవలసినవా రగుదురు. ఇటువంటి స్థితిలో నపాయకరమును సాహసికము నయినయొక యుపాయముచేత పడవ కొండ దగ్గఱకుఁ బట్టి తండ్రి యందులోనుండి కొండమీఁదికి దుముకఁగానే కూఁతురు తెడ్లువేసి పడవను మహావేగముతో వెనుకకు లోఁతు నీటిలోనికి నడపి తన నేర్పుచేత పడవ యచ్చట తేలి యాడుచుండు నట్లు చేసెను. ఇట్లు శ్రమపడి తండ్రి బిడ్డ లెంతో కష్టముమీఁద నోడపై నున్న తొమ్మండ్రను తమ పడవలో నెక్కించుకొని సురక్షితముగాఁ గొనివచ్చి వారిని తమ దీప గృహమునఁ జేర్చిరి. డార్లింగుకన్య యావిపన్నుల ప్రాణములను రక్షించుటయం దెంతి దయచూపినదో తరువాత నహితి మంతదయనే చూపి మూఁ డహోరాత్రములు సదా వారిని కనిపెట్టుకొనియుండి వారికి గావలసినవానినెల్ల సమకూర్చి, వారిమనోవేదనలను చాలవఱకు శాంతపఱిచెను. ఆదంపతులును కొమారితయు నాయాపన్నులయెడలఁ జూపిన యాదర మింతంత యని చెప్ప శక్యము కాదు. డార్లింగుకన్య తనపఱుపును బిడ్డలను గోలుపోయి విలపించుచున్న డాసన్ దొరసాని

కిచ్చి తా నొకకటికిఁ బల్లమీఁద పరుండెను. తీరమునుండి యీయాపన్నులను రక్షించుటకయి తరువాత వచ్చిన పడవలోని వారు కూడ సముద్రము యొక్క క్రౌర్యమును బట్టి యచ్చటనే నిలువవలసినవా రయినందున డార్లింగు కుటుంబమున కప్పు డతిథు లిరువదిమంది వఱకు నయిరి.

ఘనకార్యము నెంత తక్కువవంశము వారు చేసినను ప్రజల హృదయముల నది యాకర్షింపక మానదు. నిర్జనమై యప్రసిద్ధమైన యొకదీవియం దున్న దీపగృహమునకు నాయకుఁడుగా నుండినవాఁ డుత్తమవంశసంజాతుఁడును విద్యోపేతుఁడును నయియుండుట సాధారణముగా సంభవింపదు; అట్టివాని కూఁతురు పేరు లేని పేదది అయి యుండు నని వేఱుగఁ జెప్పవలసినపని లేదు. కీర్తి గౌరవములు చేసిన ఘనకార్యములనుబట్టి వచ్చును గాని పుట్టుకనుబట్టియు స్థితినిబట్టియు రావు. కాఁబట్టి యెంతహీనస్థితియం దున్నవా రయినను స్వశక్త్యనుసారముగా శ్లాఘ్యకార్యములను నిర్వహింపఁ బ్రయత్నింప వలెను. డార్లింగుకన్యయొక్క యీవృత్తాంతము జల మధ్యమునఁ జేయఁబడిన దయినను వెంటనే జనమధ్యమున వ్యాపించెను. ఈమహాకార్యము నొకటితరువాత నొకటిగా వృత్తాంతపత్రికలెల్లను బ్రకటించి యీ కన్యకారత్నము యొక్క ధైర్యకారుణ్యములను సహస్రముఖముల శ్లాఘాపూర్వకముగా ఘోషింపఁజొచ్చెను. ధనికు లనక దరిద్రులనక పండితు లనక పామరు లనక వృద్ధు లనక బాలు రనక స్త్రీ లనక పురుషు లనక గొప్పవారనక కొలఁదివారనక యెల్లవారి నోళ్లలోను గొంతకాల మీమె పేరే యుండెను. ఆమెను జూచుట కయి యెల్లవారును కుతూహలపడుచుండిరి, పలువురు పనిగట్టుకొనివచ్చి యీమెను సంద

ర్శించి పోవుచువచ్చిరి. ఇట్లామెయుదర్శింప నపేక్షించినవారు సామాన్య జనులు మాత్రమేకాక ప్రభువులలోను బలువు రుండిరి. అనేకు లామెను శ్లాఘించుచు లేఖలువ్రాసి సర్వస్థలముల నుండియు ధనాధికములైన బహుమతులను బంపఁదొడఁగిరి. నార్తంబరులాండు ప్రభువును ప్రభ్వియు నామెను తండ్రిని తమదుర్గమునకుఁ బిలిపించి యాదరించి యామెకు బంగారు గడియారమును బహుమానము నొసఁగిరి. తనెవ్వ రైనను గొప్పవారు చూడవచ్చినప్పుడామె యాగడియారమునుధరించి సంతోషముతోఁ గూర్చుండుచు వచ్చెడిది. ఇట్లొక్కరుగా నంపిన పారితోషికములుగాక లోకసంఘముచేరి యామె యుపయోగము నిమిత్తమయి చందాల పట్టికను ప్రచురించినప్పుడు 700 పౌనులు (10,500 ల రూపాయలు) చందాలుపడినవి. ఇట్లామెపొగడ్త లెల్ల యెడలను మిన్ను ముట్టుచుండునప్పుడు, నాటకసంఘములవా రనేకు లామెచేసిన యీ ఘనకార్యమును నాటకరూపమున రచించి ప్రయోగించుట కుద్యోగించిరి. అట్టి నాటకమును నేత్రోత్సవముగా నెప్పుడు చూతుమాయని జనులును నాత్రపడుచుండిరి. నాటకశాలాధికారులు కొందఱు తాము నాటకమును ప్రదర్శించునప్పుడు నాటకరంగమునకు వచ్చి కొంచెమునే పొక్కవడవలెఁ గూరుచుండినపక్షమున నెంతో సొమ్మిచ్చెద మని యామె రాకను మహోత్సుకతతోఁ బ్రార్థించిరి. ఇచ్చెదమన్న విత్తపు మొత్తము లెంత చిత్తాకర్షకములుగా నున్నను, చేసినప్రార్థన లెంతయువిలంఘనీయములుగాఁ గానఁబడినను, ఆమెస్తోత్రపాఠములయం దెంతమాత్రమును నిష్టము లేని దయి మానినీజనాలంకార మైనవినీతిని నహించి వారి ప్రార్థనల నెల్లను తృణప్రాయముగా నిరాకరించెను. స్వభావము చేతనే యామె యత్యంతవినమ్రయు లజ్జాశీలయు నయి స్తోత్రప్రియురాలు గాకుండెను.

ఎంత యెన్నివిధముల నామెను స్తుతిపాఠకులతో శ్లాఘించినను, మనస్సులో గర్వపడుట గాని యాత్మస్తుతి చేసికొనుటకుగాని తాను చేసిన కార్యము గొప్ప దని భావించుటగాని యామెకు మాత్ర మెన్నడును సరిపడినదిగా నుండలేదు. అనంతర మామె తల్లిదండ్రులతో మూఁడు సంవత్సరములు సుఖముగా కాలము గడపెను. ఈ కాలములో నొకఁడో యామెను వివాహమాడవలె నన్న యిచ్ఛను దెలిపెఁగాని తల్లిదండ్రులు సజీవులయి యున్నంతవఱకును దాను వారిని విడువనొల్ల నని యామె వారి ప్రార్థనల నన్నిఁటిని నిరాకరించెను.

ఈలోకములో మంచివస్తువు చిరకాల ముండ దని పెద్దలు చెప్పుదురు. సుకృతీగతాయు వన్నలోకోక్తి మనము పలుమాఱువిన్న దే గదా. 1841 వ సంత్సరాంతమున నామెకు క్షయరోగ చిహ్నములు కనఁబడెను. అవి యంతకంతకు ప్రబలి తల్లిదండ్రులకును బంధువులకును మిత్రవర్గమునకును మిగుల దుఃఖమును గలిగించెను. ఈమె కెంతటి ఘన వైద్యులచేత నెన్నిచికిత్సలు చేయించినను గుణ మగపడలేదు. మరణమునకు ముం దామె స్వబంధువులనెల్లఁ దనయొద్దకు రప్పించుకొని తన నామస్మృత్యర్థముగా వారి కందఱికి నేదో యొకవస్తు విచ్చెను. ఇట్లు చేసి యామె 1842 వ సంవత్సరము అక్టోబరునెల 20 వ తేదిని బాంబరోనగరమున పరమపదము నొందెను. ఆమె శవమును శ్మశానమునకుఁ గొనిపోవునప్పుడు తీర్థప్రజవలె లెక్కలేని జనులు వెంటఁ బోయిరి. ఒకరిజీవితకాల మత్యల్పమైనదే యైనను పరోపకారకార్యపూరిత మయినపక్షమున నదియే దీర్ఘమును సార్థకమును నైనది. ఉపకారశూన్యమైన జీవితము శతసంవత్సర పరిమిత మయిన దయినను అది యత్యల్పమును నిరర్థకము నైనదే. ఈ యుత్తమాంగనయొక్క వృత్తాంతమును జదివెడు సుందరు లందఱును నీమెవలెఁ బరార్థపరత్వశీల లగుటకుఁ బ్రయత్నింతురుగాక!

---

# JOAN OF ARC—MAID OF ORLEANS.

## "ఆర్లియన్సు కన్య" యనఁబడు జోన్ ఆఫ్ ఆర్కు.



ఏనూరుసంవత్సరములక్రిందట ఫ్రాన్సురాష్ట్రములోని విశేష భాగము ఇంగ్లండుదేశపురాజుల పరిపాలనమునకు లోఁబడి యుండెను. ఫ్రాన్సులోని యొకభాగ మగు నార్మండీ దేశముయొక్క ప్రభువు విల్లియ మను నతఁ డింగ్లండుదేశముమీఁదికి దండెత్తి విజయము నొంది దానికి రా జయినతరువాత నార్మండీదేశమునుగూడఁ దన యధీనము

లోనే యుంచుకొనెను. తదనంతరము రాజ్యమునకు వచ్చిన యతని సంతతివారు నార్మండీదేశమును తమ ముఖ్యస్థానముగాఁ జేసికొని యేదో మిష కల్పించుకొని యుద్ధముల నారంభించి ఫ్రాన్సురాజ్యములోని యితర దేశముల నాక్రమింపఁ జొచ్చిరి. ఫ్రాన్సుదేశపురాజయిన యాఱవఛార్లెస్ యొక్క కూఁతు రింగ్లండుదేశపురాజయిన యైదవహెన్రీకి వివాహము చేయఁబడెను. ఆఱవఛార్లెస్ ౧౪౨౨వ సంవత్సరమునందు మృతుఁడైనప్పు డాతని కుమారుఁడైన ఛార్లెస్ దుర్బలుఁడైనందున రాజ్యభార మాతని యల్లుఁడైన యైదవహెన్రీ వహించున ట్లేర్పాటు చేయఁబడెను. అయినను హెన్రీ ఫ్రాన్సుదేశమునకు వచ్చి రాజ్యాభిషిక్తుఁడు కాకముందే పరమపదము నొందినందున నింగ్లీషువా రతనికుమారుఁడైన యాఱవహెన్రీ యనుబాలుని ఫ్రాన్సుదేశమునకుఁ దీసికొనివచ్చి పారీసునగరమునందు పట్టాభిషేకము చేసి యతఁడే ఫ్రాన్సుదేశమునకు రాజని ప్రకటించిరి. బాలుఁడైన హెన్రీ స్వయముగా కార్యనిర్వాహణము కావించుకొనుటకు సమర్థుఁడు కానందున నాతనిపక్షమున బెడ్ఫోర్డుప్రభువును గ్లాసెస్టరుప్రభువును ఫ్రాన్సుదేశసంస్థానములయొక్క రాజకార్యనిర్వాహణమును నడుపుచుండిరి. ఫ్రాన్సుదేశములోని ప్రభువు లంతశ్ఛిద్రములచేత దేశాభిమానహీను లయి యన్యోన్యద్వేషపరాయణులయి యైకమత్యము లేనివారైనను గొందఱుమాత్రము స్వదేశాభిమానమును రాజభక్తియు విడువక తమరాష్ట్రమునకు ఛార్లెస్సే న్యాయమైన యుత్తరాధికారి యని యాతనిపక్ష మవలంబించి యుండిరి. ప్రబలుఁడైన బర్గండీప్రభు వింగ్లీషువారిపక్షమును వహించి యుండినందునను, ప్రధానదుర్గములును ముఖ్యపట్టణములును ఇంగ్లీషుసేనలచే నాక్రమింపఁబడి యుండినందునను, ఫ్రాన్సుదేశ మన్యాక్రాంత మగుచు

యింగ్లీషువారిపాలనమునకుఁ బోవునట్లుండెను. అట్టి సందిగ్ధసమయ మునం దాస్తికముగా నొక కాపుకన్య ప్రభుభక్తియుక్తయు దేశాభిమానమానసీయయు నయి బయలు వెడలి పరాధీనము కాకుండఁ గాపాడి స్వదేశము నుద్ధరింపఁ గలిగెను. ధైర్యశౌర్యభక్తియుక్తురా లయిన యాయుత్తమకన్యయే మనకథానాయిక. ఆమెపేరు జోన్.

జోన్ ఆఫ్ ఆర్కు ౧౪౧౨వ సంవత్సరమునందు జనన మొందెను. ఆమెతండ్రి పేరు జేకస్ అర్కు; తల్లి పేరు ఇసబెల్లా. ఈపేద దంపతులు డోమ్రెమి యనుపల్లెయందు వసించుచుండెడివారు. ఈవధూవరులకు జోన్ గాక మఱియొకకొమారితయు ముగ్గురుకుమారులును నుండిరిగాని యాకొమారిత బాల్యములోనే మృతి నొందెను. భార్యాభర్తలు తమ కున్నదానితోనే సంతుష్టులయి యీశ్వరభక్తియు న్యాయప్రవర్తనమును గలవారయి తమబిడ్డలను మంచిమార్గమునఁ బెంచుచుండిరి. జోన్ చదువుటకును వ్రాయుటకును నేర్చినది కాదు. ఆకాలమునందు మతాచార్యులకుఁ దక్క సాధారణముగాఁ బురుషులకే విద్య లేకుండినప్పుడు బీదబాలికకు విద్య లేకపోవుట వింత గాదు. ఆచిన్నదానికి తల్లి నూలువడుకుటకును కుట్టుటకును నేర్పినది; తండ్రి క్రైస్తవమతధర్మములను బోధించెను. ఆమె స్వభావముచేతనే మంచి దగుటనుబట్టి బాల్యమునుండియు భగవద్భక్తియు వినయాదిగుణసంపత్తియు దయార్ద్రచిత్తవృత్తియుఁ గలదయి సదా పాటుపడుటయందిష్టము గలదయి యుండెను. ఆమె తనయీడుబాలికలతోడి యాటపాటలను విడిచి యుపాసనసమయమునందు దేవాలయమునకుఁ బోయి శ్రద్ధతో ధర్మోపదేశములను వినుచు భక్తిపారవశ్యము నొంది యానందించుచు, పొలములోఁ గలుపుతీయుట పైరుకోయుట మొదలగుపనులలో నున్నప్పుడుసహితము తోడివారిని విడిచి కొంచెము నే

పేదో యొక యేకాంతస్థలమునకుఁబోయి యొంటిగాఁ బ్రార్థనచేసి వచ్చుచు నుండెడిది. ఆమె సదా లజ్జాశీలయు భీరుస్వభావయు మితభాషిణియునయి యుండెను. ఆమె కొంత పెద్ద దయినతరువాతసహితమింట గృహకృత్యములను చక్కఁబెట్టుచు బయిట గుఱ్ఱములను పశువులను మేపుచు నశ్వారోహణము చేసి గుఱ్ఱములను నీళ్ళకుఁ గొనిపోవుచు నిరంతరమును పాటుపడుచుండెను. ఆకాలమునందు యుద్ధములమూలమున జనులవిషయమున నడచు చున్న క్రౌర్యములను తన దేశమునకును రాజునకును సంభవించిన యన్యాయములను తఱచుగా వినుచు వచ్చుటచేత నామెమనస్సునందు పరితాపమును దేశాభిమానమును నుదయించినందున నామె స్వదేశోద్ధారణార్థమయి పలుమాఱు దేవునిఁ బ్రార్థించుచువచ్చెను. ఆచింతయే చిత్తమును విడువక సదా తలపించు చుండుటచేత నామె పదుమూఁడు పదునాలుగు సంవత్సరములప్రాయమప్పుడు దేవదూతలు తన్నావేశించి ఫ్రాన్సుదేశమును పునరుద్ధారణము చేయవలసినదని తన కాజ్ఞాపించిన ట్లామె స్వప్నాది దర్శనములను బొందుచువచ్చెను. అవి యన్నియు నీశ్వరునియాజ్ఞలే యని యామెచిన్నది నిశ్చయముగా నమ్మిన దనుట కణుమాత్రమును సందేహము లేదు.

'క్రివాంటు' 'వెర్న్యూయిల్' అను స్థలములయందు జరిగిన యుద్ధములవలన ఛార్లెస్‌యొక్కయాశ పూర్ణముగా నిరాశ యయినట్లు కానవచ్చెను. ఆసమయమునందే మనకథానాయిక యయినయాకాపు చిన్నది తనకు దేవతాసాక్షాత్కారము లయినట్టు భావించి యానందింప నారంభించెను. ఒకనాఁ డామె తనతండ్రిపొలములోఁ గూరుచుండి యుండఁగా నెదుట నొకవెలుఁగు కానవచ్చి, యందుండి నీవు భక్తి శాలవుగాను మంచిదానవుగాను నున్నయెడల దేవుఁడు నీకు మేలు

చేయు' నని పలికిన ట్లశరీరవాక్యొకటి వినవచ్చెను. ఇంకొకసారి యామె పొలములో పశువులను మేపుచుండఁగా వెకటివలెనే వెలుఁగొకటి కానవచ్చి యందులోనుండి రెండు దివ్యసుందరవిగ్రహములు "నీవింగ్లీషువారిబంధమునుండి విముక్తికలిగించి (ఫ్రాన్సు) దేశము నుద్ధరింపవలసిన" దని పలికినట్లు భావగోచరమయ్యెను. ఈ రెండును ముగ్ధభక్త్యావేశవివశురాల గుచ యాకన్యయొక్క చిత్తభ్రమనుబైక మూలకములే యయి యుండవచ్చుఁగాని శుద్ధాంతఃకరణమైన యాకన్య కవి సత్యమైనయీశ్వరాదేశములే యయ్యెను. ఈకడపటి దర్శనమువలన హృదయము ముప్పొంగి యప్పుడు మ వీరావేశపరవశ యయ్యెను. ఆక్షణముననే యామె తా నవివాహితయయి యావజ్జీవము కన్యగానే యుండునట్లును, దేవాదిదేవుఁ డయినయీశ్వరుడు దీనాతిదీన యయిన తన కనుగ్రహించినయాజ్ఞను జెల్లించుటకయి తన జీవమును ధారపోయు నట్లును, కృతప్రతిజ్ఞురా లయ్యెను. ఈసంగతి తండ్రికిఁ దెలిసినప్పు డతఁడు తన కూఁతున కున్మాదము కలిగిన దని భావించి, ఆమెను దండువెంట విడుచుట కంటెఁ దన చేతులతో లోఁతునీటిలో నట్టేట విడిచెద నని పలికెను.

బెడ్‌ఫోర్డుప్రభువు బర్గండీప్రభువుయొక్క సాహాయ్యమును బొంది చార్లెస్సును జయించుటకు గొప్పసేనను బంపెను. దానికి శాలిస్బరీప్రభువు సేనాధిపతిగా నుండెను. అతఁడు చిన్నకోటలను పట్టణములను స్వాధీనము చేసికొని "ఆర్లియన్సు" అను గొప్పదుర్గమును ముట్టడివేసెను. ఈపట్టణము శత్రువులపా లయినపక్షమున, ఛార్లెస్ తన రాజ్యమును విడిచి స్వపక్షజన సహితముగా నడవుల పాలుగావలసిన వాఁడే. ఈపట్టణముయొక్క ముట్టడి 1428 వ సంవత్సరము అక్టోబరు నెలలో నారంభ మయ్యెను. ఈపట్టణము ముట్టడింపఁ

బడు నని ముందుగానే తెలిసికొనుటచేత రాజసేనలును పురజనులును దానిని గాపాడుటకయి సర్వసన్నాహములును యుక్తసమయముననే చేసికొని యుద్ధమునకు సంసిద్ధులయియుండిరి. ముట్టడించిన యింగ్లీషు సైనికు లెంతధైర్యోత్సాహములతోఁ బయిని బడినను ముట్టడింపఁ బడిన రాజభటులును పౌరవీరులును నిరుపమాన దేశాభిమానమహితు లయి ప్రాణముల కాశింపక పోరాడి యహితులను బురము చొరనీక దూరమున నిలిపిరి. పురబహిర్ద్వారమునఁ గలిగిన యీఘోరసమర మునం దింగ్లీషు సేనా నాయకుఁ డగు శాలిస్బరీప్రభువు నిహతుఁడు కాఁగా నాతనిస్థానమున నస్ఫోకుప్రభువు సేనాధిపత్యమును వహిం చెను.

ఈసమయమునం దామెకుఁ బూర్వరీతినే దేవతాదేశము లగు చునే యుండెను. ఆర్లియన్సుపట్టణముయొక్క ముట్టడిని విడిపించుట యొకటియు, ఛార్లెస్సును రీమ్సునగరమునందు పట్టాభిషిక్తునిగాఁ జేయుటయొక్కటియు ఈరెండును దనకు దేవుఁడు విధించిన యాజ్ఞ లని యామె హృదయఫలకమునందు శిలాక్షరముల వలె దృఢముగా నాటుకొని యుండెను. తన కొసఁగఁబడిన యీశ్వరాదేశమును గూర్చి తల్లిదండ్రులతోఁ జెప్పుటవలనఁ బ్రయోజనము లేదని యెఱిఁగిన దయి, యామె సమీపగ్రామమునందు నివసించియుండెడు తన మేన మామ యింటికిఁ బోయి యాతని కడ తన మనస్సును విప్పి తనకు విధింపఁ బడిన కృత్యమునుగూర్చి వివరముగాఁ జెప్పెను. ఆచిన్నదాని యొక్క నిష్కళంకచరిత్రమును బట్టియు సత్యసంధతను బట్టియు నవ్యాజదైవభక్తినిబట్టియు నామె మేనమామ యయిన లాక్సార్టు శైశవమునుండియు నామెను ప్రాణాధిక మయినప్రేమతోఁ జూచు చుండెను, అందుచేత నాతఁ డామె చెప్పినదంతయు విశ్వసించి

యామె సందేశమును దెలుపుటకయి సమీపపట్టణ మయిన 'వాకాలియరు' నకుఁ బరిపాలకుఁ డయిన 'బొడ్రికోర్టు' దొరయొద్దకుఁ బోయెను. ఆపరిపాలకుఁ డాతనిమాటలను విని పరిహసించి "యా పిచ్చిపిల్లదానిని రెండు చెంపకాయలువేసి శీఘ్రముగాఁ దల్లిదండ్రుల యొద్దకుఁ బంపివేయుము" అని హితోపదేశము చేసి యాతనిని బంపి వేసెను. విఫలమనోరథుఁ డయి మరలివచ్చి మేనమామ యచ్చట జరిగినవృత్తాంతమును జెప్పినను, ఆమె యెంతమాత్రమును నిరుత్సాహురాలు గాక తానే స్వయముగాఁ బోయి బొడ్రికోర్టును దర్శించి మాటాడెద నని వాకాలియరుపట్టణమునకు బైలుదేఱెను. మేనమామయు నతనివెంటఁ బోయెను. ఆమె యాపట్టణమును జేరినతరువాత విచారించి యొక దొడ్డయిల్లాలిగృహమునందుఁ బ్రవేశించి మేనమామ వెంటరానప్పుడు తానెక్కడకుఁ బోవలసివచ్చినను నొంటిగా బోవక యాగృహిణిని వెంటఁ గొనిపోవుచు వచ్చెను. ఇచ్చటనే కాక మఱి యెచ్చటకు బోయినను బ్రతిగ్రామమునందును విశుద్ధచరిత్రురాలైన యొకయుత్తమాంగనను దనకు సహాయురాలినిగాను సంరక్షకురాలినిగాను జేసికొని యామెవెంట మెలగుచు వచ్చెను. ఈపట్టణము చేరిన తరువాత మొట్టమొదట, నామె కామండలపరిపాలకుని దర్శనము దొరకుటయే కష్టమయ్యెను. దర్శనములభించిన తరువాత నాతఁ డామె విన్నపమును సావధానముగాఁ జెవియిచ్చి వినుట యెంతకంటెను గష్టమయ్యెను. విన్నతరువాత నాతనిని తోడుపడునట్లొప్పించుట కష్టములలో నెల్ల నధికకష్ట మయ్యెను. ఆమె నిశ్చలభక్తియు నేకాగ్రచిత్తతయుఁ గపటము లేని నిర్మలవర్తనమును జూచి పట్టణము లోనివా రందఱును నాకన్య నిజముగా నీశ్వరసాక్షాత్కారము గలభక్తురా లని నమ్మిరి. వారిలో ముఖ్యముగా బ్రముఖులయిన

గృహస్థులిద్దఱు తా మామెకు సాయము చేయునట్లు పూనుకొని యాపురపరిపాలకునిచేత రాజున కొక విజ్ఞాపనపత్రమును వ్రాయించిరి. ఆపరిపాలకుఁ డామెను రాజునొద్దకుఁ బంపుటలో జేసినసాయమంతయు నొక ఖడ్గము నిచ్చుటతప్ప వేఱేదియు లేదు. ఆమె మేనమామయు నాతనిమిత్రుఁ డొకఁడును ఋణము చేసి యామెకొక శ్వేతాశ్వమును గొనియిచ్చిరి. ఆమెకుఁ దోడుపడిన పురవాస్తవ్యులలో నొకఁ డామె ప్రయాణవ్యయములను భరించెను. తానప్పటినుండి పురుషవస్త్రములను ధరించుట ట్లీశ్వరాజ్ఞ మైన దని చెప్పి యామె యిట్టివస్త్రములను ధరించెను. ఇట్లామె పురుషవేషమును దాల్చి యశ్వారోహణము చేసి యీశ్వరచిహ్నాంకిత మైనధ్వజమును భుజమున ధరించి రాజసందర్శనార్థము బయలు వెడలెను. ఈ చరిత్రారంభమునం దుదు వేయఁబడినది యీయామె యప్పటిరూపము.

ఈ పట్టణమునకు వచ్చినప్పటినుండియు తోడుపడుచుండిన యిద్దఱు పెద్దమనుష్యులును మఱినలుగురును నామె కంగరక్షకులుగా నామెవెంట బయలుదేరిరి. చుట్టుపట్ల ప్రదేశము లన్నియు శత్రుమయము లై యహితపక్ష మవలంబించిన వయి యుండినందున శత్రువులచేతిలోఁ జిక్కుదు మన్నభయము చేత వా రప్పుడు సాధ్య మయినంత వఱకు రాజమార్గములను గ్రామములను తొలఁగి, మనుష్యులు సాధారణముగా నడవని పెడదారులలో మహారణ్యములలోను బడి పోవలసినవా రయిరి. ఇట్లు ప్రయాసపడి కొంతదూరము పోయినపిమ్మట లోయిరునదిని దాఁటి రాజున కనుకూలురయి యున్నప్రజలు గలదేశమును బ్రవేశించిరి. అప్పు డామె తా నార్లియన్సునగరమును విడిపించుటకును ఛార్లెస్సును సింహాసనాసీనునిగాఁ జేయుటకును దేవునిచేఁ బంపఁబడి

నట్లు బహిరంగముగాఁ జెప్ప నారంభించెను. అది మూఢవిశ్వాస మత్యధికముగా నుండినకాల మగుటచేత నాచిన్నది చెప్పెడుకథ యెంత యద్భుతముగాను విశ్వాసానర్హముగాను గానఁబడినను సందేహపడక యెల్లవారును దానిని నమ్మి మనదేశమును రక్షించుటకయి దేవునిచేఁ బంపబడిన దేవదూతి వచ్చుచున్నదని గ్రామవాసులు నను గుంపులుగుంపులుగా వచ్చి చూచి సంతోషించుచుండిరి. ఆ సమయమునందు రాజు చినాన్ కోటయందు నుండి, శత్రువులు తానున్న దుర్గమును ముట్టడింతు రన్నభీతిచే నార్లియన్ పురరక్షణ యత్నమును విడిచిపెట్టి తాను గహనదేశములకుఁ బాఱిపోఁ దలఁచెను గాని కొందఱు దేశాభిమానుల ప్రోత్సాహముచేతఁ గొంత ధైర్యము వహించి యప్పటి కచ్చటనే నిలిచి యుండెను. ఇట్టిస్థితిలో జోన్‌కన్య చేరువగా నున్న జేరి తాను వచ్చుచున్న వార్తను ముందుగా రాజునకుఁ జెప్పిపుచ్చెను. ఆమె చినాన్ దుర్గమునకు వచ్చుట కుత్తరువు వెంటనే పుట్టెనుగాని యామెకు దర్శనమిచ్చుటమాత్ర మాలోచనలోఁ బడెను. మంత్రులలోఁ గొందఱ ఆమె క్షుద్రదేవతోపాసకురాలైన మాయలమారి యని పలికిరి; కొందఱ ఆమె చిత్తభ్రమణముగల యున్మాదిని యనిపలికిరి; పలువు రామె యెట్టిదయినను మన కిట్టిసమయమునందు సన్నిధికి వచ్చిన సాహాయ్యమును నిరాకరించుట యవివేకమని పలికిరి. కడపట నామెను గొన్ని ప్రశ్న లడిగి యుత్తరములను బడయుటకయి యొక సభ నియమింపఁబడెను. ఆమెనుబరీక్షించినయాసభవారిచ్చిన యభిప్రాయ మామె కనుకూలముగా నుండినందున డోలాయమానమానసుఁ డయి యుండిన యాచిఱుతరాజు తుద కామెను దర్శనమిచ్చుట కంగీకరించెను. రాజామెను మోసపుచ్చవలెనన్న యుద్దేశముతో నామె తన దర్శనమునకు వచ్చినప్పుడు తాను సామాన్యవస్త్రములను ధరించుకొని

దిగువను గూర్చుండి యుండి తనయాస్థానములోని దొరలకు గొప్ప వేషములు వేసి వారి నున్నతస్థానములయందుం గూర్చుండఁబెట్టి యుండెనఁట. ఆమె తత్పూర్వము రాజమొగ మెప్పుడును జూచి యెఱుఁగనిదైనను వేషమాత్రముచేత భ్రమపడక తిన్నగా రాజుకడకే పోయి యాతనికి మ్రొక్కి "ఓ మహాప్రభూ, నీకును నీరాష్ట్రమునకును; సాయము చేయుటకు దేవునిచేతఁ బంపఁబడిన జోన్‌కన్యను నేను. రీమ్సునగరమునందు నీ వభిషిక్తుఁడ వగుదువని ప్రకటించుటకు నే నాజ్ఞాపింపఁబడినదానను. ఇంగ్లీషువారితోఁ బ్రతిఘటించి యుద్ధము చేయుటకు నేను సంసిద్ధురాలనయి యున్నదానను." అని ధీరస్వరముతోఁ బలికెను. ఆమాటలవలన రాజునకును సభ్యులకును నత్యద్భుత ప్రమోదములు కలిగెను. ఈయద్భుత మిట్లుండఁగా జనులవిశ్వాసమును బురికొల్పునవింత యప్పుడింకొకటి నడచెను. తనసమీపమునుండి యామె నడుచుచుండినప్పుడు సైనికుఁ డొకఁ డామెనుగూర్చి మోటుగా మాటాడఁగా, "ఓయీ! మృత్యువత్యాసన్న మయి యుండ నీ కింత త్రుళ్లు పాటు తగునా?" యని యామె వానిని మందలించెను. ఆభటుఁ డాదినముననే నదిని దాఁటునప్పుడు మునిఁగిపోయి మరణము నొందెను. ఈ దైవఘటననుబట్టి యామె యానాగతము తెలిసినమహాత్మురాలని యెల్లవారికిని నమ్మకము కలిగెను [illegible] వర్తనమును నిపుణముగా పరిశీలించినకొలఁదిని భక్త్యుత్సాహము యందు నిష్కళంకురాలని తేటపడినను యుద్ధతంత్రములయందుఁ ని రాజ్యాంగవ్యవహారములయందుఁగాని విశారదురాలు కాదని మంత్రివర్గమున కభిప్రాయము కలిగెను. అందుచేత ఛార్లెస్ మరల సందేహాందోళితమనస్కుఁడయి యామెసాహాయ్యము నంగీకరించుటను గూర్చి యాచార్యసభ వారికి విజ్ఞాపనమును బంపెను. వారామె జన్మ

స్థలమైన డోమ్రెమీగ్రామమునకు మనుష్యులను బంపి యామె పూర్వ వృత్తమును పూర్ణముగా విమర్శించి యామెచరిత్రము నిష్కళంకరహిత మయినదని తెలిసికొని రాజాపుణ్యాకన్యయొక్క తోడ్పాటును నిస్సంశ యముగా నంగీకరింపవచ్చునని శ్రీముఖమును బంపిరి. ఈ యాలోచన నలతోను సందేహములతోను రెండుమాసములు గడచినతరువాతఁ దగినయేర్పాటులు చేసి కవచ మొకటియు నొకదేవాలయమునందుఁ జిరకాలమునుండి మూలఁబడి యుండిన పవిత్రఖడ్గ మొకటియు తదభీ ష్టానుసారముగా జీసస్‌యొక్కయు తల్లియొక్కయు విగ్రహములు వేయఁబడిన ధవళధ్వజ మొకటియు రాజామెకిచ్చి యుద్ధయాత్ర కనుజ్ఞ యిచ్చెను. ఆమె ప్రాయ మిప్పుడు పదునేడు సంవత్సరములు. విశ్వా సార్హు లయిన కతిపయవీరభటు లామె కంగరక్షకులుగా నియమింపఁ బడిరి. ఆమె యాశ్వారోహణచేసి కవచాదులు ధరించి వీరభటునివలె బురుషవేషముతో బైలువెడలఁగానే యావలకు నిరాశులయి పలా యితులైన సైనికు లందఱును నామె కీశ్వరసాహాయ్య మున్నదన్న సంపూర్ణ విశ్వాసముతో ధైర్యోత్సాహము గలవా రయి వీరావేశము నొంది మరల నామెచుట్టును జేరసాగిరి. ఇట్లు చేరిన వీరవార మత్య ల్పకాలములోనే యావలవారికును దెలిసెను.

ఈవఱకు సేనానాయకులుగా నుండినవారే యీసేనను నడపవలయునో జోన్‌కన్యయే నడపవలయునో యని శంక గలిగి నప్పు డామెయే నడుపవలయు నని జనసంఘము పట్టుపట్టుటచేత లోపల నిష్టము లేనివారయినను, సేనాధిపతులు వయి కామెకు లోఁబడి యామె యాజ్ఞానుసారముగా నడపవలసినవారైరి. ఆమె మొట్టమొదటఁ జేసినపని తనదండు వెంటవచ్చిన దుష్టనడతగల వడఁతుల సందఱిని వెడఁగొట్టివేసి, సైనికులసందఱిని తమదోషముల నీశ్వరునికి

నివేదించి క్షమింప వేడుకొనునట్లు చేసి యుద్ధమునకు సంసిద్ధులను జేయుట ఆమె బ్లాయిస్‌పట్టణమునుజేరి యక్కడనుండి యార్లియన్సు పురమునకు ముట్టడి వేసియున్న యింగ్లీషు సేనాధిపతులకు దేవుని యాగ్రహమునకు పాత్రులుగాక శీఘ్రముగా పట్టణమును విడిచి తొలఁగవలసినదని యాజ్ఞాపించుచు లేఖను బంపెను. ఇంగ్లీషు సేనానాయకు లామెయుత్తరమును తిరస్కారభావముతోఁ జూచినట్లు నటించిరి. కాని యామె యమానుషశక్తినిగూర్చిన యద్భుతకథ లనేకము లీవఱకే వినియున్నందున నామె యీశ్వరసాక్షాత్కారబలమో క్షుద్రదేవతా వశీకరణశక్తియో కలయువిజేయురా లని హృదయములలో నమ్మియుండిరి. ఆమె యాపట్టణమును జేరునప్పటికి చీఁకటి పడెను; గాలి ప్రతికూలముగా వీచుచుండెను; వాన జోరునఁ గురియుచుండెను. అటువంటి సమయమునందు నదిని దాఁటుటకు సేనాధిపతు లిష్టము లేనివారుగా నుండిరి. ఆమె సర్వమును ననుకూలముగా నుండునని పలికి పడవలెక్క తత్క్షణమే నదిని దాఁటుట కాజ్ఞాపించెను. ధ్వజ పటమును జేతఁ బట్టుకొని ముందుగా నామె యొక పడవ లోనికి దుముకఁగానే సంశయింపక యామె వెంబడినే సైనికులెల్లరును మహోత్సాహముతో పడవలవంక నడచిరి. ఇట్లు పడవలెక్కి యార్లియన్సు పురవాసులనిమిత్తమయి తెచ్చిన భోజనపదార్థములను గొని నదిని తరించి సైనికు లామె చెప్పిన ట్లొక్క గడియలో సురక్షితముగా నావలియొడ్డును జేరఁగలిగిరి. ఆమె యాజ్ఞప్రకారముగా శత్రువుల శిబిరముల చెంతనుండియే తనసేనలతో నడచి వారిని తప్పించుకొనిపోయి 1829 వ సంవత్సరము ఏప్రియల్ నెల 29 వ తేది రాత్రి యెల్లవారు నద్భుతపడునట్లుగా నార్లియన్సుపురమునఁ బ్రవేశించెను. ఆమె యిట్లు పురప్రవేశము చేయఁగానే రక్షకురాలు వచ్చెనని పౌర

మానంద భరితులయి పౌరులంతయు నాబాలగోపాలము నోడోరులను ద్రోచికొనుచు నడచి యామెను సందర్శింపవలెనన్న కుతూహలముతో నామెచుట్టును మూఁగిరి. అప్పటి కర్థరాత్ర మయినను మార్గాయాసముచేతఁ గడు బడలియున్నను విశ్రాంతినొందఁగోరక యామె కరదీపికలు వెలుఁగ ముందుగా దేవాలయమునకుఁ బోయి యచ్చట భక్తిపూర్వకముగా దేవునిఁ బ్రార్థించి కృతజ్ఞతాభివందనములు సమర్పించి, యటుపిమ్మట నాపట్టణములో నత్యంత పుణ్యశీలయని ప్రఖ్యాతిగన్న యొకయుత్తమ గృహిణి గృహమునకుఁ బోయి యామె యొద్ద శయనించెను.

మఱునాఁటి ప్రాతఃకాలమునందు నిద్రనుండి లేచినతరువాత నామె యుద్ధమునకు సంసిద్ధురాలయి బయలు వెడలెనుగాని జాలిగుండెగలది యగుటచేత నిష్కారణముగా ప్రాణహాని కలుగుట కిష్టము లేనిదయి లోఁబడవలసిన దని శత్రుసేనాధిపతి కొక యుత్తరము వ్రాయించి దాని నొక బాణాగ్రమునఁ గట్టించి వింట సంధించి శత్రు సేనామధ్యమునఁ బడునట్లు విడిపించెను. అంతేకాక తాను వంతెనపొడుగునను నడచుచు నుచ్చైస్స్వనముతో ముట్టడిని విడిచి తొలఁగిపోవలసినదని యింగ్లీషుసేనలకు వినఁబడునట్లుగాఁ గేకలువేసెను. అయినను శత్రుసేనాధిపతు లిప్పుడును వెనుకటివలెనె యామె యుత్తరములను గాని మాటలను గాని నరకుచేయక యవమాన వాక్యములు పలికి యామెను బరిహాసించిరి. పయికి వారెంత బింకమును జూపినను లోపలవారు భయభ్రాంతులం కాకుండినవారు కారు. జోన్‌కన్య తన విజయధ్వజమును జైకెత్తుకొని ధనుర్విముక్తమైన బాణమువలె సెంటులూపుకోటవైపు శత్రు సైన్యములమీఁదికి గుఱ్ఱమును దుమికించెను. సైనికులును ధైర్యోత్సాహములతోఁ బరు

గిడి వైరివారమును దలపడిరి. మూఁడుగంటలకాలము ఘోరయుద్ధము జరగిన తరువాత నింగ్లీషువారు పరాజితులయిరి. జోన్ నవ్యాదయార్ద్ర హృదయముతో నడ్డుపడి కాపాడినవారు నలువదియేఁబదిమంది కాక కోటలోని యింగ్లీషుసైనికు లందఱును సంహరింపఁ బడిరి. మఱునాఁడు పండుగుదిన మగుటచేత యుద్ధము నిలుపఁబడినందున, జోన్ తన పక్షమువారితోఁ గలసి యీశ్వరప్రార్థనలతోను భజనలతోను నాఁడు కాలము గడపెను. మఱునాఁటి యుషఃకాలమునందె నెప్పటియట్లు తన జయపతాకతో జయలక్ష్మి సాకారయయినట్లు సేనాముఖము నలంకరింపఁగా లాహైర్ మొదలగు ఫ్రెంచి సేనానాయకులు తమసైన్యములతో శత్రువుల కభిముఖముగా నడచిరి. నాఁడు పగలంతయు మహాహవము జరగి యెక్కడఁజూచినను జోన్ సేనలకే జయము కలుగుచు రాఁగా సాయంకాలమగునప్పటికి బాస్టిల్ దుర్గమొకఁటి తక్క శత్రువులకోట లన్నియు ఫ్రెంచివారి యధీనము లయ్యెను. ఆమె యారాత్రి పట్టణమునకుఁ బోయి సుఖనిద్రపొంది తెల్లవాఱుజామున మరల యుద్ధయాత్రకు వెడలెను. బాస్టిల్ దుర్గమును సాధించుట యసాధ్యము గనుక స్వల్పసైన్యముతో దానిపై వెడలుట కర్తవ్యము కాదని హితముచెప్పి సేనాధిపతులామెను నిరుత్సాహపఱిచినను, ఆమె యణుమాత్రమును వెనుకంజ వేయక లగ్గలువట్టి యాకోట సాధించుటకు నిశ్చయించి యాకోటవంక నడచెను. కోటముం దామె విగ్రహము కంటఁబడఁగానే ఫ్రెంచిసైనికులయొక్క దేహము లుప్పొంగి పోయెను; ఇంగ్లీషు సైనికులయొక్క గుండెలు పగిలిపోయెను. అది చదువుకొన్నవారు చదువుకొననివారును గూడ నేకరీతిగా మంత్రములను మహిమలను నమ్మినకాల మగుటచే, నామె క్షుద్రదేవతల తోడ్పాటు కలదని యింగ్లీషుసేనలలో నెల్లను నమ్మకము

వ్యాపించెను. లగ్గలు పట్టుట కయి స్వయముగానే యామె నిచ్చెన యెక్కి కోటగోడమీఁదికిఁ బ్రాఁకుచుండెను. అప్పుడు శత్రువులచే విడువఁబడిన బాణమొకటి వచ్చి కంఠమునందు గ్రుచ్చుకొనఁగా నామె పట్టువదలి జలపూర్ణ మయిన క్రింది కందకములో తలక్రిందుగా కూలెను. ఇంగ్లీషువా రామెను బట్టుకొనుటకుఁ బ్రయత్నించిరి గాని యింతలో నామె పక్షమువారువచ్చి యామెను సురక్షిత మయిన స్థలమునకుఁ గొనిపోయిరి. గాయముయొక్క బాధచేత నామె కన్నుల నుండి కొంచెము నీరు కాఱెను గాని యామె వెంటనే ధైర్యమువలం బించి తనచేతులతోనే బాణము నూడఁ బెఱికికొని కట్టుకట్టించుకొని మరలరణరంగమునఁ బ్రవేశించెను. తాను గాయపడుదు నని యామె యీవఱకే చెప్పియుండి నందున సైన్యములో నిందుమూలమునఁ గొందలపాటు పుట్టలేదు. ఆమె యాకస్మికముగా మరల సమరతల మునఁ బొడచూపఁగానే ఫ్రెంచిసైనికుల యంతరంగము లద్భుతప్రమోద రసతరంగితములయి ద్విగుణితోత్సాహవంతము లయ్యెను. తాము కోటగోడనుండి కూలఁద్రోయుటచే నరచచ్చిన దనుకొన్నకన్నె కన్నుల యెదుట మరలఁబ్రత్యక్షము కాఁగానే యింగ్లీషుసైనికులస్వాంత ములు భయభ్రాంతములయి దిగుణీకృతనిరుత్సాహవంతము లయ్యెను. భయజ్వరావేశవివశు లైనయాసైనికులు కొందఱు మృత్యువు తమ మొగములఁ వ్రేలఁగా వివర్ణులయి ప్రతిపక్షులపక్షమున దేవత లాయుధ పాణు లయినిలిచి తమసేనలను తుత్తుమురుగా నఱకుచుఁ దమ కు గనఁబడు చున్న వారని సంధి యెత్తినవారి వలెఁ బ్రల పించుచుఁ గాలునేతు లాడక వెఱ్ఱిచూపులు చూచుచు తడఁబడఁ జొచ్చిరి. ఆసంక్షోభమును జూచి యింగ్లీషు సేనానాయకుఁ డగుగ్లాడ్సు డేలు తనసేనలోనెల్ల శూరాగ్రేసరు లనఁదగిన వీరభటులను వెంటఁ

గాని కోటలోపలఁ బ్రవేశించి పోరాడవలెనన్న చింతతో వంతెన మీఁదినుండి కోటగవనివంకఁ బోవుచుండఁగా, జోన్‌కన్య యాతనిని తారసించి యింతట నయినను లోఁబడవలసిన దని యాజ్ఞాపించెను. అతఁ డామె మాటలను లక్ష్యముచేయక ముందువంక నడచుచుండఁగా ఫ్రెంచివారు వేసిన ఫిరంగిగుం డొకటి తాఁకి వంతెన విఱిగి దానితో సేనాధిపతియు వీరభటులును నదిలోఁ గూలి సంఘాతమరణము నొందిరి. ఇంతటితో సంపూర్ణవిజయము ఫ్రెంచివారికిఁ గలిగెను. హతశేషు లెదిరింపనయినను బ్రయత్నింపక కాలుచేతులు కట్టి యొప్పింపఁబడినవారి వలె ఫ్రెంచి సైనికులకు దాసు లయి లోఁబడిరి. ఈ మూఁడుదినముల యుద్ధములోను నింగ్లీషుసైనికులు దాదాపుగా నేఁడెనిమిదివేలు మృతినొందిరి. ఇట్లు నిరుపమానవిజయశోభిత యయి యామె స్వసైన్యముతోఁ బురప్రవేశము చేయునప్పుడు పౌరుల జయజయనినాదములు మిన్ను ముట్టెను; ప్రతిదేవాలయమునందును విజయసూచకము లయినజయఘంటలు మ్రోగెను. ఆమె యిట్లు ప్రజల సాధువాదములతో దేవాలయమునకుఁ జని సవినయముగా దేవునిఁ బ్రార్థించి కృతజ్ఞతాపూర్వకవందనశతము లర్పించెను. ఇప్పటికి జోన్ చేసిన మొదటిప్రతిజ్ఞ నెఱవేఱినది. ఈశ్వరునియెడల నవ్యాజభక్తివిశ్వాసములు గలయొకప్రాణి లోకములో నెంతటి యద్భుతకార్యములను నిర్వహింపఁగలుగునో దీనివలనఁ దేటపడెను గదా! ఈవిజయదినము మొదలుకొని జను లీమెను "ఆర్లియన్సుకన్య" యని పిలువఁ జొచ్చిరి.

జోన్‌కన్య యార్లియన్సునగరముయొక్క ముట్టడిని విడిపించిన మఱునాఁడే తన ప్రతిజ్ఞాశేషమును నెఱవేర్చుట కయి బైలుదేఱి బ్రయత్నముఁ జేయ నారంభించెను. రీమ్సునగరమునందు ఛార్లెసును



జోన్ కన్య.

పట్టాభిషిక్తునిగాఁ జేయువఱకును తన కీశ్వరుఁ డిచ్చినయాజ్ఞను తాను చెల్లించినట్లు కాదని యామె దృఢముగా నమ్మియుండెను. అందుచేతఁ దనకుఁ గలిగిన గెలుపున కుబ్బకయు దారి బడలికను గణనచేయకయు మెయినెల పదవ తేదీనే యామె యార్లెన్సునగరమునువిడిచి బ్లాయిన్ పట్టణమును జేరెను. అక్కడనుండి యామె యెంతదీనముగాఁ బ్రార్థించుచు లేఖల నంపినను ఛార్లెన్సు త్రోవపొడుగునను బహుస్థలము లింగ్లీషుసేనలచే నాక్రమింపఁబడినందున తానున్న తావు కదలి రీమ్సునగరమునకు వెడలసాహసింపకుండెను. అది యట్లుండ నిచ్చట

నార్లియనునగరములోని సేనాధిపతులు తాముకూడఁ గొన్ని విజయములనొంది పేరు పడవలయు నని యింగ్లీషు సేనాధిపతియైన సఫ్ఫోకు ప్రభువుచే రక్షింపఁబడుచుండిన జార్గోదుర్గమును సాధింపుటకయి సేనలతో వెడలి బహుదినములు పోరాడియు నేమియు చేయలేకపోయిరి. ఈవార్త తెలియఁగానే జోన్ కన్య వారి సాయము నిమిత్తమయి వచ్చెను. ఆమె రాకవలన ఫ్రెంచి సేనలలో నుత్సాహ మపరిమితము కాఁగా నవలీలగా విజయము కలిగెను. అక్కడ జరిగిన ఘోరయుద్ధమునందు సఫ్ఫోకుప్రభువు పట్టుకోఁబడి కారాబద్ధుఁడుగాఁ జేయఁబడెను. ఇట్లు జార్గోదుర్గము లోఁబడగానే యితరదుర్గములను రక్షించుచున్న యింగ్లీషు సైనికులు శత్రువుల నెదిరించుటకైనఁ బ్రయత్నింపక యింతవఱకును మహాధైర్యశాలియని ప్రసిద్ధిగన్న టాల్బా టనుతమసేనానాయకునితోఁ గలిసి పలాయితులయిరి. పాట్ యను గ్రామమువద్ద జరిగినమహాయుద్ధములో స్కేల్సు ప్రభువు, హాంగరుఫోర్డు ప్రభువు, టాల్బాటు మొదలయిన ప్రసిద్ధులయిన యింగ్లీషు సేనానాయకులు జోన్సుకన్యకు లోఁబడిరి. దైవమాయ యేమోగాని యీయుద్ధమునం దింగ్లీషు సైనికులు రెండు మూడువేలమంది చంపఁబడినను ఫ్రెంచిసేనలలో నొక్కఁడే హతుఁడయ్యెనఁట! జయము సంపూర్ణము కాఁగానే జోన్ కన్య తన సైనికులను వారించి వృథాసంహారమును మాన్పి గాయపడినవారి గాయములకు చికిత్సలు చేయుచు, ప్రాణోత్క్రమణదశయం దున్నవారి కీశ్వరభక్తినిగఱిపి చిత్తశాంతిని గలిగించుచు, నుత్సాహముతోఁ బనిచేయఁ జొచ్చెను. తరువాత నామె సర్లే యను స్థలమునం దున్నరాజును గలిసికొని యీనూతన విజయవార్తను స్వయముగాఁ దెలిపి, పట్టాభిషేకార్థము తత్క్షణమే బైలువెడలునట్లు రాజును బురికొల్పెను.

ఛార్లెస్సు మనస్సులో భయమువిడువనివాఁడయినను, ఆమెకు మాఱు మాట చెప్పలేక జీన్ పురమువద్ద పదివంద్రెండువేల సేనలను గూర్చుకొని యామెవెంట రీమ్సునగరమునకుఁ బోవఁ బ్రయాణ మయ్యెను. అతఁడు జోన్‌కన్యయొక్క యమూల్యసాహాయ్యముచేత త్రోవపొడుగునను నున్న ట్రాయిస్ మొదలయిన పట్టణముల ననాయాసముగా స్వాధీనము చేసికొనుచుఁ బోయి జూలయి నెల 16 వ తేది సాయంకాలము జోన్‌కన్య యశ్వారూఢయయి తనప్రక్కను జనఁగా సురక్షితముగా రీమ్సునగరమునందుఁ బ్రవేశించెను. ఆమఱునాఁడే రాజుయొక్క పట్టాభిషేక మహోత్సవము మహావైభవముతో నడచెను. పవిత్రమైన యీసంస్కారము జరుగుచున్నంతవఱకును జోన్‌కన్య తన ధ్వజపటమును జేతఁబట్టుకొని రాజుప్రక్కను వేదికకడ నిలువఁబడి యుండెను. ఈవైదికకర్మ ముగియఁగానే యాకన్య దేహము పులకింప కన్నుల నానందబాష్పములు గాఱ వినయముతో రాజుపాదముల మీఁదఁ బడి "ఓమహారాజా! ఆర్లియన్సు నగరముయొక్క ముట్టడి విడుటయు మీరిక్కడ పట్టాభిషిక్తులగుటయు నామూలమున జరగవలెనని యుద్దేశించిన భగవత్సంకల్పము నెఱవేఱె నేను ధన్యురాలనైతిని." అని విన్నవించెను. ఈశ్వరుఁడు తనకు నియమించిన యాజ్ఞ పూర్ణముగా నెఱవేఱినందునఁ దా నింకఁ యూరికిఁ బోయి తొంటియట్ల యుండుటకయి యామె యభిలషించెను. ఆమె యక్కడనున్న సమయములో నామె తండ్రియు మేనమామయు నచ్చటికి వచ్చిరి. వారిని జూడఁగానే స్వగ్రామమునకుఁ బోవలె నన్న యభిలాషము మఱింత హెచ్చఁగా వారివెంట డొమ్రెమీగ్రామమునకుఁ బోవ ననుజ్ఞ యియ్యవలసినదని యామె రాజును బ్రార్థించెను. అయినను రాజామెవలన నింకను మేలును బొందవలె నన్న యాశతో నామె

పోక కనుపతింపక పోయెను. అందుచేత లోపలఁ దన కెంత యిష్టము లేకపోయినను, ఈశ్వరుఁడు తన్నుఁ జేయుమన్న వని యంతే యని నమ్మిన దైనను, రాజాజ్ఞ నుల్లంఘింపఁజాలక యందు నిలువవలసిన దయ్యెను. రాజు మూఁడుదినములు రీమ్సునగరమునం దుండి యచ్చట నుండి జోన్‌కన్య వెంటరాఁగా నైదుక్రోసులదూరములోనున్న దొుక పుణ్యస్థలమునకు తనకృతజ్ఞతను దెలిపి యీశ్వరునికి వందనములు సమర్పించుటకయి పోయెను. అతఁ డచ్చట నున్నప్పుడు జోన్‌కన్యను బిలిచి కావలసినవరములను గోరుమని ప్రార్థించెను. ఆమె తన గౌరవము నిమిత్త మయి యియ్యఁ దలఁచిన బిరుదులను బహుమానములను సమస్తమును నిరాకరించి తన గ్రామమువారి కప్పటినుండి పన్నులు లేకుండ ననుగ్రహింపవలసిన దని వేఁడెను. ఆమె కోరిన ట్లప్పు డనుగ్రహింపఁబడిన రాజశాసనము తరువాత నన్నూఱు సంవత్సరములవఱకు నవిచ్ఛిన్నముగాఁ జెల్లెను.

రా జిట్లు విజయయాత్రలు చేయుచు ఫ్రాన్సుదేశమునకు రాజధానియైన పారీసు నగరమును సమీపించెను. జోన్ యుద్ధముల యందు మునుపటివలెనే ధైర్యసాహసములను సహనమును గనఁబఱుచు చుండినను, తా నీశ్వరాజ్ఞానుసారముగా వర్తించుచున్నదాన నని భావింపనిదయి యప్పటి యుత్సాహమును మాత్రము లేనిదయి యుండెను. రాజు సెంటు డెనిస్ దుర్గమునుండి తన పూర్వరాజధానిని జూచెను. రా జాదుర్గమును విడిచి కదల నొల్లకున్నను జోన్‌కన్య సేనలను నడుపుకొనిపోయి మొదటియగడితను దాఁటెను. అప్పు డా పట్టణము నింగ్లీషుసేనాధిపతులును బర్గండీ ప్రభువును పదివేల సేనలతోఁ గాపాడుచుండిరి. ఆమె యగడితను దాఁటి కొంతదూరము సాఁగ

గా నేస్తూరుందు జలపూర్ణమయి దుస్తరమైన మహాపరిఖ యింకొకటి కానవచ్చెను. ఆమె యక్కడనుండి పూర్వరీతినే పట్టణమును ఫ్రెంచి రాజు నధీనము చేసి లోబడవలసిన దని యింగ్లీషు సేనాధిపతుల కాజ్ఞాపించినను, వా రామాటలను సరకు సేయక గేలి సేయుచు శరవర్షమును గురిపింప నారంభించిరి. అక్కడనుండి వెనుక మరల వలసిన దని ఫ్రెంచి సైనికు లామెను ప్రార్థించిరి గాని యామె వెనుకంజ వేసినదికాదు. ఆమె కాలి కొక గొప్ప గాయము తగిలినను బాధ దుస్సహముగా నుండినను కాలుగదలుపక యొక దిబ్బ చాటున నిలుచుండి సేనలను ముందుకు నడవ నుత్సాహపరుచు చుండెను. చీకటి పడినతరువాత ఫ్రెంచిసేనానాయకుఁ డామెవద్దకు వచ్చి యామెను వెనుకకుఁ బంపివేసెను. ఈ యపజయమువలన హృదయము చెదరిన దయి యామె తా నిప్పు డీశ్వరాజ్ఞకు విరుద్ధముగా నడుచుచున్నందున ముందుగా దేవుఁడు తన కీయావద్రూపమున హితోపదేశము చేయుచున్నాఁడని తలఁచి యిఁక ముందు యుద్ధ సంబంధమును వదలుకొన నిశ్చయించుకొనెను. ఆమె రాజుసన్నిధినుండి తొలఁగి స్వగ్రామమునకుఁ బోవఁదలఁచెనుగాని రాజును తదాస్థానమునందలి ప్రముఖులును సమ్మతింపక యుండే కొంతకాల ముందు నట్లు బహువిధములఁ బ్రార్థించి యొడఁబఱిచిరి. అంతట రాజక్కడ నుండి వెనుక మరలి బోర్జెస్ పట్టణమునందు శీతాకాలము గడచువఱకును నిలిచెను. ఇక్కడ నున్నకాలములో రా జామెకు ప్రభ్వీపట్టమును నామెకుటుంబమున కంతకు ప్రభుపట్టమును నొసఁగి గౌరవించెను. ఇట్లెన్ని గౌరవములు వచ్చినను జోన్ తన పూర్వవేషమును మార్చుకొనక, శుద్ధహృదయురాలై తనకాలము నీశ్వరసేవయందుఁ గడపు చుండెను.

ఇంగ్లీషు సేనలును బర్గండీప్రభువు సేనలును వచ్చి ఫ్రెంచివారిదైన కాంపేనుదుర్గమును ముట్టడించిరి. ఆపట్టణమును విడిపించుటకయి కొంత సేనతోఁ బోయి జోన్‌కన్య శత్రువులను తలపడెను. ఆమె యుద్ధమునం దసన్యసాధారణశౌర్యమును గనఁబఱిచి పోరాడినను కడపట శత్రువులచేఁ బట్టుపడి కారాబద్ధురాలుగాఁ జేయఁబడెను. ఆమెపాటును జూచి తమప్రాణములైన నిచ్చి యాధీరురాలిని విడిపింపవలసిన ఫ్రెంచిసైనికులు పౌరుషమును విడనాడి స్వప్రాణరక్షణార్థము పారిపోయిరి. అప్పు డింగ్లీషు సేనలలో ఫ్రెంచిరాజ్యమంతయుఁ దమకు లోఁబడినంత సంతోషము కలిగెను. ఆమె వచ్చునంతవఱకును తా మెక్కడఁ జూచినను జయము పొందుచుంటి మనియు, తమ యాపదలకెల్ల నామెయే మూల మనియు, ఆమె దయ్యములసాహాయ్యమునఁ దమ్ము పరాజితులను జేయుచువచ్చిన దనియు, ఆమెను మరల ప్రాణములతో విడిచినపక్షమున తమముప్పు నిశ్చయ మనియు, ఇంగ్లీషువారు నమ్మి యామెయెడల నత్యంతక్రోధులయి యుండిరి. అందుచేత నొకస్త్రీ యామె మంచిక్రైస్తవభక్తురాలనియు నీశ్వరప్రసాదము గలదనియు చెప్పినంతమాత్రమున పారీసునగరమునం దాస్త్రీని బ్రతికి యుండఁగా బట్టలకు నిప్పంటించి కాల్చి చంపిరి.

ఆయుమానములు చెఱసాలయం దున్నతరువాత జోన్‌కన్య నాకాలమునం దింగ్లీషురా జయిన హెన్రీ యున్నటువంటి రుయాన్ పట్టణమునకుఁ గొనిపోయిరి. యుద్ధమునందుఁ బట్టుపడిన శత్రువీరుల నాదరముతోఁ జూచుట యాచార మయినను, ఇంగ్లీషువారు యుద్ధధర్మములను పాటింపక నీతిమాలినవా రయి జోన్‌కన్యయెడల మిక్కిలి క్రూరముగాఁ బ్రవర్తించిరి; ఆమెకాళ్ళకు సంకెళలు వేసి పగలెల్లను బంధించి యుంచుచు వచ్చిరి; రాత్రులు మొలకు బలమైనయినుప

గొలుసును జుట్టి కట్టి కదల మెదల నవకాశము లేకుండఁ జేయుచు వచ్చిరి. వా రామెప్రాణముల నేలాగుననైనఁ దీయ నిశ్చయించు కొన్నందున, దయ్యములను వశపఱచుకొని యీశ్వరద్రోహిణియయ్యె నన్నమహాదోషము నామెయం దారోపించి విచారణనిమిత్తమా మెను మతాచార్యులయధికారమున కొప్పగించిరి. లౌకికవ్యవహారానుసార ముగా విమర్శించెడుపక్షమున నామెయం దారోపింపఁ దగిన నేర మేదియు లేదు. వారు చేయఁదగిన దంతయుఁ గొంత విడుదలసొమ్మును స్వీకరించియో శత్రువులచేఁ బట్టువడిన తమవారికి పరివర్తనముగానో యామెను విడువవలయుట తప్ప వేఱేదియు నుండదు. ఈవిమర్శ పయికి న్యాయముగాఁ గనఁబడుట కయి పన్నినతంత్రమేగాని న్యాయాధికారులుగా నిర్ణయింపఁబడిన యాచార్యపీఠము వా రావఱకే యామెకు ప్రాణాంతదండనమును విధింప నిశ్చయించుకొని యుండిరి.

ఆమె నావఱకు రహస్యముగ పదునేనుమాఱులు విమర్శించినను, బహిరంగముగా విచారణ చేయుట కయి 1431 వ సంవత్సరము ఫిబ్రవరినెల 21 వ తేదిని ధర్మాధికారులవద్దకుఁ దెచ్చి నిలిపిరి. ఆమె పక్షమున వాదించుటకయి న్యాయవాదుల నెవ్వరి నంగీకరింప లేదు. ఆమె కప్పు డున్న బలమంతయు తాను నిర్దోషురాలనని దృఢముగా నమ్మి యుండుటచేఁ గలిగినధైర్యబలమును పరమేశ్వరభక్తిబలమును ఈరెండుబలములును గలిగి యుండుటచేత నణుమాత్రమును జంకక విపక్షులముందు నిశ్చలురాలయి నిలిచి యుండెను. వక్రస్వభావులైన యాధర్మాధికారు లామె నేమాయోపాయముచేతనైనను వంచించి ప్రశ్నలువేసి పడఁదోసి దోషురా లనిపింపవలెనని కుతంత్రములువన్ని కుయుక్తులు చూపి యేమేమో ప్రశ్నలు వేసిరిగాని యామె చెప్పిన యుత్తరములలో దేనివలనను నామెయందు దోషారోపణము

చేయుట కవకాశము దొరకలేదు. నీవు పురుషవేషము నేల వేసితి వని వా రడిగినప్పు డామె యీశ్వరాజ్ఞానుసారముగా వేసితి నని యుత్తర మిచ్చెను. ఆమె యీశ్వరద్రోహిణి యని సిద్ధాంతము చేయుటకై యీయంశమే ప్రబలమయినట్టు వివేకహీను లైన యామతాచార్యుల దృష్టి కప్పుడు కనుపట్టెను. విచారణసమయమునం దామెవర్తనమును జూచుచుండిన యొక యింగ్లీషువాఁడు "యీయుత్తమకన్య యింగ్లీషు జాతి దయ్యెనా యెంతటి శ్లాఘార్హురాలుగా నుండును!" అని పలుకుచు నాశ్చర్యపడెను. అప్పు డామె ధర్మాధికారు లామెకు దయ్యాలమూరితనము నారోపించుచు పండ్రెండు నేరములు వ్రాసి పారీసునగరవిద్యాగురుపీఠమువారు నారితీర్పును స్థిరపఱిచిరి. ఆమె చెఱసాలయం దుంచఁబడిన తరువాతి సంవత్సరమున కనఁగా 1431 వ సంవత్సరము మేయినెల 24 వ తేదీని మతాచార్యు లామె యపరాధినిగా నిర్ధారణము చేయఁబడె నని బహిరంగముగాఁ దెలిపిరి. తరువాత వారము దినముల క్రింద మతాచార్యులు ధర్మాధికారులచే నిరు మింపఁబడి యామె యున్మార్గురాలుగాఁ బోయి గూనిగాను నచే యామె గుహాన్వేషిణి యని గుంటిశ్యాహన్నఁ తమచెప్పఁ బడు నల్లు తీర్పు చేయఁబడె నని చెప్పెను. తీర్పు విధింపఁబడిన యా క్రూర మరణదండనవార్తను వినఁగానే ధైర్యము గోలుపోయి యామె దీనముగా విలపించెనుగాని శీఘ్రముగానే మరల ధైర్య మవలంబించి శాంతచిత్త యయ్యెను. ఆయుధపాణు లయిన యెనిమిదివందల యింగ్లీషుభటు లామెను కాచి రాఁగా నామె వధ్యస్థానమునకుఁ గొనిపోఁబడెను. ఆమె త్రోవపొడుగునను తనయాత్మ నీశ్వరసమర్పణము చేయుచు భక్తిపూర్వకముగా నొనర్చిన నిష్కళంక ప్రార్థనలను విని చూడవచ్చినవా రనేకులు కంట తడిపెట్టి యేడువసాగిరి; ఆమె కిరీటు

కలిగించుటలో సహకారు లయి యామె చావుఁజూచి సంతోషింప వలెనని బాలులు దేఁజెనవారు సహిత మనేకులు గుండెలు పగిలి నడి దారినుండి వెనుకకు మరలిపోయిరి. ఆమె వధ్యస్థానమునకుఁ గొనిపోఁ బడునప్పటికే నిర్దయు లయిన మతాచార్యు లక్కడ కాష్ఠములను బేర్పించి చితి నమర్చి తమ క్రూరకిరాతకృత్యమును నెఱవుటకు సంసిద్ధు లయి తమద్వేషాగ్నికి బలిపెట్టఁ దలంచిన యానిర్దోషురాలి రాకను వేచియుండిరి. దుఃఖకర మయిన తరువాతి క్రూరహింసాకర్మమును పెంచి చెప్పుట యుచితము కాదు. ఆమె చితినయి కెక్కి, వెనుక నయిపున పాతిపెట్టఁబడిన నిలువుగుంజ కంటఁగట్టఁబడి నిలిచి, విస్పష్ట మయిన కంఠస్వరముతో తనదోషములను మన్నింపు మనీశ్వరుని ప్రార్థించి, తనయెడల నపరాధు లయినవారి నంగతిని క్షమింప భగవంతుని వేఁడి, యీశ్వరేచ్ఛ నెఱవేఱును గాక యని పలికి యూరకుండెను. ఆమాటలు చెవినిఁ బడఁగానే యామె నపహసింప నిశ్చయించుకొని వచ్చినవారు సహిత మనేకులు కన్నులనీరు కార రోదనము చేయఁ జొచ్చిరి; ఆమె క్రూరవధను గన్నులారఁ జూచి సంతోషింపవలె నని వచ్చి యున్న తాననముల నలంకరించియున్న దయాశూన్యు లయిన మతాచార్యు లనేకు లచ్చట నిలువలేక బలివేదికను డిగ్గి వెడలిపోయి రఁట! మతపిశాచావేశపరవశు లయి దయాధర్మదూరు లయి యుండు మతాచార్యకిరాతులను మించు ప్రత్యక్షరాక్షసులు లోకములో వేఱొక రుండఁజాలరు గదా? కాష్ఠమునకు నిప్పంటింపఁబడిన యల్పకాలము లోనే త్రేతాగ్నులని చెప్పఁదగిన విరోధు లగు నింగ్లీషువారి క్రోధా గ్నికిని మతాచార్యుల ద్వేషాగ్నికిని ప్రజ్వలిత మయిన కాష్ఠాగ్నికిని నిర్మల చరిత యయిన యాసాధ్వీమణియొక్క యనిత్యదేహ మాహుతి యయ్యెను. ఈక్రూరహత్య ముగియునప్పటికెల్ల నెల్లవారి మనస్సుల

లోను తాము దేవదూతను నిష్కారణముగాఁ జంపి పాపము కట్టు కొంటి మన్న విచారము కలిగెను. కొందఱా మెదేహము దహింపఁ బడుటకు మాఱుగా తమ దేహములు దహింపఁబడిన మేలుగ నుండునని తలఁచిరి. మూఢవిశ్వాసములును మతోన్మాదమును మనుష్యుల మానుషత్వమును రూపుమాపి వారిచే నెటువంటి క్రూరకృత్యము లను జేయుటకుఁ జాలవు ? అటువంటి యమానుష శౌర్యమే యీకాలము నందుఁ జూపఁబడినపక్షమున శత్రువులు సహితము మామెను శ్లాఘించి పూజించి యుందురుగదా! ఈనరహత్య కొడిగట్టిన స్వదేశీయులైన మతాచార్యులకును పరదేశీయులైన యింగ్లీషు వారికిని నిది తీరనియప కీర్తిగా నున్నది. పాపకార్య మెప్పుడును జయప్రదము కాదు. స్వప్ర యోజనార్థముగాఁ దనపక్షమున చేరిన బర్గండీప్రభు వెదురు తిరుగుట చేతను తుంటవ్యాధుగాని యీక్రూరహత్యవలనఁ గలిగిన జనద్వేషము చేతను క్రమక్రమముగా నింగ్లీషువారు ఫ్రాన్సుదేశములోని తమ రాజ్యము నంతను నల్పానల్పముగాఁ గోలుపోయి స్వదేశమునకు మరల వలసినవా రయిరి. ఆకన్యకామణివలనఁ దా నంత మహోప కారము నొందియుఁ దన యుపకర్త్రి తన నిమిత్తమయి శత్రువులపా లయి సంవత్సరకాలము చెఱసాలయం దుండినప్పు డామెను విడిపించుట కయి ప్రయత్నింపక యుపేక్షించిన ఛార్లెస్ రాజును మిత్రద్రోహియు మహాపాపియు నని చెప్పవచ్చును. ఇట్లు ఛార్లెస్ రాజ్యలాభమును బొంది చిరకాలము పాలనము చేసినవాఁడయ్యును మనశ్శాంతి లేక తుదకుఁ దనకొడుకే తనకు విషముపెట్టు నన్న భీతిచేత నాహారమును విసర్జించి పస్తుపడి కృతఘ్నున కర్హమయిన యపాత్రపుచావే చచ్చెను. విమర్శ యని పేరుపెట్టి న్యాయాధికారుల మని ధర్మస్థానమునఁ గూరు చుండి యన్యాయముగా నిరపరాధినికి మరణదండనము విధించిన

పాపము మనస్సులను బాధింపఁగా మతాచార్యసంఘమువారు 1456 వ సంవత్సరమున మరల రోమ్నగరమునందుఁ గూడి పునర్విమర్శ చేసి వెనుకటితీర్పును త్రిప్పివేసి జోన్ నిరపరాధిని యని తీర్పు చెప్పిరి. దొంగలు పడినయాఱు నెలలకు కుక్క మొఱిగినదన్నట్లు నిర్దోషిణి చంపఁబడిన యిరువదియైదు సంవత్సరములకు గురుపీఠమువారు చేసిన తీర్పు నెంతని మెచ్చుకోవచ్చును! ఈసాధ్వియొక్క యత్యద్భుత కార్యములను వర్ణించుచుఁ బరువాతి కవులు ప్రబంధములను జేసిరి; విద్వద్గాయకులు నాటకములను గీతములను రచించి యాడి పాడి ; దేశమందంతటను బహుస్థానములయం దామెకు ప్రజలును ప్రభువులును ప్రతిరూపములను నిలిపిరి. రుయాన్ భాగమునం దామె యగ్నిలో నాహుతి చేయఁబడిన వేదికయందు సుందరమగు నొక మందిరము కట్టఁబడి యామె గుణవర్ణనము శిలాక్షరములుగా నిగనిగలాడు పాలరాయి పయిని చిత్రింపఁబడెను.



# Mrs. ELIZABETH FRY.

## ఎలిజబెత్ ఫ్రైదొరసాని.



ఫ్రైదొరసాని 1780 వ సంవత్సరము మెయినెల 21 వ తేదీని ఇంగ్లండు దేశమునందు జనన మొందెను. ఆమెతండ్రిపేరు జాన్ గర్నీ; తల్లి పేరు కేథరైన్ బెల్. ఆమెతల్లిదండ్రు లిరువురును ధనసంపన్నము లయి సుప్రసిద్ధము లయినవంశములయందు జనియించినవారు. తండ్రి మహాధనసంపన్నుఁడు; తల్లి విద్యారూపగుణసంపన్నురాలు. ఎలిజబెత్తనునది పసితనములో జననీజనకు లీమెకుఁ బెట్టినకన్యకానామము; ఫ్రైయనునది వివాహబంధమువలనఁ గలిగిననామము. తల్లిదండ్రులకుఁ గలిగిన పండ్రెండుగురుబిడ్డలలో నీమె మూఁడవది. ఈమెకు తోఁడఁబుట్టినవాండ్రు నలుగురును తోఁడఁబుట్టిన పడుచు లేడుగురును నుండిరి. బాల్యమునం దీమె చురుకుఁదనమును సూక్ష్మబుద్ధియుఁ గలదియేనను విద్యయం దంతగా శ్రద్ధవహించి పేరుపొందినది కాదు. శైశవమునం దీమె పుష్పములయందును సృష్టిపై చిత్ర్యముల యందును, ప్రీతికలదయి, తల్లివెంట నుద్యానవనమునందుఁ దిరుగు

నప్పుడు వృక్షలతాదులయొక్కయు పుష్పపల్లవాదులయొక్కయు సౌందర్యమున కాశ్చర్యపడుచు డెందమునం దానందించుచు నుండెను. ఉత్తమప్రవర్తనను గలదియు విద్యావతియు నైనతల్లి యొక్కసుగుణ సంపదనుబట్టి యీచిన్నది దయార్ద్రహృదయ యయి బీదలయొక్కయు వ్యాధిగ్రస్తులయొక్కయు సంక్లేశము బోవు నుపచారములచేతను మంచిమాటలచేతను వారి నాదరించుచు నుండెను. ఉగ్గుపాలనాటి నుండియు పరోపకారచింతను గలిగిన యీయుత్తమురాలికి గోలు పోవలసినదుర్దశ పండ్రెండేండ్ల యీడుననే యీమెకు సంభ వించెను. ఇట్లు 1792 వ సంవత్సరమునందు మహాదుఃఖము సంభవించునప్పటికి తల్లి కడుపున బుట్టినసంతానములో నగ్రసంతా నమునకు పదునేడేండ్లప్రాయమును కనిష్ఠసంతానమునకు రెండేండ్ల యీడును నుండెను. ఈమెతండ్రి తనబిడ్డలు మంచివారును సమర్థ లును గావలె నన్నయభిలాషతో వారికి విద్యాబుద్ధులు నేర్పించుట యం దత్యంతశ్రద్ధ వహించుచుండెను. ఈమె చిత్రలేఖనమునందును సంగీతమునందును నాట్యమునందును మహాసమర్థురా లయ్యెను. ఈమెకంఠస్వరము కిన్నరస్వరమువలె నత్యంతమధురమై వినువారి వీనులకు విందు గొలుపుచుండెను. అశ్వారోహణమునందుసహిత మీమెకు నిరుపమానమైనప్రవీణత కలిగి యుండెను. ఈమె తన యక్క లిద్దఱివలె నంతచక్కనిది కాకపోయినను, పలుచని పొడవైన శరీరమును పట్టువలె మృదువైనదీర్ఘశిరోజములును కలకలలాడెడు నవ్వుమొగమును గలదై మొత్తముమీఁద రూపవతి యనఁదగినదిగానే యుండెను. ఈమె బాల్యావస్థలో తాను పట్టినపట్టేకాని యితరులు చెప్పినమాట వినకుండెడుస్వభావము కలదిగా నుండె నఁట! పెంకెప ట్టని యాకాలములో నెల్లవారును భావించి గర్హించిన యాగుణమే

పెద్ద పెరిగినతరువాత సత్కార్యాచరణమునందలి నిర్నిరోధ మైన పూనికగా మాఱి యీమె కమూల్యాలంకార మయి యెల్లవారల శ్లాఘనకును యోగ్య మయ్యెను. పదునాఱుసంవత్సరముల ప్రాయ మప్పుడీమెకు వచ్చిన యొక గొప్పవ్యాధి వలననే యీమెకు పరార్థపరత్వమధిక మయినను, 1798 వ సంవత్సరారంభమున వినఁ దటస్థించిన యొక మతగురువుయొక్క ధర్మోపన్యాసమువలన నీమె పునస్సృష్టినైనట్లు పూర్ణముగా మాఱిపోయెను. పదునేడేండ్లప్రాయమునందుండిన యీమె యప్పుడు తనగ్రామములోని బీదబిడ్డల విద్యాభివృద్ధినిమిత్తమయి యొకపాఠశాలను ప్రప్రథమమున నొక్క పేదబాలునితో నారంభించెను. ఆపాఠశాల దినదినాభివృద్ధినొంది యల్పకాలములోనే పెద్దదయి, ఆమె వివాహానంతరమున పితృగృహమును విడిచి భర్తృగృహమునకుఁ బోవలసివచ్చునప్పటి కెనుబదియేడుగురు బాలురను బాలికలను గలసి యయ్యెను. ఆపాఠశాలయందలి పిల్లలు విద్యాబుద్ధులయందు వృద్ధిఁ బొందుటయేగాక యీమెయం దత్యంతానురాగము గలవారయి యీమె వియోగమునకు తల్లిని విడువవలసిన బిడ్డలవలెఁ బరితపించిరి. అంత పెద్దపాఠశాల నన్యులసాహాయ్యమును గోరక యొక్కతెయు నామె యెట్లు సమర్థతతో నిర్వహింపఁ గలిగినదో యాశ్చర్యముగా నున్నది.

ఈమె తనకు పందొమ్మిదియేండ్లు నిండినతరువాత 1800 వ సంవత్సరమునందు ఆగష్టునెల 19 వ తేదిన జోసఫ్ ఫ్రైయను నాతనిని వరించి వివాహము చేసికొనెను. అతఁ డొక గొప్పవాణిజ్య సంఘమునందు భాగస్థుఁడుగా నుండెను. ఈవధూవరు లిరువురును పరస్పరానురాగము గలవారయి, శరీరములు వేఱైనను మనస్సొక్కటియే యైన యైకమత్యముతోఁ గలసి మెలసి వర్తించుచుండిరి. భర్తయుం దవ్యా

జానురాగము గలది యగుటచేత భార్య హృదయపూర్వకముగా భర్తకు విధేయురా లయి తదాజ్ఞానుసారముగా మెలఁగుచుండెను. భార్యయందు విశుద్ధప్రేమము గలవాఁ డగుటచేత భర్తయు భార్య మాటయం దాదరము గలవాఁ డయి యామె మనస్సు కనిపెట్టి యనుకూలుఁ డయి ప్రవర్తించుచుండెను. ఇట్లు ప్రతివిషయమునందును దంపతులమనస్సు లొక్కటి యయి యేకీభవించుచుండుటవలన గృహము నిరంతరసుఖదాయక మయి భూతలస్వర్గమువలె నుండెను. ఆమె గృహవ్యయములను గూర్చి సరియైన లెక్క లుంచి, భోజనవ్యయములు, వస్త్రములు, తోఁటఖర్చులు, సేవకులజీతములు, ధర్మము మొదలయినవి వేఱువేఱుగా పద్దులు వ్రాయుచు నేమియు దుర్వ్యయము కాకుండ నాదాయవ్యయములను చక్కఁగా నిర్వహించుచుండెను; సేవకులయం దనురాగము గలదయి వారిమనస్సులు నొప్పింపక వారివలన నేర్పుతోఁ బనులు గొనుచు వారి ప్రేమకుఁ బాత్రురా లయ్యెను. విద్యావతు లయిన యువతులు భర్తల కడఁగి యుండరనియు గృహకృత్యములను నిర్వహింపఁ జాలరనియు పలికెడు మన యార్యావర్తములోని యపూర్వబుద్ధిమంతు లీకాంతామణియొక్క పవిత్ర చరిత్రమును జదివినయెడను విదుషీదూషకులు గాక బుద్ధి తెచ్చుకొందురుగాక.

భర్తవలన నీమెకు పదునొకండుగురు బిడ్డలు పుట్టిరి. బిడ్డలయం దీమె యపారప్రేమము గలదయి వారిసంరక్షణము నితరులకు విడిచిపెట్టక స్వయముగా తానే చేయుచు, కొంతయును నచ్చపాలికును రాత్రిం దివములు వారి నెప్పుడు నేమఱక కంటికి ఱెప్పవలె సదా కాపాడుచుండెను. వారిలో నెవ్వరికి కొంత చిన్నజబ్బు చేసినను వారి యల్పబాధను సహితము చూచి సహింపలేక శోకించుచు, కావలసిన

యుపచారములను పథ్యపానములను తానే చేయుచు, వారు స్వస్థతపడు వఱకును మనశ్శాంతిలేక పరితపించుచుండును. పిల్లలును తల్లియెడల నపరిమితప్రేమ గలవారయి, తల్లి యొక్క నిమిషము తమకంటఁ బడకపోయిన పక్షమున మిన్ను విఱిగి మీఁదఁ బడినట్టు లేమియుఁ దోఁపక విచారగ్రస్తులయి యుండి దూరమునుండి యామె కంఠస్వరము వినఁబడగానే పట్టరాని యానందముతో నెదురుగా పరుగెత్తుకొనిపోయి తల్లిని కౌఁగలించుకొనుచుందురు. ఇట్లామె బిడ్డలయం దింత ప్రేమ చూపునదిగా నుండినను, పిల్లల నల్లరిచేయనీయక వారినెల్లప్పుడును నాజ్ఞాబద్ధులను గానే యుంచు చుండెడిది. వారిని తనకిష్టములేని పనినుండి మరలించుట కయి యొక్క పరుషోక్తిసహితమునోటనుండి వెడలవలసిన యక్కఱ లేక ప్రేమాస్పదము లయిన కన్నులనుండి వెలువడెడి యనంగీకారసూచకమైన యొక్క చుఱుకుచూపో భ్రూసంజ్ఞయో చాలి యుండును. ఇట్లు ప్రేమానుబంధముచేత బద్ధులయి యామె కాజ్ఞానువర్తులయి భయభక్తులు చూపుచు మెలఁగుచుండెడివారొక్క బిడ్డలుమాత్రమే కారు, దాసదాసీజనులును ఆమె యెడల మాతృభక్తి కలవారయి స్వకృత్యముల నణుమాత్రము నేమఱక, ఆమె యాజ్ఞల నతిక్రమింపక పరమవిధేయులయి శ్రద్ధాభక్తులతో జరుపుచుండెడివారు. ఆమె తనపరివారమును స్వకుటుంబములోనివారిని గానే భావించి ప్రేమించుచు, వారు ప్రమాదవశమునఁ జేసిన తప్పులను క్షమించుచు, వారిని దన బిడ్డలవలెనే యాదరించుచుండినను, వారిని మనస్సువచ్చినట్టు తిరుగనీయక యెప్పుడును తగిన కట్టుపాటులోనే యుంచుచుండెను. అందుచేత వారు తమ యజమానురాలియెడల భక్తివిశ్వాసములు కలవారయి సర్వదావినయవిధేయతలతో సేవించుచు, తమపనుల నత్యంతశ్రద్ధాళువులయి యుక్తకాలములలో

నిర్వహించుచు, ఆమె యాజ్ఞలనెల్ల శిరసావహించి హృదయపూర్వకముగాఁ జేయుచు ఆమె నిమిత్తమయి యావశ్యక మైనయెడలఁ దమ ప్రాణముల నైన సమర్పించుటకు సంసిద్ధులయి యుండునంత యనురాగము గలవారయి యుండెడివారు.

1813 వ సంవత్సరమునందు లండన్ నగరమునందలి 'న్యూగేట్' (నూతనద్వారము) అనుపేరుగల ప్రధానకారాగృహములో నుంచఁబడియుండు స్త్రీలయొక్క దుస్థితినిగూర్చి శోచనీయములయిన కథలు ఫ్రైదొరసానియొక్క చెవి సోఁకెను. వారి దుఃఖకథలను విని యామె మనస్సునందు సంతాప మొంది తనసహోదరీతుల్యలయిన యాయభాగ్యురాండ్ర యొక్క దౌర్భాగ్యమును గొంతవఱకైనను దొలఁగించి వారిని మంచిస్థితికిఁ దెచ్చుట యెట్లు సాధ్యమగునాయని యామె తలపోయఁ జొచ్చెను. ఆచెఱసాలలోని యిన్నూఱు ఘనగజముల వైశాల్యముగల నాలుగుచిన్నగదులలో మున్నూఱుగురు కారాబద్ధురాండ్రు వారివారి బిడ్డలతోడఁ గూడ నుంచఁ బడిరి. వారిలోఁ గొందఱు అపరాధినులు, కొందఱు నిరపరాధినులు; కొందఱు విమర్శింపఁబడి దోషస్థాపనానంతరమున శిక్షింపఁబడినవారు; కొందఱింకను దోషనిర్ధారణము లేక విమర్శార్థము తేఁబడినవారు; కొందఱు నరహత్యాది ఘోరపాపముల కొడిగట్టిన కఠినచిత్తురాండ్రు; కొందఱు దారిద్ర్యదోషముచేత నల్పాహారవస్తుచౌర్యాదులకు లోఁబడవలసినవారయిన పశ్చాత్తప్తచిత్తురాండ్రు. ఇట్టి నానావిధవిశేషగుణములవారందఱు తారతమ్యవిభేదము లేక యేకసమూహముగా నక్కడఁ జేర్పఁబడియుండిరి. వారికిఁ బ్రొద్దు గడచుట కక్కడ పని యేమియు లేదు; వారు యుక్తముగా నడచుచున్నారో లేదో చూచుటకుఁ దగిన పయిపరామర్శయు లేదు; అందఱిపైని కారాగృహాధి

కారి యొకఁడును వానికి సహాయుఁడుగా బాలుఁ డయిన యంత్రసకోడు కొకఁడును అధికారము చెల్లించు చుండిరి. వారిలోఁ బెక్కండ్రకు మఱికి వేలికలును చింపిగుడ్డలును దక్క సంగములను గప్పుకొనుటకుఁ దగినవస్త్రములు లయినను లేవు. నాడు వంట చేసికొన్నను, భుజించినను, వసించినను, కూర్చుచున్నను, శయనించినను, మఱి యేమి చేసికొన్నను, ఆనాలుగు చిన్నగదులలోనే చేయవలెను. వారక్కడ సామాన్యముగా నొండొరులను తిట్టుకొనుచు, శపించుచు, అవాచ్యములు పలుకుచు, అసహ్యము లయినపాటలు పాడుచు, కాలము గడుపుచుందురు. కారాగృహమును సందర్శింప వచ్చినవా రెవ్వరయిన నా మార్గమున బోవఁ దటస్థించిన పక్షమున వారందఱును గుంపుగా ద్వారముల కడఁ జేరి 'ఆకలి' 'అన్నము' అని యఱచుచు, కడుపులు నోళ్ళు బాదుకొనుచు, డబ్బు నిమిత్త మినుపకడ్డీల సందులలో నుండి చేతులు చాచుచుందురు; వచ్చినపుణ్యాత్ములలో నెవ్వరయిన జాలి పడి చేతులలోఁ గాను పీసము లేవి యయినఁ బెట్టినపక్షమున వానిని వెంటనే చెఱసాలలోని కల్లంగడికిఁ బంపి మద్యము తెప్పించుకొని త్రాగుచుందురు. వారి పరిభాషయం దన్న మనుమాటకు కల్లనియే యర్థము. వారిలో సాహసికురాండ్రు కొందఱు ద్వారముల సమీపమునకు వచ్చినవారి వస్తువులను చేతులు చాచి బలవంతముగా నూడఁ బెఱికి కొనుటయుఁ గలదు.

ఒకనాఁడు మాననీయు లయిన సుందరు లిద్ద ఱాకారాగారమును జూడఁ బోయిరి. వారుకొంతసే పితర విషయములను గూర్చి మాటాడిన తరువాత చెఱసాలలోని స్త్రీల స్థితిని బాగుపఱుచుటను గూర్చి ప్రస్తావన చేయఁగా కారాగృహాధికారి "వారు బాగుపడుట యసాధ్యము. నామాట నమ్ముఁడు. వారు బాగుపడుటకు శక్యము

కానంత దుర్వృత్తిలోను పాపములోను మునిఁగి యున్నారు.” అని గంభీరస్వరముతోఁ జెప్పెను. అప్పటి కారాగారాధిపతులు చిరకాలాగతాచారప్రభావమును బట్టి దయాశూన్యహృదయు లయి, కారాబద్ధుల సంస్కారమును గూర్చి యెవ్వ రయిన ముచ్చటించినను వారి మాటల నాదరింపక వారిని తిరస్కారదృష్టితోఁ జూచి పరిహాసించు నంతటి కఠిన దశకు వచ్చియుండిరి. అప్పు డానుందరులలోనుండి మృదు మధురస్వరముతో “దేవుఁడు తలఁచు కొన్నను వారు బాగు పడరా! వారు దేవుని శక్తికి మించి యున్నవా రని మీయభిప్రాయము కాదనుకొనెదను.” అని యొక వాక్యము వెలువడెను. ఆమాట విని యులికిపడి యతఁ డావాక్యములు వచ్చినవంకకు దృష్టిపఱపి, దీర్ఘశిరోజములతోడ దయారస మొలుకుచున్న శాంతముఖముతోను మహోత్సాహముచేతఁ బ్రజ్వరిల్లుచున్న వెలితిఖుసఁ గన్నులతోను నిలుచుండి ధీరత్వము మూర్తీభవించినట్టున్న పొడవయిన సుందర విగ్రహమును బొడగాంచి, క్షణకాల మేమి చెప్పుటకును తోఁచక యూరకుండి కడపట “నాయభిప్రాయ మదికాదు. ఈ కారాగృహమునందు మతబోధచేయుట కయి నియమింపఁబడి యున్న మతాచార్యునకు వీరిని బాగుచేయుట యసాధ్య మయిన దని చెప్పుటతప్ప నాయభిప్రాయము వేఱొకటి కాదు.” అని తడఁబడుచుఁ బలికెను. పయి యట్లు పలికిన యామె మన ఫ్రైదొరసానియే యని దీనిం జదువు వారికి వేఱుఁగఁ దెలుపవలసిన యావశ్యక ముండదు కదా! అనాటి కావలికత్తె లిద్దఱును వారియొద్ద సెలవు గయికొని వెడలిపోయిరి. ఇట్లు వెంటఁబోయిన రెండవయామె ఫ్రైదొరసానియొక్క యుక్క పెనిమిటియు పరోపకారములయం దసమానదీక్ష వహించినవాఁడును నయిన సర్ ఫవెల్ బక్ స్టన్ దొరవారి సహోదరి యగు అనా బక్ స్టన్ కన్య.

తరువాతఁ గొన్నిదినములకు ఫ్రైదొరసాని యొక్కతెయు నొంటిగా మరల కారాగృహమునకు వచ్చెను. ఆమె చేతిలో నప్పు డొక్క పుస్తక ముండెను. ఈసారి కారాగృహాధికారు లామె నెక్కువ గౌరవముతోఁ జూచి యాదరించిరి. వారి యాదరణకు సంతోషించి యామె కారాబద్ధురాం డ్రయి యున్న స్త్రీలలోఁ గొంత సేవు త నొంటిగా విడిచి వారితో మాటాడుట కంగీకరింపుఁడని కోర — వారిని బాగుచేయఁ బ్రయత్నించుట నిష్ఫల మనియు, వారితో నొంటిగా నుండుట యపాయకర మనియు చెప్పి, కారాగృహాధికారియు మతా చార్యుఁడును ఇతర రాజపురుషులును ఆమెను నిరుత్సాహపఱిచి యామె యుద్యమమును వారింపఁ జూచిరి గాని వారిమాట లామె చెవులలో దూఱినవి కావు. ఆమాటలవలన నామె యొంతమాత్రమును భయ పడక, భగవంతుఁడు తనకుఁ రక్షకుఁ డయి యుండఁగా నితరులవలనఁ దన కపాయము రాఁజాల దని పలుకుచు, కృతనిశ్చయురా లయి తన పట్టును విడువకుండెను. అంతటి దృఢమనస్కురా లయి యున్న యామె ప్రార్థనలను త్రోసివేయఁజాలక తుదకు, బందీశాలాధ్యక్షు లంగీకరింపవలసినవా రయిరి. ఎంత చెడి హీనదశయందున్నవా రయి నను తనకువలెనే నిత్యము లయిన యాత్మలు గలవా రయి, అజ్ఞా నాంధకారముచేతఁ గన్నుఁగానక పాపపంకమునఁ బడినవా రయినను పశ్చాత్తాపావలంబదండముచే మరల లేవఁ దగినవా రయి; అరిషడ్వర్గ పిశాచావేశముచేత మతిచెడి ధర్మముతోడి పోరాటమునకుఁ బూనిన వా రయినను దయనీయు లయిన యబలలే యయి, తన సోదరీతుల్య లయిన యీశ్వరపుత్రికలవద్దకుఁ బోవునప్పు డాత్మసంరక్షణార్థముగా నామె కేమిసాధనములు కావలెను? ఈశ్వరభక్తియే యామెకు వజ్ర కవచము; ప్రేమార్ద్రమైన పరిశుద్ధహృదయమే యామె కభేద్యఖేటము;

దయాధర్మాదులే యామె కమోఘాయుధములు. ఇటువంటి యప్రతి
హత సాధనములను సాయముగాఁ గొని యపుడామె నిర్భయముగా
కారాగృహాంతర్గతలయి యున్న మదవతులయొద్దకు నడచెను. ఆమె
సమీపింపఁగానే యాయువతులామెను జూచి యన్నముకొరకు డబ్బులు
డబ్బులని యొక్కపెట్టున నఱవఁదొడఁగిరి. వారి వాగ్భూషయం దన్న
మన్న పదమున కర్థ మేమో యీయలకే తెలుపఁబడినది. అప్పు డా
కారాగారము మనుష్యనివాస మగునట్టి మందిరము వలెఁ గాక యడవి
మృగములతో నిండియున్న గుహ వలెనే కాఁబడెను. ఆకేకలలోను
సమ్మర్దములలోను తా నానతి కుపోద్ఘాతముగా వారికి బోధింప నుద్దేశించు
కొనివచ్చిన మాటలను మఱచిపోయెను గాని యామె ధైర్యమును మా
త్రము విడిచిపెట్టక, తనచేతిలోనున్న బైబిలులోని నూతననిబంధనగ్రంథ
మును విప్పి, వారికిఁ జదివి వినిపింపఁ దలఁచుకొని వచ్చిన భాగమును
దీసి, విస్పష్టమై మధురమైన గంభీరస్వరముతో నుల్లములు పల్ల
వించునట్లు చదువఁదొడఁగెను. వారిలోఁ బలువుర కాయుత్తమగ్రంథ
మును వినుట యదియే ప్రథమ మయి యుండును. ఆమె శ్రావ్య
నాదముతోఁ జదువుచున్న కొలఁది నంతకంత కాసందడి యడఁగి,
వారిలోఁ బలువురు హర్షపులకాంకితగాత్రలయి యావేదవాక్యముల
నత్యంతభక్తితోను శ్రద్ధతోను వినుచుండిరి. వారిలో చిరకాలాభ్యస్త
పాపకర్మబలముచేతఁ గఠినచిత్తలయి మృగప్రాయులయి యున్న
వారుసహిత మావాక్యార్థమునం దాదరము చూపక పోయినను, తమ
మీఁది యవ్యాజప్రేమతో వచ్చి తమక్షేమమునే నిష్కళంకహృద
యముతోఁ గాంక్షించుచు తమ యాత్మోజ్జీవనముకొఱకే మాటాడు
చున్న యా సాధ్వీమణియొక్క నిర్మల వాక్యామృతరసపానముచేత
పులకిల్లి దేహములు పరవశములు కాఁగా సందడి మాని నిశ్శబ్దముగా

నుండిరి. ఒకరిద్దఱు లేకను దమలోదాము మాటాడుకొనుచుండఁగా నత్యంతశ్రద్ధాళువయి వినుచున్న యాగన యొకతె చేయెత్తి "మాటాడకుఁడు. ఈదేవతావాక్యములు వినఁబడకుండ సందడి చేయకుఁడు." అని హస్తసంజ్ఞతో వారిని వారించెను. ఆకారాగృహమంతయు నాసమయమున దుష్టాంగనల నెడఁబాసి పుణ్యాంగనలతో నిండినట్లును, రాక్షసస్త్రీలను పోనాడి దేవతాకాంతలను దెచ్చుకొన్నట్లును, అయ్యెను. ఆదివ్యవాక్యామృతరసప్రవాహముచేత ననేక కాంతల శిలాకఠినచిత్తములు కరఁగి నీరయ్యెను; అనేక కాంతల నేత్రములనుండి యానందబాష్పములు జాలుకట్టె; అనేక కాంతల గాత్రములు గగుర్పొడిచెను. ఆహా! సౌజన్యమునం దెంతటి యద్భుత శక్తియున్నది! గ్రంథపఠన మయినతరువాత నామె బిడ్డలతల్లులను జూచి వారివలె తానును బిడ్డలతల్లియే యగుటచేత బిడ్డలయెడల తల్లుల కెట్టివాత్సల్య ముండునో బిడ్డలసుఖముగిమిత్తము తల్లు లెంత తల్లడిల్లుదురో తానెఱుఁగుదుననియు, యుక్తాహారమును శుద్ధవాయువును దేహావరిశ్రమమును లేకపోవుటచేత కృశించి యున్న యాబిడ్డలను జూడఁగాఁ దనమనస్సు దహించుకొని పోవుచున్నదనియు, అసహాయులయి యున్న యాబిడ్డలను చక్కఁగా సంరక్షించి వారిని సన్మార్గమునకుఁ ద్రిప్పుట తల్లులకెల్ల ధర్మమగుటచేత దుస్థితిలో నున్న యాబిడ్డలకొఱకయి చెఱసాలలోనే యొకపాఠశాలనుంచుట యుచితమనియు, నానావిధముల బోధించి పాఠశాల యుంచుటయందిష్టము గలతల్లు లెల్లను చేతు లెత్తవలసిన దని యడిగెను. కృపారసము వెదచల్లెడి యామెచల్లనిపలుకులవల్ల నుల్లములు కరఁగినవారయి కన్నులనుండి జొటజొట నీరుకారుచుండఁగా నొక్కసారిగా బిడ్డలతల్లు లందఱును జేతులెత్తిరి. కొంతకాలమున కాచెఱసాలలోని బిడ్డల

నిమిత్తమయి యొకపాఠశాల స్థాపింపఁబడినది. ఆపాఠశాల కుపాధ్యాయినిగా కారాబద్ధురాండ్రలోని యొకయువతి యచ్చటివా రందఱి చేతను కోరుకోనఁబడినది. ఆయువతి తాను యుక్తప్రవర్తనము కలదయి యుండుటయేకాక పాఠశాలనుగూడ చక్కఁగా నిర్వహించి నందునఁ బదునేనుమాసము లయినతరువాత వయిచుధికారు లాయువతిని క్షమించి విడుదల చేసిరి. ఆమె యాదినముననఁ గొన్నిగంటలకాల మక్కడఁ గడపి యింటికిఁబోయెను. తత్కాలమునకు తను తొంటి యవగుణములను విడిచి మంచితనము పూనినట్లు కనఁబడినను, ఆకారాబద్ధురాండ్రబుద్ధులు మాఱుటకు చిరకాలము పట్టినది.

ఫ్రైదొరసాని తనబిడ్డల సంరక్షణనిమిత్తము విశేషకాలము గడపవలసిన దయినందున 1816 వ సంవత్సరమువఱకును వస్త్రహీనలయినవారికివస్త్రములు పంపుట యప్పుడప్పుడుపోయి బైబిలులోనిభాగములు చదివి వినిపించుట మొదలయినపనులు తప్ప చెఱసాలలోని స్త్రీలనిమిత్తమయి విశేషముగా నేమియుఁ జేయలేకపోయెను. ఆమె ప్రోత్సాహమువలన 1817 వ సంవత్సరమునందు న్యూగేట్ చెఱసాలలోని కారాబద్ధ లగుస్త్రీలస్థితిని బాగుపఱచునిమిత్తమయి యొక సమాజము స్థాపింపఁబడెను. ఆమె నిరంతరప్రయాసమువలన చెఱసాలలోని స్త్రీలలో నల్పకాలముననే యద్భుతమైనమార్పు గలిగెను. ఆమార్పున కాశ్చర్యపడి కారాగృహాధికారు లామెకు సర్వవిధముల సహాయులయి యామె కర్తవ్యమని చెప్పినదానినెల్ల నంగీకరించి యామెకుఁ బ్రోత్సాహము కలిగించిరి. ఇట్లు చెప్పుటనుబట్టి యామె పూనిన ఘనకార్యము విశేషకష్ట మక్కఱలేక యనాయాసముగా నెఱవేఱినదని దీనిం జదువువారు భ్రమపడఁగూడదు. లోకములో కష్టములకోర్చి ధైర్యమును సహనమును నిరంతరోద్యమమును

పూనని సుఖపరాయణ స్త్రీచిత్తములలో నెప్పుడు నెన్నఁడును న్యూనకార్యములను దేనిని జేసినవారు లేరు. బురదలో దిగి బాహువులు నొప్పిపెట్ట దేహమునఁ జెమ్మటలుపట్ట ముక్కున నూర్పులుపుట్ట శ్రమపడినంగాని బురదకు వెలిచి వయిమండి పలుకుబారిపంచదారపట్టుకులచేత నెన్వాడును పంకమున దిగఁబడినబండి పైకి లేవదు. ముందిని శేయునతలనన్న వక్షమున స్వసుఖమును త్యజించి కష్టములను సహించి మొదలెనిపాటు పడవలెను. ఆచెఱసాల ఘాతుకమృగబహుళ మైన గుహవంటిదిగాని గృహమువంటిది కాదని పైని వర్ణింపఁబడినదికదా. అట్టియసహ్యస్థలము గొప్పవంశమునఁ బుట్టి యాబాల్యమును భోగములు ననుభవించుచు సుఖపడ నరగిన మన షైరిదారసాగివంటి పుణ్యశ్లోకములకెంత దుస్సహ మయినదిగా నుండునో చెప్పుటకంటె నూహించుకొనుటయే సుకరము. కొంచెముకాల మయినతరువాత నచ్చటివారి చేష్టలనుగూర్చి యామె యిట్లు వ్రాసెను — “మాలోఁ గొందఱ మించుమించుగాఁ బ్రతిదినమును బాలశాలను జూచుట కయి పోయిన సమయములలో చెఱసాలయందలి స్త్రీ భాగములో నడచెడి దారుణము లైనదుర్వ్యాపారములను జూచితిమి. పీడించుట, బాసలు చేయుట, జూదము లాడుట, పోట్లాడుట, దుర్భాషలాడుట, చెడుపాటలు పాడుట, గంతులువేయుట, పురుషవేషములు వేసికొని యల్లరి చేయుట, ఇట్టివే యనేకములు చెప్పను వినను దగినవికావు — అందుచేత మేమది వయసువారిని వెంటఁబెట్టుకొనిపోవుట కర్హమైనతావు కాదని భావించితిమి.” ఆస్థల మామెకు రోఁత పుట్టింపక పోలేదు. అయినను మంచిని జేయవలె నన్న యుత్సాహముచేతను స్వాభావిక సౌజన్యముచేతను భగవత్ప్రీతికరకార్యతత్పరత్వముచేతను నా సాధ్వి సమస్తమునకు నోర్చుకొన్నది. ఇట్టి హేయస్థలావలోకనమును సహించి

పదిమాసములు పనిచేసినపిమ్మట నామె మరల నిట్లు వ్రాయఁ గలిగెను.—

"మీ రేర్పఱచినవిధు లెప్పుడో యరుదుగాఁ గాని సామాన్యముగా నతిక్రమింపఁ బడలేదు. వారు మేర మీఱక నియమించిన వ్యవస్థలోనే యుండిరి. వారు నాకు పరమవిధేయురాండ్రయి వర్తించిరి. దయచూపుటతప్ప వేఱువిధముగా వారియెడల మే మెప్పుడును ప్రవర్తింపక పోయినను వారిలో నొక్కతె నాతో దండనాధికారియొద్దకు పోవుటకంటె నాయొద్దకు వచ్చుట కెక్కుడ భయపడుచుందు మని చెప్పినది. ఈకాలములో మే మెప్పుడును ఏస్త్రీని శిక్షింపనులేదు; శిక్షింపఁ దలఁచుకోను లేదు. నేనుకాని నాసఖులు గాని విధించిన శాసనముల నతిక్రమింపక యింత చక్కఁగా నను వర్తించుట క్రమశిక్షితము లయిన కుటుంబములలో సహిత మసాధ్య మని తలఁచెదను. పనివిషయమున నన్నెనో వా రిరువదివేల దుస్తులను గుట్టిరి. ఈ పనియంతయు చిన్నయంగడివాండ్రచే నియ్యఁబడిన దగుట చేత వాండ్రిచ్చిన కూలి యత్యల్ప మయినది. ఇన్నివేలలో మూడు దుస్తులు తప్ప కనఁబడకపోయినవి లేవు. అవియు స్త్రీల లోపములవలన పోయినట్టు తోఁచదు. వారు ప్రతిమాసమును అఱువది మొదలుకొని నూఱువఱకును మేజోళ్ళ నల్లుదురు. వారు కొంచెముగా నూలు సహితము వడుకుదురు. వారియార్జనము మొత్తమువిూఁద స్త్రీ యొక్కతెకు వారమునకు 18 పెన్సులు (1-2-0) కిట్టుచున్నది. ఈసొమ్ము సాధారణముగా వారి యన్నవస్త్రములకు వ్యయపఱుపఁబడును. ఇందు నిమిత్త మయి వారందఱును గలిసి నెలకు నాలుగు పౌనులు (రు 60లు) ఇత్తురు; మేము సహాయద్రవ్యముగా నెనిమిది పౌనులు (రు 120) ఇత్తుము. ఈరెండు మొత్తములును గలిసి వారికి తగిన మంచివస్త్ర

ములకుఁ జాలియుండును. ఇంకొక ముఖ్యాంశము మతబోధవలన వారిలోఁ గలిగిన గొప్పలాభ మయి యున్నది. మేము ప్రతిదినమును రెండుసారులు వారికి బైబిలు చదువుచుందుము. వారిలో పలువురకు చదువు నేర్పితిమి కాని కొందఱుమాత్రమే స్వయముగా కొంచెము చదువుటకు శక్తురాం డ్రయినారు. దానివలనఁ గలిగిన ఫల మత్యద్భుత మైనదిగా నున్నది. అంత యాదరముతో బైబిలును స్వీకరించుట యితరస్థలములలో నే నెచ్చటను జూడలేదు. వారిలోఁ బెక్కండ్ర కాపుస్తకమును, అందుఁ జెప్పఁబడిన మతరీతియు నీతియు, అపూర్వ ములుగా నున్నవి. తత్పఠనమువలన వారియాత్మలకుఁ గలిగిన ప్రయో జనము మిక్కిలి తృప్తికరముగా నున్నది. నే నప్పు డప్పుడు పోయి చదువ నుద్దేశించితి నని చెప్పినప్పుడు, నే నేదో గొప్ప సంతోషమును వారికిఁ గలుగఁ జేయబోవు చున్నట్టుగా వారు గుంపులు గుంపులుగా నావెంటఁ బడుచుందురు."

ఈమెయొక్క కృషివలనఁ దత్పూర్వము (తాగుఁబోతుతనము నకును దైవదూషణమునకును సోమరితనమునకును దౌర్జన్యమునకును నిలయమైనకారాగృహ మిప్పుడు మద్యపానవర్జనమునకును దైవభక్తికిని కర్మశీలతకును సౌజన్యమునకును నివాస మయ్యెను. ఆశ్చర్యకర మైన యీమార్పునకు సంతోషించి ప్రభుత్వమువా రీమె చేసినయేర్పాటు లను బ్రిటానియా దేశములోని చెఱసాలలో నెల్ల నెలకొల్పిరి. అటు పిమ్మట నీ యేర్పాటులు యూరపుఖండమునం దంతట నవలంబింపఁ బడినవి. పైరిదొరసాని బ్రిటానియా ద్వీపములలో నున్న చెఱసాల లను మాత్రమే కాక, ఫ్రాన్సు జర్మనీ మొదలయిన దేశములకుఁ గూడఁ బోయి యచ్చటి ప్రధానము లైన కారాగృహములను పరీ క్షించి యందలి స్త్రీలస్థితిని బాగుచేయుట కయి బహువిధములఁ

గృషి చేసెను. ఇంతకుముందు చెఱసాలనుండి విడుదలనుబొందిన స్త్రీలు నీతిమాలినవారును జీవనాధారము లేనివారును నయి స్వోదరపోషణార్థముగా పూర్వపరిచితములైన పాపములనే మరలఁ జేయువారగుచుండిరి. ఇప్పుడు చెఱసాలలోఁ దగినవృత్తులు నేర్పఁబడుటవలన విముక్తిఁ బడవలసినపడఁతులావృత్తుల నవలంబించి పాటుపడి పాపము పొంతకుఁ బోక సుఖజీవనము చేయుగలవారయిరి. పాపపాశముల నుండి విడివడి యిట్లుత్తమజీవనము చేయుటకు శక్తురాండ్రయిన స్త్రీలు తమకృతజ్ఞతను దెలుపుచు నామెకు లేఖలు వ్రాయుచుండిరి.

పైశ్రీదొరసాని చేసిన మంచికార్య మిది యొక్కటియే కాదు. ద్వీపాంతరవాసదండనము లొందిన స్త్రీలను గొనిపోయెడి యోడల లోనికిఁబోయి చూచి యావఱకసౌఖ్యమునకును క్రూరత్వమునకును స్థానము లయి యుండినవానిని సౌఖ్యమునకును సదాదరణమునకును స్థానములనుగాఁ జేసెను. ఓడలలో నెక్కింపఁబడిన స్త్రీలను పశువులమందలను దోలినట్టుగా నొకగదిలోనికిఁ ద్రోయఁగా, వారచ్చట శాపములు పెట్టుచు, ఒట్లు పెట్టుకొనుచు, జగడమాడుచు, స్త్రీలకు పాపకథల నేర్పుచు పెట్టుచు, అవాచ్యప్రసంగములు చేయుచు, అకార్యకరణముల కుపాయములు రోయుచు, ప్రొద్దు పుచ్చుచుండెడి వారు. ఆమె యట్టి యోడలోనికిఁ బోయి బైబిలులోని యుత్తమ వాక్యములను వారికి చదివి వినిపించి హితబోధ చేయుచు, ఆ ప్రయాణములయందు వారికి ధర్మబోధ చేయఁబడిన యుపాధ్యాయినుల నేర్పాటు చేయుచు, అధికారులతో మాటాడి వారిని దయతోఁ జూచునట్లు చేయుచు, గతిమాలిన దుర్మార్గగామినులగు నా కామినుల కెన్నివిధములనో మేలు చేసెను. ఆమె యున్మత్తశరణాలయములకును వైద్యశాలలకును బోవుచు రోగుల

సౌఖ్యముల కొఱకు కెన్నియెన్నివిధములనో పనిచేసెను. ఒకనాఁ డామె యొక యుద్ధస్థలమునకుఁబోయినప్పుడు నదిలో గడ్డిమీఁద పడి పొరలుచున్న యొక పిచ్చిది యామె మాట విని లేచి తన్నుఁ గట్టియున్న గొలుసు పీక్కొనుచు నామె వెనుకకు వచ్చెను. ఆమె దయావిశిష్టము లయినచల్లనిచూపులతోఁ జూచుచు తన హస్తము నాపిచ్చిదాని కందియ్యఁగా నది ప్రేమతో ననేకపర్యాయము లాహస్తమును ముద్దుపెట్టుకొనెను. ఆమె క్రైస్తవవేదగ్రంథములను ధర్మార్థముగా బీదలకుపంచి పెట్టుచుండెను. నావికులకును సైనికులకును కారాబద్ధులకును బీదలకును పుస్తకనిలయములను బెట్టించెను. ఆమె లోకోపకారార్థముగా వచనరూపమునను పద్యరూపమునను బహుగ్రంథములను రచియించెను. ఎక్కడ దుఃఖ ముండినదో, ఎక్కడ దారిద్ర్యపీడ యుండినదో, ఎక్కడ నజ్ఞాన ముండినదో, అక్కడ నెల్ల దుఃఖోపశమనమునకై యామె యేదో పనిచేయ వెదకుచుండెను. విపత్తులో నున్నవా రెవ్వరును నామెవద్దకు వచ్చి యాశాభంగము నొంది వెడలిపోయినవారు లేరు. ఒకనాఁ డామె గుఱ్ఱపుబండిలో నెక్కి పోవుచుండఁగా దారిప్రక్కను నొకచోట నొకబండివాఁడు తలగాయముతో తనబండిప్రక్కను పడియుండుట కంటఁబడెను. ఆమె తక్షణమే తన బండిని నిలిపి యాబండివానియొద్దకుఁ బోయి వాఁడు తనకడుపునఁ బుట్టినకుమారుఁ డయినట్టుగా వానితల గాయమునకు కట్టుకట్టి రక్తస్రావమును మాన్పి తరువాత బండి నెక్కి పోయెను. ఆమె రోగుల కుపచారము చేయుటయందును గాయములకు కట్లుకట్టుటయందును గూడ మహాసమర్థురాలు. 'పరోపకారార్థమిదంశరీర' మన్నట్టుగా నామె పరులనిమిత్తమే తానుజీవించుచున్నట్టుండెను. ఆమె పవిత్రచరిత్రము లోకమునకు పరోపకారమును బోధించు మహాకావ్యముగా నున్నది.

ఆమె యతిసుకుమార మయిన దుర్బలశరీరము కలదిగా నుండె ననియు; భీరుస్వభావము కల దయి బాల్యమునం దెవ్వరైన గట్టిగా మాటాడినను కోపదృష్టితోఁ జూచినను, బావు రని యేడ్చుచుండెడి దనియు, ఆమె చరిత్రమును వ్రాసినవారు చెప్పుచున్నారు. అట్టి సహజదుర్బల యయిన యీ యబలకు ధైర్యసాహసములతో నిట్టిసత్కార్యముల నిర్వహింపఁ గలబల మెక్కడనుండి వచ్చి నది? ఈబలమంతయు నామెకు మతాభినివేశమునుండియు నీశ్వ రుని నుండియు వచ్చిన దనుటకు సందేహము లేదు. ఆమెకు మత మంతయు కార్యాచరణములలో నుండినదికాని క్రియాశూన్యము లయిన శుష్కవాక్యపఠనములలో నుండినది కాదు. మతమున కెల్లను లోకజనకుఁ డయిన యీశ్వరునియందలి పితృభావము, ఈశ్వరసృష్టి లోనివా రగుటచేత సోదరు లయిన మానవుల యందలిభాతృభావము, ఈరెండును ప్రధానములు. ఇందు మొదటిదాని వలన నేర్పడుధర్మ మీశ్వరునియందు దృఢభక్తి యుంచి సమస్త విషయములలోను తదాజ్ఞ ననుసరించుట; రెండవదానివలన నేర్పడుధర్మము స్వసుఖమున్నైనఁ బరిత్యజించి పరోపకారకరణమునందు వర్తించుట. ఈధర్మద్వయము నొకదానిని విడిచి యొకటి యుండునది కాదు. కావున రెండును నేక ధర్మమే యని చెప్ప నొప్పును. ఇదియే సర్వమతసారమయిన పరమ ధర్మము. దీని నొక సంస్కృతకవీశ్వరుఁ డీక్రిందిరీతిని జెప్పి యున్నాఁడు —

శ్లో. శ్లోకార్ధేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రంథకోటిభిః
పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్.

గీ. గ్రంథకోటులచే నేది గఱపఁబడెనొ
దానిఁ బద్యార్థమునఁ జెప్పెదను వినుండి—

అగుఁ బరోపకారంబు పుణ్యంబుకొఱకుఁ
బృథివిఁ బాపంబు కొఱ కన్యపీడనంబు.

ఆమె తాను బూనినమహాకార్య మీశ్వరాజ్ఞారూప మైనధర్మ మని యాచరించెనే కాని పేరుకొఱకును ప్రసిద్ధికొఱకును గాదు. నిజ మైన మతధర్మము లేవో యెఱుఁగక పనికిమాలిన నోములతోను వ్రతములతోను ఉపవాసములతోను ఉప్పిడులతోను కాలక్షేపము చేయుచుండెడు మన దేశపుస్త్రీ లీసాధ్వీ శిరోమణి వలెఁ బరోపకార పరాయణులు కాఁ బ్రయత్నింతురు గాక! ఈమె వలె నందఱును చెరసాలలును వైద్యశాలలును సంస్కరించువారు కాకపోవచ్చును; పుస్తక నిలయములను స్థాపించువారు కాకపోవచ్చును. కాని, మనఃపూర్వకముగా కృషిచేసినచో తమ్మును తమ కుటుంబములను సంస్కరింపఁ గలవారును తమ యిరుగు పొరుగు వారిని ప్రేమించి వారికి తోడుపడఁ గలవారును కాకపోఁజాలరు. ప్రతి సత్కార్యానుష్ఠానమునందును కష్టము లుండును. బంగారమునకు మేలిమిని దెచ్చుట కయి దాని నగ్నిహోత్రములోఁ దప్తముచేయుట యావశ్యక మయినట్టే పరోపకారధూర్వహు లగుపుణ్యాత్ములకు మేలిమిని దెచ్చుట కయి కష్టము లావశ్యకము లని బుద్ధిమంతులు చెప్పుచున్నారు. తాను బైని వేసికొన్న ఘనకార్య విషయముననే కాక సంసార విషయమునను మన ఫ్రైదొరసానిగారికిఁ గష్టము లనేకములు వచ్చినవి. మొట్ట మొదట 1808 వ సంవత్సరమునందు కుటుంబమున కంతకు మూలాధారుఁడైన యామె మామగారు కాలధర్మము నొందిరి. తరువాత నామె ప్రియసహోదరి యొకతె మృతినొందెను. పిమ్మట నామె ముద్దులమనుమఁ డొకఁడు స్వర్గస్థుఁడయ్యెను. అటుపిమ్మట కుమారుని రెండవకూఁతురు లోకాంతరగతురాలయ్యెను. ఆచిన్నది గతించిన పదునొకండు దినము

లకే యాచిన్నదానితండ్రియైన పెద్దకుమారుఁడు మరణమునొందెను. తండ్రిపోయిన యెనిమిది దినముల కాతనికూఁతు రింకొకతె పరలోకగత యయ్యెను. ఒకదానిపై నొకటిగా వచ్చెడి యిటువంటి కష్టకథలను పేర్చి చెప్పుట సంతాపకర మగుటచే నీ యాపత్పరంపరాకథనను నింతటితో విడిచి పెట్టెదను. ఒకదానివెంట నొకటిగా వచ్చిన యీ విపత్పరంపరలవలన నామె మన స్సించుక చలించినను తోడనే నిశ్చలత వహించినందున సత్కార్యాచరణమునందలి థైర్యోత్సాహము లించుకయు తగ్గక మఱింత పెంపుచెందినవి.

తాను బూనినపనిని దేనిని జనులలోఁ బేరు సంపాదింపవలెనన్న యపేక్షతో నామె చేయలేదనియు, తనపేరు బయలికి వచ్చుచున్నదని తెలిసికొన్నప్పు డామె దుఃఖితురా లయ్యెననియు, చరిత్రకారులు చెప్పినను, లోకములో సత్కార్యదీక్ష వహించి పనిచేయువారిపేరు ప్రసిద్ధికిరాక యడఁగిపోవుట యస్వాభావిక మగుటచేత ఫ్రైదొరసాని పేరును సర్వత్ర వ్యాపించి మంచివారి గౌర వాదరములకు పాత్ర మయ్యెను. ఉపకారచింత గలవా రనేకు లనేకస్థలములలో సంఘములుగాఁ జేరి యామెవలెఁ బుణ్యకార్యములు చేయుట కుద్యమింపఁ దొడఁగిరి. ధనాధికారసంపన్ను లైన ఘను లనేకు లామెను సందర్శించి యామెతో సంభాషించి కృతార్థత నొంద యత్నింపఁ గడఁగిరి. డెన్మార్కుదేశపు రాజును రాణియు నామెతో విందు గుడిచిరి. 1840 వ సంవత్సరము నందు శ్రీవిక్టోరియా మహారాజ్ఞిగా రామెకు దర్శనమిచ్చి, చెల్సినగరములోఁ బెట్టఁబడిన యనాథరక్షణశాలకు సహాయముగా నేఁబది పౌనుల (రు750ల) నొసఁగిరి. 1842 వ సంవత్సరమునందు ప్రష్యాదేశపు రా జామెయింటికిఁ బోయి యామెతో సహపంక్తిని భుజించెను. ఆరాజు నెదుర్కొని గౌరవించిన ప్రస్తావనలో

నామె వ్రాసినదానిలోని కొన్ని పంక్తు లిచ్చట బొందుపఱుప ననుజ్ఞ వేడుచున్నాను — "నాభర్తగారును నేనును మాయుల్లుండ్రి లోను కుమారులలోను గొందఱితోఁ బోయి రాజు నెదుర్కొని, ఉచిత పీఠములతోను పుష్పములతోను చక్కఁగా నలంకరింపఁ బడియున్న మాసభాసదనమునకుఁ దోడి తెచ్చితిమి. అచ్చట మే మాయునకు మాయైనమందు కొమారితలను కోడండ్రను మాయేడుగురు కుమారులను పెద్ద పౌత్రుని నాసోదరీసోదరులను జూచితిమి.........ఆయన కటుతరువాత మేము మామనుమలలోను మనుమరాండ్రలోను ఇరువదియేవురను జూపితిమి." పెద్దకుటుంబ ముండుట సత్కార్యాను ష్ఠానమునకు ప్రతిబంధకమని కొంద ఱందురు. అది కల్లయని యీయామె దృష్టాంతముచే నెఱుఁగవచ్చును. మంచికార్యమునకు మన మెక్కడ నుండునో మార్గ మక్కడ నేర్పడును. ఆమె తన యవసానదశలో నీయర్థము వచ్చుమాటలు వ్రాసినది — "పదునేను సంవత్సరముల ప్రాయమప్పుడు నామనస్సు మాఱినది మొదలుకొని యారోగ్యదశలో నున్నను అమయదశలో నున్నను పగలైనను రాత్రియైనను నేను నిద్రనుండి లేవఁగానే దేవునికిఁ బ్రీతికరముగా నేను జేయవలసిన సేవ యేది యని మొట్టమొదట చింతింపకుండిన దెప్పుడును లేదని నమ్ముచున్నాను." — అఱువది యైదేండ్లు నిండినతరువాత 1845 వ సంవత్సరము అక్టోబరునెల 12 వ తేదిని ఆమె తనస్థూలశరీరమును విడిచి కీర్తిశేషురా లయ్యెను. ఆమె యాత్మ సుఖముగా పరలోకమునం దీశ్వర సన్నిధానమునం దున్నను, ఆమె చేసిన సత్కార్యము లీలోకమున శాశ్వతముగా నిలిచి యనేకులను పరోపకారకృత్యములకు నిరంతరమును బురికొల్పుచున్నవి.

---

# LADY JANE GREY.

## లేడీ జేన్ గ్రే.



లేడీ జేన్‌గ్రే జీవించినకాల మల్పమే యైనను, అంత యల్ప కాలము సుగుణము లన్నియు పూర్ణముగా వికాసము నొందుటకు

చాలినది కాకపోయినను, ఆయల్పకాలములోని యామె చరిత్రమే సజ్జనులస్తోత్రమునకు పాత్రమైనంత పవిత్రమైనదిగా నున్నది. ఆమె మితభాషిత్వమును, వినయమును, విశుద్ధహృదయమును, నిష్కళంక చరిత్రమును, సర్వజనశ్లాఘాపాత్రము లయినందున నామె కష్టములకు చింతపడని వారును దుర్మరణమునకు దుఃఖపడని వారును లేకుండిరి.

ఆమెతండ్రి నాల్గవయెడ్వర్డునకు దౌహిత్రుఁడయి యింగ్లండు లోని పురాతనప్రసిద్ధకుటుంబములోఁ బుట్టినవాఁడయి హెన్రీగ్రే యనునామధేయము గల డార్సెట్టుప్రభువు; ఆమెతల్లి యింగ్లండు దేశాధిపతి యైన యేడవహెన్రీకి కూతు రయి ఫ్రెంచిరాజునకు రాణి యయి భర్తృమరణానంతరమున సఫోకుప్రభువును పునర్వివాహము చేసికొన్న మేరీ యనునామెయొక్క జ్యేష్ఠపుత్రి యైనలేడీఫ్రాన్సెస్ బ్రాండ ననునామె. ఉభయపక్షములందు రాజబంధువు లైనయీ దంపతుల కీమె 1537 వ సంవత్సరమునందు లీసెస్టరుమండలములోని బ్రాడ్గేటుపట్టణమున జనన మొందెను. పసితనమునందే యీచిన్నది విద్యయం దత్యంతాసక్తురాలుగా నుండెను; తల్లిదండ్రులును తమ కౌమారితకు విద్య చెప్పించుటయం దత్యంతశ్రద్ధాళువు లయి యీమె నధికసమర్థురాలినిగాఁ జేయుటయం దతికుతూహలము గలవారుగా నుండిరి. అయినను వారు భయము చూపినఁగాని బాలికలు బాగు పడ రన్న నమ్మకముచేతనో మఱి యేహేతువుచేతనోకాని తమపుత్రిక యెడల నతికఠినముగాఁ బ్రవర్తించువారుగా నుండిరి. ఆమెకు మొదటఁ జిరకాలము పండితవర్యుఁ డైన యిల్మె రనునతఁ డుపాధ్యా యుఁడుగా నుండెను; కడపట మహావిద్వాంసుఁడును సుప్రసిద్ధుఁడును నైన రోజర్ ఆస్కం యనునతఁడు విద్యాగురు వయ్యెను. ఆమె యద్భుతప్రతిభావిశేషమును విద్యాభిలాషమును శాంతస్వభావమును

సాధుభావమును జూచి యుపాధ్యాయు లిరువురునుగూడ శిష్యురాలి యం దత్యంతవాత్సల్యము గలవా రయి యుండిరి.

ఆమె తనతోడ సమానవయస్కు డయి యింగ్లండునకు రాజయిన యాడువర్డునకంటె సర్వవిధముల సమర్థురాలని యెల్లరచే బరిగణింపఁ బడుచుండెను. ఆమె కుట్టుపనియందు నిపుణురాలయి యనేకకళలయందు సమర్థతకలదిగా నుండెను; వీణాదివాద్యములయందు ప్రౌఢురా లగుటయే కాక మృదుమధుర కంఠస్వరము కల దయి కర్ణరసాయనముగా గాత్రమున పాడుటయందును సాటిలేనిదిగా నుండెను. ఆమె స్వభావ మైనయింగ్లీషున సలక్షణముగా వ్రాయుటకును బ్రసంగించుటకును శక్తురా లగుటయే కాక ఫ్రెంచి, ఇటాలియన్, ల్యాటిన్, గ్రీకు భాషలలో ధారాళముగా మాటలాడుటకును వ్రాయుటకును నేర్చెను. ఇవిగాక హీబ్రూ, చాల్డీ, అరబ్బీ భాషలయం దీమె తగుపాటిపాండిత్యము కల దయ్యెను. శైశవమునందే యి ట్లన్నిభాషలయందు పాండిత్యము కలుగుట మహాశ్చర్యము. నిశ్చలచిత్తమును, అసాధారణగ్రహణ ధారణశక్తిని, బుద్ధిసూక్ష్మతను గలిగి యుండుటచేత దురవగాహము లయిన శాస్త్రవిషయములు సహిత మామెకు సులభము లయ్యెను. అందుచేత నామె పండితజనైకగ్రాహ్యము లయిన యద్విషయములను గూర్చి నిపుణముగా బ్రసంగించుటకును వాదములు సలుపుటకును సమర్థురా లయి యెల్లవారల నద్భుతప్రమోదములపాలు చేయఁజొచ్చెను. సహజశరీరసౌందర్యమునకును పాండిత్యమునకును దో డీమెకు యోషిజ్జనామూల్యవిభూషణము లనఁదగినమార్దవమును నమ్రతయు సత్యసంధతయు సౌశీల్యమును శోభాతిశయమును గూర్చెడి యలంకారములుగా నుండెను. ఈమె విద్యాబుద్ధులు చూచి సంతోషించి యింగ్లండురాజయిన యెని

మిదవహెన్రీ యీచిన్న దానిని పలుమాఱు రాచనగరునకు రప్పించి దయచూపి యాదరించు చుండెను.

ఈమెకుఁ గడపటగురువైన రోజర్ ఆస్కాముపండితుఁడు తన మిత్రున కొకనికి లేఖ వ్రాయుచు దానిలో జేన్‌గ్రేయొక్క సుగుణ సామర్థ్యములను బహువిధముల శ్లాఘించెను. అతఁ డామె కెప్పు డుత్తరములు వ్రాసినను ల్యాటిన్‌భాషలో వ్రాయు చుండెను; ఆమెయు నాతని కాభాషలోనే ప్రత్యుత్తరములు వ్రాయు చుండెను. దీనినిబట్టి విచారింపఁగా నామె పాండిత్య మసమాన మైన దనియు, ఈడుకు మించిన దనియు స్పష్టపడుచున్నది. మన దేశమునందు సంస్కృత మెటువంటిదో, యీదేశమునందు ల్యాటిన్ గ్రీకుభాష లటువంటివి. అతఁడు 1550 వ సంవత్సరము శ్రావణమాసములో నొకనాఁడు డార్సెట్టుప్రభువుయొక్క నగరమునకుఁ బోయినప్పు డా కుటుంబ మంతయు మృగయావిహారమునకు వెడలియుండెను. జేన్‌గ్రే మాత్ర మింట నున్న దని విని యతఁ డామెను సందర్శించుట కయి తన్మందిరమునకుఁ బోయెను. ఆమె యప్పుడు గ్రీకుభాషలో ప్లాటో యను తత్త్వశాస్త్రజ్ఞునిగ్రంథమును జదువుచుండెను. ఆమె యాభాష యందుఁగూడ నసమానపాండిత్యము గలదయి తత్త్వశాస్త్రవిషయ మునఁ బ్రసంగించుట చూచి, పదునాలుగేండ్లలోపలి వయస్సు గల యాబాలికయొక్క తెలివి కతఁ డత్యద్భుతపడెను. ఆమె గ్రీకుభాష యందుఁగూడ వ్రాయను జదువను నేర్చినదయి యాతని కాభాష లోనే లేఖలు వ్రాయుటకు వాగ్దానము చేసెను. అతఁడు తనసంతోష మును పట్టఁజాలక యింత పిన్నవయస్సులో నింత భాషాజ్ఞానమును శాస్త్రజ్ఞానమును నీవెట్లు సంపాదింపఁ గలిగితి వని యడిగెను. ఆమె యిట్లు ప్రత్యుత్తర మిచ్చెను — "నేను మీతో సత్యమును జెప్పెదను.

అది విన్నప్పుడు మీకొకవేళ నాశ్చర్యము గలుగవచ్చును. నాకీశ్వరుఁడు దయచేసిన గొప్పమేళ్ళలో నొకటి కఠినులయిన జననీజనకులను దయామయుఁ డయిన యుపాధ్యాయునిఁ బ్రసాదించుట యై యున్నది. నేను నాతల్లియొద్దఁగాని తండ్రియొద్దఁగాని యున్నప్పుడు నేనును మాటాడవలసినను మౌనము వహింపవలసినను కూర్చుండవలసినను నిలుచుండవలసినను నడవవలసినను తినవలసినను త్రాగవలసినను సంతోషింపవలసినను దుఃఖింపవలసినను కుట్టవలసినను క్రీడింపవలసినను నృత్యము చేయవలసినను మఱి యేపని చేయవలసినను దేవుఁడు తనసృష్టి నెంత క్రమముగాను నిర్దుష్టముగాను జేసెనో యంత క్రమముగాను నిర్దుష్టముగాను నేను జేయవలసి యుండును. అట్లుకాక నే నేవిషయమున నేమాత్రము వ్యతిక్రమముగా నడిచినను పరిహాసములతోను పరుషవచనములతోను కొన్నివేళల గిల్లులతోను తాడనములతోను పీడనములతోను నాతల్లిదండ్రులయెడల నాకుఁగలగౌరవమును బట్టి నేను జెప్ప నొల్లని యితరదండనములతోను నేను బాధింపఁబడుచుండును. ఆదుస్సహబాధచేత నామనస్సు చెదరుచుండుటనుబట్టి నా గురువైన ఐల్మరుగారివద్దకుఁ బోవలసిననిమిషము వచ్చువఱకును నేను నరకములో నున్నట్టు భావించుచుండును. ఆయన మిక్కిలి శాంతముగాను చదువునం దెంతో యభిరుచి కలుగునట్లుగాను బోధించుటచేత నే నాయనయొద్ద నుండు కాలమంతయు క్షణములోఁ గడచిపోయినట్టు తలంతును. ఆయనను విడిచి వెడలిపోవలసి వచ్చినప్పుడు నాస్వాంతము దుఃఖాక్రాంత మగును. నేను చదువు తప్ప మఱి యేయితరకార్యమును జేయవలసినను, అది నాకు దుఃఖకరముగాను భయంకరముగాను పీడాకరముగాను నుండును. ఈప్రకారముగా నాకు పుస్తకములే సంతోషదాయకములుగాను దినదినాధికసుఖప్రదములుగాను

నుండుటనుబట్టి చూడఁగా నాకితరవినోదము లన్నియు వ్యర్థములుగాను పీడలుగాను పొడకట్టును."

ఆమెయొక్కసుగుణగౌరవమును విద్యావిశారదత్వమును తల్లిదండ్రులు చూచి యానందింప లేక పోయినను, ఆమెతోడిపరిచితి భాగ్యము కలిగిన గుణగ్రహణపారీణు లందఱును ఆమె శక్తిసామర్థ్యములను గుణసంపత్తిని మెచ్చుకొని పొగడుచుండిరి. ఇతరుల స్తుతుల చేత నామె లేశ మయినను గర్వమును బొందక మఱింత వినయవతిగాను సౌశీల్యవంతురాలుగాను అయ్యెను.

మతవిషయమున నీమె రోమను కైస్తవధర్మములకు విరోధములయిన ప్రొటెస్టాంటు మతసిద్ధాంతములయందు దృఢవిశ్వాసము గలదయి తన్మతావలంబురా లయ్యెను. ఆమెయొక్క చిత్తౌన్నత్యము మిక్కిలి ప్రకాశించినది యీమతధర్మావలంబనమునందే. ఆమె చక్కఁగా నాలోచించి సత్యము లనియు నందుచేత నవశ్యానుష్ఠేయము లనియు హృదయపూర్వకముగా నిశ్చయించుకొన్న ధర్మములనుండి బహుమానములుగాని బాధలుగాని బ్రతుకుగాని చావుగాని యీమె నణుమాత్రమును మరలింపఁ గలిగినవి కావు. ఈసత్యము ముందు ముం దీమెచరిత్రమువలనఁ దెలియవచ్చును.

ఇంగ్లండురా జయిన యెనిమిదవహెన్రీకి ముగ్గురుబిడ్డ లుండిరి. వారిలో మేరీ, ఎలిజబెత్తు, అనువా రిరువురుపుత్రికలు; కడపటివాఁడయిన యెడ్వర్డనుబాలుఁడు పుత్రుఁడు. అతఁడు తనయనంతరమున మొట్టమొదటకుమారుఁ డయిన యెడ్వర్డు రాజ్యమునకు రావలయు ననియు, తరువాత మేరీయును, అటుతరువాత నెలిజబెత్తును, తదనంతరమునఁ దనమేనకోడలును, లేడీజేన్ గ్రే తల్లియు నగు ఫ్రాన్సెస్ బ్రాండమును రాజ్యమునకు రావలయు ననియు మరణశాసనమును

వ్రాసి, తనకుమారునికి యుక్తవయస్సు వచ్చునటుకును రాజ్యపాల నము చేయుటకు పదునాలుగురను కార్యనిర్వాహకులనుగా నియ మించెను. ఆ పదునాలుగురిలో నార్తంబరులాండుప్రభు వొకఁడుగా నుండెను. అతఁడు తంత్రములవలనను సామర్థ్యములవలనను తక్కిన వారి నందఱికిని మించి తానే సర్వాధికారి యయినట్లుగా యథేచ్ఛ ముగా రాజ్యకార్యములను నిర్వహించుచు మహాబలవంతుఁ డయ్యెను. ఇట్లు జరుగుచుండఁగా నతని యధికారమునకు భంగము కలిగించు వైపరీత్య మొకటి సంభవించునట్లు కానఁబడెను. ఎవరిపేరిట నీప్రభువు రాజ్యపాలనము చేయుచుండెనో బాలుఁడైన యా యాఱవయెడ్వర్డు దీర్ఘవ్యాధిబాధితుఁ డయి యుండెను. రాజు మృతుఁ డయ్యెడు పక్ష మునఁ దన యధికారము పోవుటయే కాక తన కపాయము సహితము రావచ్చు నని యతఁ డెఱుఁగును. అందుచేత రోమీయమతావలంబిని యయినమేరీని రాజ్యమునకు రాకుండఁ జేయుటకును తన యధికార మునకు భంగము రాకుండ నిలుపుకొనుటకును దగినయుపాయ మొకటి యాలోచించి యుపాయబహుళ మయిన కుతంత్రము నొకదానిని నడప నుద్యమించెను. ఈ దురాలోచనము మనస్సునందుఁ బెట్టుకొని యతఁడు ముందుగా డార్సెట్టు ప్రభువుతో బాంధవ్యము గలిగించు కొనుటకు యత్నించి, ఆతని పెద్దకూఁతు రయిన లేడీజేన్‌గ్రేను తన నాలవకుమారుఁ డయిన గిల్డుఫోర్డుడడ్లీ యనునతని కిచ్చి వివా హము చేయునట్లు డార్సెట్టుప్రభువును బ్రార్థించెను. ఇప్పుడు సప్ఫోకు ప్రభువుగాఁ జేయఁబడిన యాడార్సెట్టుప్రభు వాతని మాయోపాయ మును దెలిసికొన లేక దుర్బలమనస్కుఁ డగుటచేతఁ దన కొమారిత నాతని కొడుకున కిచ్చి పెండ్లిచేయుట కొడఁబడెను. 1553 వ సంవత్స రము జ్యేష్ఠమాసములో వారి వివాహము నడచెను. వరుఁడు దృఢ

కాయుఁడును రూపవంతుఁడును సాధుహృదయుఁడును సద్వర్తనుఁడును నయినందున వధువున కనర్హుఁడని చెప్పఁదగినవాఁడు కాఁడు. ఈ వివాహము మహావైభవముతో నడచెను. రాజయిన యాజివ యెడ్వర్డ్ దంపతులకు గొప్పకట్నములను బంపి, వధువున కమూల్యము లయిన వివాహవస్త్రముల నిచ్చెను. రాజపాయకర మయినవ్యాధిలో నుండఁగా నిటువంటి వేడుకలు జరుగుట ప్రజల కెవ్వరికిని సమ్మతము కాకుండెను.

నార్తంబర్లాండు ప్రభు విట్లొకకార్యమును నిర్వహించి తరువాతి కార్యమును కొనసాగించుట కుపక్రమించెను. ఆఱవయెడ్వర్డు వ్యాధిబాధితుఁడయి దుర్బలచిత్తుఁడయి తనచేతిలో నుండుట చేత నాతఁడు మెల్లగా రాజును సమీపించి, ఆతనివ్యాధిని గూర్చి పరితపించి, ఆతనికి మఱియొకవిధ మగుట తటస్థించెడు పక్షమున తండ్రి మరణశాసనమును బట్టి రాజ్యము మేరీయధీన మగు ననియు, అట్టయ్యెడు పక్షమున మేరీ రోమనుమతావలంబకురా లగుటచేత దేశమునకు మితిమీరినయనర్థములు మూఁడు ననియు, ఎలిజబెత్తును గూడ రాజ్యమున కనర్హురాలినిగాఁ జేయక మేరీనిమాత్రము తొలగించుట సాధ్యము కా దనియు, వారిరువురును సవతియువ్వలుగాని యేకగర్భజనితలు కారనియు, రాజు మరణశాసనమును బట్టి విధించినను ప్రభుప్రతినిధిసంఘముల వారిరువురిచేతను వారధర్మసంతతిగా నిర్ధారణము చేయఁబడినందునఁ బ్రజ లట్టి యధర్మసంతతి రాజ్యమునకు వచ్చుట కంగీకరింపఁజాలరనియు, తండ్రియొక్క మరణశాసనమును బట్టి తరువాత రాజ్యమునకు రావలసిన లేడీ జేన్‌గ్రేయొక్క తల్లి యొక్క తెరేసే యనియు, లేడీ జేన్‌గ్రే విద్యచేతను బుద్ధిచేతను గుణసంపదచేతను సామర్థ్యముచేతను సర్వవిధముల చేతను రాజ్యమున

కర్త్మారా లగుటచేత నామెను రాణినిగా నియమించుట సర్వజన సమ్మతముగా నుండు ననియు బోధించి, రాజు మనస్సును ద్రిప్పి వేసెను. ఇది లేడీ జేన్‌గ్రే రాణి యయినపక్షమునఁ దన కొడుకు రా జగునని యు, అప్పుడు తా నిప్పటివలెనే యధికారవమును నిరపాయముగాఁ జెల్లింపవచ్చు ననియు, స్వప్రయోజన పరత్వముతోఁ బన్నిన దుస్తంత్రమే కాని ప్రజాక్షేమమునుగోరి పారమార్థిక బుద్ధితో నాలోచించిన సదుపాయముకాదు. ఎడ్వర్డు దూరాలోచన లేని పిన్నవయసువాఁ డగుటచేతను, మరణ మంతికంత కాసన్న మగుటచే దుర్బలమనస్కుఁ డగుటచేతను, తన బాల్యస్నేహితురాలును యోగ్యురాలును నయిన లేడీ జేన్ గ్రేయందుఁ గల ప్రేమాతిశయము చేతను, రాజు నార్తంబరులాండు ప్రభువు యొక్క మాయలోఁబడి యాతఁ డుపదేశించినట్లు మరణశాసనమును వ్రాసెను. తరువాత శీఘ్రకాలములోనే యెడ్వర్డురాజు తన పదునాఱవయేట తండ్రిపోయిన యేడవసంవత్సరములకు గ్రీనిచ్ నగరమునందు పరమపదప్రాప్తుఁ డయ్యెను. ఆతనిమరణమునకు ముందవసాన దశలో సోదరునిఁ జూచుటకయి రప్పించు మిషమీఁద నాతనియప్పల నిద్దఱిని రప్పించి వారిని తనయధీనము చేసికోవలె నని నార్తంబరులాండు ప్రభు వొక కపటనాటకమును గల్పించెను గాని యీ పన్నుగడలో నతఁడు సఫలమనోరథుఁడు కాలేదు. మిత్రు లాతని కుతంత్రమును వారికి ముందుగాఁ దెలిపినందున నారాజతనయ లిద్దఱును నతఁడు పన్నిన వలలోఁ బడక తప్పించుకొని మరలి సురక్షిత మైన స్థలము చేరిరి. అతఁ డిట్లు విఫలమనోరథుఁ డయినను తనపూనికను విడువక నఫోకుప్రభువు మొదలయినప్రభులను వెంటఁగొని తిన్నఁగా సయన్ మందిరముల నున్న లేడీ జేన్ గ్రే వద్దకుఁ బోయి వినయవిధే

యతులతో నామెకు రాణికి నడపవలసినమర్యాదలను నడపి యామెను సందర్శించెను. పెనిమిటితోటి సహవాససౌఖ్యము ననుభవించుచుం బెండ్లి యయినప్పటినుండియు, నామె యక్కడ వసించుచుండెను. ఈ దంపతు లన్యోన్యానురాగముగలవారయి సుఖముగా కాలముగడుపు చుండిరి. ఆమె యొంటిగా నున్నప్పు డెల్ల విద్యావ్యాసంగముతో కాలము గడుపుచు సద్గ్రంథములను జదివి యానందించుచు నుండెను. అంతేకాని యిహలోక సంబంధము లయిన మరాశ లేవియు నామెమనస్సునం జొరలేదు. తనమామగారు పన్నుచుండిన కపట తంత్రము లామె కెంతమాత్రము నావఱకు దెలియనే తెలియవు. ఎడ్వర్డుయొక్క మరణానంతరమున నార్తంబరులాండు ప్రభువు వచ్చి రాజమరణశాసనమునుబట్టి యామె రాణి యయినదని చెప్పం గానే యామె బిగ్గరగా నేడ్చి మూర్ఛిల్లెనఁట! మూర్ఛ తెలిసినతరు వాత సహితమామె యెంతమాత్రము నామోదింపక చాలసేపు విచారగ్రస్తురా లయి యుండి తనకు సింహాసన మక్కఱలేదని నిరాక రించెను. మామగా రెన్నివిధములం బ్రార్థించినను తా నాతని ప్రార్థన నంగీకరింపక, జన్మస్వాతంత్ర్యమునుబట్టి న్యాయముగా రాజపుత్రికల సొత్తు కావలసినరాజ్యము నితరు లపహరింపం జూచుట యధర్మ మనియు, అట్టి యధర్మవృత్తికిం దా నొడంబడంజాల ననియు, దృఢ చిత్తముతోం బలికి, తనబంధువులు చెప్పినయుక్తుల కన్నిటికిని తగిన సమాధానములు చెప్పి, తన్ను బాధింపక తానప్పు డున్న స్థితితోం దృప్తినొంది సుఖించునట్లు తన్ను విడిచి పెట్టుఁడని వారిని దీనముగా వేఁడుకొనెను. వియ్యంకుని ప్రేరణముచేతం దనతండ్రివచ్చి యెన్నియో విధముల బతిమాలినను మనస్సు చలింపనీక యామె దృఢచిత్తురా లయి తన పూనికను విడువకుండెను. అంతట నామెతల్లి వచ్చి పూజ

నీయు నైన యిందఱాప్తులు చెప్పు చున్నప్పుడు మూర్ఖపుపట్టు పట్టుట న్యాయము కాదనియు, బంధుహితకులుఁ గోరి చెప్పెడు తనబుద్ధి విన వలసినదనియు, బోధించెను. ఇంతవఱకును నాజ్ఞాపించుచుండెడు జననీ జనకులు ప్రార్థించుచుండఁగా, సదా తదాజ్ఞాబద్ధురా లయి నడవ నల వాటుపడిన యామె యేమి చెప్పుటకును తోఁచని దయి వారిమాట కెదురాడ వెఱచి డోలాందోళితచిత్తయయి యూరకుండెను. అట్టి సమయమునం దామె ప్రాణప్రద మైన ప్రియభర్త దాపునఁ జేరి తన ప్రార్థన మంగీకరింప వలసినదని వినయపూర్వకముగా కడసారి వేఁడు కొనెను. ప్రాణాధికునిగా భావించి యాతనితోడిదే లోకమని యవ్యాజ ప్రేమతో సేవించుచున్న ప్రాణవల్లభుఁడు వచ్చి దైన్యరస ముట్టిపడ వేఁడుకొన్నప్పు డాతనిమాట కెదురుచెప్పలేక యామె యెట్లో యొడఁ బడెనుగాని యప్పుడు సహితము సంతోష పడుటకు మాఱుగాఁ దన యవస్థకు దుఃఖింపఁ జొచ్చెను. ఇంతనిర్బంధ పెట్టి బలాత్కారముగాఁ బడసినయంగీకార మనర్థదాయక మయి దుఃఖముగా ముగియు నని తెలుపునట్లుగా నప్పు డామె కన్నులనుండి బాష్పధారలు వెలువడి వెల్లువలుగట్ట నామె పయివంకఁ జూచి "దయాసముద్రుఁడవైన యో యీశ్వరుఁడా! ఈసామ్రాజ్యము నిజముగా నాదే యయినపక్షమున నీమహిమయుఁ బ్రజాక్షేమమును వృద్ధియగునట్లుగా పరిపాలించుటకు నాకు శక్తినిమ్ము" అని ప్రార్థించెను. 1553 వ సంవత్సరము జూలై నెల 10 వ తేదిని లేడీజేన్‌గ్రే పట్టాభిషేకమహోత్సవ నిమిత్తము లండన్ నగరమునందలి కోటలోని యొక సుందరమైనపడవలోఁ గొని పోఁబడెను. అప్పు డామెవెంట మామగా రగు నార్తంబరులాండు ప్రభువును తండ్రియగు సఫ్పోకు ప్రభువును బోయిరి. అంత నచ్చట పట్టాభిషేకోత్సవము నడచెనుగాని యీశ్రోత్రరాణియే యుత్సాహ

వంతురాలు గాక కన్నులు వాచునట్లుగా నేడ్చుచుండెను. ఒక్క లండనునగరమునందుఁ దప్ప రాష్ట్రమునం దంతటను ప్రజ లందఱును లేడీజేన్‌గ్రేకుఁ బ్రతికూలురయి మేరీ కనుకూలురుగా నుండిరి. లండన్ నగరమునందు సహితము ప్రజ లీమె పట్టాభిషేకసమయమునం దుత్సాహమును సంతోషమును గనఁబఱుపలేదు.

మేరీ రోమీయమతస్థురా లగుటచే నామె రాజ్యభారమును వహించుటయం దంత యిష్టము లేనివారుగా నున్నను, నార్తంబరు లాండు ప్రభువుయొక్క దుష్పరిపాలనమును బట్టి ప్రజ లాతనిని ద్వేషించువారయి జేన్‌గ్రేయొక్క ప్రభుత్వమునం దాదరము లేని వారుగా నుండిరి. ఇది యిట్లుండగా మేరీ తాను రాణి యైనప్పుడు మతభేదమును బాటింపక సర్వజనక్షేమకరముగాఁ దాను బూర్వరాజ శాసనములను మన్నించుచు సత్పరిపాలనము చేసెద నని వాగ్దానము చేసెను. అందుచేతఁ బ్రజలు సంతుష్టులయి మతభేదమును మఱచి న్యాయముగాఁ దండ్రిరాజ్యమునకు వచ్చుట కర్హురాలైన మేరీ యొక్క పక్ష మవలంబించి యామెకు సహాయులు కాఁ దొడఁగిరి. లేడీ జేన్‌గ్రేయొక్క యధికారమును గాపాడుట కయి యుంచఁబడిన సేనలు సహితము సేనాధిపతులచేఁ గొనిపోఁబడి మేరీపక్షమునఁ జేరఁ జొచ్చెను. అప్పు డేమిచేయుటకును తోఁచనివాఁ డయి నార్తంబరు లాండు ప్రభువు కొంతసేనతో మేరీ మీఁదికి దండువెడలెను. గాని తన నమ్మినభృత్యులే తన్ను విడిచి శత్రుపక్షమునఁ జేరుటచేత నిరాశుఁ డయి తానును మేరీయొక్క ప్రభుత్వమున కామోదించిన రాజభక్తుని వలె నటించి "కాంబ్రిడ్జిపురముయొక్క యంగళ్ళవాడలో బహిరంగ ముగా "దేవుఁడు మేరీరాణిని రక్షించుగాక!" యని ఘోషించెను. జేన్‌గ్రేయొక్క తండ్రి యగు సఫోకు ప్రభువును వియ్యంకుఁడు చూపిన

మార్గముననే యనుసరించి తానును మేరీ రాజ్యభారము వహించుట నభినందించెను. ఈప్రకారముగా జేన్‌గ్రేరాజ్ఞిగా ఘోషింపఁబడిన పదిదినములనాఁడు నసోఁకుప్రభువు తన కొమారితయొద్దకుఁ బోయి "నీవు రాణివేషమును విడిచి యింతటినుండి భృత్యవేషముతోఁ దృప్తినొంది యుండవలయును" నని యాకస్మికముగాఁ జెప్పెను. ఆమాట కామె యణుమాత్రమును సంచలింపక నిర్వికారచిత్తయై "నేనీవేషమును ధరించిన నాఁటికంటె నెక్కుడు సంతోషముతో నిప్పుడు దీనిని దీసివేసెదను. నాజననీజనకు లైన మీ రిరువురును నాజ్ఞాపించినందునఁగాని లేనియెడల నే నీవేషము నెప్పుడును ధరించి యుండను. ఈశుభవార్త నాకెంతో సంతోషకరముగా నున్నది." అని పలికి తత్క్షణమే తనపూర్వ వస్త్రములను దాల్చెను. లండన్ దుర్గమున కధికారిగా నున్న యామె తండ్రియే యప్పుడు మేరీయొక్క ప్రవేశోత్సవమున కయి కోటతలుపులు తెఱపించెను. అందుచేతఁ గోటలో పట్టబద్ధురాలుగాఁ బ్రవేశించిన లేడీ జేన్ గ్రే యిప్పు డాకోటలోనే పతితోడఁగూడ కారాబద్ధురాలగుట తటస్థించెను.

మేరీ సింహాసన మధిరోహించిన మఱునాఁడే రాణిపేరిట లేడీ జేన్‌గ్రే మామగా రైన నార్తంబరులాండుప్రభు వాతనిగర్భశత్రు వయిన అరండల్‌ప్రభువుచేత పట్టుకోఁబడెను. సాధారణముగా క్రూరులును భీరువులు నయినవా రందఱును ప్రాణములకు భయపడునట్లే యతఁడును భయపడి యంత్యదశయం దతిదీనముగా ప్రాణరక్షణార్థము ప్రార్థించెనుగాని యాతని యప్రతిరోధ మైన యపరాధమును వినాశకర మైన దురాశయు దయకుసహింత మతని నసహ్యునిగాఁ జేసినందున నతఁడును మఱియిద్దఱును ప్రాణాంతదండనమును బొందవలసి

నవా రయిరి. అతనికొడుకులలో ముగ్గురును సహోదరుఁడొకఁడును ప్రభుపరంపరలోనివారు కొందఱునుగూడ రాజద్రోహులుగా పరిగణింపఁబడి పట్టుకోఁబడిరి గాని, రాణి ప్రజానురంజనమును గోరి వారిలో ననేకులను క్షమించి విడిచెను. తరువాత లేడీ జేన్ గ్రేయును నామె భర్త యగుగిల్ఫోర్డు డడ్లీ ప్రభువునుగూడ విమర్శింపఁబడి యపరాధస్థాపన మయినపిమ్మట రాజద్రోహులగుటచే వధార్హులని నిర్ధారణము చేయబడిరిగాని వారిరువురునుగూడ పదునెనిమి దేండ్లయినను నిండని బాల్యప్రాయము లగుటనుబట్టియు నిరపరాధు లగుటనుబట్టియు క్షంతవ్యులుగా నెన్నఁబడినందున వారిదండనము త్వరపడి నడప నుద్దేశింపఁబడలేదు. అందుచేత నాదంపతులు కడపట విడిచిపెట్టఁబడుదు రని యెల్లవారును నమ్మియుండిరి.

ఇది యిట్లుండఁగా మేరీరాణి తనకు రాజ్యము స్థిరపడఁగానే యామతసంస్కారమువలనఁ దమ పదములను గోలుపోయిన రోమీయమతస్థులను మరల వారిపూర్వస్థానములయందు నిలుప నారంభించెను. ఆమె యత్యంతమూఢవిశ్వాసమును మతోన్మాదమును గలదయి, స్వాభావమూర్ఖత్వమును బట్టియే స్వమతతారతమ్య గ్రహణాసమర్థురాలయి, యామీఁద మతాంతరుల నిషేధవాదములవలన మఱింత దురాగ్రహావేశపరవశురాలయి, రోమీయమతనిషేధవాదులను తన్మతావలంబులను బహువిధముల బాధింపఁ జొచ్చెను. అందుచేత దేశములో రోమీయధర్మప్రతిషేధకమతముయొక్క స్థిరత్వమునకు భంగము గలుగునేమో యని సంశయింపవలసినంత వైపరీత్యము సంభవించెను. ఇట్టిస్థితిలో నామె రోమీయమతస్థుఁడును క్రూరుఁడును నైన ఫిలిప్పనుస్పెయినుదేశపురాజును వివాహమాడఁ బ్రయత్నించుటకూడఁ దటస్థించినందున, ప్రజలు నిరాశులయి సంక్షోభము

నొంద మొదలుపెట్టఁగా వారిలోననేకు లాయుధములు ధరించి బహిరంగముగాఁ గలహించుటకుఁ దెగింపవలసినవా రయిరి. ఈరాజద్రోహతంత్రము మొదట నిగూఢముగా సమర్థతతోనే యారంభింపఁబడెనుగాని కార్యనిర్వహణమున కావశ్యక మయిననేర్పు తగినంత లేనందునఁ గార్యము తుదముట్టినది కాదు. కలహకారులకుఁ బ్రథమనాయకుఁ డైన సర్ థామస్ వైయట్టు రాజసేనలఁ గొన్నిటి నోడించి లండన్‌నగరముమీఁదికి వచ్చెనుగాని యతఁ డీయల్పజయములచేత గర్వపడి ప్రమత్తుఁ డయి స్వప్రయత్న మప్రయాసముగా సంపూర్ణసాఫల్యము నొందు నని స్వప్నసామ్రాజ్యము ననుభవించుచు నేమఱియుండఁగా నాకస్మికముగా పురద్వారముకడనే పట్టుకొనఁబడెను. ఈప్రయత్నముయొక్క ప్రధానోద్దేశము మేరీస్థానమున నెలిజబెత్తును రాణినిగాఁ జేసి తన్మూలమునఁ గఠినాత్ముఁ డైన స్పెయినురాజుయొక్కయు రోమీయమతాధికారముయొక్కయు క్రౌర్యమును దొలఁగించుట యయి యున్నది. అయినను మంత్రరహస్యము వెల్లడియైనందున నారాజద్రోహసంరంభ మారంభములోనే యడఁచివేయఁబడెను. రాజద్రోహి యైన సర్ థామస్ వైయట్టును నాతనికి సహాయు లైనవారిలో నఱువందుమను తలలు తీయఁబడి, మేరీనివివాహమాడి స్పెయినురాజు ఫిలిప్పాఁతునెలలకుఁ దరువాత పురప్రవేశోత్సవమున కయి వచ్చువఱకును వారిమొండెములు వ్రేలాడఁగట్టఁబడి యుండెను.

లేడీ జేన్ గ్రే తండ్రి యైన సఫోకుప్రభువు తనకన్నులయెదుట వియ్యంకుఁ డైన నార్తంబర్లండుప్రభుత్వునకు సంప్రాప్త మయినదుర్మరణమును జూచియైనను బుద్ధి తెచ్చుకోలేనివాఁ డయి తనయల్లుఁడును గూఁతురును మేరీయొక్క కటాక్షమునకుఁ బాత్రు లయి చెఱసాలలో

నున్నవారని నైన, దూరాలోచన లేనివాఁడయి తనప్రాణములు కాశింపక తనయొక్కయు బిడ్డలయొక్కయు క్షేమమును విచారింపక కలహకారులతోఁ జేరెను. ఈయనాలోచితకృత్యమువలన నాతని ప్రాణములకు చేటు మూడుట యొకవింత కాదు. అతఁడు కలహకారులతోఁ జేరుట జేన్‌గ్రే యొక్కయు నామెభర్తయొక్కయు ప్రాణములమీఁదికిఁ గూడ వచ్చెను. ఆబాలదంపతులకు విధింపఁబడి యింతకాలము నిలిపి యుంచఁబడిన క్రూరదండనము నెప్పుడు ప్రచారమునకుఁ దేవలయునా యని దయయెట్టిదో యెఱుఁగని మేరీయొక్క మనస్సాఁటకే వేగిరపడుచుండెను; ఇంతలో నామెతండ్రి రాజద్రోహి యగుటకూడ ఋటస్థించుట యాసాకుమీఁద దానిని తక్షణమే ప్రవృత్తికిఁ దెచ్చుట కవకాశమును గలిగించెను. అందుచేత మరణమునకు సంసిద్ధులయి యుండవలసినదని లేడీ జేన్‌గ్రేకును తద్భర్తకును వర్తమానము పంపఁబడెను. తన కట్టిగతి యెప్పటికో తప్పక కలిగితీఱునని యెఱిఁగిన దయినందున ప్రాణాశ మాని యామె యాపటికే చావునకు సంసిద్ధురాలయి యుండెను ఇట్టిసమయమునందు రోమీయమతోన్మాదిని యైన మేరీరాణి కారాబద్ధురాలయి యున్న లేడీ జేన్‌గ్రేకు విముక్తికలిగించి యనుగ్రహము చూపఁదలఁచుకొన్నదానివలెఁ గనఁబడుచు నామె తన రోమీయధర్మప్రతిషేధకమతమును త్యజించి రోమీయమతము నవలంబించినయెడలనే ప్రాణదానమును స్వాతంత్ర్యదానమును జేసెదనని చెప్పిపుచ్చి సమర్థులైనట్టియు విద్వాంసు లయినట్టియు రోమీయమతాచార్యుల నామెకడకుఁ బలుమాఱు పంపుచువచ్చెను. రాణియొక్కమతాచార్యుఁ డైన ఫెకెనహేమను నతఁడు రాణి యుత్తరువు ననుసరించి స్వమతసిద్ధాంతప్రాశస్త్యము నామెకు బోధించి యామె నేలాగున నయిన రోమీయమత

మునకుఁ ద్రిప్పవలె నని సర్వవిధములఁ బ్రయత్నము చేసెను గాని యాతనికృషి యంతయు విఫల మయ్యెను. ఆమె తనయొద్దకుఁ బంపఁబడుచు వచ్చిన రోమీయమతాచార్యుల యుక్తులకుఁ బ్రతియుక్తులఁ జెప్పి ప్రతిపక్షులవాదమును పూర్వపక్షము చేసి స్వమతసిద్ధాంతములను సమర్థతతో స్థాపించుచు వచ్చెను. ఇంత జరిగినను మేరీరాణి యూరకుండక యింకను నామె రోమను మతములోఁ గలియు నేమో యన్న భ్రమచేత నామెకు మఱి మూఁడు దినములు గడు విచ్చెను. అయినను జేన్ గ్రే యిటువంటి ప్రాణసంశయదశలో సహితము తన మనోనిశ్చయమును వదలనిదయి తాను సత్యమని నమ్మిన ధర్మము నందు దృఢవిశ్వాస ముంచి నిశ్చలచిత్తురా లయి యుండుటయే కాక యెన్నికష్టములు వచ్చినను స్వమతమును మార్చుకొన కుండునట్లు ప్రబోధించుచుఁ దన సహోదరికి గ్రీకుభాషలో నొక లేఖను వ్రాసి యాభాషలో నున్న క్రైస్తవవేదము నొకప్రతి నామెకుఁ బంపెను.

ఆమె ప్రతిక్షణమును దన చావును బ్రతీక్షించుచుండి యావలకే మరణమునకు సంసిద్ధురాలై యుండినందున నిప్పు డియ్యఁబడిన గడు వామె మనోవ్యధను బెంపుచెందించుటకే తోడుపడెను గాని మనశ్శాంతిని గలిగించుట కనుకూలపడలేదు. ఇట్టిస్థితిలో నామెకుఁ దండ్రికిఁ దటస్థించిన యాపదలు తెలియవచ్చుటయే కాక యాతఁడు ప్రాణాంతదండన ననుభవించుటకుఁ దా నున్న దుర్గములోనికే తీసికొని రాఁబడినట్లు తెలిసెను. ఆసంగతి తెలియఁగానే యామె నిజజనకున కొకలేఖ వ్రాసి పంపెను. దానిలోని కొంతభాగమును దెనిగించి యిందు క్రిందఁ బొందుపఱచుచున్నాము—

"ఓ ప్రియజనకా!

ఎవరివలన నాజీవితకాలము పెంపు చెందవలసినదో యటు వంటి నీవలననే నాచావును త్వరపఱుచుటకు భగవంతుఁడనుగ్రహించి నప్పటికిని, నాయిష్టానుసారముగా నాకుదీర్ఘాయువునిచ్చి ప్రపంచము నంతయు నాయధీనము చేసినయెడల సమర్పించెడు వందనములకంటె నాదుఃఖదినములను హ్రస్వపఱిచినందున కయి యధికనిర్వ్యాజవంద నములను దేవునకు సమర్పించునంత శాంతతతోనే నేను దానిని స్వీక రింపఁగలను. నీకష్టములను గూర్చి నీవు పొందునట్టియు నితరుల వలన నేను విన్నదానినిబట్టి ముఖ్యముగా నా దుఃఖకరమైన స్థితిని గూర్చి నీవు పొందునట్టియు శోకాతిశయమును నేను నిశ్చయముగా నెఱుఁగుదును. నాప్రియపితా! అయినప్పటికిని నాచేతులను నిర్దోషిత్వ జలమునందు కడుగుచు నా నిర్దుష్టరక్త మీశ్వర సమ్ముఖమున, నిరప రాధులకు దయ చూపవలె నని ఘోషింపఁగల దగుటచేత నన్ను ధన్యురాలినిగాఁ బరిగణించుకొనవచ్చును. అయినను నీవు చక్కఁగా నెఱిఁగి యున్నట్టుగా నిర్బంధపఱుపఁబడియు విరామము లేకుండఁ బీడింపఁబడియు నైనను (రాజ్య) భారమును పైని వేసికొనుట సమ్మ తించినట్లు కనఁబడి యుండుమూలమున రాణి యెడలను దచ్ఛాసన ముల వలనను మహాపరాధమును జేసినదాన నయినట్లు నే నొప్పుకో వలసి యున్నప్పటికిని, నా రాజ్ఞీవేషధారణముచేఁ బ్రాప్త మైన నిర్బంధ నిహితగౌరవ మొప్పుటను నా నిర్మలహృదయముతోఁ జేసినది కాక పోవుటచేత నీశ్వరవిషయ మయి యీ నాయపరాధ మల్పతర మయిన దని నేను నిశ్చయముగా నమ్ముచున్నాను.

* * * *

ఓ సత్పితా! ఈప్రకారముగా నే నిప్పు డున్నస్థితిని నీకు వెల్లడి పఱిచియున్నాను—నా మరణము సమీపించినది.

ఇదియొకవేళ దుఃఖకరముగాఁ గనఁబడ వచ్చినప్పటికిని, ఈ దుఃఖముసహా నుండి వెలువడు రక్షకుఁడైన క్రీస్తునాథునితోఁ గూడి నిత్యసుఖసంతోషప్రద మైన స్వర్గసింహాసనమునం దుండఁగోరుటకంటె నధికప్రియకరము కాఁగలిగినది మఱియొకటి లేదు; (పుత్రిక తండ్రికిట్లు వ్రాయుట న్యాయ మయిన పక్షమున) తనయందలి దృఢభక్తి యందు నీ కింతపఱకును బలము నిచ్చినట్టి ప్రభువు కడపట మనము పరలోకములో తండ్రితోను కుమారునితోను పరిశుద్ధాత్మతోను గలిసికొనుటకు నీ కాబలమునే ముందును ప్రసాదించుఁ గాక!

ఇట్లు
మరణపర్యంతము నీ విధేయపుత్రి యైన
జేన్ డడ్లీ"

లేడీ జేన్ గ్రే చెఱసాలలో నున్న కాలములోఁ దన యప్పటి యవస్థకు సరిపోవు నట్లుగా ననేక ప్రార్థనలను పద్యములను రచియించెను; మరణదండనమును బొందుటకు పూర్వపురాత్రి సహితమామె వానిని దిద్దునంతటి దృఢమనస్సు గలదయి యుండెను. ఇటువంటి ప్రాణసంశయావస్థలో సహితము రోమీయమతాచార్యులామె యొద్దకుఁ బోయి యామెను స్వీయమత ప్రవిష్టురాలినిగాఁ జేయుటకయి బోధ చేసిరఁట. ఆమె పర్వతము వలె నచంచలురాలయి కడ నిమిషము వఱకును రోమీయధర్మప్రతిషేధక మతమునందే సుస్థిరురాలయి తదేకదీక్షతో నుండెను. తెల్లవారి తన్ను శిరచ్ఛేదము చేయుదు రనఁగా నారాత్రి యామె తన సహోదరి యైన కేథరైనుకు గ్రీకు నూతన నిబంధన గ్రంథమును బంపుచు దానిలో వ్రాసిన లేఖకు భాషాంతర మిది —

"ప్రియసహోదరివైన మోకేథరినా! పయిభాగము బంగారముతో నలంకరింపఁ బడక పోయినను లోపల నమూల్యరత్నముల కంటెను నెక్కువ వెల కలదయిన పుస్తకమును నీకుఁ బంపుచున్నాను. ఓప్రియసోదరీ! ఇది యీశ్వరశాసనములను గలిగిన పుస్తకము. ఇది నిర్గతికుల మయినమనకు ప్రభువు విడిచిన తన సంహితయు మరణశాసనము నయి యున్నది; ఇది నిన్ను శాశ్వత సంతోషమార్గమునకు నడపును; దీనిని నీవు మంచిహృదయముతోఁ జదివినను నిష్కపటహృదయముతో ననుసరింపఁ బూనినను నీకిది నాశములేని శాశ్వతజీవనమును జెప్పును. ఇది నీకు బ్రతుకువిధమును చచ్చువిధమును నేర్పును. నీతండ్రియొక్క యధికమయిన భూములవలన నీవు పొందవలసినదాని కంటె నీకిది యెక్కువ లాభమును గలిగించును. దేవుఁ డాతనికి మంచిస్థితిని గలిగించినందున నీ వాతని భూములను బొంద వలసినట్టుగానే, దీనిలో విధింపఁబడిన ప్రకారముగా నడచుట కపేక్షించుచు దీనిని నీవు శ్రద్ధతోఁ జదివెదువత్షమున దురాశాపరులు నీయొద్దనుండి గైకొనలేనట్టియు దొంగలు తస్కరింపలేనట్టియు పురుగులు పాడుచేయ లేనట్టియు దివ్యధనమును నీవు దాయముగాఁ బొందుదువు. ఓ సాధుసోదరీ! జేవిడ్డుచలె నీవును ప్రభువైన దేవునియొక్క శాసనములను గ్రహింపఁ గోరుము. నీవు మరణమువలన నిత్య జీవనమును బొందునట్లుగా శాంతితోఁ జచ్చుటకు బ్రతుకుము. నీ లేఁబ్రాయము నీకు దీర్ఘాయువు నిచ్చునని నమ్మకొనకుము — దేవునియాజ్ఞ యైనపత్షమున ముసలివా రెంత శీఘ్రముగాఁ బోవుదురో యంత శీఘ్రముగానే పసివారును బోవుదురు - ఎట్లు చావవలయునో నేర్చుకొనుట కయి యెల్లప్పుడును పాటుపడుము. ప్రపంచమునకుఁ బ్రతిఘటింపుము; పాపమును బొఱఁగొలుము; ఇంద్రియసుఖములను దిరస్కరింపుము; ప్రభు

వునందే యానందమును బొందెదవు. నీపాపములకయి పశ్చాత్తాప పడుము; ఎప్పుడును నిరాశయను మాత్రము పొందకుము. భక్తియందు దృఢచిత్తురాలవు కమ్ము; గర్వపడకుము ఎవఁడు మృతి నొందియు జీవించియున్నాఁడో యటువంటి క్రీస్తుతో నుండుటకు సెయింటుపాలు వలెఁ గోరుము. అర్ధరాత్రమునందు దొంగవలె వచ్చి మృత్యువు నిన్నపహరించునేమో యన్నట్టు సర్వభటునివలె రాత్రిసహితముగా నీవు జాగరూకురాలవయి యుండుము. * * * * నావలెనే నీవు క్రీస్తుసం దానందము పొందుము. నీప్రభువైన క్రీస్తునియొక్క మార్గము ననుసరించి నీసిలువను వహింపుము. నీపాపముల నాయన పేఁపుమీఁద వేసి, నీవాయనమార్గము నెల్లప్పుడు ననుసరింపుము. ఓసత్సహోదరీ! ఈదుష్టభావమునుండి విముక్తి నొంది నిర్దుష్టతను బొందఁబోవుచున్నాను గనుక నామరణమునుగూర్చి నావలెనే నీవును సంతోషింపుము. ఈయస్థిరజీవనమును బోఁగొట్టుకొనుటచే సుస్థిరజీవనమును బొందుదునని నాకు నిశ్చయముగాఁ దెలియును. భగవంతుఁడు నా కది ప్రసాదించి, ఈశ్వరభీతితో బ్రదికి నిజమైన క్రైస్తవ భక్తితోఁ జచ్చునట్టుగా నీకనుగ్రహింపవలయు నని ప్రార్థించుచున్నాను. జీవితాశచేతఁ గాని మృత్యుభీతిచేతఁగాని నీమార్గమునుండి యెప్పుడును తొలఁగకుండుట కీశ్వరనామమున నేను నీకు బోధించుచున్నాను. నీజీవితమును దీర్ఘముగాఁ జేసికొనుటకయి నీవాతని సత్యమును నిరాకరించినపక్షమున, నిన్నాయన నిరాకరించి నీదినములు హ్రస్వముచేయును; నీవాయనని యాశ్రయించి యున్నపక్షమునఁ నీకు సౌఖ్యమును దనకు మహిమయుఁ గలుగునట్లుగా నతఁడు నీయాయువు దీర్ఘము చేయును. ఆపదవికి భగవంతుఁడు నన్నిప్పుడు కొనిపోయి, ఆయన యనుగ్రహము వచ్చినప్పుడు ముందు నిన్నుఁ గొనిపోవును. ఓ సత్సహోదరీ! నీకు శుభ

మగును గాక! నీవీశ్వరుని యందే విశ్వాసముంచుము; అతఁడొక్కఁడే నీకు సహాయుఁడు కావలెను."

వారివధదినమునందు గిల్ఫోర్డుప్రభువు తనభార్యయైన జేన్ గ్రేను సందర్శింపఁ గోరఁగా మేరీరాణి వారి సమావేశమున కియ్యకొనెను. కాని, లేడీ జేన్ గ్రేయే యందు కంగీకరింపక, తమసమావేశానంతర వియోగ దుఃఖ ముభయుల ధైర్యమును జెడఁగొట్టి యవసానసమయమం దుండవలసిన మనస్స్థైర్యమునకు భంగము కలిగించు ననియు, వారి యీవిరహము కతిపయనిమిషపరిమిత మయినదే యగుటనందునఁ గొంచె మోర్చినయెడల నెక్కడ నన్యోన్యానురాగబంధము తెంపులేక నిరంతరముగా నుండునో, యెక్కడ స్మృతియు నాశాభంగమును దురదృష్టమును జేరి శాశ్వతానందమునకు భంగ కలిగింపలేవో యక్కడఁ దామన్యోన్య సమావేశము నొందవచ్చుననియు, సందేశము పంపెను.

౧౫౫౪ వ సంవత్సరము ఫిబ్రవరినెల పండ్రెండవతేది సోమవారమునాఁడు వధూవరులలో గిల్ఫోర్డు ప్రభువు శిరచ్ఛేదమున కయి ముందుగా వధ్యస్థానమునకుఁ గొనిపోఁబడెను. అతఁడు పోవునప్పుడామె గవాక్షములోనుండి చూచి తనస్మరణచిహ్నము నొకదాని నాతనికొసఁగి యీశ్వరధ్యానము చేయుచు తనగడియ వచ్చువఱకును మనశ్శాంతితో వేచియుండెను.

గిల్ఫోర్డుప్రభువు తనప్రాణావసాన సమయమునందు ధైర్యమునుగాని చిత్తోన్నతినిగాని యణుమాత్రమును గోలుపోక, తన నిమిత్తము కాచుకొనియున్న మిత్రులందఱి యొద్దను సెలవుగైకొని, దృఢచిత్తముతో వధ్యస్థానము నధిరోహించి యచ్చటఁ గొన్ని నిమిషము లీశ్వరధ్యానమునందుఁ గడపి, మూఁకలుగా మూఁగియున్న జను

లను తనకొఱకుఁ బ్రార్థింపుఁ డని పలికి, వధ్యదారువుమీఁద శిర స్సును మోపెను. మఱియొక్క నిమిషములో నాతని శిరస్సు మొండెమునుండి ఖండింపఁ బడెను.

గిల్ఫోర్డు ప్రభువు శిరశ్ఛేదము చేయఁబడిన తోడనే పురాధికారులు వచ్చి యామెను వధ్యస్థానమునకుఁ గొనిపోవలసిన గడియ వచ్చిన దని లేడీ జేన్ గ్రేతో విన్నవించిరి. ఆయాజ్ఞ తెలుపఁబడి నప్పు డామె కంపవైవర్ణ్యాదిభయ చేష్టలను వేనిని బొందక నిశ్చల ధైర్యముతో వినెను. ఆమె వధ్యస్థానమునకు గొనిపోఁబడు చుండినప్పుడు దారిలో సమాధినిమిత్తమయి బండిలో వేసి తీసికొనిపోఁ బడుచున్న శిరోవిహీన మైన భర్తృకళేబర మామెకుఁ గనఁబడెను. భర్తృశవము నేత్రగోచరము కాఁగానే యామెకన్నులనుండి బొటబొట నీరు గార నారంభించెనుగాని, ప్రాణోత్క్రమణసమయమునందు సహిత మతఁడు ధైర్యమును విడువలే దన్న వార్తాశ్రవణమువలన దుఃఖము నాపుకొని మఱింత మనోదార్ఢ్యము నొందినదయి ధైర్యమునుబూని "ఓగిల్ఫోర్డా! నీవు చవిగొన్నట్టియు నేను చవిగొనఁబోవుచున్నట్టియు మృతిరూప ఫలము నన్ను కంపము నొందించునంతటి చేఁదైనది కాదు. ఈదినమున నీవును నేనును గూడి స్వర్గములో ననుభవింపఁ బోవు విందుతోఁ బోల్పఁ బడినప్పు డిది పేర్కొనఁ దగినదే కాదు." అని పలికి తన పలకపుస్తకములో నేదో వ్రాసెను. వధ్యస్థానమును సమీపించినప్పుడు దుర్గరక్షకాధికారి యైన సర్ జాన్ గేజి యనునతఁ డామెను జూచి తత్స్మరణార్థముగాఁ దాను స్థిరముగా నుంచుకొనుట కేదైన చిన్న పారితోషికము ననుగ్రహింపవలసిన దని యామెను వేఁడుకొనెను. భర్తృశవమును జూచినప్పు డింతకుముందు దాను స్వహస్తముతో గ్రీకు భాషతో "మానుషిక న్యాయ మాతని దేహమునకుఁ బ్రతికూలముగా

నున్నను, ఈశ్వరకారుణ్య మాతనియాత్మ కనుకూలముగా నుండు" ననియు, లాటిన్ భాషతో "ఆమెయపరాధము దండనమున కర్హమైన దయినయెడల, అధమవత్సరామె బాల్యమును లోకానుభవరాహిత్యమును క్షమార్హము లయినవి" యనియు, ఇంగ్లీషుభాషతో "ఆమె దేవుని సమ్ముఖ మౌనను గాన భావికాలప్రజ లామెయెడల దయ చూపుదురుగాక" అనియు, అర్థ మిచ్చెడు మూడువాక్యములను వ్రాసిన పలకపుస్తకము నామె యాతని కిచ్చెను. ఆమె యవ్వ లోక సేవకురాలికి చేజోళ్ళ నిచ్చెను. ఇయ్యవలసిన వాస్తజనుల కిచ్చి యామె నిర్భయముగా వధ్యవేదికపై కెక్కి యక్కడఁ గూడియున్న ప్రభువులకు మ్రొక్కి ముందు మూఁగియున్న పౌరులవంకఁ దిరిగి యిట్లనియెను.-

"నాప్రభువులారా! నాచావు చూడవచ్చిన సత్క్రైస్తవజనులారా! నేనిచ్చోడ శిక్షాస్మృతికి లోఁబడి యున్నదానను. తప్పెవ్వదును జేయని న్యాయాధిపతివంటిదైన యాశిక్షాస్మృతిచేత నేను వధింపఁబడునట్లు విధింపఁబడియున్నాను. ఇది నేను జేయునట్లు నిర్బంధపఱుపఁబడినట్టియు నే నెప్పుడును గ్రహింపనిదానిని నేను జేసి యపరాధిని నయినట్టు శిక్షాస్మృతి నిర్ణయించినట్టియు పనిని నే నొప్పుకొన్నందుకుమాత్రమే కాని రాణిగారికి ప్రియమైన యేపనికొఱకును గాదు; వలయున, దానినుండి నాచేతులను శుద్ధి చేసికొని, అన్యాయమునుండి నిర్దోషిత్వ మెట్లో యట్లే యటువంటిదోషమునుండి పరిశుద్ధమయిన నాయాత్మను దేవునకు సమర్పించుచున్నాను. అది యట్లున్నను నాయింద్రియసుఖవాంఛలను నిర్భాగ్యప్రపంచసుఖములను సత్యాధికముగా నవలంబించినందువలనను, భగవంతుఁడు నాకుఁ బ్రసాదించిన జ్ఞానానుసారముగా నేను బ్రవర్తింపనందువలనను, నేను దేవునియెడల నపరాధినయి యున్నదానను. అందుచేత దేవుఁడు నాకీమరణమును

విధించి యున్నాఁడు; నాకృత్యములనుబట్టి నేను దీని కత్యంతపాత్రురాలనయి యున్నాను. ఇక్కడ నీలోకములో నాపాపములకై యనుతాప పడుటకును నాపూర్వదురభిమానములచేత విశేషముగా నే నప్రియము నొనర్చిన నారక్షకునియొక్క ప్రసన్నతను మరలఁ బొందుటకును నా కవకాశ మిచ్చినందున నే నాతనికి హృదయపూర్వకముగా వందనముల నర్పించుచున్నాను. కాఁబట్టి నాప్రభువులారా! సత్క్రైస్తవులైన సర్వమహాజనులారా! తనవిషయమున నేను జేసిన యపచారము లెంత లెక్కలేనివిగాను ఘోరమైనవిగాను నున్నను దేవుఁడు తన యపారకరుణతోను సద్భావముతోను వానిని క్షమించునట్లుగా నేను ప్రాణములతో నుండఁగానే నాతోడను నానిమిత్తమును భగవంతునిఁ బ్రార్థించుటకు మిమ్మందఱను నేను మహోత్కంఠతో వేఁడవలసి యున్నది. నేను క్రైస్తవభక్తురాలనయి చచ్చుచున్నా నని సాక్షులుగా నిలుచుటకు మిమ్మందఱను వేఁడుకొను చున్నాను. నా సమస్తకర్మలను పుణ్యకార్యములను దూరముగా విసర్జించి, రక్షకుఁడైన జీసస్‌క్రైస్తుయొక్క రక్తమువలనను ప్రేమమువలనను యోగ్యతవలనను మాత్రమే రక్షింపఁబడుదునుగాని యితరసాధనములవలనఁ గాదు. నాసుకర్మలను నాయోగ్యతలనుమాత్రమే నమ్మికొన్న యెడల నవి నాకర్తవ్యముల కెంతదూరములై నన్నెంత యధోగతిపాలు చేయఁ దగినవిగా నున్నవో! ఇప్పుడు నాతోను నాకొఱకును మీరందఱును ప్రార్థన చేయవలయు నని మిమ్ము ప్రార్థించుచున్నాను.”

పయి వాక్యము లామె స్వాభావికహృదయశాంతతను సౌజన్యమును వినమ్రతను దేటపఱుచు చున్నవి. ఆమె తనవిషయమునఁ జూపఁబడిన క్రౌర్యవిషయమునఁ బరుల నొక్క పరుషోక్తి నైనను బలుకలేదు, దోషమునంతను దనమీఁదనే వేసికొని, దానికి కారణము

రాజ్యకాంక్షగాక జననీజనకులయాజ్ఞోల్లంఘనము చేయలేకపోవుటయే యని విన్నవించెను. ఈమాటలు పలికినతరువాత నామె తన వెనుక నున్న పరిచారికాద్వయమును బిలిచి తనమెడమీఁదివస్త్రములను దొలఁగింప నియమించెను. కన్నులనీరు కారఁగా, చేతులు వడఁకఁగాఁ మేను చెమర్పఁగా వారు వస్త్రములనుదొలఁగింపఁ జేతు లాడక నిశ్చేష్టలయి నిలుచఁబడినందున, ఆమె యాపని తానే చేసెను. పరిచారికలు



వెనుక నిలువఁబడి మొగమునకు గుడ్డ లడ్డముపెట్టుకొని కన్నీటికాలువలు తుడుచుకొనుచు నేడ్చుచుండిరి. అపుడు ఘాతుకపురుషుఁ డామె పాదములమీఁదబడి క్షమింప వేడుకోఁగా, ఆమె తత్క్షణమే వానిని క్షమించితినని చెప్పి "ఓయీ! దయచేసి నన్ను శీఘ్రముగాఁ దుద

ముట్టింపుము" అని వేఁడి, "ఓ యీశ్వరా! నాయాత్మను నీచేతులలోఁ బెట్టుచున్నాను." అని విస్పష్టమైనయుచ్చైస్స్వరముతోఁ బలికి, శాంతమైనట్టియు నిర్వికార మైనట్టియు ముఖభావముతోఁ దన శిరస్సును వధ్యదారువుపైఁ బెట్టెను. ఉత్తరక్షణముననే వధకారిచేతిఖడ్గ మామె యుత్తమాంగము నుత్తరించెను. అప్పుడు చూడ వచ్చినగుంపులో నుండి హాహానినాదములును రోదనధ్వనులును బైలువెడలెను.

పదునేడు సంవత్సరములప్రాయమప్పు డుదారచిత్తురా లయినట్టియు స్త్రీజనాలంకారము లైన సమస్తసద్గుణరత్నముల చేతను భూషితురా లయినట్టియు నిష్కళంక సౌశీల్యధైర్యాభిమానమాననీయురా లయినట్టియు లేడీజేన్‌గ్రేయొక్క యైహికజీవిత మిట్లు పరిసమాప్తి నొందెను. డాక్టరు ఫుల్లరను విద్వాంసుఁ డీమెను గూర్చి "శైశవమునందలి నిష్కాపట్యమును, యౌవనమందలి సౌందర్యమును, కౌమారమునందలి దృఢత్వమును, వార్ధకమునందలి ఘనతను, అన్నిటిని పదునేడేండ్లప్రాయమునందే యీమె కలిగిన దయ్యెను. రాజకుమార్తెయొక్క జననమును విద్వాంసునియొక్క పాండిత్యమును, పుణ్యాత్మునియొక్క జీవనమును, తల్లిదండ్రులదోషమునుబట్టి పాపకర్మునియొక్కచావును నీమెకుఁ దటస్థించెను." అనివ్రాసియున్నాఁడు.

లేడీజేన్‌గ్రే యవసానదశయందుఁ జెఱసాలలో నుండినప్పుడు వ్రాసిన యనేక ప్రార్థనలలోఁ గడపట దానిని మాత్రము తెలిఁగించి యీమె శోచనీయ మయినచరిత్రమును ముగించుచున్నాము —

"ఓప్రభువా! ఈశ్వరుఁడా! నాజీవజనకా! అన్నికష్టములయందును దుఃఖము లందునుమాత్రము నీయొద్దకుఁ బరుగెత్తుచు గతిమాలి దేకాకిని నయి యున్నయబల నగునాయెడ్ల దయాలకింపుము. ఓప్రభువా! నీయందువిశ్వాస ముంచినవారిని రక్షించి ముక్తినొసఁ

గెడు వాఁడవు నీ వొక్కఁడవే కాఁబట్టి పాపముచేఁ గళంకితురాల
నయి, క్లేశములచేఁ గప్పఁబడినదాన నయి, కష్టములచే శాంతి లేని
దాన నయి, చింతలచేఁ జుట్టుకొనఁబడినదాన నయి, ఆవదలచే నాక్ర
మింపఁబడినదాన నయి, దీర్ఘకాల కారాబద్ధతచే నత్యంత బాధితమై
పనికిమాలిన మట్టిముద్ద యయినయినాపాపపుబొందిని గలదాన
నయి, ఓదయామయుఁడ వయిన రక్షకుఁడా! ఏవి లేక మోక్షకాంక్ష
కించుక యయిన నవకాశ ముండదో యటువంటి నీదయను సాహా
య్యమును వేఁడుచు, రక్షణవిషయమున సంపూర్ణనిరాశ కలుగకుండ
నేను నిన్నాశ్రయించుచున్నాను. మాజీవితము శోధనమీఁదనే నిలిచి
యుండును గాన, మేము నీవార మగుదుమో కామో పరీక్షింపఁ
బడుటకును నిన్నును మమ్మును బాగుగాఁ దెలిసికొనఁ గలుగుటకును
కొన్నిసమయములందుఁ గొన్ని విపత్తులను మాకుఁ గలిగించుట
యుక్తమే యైనను, మాశక్తికి మించిన దుర్భరకష్టములతో మమ్ము
శోధింప నని పలికినవాఁడ వగుటచేత నగతికురా లయిన యీదీను
రాలిని గరుణింపుము. ఓ యీశ్వరుఁడా! అత్యున్నస్థితి నొంది నిన్ను
మఱవకుండులాగునను, అతిహీనదశ నొంది నిరాశచే రక్షకుఁడవును
ప్రభుఁడవును నయిన నన్ను నిందింపకుండు లాగునను, నన్నతిమాత్ర
సంపదలచే నుబ్బింపకుండుటకును, అతిమాత్రవిపత్తులచే క్రుంగింప
కుండుటకును బ్రార్థించెదను. ఓకరుణానిధీ! నీ కొక్కఁడవగాఁ దెలిసిన
నాదుస్థితిని విచారించి, నారక్షణమున కయి నీవు బలిష్ఠమైన పెట్టని
కోటవు కమ్ము. నేను వినమ్రతతో నర్థించుచున్నాను; నన్ను నా
శక్తికి మించునట్లుగా శోధింపఁబడనీకుము. నన్నీమహాకష్టములనుండి
విమోచనము చేయువాఁడ వయినను గమ్ము; లేదా, యీ దుర్భర
బాధను క్రూరదండనమును శాంతతతో సహించు క్షమ నయినను నా

కనుగ్రహింపుము. నన్నూఱు సంవత్సరముల కాలము బాధించి దాస్యములోనుంచిన ఫారహోచేతులలోనుండి యిశ్రాయేల్ ప్రజలను రక్షించినది నీదక్షిణహస్తమే. ఎవరికొఱకు, నీకుమారుఁడైన క్రీస్తువు తన యమూల్య రక్తమును సిలువమీఁదఁ జిందఁజేసెనో యటువంటి శోచనీయు లయిన యభాగ్యులలో నొకతెనైన నన్ను నేనిప్పుడున్న దుఃఖకరమైన చెఱనుండియు బంధమునుండియు విముక్తి నొందించుట నీపితృవాత్సల్యమున కర్హమగును గాక! ఎంతకాలము నీవు కనఁబడ కుండెదవు? ఎల్లకాలమునా? ఓప్రభువా! దయచూపుటను నీవు విస్మరించి యున్నావా? అనంతుష్టుఁడవై ప్రేమపూర్ణమైన నీకారుణ్యా పేటికను మూసి యున్నావా? నిన్నిఁకఁ బ్రార్థింపవలసినపని లేదా? నీదయ యెప్పటికిని రాకుండఁ బూర్ణముగా నంతరించినదా? నీ యభయప్రదానము సంపూర్ణముగా సమాప్తి నొందినదా? నీవింత చిరవిలంబ మేల చేయుచున్నావు? ఓ ప్రభువా! ఇఁక నీకు దయ రాదని నిరాశచేసికొనా? అట్టిది నాకు దూరమగునుగాక! నేనును జీసస్‌క్రీస్తును సృజించిన సృష్టిలోనిదాననే, కాఁబట్టి నీ కెప్పుడు దయ వచ్చునో యప్పుడు రక్షింతు వని నిశ్చయముగాఁ దెలిసికొని, నీకు నాయెడఁ గల దయను సందేహించుటగాని విశ్వసింపకుండుట కాని మాని, నీయవకాశమునిమిత్తము వేచియుండుటకును, నీపనులను శాంతతతో సహించుటకును నాకు శాంతి నొసఁగుము. నా కేది మంచిదో యది నాకంటె నీకే యెక్కువ తెలియును గనుక, సర్వవిషయములలోను నీవు నా కెట్లు చేయఁ దలఁచుకొన్నావో యట్లు చేయుము; నీయిష్టము వచ్చిన కష్టములను కలిగింపుము. నిన్ను వేఁడుకొను చున్నాను. ఈమధ్యకాలములో నానడుమును సత్యమను నడి కట్టుతో బిగించి సాధువృత్తి యనెడి యురస్త్రాణమును ధరించి

శాంతివార్త యనెడు దుర్భేద్యచర్మనిర్మితపాదరక్షలపై నిలిచి, అన్నిటికంటెను ముఖ్యముగా దుర్మార్గులదౌష్ట్యాగ్ని బాణముల నన్నిటి నార్పివేయుటకు శక్తికలుగునట్లుగా భక్తిఖేటమునువహించి ముక్తి కిరీటమును నీపవిత్రవాక్యమైనయాధ్యాత్మికఖడ్గమును దాల్చి, నేను పూర్ణముగా నీయిచ్ఛ కాత్మార్పణము చేసి నీయిష్టమునకు బద్ధురాల నయి, ఇట్టికష్టములు నాకు శుభకరము లనియు నీవు చేసిన దంతయు నామేలుకొఱకే కాని మఱియొకందునకుఁ గాఁజాలదనియుఁ గనుఁ గొనుచు నీవు నాకుఁ బంప ననుగ్రహించిన కష్టములలో సంతుష్టిని బొందుచుండులాగున సర్వదా వినయవిధేయతలతోఁ బ్రార్థించుచు, నేను దృఢముగా నిలువఁగలుగునట్లుగా నీదివ్యకవచముతో నన్నమోఘాయుధసాధను జేయుము. ఓకరుణాళుఁడవైనపరమపితా! నీ వెవరిని నాపాపములకు బలిగా నుండవలెనని సంకల్పించితివో యాయనకొఱకు నామొఱాలింపుము. ఆయనకును నీకును పరిశుద్ధాత్మకును సమస్తయశోమహిమలును జెల్లునుగాక! తథాస్తు!"

---

## Miss MARY CARPENTER.

## మేరీ కార్పెంటరు.



మేరీ కార్పెంట రనునామె యేకేశ్వరబోధక (త్రిత్వనిషేధక) క్రైస్తవమతాచార్యుఁడైన డాక్టరు లాఁటు కార్పెంటరుగారి జ్యేష్ఠ పుత్రిక; ఆమెతల్లిపేరు పెన్. ఈ దంపతుల కీమె 1807 వ సంవత్సరము ఏప్రియల్ నెల మూడవ తేదీని ఎగ్జిటర్ పట్టణములో జనన మొందెను. ఆమెతండ్రి తాను మతాచార్యుఁడుగా నుండి, పెద్దవాండ్రకు ధర్మోపదేశము చేయుచుండుటయేగాక యుపాధ్యాయుఁడుగా నుండి పిన్న

వాంఛకకు జ్ఞానోపదేశము చేయుచుండెను. అందుచేత నామె తన జనకుని శిక్షలోనే విద్యాభ్యాసము చేసెను. ఆమె సాధారణముగా నెల్లవారును నేర్చుకొనెడి యింగ్లీషుభాషను గఱచుటయే కాక గ్రీకు భాషను లాటినుభాషను గణితశాస్త్రమును నేర్చుకొని యందుఁ బ్రవీణురా లయ్యెను. తండ్రి యామెకు నీతివిద్యను గఱపుటయం దత్యంత శ్రద్ధ వహించుచుండెను. ఆమె ప్రకృతిశాస్త్రములను జంతుశాస్త్రమునుగూడఁ జదివి వానియందు మిక్కిలి యభిరుచి గల దయ్యెను. ఈమె చెల్లెండ్రును తమ్ములునుగూడ నించుమించుగా నీమెతో సమానముగానే విద్యాలాభమును బొందిరి. ఈమె తన విద్యనుగూర్చి తరువాత నొకప్పు డిట్లు వ్రాసెను — "విద్య నన్నెప్పుడును గృహకృత్య నిర్వాహణమునకు సమర్థురాలినిగాఁ జేయలేదు; అట్లు చేయకపోవుటయే కాక యది సాధ్వీధర్మమును నిర్వహించుటకు నన్ను మఱింత పూర్ణముగా యోగ్యురాలిని చేసినది." ఈమె చిఱుతప్రాయమునందే తల్లికి శ్రమ కలుగకుండఁ దన యిద్దఱు చెల్లెండ్రను ముగ్గురు తమ్ములను సర్వవిధములఁ దానే పెంచుచు వచ్చెను.

ఆమెకు పదేండ్ల ప్రాయమవ్వుచుండఁగా 1817 వ సంవత్సరమునం దామె తండ్రి యెగ్జిటరును విడిచి బ్రిస్టల్ పురమును జేరి, తొంటి వలెనే యచ్చటఁగూడ ధర్మోపదేశవిద్యోపదేశముల రెంటిని స్వవృత్తినిగా నేర్పఱుచుకొనెను. ఈమెకుఁ దండ్రి తనశిష్యు లయినబాలురతోఁ గలిపియే విద్యచెప్పుచు వచ్చెను. తరువాత మహాధీమంతుఁడయి ప్రసిద్ధికెక్కిన రివరెండు డాక్టరు జేమ్సు మార్టినోగారు 1819 వ సంవత్సరమునందు డాక్టరు కార్పెంటరుగారికి శిష్యుఁ డయి మేరీ కార్పెంటరుకన్యకు సహపాఠి యయ్యెను. ఆమె యెదిగినకొలఁదిని తండ్రి యామెకు తన శిష్యులలోని తరుణవయస్కులకు విద్య చెప్పెడు

పని నప్పగించుచు వచ్చెను. ఆపనియం దామె కభిరుచి కలిగి యుండుటచేత నామె యాపని నత్యంతోత్సాహముతోను, పూనికతోను, నేర్పుతోను, జేయుచువచ్చెను. ఆమె తన తండ్రిగారియొక్క యుపాసనాలయముతో సంబంధించిన భానువార (ధర్మోపదేశక) పాఠశాలయం దత్యంతప్రీతి కలదయి యచ్చట శ్రద్ధతోఁ బనిచేయఁ జొచ్చెను; ఆమె యచటకు భానువారమునాఁడు పోయి విద్యార్థులకు ధర్మపాఠములను జెప్పుటతో మాత్రము తృప్తినొందక, వారితోఁ గూడ వారియిండ్లకుఁ బోయి వారి తల్లిదండ్రులతో మైత్రి చేసి, ఆత్మాభివృద్ధిని జేసికొనెడు కృషిలో వారికి సహాయురా లగుచువచ్చెను.

ఇరువదియొక్క సంవత్సరములు నిండి వ్యవహారయోగ్యత వచ్చిన తరువాత 1828 వ సంవత్సరములో తండ్రి యామె కిట్లువ్రాసెను — "నీవు త్రొక్కవలసినట్టుగా శాసింపఁబడఁబోతెుడు మార్గమేదియో మే మెఱుఁగము; అయినను భూలోకచింత యుంతియు, నీవు క్రీస్తునకవ్యాజసేవకురాల వగుదువు గాక యనియు, నీయాత్మరక్షణమునకై పనిచేయుచు క్రైస్తవపరిపూర్ణతవంక ముందుకునడుచుచు నీ కేర్పఱుపఁబడిన పని నితరుల యుపయోగములకు నిర్వర్తించుటకు శక్తురాల వగుదువు గాక యనియు, విశ్వాసముతోను శాంతతతోను పూనికతోను ఈశ్వరేచ్ఛను చెల్లింతువుగాక యనియు, కోరెడుకోరికలో నడఁగి యున్నట్లు మేము భావించుచున్నాము."

అనారోగ్యముచేత చిరకాలమునుండి దుర్బలుఁడయి యున్న డాక్టరు కార్పెంటరు 1829 వ సంవత్సరమునందు తన పాఠశాలపనిని మాని వేసెను; కాని యాతనిభార్యయు ముగ్గురుకూఁతులును చిన్న పడుచుల కొకపాఠశాలను బెట్టిరి. నూతనముగా స్థాపింపఁబడిన యీపాఠశాలయందు స్త్రీజనోచిత ప్రావీణ్యము లెల్ల నేర్పఁబడుటయే

కాక లాటిన్ గ్రీకు భాషలుకూడ నేర్పఁబడుచుండెను; అక్కడ కుట్టు పనియు కుటుంబములలో నుపయోగపడెడి యనేకేతరవిషయములును గఱపఁబడుచుండెను. అక్కడ విద్యాభ్యాసము చేసిన కాంతలలోఁ గొందఱు తరువాత బీదలకును మూఢులకును విద్యాదానము చేయుట తమ పనిగా నేర్పఱుచుకొనిరి: మఱికొంద ఱుత్తమగృహిణు లయి తమకుటుంబధర్మములను యుక్తముగా నిర్వహించుకొనుచు జనోప యుక్తము అయినసత్కార్యములందుఁ బ్రవేశించి పనిచేయఁ జొచ్చిరి.

1832 వ సంవత్సరమునందు బ్రిస్టల్ నగరమున వాంతిభేది వ్యాపించినప్పటినుండియు నామె యుపకారజీవనము నిజముగా నారంభమయ్యెనని చెప్పవచ్చును ఆవిషభేది ప్రబలి ప్రజానాశము చేయఁదొడఁగినప్పు డామె తనజీవితమును తనతోడివారియొక్క సేవ యందుఁ గడపుటకు నిశ్చయము చేసికొని, ఆసంవత్సరము మార్చినెల 31 వ తేదిని తనదినచర్యపుస్తకములో తనమనోనిశ్చయమును లిఖించి, కడపట "నాజీవితకాలములో నడపవలసిన కృత్యములయొక్క యుద్దేశ మేమయి యుండవలయునో నే నెప్పుడైన మఱచుట తటస్థించెడు నెడల, నాకు వ్యతిరిక్తముగా నివి నాపై సాక్ష్యమిచ్చుటకు నే నీసంగతుల నిచ్చట లిఖించుచున్నాను." అని వ్రాసెను.

ఇది యిట్లుండఁగా 1833 వ సంవత్సరమునందు రాజారామ మోహనరాయ లింగ్లండునకుఁ బోయి, డాక్టరు కార్పెంటరుగారి తోడి సంభాషణమువలన లాభము పొందవలెనన్న ముఖ్యోద్దేశ ముతో బ్రిష్టల్ నగరమున కరిగి, వారియింట నుండుట తటస్థించెను. ఆయుభయులకును జరుగుచు వచ్చిన చిత్తాకర్షక సంభాషణసమయము లలో కార్పెంటరుకన్య తఱచుగా సన్నిహితురా లగుచు వచ్చెను.

ఆతనితోడ జరుగుచు వచ్చిన సంభాషణము లామె మనస్సులో శిలా క్షరములవలె దృఢముగా నాటుకొనెను. అయినను బహుదినము లిట్లు లాభకరముగాఁ గడపకముందే యతఁడు వ్యాధిగ్రస్తుఁడయి లోకాం తరగతుఁ డగుట సంభవించెను. ఆయన వ్యాధిసమయమునం దీకుటుం బము వా రాయనకు స్వకుటుంబములోనివారికిఁ జేసెడుదానికంటెను నెక్కువగా నుపచారములు చేసిరి. ఆయన సమాధిసమయమునందు డాక్టరు కార్పెంటరుగారిచేతఁ జదువఁబడిన యీ క్రింది యర్థము వచ్చెడు పద్యము నామె రచియించెను—

క. నీయాత్మ శాశ్వతం బగు
నీయభిధ స్మరింతు రెపుడు నీదేశీయుల్
నీయీసమాధి వెలువడి
నీయుక్తులు వారియెడల నెలకొని లేవున్.

ఈమహనీయునితోడి సహవాస మొక్కటియే కాక యీసంవత్సరమే యమెరికానుండి యీమె తండ్రిని జూడవచ్చిన డాక్టర్ టక్కరుమ్యా నను పేరు గల సత్పురుషుని సందర్శనమువలన సహిత మీమెకు విశేష చిత్తోన్నతి కలిగెను. తనజనకునకును రామమోహనరాయలకును జర గుచు వచ్చిన సంభాషణములలో నామె స్త్రీల హీనదశ సంస్కార ప్రతిబంధములు మొదలగు విషయములలో హిందూదేశముయొక్క దుస్థితినిగూర్చి వినుచు వచ్చెను. అతఁడు చెప్పినమాటలు దృఢముగా నాటుకొని యీమె మనస్సు హిందూదేశమువంకఁ బలుమాఱు పాఱు చుండినను, పెద్దపట్టణములలో వసించు దిక్కుమాలిన బీదబిడ్డల దుర వస్థనుగూర్చి టక్కరుమ్యాను బోధించిన సన్నిహితధర్మము లడ్డుపడి వారించుచు రాఁగా ముందుగా స్వదేశమునందలి కర్తవ్యముల పయిఁ దిరిగెను. హృదయభేదకము లయిన రామమోహనుల దయ

నీయవాక్యములు తలఁపునకు రాఁగానప్పు డామె యప్పుడప్పుడు పక్షివలె రెక్కలు కట్టుకొని యెగిరి హిందూదేశముమీఁద వాలవలె నని మనస్సులోఁ దలఁచుచు వచ్చినను, తల్లిదండ్రులసేవావిషయమున నాచరింపవలసిన కర్తవ్యములును పాఠశాలాకార్యములును మరల నామెను వెనుకకు లాగుచు వచ్చెను. పూర్వోక్త సత్పురుషద్వయము యొక్క యుపదేశములకు ఫలముగా బ్రిస్టలులో నొక సతీసమాజ మేర్పఱుపఁబడెను. ఈసమాజములోని మానినీమణులు బ్రిస్టలునగరములోని సుఖహీన మయిన ప్రదేశమును గొన్ని భాగములుగ విభాగించుకొని తమలో నొక్కొక్క రొక్కొక్క భాగమునకుఁ బోయి యచ్చటి యుగతికులగు బీదలకు విద్య చెప్పి, యితరవిధముల వారి స్థితిని బాగుచేయుట కయి పాటుపడుట కేర్పఱచుకొనిరి. మేరీ కార్పెంటరు తన కావలఁ గున్న భాసువార పాఠశాలయొక్కయు దిన పాఠశాలయొక్కయు పనిని జేయుచు, బహు సంవత్సరము లీపనిని గూడ నవిచ్ఛిన్నముగా నిర్వహించెను.

1839 వ సంవత్సరమునందు డాక్టరు కార్పెంటరు గారి యారోగ్యము మరల చెడిపోయెను. అతఁడు స్వస్థతను బొందుట కయి స్థలమును మార్చి యూరపుఖండములోని దేశములలో సంచారము చేయుట యావశ్యక మని వైద్యులు చెప్పిరి. అతఁ డాప్రకారముగాఁ బ్రయాణము చేయుచు, ఇటలీసముద్రతీరము పొడుగునను నావికాయాత్ర చేయునప్పుడు 1840 వ సంవత్సరమున నోడలోనుండి సముద్రములోఁ బడి మునిఁగిపోయెను.

ఇంతవఱకును కార్పెంటరుకన్య కొంత గౌరవము గల బీదలలోఁ బనిచేయుచుండెను. అంతకంటెను నధమ జాతులలో బిడ్డలు మూఢత్వములోను పాపములోను పెరుగుచుండిరి. అటువంటి వారి నిమిత్త

మయి బీదపాఠశాల లక్కడక్కడ స్థాపింపఁబడిన వని విని యామె యటువంటిపాఠశాల నొకదానిని బ్రిస్టలునగరములోఁ గూడ నారంభించుటకు నిశ్చయము చేసికొనెను. కార్పెంటరుకన్య తన యాలోచనను కాలమును విశేషముగా వినియోగించిన యీపాఠశాల యల్పకాలములోనే యత్యంతోపయుక్తమయి నీతిదాయక మయ్యెను; అందుచేత నారక్షకశాఖవా రాచుట్టుపట్ల నేరములు తక్కువయి పాఠశాలవలన విశేషప్రయోజనము కలిగిన ట్లొప్పుకొనిరి. అయినను కార్పెంటరుకన్య మాత్ర మంతతోఁ దృప్తి పొందలేదు. అప్పు డప్పుడు నేరములు చేయు తరగతులవారిబిడ్డలు మాత్రమే యీ పాఠశాల యందు జేరి లాభము పొందుచుండిరిగాని, యీపాఠశాలకు జేరరాని యధికదుస్థితిపరుల బిడ్డలును బలువు రుండిరి. చోరత్వాదిదోషములనే వృత్తిగా నేర్పఱచుకొన్న జాతులవారి బిడ్డలసామాన్య ప్రయత్నము చేసి విశేష సాధనములఁ గల్పించినఁగాని యిటువంటి పాఠశాలల వలని లాభములను బొంది బాగు పడఁజాల రని యామె యెఱింగి యుండెను. కాఁబట్టి యామె చోరత్వాదులచే దుష్టులయి యావజ్జీవమును చెఱసాలలలోఁ బడి కడగండ్లు పడవలసిన దిక్కుమాలిన బిడ్డలను విముక్తులను జేయఁ దలఁచుకొనెను. పై (?)దొరసాని చేసిన పనిని దీనిని జదువువా రెఱుఁగుదురుగదా. చెడి చెఱసాలలయందుఁ బడిన వారిని బాగుచేయుట కయి యామె పాటుపడెను; రోగము వచ్చిన తరువాత మందు వేయుటకంటె రోగము రాకుండ మాన్పుట యుత్తమ పద్ధతి యన్న సిద్ధాంత మవలంబించి, చెడిపోవలసిన వారిని బాగుచేసి చెఱసాలలలోఁ బడకుండ వారించుట కయి యీయామె పాటుపడెను. 1851 వ సంవత్సరమునం దీమె "చెడిపోవుచున్న జాతులవారి బిడ్డలకును వయస్సురాని దోషులకును "దోషనివారక పాఠశాలలు" అను పేరితో

నొకపుస్తకమును ప్రచురించెను. కారాగృహ విద్యాలయములను స్థాపించుటకు దొరతనమువారు పూనుకొనునట్లు చేయుట కయి యీమె బహువిధములఁ బ్రయత్నములు చేసెనుగాని యీమెకృషి మొదట సఫలము కాకపోయినను కడపట సఫలమయి 1854 వ సంవత్సరమునందు కారాగృహములలో దోషనివారక విద్యాలయములను స్థాపించుటకు రాజానుమతి యియ్యఁబడెను.

పాపమునకు మూలకారణమును గనుఁగొని దానిని వారించుట కయి కారాగృహ విద్యాలయములను కర్మవిద్యాశాలలను స్థాపించి చిరకాల మోర్పుతోఁ బని చేసి కడపట పార్లమెంటుమహాసభ వారి యంగీకారమును సాహాయ్యమును బొంది, ఇంగ్లండు దేశములో నేరములు చేసెడువారిసంఖ్యను తగ్గించుటయం దావర కెవ్వరును జేసియుండనంత యెక్కువవని నీమె చేసెను. పాపములో దిగుటకు సిద్ధముగా నున్నట్టియు నావఱకే పాపములో బడినట్టియు బాలురును బాలికలును ఈమె నిరంతరప్రయత్నములవలన దుస్సహవాసములనుండి తొలఁగింపఁబడి, పాటుపడుచు గౌరవనీయు లయినపురుషులును స్త్రీలును నగునట్లు చేయఁబడిరి. ఆవఱకు బాలురును బాలికలును నేరములు చేసినప్పుడు దండవిధాయకులకు వారిని జెఱసాలలకుఁ బంపుట తప్ప వేఱుమార్గము లేకుండెను. అందుచేత నట్టివారు చెఱసాలనుండి విడుదలను బొంది వచ్చునప్పటి కచ్చటి పాపిష్టులతోడి దుస్సహవాసముచేత సామాన్యముగా వారిక బాగుపడుదు రన్నయాశ లేనంతయెక్కువగాఁ జెడిపోయి యావజ్జీవమును ఘాతుకమృగములవలె సంచరించెడు దుస్థితికి వచ్చుచుండిరి. ఈమె 1846 వ సంవత్సరమునందు లాయిన్సు మీఁదు బీదపాఠశాలలను స్థాపించెను. 1852 వ సంవత్సరమునందు రస్సెల్

స్కాట్లనుకుండు కింగ్స్ వూడ్లులో నొకయిల్లు గొని బీదబిడ్డల విద్యావిషయమయి యిచ్చి యందు దీమెతోఁ గూడ జాసను బనిచేయఁ బూనుకొనెను. ఈమె సెంటు జేమ్సు బ్యాంకువద్ద పసివాండ్ర చావిడిని కట్టించెను. ఈమె పాఠశాలలను శుచిగాను సుందరముగాను నుంచి హృదయాకర్షకములుగాఁ జేయుచుండెను.

1854 వ సంవత్సరమునందు బైరన్ ప్రభ్వి బ్రిష్టల్ నగరములో కార్పెంటరుకన్య విచారణ క్రింద నుండుటకై యొక బాలికా దోషనివారకవిద్యాలయము నిమిత్తము "శోణగృహ" (Red lodge) మనఁబడెడు విశాలమందిరమును గొని యిచ్చెను. ఆరంభమునందు దానిలో పదుగురు బాలికలు మాత్రమే యుండిరి గాని 1858 వ సంవత్సరమున కేఁబదియిద్దరుబాలిక లయిరి. దొంగలుగా శిక్షింపఁ బడిన నూఱులకొలఁది బాలిక లందుఁ జేరి యవమానకరమయినట్టియు నపకీర్తికర మయినట్టియు జీవనమునకు లోనుగాకుండ రక్షింపఁబడి యిప్పుడు మాననీయసేవకురాండ్రును, కుటుంబమాతలును, నయి గౌరవ నీయ మైనస్థితులను బొందియున్నారు. ఈవిషయములలో నామెకు కార్యవిజయము కలుగుట ముఖ్యకారణము. తనతోడిమానవులలో నత్యంతభ్రష్టు లయినవారియెడలసహితము నామెకుఁ గలప్రేమమును, నదయత్వమును నయి యున్నవి. ఎంత నీచదశలో నున్న పిల్లలనైనను తనకుటుంబములోనివారివలెఁ జూచి యామె యాదరించు చుండెను. "మన మొకబాలునిఁగాని బాలికనుగాని దోషవిముక్తి గలిగించి బాగుచేయఁ దలఁచుకొన్నపక్షమున నట్టివారిని కుటుంబములో నుంచ వలెను. ఏపనినైనను వారి నాదరించి మంచిమాటలతోఁ జేయింప వలెనుగాని బలవంతపెట్టి చేయించుటవలనఁ బ్రయోజనము లేదు. మనము వారిస్వేచ్ఛ నెప్పుడును భంగము చేయరాదు; వారిని

తమంత క్రమముగా నడవ నేర్చుకొనునట్లు దిద్దవలెను. పతితులయి మిక్కిలి చెడిపోయినవారిలోపల సహితము మరుగి యుండెడు మంచిని బయికిఁ దీసి, యది చెడుగును జయించునట్లు చేయుట యెల్లప్పుడును మనగుఱియయి యుండవలెను.'' అని యామె పలుమాఱు పలుకు చుండెను. శోణగృహదోషనివారకవిద్యాశాల యిప్పటికిని జయప్రదముగా నడపఁబడు చున్నది. ఆమె పాఠశాలల కనుబంధములుగా నప్పుడప్పుడు చేర్పఁబడుచు వచ్చిన సమాజములు మొదలయినవి సహితము పాఠశాలలంత యుపయోగకరములుగానే యుండుచువచ్చెను. వానిలో నొకటి పఠనమందిరము; అక్కడ కాచుట్టుపట్లవా రందఱును వచ్చి వార్తాపత్రికలును పుస్తకములును జదువుచుండిరి; దానిపయి యుపన్యాసమందిరములో సాంఘికవిషయములు నీతివిషయములు మొదలయినయుపయుక్తాంశములను గూర్చి యుపన్యాసము లియ్యఁబడు చుండెను. అందులోనే సురాపాననివారకసమాజసభలు జరుగు చుండెను.

ఆమె కేఁబదిసంవత్సరములు వచ్చినప్పు డామెతల్లి 1856 వ సంవత్సరమునందు మృతినొందెను. తల్లిచావుతో మేరీ కార్పెంటరు కన్యకు సంసారబంధము లన్నియు విడిపోయి, తనకాలమును నిరంతరాయముగా మంచిపనులయందు వినియోగపఱచుటకు మఱింత యానుకూల్యము కలిగెను. అందుచేత నామె మాతృవియోగదుఃఖము తలఁపునకు రాకుండునట్లుగా సత్కార్యాచరణమునందు విరామము లేకుండ పాటుపడఁ దొడఁగెను. 1856 వ సంవత్సరమునం దామెతోఁ గలసి పనిచేయుటకయి చేరిన మిస్ ఫ్రాన్సిస్ పవర్ కాబ్బు ఆమెను గూర్చి యిట్లువ్రాసెను — "అర్ధమనుష్యుని భోజనముతో కార్పెంటరు కన్య ముగ్గురుమనుష్యులపనిని చేయు చున్నది."

1858 వ సంవత్సరమునం దామె యొకకన్య నభిమానపుత్రికనుగా స్వీకరించి పెంచ నారంభించెను. ఈవిషయమునుగూర్చి యొకచెలికత్తె కామె యిట్లు వ్రాసెను — "నీవు కననట్టిబిడ్డలను నీకిచ్చియున్నానని సిద్ధాదేశములో వ్రాయఁబడి యున్నది. అంతకుముందు తల్లిప్రేమ యెట్టిదో యెఱుఁగనియనేకులకు నాహృదయాంతర్గతమయినమాతృప్రేమను జూపి యున్నాను. వివాహ మాడవలసినకష్టకాలము లేక కిసకుండ సిద్ధముగాఁ జేయఁబడి చేతికందినాకు లభించిన జననీజనకవిహీన యయినయీయమాయుదేండ్ల పసిబాలికతోఁ గూడిన నాభాగ్యమును జూడుము."

వృద్ధదశలో నితరు లపేక్షించెడువిశ్రాంతి యీయామెకు పనిచేయుచుండుటవలనఁగాక వేఱు వేఱుపనులకుఁ బూనుటలోనే కలుగుచుండెను. 1861 వ సంవత్సరమునం దామె యైర్లండునకుఁబోయి యచ్చటికారాగృహములను పరీక్షించి వానినిగూర్చి యుపయోగకర మయినచరిత్రమును ప్రకటించెను. మఱిమూఁడుసంవత్సరముల కామె "మన కారాబద్ధులు" అనునామముతో రెండుసంపుటములగ్రంథమును బ్రకటించి, దానిలో కారాబద్ధులస్థితినిగూర్చియు నాదరణమునుగూర్చియు వితర్కించెను. ఆమె చిన్నపిల్లలవిషయమునఁ దాను నడపినక్రమమునుబట్టి పెద్దవాండ్రవిషయమునఁగూడ నట్లే నడపుట శ్రేయోదాయక మని యభిప్రాయపడెను.

ఆమె కఱువదిసంవత్సరములు నిండినప్పుడు దుఃఖమును తగ్గించుటకును నేరములు మాన్పుటకును దాను జేసిన ప్రయత్నము లన్నియుఁ దానెప్పుడు నెదురుచూడనంత జయప్రదముగాఁ గొనసాగినందుకు సంతోషించి, తన్నత్యంతధన్యురాలినిగా భావించుకొనెను. అయినను దానంతటితో సంతుష్టి నొంది యూరకుండక హిందూదేశమునకుఁ

బోయి చూచి దానికి మేలు చేయవలెనని తలంచెను. ఆమె హిందూదేశమునకుఁ బైలువెడలుటకు ముందుగా "రాజా రామమోహాన రాయలయొక్క ఇంగ్లండులోని కడపటిదినములు" అను పుస్తకమును రచించి 1866 వ సంవత్సరము సెప్టెంబరునెల మొదటి తేది నోడ యెక్కి చిరకాలము నుండి యుద్దేశించుకొనియున్న హిందూదేశ యాత్ర నిప్పుడు నెఱవేర్చెను. ఆమె యెక్కినయోడలోనే యెక్కి మానమోహానఘోషనునతఁడు న్యాయవాదిగాఁ బనిచేయుట కయి మరల నీదేశమునకువచ్చెను. ఆమె బొంబై నగరములో దిగిన మఱునాఁడే బొంబయి రాజధానీ ప్రభుత్వమువారు సామాన్యముగా విద్యా విషయములు కార్పెంటరుకన్య కోరినవిశేషము లన్నియు నియ్యవలసిన దనియు బాలురకును తదితరులకును నేర్పడిన శోధనాలయముల యొక్క వృత్తాంతములను దెలుపవలయు ననియు స్థానికోద్యోగస్థుల కందఱికిని నాజ్ఞాపత్రికలను బంపిరి. బొంబయిరాజధానిలో నామె మొదటఁ జూచినస్థల మహామదాబాదు పట్టణము. ఆపట్టణమునం దప్పటికే స్త్రీవిద్య కొంతయభివృద్ధిలో నుండెను. అహామదాబాదునుండి యామె సౌరాష్ట్రపురము (సూరతు) నకుఁ బోయి, యచ్చటి నుండి మరల బొంబయిపురము వచ్చిచేరెను. సౌరాష్ట్రపురిలో "ప్రియజననీ" యని సంబోధించుచు నొకహిందూసుందరి తత్పౌర కాంతల పక్షమున స్వాగతపత్రికను జదివెను. ఆమె బొంబయి నగరములోఁ గొన్నిదినము లుండి యచ్చటివిద్యాశాలలు మొదలగువానిని పరీక్షించి, అక్కడనుండి పునానగరమునకుఁ బోయెను. చెన్నపురికిఁ బోయినప్పు డచ్చటివా రామె నాదరించి మిక్కిలి గౌరవించిరి. కలకత్తా నగరములో నచ్చటి రాజప్రతినిధిగా రయిన లారెన్సుప్రభువుగా రామెను స్వగృహములో నుంచుకొని సమ్మానించి యాతిథేయ

సత్కారము నాచరించిరి. ఆమె కలకత్తానగరములోను దానిశాఖా నగరములలోను గలపాఠశాలలు మొదలయినవాని నన్నిటినిజూచి, వానివిషయ మయి యనేకోప యుక్తాంశములను గ్రహించి, వాని వయిఁ దనకుఁ దోఁచినయభిప్రాయములను నభివృద్ధిమార్గములను దొరతనము వారికిఁ దెలిపెను. ఆమె యక్కడనుండి బొంబయినగరమునకుఁ బోయి, యచ్చటి హిందూమహాజనులచే నియ్యఁబడిన యభినందనప్రతిక నందుకొని 1867 వ సంవత్సరము మార్చి నెలలో బొంబయినగరములో నోడయెక్కి స్వదేశమునకు వెడలెను. ఆమె స్వదేశమును జేరిన తోడనే "హిందూదేశములోని కారాగృహశిక్షను గూర్చియు స్త్రీ విద్యనుగూర్చియు సూచనలు" అను పేరితో నొకచిన్న పుస్తకమును బ్రకటించెను. మఱుచటి సంవత్సరమునం దామె "హిందూదేశమునం దాఱునెలలు" అను పుస్తకమును జేసి దానిని రామమోహనరాయుల కంకితముచేసెను. ఆమె హిందూదేశమునకు బైలుదేఱునప్పుడు హిందూ స్త్రీలను స్వదేశమునకు దీసికొనిపోయి విద్య చెప్పించి యుపాధ్యాయినులనుగా దిద్దింపవలె ననుకొనెను గాని యాపని యసాధ్య మయినట్లు కనబడినందున తరువాత నామె యాప్రయత్నము విడిచిపెట్టెను. ఆమె ప్రాణమిత్రులు సహితము మాయొక్క వలన హిందూదేశమునకు విశేషలాభము కలుగునని తలఁపలేదు. "ఇక్కడి పెద్దలు మాటలలో పెద్దనోరు చూపుదురే కాని క్రియలలో శూన్య హస్తములు చూపుదు రని ముందు నీవే తెలిసికొందువు" అని యొక హిందూమిత్రుఁ డామెతో ననెను. ఆమె నంతగాఁ బ్రోత్సాహపఱ చిన కేశవచంద్రసేనుఁడు సహితము "కార్పెంటరుకన్య హిందూదేశ మును విడిచి వెనుకతిరుగఁగానే సత్కార్యవిషయ మైన ప్రతి ప్రారంభము శూన్యవాయువులో నశించిపోవును" అనిపలికెను.

ఇట్టివాక్యములచేత నామె నిరుత్సాహురాలు గాక యామె యీహిందూదేశమునందలి ప్రముఖులతో నుత్తర ప్రత్యుత్తరములను జరుపుచు నచ్చెను. బొంబయిలో న్యాయాధిపతి యైన గోపాలరావు హరిదేశముఖుగారి యుత్తరమువలన నామెకు స్త్రీబోధనాభ్యసన పాఠశాలలను బెట్టింపవలెనన్న నిశ్చయము కలిగెను. అతఁడు చిన్న తనములో వివాహము లగుచుండుటవలన బాలికలు పాఠశాలలను విడిచి తామాపఱకు నేర్చుకొన్నయల్పవిద్యను కూడ మఱచిపోవు చుండుటను బట్టి బాలికా పాఠశాలలవలనఁ బ్రయోజన మంతగాఁ గలుగకున్న దని తెలిపి, "దేశాచారమునుబట్టి యెప్పుడును పునర్వి వాహమును చేసికొనకుండెడు వేలకొలఁది వితంతువుల నుపయోగము నకుఁ దీసికొనిరావలెను; అర్హురాండ్రయిన యుపాధ్యాయినులను దిద్ది పంపుట కేర్పడిన బోధనాభ్యసన పాఠశాల యొకటి స్థాపింపఁబడు వఱకును స్త్రీవిద్యాభివృద్ధినిగూర్చి యేర్పఱిచెడి యేపథకమును సఫ లము కానేరదు. హిందూదేశముయొక్క యీప్రాంతమం దున్న మే మందఱమును మీా ప్రయత్నముయొక్క పర్యవసానమునకును మీాయొక్క పునరాగమనమునకును అత్యంతాతురతతో నెదురు చూచుచున్నాము." అని వ్రాసెను. అందువలన నామె హిందూదేశ మునం దప్పు డధికారములో నున్నవారికి స్త్రీబోధనాభ్యసన పాఠ శాలల యావశ్యకమునుగూర్చి తెలిపి, హిందువు లందఱును జేరి సంవ త్సరమునకు 1600 పౌను లిచ్చెదుపక్షమునఁ దా మంతసొమ్మును బొంబయిలోను అహమదాబాదునగరములోను స్త్రీబోధనాభ్యసన పాఠశాలలను బెట్టుట కిచ్చెదమని బొంబయిదొరతనమువారు వాగ్దా నము చేయునట్లు చేసి చందాలువేసి యంతసొమ్ము పోఁగుచేయునట్లు హిందువుల నావనికిఁ బ్రోత్సాహపఱుపఁ జొచ్చెను.

ఆమె చేసిన కర్తవ్యోపదేశము ననుసరించి హిందూదేశ ప్రభుత్వమువారు జనులతోడ్పాటు నపేక్షింపకయే బొంబయి నగరములో స్త్రీబోధనాభ్యసన పాఠశాలను స్థాపించుట కయి యైదుసంవత్సరముల వఱకును సంవత్సరమునకు పంద్రెడువేల రూపాయల నిచ్చుట కేర్పాటు చేసిరి. ఈప్రకారముగాఁ దనకృషి ఫలోన్ముఖమునకు వచ్చుసూచనలు గాంచి సంతోషించి యత్యంతో త్సాహముతో 1868 వ సంవత్సరము నవంబరునెల యేడవ తేదీయం దామె రెండవసారి హిందూదేశమునకు వచ్చెను. ఆమె బొంబయి నగరము చేరినతోడనే తానచ్చటి స్త్రీబోధనాభ్యసన పాఠశాలలో నధ్యక్షురాలుగా నుండి జీతము గయికొనక ధర్మార్థముగాఁ బనిచేసెద నని దొరతనమువారికి విన్నపము చేసెను. వారామె ప్రార్థనను గృతజ్ఞతాపూర్వకముగా నంగీకరించిరి. ఉష్ణదేశములోనుండి పని చేయుటచే నారోగ్యము చెడిపోవుటచేతను దనపనిని విడిచిపెట్టి యామె మఱుచటి సంవత్సరారంభమునం దింగ్లండునకుఁ బోవలసిన దాయెను. అయినను మరల నామె యాసంవత్సరాంతమునందే హిందూదేశమునకు మూడవసారి వచ్చి స్త్రీవిద్యాభివృద్ధినిమిత్తమయి కొంతపని చేసి మరల స్వదేశమునకుఁ బోయెను.

1870 వ సంవత్సరమునందు కేశవచంద్రసేను డింగ్లండునకుఁ బోయినప్పుడు జూన్ నెలలో బ్రిస్టల్‌నగరమున కరిగి, మేరీకార్పెం టరు కన్యను సందర్శించి, హిందూదేశమును గూర్చిన జ్ఞానమును వృద్ధి చేయుటకును హిందూదేశములోని సాంఘికలోపములను వారించుట కును నొక సమాజమును స్థాపించుట యుచిత మని యతఁ డామెకు విన్నవించెను. ఆసంవత్సరము సెప్టెంబరు నెలలో రెండవసారి యతఁ డామె దర్శనము చేయుటకు బ్రిస్టల్‌నగరమునకుఁ బోయినప్పుడు

"దేశీయహిందూదేశసమాజ" (National Indian Association) మనునామముతో నొక సమాజము స్థాపింపఁ బడెను. ఆసమాజము యొక్క యుద్దేశములను నెఱవేర్పుటకయి సమాజముపేర నొకమాస పత్రిక ప్రకటింపనారంభింపఁబడినది. ఆపత్రిక యిప్పు డిండియా పత్రిక (The Indian Magazine) యను పేరఁ బరఁగుచు తత్సంస్థాపకు రాలి యనంతర మామె పదమును వహించిన యత్యంతయోగ్యురా లగు మానింగుకన్య (Miss Manning) చే మహాసమర్థతతో నిన్నటిదాఁక నిర్వహింపఁబడుచుండెను. ఈసమాజమును మన దేశ మునం దనేకస్థలములలో నున్న దీని శాఖలును మనదేశమునకు మహోపకారము చేయుచున్నవి.

1875-76 సంవత్సరములో కార్పెంటరుకన్య కడపటిసారి మన దేశమునకు నాలవపర్యాయము వచ్చెను. ఆమె స్త్రీల విషయము లోను, చెఱసాలల విచారణవిషయములోను, పాపనివర్తక పాఠశాలల విషయములోను, కర్మశాలలవిషయములోను, వృత్తిశాలలలో స్త్రీలను పిల్లలను పనిలోనుంచు విషయములోను ముఖ్యముగాఁ బనిచేసెను. తాను జేసినపనివలనఁ గలిగినఫలితములను గూర్చి యీామె సాలి స్బరీ ప్రభువునకు వ్రాసినయుత్తరములో వివరముగాఁ దెలిపినది. అవి యటుతరువాత పార్లమెంటు మహాసభవారి యెదుటఁ బెట్టఁబడినవి.

1877 వ సంవత్సరము ఏప్రియల్ నెల 3 వ తేదీతో నామెకు డెబ్బదిసంవత్సరములు పూర్తియయ్యెను. ఆమె జన్మోత్సవ దినమునం దామె నభినందించుచు బంధువుల యొద్ద నుండియు మిత్రుల యొద్దనుండియు నాశీర్వచనపత్రికలును పారితోషికములును విస్తార ముగా వచ్చినవి. ఆసంవత్సరము 14 వ జూన్ తేదీని తన పెంపుడు కొమారితతో సల్లాపసౌఖ్య మనుభవించి యారాత్రి పడకకుఁబోయి

తెల్లవారులోపల నామె యనాయాసమరణము నొందెను. ఆమె శరీర మార్ణోకనుమ యందు భూస్థాపిత మొనర్పఁబడెను. ఆమె శవమును సమాధికిఁ గొనిపోవునప్పుడు సంఖ్యాతీతులైన మిత్రులును శోణగృహాశోధనాలయములోని బాలురును బాలికలును, పగటికర్మ పాఠశాలలోని బిడ్డలును, రింగుస్వ్రాడ్డు కర్మ విద్యాలయములోని బాలురును, తమకును లోకమునకును మహోపకారిణి యైనట్టియు బిడ్డలను బీదతనమునుండియుఁ బాపములనుండియు రక్షించుటకై తన జీవితమును ధారపోసినట్టియు నాయుత్తమాంగనయొక్క శవము వెంట శోకించుచుఁ బిక్ళృవనమునకు వేలకొలఁదిగాఁ బోయి తమ కామె యెడలఁ గలభక్తిగౌరవములను వెల్లడించిరి. మనదేశపుస్త్రీ లీమె వలె లోకోపకారకృత్యముల యందుఁ దమ కాలమును గడపుటకుఁ బ్రయత్నింతురుగాక!

---

# LIFE OF JESUS

# జీసస్ చరిత్రము



## మొదటి ప్రకరణము.



### జీసస్‌యొక్క జననమును, బాల్యదశయును.

క్రైస్తవమతస్థాపకుఁ డైన జీసస్‌యొక్క బాల్యదశను గూర్చి మన కంతగా తెలియదు. ఆయనచరిత్రమును వ్రాసినవా రాయన యొక్క బాల్యావస్థలో నడచిన వృత్తాంతము తమకు తెలియక పోవుటచేతనో, అప్పటి వృత్తాంతము ముఖ్యమైనది కాదని భావించుట చేతనో, మఱి యేహేతువు చేతనో, దానిని విడిచి యతఁడు మతబోధ నారంభించినతరువాత జరగినవృత్తాంతమును మాత్రమే విశేషముగా వ్రాసియున్నారు. ఒక్కబాల్యావస్థనుగూర్చి మాత్రమే కాక యా ఘనుని జననదిన మిది యని సహితము నిశ్చయముగాఁ దెలియదు. మన యాసియాఖండముయొక్క పశ్చిమదిగ్భాగమునం దున్న పాలస్టిన్ దేశములో నుత్తరపువైపున గాలిలీ మండలములో నాజరేత్తను గ్రామ మొక్కటి గలదు. ఆగ్రామమునం దిప్పుడు మూఁడునాలుగు వేలజనులున్నారు. పూర్వకాలమునందు సహిత మీగ్రామ మిప్పటి కంటె పెద్ద దయి యుండదు. ఈగ్రామ మొక పర్వతము యొక్క ప్రక్కను గట్టఁబడియుండుటచేతను పెక్కు పర్వతములు సమీపమునం దుండి యుండుటచేతను మిక్కిలి మనోహరముగా నుండును. సుంతర

మైన యీగ్రామమునందు 'జోసఫ్' అను పేరు గల వడ్రంగి యొకఁడు మేరీ యను పేరుగల తన చక్కని చిన్న భార్యతో వాసము చేయుచుండెను. ఆదంపతులు ధనికులు కాకపోయినను, చుట్టుపట్టుల నున్న యితరశిల్పులకంటె నెక్కువబీదస్థితిలో నుండినవారు కారు. ఆకాలమునం దెవ్వరును మహాధనికులుగాఁ గాని, కూటిపేదలుగాఁ గాని యుండక యెల్లవారును అన్నవస్త్రములకు లోపములేని సామాన్యదశలో నుండిరి. ఆకాలమునందు జోసఫ్ చేతులార కష్టపడి పని చేసి జీవనము చేయవలసిన స్థితిలోనే యుండినను, అతఁడు తద్దేశమునకు రాజధాని యైన జెరూసలేము నగరమును స్థాపించి నట్టియు, హీబ్రూజనుల కాదిమచక్రవర్తి యైనట్టియు, డేవిడ్డుయొక్క సంతతి వాఁడైన మహాకులీనుఁ డని చెప్పుచున్నారు. ఈ సంబంధముననే యాకాలమునందు రాజాజ్ఞచేత వేయఁబడిన జనపరిగణనము నిమిత్తము జోసఫ్ గర్భవతియై యున్న తన నూతనవధువగు మేరీతోఁ గలిసి తన పూర్వుల వాసస్థాన మైన బెథిల్‌హేము నగరమునకుఁ బోవలసినవాఁ డయ్యె ననియు, అతఁ డక్కడ నొక సత్రమునకుఁ బోయి యందు చోటుగానక దానితోఁ జేరియున్న యొక పశువులశాలలో వసించి యుండఁగా డేవిడ్డు మహారాజు యొక్క జన్మస్థాన మైన యీనగరము నందే యతనిభార్య రాత్రివేళ గడ్డివామిలో నొక పురుష శిశువును ప్రసవించె ననియు, కొందఱు వ్రాసియున్నారు. అప్పుడట్లు పుట్టిన యాశిశువే క్రైస్తవమతస్థాపకుఁ డైన జీసస్. *ఆశిశువు పుట్టిన దినమును సరిగా కనుఁగొనుట కాధారము లేవియు లేక పోయినను,

* జీసస్ క్రైస్తనునది జీసస్‌యొక్క సంపూర్ణనామము. అతఁడు సాధారణముగా క్రైస్తనియు పిలువఁబడును. ఈకడపటినామము వచ్చుటకుఁ గల కారణము ముందు వివరింపఁబడును.

అతఁడు క్రీస్తుశకమునకు నాలుగుసంవత్సరములు ముందు జనవరినెల మొదటి తేదికి మూఁడునాలుగుదినము లీవలనో యావలనో జనన మొందినట్లు చూపుటకుఁ దగిన నిదర్శనము లున్నవి. ప్రభుత్వమువారి యాజ్ఞను బట్టి వేయఁబడిన యీ జనపరిగణనము క్రీస్తుపుట్టిన పదిసంవత్సరములకు తరువాతఁగాని జరగనందున నతఁడు బెథల్ హేమునగరమున జన్మించుట సత్యము కాదనియు, ఆకాలపువారిచే నతఁడు 'నాజరెత్తుపుర జీసస్' అనియే పిలుపఁబడుచు వచ్చుటచేతను, కొందఱతఁడు నాజరెత్తులోనే పుట్టెనని చెప్పియుండుటచేతను జీసస్సు నిజముగా నాజరెత్తుగ్రామములోనే జననమొందె ననియు, అతఁడు డేవిడ్డు రాజవంశజుఁ డయినట్టును బెథల్ హేమునగరము నందు జన్మించినట్టును తరువాతివా రాతని జన్మాతిశయమును స్థాపించుటకొఱకును ప్రాఁతనిబంధనలో ముందఁజెప్పఁబడి యున్నదని చెప్పఁబడిన దేవదూత యితఁడే యని సాధించుటకొఱకును గల్పించి రనియు, కొందఱు బుద్ధిమంతు లభిప్రాయపడుచున్నారు. లోకోపకారులైన మహాపురుషులకు వారి తరువాతివారు మహావంశసంభవతయు దేవాంశసంభవతయు నారోపించుట యెచ్చటను క్రొత్తగాదుగదా! మనదేశము నందునహితము శంకరాచార్యులు మొదలగు మహాపురుషులెందఱుమన వారిచే దేవాంశసంభూతులుగా పరిగణింపఁబడు చున్నారు కారా? పూర్వులస్థితియెట్టిదయినను, ఆశిశువుజనించినప్పుడాతనిజననీజనకులు ధనసంపన్నులుగాని కులములో ప్రాముఖ్యము కలవారుగాని కారు. జీసస్సు యొక్క గ్రామమునకు బెథల్ హేమునగరము మూఁడుదినముల ప్రయాణములో నున్నది.

ఇట్లు పేదయింట జనన మొందినయాశిశువునకు తల్లిదండ్రులు జీసస్సని నామకరణము చేసిరి. ఆపదమునకు రక్షకుఁ డని యర్థము.

ఆకాలమునం దటి యనేకబాలకులకు సాధారణముగాఁ బెట్టఁబడు చుండిననామమే యయినను దాని కీటీవలివారు గొప్పమహిమ నారోపించుచున్నారు. మహిమ యెప్పుడును పురుషగుణమును బట్టి వచ్చును గాని పేరునుబట్టి రాదు. ఉల్లికి మల్లె యని పేరు పెట్టినను దానికి సువాసన రాదు; మల్లెపువ్వున కుల్లిపు వ్వని పేరు పెట్టినను దాని సువాసన పోదు. అతఁడు చిన్నతనమునం దెట్టియింట వసించెనో, ఎట్టి బట్టలు కట్టెనో, ఎట్టి బాలక్రీడలు సలిపెనో, ఏయే పాఠశాలలకుఁ బోయి యేయే విద్యల నభ్యసించెనో, ఇప్పు డేమియుఁ దెలియదు. ఆగ్రామ మిప్పు డున్నస్థితినిబట్టి చూడఁగా నతఁ డప్పుడు వసించి యుండినగృహ మిప్పుడు శిల్పులు సాధారణముగా వాసము చేసెడుగృహములవంటి దే యని తోఁచకమానదు. అక్కడియిండ్లకు మిద్దెలును మేడలును లేవు; ఇంటికి రెండుమూడుగదులకంటె నెక్కువ యుండవు; పడకగదిలో నొకకొయ్యపెట్టెయు రెండుచాపలును దిండ్లును నుండును. ఇండ్ల కప్పులమీఁదసుందరముగా ద్రాక్షతీఁగలు ప్రాఁకు చుండును; లోనికిఁ బోయి చూచినయెడల కూరుచుండుటకు కుర్చీలు బల్లలు మొదలయినవి లేక నేలమీఁద చాపలు పఱువఁ బడి యుండును. అన్నిగదులకును వెలుతు రిచ్చునట్లుగా నిత్తడిదీపస్తంభ మొకటి యింటినడుమ నడికప్పునుండి వ్రేలు చుండును; వంటయిల్లు వేఱుగా నుండక యింటికి చేరియే యుండును. స్త్రీలు వీధులలోనినూతులయొద్దకుఁ బోయి నీళ్ళు తోడి కుండలతో బుజములమీఁదఁ బెట్టుకొని తెచ్చి తలుపుల మూలల నుంచుదురు. ఆకాలమునం దిటువంటియిండ్లలోనే యొకదానిలో జీసస్ తనతల్లిదండ్రులతోను సోదరులతోను గలసి వాసము చేసి యుండుటకు సందేహము లేదు. మేరీకి జీసస్సు ప్రథమపుత్త్రుఁ డని యీవఱకే చెప్పి యున్నాముగదా. అతనికి కొందఱు తమ్ములును చెల్లెండ్రునుకూడఁ

గలరుగాని వారప్రసిద్ధులు. ఆతనిసోదరులని చెప్పఁబడి ప్రసిద్ధిగాంచిన నలుగురుపురుషులును వారిలో ముఖ్యముగా క్రైస్తవమతారంభదశ యందు సుప్రసిద్ధుఁ డయినజేమ్సనునతఁడును పినతల్లికొడుకులుగాని సాక్షాత్సహోదరులుగారు. జీసస్‌తల్లి యైన మేరీకి మేరీ యనుపేరు గల చెల్లెలొకతె కలదు. ఆమెభర్త క్లియోపస్సను నామాంతరము గలయాల్ఫియస్సనువాఁడు; ఆమెకు కొడుకు లనేకులు గలరు; వారు జీసస్సునకు మొదటిశిష్యులయి ప్రఖ్యాతి గాంచిరి. ఏకగర్భజనితు లయిన తమ్ములే ప్రతికూలురుగా నున్నప్పుడు జీసస్సునకు వీరనుకూలు రుగా నుండి తోడుపడుటచేత తరువాత పినతల్లికొడుకు లయినవీరికే "ప్రభుసోదరు" లన్న పేరు వచ్చినది. అతనిఁ గన్నతల్లికివలెనే నిజమైన సోదరులకును జీసస్సుయొక్క మరణానంతరమునఁగాని గౌరవము రా లేదు. అతని తోడఁబుట్టినపడుచులు వివాహము లాడి తమభర్తలతోఁ గూడి నాజరెత్తు గ్రామములోనే కాపురము చేయుచుండిరి. ఈ చెల్లెండ్రును తమ్ములును తనతోడఁగూడి క్రీడించు చుండఁగా జీసస్సు కొంతకాలము చిన్నతనములో తల్లియింట విహరించెను. అప్పు డామె తనతోడి చేడియలతోఁగూడి ముచ్చటించుచు వీధిలోని నూతివద్దకుఁ బోయి పసిపిల్లను చంక నిడుకొని పెద్దకొడుకును కేలూఁతయిచ్చి నడ పించుచు బుజముమీఁది బిందెతో మందగమనమున నింటికి వచ్చి పలు మాఱు భర్తకు నేత్రానందము కలిగించి యుండును. అయినను జీసస్సునకు యౌవనము రాకమునుపే తండ్రి కాలము చేసినట్లు కనఁ బడుచున్నది. ఉష్ణదేశ మగుటచే నతఁడు ధరించినవస్త్రములు పలుచని వయి యుండవలెను. అతఁ డాటలకయి గ్రామసమీపమున నుండు కొండలకుఁ బోయి తోడిబాలకులతోడఁ గూడి విహరించి యుండును. కొంతసే పాటలాడివచ్చి యతఁడు వడ్రపుపనిలో తనతండ్రికి తోడు

పడుచుండియు నుండవచ్చును. అతఁడు చిన్నతనములో తండ్రివద్ద పని నేర్చుకొని కొంతకాలము కులవృత్తిని చేసె ననుటకు సందేహము లేదు.

ఆకాలమునందతఁడును తక్కిన బాలురవలెనే వీధిబడికి పంపఁబడెను. ఆబడులయందు చెప్పఁబడినది యంతయు చదువుటకును వ్రాయుటకును నేర్పుటయు, కొన్ని వాక్యములను గంథపాఠము చేయించుటయు మాత్రమే. ఆకాలమునందిప్పటివలె నచ్చుపుస్తకములు లేనందున, ఉన్న పుస్తకములు కొన్నియు నాకులమీఁద వ్రాయఁబడుచుండెను. అతఁడు దేశభాష యైన సిరియాభాషలో వ్రాయుటకును చదువుటకును నేర్చుకొనుటయేగాక, మతగ్రంథము లన్నియు మన దేశమునందు దేశభాషలలోఁ గాక సంస్కృతభాషలో నున్నట్లే యూదేశమునందు హీబ్రూభాషలో నుండుటచేత ప్రాఁతనిబంధన (Old Testament) మొదలగు కొన్ని మతగ్రంథములను, మతగ్రంథములకు రాబీ లనఁబడు పండితులు చేసిన కొన్ని వ్యాఖ్యానములను, హీబ్రూభాషలోఁ జదివెను. అంతేకాని, యాతని కాకాలమునందు పండితు లనఁబడువారి కుండిన దురవగాహమైన నిష్ప్రయోజన మైన పాండిత్యప్రకర్షముగాని తర్కికమూల మయిన గ్రీకుశాస్త్రతత్త్వ జ్ఞానముగాని లేదు. అతఁడు గ్రంథములను విస్తారముగా చదివినవాఁడు కాకపోయినను చదివిన కొన్ని గ్రంథములను చక్కఁగా గ్రహించి దృఢముగా మనస్సున నాటించుకొనెను. ప్రాఁతనిబంధనమునందలి కీర్తనల (Psalms) లోను దీర్ఘదర్శుల వ్రాఁతలలోను విశేషభాగ మాతనికి ముఖస్థముగా వచ్చును. ఆగ్రంథములలోని నీతిబోధకములును భక్తిప్రదాయకములును నైన యుత్తమవాక్యములు చిన్నతనములోనే యాతనిమనస్సునందు శిలాక్షరములవలె దృఢముగా

లగ్నము లయి ముందు పూనఁబోయెడు మహాకార్యమున కాతని సత్యంతార్హునిఁ జేసెను. బీదతనమును శాంతతతో సహించుటలోను, హృదయాకర్షక మైన సద్వర్తనమును కలిగి యుండుటలోను, స్వప్రయోజనపరులయి వంచకు లయిన మతాచార్యు లుపదేశించు దుర్బోధనల ఖండించుటలోను, ఆతఁడు కొంతవఱకు హిల్లెల్ చూపిన మార్గము ననుసరించెను. గౌరవము కలుగుటకయి పురాతన దీర్ఘదర్శుల పేరులు రచియింపబడిన యాధునికగ్రంథములు కొన్ని యాతనికి చిత్తాహ్లాద కరములుగా నుండెను. వానిలో ముఖ్యముగా డానియల్ పుస్తక మాతనికి ప్రియతమ మయినది.

ఆతనికి యూదమత (Judaism) మొక్కటిదక్క మరియే మతమునుగూర్చియు విశేషముగా తెలియదు. యూదులు ప్రతిమార్చనాదులు లేని యేకేశ్వరారాధనముచేసెడి యాస్తికులు. క్రైస్తవులలో వలె భానువారముగాక వారికి శనివారము విశ్రాంతిదినముగా నుండెను. ఆవిశ్రాంతిదినము శుక్రవారము సూర్యాస్తమానముతో నారంభ మయి శనివారము సూర్యాస్తమానమువఱకు నుండును. యూదుల కది కేవలవిశ్రాంతిదినముగా నుండక మనదేశములోని వైష్ణవులకు హరివాసరము (ఏకాదశి) వలె వ్రతదినముగా కూడ నుండెను. శనివారమునాఁ డెవ్వరును సేపనియుఁ జేయఁగూడదు; నాఁడు వంటసహితము చేసికొనఁగూడదు; శనివారమునాఁడు సాయంకాలము వఱకును కుటుంబమునకు సరిపోవు భోజనపదార్థములనన్నిటిని గృహిణి శుక్రవారమునాఁడు మధ్యాహ్నముననే సంసిద్ధము చేసి యుంచవలెను; విశ్రాంతిదిన మారంభ మగునప్పటి కింట నిప్పు మండుచుండినపక్షమున, ఆఱనీయక యానిప్పును విశ్రాంతిదినము ముగియు వఱకును నుండుచుండునట్లు చేసి కాపాడవలెను; విశ్రాంతిదిన మారంభ

జరుగునప్పటికిని నిప్పు లేనిపక్షమున, ఆదినము కడచువఱకును నిప్పు రగిలింపకూడదు; ఆదినమున నెవ్వరును మూటనుగాని మఱి యేవస్తువునుగాని వహించి వీధిలో పోఁగూడదు; నాఁటికి నియమితమయి యున్న పావుక్రోసుదూరములోనే దక్క వానిని దాఁటి యెవ్వరును నడవఁగూడదు; నాఁ డేవిధమయిన యాటలను పిల్లలుసహిత మాడఁగూడదు. నాఁటిదినమున మనుష్యులు చదువుకొనుటయు మాటాడుకొనుటయు దేవాలయమునకుఁ బోవుటయుఁ దక్క వినోదార్థముగా మఱి యేపనియుఁ జేయఁగూడదు. ఆదినమున దేవాలయమునకుఁ బోవుట యొక్కటిమాత్రమే చిన్న పెద్దల కందఱకును సమానముగా కొంతసంతోషకరముగా నుండుచు వచ్చెను. దేవాలయముయొక్క బహిర్ద్వారము దాఁటగానే లోపల పెట్టబడి యున్న చిన్న పెట్టెలో బీదలకు ధర్మార్థముగా నిచ్చుటకయి యక్కడకుఁ బోయినవారందఱును తమశక్తికొలఁదిని కానుపీసములను వేయుచుందురు. ఆలయమునకుఁ బోయినతరువాత లోపల నిరుప్రక్కలను రెండేసివరుసల యున్న ఆసనములు వేయబడి యుండును. అం దొకప్రక్కను పురుషులును రెండవప్రక్కను స్త్రీలును కూరుచుండురు! ఆలయములో నించుమించుగా మధ్యభాగమునం దున్న వేదికమీఁద నాచార్యుఁడు కూర్చుండుటకయి యొక యగ్రపీఠము వేయఁబడి యుండును. గర్భాలయములో రాత్రిందివములు సదా దీపము వెలుగుచుండును. అక్కడి జనులు విగ్రహారాధకులు కానందున దేవాలయములో విగ్రహములుండవుగాని యొకయఱలో మతగ్రంథములు మాత్రము పెట్టఁబడి యుండును. దేవాలయమును సందర్శింపవచ్చువారు తమపాదుకలను వెలుపలనే విడిచి వట్టికాళ్ళతో చప్పుడు గాకుండ నడిచి లోపలికి వచ్చి కూర్చుచుందురు. యుక్తకాలమున నందఱును సమావేశమయిన

తరువాత నాచార్యుఁడుగాని పాఠకుఁడుగాని లేచిపోయి వేదికమీఁది పీఠము నధిష్ఠింపఁగానే యెల్లవారును లేచి నిలువఁబడి క్షణకాలము తమమనస్సులలో నీశ్వరధ్యానము చేయుదురు. అంతట జనులట్లు నిలువఁబడియుండఁగానే పాఠకుఁడు తాను వ్రాసికొని వచ్చినప్రార్థనము చదువనారంభించును. అతఁడు వాక్యమును ముగించినప్పు డెల్లను జను లేకగ్రీవముగా నడుమనడుమ "తథాస్తు" అని భక్తిపూర్వకముగా పలుకుచుందురు. ఈప్రకారముగా ప్రథమప్రార్థనము ముగిసినతరువాత పాఠకుఁడు హీబ్రూభాషతో ధర్మశాస్త్రములనుండి కొన్ని వాక్యములను చదువఁగా జనులకుఁ దెలియుటకయి యాచార్యుఁడు దానిని దేశభాషలలోనికి భాషాంతరీకరించి చెప్పును. అటుపిమ్మట మరల నొకప్రార్థన జరిగినపిమ్మట మఱియొకసారి దీర్ఘదర్శులపుస్తకములలోనుండి కొన్ని భాగములు చదువఁబడును. అవి సమాప్తినొందినపిమ్మట దేవాలయమునకు వచ్చినవారిలో నొకపండితుఁడు గాని సమర్థుఁ డయినయితరుఁడు గాని యాచార్యునియాజ్ఞను బొంది యొకధర్మోపన్యాసము చేయును. ఆయుపన్యాసాంతమునం దచ్చటివారు లేచి దానిమీఁద ఖండనముగాఁగాని మండనముగాఁగాని తమకుఁ దోఁచినయభిప్రాయమును యథేచ్ఛముగాఁ దెలుప నారంభింపఁగా, ఆయుపాసనామందిర మప్పుడు శాంతిప్రద మైనయీశ్వరోపాసకసమావేశమువలె నుండక పండితగోష్ఠివలె కోలాహలధ్వనితో నిండి పోవును. ఇట్లు వివాదములు జరుగుచున్న సమయమునందు పాఠకుఁడు లేచి ప్రార్థనను చదువుటకు నిలువఁబడఁగానే మరల సర్వమును నిశ్శబ్ద మగును. అంతట పాఠకుఁ డంత్యప్రార్థననుజేసి యాశీర్వదించి యుపాసనమును ముగించును. ఆవల జనులు లేచి యెవరియిండ్లకు వారు పోవుదురు. స్వగ్రామములోని యిటువంటి దేవాలయమునకు జీసస్సు

బాల్యమున తల్లిదండ్రులతోఁ గలిసి తఱుచుగాఁ బోవుచుండెను. ఇట్లాలయమునకుఁ బలుమాఱు పోవుచుండునప్పు డచ్చటి యుపదేశములవలనను భక్తిపరు లయిన వారివర్తనమువలనను జీసస్సుయొక్క మనస్సులో తరుణవయస్సులోనే నిశ్చలమైన యీశ్వరభక్తి నాఁటుకొనుటయేకాక బాహ్యమునకు భక్తవేషములు ధరించి వచ్చెడుదాంభికులనటనలమీఁదను భక్తిహీనములైన యనావశ్యకము లైన కర్మముల మీఁదను కొంతవఱ కాతని కసూయసహిత ముదయించెను.

యూదులు స్వగ్రామములయందలి దేవాలయములలోఁ జేరి యీశ్వరారాధనము చేయుచుండుటయే కాక యేటేట తమపుణ్యస్థలమైన జెరూసలేమునగరమునకు యాత్ర చేయుచుందురు. హిందువులకు కాశీపుర మెట్టి దివ్యస్థలమో యూదులకు జెరూసలేమునగర మట్టి దివ్య క్షేత్రము. పాలస్టీన్ దేశమునకు రాజధాని యైనట్టియు మతమునకు ప్రధానస్థాన మైనట్టియు యూదులక్షేత్రములలోనెల్ల నగ్రగణ్య మైనట్టియు గణన కెక్కిన వారి పూర్వరాజులకు వాసభూమి యైనట్టియు జెరూసలేమునగరమునందు ప్రతిసంవత్సరమును మూడు గొప్పయుత్సవములు జరుగును. ఆయుత్సవముల మూఁటిలో నొక్కటి మిక్కిలి ముఖ్య మయినది. అది మహావైభవముతో ప్రతిసంవత్సరమును చైత్రమాసములో వారముదినము లవిచ్ఛిన్నముగా నడుపఁబడును. వానికి 'ప్యాసోవర్' పండుగని పేరు. ఆమహోత్సవమును జూచుట కయి దేశదేశములనుండి జనులు తండోపతండములుగా యాత్ర పోయి యిసుక చల్లినను క్రింద రాలనట్టుగా పట్టణమునం దంతటను క్రిక్కిఱిసి యుందురు. అప్పు డామహానగరములో స్థలము చాలనందున యాత్రాపరులనిమిత్తమయి పందిళ్ళును పాకలును వేయఁబడును. ఆయుత్సవమునకు తనతల్లితండ్రులతోఁ గలిసి జీసస్సు పన్నెండేండ్ల

పోయి యుండును. నాజరెత్తుగ్రామమునకు జెరూసలేము నగరము మూడుదినముల ప్రయాణములో నున్నది. త్రోవలో దొంగలభయ మధిక మగుటచేత తీర్థయాత్రాపరులు కుటుంబములతో నొంటిగాఁ బోవక సాధారణముగా పలువురుచేరియే యాత్ర చేయుదురు. పండ్రెండుసంవత్సరముల ప్రాయమువ్వా డొకసారి జీసస్ జననీజనకు లతోఁ గూడి జెరూసలేమునగరమునకు యాత్ర చేసెను. ఆపట్టణము నందు గొప్ప దేవాలయ మొకటి గలదు; ఉత్సవదినములలో నక్కడ వేలకొలది మేఁకలను గొఱ్ఱెలను భక్తులు దేవునికి బలియిత్తురు. హింసాకర మయిన యాచోటతనికి ప్రీతికరముగా నుండనందున, అతఁ డచ్చట నుండనొల్లక యాబలిస్థానమును విడిచి దూరముగాఁ బోయి దేవాలయముతోనే చేరి ప్రత్యేకముగా నావరణము చేయఁబడి విద్వాంసులు మతబోధ చేయుటకొఱ కేర్పడి యున్నవిశాలము లైన యాశ్రమములలో నొకదానికిఁ బోయి యక్కడ వారు చేసెడిప్రసంగ ములను శ్రద్ధతో వినఁజొచ్చెను. తత్త్వోపదేశకు లయిన విద్వాంసులు రాబీ లనఁబడు ప్రసిద్ధపండితులు. ఇష్ట మున్నవారందరును బోయి వారు చేసెడి యుపదేశములను విని తమకు సందేహము తోఁచినవిష యములలో నెల్ల యథేచ్ఛముగా ప్రశ్నలు వేసి ధర్మసందేహములను నివారణము చేసికొనవచ్చును. ఉత్సవదినములు గడఁచిపోఁగానే యాత్రాపరు లందఱును మరల బయలుదేరి గుంపులుగుంపులుగా సహవాసులతోఁగూడి తమతమగ్రామములకుఁ బోవుదురు. జోసప్పును మేరీయును తమయూరికిఁ బోవ బయిలుదేఱినప్పుడు జీసస్సు వారికిఁ గనఁబడలేదు. అతఁడు సహవాసులతోఁగలిసి ముందు నడచుచుండఁగా జూచితి నని తోడవచ్చినవారిలో నొకఁడు చెప్పినందున, వారు వాని మాట నమ్మి యుపేక్షచేసి కొడుకుగతి విచారింపకయే దారిసాగిరి.

రాత్రి బస దిగినతరువాతసహితం మతఁడు వచ్చి తల్లిదండ్రులను కలిసి కొనలేదు; ఎంతసేపు ప్రతీక్షించినను వచ్చుజాడ గానరాలేదు. అందుచేత వారప్పుడు భయపడి కుమారుని నిమిత్తమయి సహవాసుల గుడారములకెల్లఁ బోయి వెదకఁ జొచ్చిరి. ఎందు వెదకినను ప్రియపుత్రుఁడు కంటఁ బడలేదు. ఆరాత్రి చీఁకటిలో మరల వెనుకకుఁ బోవుటకును వలనుపడదు. అందుచేత వారా రాత్రి మహావిచారముతో క్షణమొకయుగముగా నెట్లో వేగించి మఱునాఁడు ప్రభాతసమయమున మరల జెరూసలేముమార్గముఁబట్టి బయలుదేఱిరి. నాటిసాయంకాలమునకు వారు జెరూసలేము ప్రవేశించి కొన్నిచోట్ల వెదకి చీఁకటిలో దిరుగలేక మార్గాయాస పడి యుండుటచేత నాటిరాత్రి యొకచోట విశ్రమించి వేకువజామున మరల లేచి మూఁడవనాఁడు పట్టణములో జీసస్సును వెదక నారంభించిరి. ఆమహాపట్టణములో వారు సందులు గొందులు తిరిగి వెదకి యెవరినడిగినను వారికి కుమారునిజాడ తెలియరాలేదు. ఇట్లు తిరిగితిరిగి వేసరి తుదకు వారు దేవాలయమునకు బోఁగా నతఁ డక్కడ విద్వాంసులు చెప్పెడుదాని నాలకించుచు నడుమ నడుమ వారిని ప్రశ్నలు వేయుచుఁ గూరుచుండి కానఁబడెను. అతఁడు కంటఁబడఁగానే తల్లి యపరిమితానందమును బొందినదై మార్గాయాసమునంతను మఱచి చేరువకుఁబోయి "కుమారా! మమ్మిట్లు శ్రమ పెట్టితి వేమి? నీతండ్రియు నేనును నీనిమిత్తమై యెట్లు చింతతో వెదకితిమో చూడు" అని పలికెను. జీసస్సు వింతపడిచూచి "నన్నేల యింత వెదకితిరి? నేను నాతండ్రిగృహములోనే యుందు నని మీ రెఱుఁగరా" అని తోడనే యుత్తరము చెప్పెను. ఆయుత్తరమును బట్టిచూడఁగా తాను కనఁబడకపోయినప్పుడు తనతల్లిదండ్రులు తన్నుఁగా తననిమిత్తము దేవాలయమునకు వత్తురని యతఁడు భావించినట్లు

స్పష్ట మగుచున్నది. ఇంత చిన్నతనములోనే యతని కీశ్వరునియం దెంత యవ్యాజ విశ్వాసము కుదిరినదో! దారితప్పి తన యిహలోక పితను గానలేకపోఁగానే యొకచోటికిఁ బోక యతఁడు తత్క్షణమే పరలోక పితయొక్క యాలయమునకుఁ బోయి తన నిమిత్తమై తల్లి దండ్రు లక్కడకే వెదకుకొనుచు వత్తురన్న సంపూర్ణ విశ్వాసముతో నిశ్చింతముగా నక్కడఁ గూరుచుండెను. అతఁ డాచార్యులు కర్మలను పూజలను జేయుస్థలములకుఁ బోక విద్వాంసులు ధర్మోపన్యాసములు చేయుచోటికిఁ బోయి తదేకాసక్తితోఁ గూర్చుండుట యాలోచించి చూడఁగా, ఆతని మనస్సులో నంతటి బాల్యకాలమునందే భక్తిలేని బాహ్యకర్మలమీఁద ననాదరమును నిర్మల మైన ధర్మాచరణము మీఁద ఘనాదరమును దృఢపడినట్లు స్ఫురించుచున్నది. అంతటఁ దల్లి దండ్రు లాబాలుని వెంటఁబెట్టుకొని స్వగ్రామమునకుఁ గొనిపోయిరి.

అతనికి పదుమూఁడు సంవత్సరములు దాటినది మొదలుకొని దాదాపుగా ముప్పది సంవత్సరములు వచ్చువఱకును జరగిన వృత్తాంతమును దెలిపెడు విశ్వాసపాత్ర మైన చరిత్రమేదియుఁ గానరాదు. ఆకాలమునం దతఁ డెక్కడెక్కడ సంచరించెనో, ఏయేగ్రంథముల జదివెనో, ఎవ్వరెవ్వరితో మైత్రిచేసెనో, ఏయేవిషయములయం దెంతెంత యభివృద్ధినొందెనో, ఏయేపనులు చేసెనో, అదియుంతయు మన కిప్పుడు పరమరహస్యముగా నున్నది. పాలీభాషలో వ్రాయఁబడిన క్రీస్తుచరిత్రముయొక్క పురాతన మైన వ్రాఁతప్రతియొకటి టిబెటీయ దేశములోని యొకబౌద్ధమఠములో క్రొత్తగా లభించినట్టు కొన్ని వార్తాపత్రికలలో నీనడుమఁ బ్రకటింపఁబడినది. అది నిజముగా పూర్వకాలమునందే రచియింపఁబడినగ్రంథమో, లేక పుస్తకమునకు గౌరవాధిక్యము కలిగింపవలె నన్న యుద్దేశముతో నవీను లెవ్వరిచేతనైన ప్రాచీన

మనుభ్రమ కలుగునట్లు నూతనముగా సృష్టింపఁబడిన గ్రంథమో, సునిశ్చిత మగువఱకును తద్గ్రంథమునందు జెప్పఁబడిన విషయములను మనమింతవఱకును నమ్మవచ్చు నని నిర్ధారణము చేయఁజాలము. అయినను తద్గ్రంథముయొక్క సత్యాసత్యనిర్ణయమును దీనిం జదువు వారిబుద్ధికే విడిచిపెట్టి, అందలి ముఖ్యాంశముల నీవఱకుఁ బ్రకటింప బడినరీతిగా నక్కడ సంక్షిప్తముగాఁ దెలుపుచున్నాను. దేశసంచారార్థము బైలుదేఱిన 'నికొలస్‌నోటోవిష్' అను రషియా దేశస్థుఁడొకఁడు హిమాలయపర్వతముల కుత్తరమునందున్న టిబెటీయదేశములో ప్రయాణముచేయుచు నొకమఠములో బౌద్ధులిస్సా యను నొకదీర్ఘదర్శిసెఱిఁగి గౌరవించుచున్నారనియు, ఆయిస్సాయే జీసస్ క్రైస్తనియు వినెనఁట! అతఁ డంతటితోఁ దృప్తినొంది యూరకుండక యట్టిచరిత్ర మొకటి యున్నయెడల తప్పక సంపాదింపవలయు నని నిశ్చయించుకొని, ఇస్సాయొక్క చరిత్ర మెక్కడ లభించు నని బౌద్ధాచార్యుల నడుగుచు రాఁగా వారిలో నొకఁ డాగ్రంథము లాడక్ మండలములో లభించు నని చెప్పెనఁట! తత్క్షణమే యతఁడు లాడక్ మండలమునకుఁ బోయి విచారించి, లేనగరమునందలి హేమిస్ మఠములో గ్రంథమున్న దని తెలిసికొని, బహుప్రయత్నములు చేసి మొదట విఫలమనోరథుఁడై తుదకాపుస్తకము నక్కడి మఠాచార్యుని వలనఁ బొంది, ద్విభాషి యొకఁడు దానిని జదివి యర్థముచెప్పుచు రాఁగా నతఁడు స్వభాషలోనికి దానిని భాషాంతరీకరించుకొనెనఁట. అందలిసారాంశ మిది:— "ఇస్సా యిస్రాయెల్ దేశమునందు జననమొందెను. అతని తల్లిదండ్రులు బీదలు. వారిపూర్వులు తమ్ముశోధించుటకై యీశ్వరుఁడు తమ కనుగ్రహించిన కష్టములనిమిత్తమై సృష్టికర్తకు కృతజ్ఞతాపూర్వకము లైన వందనము లర్పించుచు

భూమిమీఁద నీశ్వరమహిమను నర్థిలఁ జేయుటకయి తనపూర్వపుగొప్ప తనమును మఱచిన మహామహుఁడైన భక్తాగ్రేసరుఁడు. ఆతఁడు చిన్నతనము నుండియు నీశ్వరుఁ డొక్కఁడని బోధించుచు వచ్చెను. పదమూఁడు సంవత్సరములప్రాయమున వచ్చిన తరువాత దేశాచారానుసారముగా వివాహమునకై యత్నింపఁ దన తండ్రియిల్లు విడిచి పాఱిపోయి వణిజులతోఁ గలిసి సింధుదేశమునకుఁ బోయెను. పదునాలుగు సంవత్సరముల ప్రాయమప్పు డతఁడు తా నార్యులమధ్య నుండెను. జగన్నాథము, రాజగృహము, వారణాశి, మొదలగు క్షేత్రములకుఁ బోయి యతఁ డక్కడ వేదాధ్యయనము చేసి వేదార్థమును గ్రహింపఁ నేర్చెను. కాని యతఁడు వేదములయొక్క యీశ్వరకర్తృత్వమును పరబ్రహ్మముయొక్క యవతారసద్భావమును నిరాకరించి బ్రాహ్మణులతో ప్రబలవిరోధము పెట్టుకొనెను. అందుచేత భీమ్మపురములో శ్వేతాచార్యు లాతని ప్రాణములు కెగ్గువలఁచిరి. అతఁడక్కడనుండి తప్పించుకొనిపోయి గౌతమమతస్థుల మఱుఁగు చొచ్చి, పాళీభాషను నేర్చుకొని, ఆఱుమాసములలో పరిశుద్ధ బౌద్ధమతరహస్యములను గ్రహించెను. అతఁ డక్కడనుండి విగ్రహారాధనమునకు ప్రతికూలముగా బోధచేయుచు పశ్చిమదిక్కునకు వెడలిపోయెను. పారసీక దేశములో జోరాష్టర్ మతగ్రంథములకు విరోధముగా జనులకు బోధించి, మాంత్రికులచే బాధింపఁబడి యక్కడనుండి పాఱిపోయెను. జూడియా దేశమునకు మరలఁ బోవునప్పటి కతనికి వయస్సిరువదితొమ్మిదిసంవత్సరములు. స్వదేశము చేరఁగానే యతఁడు మతబోధ కారంభము చేసెనుగాని యతనిజనానురాగము శీఘ్రకాలములోనే పాంటియస్ పైలేటు యొక్క హృదయములో భయమును పుట్టించెను. ఇస్సాను విమర్శించుటకయి పైలేటు మతాచార్యులను పండితులను రావించి

సభకూర్చెను. ఆసభవారు విచారణచేసి, ఇతఁడు నిర్దోషి యని నిర్ధారణము చేసిరి. నీజనుకు విధేయు లయి యుండవలయుట, స్త్రీలయెడల గౌరవము చూపవలయుట లోనుగాఁగల విషయములనుగూడ చేర్చి యిస్సా విరామములేక జనులకు మతబోధలు చేయుచునే యుండెను. కాని యాతని వర్తనమును కనిపెట్టి పరీక్షించి తెలుపుచుండుటకై నియమింపఁబడిన చారులు మూఁకలయొక్క యుత్సాహమును మతోన్మాదముగను జూచి యాతనివిషయమై వ్యాదనాభేదకములైన కథలను తమ ప్రభువునకుఁ బంపిరి. అంతమీఁద నాదేశపాలకుఁడు యిస్సాను చెఱసాలలోఁ బెట్టించి, బహుబాధలుపెట్టి, ఇద్దఱు దొంగలతోఁ గలిపి న్యాయసభ యెదుటికి విచారణకుఁ దెచ్చెను. ఈసారి లంచములు గైకొన్న తప్పు సాక్షులు తీసుకొని రాఁబడిరి. పై లేటు సాక్షులను పిలువగానే యాతనియాజ్ఞచేత వా రిస్సానయిని ద్రోహమున కొడిగట్టిరి. అం దొకఁడు ముందుకు వచ్చి యిస్సా నుద్దేశించి 'జనులను సన్మార్గమునకు [illegible] పరలోకప్రభువు నిన్నుఁ బంపె నని పలుకుచు నీ విస్రాయీలకు రాజవయినట్లు చెప్పలేదా?' అని యడిగెను. అప్పు డిస్సా వాని నాశీర్వదించి "నీ విప్పుడు చెప్పునది నీహృదయములో నుండి వచ్చునది కాదు. కాఁబట్టి నీవు క్షమింపఁబడుదువు." అని పలికి పై లేటువంకఁ దిరిగి 'ఇట్టి యసత్యముల సహాయ మక్కఱలేకయే నిరపరాధులను దండింపఁగలశక్తి నీయొద్ద నుండఁగా, నీగర్వమును గడఁగాడి యీ [illegible] వారి కసత్యములతో జీవనము చేయున ట్లేల [illegible]?' అని పలికెను. ఈమాటలు దేశపాలకుఁడు దురాగ్రహావేశము [illegible], యిద్దఱుదొంగలనువిడిచి యిస్సాకు మరణశిక్ష విధించున ట్లుత్తరవు చేసెను. అప్పుడు ధర్మాధికారులు తమలో నాలోచించుకొని 'ధర్మశాస్త్రవిరుద్ధముగా నిద్దఱు తస్కరు

లను పిడిచిపెట్టి నిరపరాధికి శిక్షవిధించెడి ఘోరమైన మీ పాపకృత్యమునకు మేము మొడఁబడనేరము. కాఁబట్టి యీవిషయమున నీయిచ్ఛవచ్చినట్లు నీవే చేయుము' అని పైలేఖతో ఖండితముగాఁ జెప్పిరి. ఈప్రకారము వారు పలుకుచును మహాచార్యులును, ధర్మాధికారులును, 'ఈనిరపరాధియొక్క వధవిషయమై మే మెంతమాత్రమును దోషలము కాము' అని తమచేతుల నొకపవిత్రపాత్రములో కడుగుకొని సభవిడిచి లేచిపోయిరి. ఇస్సాను దొంగలను తరువాత ద్రూనిపైఁ బెట్టి మేకులు గొట్టి చంపిరి. ఇస్సాయొక్క సమాధి మూఁడవనాఁడు తెలియఁబడి పట్టణిగా నుండెను." *



* ఈపుస్తకము కేవలకల్పితమనియు, టిబెత్తీయదేశములోను బౌద్ధమతమునందును నిట్టిపుస్తక మెన్నడును లేనట్టు నిశ్చయముగాఁ దెలియవచ్చిన దనియు మాక్సుమూలరు మొదలయినవారు దృఢముగాఁ జెప్పుచున్నారు.

## రెండవ ప్రకరణము.

••••O••••

### తత్కాలదేశస్థితి.

చిరకాలమునుండి స్వదేశరాజుల పాలనములో నున్న పాలస్టీన్ దేశమును రోమకసేనానాయకుఁడైన పాంపియసను వాఁడు క్రొత్తగా జయించి క్రీస్తుశకమునకు పూర్వము 63 వ సంవత్సరమునందు దానిని రోమకరాజ్యముక్రిందఁ జేర్చెను. అటుతరువాత సుమారు 40 సంవత్సరములకు రోమకచక్రవర్తియైన జూలియస్‌సీజరు హేరా డనునతని నా దేశమునకు రాజునుగా నియమించెను. రోమకచక్రవర్తులు జనులిష్టపడినవారినిగాక తమకునునచ్చినవారినే దేశపరిపాలనమునకు నియమించుచు వచ్చిరి. యూదులు సామాన్యముగా స్వదేశాభిమానము గలవారై నందున, అన్యదేశరాజులకు లోఁబడి పడుచుకొనుటయే వారి కనిష్టముగా నుండెను; అదియుఁగాక హేరాడ్ స్వజాతివాఁడు గాక రాజవంశస్థుఁడు కాక హీనకులుఁడై నందునను దుష్టవర్తనుఁడై నందునను జను లాతని పై నెక్కు ద్వేషించుచుండిరి. ఆతఁడు ప్రజానురాగము లేనివాఁడయినను చిరకాలము రాజ్యము చేసి ఘనుఁడని బిరుదంది జీసస్ జనన మొందిన సంవత్సరమునందే పరమపదము నొందెను. ఆతఁడు జెరూసలేము నగరమునందు జీర్ణమగుచుండిన దేవాలయమును పునరుద్ధారణము చేసి, దాని నావఱకెన్నఁడును లేనియున్నతస్థితికిఁ దెచ్చుటచేతను బహుకాలమునుండి యెల్లెడలను నిండియుండిన దొంగలను రూపుమాపి రాజ్యమును సురక్షితముగాఁ జేయుటచేతను ఘనుఁడని పేరొందినను, ఆతని క్రూరస్వభావము నుబట్టి తా నావఱకుఁ జేసిన క్రూరకృత్యములను కప్పిపుచ్చి

యుత్తరులను మోసపుచ్చుట కయి యీమంచికార్యములను జేసెనే కాని సదుద్దేశముతోఁ జేయలేదని భావించి జనులాతని యెడ విశ్వాసము వహింప రయిరి. అతఁడు చేయుచు వచ్చిన దారుణకర్మములకు తాళఁజాలక పలుమాఱు జను లాతనిమీఁద తిరుగఁబడి కలహించుచు వచ్చిరిగాని యతఁ డప్రమత్తుఁ డయి తలయెత్తఁగానే యుక్తసమయమునందు కనిపెట్టి పందలకోలఁది కలహాకారులను నిర్దయుఁ డయి వధించియు హతశేషులను క్రూరదండనపాలు జేయించియు కలహముల నడఁచుచు వచ్చెను. అందుచేత ప్రజలాతని భారకు తాళలేక తల్లడిల్లఁ జొచ్చిరి. రాజ్యకాంక్షచే తాను జేసికొన్న భార్యను, తాను గన్నకొడుకులను, సంహరించిన కఠినచిత్తుఁడు పరులవిషయమున నెఁక నెట్టి క్రూరకృత్యములను జేయ సాహసింపఁడు! ఆతఁడు రాజద్రోహము తలఁచి రన్న హేతువుచేత చేతులార ముగ్గురుకొడుకులను జంపించెను. ఈక్రూరకార్యము లిట్లుండఁగా నతఁడు తాను కట్టించిన దేవాలయములలో నెల్ల రోమకచక్రవర్తిని కొలుచున ట్లుత్తరువు చేసెను. ఈశ్వరుని కొక్కనికే చెందవలసిన యీయారాధనమును మనుష్యున కర్పించుట ఘోరపాతకముగా భావించువా రయినందున యూదుల కీయనాలోచితకార్యముచేత నాతనిమీఁద మఱింత ద్వేషము పుట్టెను. అట్టి జనగర్హితునకు సుతులయి పుట్టినవారిమీఁద జను లనురాగము గలవా రయియుండుట సాధారణముగా సంభవింపదుగదా! ఆఘనుని మరణానంతరమున తండ్రివాతఁబడక బ్రతికిన కొడుకులు ముగ్గురును రాజ్యభాగముల నిమిత్తము తమలోఁ దాము తగవులాడి రోమకచక్రవర్తికి విన్నపములు పంపుకొనిరి. ఆచక్రవర్తి వారితండ్రి కోరికప్రకారముగా జెరూసలేమునగరమును గలిగి యున్న జూడియా యను నుత్తరమండలమును సమేరియామండలమును జ్యేష్ఠపుత్రుఁ డయిన యార్కి-

లానసునకును, జీసస్ వాసముచేయుచుండిన గాలిలీ యనుదక్షిణమండలమును పెరియా మండలమును ద్వితీయపుత్రుఁ డయిన హీరాడ్ ఆంటిపస్సునకును, మఱియొక మండలమును కనిష్ఠపుత్రుఁ డయిన ఫిలిప్పునకును, దేశమును మూఁడు భాగములుగా భాగించి యిచ్చి ముగ్గురు సోదరులను మూఁడు సీమలకు రాజులను జేసెను. ఈక్రొత్త రాజులు సర్వస్వతంత్రులుగాక రోమకచక్రవర్తికి లోఁబడినవారయి మనదేశమునం దిప్పుడు శ్రీమహారాజ్ఞిగారియధికారమునకు లోఁబడి యున్న మహీసూరుమహారాజు మొదలయిన సంస్థానాధిపతులవలె రక్షితరాజులుగా నుండిరి. జీసస్ జీవితకాలములో నెల్లను గాలిలీ దేశమునకు హీరాడ్ ఆంటిపస్సే రాజుగా నుండెను. అతఁడు రోమకచక్రవర్తియెడల భయభక్తులు చూపుచు జనులయెడ దయాశూన్యుఁ డయి ప్రవర్తించువాఁ డయినందున ప్రజ లాతనిక్రౌర్యమునకు భయపడి పయికి లోఁబడియున్నను లోపల నాతని ద్వేషించుచుండిరి; అతని గూర్చి దుర్వార్తలేగాని యెక్కడవిన్నను మంచికథ యొక్కటియు నతనివిషయమున జీసస్సునకు చెవిసోఁకలేదు. అతఁడు కాపట్యమునకు పేరుపడినవాఁ డగుటచేత తరువాత జీసస్సతనికి జంబుక మని పేరు పెట్టెను.

అతనిసోదరుఁ డయిన యార్కిలాస్ సంతకంటెను జనకంటకుఁ డయి యనేకదౌర్జన్యములు చేయుచుండఁగా జను లాతనిమీఁద కలహించి పలుమాఱు దేశక్షోభములు కలిగించుచువచ్చినందున, రోమక చక్రవర్తి యతనిని సింహాసనవిహీనునిగాఁ జేసి యాతనిస్థానమున మఱియొకనిని పాలకునిగా నియమించెను. ఇట్లుకొందఱు పరిపాలకులు మాఱినతరువాత పాంటియస్ పైలేట్ అనునతఁడు జూడియా దేశమునకు ప్రభువయ్యెను. ఈవిధముగా వచ్చినరోమకపరిపాలకు లందఱును

దేశములో తమ యధికారమును సురక్షితము చేసికొనుట కయి తమ తోడఁగూడ స్వదేశమునుండి రోమకభటులను దీసికొనివచ్చి రోమక రాజచిహ్న మయిన స్వర్ణవికార మగు పక్షిరాజవిగ్రహములు రజత మయ మయిన రోమకచక్రవర్తి రూపమును గల పతాకములను వారి చేత వహింపించుచుండిరి. రోమను లాధ్వజములమీఁది విగ్రహముల కీశ్వరుని కర్పించెడు పూజలను జేయుట యాచారము. యూదులు విగ్రహారాధనమును ద్వేషించువా రయినందున, నా రాధ్వజపటము లను తమ పుణ్యస్థల మయిన జెరూసలేమునగరమునకుఁ దీసికొని రానీకుండిరి. అందుచేత రోమకసైనికు లాధ్వజములను తాము దిగెడు సముద్రతీరపట్టణములలో విడిచి వచ్చుచుందురు. ఇట్లు జరుగుచుండగా సైలేటు పరిపాలకుఁ డయినతరువాత పూర్వాచారవిరుద్ధముగా నొక నారి యాపతాకములను రాత్రివేళ, జెరూసలేము నగరమునకుఁ దెప్పించెను. మఱునాఁటి యుదయకాలమునందు ధ్వజపటములు కంటఁబడఁగానే పురజనులలో గొప్ప సంక్షోభము పుట్టెను. అప్పు డసంఖ్యాకు లయిన జనులు గుంపుగూడి సైలేటుగృహమునకుఁ బోయి యాధ్వజపటములను తమ పట్టణమునుండి పంపివేయవలసిన దని మొఱ్ఱపెట్టుకొనుట కయి యాతనిదర్శన మపేక్షించి వేచియుండిరి. ఆతఁడు వారి మొఱ్ఱలాలింపక నా రయి దహోరాత్రములు తన గుమ్మమువద్ద వేచియున్న తరువాత సభాభవనమునకు రావలసిన దని వారికి వర్తమానము పంపెను. తత్క్షణమే జను లతఁడు తమ ప్రార్థన నంగీకరించు నని భ్రమపడి యతఁ డాజ్ఞాపించినట్లు చేసిరి. కాని యతఁ డంతకుముందే సభాస్థానమునంతను ఆయుధపాణు లయిన సైనికులతో నింపివేసి, గొఱ్ఱెలమందను వలె నిరాయుధు లయి వచ్చిన జనులను దొడ్డిని పెట్టిన తరువాత కత్తులను దూసికొనియున్న వీరభటులను

లోపలికిరప్పించి, తమపూనికను విడిచి యుండ్లపు తిన్నఁగా నడువని పక్షమున, నొక్కసారిగా జనుల నందఱిని జంపించెద నని బెదరించెను. వారా ధిక్కారమును కఱుసుఁ జిత్తమును జంకక ధైర్యముతో నిలువఁబడి, తాము ప్రాణములు నయినఁ బోఁగొట్టుకొందుము గాని యీశ్వరద్రోహాకర మయిన విగ్రహారాధనమును గొనఁబడనేర మని యేకవాక్యముగాఁ బలుకుచు సంఘమురణమునకు నొప్పుకొని సాగిలపడి, తమ యుంపఱికి తలలను నఱికింపవచ్చు నని మొఱ లిడిరి. అంతట పైలేటు వారి ధైర్యస్థైర్యములు నచ్చుకొనఁబడి తన పట్టుదలను విడిచి ధ్వజపటములను పట్టణముయొక్క బాహ్యప్రదేశమునకుఁ గొనిపోవున ట్లుత్తరువు చేసి పౌరులను బంపివేసెను. ఆకాలమునం దీపరిపాలకులపయి నధికారము చెల్లించుచు రోమాపురమునందు టైబిరియ స్సనునతఁడు చక్రవర్తిగా నుండెను. వీరి పేరులనే జీసస్సు తెలుచుగా వినుచుండెను. రోమకచక్రవర్తిచేత నియమింపఁబడిన పరిపాలకు లందఱును సామాన్యముగా క్రూరు లయి జనుల కొత్తుడు కలుగఁజేయుచుండిరి; ఆయుష్టాధికారులు జనులనుండి సాధ్యమయినంత యెక్కువవన్ను నాకర్షించుటయే తమపనిగా భావించుచుండిరి కాని దేశక్షేమనిమిత్తము పాటుపడుట తమయుద్యోగకృత్య మని లేశమును చింతింపకుండిరి. జనులు మనస్సులో వారిని ద్వేషించు చుండినను దుర్బలు లయినందున వారిసైనికులను దండించు నేమియుఁ జేయనేరక ప్రజ్వరిల్లుచున్న క్రోధాగ్నిని మ్రింగి తమ ద్వేషమును లోలోపలనే యడఁచుకొనిపయికి శాంతులవలె లోఁబడి నడచుకొనుచుండిరి. అయినను సాహసికు లయిన దుడుకువారు కొందఱ అప్పుడప్పుడు తిరుగఁబడి కలహకారులయి ప్రాణములకు తెగించి సంక్షోభము కలిగించుచు వచ్చిరి.

అట్టివారు దేశాభిమానముచేఁ జేయుచువచ్చిన కృషి నిష్ఫలము లగుటయే కాక యందువలన ననేకానర్థములును ప్రాణహానియుఁ గలుగుచు వచ్చెను. తనదేశముయొక్క స్వాతంత్ర్యమును మరల స్థాపింపఁగోరి గాలిలీదేశస్థుఁ డయిన జూడ స్సనువాఁడు దేశాభిమానమానసీయు లయిన వేగిరకాంద్రను వెంటఁజేర్చుకొని ధైర్యముతో పోరాడి పరాజితుఁ డగుటయు, తన్మూలమున దేశస్వాతంత్ర్యము నణుమాత్రమును సాధింపలేకపోవుటయే కాక నిష్కారణముగా రక్తప్రవాహములు కట్టించి దేశాభిమానుల ప్రాణములను గోలుపోవలసి వచ్చుటయు మొదలుగాఁ గల కథలను చిన్నతనములో జీనస్ వేమాఱు విని యుండును. స్వచ్ఛందవృత్తి ననుభవించి బ్రతికినతము కితరులకు లోఁబడి వారికి దాసు లయి యుండవలసినగతి పట్టుటచేతను, ప్రజాపీడ కలుగు నట్లుగా దుష్టు లయిన పాలకులను తమదేశము నేలనిచ్చిన పాపమున కయి భగవంతుఁడు తమ్ము శిక్షించుచున్న భీతిచేతను, పరిపాలకులు బీద సాద యని చూడక బాధించి తమవద్ద పన్ను లధికముగాఁ గొనుచుండుటనుబట్టి వారు తమ్ము క్రమముగా దోఁచుకొను చున్నారని దృఢముగా నమ్మి యుండుటచేతను, రోమనులమీఁద ప్రజల కంతటి విద్వేషము కలిగెను. జనుల కతృప్తికర మయిన యీపన్నులను తండెడి పని స్వదేశస్థు లయిన సుంకరులయం దుంచఁబడెను. అందుచేత జనులు వారి నధికపాపాత్ములనుగా భావించి, రోమనులకంటెను సుంకరుల నధికముగా గర్హించుచుండిరి. ఇటువంటి సమయములో నెల్లవారును తమ్మట్లన్యాయముగా బాధించుచున్న క్రూరకర్ముల హస్తముల నుండి విడిపించి రక్షించుట కయి సర్వరక్షకుఁ డయిన యీశ్వరుఁ డొక్కరక్షకునిశీఘ్రముగాఁ బంపకమానఁ డని యాశపడి నిరీక్షించుట వింతగాదు.

దేశముయొక్క రాజ్యాంగస్థితి నింతట విడిచిపెట్టి యించుక నేను

ప్రజాంగస్థితికి వర్తమము. ఇట్లు ప్రభువులు ప్రజాపీడకు లయి యుండఁగా, ప్రజలును తమలో నైకమత్యము లేనివా రయి యంతశ్ఛిద్రములలో మునిఁగి యుండిరి. స్వదేశీయులే దేశభావము లేనివారయి రోమక మాటమీఁద నడచుకొనువా రయిన పక్షమును, విదేశీయు లయిన రోమనులకు వారిని విధేయులనుగాఁ జేసికొని నిరంకుశాధికారము చెల్లించుట దుర్భర మయి యుండును. జనులలోఁ గల పలుతెగలవారు పరస్పరస్పర్థ గలవా రయి రోమనులను ద్వేషించునట్లే తమలోఁ దమ్మును ద్వేషించుకొనుచుండిరి. ఆకాలమునం దచ్చటి జనులను ముఖ్యముగా మూఁడుభాగములుగా విభజింపవచ్చును. వారిలో ప్రముఖులు సద్దూకీ లనఁబడువారు. యూదులలో వారు ప్రభుజాతివారు; వారు తాము ప్రాచీనప్రభుసంతతివార మని గర్వించుచు జనులతోఁ గలసిమెలసి యుండకుండిరి. వారే యించుమించుగా నెల్లదేవాలయములకు నధికారు లయి ధర్మకర్తలుగా నుండిరి. వారు మహాకులీనులును ధనసంపన్నులు నయి రోమనుల కనుకూలురుగా నుండిరి. నిజముగా వారు హృదయములలో రోమనులమీఁద ప్రేమగలవారు కాకపోయినను, స్వలాభము నపేక్షించి కాలోచితముగా వారియెడల మిత్రభావమును వహించి యుండిరి. రోమనులును వారినే దేశములోని యధికారపదములయందు నియోగించుచుండిరి. వారు జనసమ్మతులు కానందున జనులకే రాజ్యస్వాతంత్ర్యము లభింపఁ దటస్థించిన పక్షమున వారికి నియోగము లుండవు. వారికి పూర్వనిబంధములోని లిఖితధర్మములుమాత్రమే ప్రమాణములు; వారికి పరలోకజీవనమునందు విశ్వాసము లేదు.

ఫారిసీ లనుమఱియొక తెగవారు సంఖ్యయం దధికు లగుటచేత దేశమున ప్రబలులుగాను జనులలో మాటచెల్లుబడి కలవారుగాను

నుండిరి. జీసస్ కాలమునందు కొక్కకు వారు వేలుమాత్రమే యుండినను, వారిపక్ష మవలంబించినవారు బహుసహస్రసంఖ్యాకు లుండిరి. వారు తాము జనసామాన్యమునకంటె నధికులమనియు పరిశుద్ధుల మనియు భావించుకొనుచు సదా తాము నైష్ఠికత్వమును కాపాడుకొనుటకు పాటుపడుచుండిరి. సద్దూసీలకు పూర్వనిబంధన మొక్కటితక్క ప్రమాణాంతరము లేదు; ఫారసీలకు పూర్వనిబంధనముమాత్రమే కాక యైతిహ్యములును రాబ్బీ లనబడు గురుపరంపర నుండి వచ్చుచున్న సంప్రదాయములును గూడ సమప్రమాణములు. ఐతిహ్యము లాదికాలమునం దీశ్వరముఖమున వెలువడి పారంపర్యముగా వచ్చుచున్నవని వారికి నమ్మకము. వారి వంశపరంపరాగత పూర్వసంప్రదాయములలో మంచివి కొన్ని యున్నను, అనేకము లసంగతము లైనవి. వారి యైతిహ్యధర్మములలో రాత్రులు దీపము లెట్లు వెలిగింపవలయునో వెలిగించినదీపముల నెట్లు కాపాడవలయునో మొదలయిన యల్పాంశములనుగూర్చి కూడ సూక్ష్మము లయిన విధు లుండెను; ఆవిధులను మీఱుట వేఱువిధముగా దీపము వెలిగించుట సహితము వారిలో గొప్పపాపకార్యము, ఆహారవిషయముననను, వస్త్రధారణవిషయముననను, దేహయాత్ర విషయమునను వారికి సంప్రదాయసిద్ధము లైన యనావశ్యకాచారములు పెక్కు లుండెను; అనంతము లైన యీయాచారములలో సూక్ష్మాతిసూక్ష్మ మయిన యొక్క విధి నతిక్రమించి నడిచినను పాపము వచ్చి చుట్టుకొనునని వారి సిద్ధాంత మయినందున వారు బాహ్యకర్మల ననుష్ఠించుటలో మహాశ్రద్ధాళువులై యుండిరి. ఈకర్మరతులు నీతిని న్యాయమును విడిచినను కర్మానుష్ఠానమును విడువకుండిరి. ఇట్లుతఱుచుగా నుపవాసవ్రతములు చేయుచు నిష్ఠాగరిష్ఠుల మనుకొనెడి యీఫారసీలు మతోన్మత్తులయిన

మన దేశపు బ్రాహ్మణోత్తములవలెనే లోకములో తాము మాత్రమే పవిత్రుల మనియు నితరు లందఱును కర్మబాహ్యులైన యపవిత్రులనియు నెన్నికొని సంతోషపడుచుండిరి. ఇట్టి ధర్మిష్ఠతను జూచి యనుష్ఠానపరు లని పామరజనులు వారియెడల నత్యంతగౌరవము కలవారై భక్తి చూపుచుండిరి. ఫారిసీలలో తమయనుష్ఠానముల యందు సంపూర్ణవిశ్వాసము గలవారై శుద్ధహృదయములతోనే కర్మలాచరించుచుండువారు కొందఱుండిరికాని పెక్కండ్రు వేషధారులై జనుల మెప్పుకొఱకు పయికి కర్మిష్ఠులైన మహర్షులవలె నటించుచు తమ్ముతరులు భక్తులనుకొనుటకయి వీధులచివరలను నిలువఁబడి దీర్ఘప్రార్థనలు చేయుదాంభికులుగా నుండిరి. ఇట్టివారు బాహ్యమునకు నిష్ఠాపరులవలెఁ గనఁబడినను లోపల స్వప్రయోజనపరులును దుష్టులునునై నిజముగా పారమార్థికచింత లేని నికృష్టులుగా నుండిరి. సద్దూసీలు ఫారసీలను వంచకు లని యాక్షేపించి వారియాచారములను పరిహసించుచుండిరి. ఫారిసీలు సద్దూసీలను కర్మభ్రష్టులైన నాస్తికులని దూషించుచు వారు రోమనులపక్షమున నుండుట యాధారము చేసికొని జనులకు వారిమీఁద ద్వేషాగ్ని రగులుకొల్పుచుండిరి. ఇది గాక యీయిరుతెగలవారికిని పరస్పరద్వేషకారణ మింకొకటి కలదు. ఫారిసీలు పరలోకజీవనమునందు విశ్వాసము కలవారు; సద్దూసీలట్టి విశ్వాసము లేనివారు. అందుచేత పరలోకజీవనవిషయమయి యీ రెండు తెగలవారికిని తఱచుగా వివాదములు సంభవించుచుండెను. పరలోకసుఖ మపేక్షించి ప్రవర్తింపనిపక్షమున నిహలోకవర్తనము శుద్ధముగా నుండ దని ఫారిసీలు వాదించుచుండిరి; సందిగ్ధ మయినపరలోకసుఖవాంఛను దగిలి యిహలోకకృత్యముల నుపేక్షింతురని సద్దూసీలు వాదించుచుండిరి. ఈవివాదములలో దురాగ్రహావేశముచేత నుభయు

పక్షములవారును వాదాంశమును విడిచి యొండొరులను దూషించుచు ద్వేషించుచు ఒకరియం దొకరు లేని దోషముల నారోపించుచు శుష్క కలహములతో కాలక్షేపము చేయుచుండిరి. ఫారిసీలలో నాయకులుగా నుండువారు లేఖకు లనియు, సద్దూసీలలో నాయకులుగా నుండువా రాచార్యు లనియు, పిలువబడు చుండిరి. ఎట్టితక్కువయింట బుట్టినవాఁ డయినను తనవిద్యాసామర్థ్యాదులవలన లేఖక పదమును బొందవచ్చునుగాని యాచార్యపదమునుమాత్ర మొక్కసత్కుల ప్రసూనతవలనఁ దక్క పూర్గాంకురమునఁ బొందుటకు శక్యము కాదు. లేఖకపదమును బొందఁగోరు ప్రతిపురుషుఁడును జెరూసలేము నగరమునకుఁ బోయి యక్కడ ధర్మశాస్త్రాభ్యాసము చేయవలెను. అట్లు చిరకాల మక్కడ గురుశుశ్రూష చేయుచు నధ్యయనము చేసిన తరువాత నాతనికి లేఖకపట్ట మియ్యఁబడును. ఆకాలమునందు ముద్రాయంత్రములు లేనందున సమస్త పుస్తకములును చేతులతో వ్రాయవలసినదే. మతగ్రంథములను నిర్దుష్టముగా లిఖించువారగుటచేత వారికి లేఖకు లన్న నామము వచ్చినది. ఈలేఖకులలో మిక్కిలి ప్రసిద్ధు లయినవారు రాబ్బీ లనఁబడు చుండిరి. ఆపదమునకు విద్వాంసులని యర్థము.

ఈరెండు తెగలవారును గాక యాదేశమునం దప్పాడెస్సీనులని చెప్పఁబడెడు మఱియొక తెగవారుకూడ నుండిరి. జీసస్ కాలమునందు వారి సంఖ్య నాలుగువేలకంటె నధికముగా నుండెను. వా రించుమించుగా మనదేశములోని సన్యాసులను బోలినవారు. వారు మతములయం దనేకులు గుమికూడి యుండి సాముదాయక స్వత్వమును విభాగములు లేక యేకముగా ననుభవించుచుండిరి. వారు లౌకిక వ్యాపారములయందుఁ బ్రవేశింపరు. ఫారిసీలవలెనే తమకు నియమి

తము లయి యున్నకర్మలను శ్రద్ధాభక్తులతో నాచరింతురు. వారు మొత్తముమీద దయార్ద్ర హృదయులును మంచివారును నయి యుండిరి. వారు మాంసభక్షణము ద్రాక్షారసపానమును వర్జించి నియతాహారులై యుండిరి. వారు రాజ్యాంగవిషయములలో జనులతో జేరక పోవుటచేతను యుద్ధములను నాశిష్యులయందలి మోసములను నిందించువారగుటచేతను, జనులు వారి చర్యలు సరిపడవు. ఫారిసీలవలె వీరు పరలోక జీవనమును నమ్ముటయే కాక వారికంటె నొక్క మెట్టెక్కువ యెక్కి దేవతావేశము, దేవతాసాక్షాత్కారము మొదలైన వానినికూడ నమ్ముచుండిరి. బౌద్ధమతబోధవలనఁ గొంత వఱకు వీరిట్లయిరని యూహింపఁ బడుచున్నది.

ఈచెప్పఁబడినవారు గాక యీకాలమునందు మఱికొన్ని తెగలవారుండిరిగాని వారంతగా ముఖ్యులు కారు. సమరయులని యొక మిశ్రజాతివా రుండిరి. వారిని యూదు లందఱును గర్హించి తక్కువగాఁ జూచుచుండిరి. వ్యవహారవిమర్శ జేయఁదగియున్న ఆచార్యులును లేఖకులును పెద్దలును జేరి యున్నసభవారియం దుండెనుగాని మరణదండనాధికారమును మాత్రము రోమనులాసభవారినుండి తొలఁగించిరి.

అన్యదేశీయులు వచ్చి దేశము నాక్రమించుకొని ధనాకర్షణము నిమిత్తమై ప్రజలను నానా విధముల బాధింపఁ జొచ్చినప్పుడు తమ్మాబాధలనుండి విముక్తులను జేసి రక్షించుటకయి జనులు రక్షకుని నిమిత్త మెదురు చూచుట వింత కాదని యిదివఱకే చెప్పియున్నాము గదా! ఈయాశను వారిపూర్వగ్రంథములలో ప్రవక్తలు చెప్పిన భవిష్యత్కథనములు బలపఱచినవి. ఆకాలమునందలి యూదు లందఱును రోమనులను పాఱఁద్రోలి యన్యాక్రాంత మైన తమ దేశమును మరల

తమవశము చేయుటకై తమమతగ్రంథములలోఁ జెప్పఁబడిన ప్రకార
ముగా దేవుఁడు మెస్సీయాను బంపు నను దృఢవిశ్వాసము గలవారై
యుండిరి. మెస్సీయా యను పదమునకు హీబ్రూభాషలో నభిషిక్తుఁ
డని యర్థము; క్రీస్తనునది గ్రీకుభాషలో దీనికి పర్యాయపదము.
భక్తరక్షణమునిమిత్తమై యీశ్వరుఁడొక్క మానుషభావుని నభి
షిక్తుని జేసి పంపు నని పూర్వపుదీర్ఘదర్శులు మతగ్రంథములలోఁ
జెప్పిన వాక్యములనుబట్టి యట్టి మెస్సీయా వచ్చుట కప్పుడు సమయము
వచ్చిన దని సర్వసామాన్యముగాఁ దలఁచి యుండిరి. ఈశ్వరునిచే
నభిషిక్తుఁడై పంపఁబడిన రక్షకుఁ డతఁడే యున్నవిశ్వాసముతోనే
జీసస్సును జనులు క్రీస్తని పిలువ నారంభించిరి. అయినను జనులు
ప్రారంభదశలో తమ్ము పాపములనుండి రక్షించుప్రభువు వచ్చు నని
యెదురు చూడక శత్రువులను సంహరించి దిగ్విజయము చేసి
సర్వరాజ్యములకును జెరూసలేమునగరము రాజధానిచేసి లోకము
లోని సర్వసంపదలను తమ కధీనము చేసి తమకు మహాన్నత్యమును
కలిగించి యేలెడు ప్రభువు వచ్చు నని యెదురు చూచుచుండిరి.
ఆకాలమునం దెల్లవారలహృదయములలోను మెస్సీయాయొక్క రాకను
గూర్చినచింతను మించినచింత వేఱొకటి లేదు.

రోమనులు వచ్చి దేశమును జయించి జనుల స్వేచ్ఛావిహారము
నకు భంగముకలిగించి వారిని నిరోధించి పన్నులధికముగా గ్రహించి
వారి కొత్తుడు కలుఁగఁ జేయుచుండినను, జనుల నొండొరులతోఁ
బోరాడనీయక యడఁచియుంచి దేశమును స్వస్థపఱిచి వాణిజ్యాదులు
నిరపాయముగా సాగునట్లు చేసిరి. ప్రభుత్వమువారి సేనాబాహు
ళ్యమునకు భయపడి దేశములోని దుష్టజను లడఁగి యుండవలసినవా
రయినను వారి హృదయములు మాత్ర మతృప్తిని విడువక తమ

స్వేచ్ఛాచరణస్వభావమును జూపుట కయి సమయము కొఱకు ప్రతీ
క్షించుచుండెను. ఈయవస్థలో మహోన్నాద మెల్లయెడల వ్యాపించి
సర్వజనులహృదయములలోను నెలవుకొనఁగా మెస్సయాపిచ్చ యెల్ల
వారిని పట్టుకొనెను. మెస్సయా వచ్చి దుష్టసంహారము చేసి ధర్మ
సంస్థాపనము చేయునని యూదబాలగోపాలమును నమ్ముచుండిరి. కృత
యుగమెప్పుడో కడచిపోయిన దని యిక్కడ మనవారి నమ్మకము.
కృతయుగము ముందు రానున్న దని యక్కడవారి నమ్మకము;
పాలస్టీన్ దేశములో వారిదీర్ఘదర్శులు వందలకొలఁది సంవత్సరముల
క్రిందటనే యీవఱకు పుట్టిపెరిగినవా రందఱికంటెను నధిక బుద్ధి
మంతుఁడును బలవంతుఁడు నయిన యద్భుత శక్తిసంపన్నుఁ డగు ఘనుఁ
డొక్కఁడు తమదేశమునం దుద్భవిల్లు నని పలికియుండిరి. అతఁడు
మానవకోటి నంతను శాసించుననియు, సమస్త దేశములవారును వచ్చి
యాతనిపాదము లాశ్రయించి కొలుతురనియు వారు వచించియుండిరి.
అటుతరువాత గ్రంథకర్త లావాక్యములను మఱిచి యూదుఁడు
యూదులలోనే పుట్టు ననియు, డేవిడ్వంశమునం దుద్భవించి పూర్వ
రాజవంశమును మరల నుద్ధారణము చేసి లోకమున కంతకును ప్రభు
వగు ననియు, తొంటికంటెను స్పష్టముగా వ్రాసిరి. పరరాజుల పాల
నము వలన జనులలో కష్టము లధిక మయినకొలఁదిని ప్రజల మనస్సు
లలో లోకజేత యగు రాజునుగూర్చినచింత యధికము కాఁజొచ్చెను.
అట్టి ప్రభువు శీఘ్రముగా వచ్చి 'తమ కష్టములను గట్టెక్కింప
వలయు' నని పురుషులును స్త్రీలును బాలురును వృద్ధులును సర్వజను
లును సదా తమచిత్తములలోఁ బ్రార్థించుచుండిరి. వారిలో ననేకులకు
స్వప్నములలో నహితము మెస్సయా వచ్చినట్లే కనఁబడు చుండెను.
వారికి రాత్రిందివములు మెస్సయాచింతయే పలవరింతగా నుండెను.

అతఁ డెక్కడ పుట్టునో, ఎట్లు కనఁబడునో, తా నేయే కార్యములు చేయునో, యన్నవిషయములలో నభిప్రాయభేదమున్నను మెస్సయా వచ్చు నన్నవిషయములలో నెవ్వరికి నణుమాత్రమును సందేహములేదు. మఱునాఁడు సూర్యుఁ డుదయించు నని యెంతనిశ్చయ ముండెనో యెల్లవారిమనస్సులకును మెస్సయా వచ్చుననుటయు నంతదృఢనిశ్చయ మయి యుండెను; కొందఱు మెస్సయా నేఁటి రేపటఁ బుట్టబోవుఁ చున్నాఁడని తలఁచుచుండిరి; కొందఱావఱకే పుట్టి తమలోఁ బెరుగు చున్నాఁడని తలఁచుచుండిరి. కొందఱు నేఁడో రేపో దర్శన మిచ్చి లోకమునకు తనరాకను ప్రకటించు నని తలంచుచుండిరి. ప్రజలలోని పలు తెగలవా రితరవిషయములలో పరస్పరవైషమ్యము కలవారుగా నున్నను, ఈవిషయములో మాత్ర మెల్లవారును నేకీభావము వహించి యుండిరి. ఎస్సీనులు జనులు దుర్మార్గు లగుటవలన నతఁడు దర్శన మియ్యకున్నాఁ డని పలుకుచు జనులను సన్మార్గవర్తులు కం డని బోధింపఁ జొచ్చిరి; ఫారిసీలు మెస్సయా తమలోనేపుట్టి రాష్ట్రములో నున్నతస్థానములను తమ కిచ్చు నని సంతోషించుచుండిరి. సద్దూసీలు తాముత్తమకులీను లగుటచేత తమలోనివాఁడే యొక మహా పురుషుఁడు తాను మెస్సయా నగుట యెప్పుడో ఘోషించు నని కనిపెట్టుకొని యుండిరి. సామాన్యజనులు మెస్సయా యెక్కడనో జనన మొంది తమలోనే గూఢముగా మెలఁగుచున్నాఁ డనియు, అతఁడు లోకమునకు తన్నెఱిఁగించుకొనుట కయి యుక్తసమయము కొఱకు ప్రతీక్షించుచున్నాఁ డనియు, నేఁడో రేపో యెప్పుడో యే నిమిషముననో యేపండుగనాఁడో బయలఁ బడు ననియు, తలఁచి యాతని దర్శింప నతికుతూహలు లయి యుండిరి. పూర్వదీర్ఘదర్శులు చెప్పినవచనములను బట్టి మెస్సయాదర్శన మిచ్చిన మఱుసటి దిన

నము నుండియు తా మందఱును సుఖులును భాగ్యసంపన్నులు నగుదు మనియు, ప్రపంచమున కంతకును జెరూసలేము రాజధాని యగు ననియు, భూమిమీఁద యుద్ధములును విపత్తులును రూపు మాయు ననియు, దుష్టశిక్షణమును శిష్టరక్షణమును కలుగు ననియు, సమస్త ఋతువులలోను సంవత్సరము పొడుగునను వృక్షములును సస్యములును ఫలసమృద్ధము లయియుండు ననియు, క్రూరసర్పములు సహితము తమ క్రౌర్యమును సహజవైరమును విడిచి సింహమును మేఁకయుఁ గలిసి యేకముగా నొక్కచోట వాసము చేయు ననియు, వ్యాధులును బధిరత్వాదు లయిన యంగవైకల్యములును లేకుండు ననియు, మెస్సయా జెరూసలేములో పరిశుద్ధము లయిన ధర్మములను స్థాపించి యేలునప్పుడు తమ దేశము భూతలస్వర్గ మగుననియు, వారి యెన్నిక.

దేశ మీస్థితిలో నున్నప్పుడు నడుమనడుమ నొకానొకఁడు దేవునిచేఁ బంపఁబడిన మెస్సయా తానే యని బయలుదేఱుచుండెను. అప్పుడాతని చుట్టును వందల కొలఁది జనులు చేరుచుండిరి. ఇట్లు మెస్సయా నని బయలువెడలిన ప్రతిపురుషుఁడును తాను సహాయసంపదలేనివాఁ డయ్యును మతోన్మాదముచేత శక్యాశక్యవిచారము లేనివాఁడయి తానొక్కఁడే రోమనులను పాఱఁదోలి దేశము నుద్ధరింపఁ గలుగుదునన్న పూర్ణవిశ్వాసముతో వెలువడి దురాగ్రహావేశముతో దేశక్షోభమును సమగ్రముగఁ జేయఁగానే రోమను లట్టివారిని బట్టి సంహరించి యాక్షోభము నడఁచివేయుచుండిరి. అట్లు వెలువడిన వారికెల్లను చావు నిశ్చయమే యయినను మతావేశపరవశత్వముచేత మరణమునకు వెఱవక యట్టివా రనేకు లొకరితరువాత నొకరు మరల మరల బయలుదేఱుచునే యుండిరి. కలితు లయిన పరరాజులను దేశము నుండి తఱిమివేసి రాజ్యమును నిష్కంటకము చేయుటకై తమిశ్వాస్య

రుఁడు పంపి ననియుఁ దాము దుర్జయుల మఱియు నమ్మి మతోన్మాదములవలనఁ గలిగిన వీరావేశమునుగాని వెలువడి యీసంవత్సరము కొందఱు ప్రాణములు కోలుపోఁగా, అమనుసటి సంవత్సరమే యట్టివారు మఱికొందఱు వెనుకటివారి పురాణకథను మఱచిపోయి యెప్పటి విశ్వాసముతోనే వెలువడి మరల మరల రోమనుల ప్రతాపాగ్నికాహుతి యగుచుండిరి. ఇట్టి రాజద్రోహులను చిత్రవధ చేసి దేశక్షోభము నడఁచుటలో క్రూరులుగా నుండినను రోమను లితర విషయములలో జనుల స్వాతంత్ర్యములకు భంగము కలిగింపక మన్నించుచుండిరి. ఈసర్వజనసంక్షోభసమయమునందు జీసస్సెట్లు ప్రవర్తించెనో, అతనిమనస్సెట్లుండెనో, మొదలయిన విషయములు ముందు ముందు వివరింపఁబడును.

---

## మూడవ ప్రకరణము

## జీసస్ యొక్క బోధనారంభదశ.

మెస్సయా భ్రమలోఁ బడి విశ్రాంతి గానక యెల్లవారును వ్యాకులస్థితిలో నున్న యీకాలములోనే జీసస్ పుట్టుమొదట 'కేనా' నగరమునందు జనులకు ధర్మబోధ చేయ నారంభించెను. తన కొడుకు పని కారంభించి ప్రఖ్యాతి పొందకమునుపే జోసఫ్ పరలోకగతుఁ డయ్యెను. భర్తయొక్క మరణానంతరము మేరీ కుటుంబమునకు యజమానురాలయి నాజరెత్తు గ్రామమును విడిచి తనపెద్దలతో 'కేనా' పట్టణమునకు లేచిపోయి యందు నివసించినట్టు కనఁబడుచున్నది. మేరీ కుటుంబ యాజమాన్యమును వహించుటను బట్టియే యేకనామ ధారులయిన యితరులనుండి యతనిని వేఱుచేయవలసినప్పుడా కాలపు వారు జీసస్సునకు మేరీ కొడుకయిన యనువిశేషణమును జేర్చుచు వచ్చిరి. నాజరెత్తు గ్రామమునకు జాము ప్రయాణములో నున్న యీ కేనాపట్టణ మొకవేళ నామె పుట్టినిల్లయి యుండవచ్చును. తన యౌవనదశలో కొంతకాలము జీస స్స్వపట్టణమునందు వాసము చేసి యిక్కడనే ప్రప్రథమమున మతబోధ కుపక్రమించెను. జీసస్సున కప్పటికి వివాహము కాలేదు. అటుతరువాత సహిత మతఁడెప్పుడును వివాహము నపేక్షింపక యావజ్జీవమును బ్రహ్మచారిగానే యుండెను. బాల్యమునుండియు నాతని ప్రేమ మొకప్పుడును కళత్రాదులైన యిహలోకవిషయముల మీఁదికిఁ బోక యెల్లప్పుడును పరమేశ్వరుని మీఁదికే పోవుచుండెను. అప్రసిద్ధస్థితిలో నున్న యీకాలములో నాతనిజ్ఞాన మెట్లు దినదినాభివృద్ధి గనెనో, ఎట్టిధ్యానమార్గముచేత కడ

పటం నతం డట్టి యీశ్వరైకపరాయత్త మైనవిశ్చల మతోత్సాహమును పొందం గలిగెనో, తెలియదు. నిపుణముగా నాలోచించి చూడంగా నితరజన సాహాయ్యము చేతను మతగ్రంథ సాహాయ్యము చేతనుగాక స్వబుద్ధి విశేషముచేతనే యాతని కట్టి యుత్తమ జ్ఞాన పదవి లభించినట్లు తోంచుచున్నది. అతండు చూపిన యీశ్వర విషయక మైన యీ యుత్తమజ్ఞాన మాతనికి యూదులమతము వలనం గలిగియుండదు; ఆమతమునం దట్టినిర్మలబోధ మున్నట్లును గానరాదు. ఈశ్వరుండు సర్వజనులకును తండ్రి యన్న నిశ్చయజ్ఞాన మెట్లో యాతని హృదయఫలకమునందు శిలాక్షరమువలె దృఢముగా లగ్నమయి యెప్పుడు నెడంబాయ కుండెను. అందుచేత నాతనికి తండ్రి యన్న పద మీశ్వరపదమునకు పర్యాయపద మయ్యెను; అతం డీశ్వరు నెప్పుడు పేర్కొనవలసివచ్చినను తండ్రీయనియే సంబోధించుచుండెను. అంతేకాక యాపరమపితయొక్క యాజ్ఞలాతని యంతరాత్మను సదా వినంబడుచున్నట్లుండెను. పయినుండి వచ్చి యీశ్వరుండు ప్రత్యక్ష మైనట్లు గాని, యతం డెప్పుడును భావింపలేదు; అతం డీశ్వరుని తనహృదయములోనే చూచుచు మనస్సు చేతనే సర్వదా యీశ్వరసాన్నిధ్య సాంగత్యము లనుభవించుచుండెను. అతండు తానీశ్వరునిలోనే వసించుచున్నట్లు దృఢభావన కలవాండయి భౌతికనేత్రములతోం జూడక పోయినను జ్ఞాననేత్రముచే నీశ్వరుని సందర్శించి యానందించుచుండెను. మనదేశమునందలి యహంబ్రహ్మల వలె నతం డెప్పుడును తానే యీశ్వరుండ నని భావించుకో లేదు. ఈశ్వరుని తండ్రినిగా భావించుకొనుచుండుటచేత తా నీశ్వరపుత్రుండ నని మాత్రము దృఢముగా నమ్మియుండెను. ఈయగాధజ్ఞాన మంతయు నాతని కొక్కసారిగా నలవడిన దని చెప్ప వలనుపడదు.. ఇది చిరకాలాభ్యాసము సంయము

దీర్ఘాలోచన వలనను గలిగినఫల మయి యుండవలెను. జీసస్ దృష్టి కీశ్వరుఁ డెల్లవారికిని తండ్రియగుటచేత బిడ్డలందఱు నాతనిని ప్రేమింప వలసినవారే కాని యెవ్వరు నాతనికి భయపడవలసిన పని లేదు; యూదులు తమ మతప్రకారముగా భావించుకొనున ట్లీశ్వరుఁ డొక్క యూదులకే పితయయి వారిరక్షణముకొఱకు నితరులను సంహరించెడు క్రూరుఁడు గాక యాతనిదృష్టియం దెల్లవారిని సమానముగా కాపాడెడు సర్వకారుణ్యుఁడైన లోకపిత యయి యుండెను అనఁ డందుచేత తన దేశము వారి దురభిమానమును వదలి యీశ్వరునియొక్క సర్వజన పితృభావమును లోకములో స్థాపించుటకొఱకే మొదటి నుండియు పాటుపడఁ జొచ్చెను. తాను నిలకొల్పఁ దలఁచుకొన్న యీసిద్ధాంతము నతఁడు సాధారణముగా "ఈశ్వర రాజ్యము" "పరలోకరాజ్యము" అను పేరులతోఁ బిలుచుచు వచ్చెను. ఈపదము లక్కడి వారి పూర్వగ్రంథములలో నుపయోగింపఁబడినవే కాని యతఁడు క్రొత్తగా కల్పించినవి కావు. ఈ పదముల కచ్చటివారు తమతమ బుద్ధ్యనుసారముగా ననేకు లనేకార్థములను చేసికొనుచుండిరి. ఈశ్వర రాజ్యము మానసికరాజ్య మనియు, ఎల్లవారు నీశ్వరాజ్ఞకు లోఁబడి నడుచుకొనువా రగుదురేని యీశ్వరరాజ్యము లోకములో స్థాపన మగు ననియు, జనస్సుయొక్క యభిప్రాయమైనందున నతఁడా పదములను తదనుగుణ మైన యర్థమునందుఁ బ్రయోగించుచు వచ్చెను. అందుచేతనే యీశ్వరరాజ్య మెక్కడ నున్న దని యితరులు తన్నడిగి నప్పు డతఁడు మీమనస్సులోనే యున్నదని వారి కుత్తరము చెప్పుచు వచ్చెను. అతఁ డీశ్వర సాన్నిధ్యమును తన మనస్సులోనే యనుభవించువాఁ డైనందున, ఆచార్యోపదేశములవలనను బాహ్యకర్మల వలననుగాక యొక్క మానసికభక్తిచేతనే యీశ్వరుని పొందఁ దగు

ననియు, ధ్యానమార్గముచేత నీశ్వరసాంగత్యమును బొంది సమస్త కార్యములను నీశ్వర ప్రీతికరముగా నాచరించుచు నీశ్వరునివలె పరిశుద్ధ వర్తనమును బొందుటయే యానందదాయక మనియు, నమ్మి యితరుల కట్లే బోధించుచుండెను.

ఈ బోధనలమూలముననే దురాగ్రహావేశముచేత మతాచార్యు లాతనిని ద్వేషించి దూషింపఁ బూనిరి. కన్నులు మూసికొని ప్రార్థించునప్పుడు జనులు తమ్ముఁ జూచుచున్నారో లేదో కనిపెట్టుట కయి నడుమనడుమ కన్నులు దెఱచి చూచుచుండుటయు, ఇతరులు తమ్ముఁ దాతలని చెప్పుకొనుట కయి డంబముతో నలుగురును చూచు నట్లు దానములు చేయుచుండుటయు, తమ్ముఁ బుణ్యపురుషు లని జను లనుకొని గౌరవించుట కయి భక్తవేషమున కనుకూలముగా వస్త్ర ధారణము చేసికొనుచుండుటయు, లోనుగాఁ గల దాంభిక వ్రతముల నతఁ డనుదినమును ఫారసీలలోఁ జూచి రోఁతపడి, యెల్లవారి మనస్సు లను పరిశోధించి చూచుచు ఫలము లిచ్చెడు సర్వేశ్వరుఁ డంతట నిండియుండఁగా తదనుగ్రహాకరణమునకు దాంభికు లైన యాచార్య పురుషులతోఁ బనియుండ దనియు, కొడుకులకును దండ్రికిని నడుమ మధ్యవర్తు లుండవలసిన యక్కఱ లేదనియు, మనశ్శుద్ధి లేనప్పుడు బాహ్యస్నానములు మనుష్యుని పవిత్రుని జేయఁజాల వనియు, కనఁ బడినవారి కెల్లను నిశ్చయముగా బోధింప నారంభించెను. ఈ స్వదేశీయుల దాంభికాచారములను మనస్సులో నుంచుకొనియే యతఁడు తరువాత తనశిష్యుల కుపదేశించునప్పుడు "మీరు దానము చేయు నప్పుడు మీ కుడిచేయి చేయుదానిని మీ యెడమచేయి యెఱుఁగకుండు నట్లు రహస్యముగా చేయుఁడు. రహస్యముగా జేసెడు దానిని జూచెడు మీతండ్రి మీకు బహిరంగముగా బహుమాన మిచ్చును" అనియు,

"నీవు ప్రార్థించునప్పుడు నీగదిలోనికి పోయి తలుపులు వేసికొని యంతర్యామి యైన నీతండ్రిని ప్రార్థింపుము. రహస్యములోని దానిని జూచెడు నీతండ్రి నీకు బహిరంగముగా బహుమానము చేయును. దీర్ఘపాఠములవలననే తమ మొఱ్ఱలాలించు నని భావించి ప్రతిమార్చకులు చేయునట్లు నీవు ప్రార్థించునప్పుడు పలికినదానినే మరల వ్యర్థముగా పలుకఁబోకుము. నీవు తన్నడుగక మునుపే నీ కేమి కావలెనో నీతండ్రి యెఱుఁగును." అనియును, బోధించుచు వచ్చెను. ఇట్లతఁడు మతరక్షణమున కావశ్యకము లన్న మిషమీఁద గురువులచేఁ గల్పింపఁబడి కాపాడఁబడుచుండిన సత్యమతభంజకము లైన కర్మల కన్నిటికిని గర్భశత్రు వయ్యెను. అందుచేత నతఁడు లోకములో సత్యమతమునకు పరమోపకారి యయ్యెననుటకు సందేహము లేదు. ఇట్టి యాతని బోధలను విని యాతనికి స్వగ్రామములో కొంతమంది శిష్యులుగా నేర్పడిరి.

జీసస్సునకుఁ గల విద్యావిశేషమును గూర్చి యీవఱకే కొంత వివరింపఁబడినది కదా? అమానుషశక్తుల విషయ మయి యాతని కత్యంత సంపూర్ణవిశ్వాస ముండెను. ప్రకృతిశాస్త్రజ్ఞాన మత్యల్పముగా నుండిన యాకాలములో నతఁడు ప్రార్థనలచేత తాను మేఘమార్గములను మరల్పఁగల ననియు, రోగమును మరణమును మాన్పఁగల ననియు, సమస్తము నీశ్వరేచ్ఛాయత్త మగుటచే భక్తపరాధీనుఁ డయిన యతఁడు భక్తజనాభీష్టసిద్ధి కలిగించుటకై యెట్టి యద్భుతము లైనఁ జేయవచ్చు ననియు నమ్ముట యొక వింత గాదు. అయినను జీసస్సున కిటువంటి నమ్మకములవలన సాధారణముగా పామరజనులలోఁ గలిగెడి యనర్థము లేవియుఁ గలుగక వానికంటె విలక్షణము లయిన సత్ఫలములు కలిగెను.

ఇటువంటి విశ్వాసములవలన పామరులలో కారణము లేని భయము లును, పనికిమాలినభ్రమలును, అనావశ్యకము లయిన యాచారము లును, మాంత్రికాదివేషధారుల వలని మోసములును కలిగి దేశ క్షోభమునకు కారణము లగును; జీసస్సునందో వీనివలననే యాశ్వ రునియెడల సంపూర్ణభక్తియు మనుష్యశక్తియెడల నతిమాత్రవిశ్వా సమును గలిగి దేశలాభమునకు కారణము లయ్యెను. ఈవిశ్వాసముల నటుండనిండు. మతమునకు పరిశుద్ధహృదయమును, పరిశుద్ధవర్తన మును, సర్వజనసౌభ్రాత్రమును, ఈశ్వరభక్తియు ప్రధానములు గాని నిరర్థకము లయిన బాహ్యకర్మలును బాహ్యవేషధారణములును ముఖ్య ములు కావన్నది జీసస్సు చేసినబోధయొక్క సారాంశము. ఇంచు మించుగా నిటువంటి సిద్ధాంతములనే యప్పుడప్పు డుపదేశించుచు వచ్చినవా రొకానొక రుండుచువచ్చిరి కాని తమయుపదేశముల నను ష్ఠానములోఁ జూపినవారు మాత్రము కానరారు. సర్వము ననుష్ఠాన ములో నున్నది కాని యుపదేశములో నేదియు లేదు. వెనుకటివారి వలె కేవలోపదేశముతో తృప్తినొంది యుండక జీసస్ తా నుపదేశిం చిన దానినెల్ల ననుష్ఠించి చూపెను. సత్యమెప్పుడు నుపదేశకాలమున కంటె ననుష్ఠానమునందే లోకమున కధికోపకారదాయక మగును. ఎవ్వఁడు మాటలతోను చేష్టలతోను ధర్మము ననువర్తించునో, ఎవ్వఁడు ప్రాణాపాయము వచ్చినను ధర్మమును విడువకుండునో, అట్టి వాఁడొక్కఁడే లోకములో సర్వజనులకు పూజనీయుఁ డగును.

ఎల్లవారును మెస్సయా వచ్చు నని యెల్లచోటులను ప్రతీ క్షించుచున్న కాలములో జీసస్ తనగ్రామములో మతబోధ కారం భించి యుండఁగా నాకస్మికముగా దేశమునం దంతటను "మెస్సయా యీవఱకే మనలో నుద్భవిల్లియున్నాఁ డనియు, ఈశ్వరరాజ్యము

సమీపించిన దనియు, బోధించుచు జార్డన్ నదీతీరప్రాంతమందలి యరణ్యములోనుండి యొకప్రవక్త బయలు దేఱినాఁడు" అని యొక ప్రవాదము కలిగెను. ఈవార్త పుట్టినతోడనే దేశమునం దంతట నొక్కసారిగా సంక్షోభము పుట్టి యామహాపురుషుని సందర్శించుట కును, తద్బోధనల నాకర్ణించుటకును నానాముఖములనుండి జనులు తండోపతండములుగా వరుగెత్తసాగిరి. ఇట్లు బయలు వెడలిన ప్రవక్త పేరు జాన్. క్రీస్తుశకము ౨౭ వ సంవత్సరప్రాంతమునం దత్యు త్సాహవంతుఁడును తపస్వియు నయిన జా ననెడి యీమహాపురుషుని యొక్క ఖ్యాతి యింతింతింతయింతై పాలస్టీను దేశమునం దంతటను వ్యాపించెను. ఈజాన్‌యొక్క జన్మస్థలము జూడియాదేశములోని హెబ్రన్ పురమునకు సమీపమున నున్న జెట్టా గ్రామము; ఇతఁ డాచార్యపురుషుల వంశమునఁ బుట్టినవాఁడు. జీసస్ పాలస్టీన్ దేశ ములో నుత్తరభాగమునందు వర్ధిల్లుచుండఁగా నితఁడు దక్షిణభాగము నందు పెరుగుచుండెను. ఇతఁడు బాల్యమునుండియు నుపవాసాది వ్రతములతో కాలక్షేపము చేయ నలవాటు పడినవాఁడు; మన భరత ఖండమునందలి ఋషులవలెఁ గొంతకాల మరణ్యమందు తప శ్చర్య చేసినవాఁడు. అట్టి యితఁ డిప్పుడు తనశిష్యులను జార్డన్ నదీ జలములలో స్నానములు చేయించి యుపదేశములు చేయుచున్నందున నతనికి స్నాతకుఁ డన్న నామము ప్రసిద్ధ మయినది. ఇతఁ డిప్పుడు చేయుచున్న ముఖ్యబోధ "అనుతాప పడుఁడు. ఈశ్వరరాజ్యము సమీపించుచున్నది" అనునది. జీసస్సు మనస్సునందువలెనే యీతని మనస్సునందును చిన్నతనములోనే తత్కాలదేశదుర్గతి దృఢముగా నాఁటి సంతాపము కలిగించెను. జను లెట్లు కష్టములకు లోనయి దుఃఖపడు చున్నారో, వారిలో నెందఱు పాపముల పాలయి బాధ

పడుచున్నారో, మంచివారుగాను ధీమంతులుగాను నుండవలసిన గురువు లెట్లు దుష్టవర్తనులును బుద్ధిహీను లయియున్నారో, ఎస్సీలును ఫారిసీలును ధర్మకవచమును దొడిగి పైకి భక్తుల వలె నటించు చున్నను హృదయములోపల భక్తిహీనులును దయాశూన్యులు నయి యున్నారో, తెలిసికొని జాన్ మనస్సులో నారాట మొందఁజొచ్చెను. అతఁ డుగ్రస్వభావుఁడును వేగిరపాటు గలవాఁడు నగుటచే నాతని దృష్టికి యక్రమములు దుస్సహము లయ్యెను. హెబ్రన్ నగరము నందలి తన సుందరమందిరమునందు సుఖముగా నుండినవాఁ డయ్యెను కన్నులు నీరుగా ననుదినమును తనచుట్టును నడుచుచున్న దుర్వృత్తములను జూచి సహింపలేనివాఁ డయి యతఁ డితరులవలె మెస్సయా రాక నపేక్షించి యింట నణఁగి యుండనొల్లక తనకు కోపోద్రేకమును కలిగించుటకు కారణము లయిన యకార్యకరణములు కంటఁబడకుండు ననియు తన దేశస్థులను మంచిమార్గమునకుం ద్రిప్పుటకుఁ దగిన సాధము లుపదేశించుట కయి నిశ్చలహృదయముతో రాత్రిందివము లీశ్వరుని ప్రార్థింపవచ్చు ననియు తలపోసి యతఁడు వనమునకుఁ బోయి నివసింపవలె నని నిశ్చయించుకొనెను. అడవులకుఁ బోయి కాయములు శుష్కింపఁ జేసి తాపసు లయి వసించుట యీ దేశమునందువలెనే యా దేశమునందును పూర్వకాలమునం దాచార మయి యుండెను.

అట్లు వనవాసము చేసి తపస్సు చేయువారి కీశ్వరసాక్షాత్కారము కలుగు నని నమ్మి జను లట్టివారికి భయపడుటయు వారిని గౌరవించుటయుఁ గలిగి యుండెను. వానప్రస్థము పుణ్యకార్యముగా నెల్ల వారిచేతను భావింపఁబడు చుండెను. అట్లు కృతనిశ్చయుఁడయి యప్పుడే యిల్లు విడిచి జాను మృతసముద్రమునకు సమీపమున నున్న యరణ్యా

ముఖకు లేచిపోయెను. ఆఘోరాటవి దురాలోక మయిననిర్జనప్రదేశము; అక్కడ కొండలును నిసుకతిన్నెలును దక్క కంటికి మతేమియు కనఁబడవు. ఆకాఱడవిగుండ దినములకొలఁది నడచినను వనవాసుల కప్పుడప్పు డేకానొకపక్షియో నక్కయో విషసర్పమో దక్క జీవజంతు వేదియు కంటఁబడదు. అక్కడక్కడ వానలు కురిసినప్పుడు కొండలసందులలోను చిన్నయూటలలోను నిలిచిననీరు దక్క త్రాగుటకు మంచినీరయినను లభింపదు. అడవితేనెయు మిడుతలును దక్క మనుష్యుఁడు శరీరభరణము చేసికొనుట కనుకూలమయిన యాహార పదార్థములేవియు దొరకవు. కొండలలోని నెఱియలలో తేనెయీఁగలు తేనెపట్లు పెట్టును; దక్షిణవాయువులచేత యమనదేశమునుండి మిడుతలదండు కొట్టుకొనివచ్చును. ఇట్టి కాఱడవిలో మిడుతలను దిని తేనె త్రాగి ప్రాణాధారణము చేసికొనుచు బహుసంవత్సరము లేకాకియై జాను వసించెను. ఆకాలములో నతఁడు రాజదండనమును తప్పించుకొనుటకయి ప్రాణభీతిచేత పాఱిపోయి వచ్చినయొకానొక తపస్కురుని మొగమును దక్క మనుష్యముఖము నెప్పుడును జూడలేదు. అతని కప్పు డక్కడ పర్వతగుహాదులే వాసగృహములు; కటిసూత్రమున బంధింపఁబడిన యుష్ట్రాజినమే వస్త్రము; మనోగతములే సహచరులు; పూర్వప్రవక్తలయొక్క వాక్యములను చింతనము చేయుచుండుటయు తనదేశస్థులను దౌర్బల్యములనుండియు పాపములనుండియు విముక్తులను జేయవలయునని యీశ్వరప్రార్థనము చేయుచుండుటయునే యతని వ్యాపారము.

ఇట్లీశ్వరుని ధ్యానించుచు తపశ్చర్యయందుఁ గొంతకాలము గడపినతరువాత తత్ఫలముగా నతనిమనస్సునం దొకసంకల్ప ముదయించెను. రోమకసైనికులు దూరముగా నున్నందున నతని కీయడ

విలో వారివలనిభయముగాని వారితో పోరాడుట వృథాయాస మన్న చింతగాని కలుగలేదు. సమీపించినప్పటివలె దూరముగా నున్నప్పు డపాయము లంత భయంకరముగా తోఁచకపోవుట లోకసహజమే కదా! ఆయుధపాణు లయిన రోమకభటులను నిత్యమును కన్నుల యెదురఁ జూచుచు పట్టణములలో వాసము చేయుచుండినవారి కట్టి బలిష్ఠుల జయింపఁగలుగుదు మన్న యాశ పుట్టుట కష్ట మయ్యెను; కాని యడవిలో నున్న జానుయొక్కదృష్టికి సర్వశక్తుఁ డయిన యీశ్వ రునిరాజ్యమును తనదేశములో స్థాపన కాకుండ నిలుపుటకయి యల్ప సంఖ్యాకు లయిన యీ యాయుధహస్తు లెంతటివా రని తోఁచెను. ఇట్టిసంకల్ప మతనిమనస్సునకు తగులఁగానే యతఁడు తనలో తాను పరిపరిలాగుల నాలోచించుకొనఁజొచ్చెను. జనులయొక్కపాపముల మూలమున మెస్సయా దర్శన మిచ్చుటకు శంకించుచున్నాఁ డని రాబ్బీలు ఘోషించుచుండ లేదా? ఒక్కదిన మయినను జను లంద ఱును తమపాపముల కయి నిజముగా పశ్చాత్తప్తు లైనపక్షమున, మెస్సయా ప్రత్యక్షమై యీశ్వరరాజ్యమును స్థాపించు నని వారు పలికి యుండలేదా? మెస్సయాయొక్క సాక్షాత్కారము నిమిత్తము కావలసినదెల్లను జనులు పశ్చాత్తప్తులై పాపపరాఙ్ముఖు లగుటయే కదా! నేనువూని జనుల ననుతాపపడునట్లు చేసెదను. అని మనస్సులో దృఢనిశ్చయము చేసికొని యితరులు రిక్తకోరికలు కోరుచు కాల క్షేపము చేయు చుండఁగా జాను కార్యదీక్ష వహించి బయలువెడ లెను. జా నెప్పుడును తానే మెస్సయా నని తలఁచుకోలేదు; నిజదర్శన ప్రాప్తి కర్హత కలుగునట్లుగా జనులు పరిశుద్ధు లగుట నిమిత్తమా మహాప్రభువు వేచియున్నాఁడని మాత్రమే తలఁచి యుండెను. ఇట్టిస్థితి యుం డాతనిమనస్సులో నీవుపోయి "పాపమునకు పరితపింపుఁడు.

ఈశ్వరుని రాజ్యము సమీపించినది.” అని జనులకు బోధింపు మని యాజ్ఞాపించిన ట్లొక వాక్యము వినఁబడెను. అట్లు వినఁబడినతోడనే యది యీశ్వరాజ్ఞగాఁ జేకొని యావివిక్త ప్రదేశమును తనగుహను విడిచి బయలుదేఱి యతఁడు శ్రోవపొడుగునను కంటఁబడినవాని కెల్లను స్వమత ప్రకటనము చేయుచు జార్డన్ నదీతీరమునకుఁ బోయి తన సిద్ధాంతమును బోధింపఁజొచ్చెను. మన దేశమునందలి బైరాగుల వంటి శిష్యు లనేకు లప్పటికే యతనిచుట్టును జేరి యతఁ డేర్పఱచిన నియమములకును, బోధించిన సిద్ధాంతములకును లోఁబడి నడుచుకొను చుండిరి. ఆతనిబోధను విన్నవా రెల్లను నతఁ డీశ్వర ప్రేరణముచే వచ్చిన నిజమైన దేవదూత యని విశ్వసించి తాము విన్నదాని నిత రులకుఁ జెప్పసాగిరి. ఈప్రకారముగా కర్ణపరంపరచేత నాతనిఖ్యాతి దేశమం దంతటను మెల్లమెల్లఁగా నల్లుకొనఁగా నల్పకాలములోనే జెరూసలేమునగరమునకు సహితము చేరెను. అందుచేత జనులు నానా ముఖములనుండి ప్రవాహరూపమున బయలుదేఱి వచ్చి యాతని బోధను వినుటకై మూఁగఁజొచ్చిరి. ఎక్కడనో మూలమూల నున్న గాలిలీ దేశములోను ప్రశాంతమైన నాజరెత్తుగ్రామములోను గూడ జాను బోధించుచున్న కథయు జను లాతనిచుట్టును జేరుచున్న వార్తయు నెల్లవారికిని కర్ణతాడిత మయ్యెను. ఇట్లు కొన్ని మాస ములు జరుగునప్పటి కతఁడు జూడియామండలములో మిక్కిలి ప్రబలుఁ డయ్యెను. పామరజను లందఱు నాతని మహాత్మునిగా భావించి పూజించుచు వచ్చిరి; పలువు రతఁడు దేశోద్ధారణమునిమిత్తమయి యవతరించిన మహాపురుషుఁడని నమ్మిరి; తాను మెస్సయాను కానని యతఁడు బహిరంగముగా ఘోషించుచున్నను, అనేకు లతఁడే మెస్సయా యని భావించిరి. అతఁడు నిర్భయముగా తనికు స్థైన మాటా

చార్యులయొక్కయు ఫారిసీలయొక్కయు మాయవేషములను వెల్లడి పఱచుచుండుటచేత మతాచార్యులును లేఖకులును మాత్ర మాతనిని ద్వేషించి తిరస్కారభావముతోఁ జూచుచుండిరి. అయినను జనులకు జడిసి వారాతని నేమియుఁ జేయలేకుండిరి.

ఈకాలమునకు జీసస్సున కించుమించుగా ముప్పదిసంవత్సరముల ప్రాయము వచ్చెను. గొప్ప ప్రవక్త యొకఁడు బయలు వెడలి యెల్లవారిని శిష్యులనుగాఁ జేసికొనుచున్నాఁ డన్న వార్త చెవిసోఁకఁగానే జీసస్సు తనయిల్లును వ్యాపారమును విడిచి తన కొంచెపాటి శిష్యబృందమును వెంటఁగొని స్వగ్రామమునుండి బయలుదేఱి యెక్కడనో దక్షిణమున జాను బోధ చేయుచున్న దూరదేశమునకు తిన్నఁగా నడిచిపోయెను. ఇట్లతఁడు సంతోషదాయక మైన తనవాసస్థానమును సుఖములను విడిచిపోవునప్పు డతనికి తనకు ముందు కలుగఁబోయెడు స్థితినిగూర్చినచింత గాని తన కామరణమును బాధలును తన్మూలమున లోకమునకు మేలును గలుగు నన్న యాలోచనగాని మనస్సులో పుట్టెనదో లేదో! జానుయొక్క నిప్పులుగురియుమాటలు చెవిని బడఁగానే యాతనిమనస్సులో నుత్సాహాగ్ని రగులుకొని యొక్కసారిగా ప్రజ్వరిల్లెను. సమస్తదిక్కులనుండియు గుంపులుగుంపులుగాఁ బోవుచున్న మూకలతోఁ గలసి జార్డన్‌నది మృతసముద్రములో సంగమించిన చోటికి సమీపమునం దున్న జానువద్దకు జీసస్ వచ్చెను. అతఁ డక్కడకు వచ్చునప్పటికి దీర్ఘశిరోజములు భుజములనుండి వ్రేల, తల విరయఁబోసికొని, కన్నులనుండి నిప్పులురాల వికృతముగాఁ జూచుచు బాహువులు పయికెత్తి దృఢభక్తిసూచకముగా నభినయించుచు, బట్టబయల నిలువఁబడి మేఘగంభీరభాషణములతో వాగ్ధారాప్రవాహమును వర్షించుచున్న దృఢోన్నతశరీరుఁ డైన పురుషుఁ డొకఁడు కన్నుల

యెదుటఁ గానఁబడెను. అప్పు డాతనినోటినుండి "ప్రభువుయొక్క రాకకు దారిచేయుఁడని యరణ్యములో ఘోషించు చున్నవాఁడను నేను. నాతరువాత వచ్చుప్రభువు నాకంటెను శక్తిమంతుఁడు. ఆతని పాదరక్షలయొక్క వారును వంగి విప్పుటకైనను నేనర్హుఁడను గాను. అతఁ డీవఱకే మీలో నిలిచి యున్నాఁడు. ఆతనివ్యాజన మాతనిచేతి లోనే యున్నది. కృషీవలుఁడు ధాన్యమునుండి పొల్లెగరఁ గొట్టినట్లు, అతఁడు పాపాత్ములను భూమినుండి తొలగఁజిమ్మివేయును. కాఁబట్టి యనుతాపపడుఁడు; మీపాపకృత్యములను శీఘ్రముగా విడిచి మంచిని జేయుట కభ్యసింపుఁడు. ఈశ్వరరాజ్య మాసన్నమై యున్నది." అనుమాటలు పిడుగులు పడుచున్నట్లు బయలువెడలి వినువారికర్ణ రంధ్రములనుండి దూరి హృదయములను కలఁచుచుండెను. ఆసమయ మునం దక్కడ నున్నమూఁకలో ఫారిసీలును సద్దూసీలును కొంద ఱతనికంటఁబడఁగా జాను వారివంక గూఢదృష్టితోఁ జూచుచుచేతులు చాఁచి "ఓవిషసర్పములారా! రాఁబోవు కోపమునుండి తప్పించుకొండని మిమ్మెవ్వఁడు హెచ్చరించును? మీరు మీపాపములకు పరితాప పడినఁగాని మిమ్ము దేవుఁడు రక్షింపఁడు." అనునట్టివాక్యములను పలికి జనులవంకఁ దిరిగి "పశ్చాత్తాపపడుఁడు; పశ్చాత్తాపపడుఁడు. జ్ఞాన స్నానము పొందుఁడు" అనుమాటలు మాటిమాటికి నుపన్యసింపఁ జొచ్చెను. స్నానములు ముక్తిదాయకము లని ప్రాగ్దేశము నందెల్ల వారికి నమ్మక మగుటను బట్టి యతఁడు జనులు పశ్చాత్తప్తు లయి తన శిష్యులగుట కంగముగా జ్ఞానస్నానమును పేర జార్డన్ నదీజలా వగాహన మేర్పఱిచెను. అతని యాయుపదేశము విని పశ్చాత్తప్తు అయి వేలకొలఁది జనులు కన్నుల నీరుగార మూఁకలలోనుండి వెలు వడి పోయి నదిలో స్నానము చేసి వచ్చి యాతనికి శిష్యులగుచుండిరి.

జాను నదిగట్టున నిలుచుండి యుపన్యసించుచుండఁగా శిష్యులు స్నానముచేసి వచ్చువారును స్నానమునకుఁ బోవువారునునై గురువునకు భక్తితో ప్రణామము చేయుచుండఁగా, లెక్కలేని జనులు చేరువను నిలువఁబడి వేడుక చూచుచుండిరి. అట్టి సమయమునందు యౌవన పురుషుఁడొకఁడు జాఘ్యూకలోనుండి వెలువడి తాను జ్ఞానస్నానమునకు నీటిలో దిగెను.

అవలికే జాను కొంతకాలము నుండి జార్డను నదిగట్టున నిలువఁబడి నిత్యమును జనులకు బోధచేయుచు పశ్చాత్తప్తు లయిన వారికి జ్ఞానస్నాన మిచ్చుచుండెను. జనులు తమ పాపముల నిమిత్తమెప్పుడు చిత్తములో పశ్చాత్తాపము నొందుదురో యప్పుడు మెస్సయా తప్పక వచ్చు నని జానుకు దృఢవిశ్వాస ముండెను. ప్రతి దినమును వేలకొలఁది జనులు తనవద్దకు వచ్చి తమ పాపముల నొప్పుకొని యనుతాపపడి శిష్యులగుచుండుటచేత మెస్సయావచ్చి దర్శన మిచ్చు దిన మత్యాసన్న మయియున్నదనియు నతఁడు హృదయములో నమ్మి యుండెను. అంతకంతకు జను లధికముగా వచ్చి తమపాపము లనుగూర్చి శోకాగ్ని సంతప్తులై శుద్ధచరిత్రులుగా నుండవలె నన్న మనోనిశ్చయముతో తమతమ వాసములకుఁ బోవుచు వచ్చినకొలఁదిని మెస్సయామీఁది చింత బలపడి యతని కావచ్చెడువారిలోనే మెస్సయా యున్నాఁడేమో యన్న భ్రమసహితము కలుగుచు వచ్చెను.

అందుచేత నాతఁడు మెస్సయా యేవేళనో యేనిముషమందో వచ్చి దర్శనమిచ్చు ననియు, ప్రజారక్షకుఁడయిన యాప్రభువురాకను దేవుఁడు తరుణము వచ్చినప్పుడు ముందుగాఁ దనకుఁ దెలుపుననియు, నెదురుచూచుచుండి, యెవ్వని ముఖమునందైన మెస్సయా కాఁదగిన

లక్షణము లున్న వేమో యని తనవద్దకు స్నానమునకు వచ్చువారి ముఖములనెల్ల నిపుణముగా పరిశీలించి చూచుచుండెను. ఇట్లుండఁగా నొకనాఁడు తన బోధ ముగిసిన తరువాత పైన జెప్పినట్లొక యౌవన పురుషుఁడు నదిలో స్నానము చేసి తన వద్దకు వచ్చుచుండఁగా జాను కొంతతడవు నిశ్చలదృష్టితో తెప్పవాల్పక యతని మొగము వంకఁ జూచెను, అప్పు డతనిదృష్టికి తన్ను సంతోషపరవశుని జేయఁ దగినచిహ్నము లేవో యాయౌవనపురుషుని సాధుముఖము నందు పొడ కట్టెను. "ఇతఁడే యతఁ డగునా?" యని తనలోఁ దాను వితర్కించుకొనుచు, తన్ను సమీపించుచున్న యాపురుషుని నేకాగ్రచిత్తుఁ డయి తదేకదృష్టితోఁ జూచునప్పుడు చెవిలోఁ జెప్పి నట్లుగా జానునకు తనహృదయములో నుండి "ఇతఁడే మెస్సయా; దేవునిచేత నభిషిక్తుఁ డయినవాఁడితఁడే." యన్నశబ్దము వినఁ బడిన ట్లయ్యెను. అట్లు వచ్చిన యా యౌవనపురుషుఁడే జీసస్సు. ఆప్రవక్తయొక్క దృఢగంభీరోక్తులు చెవిని బడినప్పు డతని హృదయ మునం దావఱ కెన్నఁడును పుట్టని యనిర్వాచ్యమగు నొకవిధమైన యుద్దీపనము కలిగెను. అతఁ డాక్షణముననే త న్నొక దేవదూత చేయిచూపి కొనిపోవు చున్నదో యనునట్లు శాంతముఖముతో తిన్నఁగా జానుయొక్క సమ్ముఖమునకు నడిచెను. ముం దేమి జరగ నున్నదో యాతనిమనస్సున కప్పుడు పూర్ణముగా పొడకట్టకపోయినను, తాను పవిత్ర మయిన దేవకార్యము నిమిత్తము తనజీవమును నిశ్శం కముగా ధారపోయవలయు నన్న యీశ్వరప్రేరణ మాతని మనస్సులో నుదయించెను. ఆవఱ కాపుణ్యపురుషు లెప్పుడు నొండొరులముఖము లను జూచి యెఱుఁగనివా రయినను ప్రథమదర్శన సమయముననే వారిరువురకును దేవుఁడు హృదయములు నొక్కటిగాఁ గూర్చినట్లుగా

లోపలదృఢమైన స్నేహానుబంధము కలిగెను. మఱేమియు పలుకక యితరులవలెనే జీసస్సును జ్ఞానస్నానము నాతనివలనఁ బొందుట కయి నీటిలో దిగెను. అంతట జా నాతని వంక కొంచెము సేపు చూచి యనుమానించి "నేనే నీ వలన స్నానము పొందఁదగినవాఁడను. నీవే నావద్దకుఁ వచ్చుచున్నావా?" అని పలికెను. జీసస్ శాంతచిత్తముతో "ఇట్లుజరగనిమ్ము, ధర్మము సర్వమును నిర్వహించుట మన కిట్లే తగియున్నది." అని యుత్తర మిచ్చెను. పాపమునకు పశ్చాత్తాపపడి ధర్మాచరణదీక్ష వహించుట కితరు లవలంబించిన యీస్నానమార్గమే తనకును తగియున్న దని యీమాటల కర్థమై యుండును. అంతట జాను జీసస్సునకు జ్ఞానస్నాన మిచ్చెను. జీసస్ నీరువెలువడి వచ్చి యీశ్వరుని ప్రార్థించుటకై మోకరించుకొని కూరుచుండి యున్నప్పుడు జాను తనవద్ద నిలుచున్నవారితో "నా తరువాత నాకంటెను శక్తిమంతుఁ డొకఁడు రానున్నాఁడని నేను చెప్పిన దితనిని గూర్చియే. నేను మిమ్ము నీటిలో స్నానము చేయించినట్లే మి మ్మితఁడు పరిశుద్ధాత్మలో ముంచును." అని మెల్లగా చెప్పె నఁట. ఇందువలన జీసస్సే మెస్సయా యని యప్పు డందఱికిని గాకపోయినను జాను యొక్క మనస్సునకైనను తోఁచె ననుట స్పష్టము.

జీసస్సే మెస్సయా యన్న తనయభిప్రాయమును జాను పలువురతోఁ జెప్పినట్లు తోఁచదు. అందుచేత జ్ఞానస్నానవేళ నడచిన యీవృత్తాంతమును జనసంఘములో నంతగా వ్యాపించలేదు. జీసస్సు జ్ఞానస్నానము పొందిన తరువాత నత్యల్పకాలములోనే యక్కడ నుండి వెడలి పోయెను. జెరూసలేము నగరముననో మఱియెచ్చటనో జీసస్సు మహోత్సాహముతో తన పని నారంభించిన సువార్త యచిర కాలములోనే చెవిని బడు నన్న పూర్ణవిశ్వాసముతో జా నిక్కడ

యథాప్రకారముగా తా నారంభించిన పనిని తాను పూని
కతో నిర్వహించుచుండెను. జాను వద్ద సెలవు గయికొని
వివిధాలోచనలతో చిత్త ముత్క్రాంతి లూఁగ నొక్కఁడును
జీసస్సు మున్ను జాను తపస్సు చేసిన జూడియా యరణ్యమునకే
తిన్నఁగ తానును నడచెను. ఇంతకుముం దెన్నఁడు ననుకోని తానే
మెస్సయా యన్నవిశేష మొకటి యిప్పుడు క్రొత్తగా నాతని చెవిని
సోఁకెను. జానుయొక్క ముఖవీక్షణము వలన మెఱుము మెఱసిన
ట్లాకస్మికముగాఁ గలిగిన చిత్తోద్వేగములో నతఁ డీశ్వర కార్యమున
కయి తన జీవనమును ధారపోసెద నని కృతప్రతిజ్ఞుఁడయి యీవలకు
వచ్చినను, ఆయుద్రేకము కొంతశాంతి పొందినపిమ్మటఁ దాను నిర్వ
హింపఁ బూనుకొన్న ఘనకార్యమును సాధించుటకు తాను సమర్థుఁడ
నగుదునా కానా యన్న సంశయ మిప్పు డాతనిమనస్సును బాధింపఁ
జొచ్చెను. తాను పూనిన మహాకార్యము దుస్సాధ్య మనియు కష్ట
భూయిష్ఠ మనియు స్పష్టపడిన యిప్పు డాతనికి తాను మెస్సయా నగు
దునా యన్నవిషయములోనే సందేహముతోఁచెను. మెస్సయా నిర్వ
హింపవలసినపని సాధారణ మయినది కాదు. అట్టి యసాధారణ
కార్య నిర్వహణమునకుఁ జాలినంత బలమును బుద్ధికౌశలమును
నాయొద్ద నిప్పు డున్నవా? అట్టి శక్తిని భగవంతుఁడు నా కనుగ్ర
హించుట సాధ్య మగునా? నేనో యసహాయుఁడ నైనయప్రసిద్ధుఁ
డను; నిర్వహింపవలసిన కార్యభార మో దుర్భర మయినది. భవిష్య
ద్గతి నాలోచించిన నన్నియుఁ గష్టములే కానవచ్చుచున్నవి. జనులో
చపలచిత్తులు! నానాయకత్వ మంగీకరించి వారు కొంతకాలము న
న్ననుసరించి తరువాత నెదురు తిరిగి ప్రాణాంతము తేవచ్చును.
ఒక్కఁడు నాయకత్వము వహించి లోకము నంతను తనదారి కెల్లు

త్రిప్పఁ గలుగును! నే నిప్పుడు మెస్సయా నని బయలు దేఱితినె పో తరువాత జరుగవలసిన దేమి ? జను లామాట నమ్ముదురా? నమ్మిన యెడలఁ జేయవలసినపని యేమి? జనుల యభీష్టప్రకారము సేనలను గూర్చుకొని పోయి రోమనులతో యుద్ధము చేయవలెనా? జనుల కీశ్వ రునిగూర్చి బోధించి యొక్క-ధర్మమార్గోప దేశమునే చేయవలెనా? ఇటు వంటియాలోచనలు విరామములేక మనస్సునుబట్టి బాధించుచుండఁగా రేయింబగళ్ళు నిద్రాహారము లెఱుఁగక యతఁడా యడవిలో కాలము గడుపుచుండెను. ఇప్పు డీవిషయముల నన్నిఁటిని చక్కఁగా నాలో చించుకొని యొక కార్యాంశమునకు రావలెను. తాను మెస్సయా నగుదునా? యన్నవిచారము బహుదినము లాతని కాఁకలి తోఁచ నియ్యకపోయినను, ఆయంశములో నిశ్చితాభిప్రాయ మింకను మన స్సులో దృఢపడ లేదు. తాను మెస్సయా నగుదునో కానో శోధింప వలె నన్న తలం పాతని మనస్సులో నడుమనడుమఁ గలుగుచు వచ్చెను. అంతరాత్మయో నిరంతరము నాతని ధర్మానుసరణము నకు సుముఖుని జేయుచున్నది; కష్టచింతలో ధర్మమునుండి విముఖునిఁ జేయఁ జూచుచున్నవి. లోకోత్తరకార్యమున కుత్సహించు మహాపురు షులచిత్తములో నెన్నికష్టములు వచ్చినను ధర్మపథము నణుమాత్రము నతిక్రమింప రాదన్న సచ్చింతలు కలిగినప్పు డోకమూల కొన్నిసమ యములయందు ధర్మము నిమిత్తమయి సర్వసుఖములను ద్యజించి కష్టము లేల తెచ్చిపెట్టుకొనవలె నన్నదుశ్చింతలుకూడ నుదయిం చుట వింతకాదుగదా? అట్టి చింతలలో మొదటివానిని దేవతాప్రేర ణము లనియు, రెండవవానిని పిశాచప్రేరణము లనియు, బుద్ధిమంతు లాదికాలమునుండియు భావించుచున్నారు. నీ వీశ్వరనియుక్తుఁడ వని చెప్పి యీశ్వరరాజ్యమును భూమిమీఁద స్థాపన చేయునిమిత్తమై

నీశరీరమును తృణకణమువలె విడువు మని దేవప్రేరిత మైన సద్బుద్ధి ప్రోత్సాహపఱిచి యతనికి ధైర్యము చెప్పుచుండఁగా, పిశాచప్రేరిత మైన దుర్బుద్ధి తా నప్పు డప్పుడు నడుమవచ్చి యతని కధైర్యసంశయములు పుట్టించుచు వచ్చెను. అట్టిస్థితిలో క్షుత్పీడితుఁ డై యున్న యతని కొకప్పుడు "మెస్సయ కసాధ్యమేదియును లేదని పెద్దలు చెప్పి యున్నారే! నేనే మెస్సయా నైనపక్షమున నాయాఁకలి పోవునట్లుగా నిక్కడి రాళ్ళను రొట్టెలనుగా మార్చఁ బ్రయత్నింతునా?" అన్నబుద్ధి పుట్టి యింతలో "మనుష్యుఁడు రొట్టెలవలననే జీవింపఁగూడదు; ఈశ్వర ముఖమునుండి వచ్చిన వాక్యములవలన జీవింపవలెను." అన్న వేద వాక్యము జ్ఞప్తికి వచ్చి యాతలంపు తొలఁగిపోఁగా నతనికి మరల తన హృదయములో నున్న యీశ్వరాజ్ఞ ననుసరించి తానొక్క ధర్మావలంబమువలననే జీవింపవలె నన్నబుద్ధి పుట్టెను. మఱియొకప్పు డతఁడలసి సొమ్మసిల్లి కన్నులు మూసికొని కునుకుపాట్లలో తాను జెరూసలేము నగరములోని దేవాలయముయొక్క గోపురాగ్రమున నున్నట్లు భావించుకొని యాభావనలోఁ గూడ మెస్సయా చింత మఱచిపోక "నేనే మెస్సయా నైన పక్షమున, దీనిమీఁదినుండి యుఱికినను దేవుఁడు నన్ను క్రిందపడకుండ రక్షింపఁడా?" అనుకొని యాస్థితిలోనే మరల "నీవు నీప్రభువైన యీశ్వరుని శోధింపఁగూడదు" అన్న వేద వాక్యమును స్మరణకుఁ దెచ్చుకొని భగవంతుఁడు తన్ను రక్షించునో లేదో శోధించుటకై యాపదలను బుద్ధిపూర్వకముగా తెచ్చుకోరాదని తన యుద్యమమునుండి మరలుకొనెను. ఇట్టి యారాటములోనే యింకొకసారి యతఁడు తాను పర్వతాగ్రమునం దధివసించి చుట్టును గల రాష్ట్రములను జూచుచున్నట్లుగా భావించుకొను చుండఁగా "ఇతరుల [illegible] నీవు కొంచెము స్వార్థపరుఁడ వయి నిష్కారుణుఁడ వైనపక్షమున

మెస్సయాభావము వహించి నీ పీ గాష్ట్రియుల కన్నిటికి రాజ నగుటకు నీశక్తి నుపయోగించుకొనవచ్చును." అని హృదయములో నెవ్వరో చెప్పిన ట్లయ్యెను. అతఁ డామాట వినఁబడగానే తెలివి తెచ్చుకొని "ఇది దుశ్చింత. ఓపిశాచమా! ఇక్కడనుండి తొలఁగిపొమ్ము. వేదములో చెప్పినట్లు సమస్తవిషయములలోను నేనీశ్వరునే పూజించి సేవింపవలెను. ఉత్తమోత్తమమైన మార్గమునఁ దక్క నన్యవిధమున నేను దేవునికార్యమును జేయ యత్నింపను." అని పలికెను. ఇవియే పిశాచప్రేరణము లైనట్టు గ్రంథములయందు విచిత్రముగా వర్ణింపఁబడినవి. ఇట్టి హృదయాందోళనములతో నాతని కా యడవియందు నలువది యహోరాత్రములు గడచినవి. ఈప్రకారముగా కర్తవ్యనిశ్చయము గానక నలువది దినములు త్రొక్కటపడిన తరువాత నాతని మనస్సునకు పిశాచప్రేరణము వదలి దేవావేశము కలిగెను. అంతటితో నాతనికి లోపలఁ గల యాందోళనమును సందేహములును తొలఁగిపోయెను; శాంతియు సంతుష్టియుఁ గల దయి చిత్తము స్వస్థపడెను. అప్పు డతఁడు తాను ధర్మసంస్థాపనార్థ మీశ్వరునిచే నియోగింపఁబడిన మెస్సయా నని మనస్సులో ధ్రువపఱచుకొని నాఁటినుండి దేశోద్ధారణనిమిత్త మాత్మార్పణము చేయకృతనిశ్చయుఁ డయ్యెను. తనదారి సుగమ మయినది కాదనియు ప్రాణాపాయకరము సహితము కావచ్చు ననియు స్పష్టముగా నెఱిఁగినవాఁ డయ్యెను, అతఁ డాక్షణమునుండియు నొకప్పుడును వెను కంజవేయక తాను మార్గదర్శియై నడిపి జనుల నజ్ఞానమునుండియు దుస్థ్సితి నుండియు, పాపములనుండియు విముక్తులనుజేయ బద్ధకంకణుఁడై సమస్తమునకు నీశ్వరునే నమ్ముకొని కష్టములను సరకు సేయక యీశ్వరసేవ కయి ముందుకు నడవఁ జొచ్చెను. ఇంతవఱకును జీసస్సునుగూర్చి చెప్పినది

సామాన్యపు వడ్రంగిగా నున్నప్పటి చరిత్రము; ఇఁక ముఁదు చెప్పఁ బోవునది దేవకార్యమునందు నియుక్తుఁడైన మెస్సయాగా వర్తించునప్పటి చరిత్రము. అప్పటి చర్యను బట్టియే జీసస్సునకు మెస్సయాకు పర్యాయపదమైన క్రీస్తను విశేషాభిధానము కలిగినది.



## నాలవ ప్రకరణము.

•••○❀○•••

### జీసస్ మొదట స్వస్థలమున ధర్మప్రవచనము చేయుట.

జానువలన జ్ఞానస్నానము పొందుకాలమునకు జీసస్సుప్రాయము దాదాపుగా ముప్పదిసంవత్సరములు. పెక్కుశోధనలకు లోనయి కట్ట కడపట తానే మెస్సయా నన్న పూర్ణవిశ్వాసముతో నరణ్యమునుండి వెడలి వచ్చినతరువాత నతఁడు తనకు జ్ఞానస్నానమును ప్రసాదించి యీశ్వరదాస్యమున కయి యాత్మార్పణము చేయఁ బురికొల్పిన జాను వద్దకు మరలఁ బోయి యాతనిని సందర్శించి ధర్మప్రవచన మారంభించుట కయి యాతనివలన ననుజ్ఞ గైకొని యుండవచ్చును. అసమా వేశసమయమునందును జాను మరల తనప్రియశిష్యులతో నితఁడే మెస్సయా యని చెప్పియు నుండవచ్చును. అయినను తామే మెస్స యాల మని యీవలఁ కెందరో వీరావేశముచేత బైలుదేఱి నాలుగు దినములు సివములాడి తాము పూనినకార్యభారము నణుమాత్రమును నిర్వహింప శక్తులు కాక కడపట భగ్నమనోరథులయి నామరూప ములు లేకుండ నడఁగిపోవుచు వచ్చుటచేత విన్నజనులుమాత్రము సంశయమనస్కులయి వేగిరపడి తాము మరల నింతలో మోసపోవుట కిష్టము లేనివారయి జీసస్ నిజమైన మెస్సయా యగునో కాఁడో నిర్ధారణము చేయుటకుఁ దగిననిదర్శనములు కనఁబడుటవఱకు నిదమిత్థ మని నిశ్చయింపక వేచి యుండుట కయి పలువు రుద్దేశించుకొని యున్నట్టు తోఁచుచున్నది. అతఁడు జానువద్ద సెలవుగైకొని బయలు దేఱి నదీతీరమున కాలినడకను బోవుచున్నప్పు డంతికము న్నితఁడే

మెస్సయా యని గురువు తమకుఁ జూపినజానుశిష్యులు కొందఱు
జీసస్సును వెంబడించి, అతనితోడఁ గూడ నడవఁజొచ్చిరి. ఇట్లు కొంత
దూరము నడచినతరువాత జీసస్ వారిని వెనుక తిరిగి చూచి "మీకుఁ
గావలసిన దేమి?" అని యడిగెను. అప్పుడేమి చెప్పుటకును తోఁచక
శాంబోలును వారడిగినదానికి బదులు చెప్పక "స్వామీ! నీ వెక్కడ
వసించెదవు?" అని మరల ప్రశ్న వేసిరి. "మీరే వచ్చి చూడుఁడు"
అని వారి కుత్తరము చెప్పి తలవంచుకొని యతఁడు మరల యథా
పూర్వకముగా నడుచుచుండెను. తదాజ్ఞానుసారముగ వారతని
వెంటఁబోయి కొంతకాల మతనితో సహవాసము చేసి తరువాత
నతఁడు జానుకంటె తప్పక గొప్పవాఁడని తమమనస్సులలో నిశ్చయము
చేసికొనిరి. అతఁడు శాంతస్వభావుఁ డగుటవలన మానసోద్రేకమును
గలిగించు తీవ్రలక్షణము లేనియు నాతనియందు పొడకట్టకపోవుటచేత
క్రొత్తగా చూచువారి కతఁడు సామాన్యమానవుఁడుగానే తోఁచును
గాని యితరులకంటె నతనియందు విశేష మేమియు కనఁబడదు.
కాని, యతనితోఁ గొంతకాలము పరిచయము చేసి యతనివాక్యము
లను వినుచు నతనివర్తనమును గనిపెట్టువారికి మాత్ర మాతని చేష్ట
లును మాటలును సమ్మోహజనకము లయి యతనియం దనురాగ
మును గౌరవమును గలిగింపక మానవు. ఇట్లతఁడు పూర్వము తన
వెంట వచ్చినట్టియు నిప్పుడు క్రొత్తగాఁ జేరినట్టియు పరిమితశిష్య
బృందము వెంటనంటి రాఁగా గాలిలీ దేశములోని స్వస్థానమును
గూర్చి ప్రయాణము చేయుచుండెను. మెస్సయావలన జనులు ప్రతీ
క్షించుచున్నట్లుగా యుద్ధములతోను సేనలతోను తనకుఁ బనిలే
దనియు తాను జేయవలసినపని యంతయు తన యుపదేశములచేతను
వర్తనముచేతను స్వదేశస్థులకు పరిశుద్ధ మయిన యుత్తమజీవనమార్గ

మును బోధించుటయే యనియు నతఁ డరణ్యములో నున్నప్పుడే నిశ్చయము చేసికొన్నందున, ఆనిశ్చయమునుబట్టి తాను జేయఁదలఁచు కొన్నపనిని తా నెఱిఁగియున్న దేశమునకుఁ బోయి యెఱిఁగియున్న వారిలోనే యారంభించుట యధికప్రయోజనకరముగా నుండు నని భావించుకొని యాయుద్దేశముతోనే స్వదేశాభిముఖుఁ డయ్యెను.

అతఁడు స్వస్థలమును జేరుటకు లోపలనే సకలజనసంక్షోభకర మయిన వైపరీత్య మొకటి సంభవించెను. ఆకస్మికముగా జాను రాజ భటులచేతఁ బట్టుకోఁబడి కారాగృహమునందుఁ బెట్టఁబడె నన్న పిడుగు వంటి దుర్వార్త త్రోవలోనే యతని చెవి సోఁకి కొంత హృదయతాప మును గలిగించెను. అంతేగాని యా దుఃఖవార్త వజ్రసన్నిభ మైన యాతనిహృదయమును సంచలింపఁజేసి పూనిన పూనికనుండి యాతనిని మరలింపఁగలిగినది కాదు. రాజదండనమునకు పాత్రుఁ డగుట కయి జాను చేసిన యపరాధ మేదియు లేదు; జానుయొక్క ప్రసిద్ధియు జనానురాగకథయు విని, తన ప్రజానురాగబలముచేత నతఁడు ముం దేమయిన జనసంక్షోభమును ప్రేరేచునేమో యన్న భీతిచేత హీరాడ్ అంటిపస్ సేనలను బంపి పట్టి తెప్పించి యాతనిని చెఱసాలలోఁ బెట్టించెను. ఘనుఁ డైనయాబోధకుఁ డిప్పుడు రోమనులచేతులలో నున్నందున, ఎప్పుడో యేవేళనో యతఁడు వధింపఁబడుట నిశ్చయము. జనప్రియుఁ డయి ప్రఖ్యాతి గాంచి జనులను తనమార్గమున నడపఁ గల యవస్థ తటస్థించినప్పుడు తనకును నట్టిగతియే పట్టవచ్చునని జీసస్సు మనస్సులో నప్పుడే యూహ కలిగెను. అట్టియూహనుబట్టి తనకు ముందు రాఁబోయెడి యాపదలవిషయ మయి యతఁ డెంతమాత్ర మును సందేహము పొందనివాఁడయినను, అతలం పతనియుద్యమము నకు విఘ్నకారణము కాక జాను కారాబద్ధుఁ డయి యుండుటనుబట్టి

పని చేయువారు లేనందునఁ దాను మఱింత శీఘ్రముగా పని కారం భింపవలె నన్న ప్రోత్సాహము పుట్టించుటకు హేతు వయ్యెను.

మతాచార్యులదుర్నయములను నిర్భయముగా బయలుపుచ్చుట మొదలగు కొన్నివిషయములలో నొండొరులను బోలి యున్నను, స్వరూప స్వభావములయందును బోధించుటకు స్థలములు మొదలయి నవి యేర్పఱుచుకొనుటయందును బహువిషయములలో జానునకును జీసస్సునకును మిక్కిలి వ్యత్యాసము గలదు. జాను మహోగ్రస్వభా వుఁడు; జీసస్ పరమశాంతస్వభావుఁడు. జాను బిగ్గరగా భీషణకటు నినాదముతో ఘోషించెడువాఁడు; జీసస్ మెల్లగా మృదుమధుర స్వరముతో నుపదేశించువాఁడు. జాను నిస్సంగుఁడయి విశేషకాలము నిర్జన ప్రదేశములయందుఁ గడపుచు వనవాటులలో బోధింప నిచ్ఛ గలవాఁడు. జీసస్ సంగశీలుఁడయి నిరంతరము జనులతోఁ గలసి మెలసి వసించుచు బహుజనాకీర్ణము లయినజనపదములలో బోధింప నభిలాష గలవాఁడు. ఇట్టిస్వభావగుణములతో మొట్టమొదట జీసస్ తాను కొంతకాలము వాసముచేసిన కేపర్నాముగ్రామములో ధర్మ బోధము చేయుట కుపక్రమించె. అతనిబోధను వినుటకయి జనులు గుంపులుగుంపులుగా వచ్చి యతనిచుట్టును మూఁగజొచ్చిరి. తాను మెస్సయానని యప్పటి కతఁడు మనస్సులో దృఢముగా నమ్మి యున్నను, తాను చెప్పినదానిని చేసినదానిని పరీక్షించి జనులే గ్రహింపవలెనని కాఁబోలును ముఖ్యు లయినతన పరమాప్తులతో నెవ్వరితోనో దక్క మఱి యెవ్వరితోను జీసస్సు తాను మెస్సయా నని బహిరంగముగాఁ జెప్పలేదు. ఐక్యకంఠముతో నెల్లవారును తన్ను మెస్సయాను గా గ్రహించి విశ్వసింతు రన్ననమ్మిక యతనికిసహితము లేకయే యుండవచ్చును. అతఁడు తన్నెప్పుడు చెప్పుకోవలసి వచ్చినను

మెస్సయానని చెప్పుకోకపూర్వము డేనియల్ తనస్వప్నదర్శనములోఁ జూచిన (యీశ్వరధర్మప్రవచనము చేయు) దేవదూతకుఁ బెట్టిన "మనుష్యపుత్రుఁ" డన్న పేరును తానుధరించి "నేను" అనుటకు పర్యాయపదముగా "మనుష్యపుత్రుఁడు" అన్నమాటనే తఱచుగా వాడుచు వచ్చెను. మాయయు మర్మము లెఱుఁగక ఋజువర్తనులయి యతనిబోధను పరిశుద్ధహృదయములతో నమ్మి భక్తితోఁజేరిన పిన్న వయస్సువారైన స్త్రీపురుషులుమాత్ర మప్పుడప్పుడు "నీవే మెస్సయా" వని యతనితో ననుచు వచ్చిరి. పూర్వగ్రంథముల ననుసరించి మెస్సయా డేవిడ్ సంతతివాఁడయి యుండవలసినందున, మెస్సయా యనుమాటకు పర్యాయపదముగా వా రాతనిని "డేవిడ్ పుత్రా!" అనియు పిలుచుచు వచ్చిరి. జీసస్ తాను డేవిడ్ వంశజుఁడ నన్నవిషయ మును విశ్వసించినను విశ్వసింపక పోయినను, ఆయర్థమునందు వారట్లు తన్నుపిలుచుట కామోదించుచు వచ్చెను. అయినను తానుమాత్ర మతఁడు తన్నా పేరితో నెప్పుడును జెప్పుకొనక మనుష్యపుత్రుఁ డన్న నామమునే తృప్తితో వహించుచుండెను.

తాను జేసెడిహితబోధమును విశ్వసించి తన్ననుసరించువారు కొంతకాలమువఱకును కొందఱుమాత్రమే యుందురనియు నతఁడు మొదటనే దృఢముగా నెఱుఁగును. తనయం దవ్యాజవిశ్వాసము గల వారికిఁ గొందఱికిమాత్రమే తనసిద్ధాంతములను కూలంకషముగా బోధపఱిచి మనస్సులో దృఢముగా నాటించి తా నాకస్మికముగా నిహలోకయాత్ర పరిసమాప్తి పొందించి దేహము త్యజింపవలసి వచ్చినయెడలఁ దానారంభించినపనిని తనయనంతరమున ధైర్యసాహ సములతో నిర్వహించుటకయి వారిని సమర్థులను జేయవలె ననియే యూతనియూహ. అందుచేత జీసస్ పరమాప్తులుగాను శ్రద్ధాళువులు

గాను నుండెను కొందఱుప్రియశిష్యులను తనవద్దఁ జేర్చుకొని, సంఘ
మునకు సాముదాయకముగా బోధించునప్పుడు మూల శక్తులుగాని
యధికశ్రద్ధతో వారిని శిక్షితులనుగ జేయవలెనని నిశ్చయించుకొనెను.
ఆపనినిమిత్తమై యతఁడు తనబోధలను వినవచ్చువారిస్వభావ
స్వభావములను నిపుణముగా పరిశీలించుచు, ఎవ్వరిని తన కాంతరంగి
కులనుగాఁ జేర్చుకొనవచ్చునో యెవ్వరిని జేర్చుకొనరాదో తనలోఁదా
నాలోచించుకొనుచుండెను. ఇట్లాలోచించి కొన్నినెల లయినతరు
వాత నతఁడొకనాఁడు త్రైబీరియస్ సరస్తీరమునందు నడుచుచు తన
బోధము నాపటికి వినవచ్చుచుండెడివారయిన యనుయాయులగు
బెస్తవాండ్రు కొందఱు చేపలఁ బట్టుచుండఁగాఁ జూచి వారిని చేరఁ
బిలిచి "మీరు నావెంట రండు. నేను మిమ్ము చేపలను గాక మను
ష్యులను పట్టువారినిగాఁ జేసెదను." అని చెప్పఁగానే వారు తత్క్ష
ణమే తమ పడవలను వలలను విడిచి యాతనివెంటఁ బోయిరి. ఈప్రకా
రముగాఁ జేర్చుకొనఁబడిన ముఖ్యశిష్యులనామకథనాదులు యుక్త
స్థలమునందు వివరింపఁబడును. అతఁడు తాను ప్రియశిష్యులనుగాఁ
జేకొన్నవారికి విశేషశ్రద్ధవహించి బోధించినను, సామాన్యముగా
తనవద్దకు వచ్చువారికందఱికిని మానక సర్వకాలములయందును బోధ
చేయుచునే యుండెను. ఆతనిబోధనాశక్తినిబట్టిమాత్రమే కాక రోగు
లను స్వస్థపఱిచెడి యద్భుతశక్తినిబట్టికూడ నాతనిఖ్యాతి శీఘ్రకాల
ములోనే చుట్టుపట్లదేశమునం దంతటను వ్యాపించెను. అందుచేత
చేరువనుండియు దూరమునుండియుఁ గూడ నానూతనబోధకునిబోధ
వినుటకును వ్యాధులను నివారణము చేసికొనుటకును జనులు రాఁ
దొడఁగిరి. గాలిలీదేశమునం దంతటను బయట యెరూసలేమునగరము
వఱకునుగూడ కొంతకాలములో నాతనికీర్తి వ్యాపించెను. కొలఁది

సంఖ్య గలయాత్రలలో మొదట తేన కేపర్నాముగ్రామము ప్రవేశించి ధర్మోపదేశము చేయ నారంభించినను, కొన్నిమాసములు గడచినప్పటి కతఁ డెక్కడకుఁ బోయినను జను లతనినిగూర్చి యద్భుత కథలను జెప్పుకొనుచు వెంటఁ బడఁ జొచ్చిరి.

లోకములో జన్మభూమి యెట్టివారికిని ప్రియతమ మైనది కదా! అతఁ డీప్రకారముగాఁ గొంతకాలము తన కడపటి వాసస్థల మైన కేపర్నాముగ్రామములో బోధచేసి పేరు పొంది తన జన్మస్థలమును జూడవలె నన్న వాంఛపుట్టఁగా బయలుదేఱి త్రోవపొడుగునను గల గ్రామములలో బోధచేయుచు తుద కొకనాఁడు నాజరెత్ గ్రామము ప్రవేశించెను. ఆనాటికే యతని కీర్తి యాప్రాంతములయం దంతట నల్లుకొనెను. తమ గ్రామములో నుద్భవించినవాఁ డొకఁడు బైలుదేఱి ప్రవక్త యయి యెల్లయెడలఁ బ్రఖ్యాతి గాంచుచున్నాఁ డని విన్నమాత్రముననే యెల్లవారికిని సంతోషము పట్టరాకుండునుగదా! అట్టివాఁడు తమయం దాదరము గలవాఁ డయి మరల తమ గ్రామమునకు వచ్చి వాక్సుధాధారలను వెదచల్లఁ బోవుచున్నాఁ డని తెలిసికొన్నప్పుడు తద్బోధామృతరసపానము చేసి యానందపరవశులము కావలె నన్న బుద్ధి యెవ్వరి మనస్సులలో నుదయింపకుండును? అది యతఁడు పుట్టిపెరిగిన స్థల మగుటచేత నాజరెత్తు గ్రామములోనివా రందఱు నాతనిని చక్కఁగా గుర్తెఱుఁగుదురు; అల్పకాలముక్రిందటనే స్వగ్రామమును విడిచిపోయిన యతఁ డింతలో నాకస్మికముగా ప్రసిద్ధపురుషుఁ డయి మరల స్వజనమును జేరవచ్చుచుండెను. అట్టిస్థితిలో నామహాపురుషునికి తమ గ్రామము జననస్థానమై ధన్యతగన్న దన్న గర్వముచేత తద్గ్రామవాసు లెవ్వ రద్భుత ప్రమోదమగ్న మానసులు కాకుందురు? జీసస్ చేసిన యద్భుతచర్యలనుగూర్చి యావఱకే

వినియుండుటచేత నతఁడు తమ మొదల నధికగౌరవానురాగములు చూపి తమ గ్రామమున మఱింత యధికముగా సత్క్రియ్మాత కార్యములు చేసి తమ్మందఱ సంతోషపెట్టు నని యాగ్రామవాసు లెల్లరు నెదురుచూచుచుండిరి. అందుచేత జీసస్ స్వగ్రామము చేరఁగానే నాజరెత్తుగ్రామనివాసు లందఱు నాతనిఁ జూడవచ్చిరి. "అతిపరిచయా దవజ్ఞా" యను న్యాయముచేత పూర్వపరిచితు లనేకు లతనిని తమవాఁడే యన్న యనాదరభావముతో చులుకఁగా జూచియు నుందురు. పేరు పెంపు లేని యతని కుటుంబస్థితినిగూర్చి యందఱు నెఱిఁగినవా రగుటచే స్వగ్రామమున నతని కంతగౌరవము కలుగక పోవుట వింతగాదు. ఆతని తల్లిని తోఁబుట్టువులను బావలను కన్నుల యెదుట నిత్యమును జూచుచుండెడివా రతనిని డేవిడ్ రాజవంశజుఁగా నెట్లు భావించి సమ్మానింపగలుగుదురు? ఇతరగులసూట యటుండఁగా తుద కతని కుటుంబమువారే యచ్చట నతనిని ప్రవక్తనుగా నంగీకరింపక ప్రతిపక్షు లయిరి. పూర్వస్నేహితులు పూర్వపరిచయముతోనే యాతని సమీపించి తమ్ము విడిచిపోయిన తరువాత నాతనియందు గలిగిన గొప్ప మార్పును గనిపెట్టలేక పూర్వపురీతినే కుశలప్రశ్నలను వేయఁ జొచ్చిరి; ఎల్లవారును చనవుతో ముందుకు వచ్చి యితర స్థలములలోఁ జూపిన వింతలను దమకుఁ జూపు మని పీడింపఁ జొచ్చిరి. నాఁడు తాను దేవాలయములో నుపదేశము చేయుట కయి యేర్పఱుపఁబడిన సమయము సమీపించకముందే యశేఁసు స్వగ్రామవాసులు తన బోధనలయందు భక్తివిశ్వాసములు కలవారు కారనియు తనచేత నేవో యింద్రజాలములు చేయించి వేడుకచూచి యానందింపఁ జూచుచున్నా రనియుఁ దెలిసికొనెను. అవలఁ గానినిని జూచి యుండనివారు మాత్రము గౌరవసూచకము లైన శీతలవాక్యములతో

నాతని నాదరించి యభినందించిరి. జీసస్ నాఁడు దేవాలయములో ప్రసంగము చేయఁబోవుచున్నాఁ డని యూరంతటను దెలిసినందున, ఉపాసనాసమయమునకు ముందే యచ్చటి చిన్న దేవాలయ మంతయు జనులతోఁ గ్రిక్కిఱిసిపోయెను. సాధారణముగా చదివెడు ప్రార్థనలును ధర్మశాస్త్రవచనములును ముగిసిన తరువాత జీసస్ పూర్వప్రవక్త యైన యిసాయాయొక్క గ్రంథములోనుండి "ఈశ్వరుఁడు బీదలకు శుభవార్తలను బోధించుట కయి నన్నభిషిక్తుని జేసినందున, ఈశ్వరుని యాత్మ నన్నిప్పు డావేశించియున్నది." అన్న వాక్యము నందుకొని యాప్రకరణమును జదివి ముగించి, ఆవిషయమునే తనప్రసంగములో ననువదించి తా నాప్రవక్తల వాక్యము సత్య మగునట్లుగా శుభవార్తను శాంతాత్ములకు బోధించుటకును భగ్నహృదయులను సంస్థాపించుటకును శోకార్తులకు దుఃఖశాంతిచేయుటకును సర్వజనాదరణీయ మైన యీశ్వరవాక్యమును బోధించుటకును వచ్చితిననియు, ఈశ్వరాజ్ఞకందఱును బద్ధులై యెల్లవారల హృదయములలోను కారుణ్యమే రాజ్యము చేయు కాలము వచ్చినప్పు డెల్లవారును భూతలస్వర్గసుఖము ననుభవింతు రనియు, ఉపన్యసింప నారంభించెను. ఈ ప్రథమవాక్యములు సర్వజనులకును కర్ణరసాయనముగా నున్నందున, దేవాలయములోనివా రందఱు నొండొరుల మొగముల వంకఁ జూచుచు "ఇతఁడు జోసఫ్ కొడుకు కాఁడా? అంతకాలము వడ్రంగిగా నుండి మనలో నివసించినవాఁ డింతలో నిట్లు ప్రసంగింపఁ గలుగు నని యెవ్వ రూహింపఁ గలరు?" అని యతని శ్లాఘింపఁ జొచ్చిరి. ఇట్లీవిధముగాఁ గొంతసేపు ప్రసంగించి తరువాత జీసస్ మఱియొక ధోరణికి దిగెను. అతఁ డక్కడకుఁ బోయిన యుద్దేశము వారిని దిద్ది బాగుచేయవలె ననియే కాని ప్రియవాక్యములు పలికి వారిని సంతోషపెట్టి

తాను మెప్పొందవలయునని కాదు. ప్రసంగము యొక్క పూర్వభాగమునం దతఁడు సూచించిన భావిమహోత్కృష్టదశను పొందుటకు మార్గ మేదో యిప్పుడు విశదముగాఁ దెలుపవలెను. సాధ్యమైన మొదల వా రేయేవిషయములలో తప్పుదారులు త్రొక్కుచున్నారో, ఆలోచించుటకును వర్తించుటకును యోగ్యము లైన యుత్తమ మార్గములేవో, చూపి వారికన్నులు తెఱచుట కర్తవ్య మైనందున, నతఁ డిప్పుడు తనవారు సంస్కరించుకోవలసిన దోషములను జూపి సంస్కారమార్గముల నుపదేశింప నారంభించెను. మార్గోపదేష్టయయి తాను ధర్మముల నుపదేశించు చున్నప్పుడు తన పూర్వపరిచితులు తన్ను స్వోత్కర్షము చూప వచ్చిన గర్వితునిగా భావించి యసూయాగ్రస్తు లయి యున్నారని వారి చేష్టావికారములవలనఁ గనిపెట్టి, లేశమును సంశయపడక యతఁడు తా నప్పు డుపదేశించు చున్న వాక్యములు తనవి కావనియు తనలోపల నుండి పలికించు చున్న యీశ్వరునివాక్యము లనియు దృఢముగా భావించి మఱింత యుత్సాహముతో "మీస్థితి చూడఁగా 'వైద్యుఁడా! ముందు నీరోగము నీవు కుదుర్చుకొమ్ము' అన్న పూర్వపుసామెత నాకు స్మరణకు వచ్చుచున్నది." అని చెప్ప నారంభించెను. జనుల కాతని మాటలు రుచింపక పోఁగా వారు "ఇంట గెలచి రచ్చ గెలువుము. ముందుగా నీపని నిక్కడ నారంభింపుము. నీమహిమల నిక్కడఁ జూపి, తన్మూలమున వచ్చెడి కీర్తి నీవాసస్థల మయిన యిక్కడ నుండి యితరస్థలములకు వ్యాపించునట్లు చేయుము." అని యేవేవో ప్రలపింపసాగిరి. ఆమాటల కతఁడు కోపపడక వినయముతోను విచారముతోను, తాను మహిమలను జూపి ప్రజలను వినోదపెట్టుట కయి యక్కడకు రాలే దని తెలియఁ బలికెను. అతఁ డప్పుడు జేయుచుండిన యుప

దేశము దైవాదేశప్రేరిత మనియు నీశ్వరసందేశ మనియు వారి మన స్సులలో నాదరము కలుగలేదు. ప్రవక్తగా నతఁడు స్వగ్రామమున కేదో గొప్పతనమును సమకూర్చవలయు నన్నచింత దప్ప వారి మనస్సుల కన్యచింత తోఁచలేదు. అట్టి సమయములో జీసస్ మరల నందుకొని "ఒక్క స్వదేశమునఁ దక్క మఱియెక్కడను ప్రవక్త గౌరవము పొందకుండఁడు" అన్న లోకోక్తి నుదాహరించి, ఈశ్వర రాజ్యమును భూమిమీఁద వ్యాపింపఁ జేయుటకంటె స్వోత్కృష్టతను వారెక్కువగాఁ జూచుకొనుచున్నంతవఱకును తాను వారిలోఁ గలిసి పనిచేయఁయత్నించుట వ్యర్థమని వారికిఁజూపఁ బ్రయత్నించెను. అతఁడు నిర్భయముగాఁ బలుకుమాటలు వారి కంతకంతకు కర్ణకఠోరము లుగాఁ దోఁచుచురాఁగా "ఇతఁడు మనలను తిరస్కరించుచున్నాఁడు" అని యొకఁడును, "ఇతఁడు మనకు ప్రవక్త కాఁడు, మనలను యోగ్యు లనుగా భావింపఁడు" మనకొఱకు మహిమల నేమియుఁ జూపఁడు". అని మఱియొకఁడును, పలువురు పలువిధములఁ దమలోఁదాము గుస గుస లాఁడఁ జొచ్చిరి. జీసస్ వారి మనోగతములను ముఖచేష్టాది వికృ తులను స్పష్టముగాఁ జూచియు నింకక యెప్పటిధోరణినే ప్రసంగము సాగించి యీశ్వరదృష్టియందు తనవారును పరులు నన్న భేదము లేక యుందఱును సమానులే యనియు తానునట్లే కులీనతా సంపన్నత్వాదు లగు ప్రాపంచిక చంచలౌన్నత్యములను పాటింపక తన్నెవ్వరు జ్ఞాన కాంక్షులును దీనులు నయి సమీపింతురో వారి చిత్తోపశాంతి కయి ముందుగా శ్రద్ధ చేయవలయు ననియుఁ జూపుట కయి కొన్ని యుప మానములు తెచ్చెను. ఆ యుపమానములు తమ్ము లాఘవపఱచుట కయి తేఁబడిన వని దురహంకారు లయిన యా నాజరెత్తు గ్రామవాసులు భావించుకొనుటయందున వారి చెవుల కవి దుస్సహము

లయ్యెను. అంతేకాక యింతవఱకును తమయూర తక్కువగా బ్రతికిన వడ్లంగి కొడుకు వచ్చి తమవర్తనములో తప్పులు పట్టి తమకు మార్గోపదేశకుఁడు కానా యన్న దురభిమాన మొకటికూడ వారి మనస్సులను బట్టుకొనెను. ఈ రెండు కారణములచేతను వారు ప్రారంభదశలో నాతని ప్రసంగము కలిగించిన సంతోషమును గింతో షమును మఱచి యాతని యుపదేశమును విననొల్లక యుల్లంఘనసాగించిరి. ఈవిధముగా సంతకంతకు మూర్ఖత్వము ముదురఁగా వారు రొమ్ము రేఁగి దౌర్జన్యమున కారంభించి కాఱు లఱచుచు నాతనిమీఁదఁబడి ఆతనిని దేవాలయములో నుండియు గ్రామములో నుండియు దూరముగా నీడ్చుకొని పోయి యొక కొండకొన కెక్కించి యచ్చటనుండి తలక్రిందుగా క్రిందికిఁ బడఁద్రోచి చంపఁ జూచిరి. అతఁ డప్పటికిని వారి కోపమునకు భయపడక కఠినోక్తులాడక శాంతచిత్తుఁడయి నిశ్చలుఁడయి యూరకుండెను. పర్వతాగ్రమునకుఁ గొనిపోవులోపల వారి కోపము కొంతశాంతి పొందినందుననో, ప్రాణదానమునకుసిహి తము వేఁడక నిశ్చలచిత్తముతో మౌనముగానియున్న యాతని యాకారమును జూచిన మీఁదట జాలిపుట్టినందుననో, వారాతనిని క్రిందికిఁ బడఁద్రోయక కొండకొమ్మున దిగవిడిచి తమదారిని తాము గ్రామమునకుఁ బోయిరి. జీసస్ స్వగ్రామమునకుఁ బోవుట కిదియే కడసారి.

స్వగ్రామమున జరగిన యీయవమానము వలన నతఁ డిలు మాత్రమును నిరుత్సాహుఁడు కాక గొప్పవారి కెవ్వరికి నిటువంటి గతి పట్టుట వింతగా దనియు నెటువంటి ప్రవక్తయు స్వదేశమున గౌరవింపఁబడఁ డనియుఁ దలఁచుచు మరల కేపర్నాము గ్రామమునకు వచ్చి, అక్కడజనులు తన కనుకూలురుగా నున్నందున వారికి తన మతమును బోధించుచు, చుట్టుపట్టుల గ్రామములకు మతప్రచా

రము నిమిత్తమయి సంచారములు చేయుచు వచ్చెను. ఆ కాలములో విశ్రమవాసర మయిన యొక్క శనివారము నాఁడు దక్క జనులొక్కచోట కూడఁబడుట సంభవింపకుండెను. ఆ దివసమునందు మాత్రము పల్లెలలోనివా రందఱును తమ గ్రామదేవాలయములో నొక్కటిగాఁ జేరుచుండిరి. అది సమయముగాఁ జేసికొని జీసస్ విశ్రమవాసర మైన యాదినమునందే దేవాలయములో జనులకు పూర్వసిద్ధాంతములతోఁడి పాటుగా తన నూతన సిద్ధాంతములను సహితము బోధింప సాగెను; ఉపాసనాసమయమునం దతఁడు దేవాలయములకుఁ బోయి ప్రార్థనలుముగిసిన తరువాత తాను లేచి నిలువఁబడి యర్చకుఁడు చదువుట కయి ధర్మవాక్యములు గల ప్రమాణగ్రంథమును చేతి కియ్యఁగా నందుండి కొంతభాగము చదివి యందులో నుండియే యొకవాక్యమును తనప్రసంగమునకు మూలసూత్రమునుగా గ్రహించి తన యభిప్రాయములను వివరించి చెప్పుచువచ్చెను. అతఁడు చెప్పిన యభిప్రాయములను ఖండించి వివాదపడుట కయి యాపల్లెలయందు విద్వాంసు లయిన ఫారిసీలు లేరు. అందుచేత జెరూసలేము నగరమునందు వలె నతనిబోధన కక్కడ ప్రతిపక్షమేమియు లేనందున, జనులాతఁడు చెప్పినది యెల్లను శ్రద్ధతో వినుచుండిరి. అతఁడు చెప్పెడు పరిశుద్ధనీతివాక్యములు దుష్పాండిత్యదూషితములు కానివారి నిర్మలమనస్సుల కాహ్లాదజనకము లయి వారిహృదయాంతరాళమున శిలాక్షరములవలె నాటుకొను చుండెను. అతిపాండిత్యము చేతను స్థలవేదాంతశ్రవణములచేతను వారిబుద్ధులు చెడనందున, కపట మెఱుఁగక సత్యసంధు లయి సరళవర్తను లయి యున్నయాజానపదులు సామాన్యజ్ఞానమువలనఁ దెలిసికోఁ దగిన యాతఁ డుపదేశించు సత్యముల నాదరించి యాతని బుద్ధికి

నీతికి నద్భుతపడి యాతనిని ప్రోత్సాహపఱుచుచు వచ్చిరి. అతఁడు చెప్పినదెల్లను చక్కఁగాఁ జెప్పెననియు, అతఁడు చెప్పినవి మంచి హేతువులనియు వారిమనస్సులకు తోఁచుచుండెను. వారడిగిన కఠిన ప్రశ్నలకు సహిత మతఁ డనాయాసముగా సదుత్తరములను జెప్పి వారికి సంశయనివారణముఁ జేయఁగలుగుచుండెను. అందుచేత నా ప్రాంతములయందలి గ్రామ్యప్రజల కాతనిమాటలయం దంతకంతకు ప్రమాణబుద్ధి దినదినప్రవర్ధమాన మగుచువచ్చెను. తనయందు జనులకు విశ్వాసము హెచ్చినకొలఁదిని స్వాభావికముగా జీసస్సునకును తనయందు విశ్వాసము హెచ్చెను. అతఁ డిట్లు మొట్టమొదట ముఖ్యముగా కేపర్నామ్గ్రామములోనే బోధచేయుచు వచ్చినను కొన్ని మాసములు గడచినతరువాత నితరస్థలములకును తిరుగుచుగాఁబోయి బోధచేయ నారంభించెను. సమీపస్థలములనుండి యాతని యుపదేశములను వినవచ్చినవా రనేకులు తృప్తులయి యాతనిని తమ గ్రామములకు వచ్చి తమమిత్రులకును బంధువులకునుగూడ బోధ చేయుమని వేఁడుచువచ్చిరి. కొంతప్రసిద్ధి కలిగినతరువాత నతఁ డెక్కడకుఁ బోయినను జనులు మూఁకలుకూడి యాతని ధర్మోపన్యాసములను వినుటకయి విఱుగఁబడుచు వచ్చుటయేకాక, ఉపన్యాసావసానమున ప్రతిగ్రామమునను తమవ్యాధులను కుదుర్చుకొనుట కయి రోగులుసహితము ప్రోఁగగుచు వచ్చిరి. ఆరంభదశయం దతఁడు బోధ చేయుచు వచ్చినప్రదేశమే మిక్కిలి పరిమిత మయినది. టైబీరియస్ సరస్సుసమీపమునఁ గొన్ని యామడలదూరమువఱకుమాత్రమే యతఁ డప్పుడు సంచారము చేయుచువచ్చెను. అతఁడు మొట్టమొదట తన ధర్మబీజమును నాటినది యీచిన్నభాగమునందే. అతఁడు ప్రప్రథమమున చేయుచు వచ్చిన స్వమతబోధము తన ముఖ్యస్థాన మయిన కేప

ర్నహూముగ్రామమునకు చుట్టునున్న ఒకటి రెండుగడియల ప్రయాణములో నున్న నాలుగయిదు పల్లెలలోని గ్రామమే. అతఁడు తన యూరికి మిక్కిలి చేరువగా నున్నట్టియు హీరాడ్ అంటిపస్కు వాసస్థాన మయినట్టియు టైబీరియస్ పట్టణమునకైనను పోయి యుండినట్టు కనఁబడదు. అంతరంగమును బాధించు మనోవ్యాధులను మాత్రమే కాక బహిరంగమును బాధించు దేహవ్యాధులను గూడ స్వస్థపఱుచు సామర్థ్యము కలవాఁ డగుటచేత, జీసస్ చేయు ధర్మబోధను వినుటకును వ్యాధులను కుదుర్చుకొనుటకును గూడ జను లాతనియొద్దకు వచ్చుచుండి రని యీపటికే సూచింపఁబడెను గదా! కేపర్నహూముగ్రామమునకు మరల వచ్చినతరువాత నొక విశ్రాంతిదినమునం దతఁడు దేవాలయములో బోధించుచుండఁగా విన వచ్చిన జనసమూహములో నుండి మతిచెదరినవాఁ డొకఁడు లేచి నిలుచఁబడి భయంకరముగా రణగుణధ్వనితో నఱవ మొదలుపెట్టెను. అల్లకల్లోలముగా నుండి మతవిషయకమయిన యుద్రేకము దేశమునం దంతటను వ్యాపించియున్న సమయములయందు మతావేశముచేత దుర్బలచిత్తు లనేకులు చిత్తచాంచల్యము పొందుట వింత కాదుగదా! గ్రామదేవతల యుత్సవదినములయందు తప్పటల చప్పుడు చెవిని బడిన మాత్రముచేత మతోన్మాదముచేత నొడళ్ళుమఱచి యమ్మవారు పూనిన దని యవ్యక్తప్రలాపములు చేయుచు శివములాడువారిని మన మీదేశమునందు సహిత మెందఱిని జూచుచున్నాముకాము? ఇట్టిస్థితిలో దేశమందంతటను సంక్షోభము కలిగియున్నప్పు డట్టివారెక్కడనయినను బయలుదేఱవచ్చును! అప్పుడు జీసస్సు బోధించుచుండిన వాక్యములు చెవిని బడినప్పు డాకస్మికముగా నొకనికి మతిభ్రమణము కలుగుటనుబట్టి చూడఁగా నాతనివాక్యములు వినువారల హృదయముల కెక్క వారి నానందపరవశాత్ములను జేయు

శక్తికల వయి యుండినట్లు స్పష్టమగుచున్నది. ఆకాలమునం దొక్క-
మతిభ్రమణమునుమాత్రమేకాక యనేకము లయిన యితర వ్యాధులను
సహితము పిశాచావేశముల కారోపించుట సర్వసామాన్య మయి
యుండెను. అక్కడిమాట యేల? ఈకాలమునం దీదేశములో సహి
తము తమయింట నెవ్వరికయిన వ్యాధి సంభవించినప్పుడు పామరులు
సాధారణముగా వైద్యునియింటికిఁ బరుగెత్తుటకంటె ముందుగా సోది
చెప్పువానియింటికిఁ బరుగెత్తుచున్నారు. ఆకాలమునం దక్కడ నెల్ల
వారికిని దయ్యములయందు గట్టినమ్మక ముండుటచేత మతిభ్రాంతు
లయి యున్నవారుసహితము కొన్ని సమయములయందు తమ్ము పిశా
చములు పూనిన వని తలఁచుకొని యసంబద్ధప్రలాపములు చేయు
చుండుట గలదు. ఆవిధముగానే యీ ధర్మోపన్యాససమయమునం
దొకఁడు మతోన్మాదముచేతఁ దన్నుమఱచి తా నేదో దయ్యమయి
నట్లు భావన చేసికొని "నాజరేత్తుగ్రామవాసి వయిన జీససా! నీతో
మాకేమిపని? నీవు మమ్ము నాశనముచేయ వచ్చినావా? ఓ పరి
శుద్ధుఁడ వయిన దేవునివాఁడా నిన్ను నే నెఱుఁగుదును." అని ప్రల
పింప నారంభించెను. దయ్యములను గూర్చిన నమ్మక మాకాలపువారి
కందఱికిని నున్నట్లే జీసస్సునకుఁగూడ నుండియుండవచ్చును. అప్పుడు
జీస స్సాచిత్తోన్మత్తునివంక తెప్పవాల్పక తేఱిపాఱఁ జూచి 'ఇఁక
మాటాడక వానిని విడిచి వెలుపలికి రా" అని గంభీరస్వరముతో
నాజ్ఞాపించెను. పిడుగుపడునట్లు పలికిన యాయాజ్ఞావచనము లాతని
వాఁడిచూపులతోఁడఁ గూడ సునిశితబాణములవలెఁ దిన్నగాఁ బోయి
యాభ్రాంతాత్ముని హృదయమూలమునందు సూటిగా నాటి వానినో
రడఁచినందున, తత్క్షణమే వాఁడు ప్రేలుట మాని యూరకుండెను.
అంతవఱకు నూరక వదరుచున్నవాఁ డాతని యాజ్ఞాబలముచేత నొక్క-

పారిగా వాకట్టు కట్టినట్టు మూకీభావమువహించుట చూచి యచ్చట నున్నవా రందఱును పరమాశ్చర్యరసమగ్నమానసులయి యతనికి దయ్యములను వదల్పఁ గలయద్భుతప్రభావ మున్నదని భావించిరి. ఇంద్రియోద్రేకముచేత మనస్సులను తాము వశపఱుచుకొ లేక యస్వస్థమానసులై యుండువారిని స్వస్థపఱిచెడి యద్భుతసామర్థ్య మాతనివాక్యములయం దుండినదనుటకు సందేహము లేదు. జీసస్సున కొకవేళ పిశాచావేశమునందు నమ్మకము లేక యుండినయెడల, అస్వస్థచిత్తునికి మరల చిత్తస్వాస్థ్యము కలిగించుట కది తప్ప వేఱుమార్గము లేదని భావించి యయినను నతఁ డప్పుడు వానిలోపల నున్న పిశాచము నాజ్ఞాపించినట్లుగాఁ బలికి యుండవచ్చును. ఈకార్య ముతో నతఁడు పిశాచముల నుచ్చాటనముచేయు ననియు సమస్త వ్యాధులను నివారణము చేయు ననియులోకప్రవాద మొకటి మొట్ట మొదట చుట్టుపట్ల పుట్టి క్రమక్రమముగా దేశమునం దంతటను వ్యాపించెను. జీసస్ మనోవ్యాధులను, శరీర వ్యాధులనుగూడ నివా రించె నని తచ్ఛిష్యులచే ననేకాద్భుత కథలు చెప్పఁబడి యున్నవి. బహువిషయములలో దేహారోగ్యము మనస్స్థితి ననుసరించియే యుండును. చింతలచేతను భయములచేతను మనో వ్యాధులచేతను జనులు తఱుచుగా దేహవ్యాధులొంది బాధ పడుదురు; అట్టి మనోవ్యాకుల తలు తొలఁగుటచేతను రోగము కుదురు నన్న దృఢవిశ్వాసముచేతను గూడ బహురోగములు మందు లేకయే నివారణము లగును. శీతల మధురోక్తులతో కర్ణరసాయనముగా ధర్మోపన్యాసములు చేసి జనుల హృదయములను కరఁగించి చల్లపఱిచెడి హృత్తాపహారకమైన సమ్మో హనశక్తి జీసస్సువద్ద నున్నందున, తన్మూలమున ననేకులకు మన స్స్వాస్థ్యమును కలిగించి రోగనివారణముచేసి యుండుట యాశ్చర్య

కరము గాదు. అయినను జీసస్ను చేసిన రోగనివారణమును గూర్చిన యద్భుతకథాంకురము లనేకములు కర్ణాకర్ణిని వ్యాపించినప్పుడు క్రొత్త క్రొత్తకొమ్మలువేసి పెంపొంది లేఖకులవద్దకు వచ్చినప్పటికే చిలవల తోను పలవలతోను మొదటఁజూచినవారు గుఱుతు పట్టలేనంత మహా వృక్షములుగా పెరిగి యుండవచ్చును. ఈమానసిక స్పష్టియం దెంత సత్య మున్నదో యిప్పుడు నిశ్చయముగాఁ జెప్పఁజాలముగాని యాకాలపువారిలో మాటమాత్రముచేతనే మంత్రించి నట్లు రోగ నివారణము చేయఁగల యమానుషశక్తి జీసస్నునకుఁ గలదన్న నమ్మక ముండిన దనుటకు సందేహములేదు. దీనికొక్క నిదర్శనమును విను(డు. జీసస్సొకనాఁడు కేపర్నామ్గ్రామములో నొక యింట ధర్మ బోధము చేయుచుండఁగా నాతని వాక్యామృతపానము చేయవలె నన్న కౌతుహలముతో నూఱులకొలఁది జనులు మూఁగి పైకినుక చల్లినఁ గ్రిందరాలనంత దట్టముగా నిల్లంతటను గ్రిక్కిఱిసి యుండిరి.

ఆతని రోగనివారణకథలను విన్నవారు నలుగు రా సమయము నందు పార్శ్వవాయువుచేత బాధ పడుచున్న యొకరోగిని మంచము మీఁద మోచుకొని యాయింటిద్వారముకడకు వచ్చిరి. తీర్థప్రజవలె మూఁగియున్న యా జనులను తొలఁగఁద్రోచి లోపలికిఁబోవుట దుర్ఘట మగుటచేతను ప్రసంగమును ముగించి జీస స్సీవలికి వచ్చువఱకును వేచి యుండునంత సహనము లేక యత్యాతురులై యుండుటచేతను తా మే యాతని ముందుగా సందర్శించి స్వస్థులుకావలె నన్నవేగిరపాటు చేతను వెలుపలినుండి నిచ్చెన వేసికొని యింటి నడికొప్పుమీఁదికి వా రారోగితో నెక్కి యేలాగుననో యింటికప్పు కొంత తొలఁగించి ద్వారిచేసి యాసందునుండి త్రాళ్ళుకట్టి యారోగిని మెల్లఁగా జీసస్ను



కూర్చున్న చోటికి దింపిరి. ఈప్రకారముగా నడుమవచ్చి తన ప్రసంగమునకు విఘ్నము గలిగించినందున కొంత మనస్తాపము కలవాఁడైనను, రోగికిని రోగిబంధువులకును దనయందుఁ గల విశ్వాసమున కద్భుతపడి తననిమిత్తమై వారంత శ్రమపడి రోగిని తన పాదముల కడఁ జేర్చినందున కయి జాలిపూని యత్యాతురుఁడై తన వంక నపేక్షతో దీనముగాఁ జూచుచున్న రోగివంక శీతల దృష్టితోఁ జూచి జీసస్సు

నీపాపములు క్షమింపఁ బడినవి" అని తానే పాపక్షమాధికారియైన ట్లధికారవాక్యమొకటి పలికెను. ఆకాలమునందు యూదు లంద ఱును రోగములు పాపఫలము లని నమ్మియుండిరి. ఆరోగిసహితము దేవునియెడలఁ దానేదో యపచారము చేసియుండుటచేత దేవుఁడా పాపమునకు శిక్షగాఁ దనకారోగమును గలుగఁ జేసెనని నమ్మి యుండెను. జీసస్ పాపమునకు ఫలముగా రోగములు వచ్చునని నమ్మి నను నమ్మకపోయినను, అట్టి నమ్మకము గల రోగి కితోపగముగా హృదయశాంతిని ధైర్యమును గలిగించుట కామాటవలెఁ బ మఱి యేదియు కార్యకరముగా నుండ దని యెఱిఁగినవాఁడై వానితో నీపాపములు క్షమింపఁబడిన వని పలికెను. ఆమాటలు విని యక్కడ నున్నవారిలోఁ గొందఱు "పాపముల క్షమించుటకు మనుష్యుఁ డెంతటి వాఁడు? దేవుఁ డొక్కఁడే యాపని చేయఁగలవాఁడు. దేవుఁ డనవల సినమాటలు తా ననుట దోషముకాదా?" అని తమలోఁ దా మను కొని యొండొరుల ముగములవంకఁ జూచుకొనుచుండఁగా జీస స్సాజాడకనిపెట్టి సమయోచితబుద్ధికలవాఁ డగుటచేత లేశమాత్రమును సంశయింపక తా నన్నవాక్యములో నొక్క యక్షరమైనను మరలించు కొనక తాను భగవత్ప్రేరణమువలనఁ బనిచేయుచున్నట్టు మనస్సులో సంపూర్ణ విశ్వాసము గలవాఁడై యుండుటచేత ధైర్యముతో "నే నీ వాక్యములను దేవునియాజ్ఞచేతఁ బలుకుచున్నా ననియు, నేను జెప్పెడిదానిలోను జేసెడుదానిలోను సర్వములోను దేవునిచేతనే నడపఁబడుచున్నా ననియు, మీరే తెలిసికోఁ గలరు" అని పలికి రోగివంకఁ దిరిగి "లే. నీమంచ మెత్తుకొని నీయింటికి నడువు" అని యధి కారస్వరముతో నాజ్ఞాపించెను. ఆమాటలతో వాఁడు చివాలునలేచి తన బట్టలు పట్టుకొని యెల్లవారు నద్భుతపడునట్లుగాఁ నడిచిపోయెను.

మానసికములైన పాపరోగములనే రూపుమాపఁగల యద్భుత సామర్థ్యము గల మహాపురుషునకు శరీరరుజలను బోఁగొట్టఁగలశక్తి యున్న దన్న హేతువుచేత నూతనమహిమరాదుగాని యొక్కయాతని విషయమున దేవుఁ డేర్పఱిచిన స్థిరము లైన వస్తుధర్మములు మాఱిన వనుమాట మాత్రము విశ్వాసపాత్రము కాదు. ఐనను బయిని చెప్పఁకున్నరీతి యుత్సాహవాక్యములవలనను రోగులమనస్సులలో నట్టి వాక్యములు కలిగించిన ధైర్యవిశ్వాసముల వలనను రోగు లనేకు లాతనిమాటమాత్రమున స్వస్థతను బొందియుందురు.



# అయిదవ ప్రకరణము.

•••○•••

## పాపులయెడఁ జూపిన యాదరము, సరస్తీరప్రవచనము.

---

జీసస్ తైబీరియస్ సరస్తీరమునం దున్న కేపర్నాము మొదలైన గ్రామములలో ప్రవచనము చేయుచుండిన కాలమునందు జనులాతఁడు బోధించిన దంతయు గ్రహింపఁ గలిగినను లేకపోయినను చెప్పినది వినుటకు మాత్రము గుంపులు గుంపులుగా వచ్చి విని యానందించుచు నాతఁడు చెప్పినదానిలో నేదైనఁ దా మావఱకు నమ్మిన దానికి విరుద్ధముగా నున్నయెడల కుపితులయి యనిష్టమును సూచించుచునుండిరి. సాధారణముగా జనులు లఘుమనస్కులు; లఘుమనస్సులెప్పుడును దురభిమానభూయిష్టములు. అందుచేత వారు తమ మనస్సులు ద్వేషముతోను దుశ్చింతలతోను పూరితము లయి యున్నను, పండితనామములు ధరించి శిష్టులుగా పరిగణింపఁబడువారు విధించిన బాహ్యకర్మలను మీఱక నిత్యమును యథావిధిగా ననుష్ఠించుచు వచ్చినపక్షమున సమస్తమును వానితో పరిశుద్ధము లగునని నమ్మియుండిరి. ఉదారచిత్తుఁడైన జీసస్సు బోధించెడి సర్వజన సమాదరణీయము లైన యుత్తమధర్మముల తత్త్వమును గ్రహించి యనుష్ఠించుటకుఁ గావలసినంత జ్ఞానతేజస్సు వారిహృదయములలో లేదు. అందుచేతఁ దమలో నేర్పడియున్న యల్పవ్యవస్థల నతిక్రమించిన గురుధర్మము లన్నియు వారి దృష్టి కనర్థదాయకములుగానే తోఁచుచు వచ్చెను. లోకములో సదా సందుగొందులలో నుండ మరఁగిన ఘూకములు సూర్యతేజస్సువలని ప్రయోజనమును బొంద నేరక యావెలుతురనర్థదాయక మని భావించుకొను లాగుననే యుక్తాయుక్త విమర్శలేక చిరకాలమునుండి యజ్ఞానాంధకారమునం దడఁగియుండి యంధ

ప్రాయముగాఁ బూర్వాచారపరిరక్షిత మైన యజ్ఞానమే మంచి దని యెంచి యనుసరింప నలవాటుపడిన జనులును నతఁ డాకస్మికముగాఁ జూపిన నూతనసత్య తేజస్సును జ్ఞాననేత్రమును దెఱచి సువిచారపూర్వకముగాఁ గనుగొని దానివలనిలాభమును బొందఁజాలక యది దోషదూషిత మని మీఁదమిక్కిలి ద్వేషింపఁ జొచ్చిరి. అట్టిస్థితిలో జనుల యజ్ఞానమునే యాధారపఱచుకొని యుదరపోషణము చేసికొనుచు తమ ఘనతను కాపాడుకొనుచుండు మతాచార్యులు జీసస్సు చేయు బోధమును మఱింత యధికముగా ద్వేషించుట వింతకాదు గదా! ఫారిసీలును లేఖకులును జీసస్సును ముఖ్యముగా ద్వేషించువారుగా నుండిరి. పుణ్యపాపములవిషయ మయి వారిలోఁ గల యవిచారమూలకములైన వ్యవస్థలను జీసస్సు పాటింపనివాఁ డయి ఖండించుచు వచ్చినందున వారి కతనిపై రన్నఁ దల కంటగించు చుండెను.

ఆ దేశమునందు బాటసారులు మొదలయినవారినుండి సుంకము తండెడిసుంకరు లనఁబడెడు రాజకీయోద్యోగులు కలరు. వారిలో నధిక సంఖ్యాకులు ప్రజలను పీడించి లంచములు గొనెడు దుష్టాత్ములయినను ధర్మచింత గలమంచివారు సహిత మనేకు లుండిరి. జనకంటకు లయియున్న రోమనులవద్ద కొలువు కుదిరినందునను జనుల వలన నిర్బంధముగా పన్నులు గొనువా రయినందునను యూదులు వారి నందఱిని మంచివారిని చెడ్డవారిని గూడ నేకరీతిగా ద్వేషించి వారిని మహాపాతకులనుగా భావించుచు, తమలోనివాఁ డెవ్వఁడయినఁ గ్రొత్తఁగా బోయి యట్టికొలువు కుదిరినపక్షమున వానిని కులములో నుండి బహిష్కరించి వానితో భోజన ప్రతిభోజనములను సాధ్య మయినంతవఱకు సంభాషణమును గూడ వర్జించి దేవాలయములకును తమ యిండ్లకును వాని రానీయకుండిరి. ఫారిసీలు తెల్లనివస్త్రమును ధరించి

కూరుచుండి మన దేశమునందలి బ్రాహ్మణులవలెనే యూదులు తమ దాపునకు వచ్చినను స్పర్శదోషమువలన తాము మంటుపడుదుమని యెంచుకొని లోకములో తామే పరిశుద్ధుల మను నహంభావము కలవారయి యుండిరి. మనబ్రాహ్మణులు పంచములని తాకినప్పటివలె వారిలో నెవ్వరయినను పతితసంస్పర్శము చేసినపక్షమున, పతితులను తాకినదోషమునకయి మతాచార్యులు వారికి ప్రాయశ్చిత్తములు విధించి వారివలన దక్షిణలు గయికొనుచుండిరి. అందుచేత ఫారిసీ లెవ్వరును పాపులుగా పరిగణింపఁబడుచుండిన సుంకరిజాతివారితోఁ గలిసి భుజించుట మహాపాతక మని యెంచి వారికి సాధ్య మయినంత దూరముగా తొలఁగుచుండిరి. జీసస్సునకు సుంకరులయందు ఫారిసీలకుఁ గలిగినట్టి భేదభావము లేదు. వారు మంచివారయినపక్షమున వారి నితరులకంటెఁ దక్కువగాఁ జూడవలసిన న్యాయము లేదని యెంచి యతఁడు సుంకరులతో యథేచ్ఛముగాఁ గలసిమెలసి తిరుగుచుండెను. అంతేకాక వారిలోని చెడ్డవారిని సహితము ద్వేషించి విడనాడక ధర్మోపదేశములచేత వారిని మంచిమార్గమునకు త్రిప్పుటకయి ప్రయత్నించుచుండెను.

ఒకనాఁడు వీధిలో నడుచుచుండఁగా జీసస్సునకు మార్గస్థుల వలన సుంకము గ్రహించుచు మాథ్యూ యను సుంకరి యొకఁడు కనఁబడెను. జీసస్సతని నావఱకెఱిఁగినవాఁ డగుటచేతను, తన బోధనలను వినవచ్చినప్పు డతని శ్రద్ధాభక్తులను సద్వర్తనమును కనిపెట్టినవాఁ డగుటచేతను, అతనిని తన శిష్యులలో నొక్కనిగా స్వీకరింపవలె నని యుద్దేశించి 'నావెంటరమ్ము' అని పిలిచెను. ఆమాటల యర్థమును గ్రహించి యాపిలుపుతోడనే మాథ్యూ తన పనిని విడిచిపెట్టి యెంతమాత్రమును సందేహింపక యాతని వెంట నడిచెను.

పండితమండలిలోఁజేరి ప్రవక్తగా నెన్నఁబడు చున్నజీన స్ననతక్కి వాఁడు వచ్చి సామాన్యముగా పండితకులము వారిచే నెల్లవారిచే ననాదరింపఁబడుచు ద్వేషింపఁబడు చున్నతన్నుఁ దనవెంట రమ్మని పిలువగానే మాథ్యూ తన కది గొప్ప యనుగ్రహముగాఁ దలఁచు కొని, యీదేశమునందు శ్రోత్రియుఁ డయిన బ్రాహ్మణోత్తముఁ డొకఁడు కడజాతివారిని తనసరసకు రమ్మని పిలిచియాదరించినప్పుడు వాఁడు తన్ను ధన్యునిగా భావించుకొని యెంతసంతోషపడునో యంత పరమానందమును బొందియుండును. మాథ్యూ బీదవాఁడు కాఁడు. గృహమును ధనసంపత్తియు నాప్తవర్గమును గలసంపన్న గృహస్థుఁడు. అందుచేత నతఁ డాదినమునఁ తన బంధుమిత్రులను విందునకుఁ బిలిచి వారి కాతని బోధనమును విని యానందింపఁ గలుగు భాగ్యమును గలిగింపఁజేయుట కయి జీసస్సును గూడ నాఁడు తనయింటికి భోజనమునకు రమ్మని ప్రార్థించెను. అతఁ డాయాహ్వానము నంగీకరించి యాతని బంధుబృందముతో గలిసి సహపంక్తిని భుజించుట కయి యాతని యింటికిఁ బోయెను. ఈవార్తకొంచెము సేపటిలోనే గ్రామమునం దంతటను వ్యాపింపఁగా, జీసస్ పతితు లయిన సుంకరులతోఁ గలిసి భోజనము చేయుచున్నాఁ డని యెల్లవారును గుంపులుగూడి వీథివీథిని వింతవింతగాఁ జెప్పుకొనసాగిరి. రాబ్బీ (పండితుఁడు) అనఁబడు వాఁడు పోయి పతితు లయిన సుంకరులయింట భోజనము చేయుటకంటె ఘోర మైనయకార్యకరణ మొకటి యప్పుడు ఫారిసీల దృష్టికిఁ గనఁబడ లేదు. అందుచేత ఫారిసీలలోఁ గొందఱు బయలుదేఱి యతఁడు చేయుచున్న కానికార్యమును ప్రత్యక్షముగా చూచి పట్టుకోవలె నన్న తలంపుతో తిన్నఁగా మాథ్యూయింటివంక నడచిరి. అప్పు డాయింట వాకిట జీసస్సుయొక్క శిష్యులుకొందఱు కనఁబడఁగా ఫారిసీలు వారిని

జూచి "మీరు గురువు చెడిపోయినవారితోఁ గలిసి లోపల కానికూడు తిను చుండఁగా మీరు సిగ్గులేక చూచుచు వాకిట నిలుచున్నారా?" యని దూషింపనారంభింపఁగానే మాటమీఁద మాట పెరిగి యాశిష్యు లకును వారికిని వాక్కలహము సంభవించెను. ఆసంక్షోభమును లోపలినుండి విని కలహకారణమును గ్రహించి జీసస్ వెంటనే యీవలకు వచ్చి ఫారిసీలనుఁ జూచి "అన్నలారా! నన్ను విందుకుఁ బిలిచిన వీరు పాపాత్ములని మీరు యెన్నుచున్నారు గదా! పాపముల నుండి రక్షింపఁబడవలసినవా రయిన పాపాత్ములయొద్దఁ గాక నే నుండవలసినచోటు మఱియెక్కడ నుండును? దగ్గఱఁ బోయినయెడల రోగము తనకంటు నని భయపడి రోగులయిండ్లకుఁ బోవక వైద్యుఁ డారోగ్యదశలో నున్నవారి యిండ్లకుమాత్రమే పోవుచున్నపక్షమున మీరాతని విషయమున నేమని తలచెదరు?" అని సమయోచితముగాఁ బలికి వారిని నిరుత్తరులను జేసి యప్పటికిఁ బంపివేసెను.

పతితులుగా భావింపఁబడెడు సుంకరులు మొదలయినవారి యెడల కనికరము చూపి యిటువంటి కార్యములను జేయుచు వచ్చుట చేత ఫారిసీలు జీసస్సును "పతితసంసర్గి" యని పిలుచుచు నతనిని గూడ పతితతుల్యునిగానే గణనచేయుచుండిరి. ఆతని కీబిరుదాంక మును ప్రసాదించుట కింకొకసంగతి యీవలనే తటస్థించెను. దానిని గొన్నివాక్యము లయినతరువాతఁ దెలిపెదను. ఫారిసీలు చిరకాలా చారమహిమచేత తమ్మధికులనుగా భావించుకొనుచు తా మల్పు లని యెంచువారితోడిసంసర్గమునుమాని, యట్టివారియెడలఁ గఠిన హృదయులయి వారికష్టములకు జాలిపడకుండుట కలవాటుపడియుం డిరి. మతోన్మాదమువలనఁ దామే నిష్పాపరుల మనుకొని గర్వపడుచు తమలోఁ గలనిరర్థకకర్మల నాచరించినంతమాత్రమునఁ బరులను

భ్రష్టులనుగా నెన్నుచు నట్టివారు నేత్రగోచరు లయినమాత్రమున తమసముఖమందటికి యన్నమును పాఱవేసి లేచిపోవునంతటి దుస్థితికి వచ్చిన మానవనామధారులలో తోడి మానవులయెడల దయాదాక్షిణ్యము లెట్లుండును ? ఇటువంటి మతోన్మాదుల మూర్ఖవర్తనములవలన కష్టములపా లగుచున్న నిర్దోషులను సమబుద్ధితోఁ జూచుచు తక్కినవారి తోడిపాటుగా వారినాదరించుచు వారితోఁగలసి భోజనప్రతిభోజనములు చేయుచు వారుకూడ దేవునికిఁ బ్రేమాస్పదు లయినబిడ్డలేయని లోకమునకుఁ జూపుట జీసస్సున కభిమతము. ఈపారమార్థిక బుద్ధిచేత జీసస్ నిష్కారణముగా జనలాఘవము ననుభవించు చున్నవారితోను నిజముగానే పాపముచేసి బాగుపడఁ దలఁచినవారితోను కలిసి భోజనము చేసినందున కయి యితరులు తప్పుపట్టుచు వచ్చినప్పుడెల్ల నతఁడు సమయమునకుఁదగినట్టుగా "చెడినవారికేకాని బాగున్నవారికి వైద్యునితోఁబనిలేదు" అనియు, "మనుష్యపుత్రుఁడు పతితులను పావనులను జేయుటకే వచ్చినాఁడు" అనియు, నూఱుగొఱ్ఱెలు గలవాఁడు వానిలో నొక్కటి తప్పిపోయిన పక్షమున మంచిగొఱ్ఱెలను తొంబదితొమ్మిదింటిని విడిచి దారితప్పిన యాయొక్కగొఱ్ఱెను వెదకుకొనుచుఁబోయి యదికంటఁబడఁగానే సంతోషించి దానిని మూపున వహించి కొనిరాకుండునా ?" అనియు, చెప్పి తప్పించుకొనుచు వచ్చెను. జీస స్సివిధముగా నాపద్బాంధవుఁడయి దీనులై కష్టపడుచున్నవారి కందఱికిని దయారసపూరితమైనహృదయముతో సర్వవిధముల తోడుపడుచుండును. నిజముగా చెడు తెరువులయందుఁ బ్రవేశించి పాపఫలముగా మనోవేదనల ననుభవించుచుండువారికిఁ గాక వేఱెవ్వరికి రక్షణమార్గమును పరులతోడ్పాటును విశేషముగాఁ గావలసియుండును! ఫారిసీలు శాస్త్రదీక్షితులను తారసించినప్పు డొక్కయుత్సాహవాక్య మయినను

బలుకక మీఁదిమిక్కిలి చేసికొన్న దనుభవింపవలసినదే యని మొగ తాళిచేయుచు దేవుఁడు దీనరక్షకుఁడనియు పతితపావనుఁడనియు గణింపక యతఁడు పాపులను ద్వేషించి పాపులతో సంభాషించినచోఁ దమ్ముఁ గూడ శిక్షించు ననిభ్రమపడి దూరదూరములఁ దొలఁగుచుండఁగా, జీసన్నట్లుభావింపక యుక్తసమయమున తోడుపడి దారిచూపిన యెడల దుర్మార్గులలో ననేకులు సన్మార్గముంబట్టి బాగుపడుదురనియు వారి చెడుదారులనుండి రక్షింపఁ బాటుపడుటయే యీశ్వరప్రీతికర మైనయుత్తమధర్మ మనియు నమ్మి సర్వవిధములచేతను పాపులను దుర్గతినుండి తప్పించుటకై పూనుచుండెను. ఫారిసీలవలెఁ దిరస్కార బుద్ధితో జూడక తమ్మాదరించి మంచిమాటలతో పాపోపశమనము నకు వలయుసద్బోధలు చేయుచుండుటవలన దీనజనులు జీసస్సునందు భక్తికలవారయి యాతనిమాటలయందు పరమ విశ్వాస ముంచి తమయెడలఁ జూపిన సద్భావమును దలఁచి యాతనిని దేవునివలె బూజింపఁజొచ్చిరి.

ఒకనాఁ డొకగ్రామములో సిమన్ అనుపేరుగల యొకఫారిసీ తనగృహమునకు జీసస్సును భోజనమునకుఁ బిలుచుట తటస్థించెను. ఆఫారిసీ యతనియందుఁ గలభక్తిచేత నాతనిని విందుకుఁ బిలువక పోయినను, ఏదో మిషమీఁదఁ దనయింటికి రప్పించి వచ్చినప్పు డతనికి దియ్యనిమాటలతో బోధించి బుద్ధిచెప్పి దేశాచారవిరుద్ధ మైనమార్గ మునుండి యతనిని మరలింపవలె నన్నకుటిలబుద్ధితోఁ బిలిచియుండును. మతాచార్యులు ప్రతిదేశమునందును మాయలమారులై దేశక్షేమము నపేక్షించి తమమార్గములకుఁ బ్రతికూలముగా పని చేయువారిని వారి ప్రయత్నమునుండి మరల్చుట కయి నయమున భయమున బతిమాలియు బెదరించియు నానావిధమాయోపాయములు పన్నుదురు. అందుచేత

సిమన్ తన యింటికి జీసస్ వచ్చినప్పుడు దేశాచారమునుబట్టి యతిథికిఁ జేయువలసిన యర్ఘ్యపాద్యాదులైన యాతిథేయసత్కారములను వేనిని జేయక యాతని నుపేక్షతోఁ జూచెను. అయినను జీసస్సతఁడు తన యెడలఁ జూపినయనాదరభావమును పాటింపక చావడిలో బల్లమీఁద గూరుచుండి తనమాటలను వినవలె నని యక్కడకు వచ్చినవారితో సంభాషించుచుండెను. అందఱును మాటలసందడిలో నున్నప్పుడు చూడవచ్చినవారితోఁ గలిసి చెడిపోయినయువతి యొకతె లోపలికి వచ్చి బల్లమీఁదఁ గూరుచుండి యున్నజీసస్సుయొక్క పాదములచెంత క్రిందఁ గూరుచుండెను. ఆకులట నాఁటియుదయమున జీసస్సు చేసిన బోధను విని పరితాపపడి తనదుశ్చరిత్రమును విడిచి యతనిపాదము లాశ్రయించి యిఁకముందు మంచిదారిని నడువ నేర్చుకోవలెనని మన స్సులో నిశ్చయము చేసికొనెను. అతఁ డుత్సాహవాక్యములు పలికి నాఁటిప్రాతఃకాలమున నెంతటి పాపాత్ములకును రక్షణమార్గము కల దని యాశ్వాసించినందున, పాపవర్తనమునం దగిలి యున్నయాయువతి తనహృదయమునం దూఱటను బొంది యాతనిసన్నిధానమునకుఁ బోయి పాదసేవ చేసి తదనుగ్రహమువలనఁ దన్నంటి యున్నపాప పాశములను త్రెంపుకొని ముక్తురాలయి కృతార్థతఁ బొందవలె నన్నయపేక్షతో నచ్చటికి సాహసము చేసి వచ్చి నిర్భయముగా పెద్దమనుష్యులనడుమను గూరుచుండి బాష్పధారలతో నాతని చరణముల కభిషేకము చేయుచుండెను. మొట్టమొదట సిమన్ యొక్క సేవకు లెవ్వరైన నను జూచి యుండినయెడల, ఆస్త్రీ నప్పుడు లోపలికి రానిచ్చి యుండరు. ఎల్లవారును ప్రసంగశ్రవణములో మునిఁగి యున్యమును మఱచి యున్నసమయములో నాకాంత మెల్లఁగా లోపల చొరఁబడి మొదట నాతనిపాదములవద్ద నిలుచుండి తనపాప

ములను దలఁచుకొని దుఃఖించి త్రుటికాలము తన వేఁడికన్నీటితో నాతని పాదములు తడిసి, తన స్నిగ్ధశిరోజములు నేల జీరాడునట్లుగా తరువాత మోకరించుకొని కూరుచుండి, తన పాలిటి వేల్పువలె వచ్చి తనకు చిత్తశాంతిని గలిగించిన యాఘనుని పాదారవిందములకుఁ దాను వచ్చినప్పుడు తెచ్చిన సుగంధద్రవ్యమును రాచి సంతోషపారవశ్యము చేత నచ్చట నెవ్వరున్నారో మఱచి యాతని పాదములమీఁద వ్రాలి నమస్కారము చేసి యడుగులు ముద్దుపెట్టుకొనఁ జొచ్చెను. అప్పుడక్కడ నున్న వారందఱును దాని చేష్టలు చూచి విస్మయపడిరి. ఇతరులు తన్ను కోపదృష్టితోఁ జూచుచున్నారని తెలిసికొన్న తోడనే యాచేడియ సిగ్గుచేతను భీతిచేతను నడఁకుచు నావలికి లేచిపోఁ జూచెను. గాని యింతలో నభయహస్తము చూపి జీసస్ దానినచ్చటనే యుండ నియమించెను. తోడనే కోపతిరస్కారములు చూపుచుఁ జూపులతో సిమన్ తనవంకఁ జూడఁగా ఆవ్యభిచారిణిని దన్ను తాఁకనిచ్చినందునకై యతఁడు తనమీఁద కోపము వహించియున్నాఁడని తెలిసికొని యందుమూలమున నతని కొక్క హితము చెప్పఁదలఁచి జీసస్ సిమనును బిలిచి "ఓయీ! నిన్నొక్కమాట యడుగవలెనని యున్నది అడుగవచ్చునా?" అని పలికెను. "నీ కేమి యడుగవలెనని యున్నదో యడుగు" అని సిమన్ తృణీకారమును జూపుస్వరముతో బదులు పలికెను. "ఒకానొక మనుష్యుని కిద్దఱు ఋణస్థు లుండిరి. వారిలో నొకఁడు ఏనూఱురూకలును రెండవవాఁడు ఏబదిరూకలును ఋణపడి యుండిరి. వారాయప్పు తీర్చుటకు శక్తులుగాక పరితాపపడుచుండఁగా, ఋణప్రదాత కరుణించి వారిని క్షమించి యిరువురను ఋణమునుండి విముక్తులను జేసెను. ఆయిరువురిలో నెవ్వఁ డాదాతయెడల నధిక కృతజ్ఞత గలవాఁడయి యుండవలెను?"

అని జీసస్ ప్రశ్న వేసెను. ఎవఁ డెక్కువ ఋణానడియుండి మన్నింపఁ బడెనో వాఁడే యెక్కువకృతజ్ఞత జూపవలెను." అని సిమన్ ఉత్తర మిచ్చెను. "నీవు చెప్పినది సత్యము" అని యతనితోఁ బలికి జీస స్సంతట ఆస్త్రీని జూపి "ఓయీ! ఈస్త్రీని జూచితివా? నీయింటికి వచ్చిన యతిథికి నీవు పాదోదకము నియ్యకపోయినను, యీయువతి నన్ను వెదకుకొనుచు వచ్చి తన కన్నీటితో నాయడుగులు కడిగినది. నీవు నాశిరస్సుపై గంధసారము ప్రోక్షింపకపోయినను, ఇది నాపాదముల పై ప్రోక్షించినది. దీని పాపములు క్షమింపఁబడినవి. ఎవ్వరివి స్వల్ప పాపములు క్షమింపఁబడునో వారు తక్కువభక్తి చూపుదురు. ఎవ్వరి వధికపాపములు క్షమింపఁబడునో వారెక్కువ భక్తి చూపుదురు. ఈ కామిని చేసినపాపము లధికము కాఁబట్టి యీయింతి యధికభక్తిని జూపుచున్నది." అని పలికి యాస్త్రీవంకఁ దిరిగి "ఓ కాంతా! నీ పాప ములు క్షమింపఁబడినవి" అనెను. ఆమాటలు చెవినిఁ బడగానే వెనుక రోగిని గూర్చి యతఁ డీమాట లన్నప్పుడు పుట్టినట్టుగానే యక్కడ నున్నవారిలో నిప్పుడును గొప్ప కలకల మొక్కటి పుట్టెను. వారిలోఁ గొందఱు లేచి "పాపులను క్షమించుట కితఁ డెవ్వఁడు?" అని బిగ్గరగా నఱవఁ జొచ్చిరి. జీసస్ వారిమాటలను సరకుగొనక "ఓ యబలా! నీవిశ్వాసము నిన్ను రక్షించినది. ఇఁక నీవు నిర్విచార ముగా బొమ్ము." అని యాస్త్రీ నక్కడనుండి మెల్లఁగా బంపివేసెను. చేసినపాపమున కావిధముగా ననుతాపపడినప్పు డీశ్వరుఁ డామె పాప ములను తప్పక క్షమించు నన్న పూర్ణవిశ్వాసముతో నతఁ డప్పు డా మాటలు పలికి యుండును. ఇతరు లందఱును హైన్యముతోఁ జూచెడి చెడిపోయిన పడఁతి యెడల నతఁడు చూపిన యాదరమును దయయు సర్వజనశ్లాఘాపాత్రములుగా నున్నవి. క్రూరాచార కళంకితము కాని

యాతనిని నిర్మలదృష్టిం గాం గులటయు దయనీయ మయిన యాశ్వరుని బిడ్డగానే గనంబడెను. తన జీవితమును నిర్భాగ్య మయిన దానినిగాం జేసిన కుమార్గమునుండి తప్పించుకొని యావలం బడంగలిగెనా యా పడుచును తక్కిన యాశ్వరుని బిడ్డలవలెనే పరిశుద్ధజీవనము కలదయి మరల సుఖ మనుభవింపవచ్చును. ఆ మందభాగ్యురాలు హేయ మైన తన ప్రస్తుత జీవనము విడిచి బాగుపడం గోరియున్న దనియు, దుష్పథమునుండి మరల నీతిపథము పట్టంగలుగుటకై తన యుత్సాహ వచనములును సాహాయ్యమును గొంచెము కావలసియున్న దనియు, ఎఱింగి పయిని జెప్పిన వాక్యములు పలికి జీస స్సాకోడ్పాటును జేసి యాయంగనను పాపమునుండి విముక్తురాలిని జేసెను.

పైని జెప్పినట్లు జీసస్సు చేసెడు బోధనలవలనను, మతాచార్యుల లోపముల నెత్తి జనులకు చూపుచుండుటవలనను, మతాచార్యులు సత్కార్యము లని భావించుచుండెడి యనావశ్యకాచారములను పాటింపకపోవుటవలనను, ఫారసీలకును లేఖకులకును జీసస్ మీంద ద్వేషము కలిగెను. అందుచేత వారు జీసస్ వర్తనమునందు తప్పులు వెదక నారంభించిరి. ఏకాదశినాండు వైష్ణవులు కొందరైనవా రీదేశ ములో నుపవాసములు చేయునట్లు యాదేశమునందును లోపల నెన్ని యకృత్యములు చేసినను పైకి భక్తులవలె నటించుచు విశ్రాంతి దిన మునందు నిరాహారులై యుండుట జనులలో వాచారముగా నుండెను. ఆత్మశుద్ధిలేని యటువంటి బాహ్యాచారమువలనం బ్రయోజనము లేదని యెఱింగినవాండై జీసస్ తనశిష్యులకు విశ్రాంతిదినములలో యథేచ్ఛ ముగా భోజనము చేయవచ్చునని యనుజ్ఞ యిచ్చెను. వారట్లు చేయుట చూచి ఫారిసీ లాతనిశిష్యులు మహాపాతకము చేయుచున్నట్లు భావించి విశ్రాంతిదినమున భుజించుచున్నా రని వారియం దొక దోషా

రోషణము చేయఁజొచ్చిరి. ఈప్రతిపక్షుల యాక్షేపణములను బంధువులయింట వివాహము జరుగుచున్న యొకానొక దినమునందు విని యక్కడకు వచ్చినవారితో జీసస్ "నిష్కారణముగా నిరాహారులై దేహశోషణము చేసికొని వారేల బాధపడవలెను? పెండ్లికొడుకు చెంత నుండఁగాఁ బెండ్లికొడుకువంకవా రెక్కడనైనఁ బస్తుందురా? నేను చెంతనున్న కాలము వీరికి సంతోషసమయము. ఈసంతోషదినములలో వీరేల తిండిలేక మాడి సంతాపము తెచ్చిపెట్టుకొనవలెను? నేను వీరి నెడఁబాసినప్పు డాహారమును వర్జించి దుఃఖింపవలసిన కాలము ముందు వచ్చును" అని సమయోచితముగా సమాధానము చెప్పెను. ప్రతియుక్తి గానక ఫారిసీ లప్పటికి నిరుత్తరు లయినను తమ ప్రయత్నములను మానక జీసస్ యొక్కయు శిష్యులయొక్కయు వర్తనమును రహస్యముగా పరిశీలించి వచ్చి తమతోఁ జెప్పుటకయి వేగులవారిని నియమించిరి. గూఢముగాఁ బోయి వారు లెంతనిపుణముగాఁ బరీక్షించినను దేశాచారవిరుద్ధముగా నడచిన కొన్ని యల్పాంశములు దక్క వారి కితరదోషము లేవియుఁ గనఁబడలేదు. ఆపైని వారు ఫారిసీలవద్దకుఁ బోయి యొకనాఁ డాతనిశిష్యులు విశ్రాంతిదినమున నొక్క పొలములో గోధుమకంకులు విఱుచుకొని తిని విశ్రాంతినియమమునకు భంగము కలిగించి రనియు, మఱియొక విశ్రాంతిదినమున జీసస్ వెఱ్ఱివాని కొకనికి చికిత్స చేసి స్వస్థచిత్తునిగాఁ జేసె ననియు, ఇటువంటి మహాదోషములను మాత్రమే కొన్నిటి నేరుపు పెట్టిరి. ఆమహాపండితు లట్టి యల్పాంశములనే మహాదోషములనుగా నెంచి గోరంతలు కొండంతలు చేసి జనులకు దుర్బోధలు చేసి ద్వేషము పురికొల్పి మతాచారములను మీఱి నడుచు పతితులవాక్యములు వినవలదని జనులను జీసస్ యొక్క ధర్మోపన్యాసములనుండి విముఖులను జేయఁ

బాటుపడిరిగాని వారికృషి యంతగా సఫలము కాలేదు. అయినను పూర్వాచార పరాయణు లగువా రనేకు లాతని బోధనలను వినుట పాప మని యాతనివద్దకుఁ బోవకుండిరి. విశ్రాంతిదినమున రోగిని స్వస్థపఱుచుట దోషము కాదనియు, విశ్రాంతిదినమున తనయొద్దకు రోగులు వచ్చినపక్షమున నెట్టిమందమతి యైనను మందు వేయక యుపేక్ష చేయునా యనియు, తెవులుపడిన పశువునకు మందు వేయ సంశయిం పక పోఁడి మానవుఁడు రోగపడినప్పుడు చికిత్సచేయక యూరకున్నచో మనుష్యుని మృగముకంటెను నీచముగా భావించుట కాదా యనియు, జీసస్ వారిని సమాధానపఱుపఁ జూచెనుగాని మాత్సర్యావేశదూషి తము లయి యున్నవారి మనస్సుల కాయుక్తు లణుమాత్రమును రుచించినవి కావు.

జీసస్ బోధించుదానిని జనులు పరమాదరముతో వినుచు వచ్చినను, చెప్పిన దాని పరమార్థమును గ్రహించువారుమాత్రము వారిలో నల్పసంఖ్యాకులుగానే యుండిరి. తాను బోధించెడు ధర్మము లను కథలరూపమునఁ జెప్పినప్పుడు జను లధికాదరము కలవా రగుచు వచ్చుట కనిపెట్టి, తరువాత జీసస్ తన యుపదేశములను సాధారణముగా కథలరూపమునఁ జేయ నారంభించెను. తనయుపదేశ మును వినుట కయి యొకనాఁడు కేపర్నాముగ్రామములో జను లధికముగా మూఁగినప్పు డతఁడు వారిని వెంటఁగొని టైబీరియాసరస్తీ రమునకుఁ బోయి, అందఱికిని వినఁబడునట్లుగా నిలిచి ప్రసంగింపఁ దగిన యున్నతస్థాన మెందును లేకపోవుటచేత నీటిలో నున్న యొకపడవపై నెక్కి మూఁకలు వచ్చి మీఁదఁబడకుండునట్లు శిష్యులచే తెడ్లు వేయించి దానిని నీటిలోఁ గొంతలోఁతునకుఁ గొనిపోయి యానావమీఁద నిలు చుండి జీసస్ జనులవంకఁ దిరిగి యుచ్చైస్స్వనముతో నుపన్యాసము

చేయ నారంభించెను. ఆసమయమునందు తల పైకెత్తి చూచినప్పుడు పొలములలోను కొండప్రక్కలను విత్తనములు చల్లుచున్న కాపు లతనికి దృష్టిగోచరు లగుటచేత నుపన్యాసారంభసమయమునం దాతని మనస్సున కీయుపమానము తోఁచి యుండవచ్చును.

"ఒకనాఁడు కర్షకుఁడొకఁడు విత్తనములను చల్లుచుఁ బోయెను. ఆవిత్తనములలోఁగొన్ని కాళ్ళత్రొక్కుడులచేత గట్టిపడిన దారులలో పడగా, పక్షులువచ్చి యేఱుకొని వానిని భక్షించిపోయెను. కొన్ని మన్నంతగా లేని రాతి నేలమీఁదఁబడెను. అవివెంటనే మొలక లెత్తెను గాని సూర్యుఁడు వేఁడియెండలు కాయఁగా నడుగున లోఁతుగా వేరు దిగకపోవుటచేత నల్పకాలములోనే యెండిపోయెను. కొన్నిగింజలు ముండ్లచెట్లలోఁ బడెను. ముండ్లచెట్లుక్రమ్ముకొని వానిని తలయెత్త నీయకపోవుటచేత నవి నిష్ఫలములయ్యెను. కొన్ని మంచినేలనుబడెను. అవిమాత్రమే విస్తారముగా పంట నిచ్చెను."

అతఁడప్పుడు జనుల కింకొక యుపమానము చెప్పెను:—

"ఈశ్వరరాజ్యము తన పొలములో మంచిగోదుమలను జల్లుకొన్న మనుజునివంటిది. ఆతని శత్రువు రాత్రివేళ వచ్చి యాగోదుమలలో కలుపుగింజలు చల్లిపోయెను. అందుచేత గోదుమలు పెరుగ నారంభించినప్పుడు గోదుమ మొక్కలలోఁ గలిసి కలుపు మొక్కలనేకములు బైలుదేఱెను. అది చూచి పనివాండ్రుపోయి క్షేత్రస్వామితోఁ జెప్పి 'యాకలుపు మొక్కలు పెఱికివేయువలెనా' యని యడిగిరి. 'కలుపు మొక్కలను పెఱుకునప్పుడు గోదుమ మొక్కలు కూడ పెల్లగిల్లునుగాన, అట్లుచేయక కోఁతకాలము వచ్చువఱకును రెంటినిగూడఁ బెరుగనిండు. అప్పుడు మనము గోదుములనుండి కలుపును విడఁదీసి కాల్చివేయుదము' అని యజమానుఁడు చెప్పెను."

అప్పుడు జీసస్ జనులకుఁ దెలిపినమఱియొకకథ యిది:— "ఈశ్వరరాజ్యము గింజ లన్నిటిలోను మిక్కిలి చిన్నదైన మస్టర్డుగింజ వంటిది. అయినను పెరిగినప్పు డది మహావృక్ష మగునుగానఁ బక్షులు వచ్చి దానికొమ్మలమీఁద గూండ్లు కట్టుకొనును."

అతఁ డిట్టివే యింకను గథ లనేకములు చెప్పెను. ఇట్టియుపమానములను గౌతమబుద్ధుఁడు జనుల కుపదేశించి నట్లు బౌద్ధమత గ్రంథములలోఁ బెక్కులుదాహరింపఁబడి యున్నవి. ఆకాలమునందా దేశమునందుండిన యెస్సీనులు బౌద్ధమతసిద్ధాంతములను గొంతవఱ కవలంబించినవారనియు, తన్మూలమున జీసస్సిట్టికథలను విని నీతులను జనులమనస్సులలో దృఢముగా నాటుకొనునట్లు చేయుట కిట్టి యుపమానము లత్యంతోపయుక్తములని యెంచి కథలమూలమున ధర్మోపదేశములు చేయుచు వచ్చెననియు, కొందఱు తలఁచుచున్నారు. అవి యెట్టివైయినను జీసస్ చెప్పిన యీమనోహరములయిన యుపమానములయొక్క ఫలితార్థమును జనులు చక్కఁగా గ్రహించినట్టు కనఁబడదు. అతనిశిష్యులుసహితము కొందఱు వాని తాత్పర్యమును గ్రహింపనేరక ప్రసంగము ముగిసినతరువాత నాతని వద్దకుఁబోయి యిట్టికథల నేల చెప్పితివనియు వానిభావ మేమనియు నడిగిరి. జనులమనస్సులలో నీశ్వరరాజ్యమునుగూర్చిన సత్యములు సుస్థిరముగా లగ్నము లగునట్లు చేయుటకయి యుపమానరూపమున నుపదేశించితి నని చెప్పి, "కర్షకుఁ డనఁగా ధర్మబీజములను జనుల హృదయసీమలలో వెదఁజల్లి పైరుచేయువాఁడు. కొందఱిహృదయము లణఁగద్రొక్కినమార్గము లంత కఠినముగా నుండును. ధర్మోపదేశమును బడికొల్పుమాట లక్కడఁ బడునుగాని వేరు నాటుకొనక యుండదే దుశ్చింతలు పైఁబడి వాని నిర్మూలము జేసివేయును.

కొందఱిమనస్సులు చెడ్డవి కాకపోయినను రాతినేలలవలె దుర్బలము లును నిస్సారములు నయి గంభీరములు కాక యుండును. అట్టివారు సత్యమును సంతోషపూర్వకముగా స్వీకరించి యప్పటికి దాని ననుస రింప నిశ్చయించుకొందురుగాని ధైర్యమును సహనశక్తియు లేనివా రగుటచేత వారి యుత్తమసంకల్పము లన్నియు నల్పకాలములోనే రూపుమాసిపోవును. తోటలలో ముండ్లును బొదలు నుండునట్లు కొందఱిమనస్సులు ప్రాపంచిక చింతలతోను కాంక్షలతోను నిండి యుండును. సత్యవచనాంకురము లచ్చట నాటుకొని కొంతకాలము వర్ధిల్లునుగాని పనికిమాలినకంటకములు మఱింత వేగముగాఁ బెఱిగి క్రమ్ముకొని యందు సత్ఫలములు కలుగఁకుండఁ జేయును. అయినను గొన్ని మంచిబీజము లెల్లప్పుడును విశ్వాసము గలసుదృఢము లయిన శుద్ధహృదయములలోఁ బడి యేపుగాఁ బెరిగి శాంతిసంతోషఫలముల నమితముగా నిచ్చును." అని వివరించి తెలిపెను. జీసస్వప్పుడును దన్ననుసరించువారు సంఖ్య కధికముగా నుండవలెనని కోరక తాను జేసెడియుపదేశములను నిశ్చలబుద్ధితో నమ్మి యనుసరించువారు కొందఱైనను జాలుదురని యెంచి యిందుఁ గడపటఁ జెప్పఁబడిన వాఁడరీతి వారిని జేర్చి వారిమూలమున లోకమున కమేయోపకార మును జేయఁ దలపోయుచుండెను.

ఆకాలమునందు జను లందఱును మెస్సయా వచ్చి దుష్టసంహా రము చేసి దేశమునంతను మంచివారిపాలు చేయునని నమ్మి యుండిరి. దేశములో ఘోరయుద్ధము జరిగెడుపక్షమున చెడ్డవారుమాత్రమే కాక మంచివారుసహితము మడియక మానరని యతఁడు నిశ్చయ ముగా నెఱుఁగును. అందుచేత నతఁ డది మనస్సులో నుంచుకొని గోదుమమొక్కలను గొన్నిటినైనఁ బెల్లగింపకుండఁ గలుపుమొక్కల

నన్నిటిని బూర్ణముగాఁ దీసివేయుట సాధ్యము కాదని యుపమానము చెప్పి, దుష్టు లందఱు నొక్కసారిగా సర్వదండనను బొందఁజాల రనియు, అందుచేత శిష్టు లయినవారు లోకములో సర్వమును దమ యిష్టానుసారముగానే నడచు నని యెన్నఁడును భావింపఁగూడ దనియు, దుష్టులు కొంతకాలము వర్ధిల్లుచున్నట్లు కనఁబడుచున్నను తొందర పడక తమ కర్తవ్యము లయినఫలములను బొందుటకై యు తాలిమితో యుక్తకాలము వచ్చువఱకును వేచి యుండవలె ననియు, జనులకుఁ జూపుట కయి యీ రెండవకథను జీసస స్పష్టము చెప్పెను.

ఈశ్వరరాజ్య మంతయు లోకములో నొక్కపెట్టున వ్యాపించి యెల్లవారికి నొక్కసారిగా సత్ఫలములు కలుగునని యెదురుచూచుచున్న జనులభ్రమను నివారణము చేసి, అతిసూక్ష్మ మైనవటబీజము మొలకయెత్తి క్రమక్రమముగా వృద్ధి నొంది మహావృక్ష మయి యసంఖ్యము లయినపక్షుల కాశ్రయ మగునట్లే యీశ్వరరాజ్యము సహిత మల్పారంభమునే కల దయి దినదినక్రమమున లోకములో వ్యాపించి కడపట బహుజనానందదాయకము కావలెనని చూపుట కయి యతఁడీ మూడవకథను జెప్పెను. ఐహికరాజ్యమును సంపాదించి యానందింపవలెనని జనులమానసములు సదా బాహ్యసౌఖ్యముల మీఁదికి బరుగిడుచుండఁగా, జీసస్ వారిహృదయములను మెల్ల మెల్లఁగా బాహ్యసుఖచింతలనుండి విముఖులను గాఁజేసి శుద్ధపఱిచి యాత్మానందమువంకఁ ద్రిప్పి యాంతరసౌఖ్యములకొఱకు నున్ముఖములనుగాఁ జేసి యీశ్వరరాజ్యమును వారిహృదయములలోనే స్థాపింపఁ జూచుచుండెను. ప్రవాహమూలము కలుషముగా నున్నపక్షమున దానినుండి పాఱు జలమును కలుషమయినదిగానే యుండును. ప్రజల మనస్సులు నిర్మలములుగా నున్నప్పుడు మాత్రమే వారి కార్యములు

యోగ్యములుగా నుండు నని సంకల్పించిన వాఁడయి జీవ స్వభావమును జనులహృదయములను పరిశుద్ధపఱిచి యందుండి సచ్చింతలు ప్రవహించునట్లు చేయుటవలననే పారిశుద్ధిని వర్తనమును బాగుచేయవలె నని సర్వవిధముల బాటుపడఁ జొచ్చెను.

తనయుద్దేశములు ప్రియశిష్యులకుఁ దక్క సర్వజనులకును సుగ్రాహ్యములు కాకుండ గుప్తములు చేయవలె నన్న యుద్దేశ్యములతో జీసస్ కథలమూలమున నుపదేశించుచు వచ్చెనని యిప్పటి గుప్త విద్యాభిమానులు కొందఱు చెప్పుచున్నారు గాని వారి మాటలు ధీమంతు లంగీకరింపఁదగినవి కావు. నూతనమతమును స్థాపించి దానిని లోకమునం దంతటను వ్యాపింపఁ జేయుట కయి యహర్నిశము బాటుపడుచుండిన మహాపురుషుఁడు స్వమతసిద్ధాంతము లెవ్వరికిని బోధపడకుండునట్లు బుద్ధిపూర్వకముగా మఱుఁగు పఱుచు నని చెప్పుటకంటె విరుద్ధాంశ మింకొకటియుండదు. ఆకాలమునం దాతని యుపదేశములను వినవచ్చెడి వారు ప్రాయికముగా విద్యాగంధము లేని ముగ్ధమానవులు. బాలప్రాయు లయినయట్టివారికి కథలు రుచించునట్లు ధర్మకథనములు రుచింపకపోవుటచేతను, చెవులకింపుగా నుండెడు కథలమూలమున ధర్మముల నుపదేశించు నప్పుడవి వారి మనస్సులలో శిలాక్షరముల వలె నాటుకొనుట స్వభావ మగుటచేతను, అతఁడట్టి యుపమానములను దఱుచుగా జెప్పి యుండునుగాని యిప్పటి బుద్ధిమంతు లూహించునట్లు వేఱు కారణములచేత నయియుండదు. నిత్యమును జీసస్సు యొక్క ప్రసంగములు వినవచ్చువారు చేఁపలను బట్టుకొనుచు గైలీలియా సరస్తీరమునందు వాసముచేయు బెస్తలును వారివంటి యితరసామాన్యమానవులునుగాని; పండితులు గారు. జనుల నుండి తాము గయికొన్న వృత్తిపన్నుల యొక్కయు సుంకముల

యొక్కయు మొత్తములను లెక్కవ్రాయు నేర్చిన దొరతనము వారి సుంకరులును క్రయవిక్రయములు చేయు చిల్లరవస్తువులను పద్దులు వ్రాసికొనఁ జాలిన యంగడివాండ్రును వారిలో మహావిద్వాంసులు. వారి బద్ధిబలమును వారికిఁ గల విద్యాబలము ననుసరించియే యుండెను. ఎల్లవారికిని దయ్యములమీఁదను భూతములమీఁదను మేరమీఱిన విశ్వాసము కలదు. మూఢు లయినను వారు కపట మెఱుగని నిర్మల మానసులు; వారి సాధుహృదయములు లెప్పుడును దయాగ్రసపూరితములు లయి యుండెను. ఆకాలమునం దిట్టి శిష్యబృందముతోఁ గలిసి జీసస్ సదా బయల వసించి ప్రొద్దుపుచ్చుచు, స్వేచ్ఛావిహారము సలుపు చుండును. ఒకప్పుడు నావపై నెక్కి యొడ్డునఁ గూడఁబడు మనుజు లకు ధర్మోపన్యాసములు చేయును; ఒకప్పుడు చేరువ కొండమీఁద కెక్కి వెంటఁబడువారికి స్వమతోపదేశము చేయును. వినువారి వినయధర్మమును ధర్మముగాను ధర్మము ధర్మముగాను జూచుచు దుష్పాండిత్యముచేత దూషితము లయిన విపరీతహృదయములు లేకపోవుటచేత వారాతఁ డుపదేశించు సువ్యక్తము లయిన సత్య ముల నెల్లను పరమాదరముతో స్వీకరించుచుందురు. ఒకానొకప్పు డొకానొకరి మనస్సులలో నాతని యుపదేశములయం దించుక సందేహము కలిగినను అడిగిన ప్రశ్నకు మందహాసము చేసి దయా రసము చల్లు చల్లని చూపులతో జీవ స్నేహో యుత్తరము చెప్పఁ గానే వారిమనస్సు లంతటితో సమాధాన పడి సంతృప్తి నొందు చుండును. అమాయికు లయిన యాజనులు తమకు శీఘ్రకాలము లోనే యీశ్వరసాక్షాత్కారము కలుగు ననియు, ప్రపంచమున కేలిక లయి తాము ధన్యుల మగుదు మనియు, నమ్మియుండిరి. జీసస్ వారి కుపదేశించిన దానిలో — "బీద లగువారు ధన్యులు;

వారిదే స్వర్గరాజ్యము. దుఃఖపడువారు ధన్యులు; వారు దుఃఖోప శాంతిని పొందుదురు. నమ్రులయినవారు ధన్యులు; వారు భూమి కధికారు లగుదురు; ధర్మమునందు దాఁకలి గొని దగ గొనువారు ధన్యులు; వారు సంపూర్ణమనోరథు లగుదురు. దయాళు రైనవారు ధన్యులు; వారు దయ చూపఁబడుదురు. హృదయశుద్ధి గలవారు ధన్యులు; వా రీశ్వరుని దర్శింతురు. సంధిచేయువారు ధన్యులు; వారు దేవుని బిడ్డ లని చెప్పఁబడుదురు. ధర్మముకొఱకు బాధలు సహించు వారు ధన్యులు; స్వర్గరాజ్యము వారిది." — ఇత్యాది వాక్యము లనే కము లుండెను.

ఇట్లు బీదతనమును భూషించుచు ప్రాపంచిక సుఖములను దూషించుచు వైరాగ్యోపదేశము చేయుట పూర్వకాలమునం దుష్ణ దేశములలో వాసము చేయు మతాచార్యుల కందఱికిని గొంతవఱ కాచార మయి యుండెను. చలిదేశములలో వలె మంచి గృహములు వస్త్రములు మొదలయినవి యుష్ణదేశములోని జనుల కంతగా నావ శ్యకములు కావు. అక్కడ దిగంబరు లయి బయల వసించుచు జనులు కష్టపడక కాలము గడపవచ్చును. అట్టివారిదృష్టికి మంచిబట్టలు ధరిం చుటయు మంచియిండ్లయందు వసించుటయు భోగములుగా తోఁచుట వింతకాదు. ధనవస్తువాహనాదులమీఁది యతికాంక్షవలననే సాధార ణముగా జను లకార్యకరణమునకు లోఁబడుచు నంతకంత కీశ్వరునికి దూరముగాఁ దొలఁగుచు వచ్చుట నిత్యమును జూచుచుండు మతా చార్యులు ధనాదిబంధములే పాపహేతువు లని భావించి యీశ్వర రాజ్యమును బొందుటకు ధనాదిబంధవిమోచనమే ప్రధాన మని వైరాగ్యోపదేశము చేయుటయు నాకాలమునందు స్వభావవిరుద్ధము కాదు. జనులలో జ్ఞానుల మనుకొనువారు తమలో పశుపత్న్యాదులకు

సహితము కష్టపడ నక్కఱలేక చిత్రవర్ణముల నీశ్వరుఁడు ప్రసాదించి యుండఁగా వానినిమిత్తము మనుష్యు లేల కష్టపడవలెనని తలఁచు చుండిరి. ఇట్టి యూహాలచేతనే యుష్ణదేశములలో శీతలప్రదేశముల కంటె విరక్తి మార్గ మవలంబించిన సన్యాసులసంఖ్య యిప్పటికి నధిక ముగా నున్నది. ఇట్టియూహలు సోమరితనమువలన నుదరపోషణార్థమై కలుగక పారమార్థచింతచేతనే కలిగెడు పక్షమున నీయస్వాభావికవర్త నమువలనను లోకమునకుఁ గొంతలాభము కలుగవచ్చును. కేవలసంసార పరిత్యాగమును బోధింపక పోయినను ధనత్యాగమును జీసస్ తన శిష్యులకుఁ బలుమా ఱుపదేశించుచు వచ్చెను. ఆతని యుపదేశము లోని కొన్ని వాక్యములు వినుఁడు :— "చిమ్మటలును త్రుప్పును తిను నట్టియు చోరులు పగులఁగొట్టి దొంగిలించునట్టియు భూమిమీఁది మీధనమును కూడఁబెట్టుకొనకుఁడు. మీధన మెక్కడ నుండునో మీమనస్సుకూడ నక్కడనే యుండును. ఏమనుష్యుఁడును ఏకకాలము నం దిద్దఱుప్రభువులను గొలువ లేఁడు. అతఁ డొకరిని ద్వేషించి యొక రిని స్నేహించును; లేదా, యొకరిని బహూకరించి రెండవవానిని నిరాక రించును. మీరు దేవునిని ధనదేవతనుగూడ సేవింపలేరు. కాఁబట్టి యేమి తినవలెనో యేమి త్రాగవలెనో యని మీజీవనము నిమిత్తము గాని, యేమిధరింపవలెనో యని మీశరీరము నిమిత్తముగాని యాలోచన చేయువలదని నేను మీకుఁ జెప్పుచున్నాను. మీజీవన మాహారము కంటెను మీశరీరము వస్త్రములకంటెను మేలయినవి కావా? గాలి లోని పక్షులను జూడుఁడు.—అవి విత్తనములుచల్లవు; కోఁతకోయవు; గాదెలలో నిలువ చేసికోవు; అయినను మీపరలోకపిత వాని కాహార మును బ్రసాదించుచున్నాఁడు. మీరు వానికంటె మిక్కిలి యధికులు కారా? మీలో నెవ్వఁడు వస్తుకాంక్ష వహించి తన యౌన్నత్యమున

కింకొకమూర చేరఁగలఁడు! వస్త్రములనిమిత్త మేల కాంక్షించె దరు? పొలములో గడ్డిపూవులెట్లు పెరుగుచున్నవో చూడుఁడు:—అవి పనిచేయవు; నూలువడకవు; అయినను సొలొమోను ప్రభువంతటి వాఁడును దనమహావైభవదశలో సహిత మలంకారములో వానిలో నొకదానినైనఁ బోలియుండఁడని చెప్పుచున్నాను. ఓవిశ్వాసహీనులారా! నేఁడుండి రేపు పొయిలోఁబడెడు పొలములోని గడ్డి కీశ్వరుఁ డిట్టి యలంకారమును దయచేయునప్పుడు మీకంతకంటె నధికముగా దయచేయఁడా? కాఁబట్టి మేమేమి తినవలెను, మేమేమి త్రాగవలెను, మేమేమిధరించుకోవలె నన్న చింతను బెట్టుకోఁబోకుఁడు. ఇవియన్నియు మీకుఁగావలె నని మీపరలోకపిత యెఱుఁగును. కాఁబట్టి మీరు మొట్టమొదట నీశ్వరరాజ్యమును తద్ధార్మికత్వమును బొంద బ్రయత్నింపుఁడు; ఈసమస్తపదార్థములును దమంతనే మీకుఁ జేర్పఁబడును. కాఁబట్టి రేపటిదినమునుగూర్చి యాలోచన చేయఁకుఁడు. రేపటిదినము తానే యావస్తువుల నిమిత్త మాలోచన చేయును.”

జీసస్సుయొక్క యిట్టివాక్యము లప్పటివారియొక్క మనస్సులలో నూతనోత్సాహమును బుట్టించిన వనుటకు సందేహములేదు. సంతుష్టమానసు లయిన యాజనులు సమస్తమునకు నీశ్వరునే నమ్ముకొని యైహికచింత లనర్థదాయకము లని భావించియుండిరి. ఐహిక వ్యవహారము లన్నిటిలోను ధర్మమును మీఱక యీశ్వరప్రీతికరముగా నడుచుచు లోకమునకు మేలుచేయుచుండుట యుత్తమధర్మ మగును గాని సంసారమును బొత్తిగావిడిచెడి విరక్తి యంతగా శ్లాఘ్యమయినదికాదు. ఇట్టి యస్వాభావిక మయిన యావిరక్తి మార్గోపదేశమే యాదేశమునందు సీతిలతను శోభిల్ల జేసి ధర్మదేవతను నిద్రపుచ్చి యిహలోకజీవనమును నిస్సారము చేసినది.

జీసస్ సంసారత్యాగమును విధింపకపోయినను ధనత్యాగమును బలుమారు శిష్యుల కుపదేశించుచు వచ్చెను. అతఁ డొకపర్యాయము "మీకున్నదంతయు విక్రయించి దానము చేసి, మీకు నిశ్చయముగా రానున్న పరలోకధనము నిమిత్త మిప్పటికిని ప్రాఁతగిలని సంచులను సిద్ధము చేసికొనుఁడు" అని బోధించెను. అతఁ డింకొకసారి "ఈశ్వరరాజ్యము ధననిక్షేపము గలతోఁటవంటిది. దానిని కనుఁగొన్నవాఁడు తత్క్షణమే సంతోషపూర్వకముగాఁ బోయి తన కున్నది సర్వమును విక్రయించి యాపొలమును గొనును" అని బోధించెను. అతఁడు మఱియొకసారి "ఈశ్వరరాజ్యము కావలసినవాఁ డీలోకములోఁ దనకున్న వన్నియు నిచ్చివేసి దానిని గొనవలెను. ఈపరివర్తనమువలన లాభము పొందినవాఁడే సుఖుఁడు" అని బోధించెను. అంతేకాక యారంభదశయందు జీసస్ తనశిష్యపదమును బొందుటకు వానియొద్దఁ గలసొత్తెల్ల విక్రయించి యాసొమ్ము బీదల కిచ్చుట ప్రథమ నిబంధనముగా నేర్పఱిచెను. అట్లుచేయ వెనుకతీసినవారు శిష్యులుగా సంగీకరింపఁబడలేదు. అయినను దరువాత జీస స్సానిర్బంధము నంతగా పాటింపలేదుగాని "ధనవంతున కీశ్వరరాజ్యమును బొందుటకంటె నుష్ట్రమునకు సూదిబెజ్జమునుండి దూరుట సులభము" అని యీ నీతివాక్యములు కడవఱకును బోధించుచునే వచ్చెను. మనుష్యదౌష్ట్యమును నీతిరాహిత్యమును తఱుచుగా నతిమాత్రవిషయసుఖానుభవమువలనను స్వప్రయోజన పరత్వమువలనను గలుగుచు వచ్చుటచే వానికి మూలమైన ధనము నతఁడిట్లు దూషించి యుండును. ఎట్లయినను జీసస్‌యొక్క యిట్టిబోధనవలన నాతని శిష్యులింద్రియసుఖవిముఖు లయి యాధ్యాత్మికానంద సంపాదనోన్ముఖులయి నిరంతరకృషి చేయుటచేత నాకాలమునందు లోకమున కమితమయినలాభము కలిగినది.

## ఆఱవ ప్రకరణము.

### శిష్యసంగ్రహమును, పర్వతముమీఁది ధర్మోపన్యాసమును.

వెనుకటిప్రకరణములయందుఁ జెప్పఁబడినట్లు మూఁకమూఁకలుగా వచ్చి జీసస్ చేయుప్రసంగములను విని యప్పటి కానందించి పోవువారు మితిమీఱి యుండినను నిశ్చలమనస్కులయి కష్టసుఖములయందు విడువక యాతని ననుసరించువారు వారిలో నెంద ఱుందురో యని సందేహింపవలసి యుండెను. ఆతనినూతనమతమును వ్యాపింపఁ జేయుట కయి యిష్టమును సామర్థ్యమును గలవారు వారిలోఁ గొందఱె యుందు రనుటకు సందేహములేదు. ఒకధీమంతుఁడు లోకములో నేదేని నూతనమతస్థాపనముచేయు నుద్దేశించినప్పు డాకార్యభారమును గొంతవఱకుఁ బైని వేసికొని తోడ్పడి యాతనితోడి కష్టనిష్ఠురముల నోర్చి నిర్వహింపఁ గృతనిశ్చయులయి కంకణము కట్టుకొన్న సమర్థులు కొందఱైన నుండక కార్యసాఫల్య మగుట దుర్ఘటముగదా? ఏకార్యమునందును కష్టములు రానంతకాల మెల్లవారు నుత్సాహవంతులుగాను గార్యసాధకులుగానే కనబడుదురు. ఇంచుకకష్టము లారంభము కాఁగానే యాయుత్సాహప్రవాహ మంతయు నింకిపోఁగా మొదలింటి వాక్శూరు లనేకు లడుగంటఁగా వారిలో మిక్కిలి కొందఱుమాత్రమే దృఢచిత్తులయి నిలుతురు. అట్టిదృఢమనస్కులను గొందఱిని ముఖ్యశిష్యులఁగా నేర్పఱుచుకొనుట యిప్పుడు జీసస్సునకుఁ బ్రథమకర్తవ్యము. ఈవఱకుఁ జేసినశిష్యులలో విశేషభాగము తమతమవ్యాపారములను జేసికొనుచు నతఁడు తమగ్రామసమీపప్రదేశములకు వచ్చి ప్రసంగించినప్పుడు పోయివినుచుఁ దమసంశయములను నివారణ చేసి

కొనుచు నతఁడు మార్గగాములకుఁ బోఁగానే తామును దమ యిండ్లకుం బోవుచుండిరు. అటువంటివారు గాక యితరవ్యాపారముల నన్నిటిని విడిచి సదా యతనితోనుండి సుశిక్షాపనము నిమిత్తము పనిచేయు కార్యకర్తలివ్వరు కావలసివచ్చిరి. అందుచే నతఁడు తన శిష్యబృందములోనుండి యటువంటివారిని పండ్రెండుగురను బ్రియ శిష్యులనుగా నేఱికొనెను.

అట్లేర్పఱుచుకొనిన పండ్రెండుగురిలో 'సైమన్' అను నామాంతరము గల 'పీట' రనువాఁడును, 'ఆండ్రూ' యనువాఁడును, జోనస్ యొక్క కుమారులు. జీసస్ వీరియింటనే చిరకాలము వాసము చేసెను. పీటరున కత్తయు భార్యయు నిద్దఱు బిడ్డలు నుండిరి. ఆంద్రూ కొంతకాలము స్నానకుఁ డైన జానునకు శిష్యుఁడుగా నుండెనఁట. ఈ యిరువురును జీసస్సునకు శిష్యులుగా నున్న కాలములో సహితము తమ చేఁపల వ్యాపారమును మానలేదు. వీరిద్దఱును జీసస్సునం దధిక భక్తివిశ్వాసములు కలవారు. ఈకుటుంబముమాత్రమే కాక 'జెబిడీ'. యనువాని కుటుంబము కూడ జీసస్సునెడల నత్యంతాదరము కలది. జెబిడీకి 'జేమ్సు' అనియు, 'జాన్' అనియు నిద్దఱుకొడుకులు గలరు. వీరిలో కనిష్ఠుఁడైన జాన్ జీసస్సున కాప్తశిష్యుఁడై తరువాత మిక్కిలి ప్రసిద్ధి చెందెను. వీరితల్లి యైన 'సలోమీ' కూడ జీసస్సునం దధికానురాగము కలదై యాతని మరణపర్యంతము నాతని విడువక వెంబడించెను. జీసస్‌యొక్క యితరశిష్యులు ఫిలిప్, బర్థొలోమస్, థామస్, లెబ్బాస్, మాథ్యూ, సిమన్, జూడస్, జేమ్సు. వీరిలో కడపటి యతఁడైన జేమ్సు జీసస్సునకు పినతల్లి యైన మేరీకుమారుఁడు. జేమ్సునకు జేక బనియు నామాంతరము గలదు. ఇట్లేఱుకొన్న పన్నిద్దఱిలో జీసస్సుండఱిని మంచివారినే యేర్పఱుచుకొనెను గాని యొక్క 'జూడస్'

విషయములో మాత్రము భ్రమ కలిగెను. ఎంత జాగరూకు లయియున్నను ధీమంతులకు సహితత మొకొకప్పుడు ప్రమాదము సంభవించును. జూడస్ పయికి మంచివాడుగా కనబడినను స్వభావముచేత దుష్టుడు. ఇతడు గురుద్రోహియయి కడపటం దనగురువును శత్రువుల కొప్పగించెను. ఇతం డొక్కడు తక్క జీసస్ శిష్యులందఱును గాలిలీదేశస్థులు. ఇతడుమాత్రము విదేశస్థుం డయిన యిస్కారియత్ గ్రామస్థుడు. ఇట్లు ప్రథమమున సంపాదింపఁబడిన ద్వాదశశిష్యులను సామాన్యస్థితియం దుండినవారే కాని వీరిలో నొక్కడును మహాకులీనుడును ధనసంపన్నుడును విద్వాంసుడును లేడు. వీరిలోం బలువురు చేపలవాండ్రు, ఒక్క మాథ్యూమాత్రము సుంకరి. ఈశ్వరకార్యమునందు నియోగింపఁబడిన యీయాపస్సిలవులను 'ఈశ్వరదూత' లని వ్యవహరింపఁబడిరి.

ఇట్లు దేవదూత లని నూతనబిరుదాంకముల నందిన యీయాపన్నిద్దఱును వ్యాపారములను విడిచి తమ స్వామిని జేరిరి. ముందీనూతన మతముయొక్క యభివృద్ధియంతయు వీరి ధైర్యవిశ్వాస సామర్థ్యముల మీఁద నాధారపడి యుండును. వీ రీశ్వరకార్యమునం దవ్యాజభక్తి విశ్వాసములు కలవా రయి ధైర్యసాహసములతోం బనిచేసిరా సర్వమును విజయము నొందును. ధర్మభీరు లయి కష్టములు వచ్చినప్పు డీశ్వరకార్యమునందు నిరుత్సాహు లయి వెనుకతీసిరా సర్వమును భగ్నమయి విజయము దవ్వగును. కాఁబట్టి జీసస్క్రీస్తు తన కొకవేళ నపాయము సంభవించినను తాను పూనిన కార్యభారమును పైని వేసికొని నిర్వహింపఁ సమర్థులనుగాను దేవకార్యమునందు బద్ధకంకణులనుగాను వీరిని దిద్దవలెను. అన్నివైపులను ప్రతిపక్షులుగా బైలు వెడలుచున్న శత్రువు లెప్పుడో తనప్రాణముల కెగ్గు తలఁపక మాన

రని యశేఁడు ముందుగానే కనిపెట్టెను. అటువంటి వైపరీత్యము సంభవించినయెడలఁ దాను బోధించెడి దిప్పుడు పరమానందమునతో విని, యామోదించు చున్నవారిలో నధికసంఖ్యాకులు ఫారిసీలకు విధేయులయి యీక్రొత్తపంథ విడిచి పూర్వపువారికే వెనుక మరలుదురనియు నాతఁ డెఱుఁగును. రాతినేలను మొలచిన బీజాంకురముల వలెనే చిరకాలాచారముచే చట్టుపడియున్న వారి హృదయక్షేత్రములయందంకురించిన నూతనధర్మబీజములను నించుక కష్టము వచ్చినప్పుడు సంతతబోధామృతధారావర్షము లేనిపక్షమున నల్పకాలములోనే రూపు మాయునని యాతని యెన్నిక. అందుచేత నాతఁడు తనసిద్ధాంతములు మొలకలోనే నశింపక తలయెత్తి వృద్ధినొంది లోకమున వ్యాపించి భావికాలమునం దనంతఫలములను గలిగించునట్లు చేయుట కయి, యెన్ని యంతరాయములు వచ్చినను నెట్టికష్టములు ప్రాపించినను చలింపక యచలములవలె నిలువఁగలుగునట్లుగా ధైర్యము చెప్పి కొందఱినైనను దిద్ది తీర్పవలె నని నిశ్చయము చేసికొనెను. ఈ యుద్దేశముతోనే యశేఁడు తనశిష్యబృందములోనుండి దృఢచిత్తులుగాఁ గనఁబడినవారిని పన్నిరువురఁ నేఱికొని యాంతరంగికులఁగా నంగీకరించి వారిని సదా తన సన్నిధియం దుంచుకొనెను. జనుల విషయమునఁ దాను నడపవలసినకృత్యమును మఱవక వారికి సామాన్యముగాఁ జేయవలసిన మేలు నతఁ డణుమాత్రమును మానక యుపదేశాదుల మూలమునఁ జేయుచుండినను, తన యనంతరమునఁ గూడ దా నారంభించిన మహాకార్యమును సాగించుట కయి యీ యాప్తశిష్యుల సమర్థతములనుగాఁ జేయుట కయి యధికశ్రద్ధ వహించి మఱింత పాటుపడఁ జొచ్చెను. తన జీవితకాలములోనే దేశము మీఁదఁ బోయి ప్రసంగములు చేసి స్వతంత్రముగా మతవ్యాపనము చేయ నారంభింపఁ

కుశలులనుగా వారిని జేయవలె నన్న యభిలాషతో జీసస్ వారితోఁ
డా నొంటిగా నున్నప్పుడును వారికి తన సిద్ధాంతములను వేమాఱు
బోధించి మనస్సున నాటించు చుండెను. మఱియుఁ గొన్ని సమయము
లయం దతఁడు వారి నరణ్యములలోనికిఁ గొనిపోయి నిర్మానుష్యము
లయిన యేకాంతస్థలములయందును వారికి సావకాశముగాఁ బోధింపఁ
జొచ్చెను. అట్టి సమయములయందు దతఁడు శిష్యులను తన చుట్టును
గూరుచుండఁ బెట్టుకొని యొక్క-ధర్మప్రవచనమును గూర్చి మాత్రమే
కాక లోకములో వారికిఁ గలుగఁబోవు కష్టములను గూర్చియు కష్ట
కాలములయందు ధైర్యముతో వారు వర్తింపవలసిన మార్గములను
గూర్చియు వారి కనేకవిధముల బోధించి యుండును. ముందుగా నన్య
స్థలములలో నారంభింపక స్వగ్రామములకును పల్లెలకును మాత్రము
పోయి స్వజనమున కీశ్వరరాజ్యము సమీపించిన దని బోధింపవలసిన
దనియు, పరులకంటె వా రధికాదరముతో విందు రనియు, పూర్వ
ప్రవక్తలు చెప్పియున్నట్లుగా దేశము బాగుపడవలసిన సమయము
మాసన్న మయిన దని ఘోషింపవలసిన దనియు, వారి కతఁడు
ప్రథమకర్తవ్యము నుపదేశించి, మతవ్యాపనమును స్వధర్మముగాఁ
జేకొనక వృత్తిగాఁ గైకొని దానిని ధనార్జనమార్గముగాఁ జేసికొన్న
పక్షమున నచిరకాలములోనే మతము హీనస్థితికి రాక మాన దని
యెఱిఁగినవాఁ డగునందున ఖండితముగా వారి కతఁడు ప్రయాణ
ములలో స్వోదరపోషణార్థమయి వస్తుసంగ్రహణము చేయవల దనియు,
నితరులకుఁ జేసిన సాయమున కయి వారివలన నేమియుఁ బారితోషి
కముగా నంగీకరింపఁ గూడ దనియు, బుద్ధులు చెప్పెను. ధనాపేక్ష
లేక వారు తా నుపదేశించినట్లు కేవల పారమార్థికబుద్ధితోనే ధర్మ
ప్రకటనము చేయువా రయినారేని, జనులే వారి నాదరించి స్వగృహ

ములకుఁ గొనిపోయి యన్నపానాదులు సమకూర్చి యాదరింపక మాన రనియు, నందుచే వారు కష్టములపాలు కావలసిన యావశ్యక ముండ దనియు, అతఁ డెఱుఁగును; కేవలపరార్థపరాయణులు గాక ధనాశా పరు లయి స్వార్థపరత్వము నించుక చూప నారంభించిన యుత్తర క్షణముననే. సత్యప్రవచనాగ్రేసరు లగుటచే వారికిఁ గలిగిన బల మంతయు నొక్క-సారిగా నడుగంటు ననియు నతఁ డెఱుఁగును. వారి కతఁ డుపదేశించిన యితర హితవాక్యములు కొన్ని యీరీతిగా నుండెను.

ఎక్కడకుఁ బోయినను మీ రనువర్తనము గలవారు గాను శాంతిసంపన్నులు గాను నుండవలెను. ధర్మబోధ చేయునప్పుడు జనులు విన్నపక్షమున బోధింపవలెను; విననొల్లని పక్షమున నక్కడి నుండి తొలఁగి వేఱొకచోటికిఁ బోవలెను. బోధింపవలసిన దొక్కటే మీధర్మము కాని దాని ఫలము మీశక్తిలోనిది కాదు. జను లవి నయులయి మీ రుపదేశించెడి హితబోధ వినక పెడచెవిని బెట్టిన పక్షమున వారే యీశ్వరున కుత్తరవాదు లయి యాఫలము ననుభ వింపవలసినవా రగుదురు. పుణ్యాపాపఫలముల నొసఁగవలసినవాఁ డొక్క- యీశ్వరుఁడే. ఈశ్వరాధికారమును పైనివేసికొనుట మను ష్యునకు తగదు. విననివారికి సహితము మేలునే కోరి వారికి సద్బుద్ధి నుద యింపఁ జేయుట కయి యీశ్వరుని ప్రార్థింపవలయునే కాని యవిధే యుల నెప్పుడును మనస్సులో సహితము ద్వేషింపను దూషింపను రాదు.

ఇట్లెవరికిని నే కీడును జేయక యెవ్వరివిషయమునను పరుష వాక్యము నోటరానీయక యెవ్వరికిని మనస్సులోను చెడుగుకోరక, మంచిమాటలవలనను శుద్ధవర్తనము వలనను పరులను సిగ్గు పఱచి

వారిని కోపోద్రేకము నొందియు దుష్టత్వము నొందియు నుర్పు వల సిన దని నియమించి యేసు తన శిష్యులను క్రూరకర్ము లయిన మనుష్యులకు ధర్మబోధ చేయఁ బంప నిశ్చయించుకొనెను. దీనినిఁ బట్టి యాతనికి సత్యబలము నందును ధర్మబలము నందును నెంత దృఢవిశ్వాసముండెనో విస్పష్ట మగును. జనులను లోఁబఱుచుకొని ధర్మమార్గమునకుఁ ద్రిప్పుటలో బోధనాశతమున కంటె స్వీయసదనుష్ఠానరూపకోపదేశమునం దధికశక్తి కల దని యాతని నమ్మకము. శిష్యు లెంత జాగరూకులుగా నున్నను కష్టములు రాక మాన వని యెఱిఁగినవాఁడయి ముందియు నాతఁడు వారి కిట్టి వాక్యములను గొన్నిఁటిని బోధించెను.

మిమ్ము తోడేళ్ళ లోనికి గొఱ్ఱెలను వలెఁ బంపుచున్నాను. మీరు మేకపిల్లలంత సాధువులుగా నుండుటయే కాక సర్పములంత జాగరూకులుగా కూడ నుండవలెను. సాధ్య మయినంత వఱకు కపాయమునుతప్పించుకొని దూరముగా తొలఁగుచు, మీయొద్దనున్న యోగ్యతను గొప్పపఱుచుకొనుటచే నెవ్వడును మీయెడల పరుల కసూయ పెరుగకుండునట్లు చేయవలెను. మీ రెంత జాగరూకు లయి మెలఁగుచున్నను దేశాచారములకు విరోధముగా ధర్మబోధ చేయుచు నుటనుబట్టి కొన్నిసమయములయందు మీరు ఒవాలిమిషలమీఁద ధర్మస్థానముల కీడ్చుకొని పోఁబడి నిరోధము నొందవచ్చును. అటువంటి సమయముల యందు స్వరక్షణార్థముగా దండవిధాయకునివద్ద మీ రేమి చెప్పవలయునో దానిని మీ కీశ్వరుఁడే యప్పుడు బోధించును. మీ సాధువాదములవలన మనసు కరగనివాఁ డయి కఠినచిత్తముతో న్యాయాధికారి మిమ్ము విడిచిపెట్టక దండింపఁ దలకొన్నప్పుడు మీ కాతఁడు చేయఁగలిగిన దేమఁడును? మీ కతఁడు చేయఁ

గలిగిన గొప్పయుపకృతియంతయు మిమ్ము వధించుటకంటె నెక్కువగా నుండనేరదు. అతఁడు మీ దేహములకు భంగము కలిగింపఁ గలిగినను మీ యాత్మలను తాఁకలేఁడు; మీకుఁ బరలోకమునఁ గలుఁగనున్న నిత్యానందమునకు భంగము కలిగింపఁలేఁడు. శరీరమునకు మాత్రము హాని కలుగఁ జేయఁగలిగినదానినిగూర్చి మీరు భయపడఁ బోకుఁడు; నిత్యమయిన యాత్మకు హాని కలిగించెడుదానినిగూర్చి భయపడుఁడు.

ఆత్మకు హానిచేసెడి దనఁగా ధర్మపరిత్యాగ మని యాతని భావము. వారు మరణమున కంటెను ధర్మభీరుత్వమున కెక్కుడు భయపడవలెనని యీబోధనయొక్క పరమార్థము. ఇట్లు దిటవుగఁజెప్పి మఱియు, —

"మీరు బైలుదేఱి పోయి నేను మీకు చీఁకటిగడియలలో బోధించినదానిని పగటిపూట వెలుతురులో బహిరంగముగా బోధింపుఁడు. రహస్యస్థలములలో నానోటినుండి విన్న దానిని మీ రింటినడి కప్పులమీఁదినుండి ఘోషింపుఁడు. మనుష్యుల యధికారమునకు భయపడఁబోకుఁడు. అల్పములైన పిచ్చుకల రక్షించెడి యీశ్వరుఁడు మీకు మార్గదర్శకుఁడును గాకపోఁడు. తమ దోషములనుజూపి ఖండించెడు సజ్జనులతో దుష్టజనులు కలహింతురు గనుక మీకాపదలును వచ్చును. మీకప్పుడును సత్యమే పోరాటమును పురికొల్పెడు ఖడ్గముగా నుండవలెను. తనకుఁ బ్రియమయిన సర్వమును తుదకు బ్రాణమును దానినిమిత్తమయి విడిచిపెట్ట నిష్టపడినంగాని మీలో నెవ్వఁడును మీరిప్పుడు పంపఁబడనున్న దేవకార్యమున కర్హుఁడు కాఁజాలఁడు. అల్పప్రయోజనము నిమిత్తమయి యిట్టిపరిత్యాగములను మీరు చేయఁబోవుచుండలేదని దృఢముగా నమ్ముఁడు. నాశుభవార్త నంగీకరించుట కిష్టపడమియైనను మీరు ప్రబోధింపఁ గలిగినయెడల,

ఆహ్వానదయము తనకుఁ ప్రేమపదముగా నన్ను ప్రతిగ్రహించుటయే. నన్నుఁ బ్రతిగ్రహించుటయే నన్నుఁ బంపిన యీశ్వరుని బ్రతిగ్రహించుట. మనుష్యులలో శాంతియు ననురాగమును వృద్ధిపొందించుటకయి మీరేది చేయఁగలిగినను, ఆచేసినది దప్పిగొన్నవారి కొకగిన్నెడు మంచినీళ్ళిచ్చుట మాత్రమే నైనను, దానిబహుమానము రాకయుండదు.

అని యిటువంటి ప్రోత్సాహ వాక్యములఁ బెక్కులు వలికెను. ఇట్లు వలుమాఱుబోధించి దృఢచిత్తులను జేసి కొంతకాలము జరగిన పిమ్మట నతఁడు తనశిష్యులను స్వతంత్రముగా ధర్మబోధ చేయుటకయి పంపి శోధింప నిశ్చయించుకొని, తనవలెనే ధర్మబోధయు రోగనివారణమును జేయుటకయి స్వాతంత్ర్యమిచ్చి యిద్దఱిద్దఱిని బయిటఁ బంపఁజొచ్చెను.

ఇట్లెంతబోధించినను శిష్యు లెంతనిర్మలహృదయములైనను వారిలోవారి కీర్ష్యయు మనస్తాపమును బొత్తిగా కలుగకపోలేదు. ఈశిష్యబృందములో జీసస్సునకుఁ గొంద అధికాప్తులుగా నుండిరి. పీటరును, జెబిడీకొడుకు లయిన జేమ్సును జానును వారిలో ముఖ్యులు. ఈకడపటివారిరువురును నత్యుత్సాహమును చిత్తోద్వేగమును గలవారు. వారి యుత్సాహవ్యగ్రతను బట్టి జీసస్సు వారిని పిడుగుబిడ్డలని పిలుచుచుండెను. ఆయిద్దఱిలోను జానునకు జీసస్సు వద్ద చనవెక్కువ నైనట్టు కనుపట్టుచున్నది. జీసస్సు ఫారిసీలతో వివాద పడునప్పుడు పీటర్, జేమ్సు, జాను; అనుమువ్వురితోనే కార్యాలోచనము చేయుచుండెను. ఈశిష్యు లొండొరులను సహోదరు లనియు, జీసస్సును ప్రభు వనియు పిలుచుచుండిరి. పీటర్ జీసస్సునకు పరమాప్తుఁడగుటచే పైకి శిష్యులకెల్ల నతఁడు నాయకత్వము వహించియుండెను.

పీటర్ ఋజువర్తనమును సత్యశీలతయు వేగిరపాటును గలవాఁడు. ఆతఁడు తన సందేహములను, ఇష్టానిష్టములను, కోపములను, ఏమియు మఱుఁగు పఱుపక సర్వమును నిష్కపటముగా జీసస్సునకుఁ దెలుపుచుండును. జీస స్స్వామియం దాదరమును విశ్వాసమును గల వాఁ డయి మిత్రభావముతోనే యాతనిని చీవాట్లు పెట్టుచుండును. జీసస్సు నభిషిక్తునిగా మొట్టమొదట నంగీకరించినవాఁ డతఁడే. ఆతని భక్తి కానందించి జీస స్స్వకనాఁ డాతనితో స్వర్గరాజ్యముయొక్క తాళములు నీకరగతము లగునని పలికెనఁట. ఇట్లొక శిష్యునియెడల పక్షపాతమును జూపినందునకయి తక్కినవారి మనస్సులలో అసూయ కలుగ నారంభించెను. జీస స్సప్పుడప్పుడు వారిముందఱ మీఁ దీశ్వర రాజ్యములో వా రందఱును దన కుభయపార్శ్వములయందును సింహాసనములమీఁదఁ గూరుచుందు రని యుత్సాహవాక్యములను బలుకుచుండెను. అమాయికు లయిన యామూఢు లామాటల కక్షరార్థమునే గ్రహించి మనుష్యపుత్రుని యెడమవైపునను కుడివైపునను సత్యాసన్ను లయి కూరుచుండువారు తమలో నెవ్వ రని వివాదపడఁ జొచ్చిరి. జెబిడీపుత్రు లయిన జేమ్సును జానును తా మా రెండుస్థానములను బొందనెంచి తమ తల్లియైన సలోమీచేత నాయగ్రస్థానములను తన కొడుకుల కనుగ్రహింప నడిగించిరి. అడిగినదానికి స్పష్టముగా నుత్తరను చెప్పక జీసస్, 'తమ్ము ఘనపఱుచుకొనువారు నీచపదమునకుఁ బంపఁబడుదురు. ఈశ్వరరాజ్యము దీనులును నమ్రులు నైనవారిచేఁ బొందఁబడును' అని సామాన్యవాక్యములతో సమాధానము చెప్పెను. దీనినిబట్టి తక్కినశిష్యుల కా యిరువురియెడలను గొంతయసూయ కలిగెను.

పూర్వోక్తరీతిని శిష్యులను ధర్మప్రవచనార్థము దేశము

మీఁదఁ బంప నారంభించుటకుఁ గొంతకాలముముందే కేపర్నాము నగరసమీపమున నున్నయొక కొండమీఁద జీసస్సొక యుత్తమోపన్యాసమును జేసెను. అట్టిమహోపదేశమునుగూర్చి యిందుఁగొంత ప్రశంసింపకుండుట యుచితముకాదు.

శిష్యులు మొదలుకొని సర్వజనులును మెస్సయా వచ్చి భూలోక రాజ్యమును స్థాపించి యూదులను తదధిపులనుగాఁ జేయు నని నమ్మి యుండి రనియు, మెస్సయానుగాఁ బరిగణించి ప్రజలు గుంపులు గూడి జీసస్ వెంటఁ దిరుగ నారంభించినది మొదలుకొని వాఁడు సైన్యమును గూర్చుకొని యెప్పుడు యుద్ధ మారంభించునా యని యెల్లవారు నెదురు చూచు చుండి రనియు, ఈపఱకే కొంత తెలుపఁబడి యుండెను గదా. ఈశ్వరరాజ్యము సమీపించుచున్నదని పలుమాఱు పలుకు చుండుటయేకాని యీశ్వరరాజ్య మెట్టిదో యీపఱ కెవ్వఁడును జీసస్ స్పష్టముగా వివరించినవాఁడు కాఁడు. తానే మెస్సయానని మనస్సులో నతఁ డెంత దృఢముగా నమ్మి యుండినను పైకట్లు చెప్పకపోవుటచేత, ప్రతిపక్షులైన ఫారిసీలు జీసస్ మెస్సయా కాఁడనియు మోసగాఁ డనియు నెల్లయెడలను ఘోషమఁ జేయుచుండిరి. జీసస్సునందు భక్తివిశ్వాసములు గలశిష్యు లతఁడు తాను మెస్సయా నని లోకమునకు శీఘ్రముగాఁ బ్రకటించి లోకమును లోఁబఱుచుకొని ఫారిసీలమాట లసత్యములు చేయవలయునని యత్యుత్సుకులై యభిలషించుచుండిరి. మెస్సయానని ప్రకటించి ఫారిసీలనో రడఁపవలసిన దని మిత్రు లాతనిని నిర్బంధపఱుపఁ జొచ్చిరి. జీసస్సెప్పు డేదోవిధమున వారి మనోరథమును దీర్చి యందఱిని సమాధానపఱుపవలెను. అట్లు చేయనిపక్షమున వారందఱు నాశాభంగ మొంది యొక్కసారిగా విముఖులై యాతనిని విడిచి తొలఁగి పోవుదురు. జీసస్ తాను

మెస్సయా నని చెప్పుకొనయే జనులు గ్రహించునట్లు చేయవలె ననియు మనస్సులలో శాంతియుఁ గారుణ్యమును పూర్ణముగాఁ గలిగి నంగాని యీశ్వరరాజ్యము రానేరదని బోధించి మెల్లమెల్లఁగా జనులమనస్సులనుండి మెస్సయాయం దారోపిత మైన యుద్ధచింతను బాఁదోలవలయుననియుఁ దలఁచి యుండినను, ఫారసీలు శత్రువులై తన్నుఁ గూర్చి నానావిధంబుల దురారోపణములు ప్రకటించు చున్నందు నను మిత్రులు వేగిరపడు చున్నందునను తాఁదలఁచుకొన్నంతకాలము వేచియుండుట కవకాశము లేనివాఁడై తోడనే తన మిత్రులకును శిష్యులకును వారిచిత్తములలో నెలకొని యున్న యిహలోకరాజ్యా పేక్షను విడిచిపెట్టుఁడని తెలియఁజెప్పవలసినవాఁ డయ్యెను. ఈశ్వర రాజ్య మన్నమాటకు వారు చేసికొనుచుండిన యర్థమునకును తా నిప్పుడు విప్పి చెప్పఁబోయెడి యర్థమునకును గలతారతమ్యమును జను లొక్కసారిగా గ్రహించి తనయుత్తమసిద్ధాంతము నంగీకరింపఁ గలుగుదురా, ఈనూతనసిద్ధాంతప్రకటనమువలన వారి కింతవఱకుఁ దన యెడలఁ గల గౌరవానురాగము లాకస్మికముగా ద్వేషతిరస్కారము లుగా మాఱినయెడలఁ దాను పూనిన యీశ్వరకార్యమునకు విఘా తము కలుగకుండునా, మెస్సయాపని యుద్ధము చేయుట కాదని చెప్పి నప్పుడు వారు తన్ను రణభీరువునుగా భావించి తొలఁగ కుందురా. అనుచింత లిప్పుడు మనస్సును పరిపరిలాగుల బాధింపఁగా నతఁడు రాత్రి నిద్ర పట్టక కేపర్నామువట్టణమును విడిచి యాచేరువ నున్న యొక పర్వతముమీఁదికిఁ బోయి యొంటిగా నీశ్వరుని ప్రార్థించి మనో బలమును శాంతియుఁ బొందినవాఁడై యాకొండమీఁదనే నిద్ర పోయెను. తెల్లవాఱి యతఁడు లేచునప్పటికే శిష్యు లాతఁ డున్న స్థలమును గనిపెట్టి మూఁకలుగా నాపర్వతపార్శ్వమును జేరి యుండిరి.

నాఁటి ప్రాతఃకాలమున నతఁడు ప్రప్రథమముగాఁ జేసినపనిని యీశ్వరరాజ్యప్రకటనము చేయుటకై శిష్యసంఘములోనుండి పండ్రెండుగురను దేవకార్యదూతలనుగా పరిగ్రహించుట. శిష్య సంగ్రహకార్యము ముగియఁగానే యతఁడు కూరుచుండి యేదో ప్రసంగ మారంభింపఁబోవునట్లుగా నిమీలితనేత్రుఁడై క్షణకాల ముండెను. అతఁ డేమి చెప్పునో వినవలె నన్న కుతూహలముతో నెల్ల వారును నాతనిముఖముమీఁద దృష్టిపఱపి వీను లొగ్గి యేకాగ్రచిత్తు లయి నిశ్శబ్దముగా నుండిరి. అంతట నతఁడు మూసినకన్నులు తెఱచి తలయెత్తి శిష్యులవంకఁ జూచి సహజమధురగంభీరస్వరముతో— "దీనమనస్సులు గలవారు ధన్యులు; స్వర్గరాజ్యము వారిది. దుఃఖార్తు లగువారు ధన్యులు; వారు సమాశ్వాసింపఁబడుదురు. నమ్రులగు వారు ధన్యులు; వారు భూస్వామ్యమును బొందుదురు. పుణ్యముకొఱకు కాఁకలిదప్పులు గొన్నవారు ధన్యులు; వారు తృప్తిపఱుపఁబడుదురు. కరుణాళువు లగువారు ధన్యులు; వారు కరుణింపఁబడుదురు. శుద్ధ హృదయము గలవారు ధన్యులు; వారీశ్వరునిదర్శింతురు. మనశ్శాంతి జేయువారు ధన్యులు; వారీశ్వరతనూజు లనఁబడుదురు. ధర్మము నిమిత్తము బాధపడువారు ధన్యులు; స్వర్గరాజ్యము వారిది."—అని బోధింప నుపక్రమించెను. ఉపన్యాసారంభమునఁ జేయఁబడిన యీ యుపదేశాష్టకముయొక్క భావము నప్పటివా రప్పుడు చక్కఁగా గ్రహింపఁగలిగిరో లేకపోయిరో కాని యీయమూల్యవాక్యరత్నము లనుబట్టి జీసస్సు మనస్సులో నైహికరాజ్యసంపచ్చింత లేదనియు నతని నాయకత్వ మంగీకరించినవారు భూలోకవైభవాపేక్ష వదలుకొనవలసిన దనియు స్పష్టముగాఁ దె[illegible]కొని యుందురు. దుఃఖము, ఆకలి, దైన్యము, బాధలు, మొదలగు శ్రావ్యములు కానిమాట లిహలోక

సంపదల కాశించుచున్న యనేకుల కారంభదశలోనే యాశాభంగమును గలిగించి యుండును. అయినను జీసస్సుయొక్క వాగ్మాధుర్యమును బట్టియు నుపన్యాసమునందలి విషయగౌరవమును బట్టియు మనస్సు చెదరనీయక యెల్లవారును దానిని కడవఱకును పరమాదరముతో వినిరి. అపూర్వమైన యీ ధర్మోపన్యాసశేషమును సమగ్రముగా నిందు బొందుపఱచుచున్నాను —

“నా నిమిత్తమై జనులు మిమ్ము దూషించినప్పుడును బాధించినప్పుడును మీమీఁద నన్యాయముగా సర్వవిధ దురారోపణములను జేసినప్పుడును మీరు ధన్యులగుదురు. పరలోకమున గలుగు ఫలమధిక మయినది. కాఁబట్టి మీరు సంతోషించి యపరిమితానందము నొందుఁడు. మీకుఁ బూర్వమునుండిన ప్రవక్తలను వారీవిధముననే బాధ పెట్టిరి.

మీరు భూమికి లవణమయినవారు. లవణమే తనసారమును బోగొట్టుకొన్న పక్షమున, ఇఁక దానికి దేనితో చవి కలిగింపఁబడును? అది అప్పటినుండి పాఱవేయఁబడి మనుష్యుల కాళ్ళక్రింద త్రొక్కఁబడుటకే కాని మఱి యెందునకును బనికిరానిదగును.

మీరు ప్రపంచమునకు వెలుగయినవారు. పర్వతముమీఁదఁ గట్టఁబడిన పురము మఱుఁగుపడి యుండనేరదు. మనుష్యులు దీపమును వెలిగించి దీపస్తంభముమీఁదఁ బెట్టుదురే కాని కుంచము క్రిందఁ బెట్టరు. అది యింట నున్నవారి కందఱికిని వెలుతురు నిచ్చును. జనులు మీ సత్కార్యములను జూచి పరలోకపితయొక్క మహిమను బ్రశంసింపఁ గలుగుటకుఁ దగినట్లుగా వారిముందు మీ వెలుతురు ప్రకాశింపనిండు.

ధర్మశాసనమును గాని ప్రవక్తలను గాని నేను కొట్టివేయవచ్చితి వని తలంచవలదు. నేను నడిపించుటకయి వచ్చియున్నాను గాని నాశనము చేయుటకయి రాలేదు. భూమియు నాకాశమును గతించు వఱకును ధర్మశాసనము నుండి లవ లేశ మయినను పూర్ణముగా నెఱ వేర్పఁబడక యేవిధమునను గతింప దని నేను మీకు నిశ్చయముగాఁ జెప్పుచున్నాను. కాఁబట్టి యీసూత్రములయిన యాజ్ఞలలో నెవ్వఁ డొకఁడు దాని నతిక్రమించి లోకమున కట్లు బోధించునో వాఁడు పర లోకరాజ్యమునం దధమాధముఁ డని చెప్పఁబడును; ఎవ్వఁడు వానిని తా నాచరించి ప్రవచనము చేయునో వాఁడు పరలోకరాజ్యమున ఘనుఁ డనఁబడును. మీ నీతివర్తనము లేఖకులయొక్కయు ఫారిసీల యొక్కయు నీతివర్తనమును మించినదయినం గాని మీ రెన్నఁడును స్వర్గరాజ్యమునఁ బ్రవేశింపఁ బోరని మీకు నేను జెప్పుచున్నాను.

నీవు హత్య చేయరాదు; ఎవ్వఁడు హత్యచేయునో వాఁడు విచారణోపద్రవమును (దండనమును) బొందును. అని పూర్వకాలపు వారిచేఁ జెప్పఁబడినట్టు మీరు వినియున్నారు. ఎవ్వఁడు నిష్కారణ ముగాఁ దన సోదరునియెడ కోపము చూపునో వాఁడు న్యాయవిచా రణోపద్రవమును బొందు ననియు, ఎవ్వఁడు తన సహోదరుని 'నీచుఁడా' యని పలుకునో వాఁడు విచారణోపద్రవమును బొందు ననియు, 'బుద్ధిహీనుఁడా' యని యెవ్వఁ డనునో వాఁడు నరకాగ్ని భయమును బొందుననియు నేను మీకుఁ జెప్పుచున్నాను. కాఁబట్టి నీ వుపహారమును గొని బలిపీఠమునకుఁ బోయి యున్నప్పుడు నీసోద రుని యెడ నీవేదో యపరాధి వయినట్లు నీకక్కడ నీస్మరణకు వచ్చినను నీయుపహారమును బలిపీఠమువద్దనే దిగవిడిచి తిన్నఁగాఁ బోయి మున్ను మొదట నీసోదరుని సమాధాన పఱిచి పిమ్మట వచ్చి నీయుపహారమును

సమర్పింపుము. నీ వాదినితో దారిలో నుండఁగానే శీఘ్రముగా నీప్రతిపక్షులతో సహాధానపడుము. లేకపోయినయెడల నీప్రతిపక్షుఁ డెప్పుడయినను నిన్ను న్యాయాధికారి కప్పగించును; నీవు చెఱసాలలోఁ ద్రోయఁబడుదువు. కడపటి కాసుకట్టువఱకును నీవందుండి యే మార్గమునను వెడలి రావని నీతో నేను సత్యమును జెప్పుచున్నాను.

'నీవు వ్యభిచారము చేయరాదు' అని పూర్వకాలపువారిచేతఁ జెప్పఁబడినట్లు మీరు వినియున్నారు. కామముతో నెవ్వఁ డొకస్త్రీ వంకఁ జూచునో వాఁ డప్పటికే యామెతో మానసిక వ్యభిచారము చేసినవాఁ డని నేను మీకుఁ జెప్పుచున్నాను. కాఁబట్టి నీ కుడికన్ను నీ కపరాధియయినపక్షమున దానిని పెరికివేసి నీయొద్దనుండి పార వేయుము. ఎందుచే ననఁగ, నీశరీరమంతియు నరకాగ్నిలోఁ వేయఁబడక నీయవయవములలో నొకటి నశించుట నీకు లాభకరము. నీకుడిచేయి నీ కపరాధి యయిన పక్షమున, దానిని ఖండించివేసి నీయొద్దనుండి పాఱవేయుము. ఎందున కన, నీశరీర మంతియు నరకాగ్నిలో వేయఁబడుట కంటె నీయవయవములలో నొక్కటి నశించుట నీకు లాభకరము.

తనభార్యను విడిచిపెట్టువాఁ డెల్లను వివాహబంధ విమోచన పత్రము నియ్యవలెను' అని చెప్పఁబడి యున్నది. జారత్వకారణమునఁ దక్కఁ దనభార్య నెవ్వఁడు పరిత్యజించునో వాఁ డామెను వ్యభిచరించునట్లు చేసినవాఁ డగు ననియు, అట్లు పరిత్యజింపఁబడిన దానిని వివాహ మాడువాఁడు వ్యభిచారము చేసినవాఁ డగు ననియు నేను మీకుఁ జెప్పుచున్నాను.

మఱియు 'నీవప్రమాణములు చేయక, నీప్రమాణముల నీశ్వరుని కడ జెల్లింపవలెను' అని పూర్వకాలపువారిచేతఁ జెప్పఁబడినట్లు

మీరు వినియున్నారు. "మీరెప్పుడును ప్రమాణములే చేయకుఁడు. ఆకాశముతోడనఁ బోకు — అది దేవుని సింహాసనము; భూమితోడనఁబోకు — అది యాతనిపాదపీఠము; జెరూసలేముతోడనఁబోకు — అది మహారాజపట్టణము; నీశిరస్సుతోడని యొట్టుబెట్టుకోకు — నీ వొక్క వెంట్రుకను నల్లగాఁ గాని తెల్లగాఁ గాని చేయ లేవు. నీభాషణము అయిన దౌను, కానిదికాదు. అయి యుండనిమ్ము. వీని కంటె నధిక మయినదంతయు చెడుగునుండి వచ్చిన దగును." అని నేను మీకుఁ జెప్పుచున్నాను.

'కంటికి కన్ను పంటికి పల్లు' అని చెప్పబడినట్లు మీరు విని యున్నారు. దౌష్ట్యమున కెదు రొడ్డక, ఎవ్వరయినను నీ కుడిచెంప మీఁదఁ గొట్టినయెడల, రెండవచెంపనుగూడ నాతనివంక త్రిప్పుము. ఏమనుష్యుఁడైనను వ్యాజ్యమాడి నీచొక్కాను తీసికొన్నయెడల, నీపయిబట్టకూడ వానినే దీసికొననిమ్ము. ఎవ్వఁడయినను నిన్నరక్రోసు దూరము నడువ బలవంతపెట్టినయెడల, క్రోసుదూరము నీ వాతనితో నడువుము. నిన్ను వేఁడుకొనువాని కిమ్ము; నీవద్ద బదు లడుగఁ గోరు వానినుండి తొలఁగి పోకు" అని నేను మీకుఁ జెప్పుచున్నాను.

'నీవు నీపొరుగు వానియెడ ప్రేమచూపవలెను; నీశత్రువును ద్వేషింపవలెను' అని చెప్పఁబడఁగా మీరు వినియున్నారు. "మీ శత్రువులయెడలఁ బ్రేమ చూపుఁడు; మిమ్ము శపించువారి నాశీర్వదింపుఁడు; మిమ్ము ద్వేషించువారికి మేలు చేయుఁడు; మి మ్మవమానయతో ననాదరించి బాధించువారినిమిత్తము ప్రార్థింపుఁడు. అందు వలన మీరు పరలోకమునం దున్న మీతండ్రికి కుమారు లగుదురు. ఎట్లన, ఆయన, తనసూర్యుని చెడ్డవారిమీఁదను మంచివారిమీఁదను ఉదయించు (ప్రకాశించు) నట్లు చేయుచున్నాఁడు; ధార్మికులకును

అధార్మికులకును వర్షమును బంపుచున్నాడు. మీమీద ప్రేమ గలవారిపైని మీరు ప్రేమ చూపినయెడల, మీకు ఫల మేమి? ఆలాగున సుంకరులు సహితము చేయుచుండ లేదా? మీసోదరులకు మాత్రము మీ రభివాదము చేసినపక్షమున, ఇతరులకంటె మీ రెక్కువ చేయుచున్న దేమున్నది? ఆలాగున సుంకరులుసహితము చేయరా? కాఁబట్టి స్వర్గమునం దున్న మీతండ్రి పరిపూర్ణుఁడయి యున్నట్లుగానే మీరును పరిపూర్ణులు కండు.

మనుష్యులచే చూడఁబడునిమిత్తముయి వారిముందు నీవు దానము చేయకుండ జాగ్రత్తపడుము. లేకపోయినయెడల, పరలోకమునం దున్న నీతండ్రియొక్క బహుమానమును నీవు పొందవు కాఁబట్టి సభాగృహములలోను వీధులలోను మనుష్యుల మెప్పునకయి వేషధారులు చేయునట్లుగా, దానము చేయునప్పుడు నీవు నీముందు చాటుకోఁబోకు. వారికి వారిఫలము కలదని నేను నిశ్చయముగాఁ జెప్పుచున్నాను. నీవు దానము చేయునప్పుడు నీకుడిచేయి చేయు దానిని నీయెడమచేతికిఁ దెలియనీకు. నీదానములు రహస్యముగా జరుగనిమ్ము. రహస్యమునఁ జూచెడు తండ్రియే బహిరంగముగా నీకు బహుమానము చేయును.

నీవు ప్రార్థన చేయునప్పుడు వేషధారులవలెఁ జేయఁబోకు. ఏలయన, మనుష్యులచే చూడఁబడునిమిత్తముయి వారు సభామందిరములలోను వీధులమూలలలోను నిలుచుండి ప్రార్థన చేయ నభిలషింతురు. వారికి వారిఫలము కలుగునని నేను మీతో నిశ్చయముగాఁ జెప్పుచున్నాను. నీవు ప్రార్థించునప్పుడు గదిలోనికిఁ బోయి తలుపువేసికొన్న తరువాత సంతరంగమున నున్న తండ్రిని ప్రార్థింపుము. రహస్యమునఁ జూచెడు నీతండ్రి నీకు బహిరంగముగా బహుమానము

చేయును. నీవు ప్రార్థన చేయునప్పుడు ప్రతివేషధారులవలె నిరర్థకములైన పునరుక్తములను వాడఁబోకుము. ఏలయన, అధికముగా మాటాడుటవలననే తమ మొఱ ఆలకింపఁబడు నని వారు భావింతురు. కాఁబట్టి మీరు వారివలె నుండఁబోకుఁడు. మీకేమి కావలసి యున్నదో మీరడుగకమునుపే మీతండ్రి యెఱుఁగును. కాఁబట్టి మీరీవిధముగఁ బ్రార్థింపుఁడు — మా తండ్రీ! నీనామము పవిత్రీకరింపఁబడును గాక! నీరాజ్యము వచ్చును గాక! పరలోకమునందు వలెనే భూలోకమునందును నీయిచ్ఛయే నెరవేరును గాక! నేఁడు మాకు మా దినాహారము ననుగ్రహింపుము. మాఋణస్థులను మేము మన్నించునట్లే నీవు మాఋణములను మన్నింపుము. మమ్మింద్రియవికారములోఁ బడనీయక పాపములనుండి విమోచనము చేయుము. ఏలయన, రాజ్యమును, బలమును, మహిమయు నిరంతరమును నీవి. తథాస్తు!—మనుష్యుల వ్యతిక్రమములను మీరు క్షమించినపక్షమున, మీపరలోకపితకూడ మీవ్యతిక్రమములను క్షమించును. మనుష్యుల వ్యతిక్రమములను మీరు క్షమింపనిపక్షమున, మీతండ్రియు మీ వ్యతిక్రమములను క్షమింపకుండును.

అంతేకాక మీ రుపవాసములు చేయునప్పుడు వేషధారులవలె మీరు దీనముఖములు పెట్టుకొనకుఁడు. ఏలయన, తా ముపవాసము చేయుచున్నట్టు మనుష్యులకు కనఁబడుటకయి వారు తమముఖములను వికృతముగాఁ జేసికొందురు. వారికి వారిఫలము కలదని నేను మీకు నిశ్చయముగాఁ జెప్పుచున్నాను. నీవో, యుపవాసము చేయునప్పు డుపవాసము చేయుచున్నట్టు మనుష్యులకుఁగాక యంతరంగమున నున్న నీతండ్రికిమాత్రమే కనఁబడునట్లుగా శిరస్సంస్కారము చేసి కొని ముఖప్రక్షాళనము చేసికొమ్ము. రహస్యమునఁ జూచెడు నీతండ్రి

నీకు బహిరంగముగా ఫలదానము చేయును. కీటకములును త్రుప్పును భ్రష్టము చేయునట్టియు దొంగలు కన్నము వేసి దొంగిలునట్టియు భూమిమీఁద మీసంపదలను కూడఁబెట్టక, కీటకములుగాని త్రుప్పుగాని నాశము చేయనట్టియు చోరులు కన్నము వేసి యపహరింపనట్టియు పరలోకమునందు మీసంపదలను మీకొఱకు నిలువచేసికొనుఁడు. మీవిత్త మెక్కడనుండునో మీచిత్తముకూడ నక్కడనే యుండును. నేత్రము శరీరమునకు జ్యోతి యగుటచేత, నీకన్ను తిన్నఁగా నున్నపక్షమున నీసర్వశరీరమును తేజోమయ మయి యుండును; నీకన్ను చెడినపక్షమున నీసర్వశరీరము నంధకారబంధుర మగును. అందుచేత నీలోపల నున్న వెలుతురే కలుష మైనపక్షమున, ఆయంధకార మెంత గాఢమై యుండును! ఏమనుష్యుఁడును ఇద్దఱు ప్రభువులను సేవింపలేఁడు. అతఁ డొకరిని ద్వేషించి యొకరిని ప్రేమించును; లేదా, యొకరి నాశ్రయించి మఱియొకరిని తిరస్కరించును. మీరు దేవునిని ధనలక్ష్మినికూడ కొలువలేరు. కాఁబట్టి మే మేమి తిందుము? మే మేమిత్రాగుదుము? అని మీజీవనమునుగూర్చి కాని, మే మేమిధరింతుము? అని మీదేహమునుగూర్చి కాని, ఆలోచింపవలదని నేను మీకు చెప్పుచున్నాను. ఆహారమునకంటె జీవనమును, వస్త్రములకంటె శరీరమును, గొప్పవి కావా? గాలిలోనిపక్షులను చూడుఁడు; అవి విత్తనములు వేసి, కోసి, కొట్లలో నిలువ చేసికోవు. అయినను మీపరలోకపిత వాని కాహారము దయచేయుచున్నాఁడు. వానికంటె మీరు మిక్కిలి శ్రేష్ఠతరములుకారా? ఆలోచన చేసి మీలో నెవ్వరు తమపరిమాణమున కొకమూర చేర్పఁగలరు? వస్త్రములకొఱకు మీ రేల చింత చేసెదరు? పొలములలోనిగడ్డి పువ్వులను గూర్చి యవి యెట్లువర్ధిలుచున్నవో యాలోచింపుఁడు. అవి కష్టపడి,

నూలువడకవు. అయినను సొలొమోను సంతటివాఁడు సహితము తన మహోన్నతదశలోను వానిలో నొక్కదానిని బోలిన వస్త్రధారణము చేసికొనియుండఁ డని నేను మీకుఁ జెప్పుచున్నాను. కాఁబట్టి ఓ భక్తిహీనులారా! నేఁడుండి రేపు పొయిలో వేయఁబడెడి పొలములోని గడ్డికే యిటువంటి యాచ్ఛాదనమును బ్రసాదించియున్నప్పుడు, మీ కంతకంటె నధికముగా నాచ్ఛాదన మనుగ్రహింపఁడా? కాఁబట్టి మే మేమి తిందు మనికాని, యేమి త్రాగుదు మనికాని, వేనితో నాచ్ఛాదితుల మగుదు మనికాని, చింతింపఁబోకుఁడు; ఈ యన్నివస్తువులును మీకుఁ గావలసిన వని మీపరలోకపిత యెఱుఁగును. మీరు మొట్టమొదట నీశ్వరరాజ్యమును, ఆతనిపరిశుద్ధతను, వెదకుఁడు. ఈవస్తువులన్నియు మీకు చేర్పఁబడును. కాఁబట్టి రేపటికొఱ కాలోచన చేయకుఁడు. రేపటిదినము తానే యావస్తువులకొఱ కాలోచన చేయును. ఆనాఁటి చింతయే యానాఁటికి చాలియుండును.

మీరు విమర్శింపఁబడ రని యెంచుకోకుఁడు. ఏన్యాయముతో మీరు విమర్శింతురో దానితోనే మీరును విమర్శింపఁబడుదురు. ఏకొలపాత్రముతో మీరు కొలుతురో మరల దానితోనే మీకు కొలువఁబడును. నీవు నీపొరుగువానికంటిలోనినలుసును జూచుచు, నీనేత్రమునందే యున్న దూలమునుగూర్చి యేల యాలోచింపవు? నీకంటిలోనే దూల ముండఁగాఁ జూచుచు, 'నన్ను నీకంటిలోని నలుసును దీయని' మ్మని నీసోదరునితో నీ వెట్లనఁ గలవు? ఓవంచకుఁడా! మొట్టమొదట నీకంటిలోనుండి దూలమును తీసివేసికొమ్ము; అప్పుడు నీసోదరునికంటిలోనుండి నలకను దీసి వేయుటకు చక్కఁగా చూడఁ గలుగుదువు. పవిత్రమైనదానిని కుక్కలకు వేయకుఁడు; మీముత్యము

లను పందులముందు వేయకుఁడు — అవి వానిని తమకాళ్ళక్రింద నలుగఁద్రొక్కి యెదురు తిరిగి మిమ్మే గ్రుమ్మును. అడుగుఁడు; మీకియ్యఁబడును. వెదకుఁడు, మీకు కనఁబడును. తట్టుఁడు; మీకు తెఱువఁబడును. తనకొడుకు రొట్టె నడిగినప్పుడు వానికి రాయియిచ్చు వాఁడు మీలో నెవ్వఁడుండును? వాఁడు చేఁప నడిగినప్పుడు వానికతఁడు పామునిచ్చునా? మీబిడ్డలకు మంచియీవుల నెట్లియ్యవలెనో పాపు లయిన మీరే యెఱిఁగి యున్నప్పుడు, పరలోకమునం దున్న మీతండ్రి తన్ను వేఁడినవానికి మంచివస్తువుల నింకను నెంత యధికముగా నిచ్చును? కాఁబట్టి మనుష్యులు మీకేమి చేయవలె నని మీరు కోరుదురో వానినెల్లను వారి కాలాగుననే మీరును చేయుఁడు. ఇదియే ధర్మశాస్త్రమును ప్రవక్తృవచనమును.

మీరు తిన్నని దారిని లోపలఁ బ్రవేశింపుఁడు; వినాశమునకు గొనిపోవు ద్వారము విశాల మయినదియు దారి వెడల్పయినదియు కాఁబట్టి యామార్గమున లోనికిఁ బోవువా రనేకు లుందురు. (నిత్య) జీవమునకుఁ గొనిపోవు ద్వారము సరళ మయినదియు దారి యిఱుకయినదియు కాఁబట్టి దానిని కనుఁగొనువారు కొందఱే యుందురు. అబద్ధప్రవక్తలను గూర్చి మీరు జాగ్రత్త పడుఁడు; గొఱ్ఱె (సాధు) వేషములతో మీవద్దకు వత్తురు కాని వారు లోపల సత్యశనాతురము లయిన తోడేళ్ళు (క్రూరచిత్తులు). వారివలని ఫలములను బట్టి మీరు వారిని తెలిసికొందురు. మనుష్యులు ముండ్లపొదల నుండి ద్రాక్షఫలములను గాని మేడిపండ్లను గాని సంగ్రహింతురా? అలాగుననే ప్రతిసద్వృక్షమును సత్ఫలముల నిచ్చును; దుష్టవృక్షము దుష్ఫలముల నిచ్చును. ఒక మంచిచెట్టు చెడుఫలముల నియ్యనేరదు;

చెడు చెట్టును మంచిఫలముల నియ్యఁజాలదు. మంచిఫలముల నియ్యని ప్రతివృక్షమును నఱకఁబడి నిప్పులో వేయఁబడును. కాఁబట్టి ఫలము వలన మీరు వాని నెఱుఁగుదురు.

పరలోకమునం దున్న నాతండ్రియొక్క చిత్తానుసారముగా నాచరించువాఁడే కాని నన్నుఁ గూర్చి 'ప్రభువా! ప్రభువా!' అని పలుకువాఁ డెల్లను స్వర్గరాజ్యములోఁ బ్రవేశింపఁడు. 'ప్రభువా! ప్రభువా! మీ పేరిట మే మనాగతమును సూచించి యుండలేదా? మీ పేరిట మేము దయ్యములను వెడలఁ ద్రోలలేదా?' అని యా దినముల నాతో ననేకులు పలుకుదురు. 'మిమ్ము నే నెన్నఁడు నెఱుఁగను; నీతిమాలి వర్తించిన మీరు నాయొద్దనుండి తొలఁగుఁడు' అని వారితో నే నప్పు డందును. కాఁబట్టి యీ నావాక్యములను విని తదనుగుణముగా నెవ్వఁ డాచరించునో యటువంటివాని నెల్లను దన యింటిని ఱాతిమీఁదఁ గట్టుకొన్న బుద్ధిమంతునితోఁ బోల్చెదను. వర్షము కురియును; వఱదలు వచ్చును; గాలి వీచి యాయింటిమీఁద గొట్టును; ఱాతిబండమీఁద పునాది వేయఁబడినందున, ఆయిల్లు కూలదు. ఈనా వాక్యములను విని వానిప్రకారముగా నడవనివాఁ డెల్లను దనయింటి నిసుకపైఁ గట్టుకొన్న బుద్ధిహీనునితో సరిపోల్పఁబడును. వాన దిగును; వరదలు వచ్చును; గాలి వీచి యా యింటిమీఁద కొట్టును; అది పడి పోవును; దానిపాటు మిక్కిలి గొప్పదగును."

ఏయి యుపన్యాసమునం దీశ్వరరాజ్య మన్న వచనమునకుఁ గల యభిప్రాయమేమో జీసస్ తన శిష్యబృందమునకు మనస్సు నొవ్వ కుండ మంచిమాటలతో క్రమక్రమముగా విప్పి చెప్పివేసెను. అతఁ

డిట్లు నేర్పుతోఁ బలుకక యీశ్వరరాజ్యవిషయమును నా రేమరు చూచుచుండిన జంతయు నసాధ్యమైన పనికిమాలిన యెన్నిక యని యొక్కసారిగాఁ జెప్పివేసినయెడల వారిమనస్సులకు నొప్పి కలుగుటయే కాక పలువురకు కోపము సహితము వచ్చియుండును. అట్లుచేయక యతఁడు శాంతివచనములతోఁ దా నుద్దేశించి యున్న యుత్తమ ధర్మములను బోధించి వారిమనస్సులలోనున్న భ్రమను తొలగింపఁగా, తామావలంబించుచున్న ప్రాపంచికవైభవసంరక్షణము నిరర్థక మయిన దని వారిమనస్సులకు పొడకట్టెను. ఈయుపన్యాసమునం దతఁడు బోధించిన ధర్మములలో నొకటి రెంటికిఁ గొందఱు విపరీతాభి ప్రాయములను జేయుదురు. కుడిచెంపను గొట్టినవానికి నెడమచెంపఁ ద్రిప్పవలసిన దని యతఁడు చెప్పినదానికిఁ బరులు పెట్టెడు బాధను శాంతితో సహించి తన కపకారము చేసినవారికిని బ్రత్యపకారము తలఁపవల దని బోధించుటయే కాని నిజముగా నెడమచెంప ద్రిప్పవలె నని తాత్పర్యము కాదు. ఇట్లు దృష్టాంతపూర్వకముగాఁ జెప్పిన యీ యర్థమునే యతఁడు శత్రువులపయిని సహితము ప్రేమ చూపవలసిన దనియు చెఱుపు చేసినవారికిని మేలు చేయవలసిన దనియు స్పష్టము గానే ముందుగాఁ దెలిపెను. భూలోకధనమును జేర్చక పరలోక సంపదలను గూడఁబెట్టఁ బ్రయత్నింపుఁ డని జీసస్ బోధించినదాని తాత్పర్యము క్షణభంగురము లైన యిహలోకవస్తువుల సంపాదనమున కంటె నిత్యమైన నీతి ధనార్జనము ముఖ్యముగాఁ జేయవలసిన దనుటయే కాని యశనవసనాదులను గూర్చి ప్రయత్నమే చేయఁగూడదని కాదు. ఎల్లప్పుడును నన్నవస్త్రాదులను గూర్చియే చింతించుచున్నచోఁ బర మార్థచింత యడుగంటు నన్న యుద్దేశముతో నతఁడు రేపటినిగూర్చిన చింత మానఁ దన బోధించెనే కాని యింతకంటె వేఱు కాదు. అవను

వాక్యములలోనే యతఁడు పక్షుల కాహారము ప్రసాదించెడి యీశ్వరుఁడు మనుష్యునిఁ గాపాడకుండునా యనియు గడ్డిపూలకు విచిత్రవర్ణములు దయచేసిన దయాళుఁడు మనుష్యులకుఁ గట్ట నియ్యకుండునా యనియుఁ దెలిపి, అన్నవస్త్రాదులను గూర్చిన చింతయే సదా పూనక యీశ్వరుని మీఁద భారమువేసి శుద్ధవర్తనము నిమిత్తమయి పాటుపడుచున్నచో విశేష ప్రయాస మక్కఱలేకయే భగవదనుగ్రహమువలన నన్నపానాదులు లభించునని సత్కార్యాచరణమునకుఁ బురికొల్పెను.



## ఏడవ ప్రకరణము

### (స్నానికుఁడైన) జానుయొక్క సందేశము, జెరూసలేము యాత్ర.

---

ఇప్పుకాలమువఱకును గూఢముగ నున్న జీసస్ యొక్క మిత్రులకు సహితము "అభిషిక్తుఁడు (మెస్సయా)" అను పదమునకును "ఈశ్వర రాజ్యము" అను పదమునకును అతఁడుద్దేశించుకొన్న యర్థము తెలియదు. అట్టిస్థితిలో దూరమున నున్న (స్నానికుఁడగు) జానున కెట్లు తెలియవచ్చును? ఇతరజనులవలెనే యతఁడును మెస్సయా దేశము నుండి రోమనులను వెడలఁగొట్టి, స్వదేశస్థులను లోకమునకు ప్రభువులనుగాఁ జేయునని నమ్మియుండెను. జీస స్సట్టి యైహికరాజ్యచింత లేనివాఁడయి పరమమయిన యొక యుత్తమకృత్యమును గూర్చి యాలోచించుచుండెను. రోమనులుపోయి యూదులు దేశమునకు ప్రభువులయినను ప్రజ లప్పటికంటె నధికసుఖము ననుభవించువారు కాఁజాలరనియు, న్యాయదయాదాక్షిణ్యముల నెఱిఁగి యభ్యసించువఱకును లోకము మంచిదశకు రానేరదనియు, ఎఱిఁగినవాఁడయి జీసస్ జనులలో శాంతియు నీతియు ప్రీతియు నెలకొల్పు సాధనము చూచుచుండెను. అతఁ డుద్దేశించిన మహాకార్య మల్పకాలములో నెఱవేఱునది కాదు. అతఁ డామహాకార్య పర్యాలోచనములో నుండఁగా నక్కడ గొంతకాలమునుండి కారాబద్ధుఁ డయియున్న జాన్ తా నాశతో నెదురుచూచుచుండిన యర్థకృత్యమును నిర్వహింపక జీసస్ వృథా కాలక్షేపము చేయుచున్నాఁ డని సందేహ మొంది తత్తఱపడసాగెను. జాన్ చేయు బోధవలన దేశక్షోభము సంభవించునని భయపడి ప్రభుత్వమువా రాతనిని బోధింపనీయక పట్టి తెచ్చి యూతని నాలుగెలల

నుండి మృతసముద్రతీరమందుండిన మాకిరోనగరమునందలి చెఱసాలలో నుంచియుండిరికాని ప్రారంభదశలో నాతనిని మిత్రులతో మాటాడనిచ్చుటయేకాక శిష్యులకు సందేశములను సహితము పంపనిచ్చుచుండిరి. చెఱసాలలోఁ బెట్టఁబడినతరువాత నాతనికి దినములు గడచినకొలదిని మెస్సయా వనిమీఁది తమాతమా హెచ్చఁజొచ్చెను. మెస్సయా యేమోచేయునని యెదురు చూచుచుండఁగా నెలలుకడచినను, ఆతఁడు చేసినవనియేమియుఁ గానరాలేదు. ఇట్లుండ కడకు జీసస్ కొండమీఁదఁ జేసిన ధర్మోపన్యాసవృత్తాంత మాతని చెవినిబడెను. ఏమిచేయుమన్నను జేయుటకు సంసిద్ధమయి యున్న భక్తకోటితోఁ గూడియుండియు రాజులయి యున్న యన్యదేశస్థులను దేశమునుండి తొలఁగఁదోలు ప్రయత్నమును గూర్చినమాట యొక్కటియైనను ఆయుపన్యాసములో లేకపోవుటయేకాక పయిపెచ్చు శత్రువుల యెడని ప్రేమచూపవలె నన్నయుపదేశము కనఁబడుటచేత నాతని మనస్సునకది తృప్తికరముగా నుండలేదు. అందుచేత నాతనిడెందములో జీసస్ మెస్సయాయగునో కాఁడోయని సందేహమునహితము కలిగెను. కాఁబట్టి యతఁడు తనమనస్సంతుష్టికయి తనమిత్రులను కొందఱను జీసస్ కడ కంపి 'ప్రతీక్షింపఁబడినవాఁడవు (మెస్సయావు) నీవా? లేక మేము వేఱొకనికొఱకు చూడవలెనా?'' అని యడుగ నియమించెను. ఆదూతలువచ్చి చూచునప్పటికి జీసస్ పూర్వప్రకారముగానే రోగములు కుదుర్చుచు ధర్మోపదేశములు చేయుచునుండెను. వారాతనిని సందర్శించి తమగురుఁ డడుగ నియమించినప్రశ్నలను రహస్యముగా నడుగక యందఱిలోను బహిరంగముగా నడిగిరి. జీనస్సున కప్పుడేమి చెప్పుటకును పాలుపోలేదు. నేనే మెస్సయానని చెప్పినపక్షమున, తాను గొంతకాలములో నేనలను గూర్చికొనిపోయి పోరాడ నుద్దేశించు

కొని యున్నట్టు జానునకు దుర్భ్రమ కలుగును. నేను మెస్సయాను కానని చెప్పినపక్షమున, అది తానునమ్మినదానికి విరుద్ధ మగుటయే కాక దానివలన శిష్యులకెల్లను నుత్సాహవిశ్వాసములు చెడిపోవును. కాబట్టి యతఁడాలోచించి కోడనే యేదో ప్రత్యుత్తరము చెప్పక తీఱదు కనుక సమయోచితబుద్ధి కలవాఁడయి "మీరు మరలఁబోయి యిక్కడ నాశిష్యమధ్యమున మీరు నావిషయమయి విన్నదానిని కన్న దానిని జానుతోఁ జెప్పుఁడు. నావయిని కోపము వహింపనివాఁడు ధన్యుఁడని కూడ మీరాతనితోడఁ జెప్పుఁడు." అని యుత్తరమిచ్చెను. 'నేను మెస్సయా నగుదునో కానో నేనుజేయుచున్న కార్యములవలననే మీరు తేటపడియుండవచ్చును. అట్లు తేటపడియుండనిపక్షమున నేను మెస్సయానని చెప్పుకొనుటవలనఁ బ్రయోజనమేమి?' అని యాతఁడిచ్చిన యుత్తరమునకు తాత్పర్యమయినట్టు కనఁబడుచున్నది. ఈమాటలవలన వేగిరపడ వలదని జానునకు హితము చెప్పు టయు నాతనియుద్దేశమయి యుండును. అంతట నావర్తమానహరు లాతనిని విడిచి వెడలిపోయిరి. ఈసందేశము మరల జానున కందినదో లేదో, అందినయెడల నాతఁడెట్లనుకొనియెనో యేమియుఁ దెలియదు.

అటుతరువాత నత్యల్పకాలములోనే జాన్ చెఱసాలలోఁ జంపఁబడెనని దేశమునందంతటను సంక్షోభము పుట్టెను. జీసస్ చే నావ లకు ధర్మబోధ నిమిత్తమయి పంపఁబడిన పండ్రెండుగురు శిష్యు లును మరల వచ్చి యింతలో తమగురువు సమ్ముఖమునఁ జేరిరి. హీరాడ్ చిరకాలమునుండి జాను నంతము నొందింపవలెనని యుద్దే శించుకొని యుండెను గాని యట్లు చేసినపక్షమున తమ ప్రవక్తను జంపినందున కయి జనులు తిరుగబడి యేమి యుపద్రవము చేయు దురో యని జంకుచుండెను. ఆతనిని సంహరింప కుండిన పక్షమున

నాతని జ్ఞానవస్త్రులయి లెక్కకెక్కుచున్న యతని యనుచరు
లెప్పుడైన నాకస్మికముగా రాజద్రోహు లయి రోమనులపై ధ్వజ
మెత్తి మహోన్మాదముచేత దేశముల కాండక ప్రయత్నములు
చేయవచ్చునని యతడు భయపడుచుండెను. ఆతఁ డెట్లు చేయుటకును
తోఁచక సందేహడోలాయమాన మానసుఁడయి యున్న కాలములోనే
నొక్క తరుణి ప్రేరణముచేతఁ దాను జేయ శంకించుచున్న కార్య
మును జేయవలసినవాఁ డయ్యెను. హేరాడ్ తన సహోదరుఁడు
జీవించి యుండఁగానే యతని భార్యయైన హెరోడియాను వివాహము
చేసికొనెను అతఁడు చేసిన కార్య మకార్యమనియు ధర్మవిరుద్ధ
మనియు జాను తన ధర్మోపన్యాస సమయములయందు నిశ్శంకముగాఁ
బలుకుచుండెను. హేరాడా వార్తను విని మనసులో కసిపట్టియుండెను
గాని వెంటనే ప్రతీకారము చేయుటకు శంకించి సమయముకొఱకు ప్రతీ
క్షించుచుండెను. హెరోడియాకు ప్రథమభర్తవలన నొక కూఁతు
గుండెను. ఆచిన్నది యొకనాఁ డొకయుత్సవ సమయమునందు హేరాడు
నకు మెప్పు పుట్టునట్లు అత్యంత మనోహరముగా నృత్యకౌశలము
చూపెను. త్రాగి త్రుళ్ళు వేడుక ననుభవించుచున్న యతఁ డామె
నృత్యమున కానందపరవశుఁ డయి యామెను జేరఁ దీసి శ్లాఘించి
యామె మనోరథ మేమి తెల్పినను దీర్చెదనని పలికెను. ఆతరుణి
యావఱకే తల్లిచేత బోధితురాలయి యుండినందున, స్నానికుఁడైన
జానయొక్క శిరస్సును నఱకించి తెప్పించి తనకు బహుమానము
చేయవలసినదని వేడుకొనెను. తాను జేసిన బాసను తీసివేయలేక
హేరాడ్ వెంటనే పోయి జానయొక్క తల నఱికి తేవలసినదని తన
భృత్యుల కాజ్ఞాపించి తదాజ్ఞానుసారముగా వారు ఖండించి తెచ్చిన
శిర స్సాచిన్నదాని కర్పించి తన వాగ్దానము చెల్లించుకొనెను. కొంద

ఈదారుణకర్మము ఫారిసీల ప్రేరణమువలన జరపఁబడిన దని భావింతురు. తనకువలెనే జానునకును గర్భశత్రువులుగా నున్న ఫారిసీ లాతని ప్రాణములు గొనఁ దలచి యున్నారని జీసస్ చిరకాలము క్రిందటనే యెఱిఁగి యుండెను. వారిద్వేషాగ్నికి రెండవబలి కావలసినవాఁడు తాననియు నతఁ డొకవేళ భావించి యుండును. జీసస్సును జనులలోఁ గొంతవఱకుఁ బేరుపడి యుండినను జా నంత సుప్రసిద్ధుఁ డయి యంత జనానురంజకుఁడుగా నుండలేదు. అయినను ఫారిసీలుమాత్ర మాతని ప్రమాదకరుఁ డైనశత్రుఁ డని భావించి యీవఱకే యతనిమీఁద నొక కన్ను వైచి యుంచిరి. జీసస్ మరణమునకు భయపడలేదుగాని తాను పూనిన కార్యభారమును నిర్వహించుటకు ముందు ఫారిసీల కోపాగ్నికి బలి యగుట కిష్టము లేనివాఁడుగా మాత్ర ముండెను. లోకముయొక్క మేలునిమిత్తము తనప్రాణమును ధారపోయుటకు సంసిద్ధుఁ డయి యున్నను వ్యర్థముగా పోఁగొట్టుకొన నొల్లకుండెను. వారికిఁ దానొప్పగింపఁ దలఁచుకొన్న మహాకార్యమును శిష్యు లైనను నిర్వహింపఁగల స్థితిలో నున్నా రని యతని మనస్సునకు నిశ్చయము కలిగిన పక్షమున, శత్రువుల యెదుటఁబడి యేమి యైనను గాని వ్వని ముఖాముఖిని పోరాడ సాహసించి యుండును. నిర్వహణార్థ మయి యీశ్వరుఁడు తనమీఁదఁ బెట్టినాఁ డని యతఁడు దృఢముగా నమ్మియుండిన కార్యభారమును తాను నిర్వహింపక తాను చేయవలసిన కార్య మెంతో యుండఁగా నడుమ నపాయము తటస్థించి నప్పుడు తప్పించుకో గల యుపాయ మొండియు నుపేక్షచేసిన యెడల తానీశ్వరద్రోహము చేసినవాఁ డగునని యతఁ డనుకొనెను. కాఁబట్టి యతఁడు తన యాప్తశిష్యులు పన్నిద్దఱితోను నిరపాయమైన తావునకు తొలఁగిపో నిశ్చయించుకొనెను. అంతేకాక జను లనేకు

లిప్పుడతనిని మెస్సయా యని తలంచుచుండిరి. మెస్సయా విషయ మున తమకుం గలిగియుండిన యభిప్రాయమునుబట్టి జాను మరణము వలన దురాగ్రహావేశపరవశు లయియున్న జనులు ప్రభుత్వము వారిపై తిరుగఁబడి యుద్ధసన్నద్ధు లయి తమ్ము నడుపు మని యాతని నిర్బంధ పఱుపవచ్చును. అందుచేత నతఁడీకోపోద్రేక మడఁగువఱకును వారి కంటఁ బడక దూరముగా తొలఁగి యుండుట మంచి దని భావించియు తన్నానవాలు పట్టలేని విదేశమునకుఁ బోవ నిశ్చయించుకొని యుండ వచ్చును. అందుచేత నతఁడు శిష్యులను వెంటఁగొని పడవయెక్కి పర స్త్రీరనమీపమునుండి పోయి యొక యెడారిఁ జేరెను. అయినను జనులు పడవ నడుచు జాడను కనిపెట్టి వ్యాధిగ్రస్తులను తమవెంటఁ దీసికొని తీరము పొడుగునను నడుచుచు రోగులను స్వస్థులను జేయ వేఁడుచు జీసస్సు వెంటఁబడఁజొచ్చిరి. అందుచేత నెడారి సహిత మల్ప కాలములోనేమూఁకలచేత నిండిపోయెను. అప్పు డతఁడు వారియొత్తుడి నుండి తప్పించుకొనుట కయి యొక నూతనమార్గమున వేఱొకవంకకుఁ బోవఁదలఁచుకొని వెనుకకు మరలి కాపర్నాము గ్రామనమీపమునకుఁ బోవలసినవాఁ డయ్యెను. అతనిని వెంబడించువారిలో దారి పొడుగు నను జాడలు తీసి తెలుపుచుండుట కయి జెరూసలేము నుండి ఫారి సీలచేఁ బంపఁబడిన వేఁగులవారు సహితము కొంద ఱుండిరి. జాను మరణమువలన జీసస్ భయపడియుండె ననియు, తా మతనిని కొన్ని ప్రశ్న లడిగినప్పుడు భయభావమును సూచించెడి యుత్తరము లాతని నోటినుండి వెలువడఁగానే భీరు వని కనిపెట్టి శిష్యు లాతని యెడలఁ దమకుఁ గల తొంటి భక్తివిశ్వాసములను గోలుపోవుదు రనియు, అతఁడు పిఱికివాఁ డని తేటపడఁగానే జనులు సహిత మాతనిని తి స్కారభావముతోఁ జూతురు గాన ప్రజల కాతనియెడల గలగౌరవ

మును చెప్పఁగొన్నట్టి కిదే యుంచినసమయ మనియు, సాధు భావించి యుందురు. ఈభ్రమతో వా రాతనిఁ జేరవచ్చి "నీ శిష్యులు చేతులు కడుగుకొనకుండ భోజనము చేయు నంతటి పాపకార్యమున కొడిగట్టుచుండఁగా నీవేల చూచి సహించుచున్నావు?" అని యవి నయసూచకము లయిన గర్వోక్తులతో నడిగిరి. చేతులు కడుగుకొన కుండ భుజించుట పాప మని భావించి యూదులు భోజనమునకు ముందు మురికినీటిలో నయిన చేతులు ముంచుకొందురు; జీసస్సును శిష్యులును శుచిత్వము కొఱకు మాత్రమే శుద్ధజలముతో హస్త ప్రక్షాళనము చేయుచుందురు. జీసస్సు వారు తన్ను పరాభవ పఱచుట కయి విరోధు లగు ఫారిసీల ప్రేరణముచేత వచ్చినవా రని యెఱిఁగినవాఁడయి తీవ్రమైనను జంకువడక వారివంకఁ దిరిగి వారిని రూక్షవీక్షణములతోఁ జూచుచు ధీరభావముతో, "మీ రాచారదాసు లయి యేల యీశ్వరాజ్ఞోల్లంఘనము చేసెదరు? వార్ధకము చేత బలహీను లయినప్పుడు తలిదండ్రులను పోషించ వలసిన దని ధర్మశాస్త్రము విధించుచున్నది. ఆచారము నాధారము చేసికొని కృతఘ్నుఁ డయిన సుతుఁడు తనధనము దేవాలయమున 'సర్వార్పణం' మన్నమాట యుపయోగించి, ఆచార్యపురుషు లైన మీరు శైశవము నుండియు తన్ను పెంచి పెద్దవానిని జేసిన జననీజనకులను వృద్ధదశలో పోషింపవలసిన యక్కఱ ధర్మవిరుద్ధముగా కన్న కుమారుని కర్తవ్యమునుండి విముక్తుఁ జేయుచున్నారు. ఓవంచకులారా! మీరు పెదవులతో నన్ను పొగడుచున్నారే గాని మీ హృదయములు నాకెంతో దూరముగా నున్న వని యీశ్వరుఁడు మీవిషయమున పలుకఁడా? భోజనమునకు ముందు చేతులు కడుగుకొనకపోవుట యేమో దుష్కార్య మని మీ రనుచున్నారు. అం దేమియు దుష్కార్యము

లేదని నే ననుచున్నాను. తన సొత్తును గూర్చి యీశ్వరార్పిత మని కొడుకునోట పలికించి వాఁడు వృద్ధు లయిన మాతాపితలకు తిండిపెట్టక పస్తుపడ విడిచిపెట్టి నిర్దోష మని మీరంగీకరించుట మహాఘోర దుష్కృత్యము." అని పలికెను.

ఈమాటలు ఫారిసీలయుల్లములలో బల్లెమువలె నాటుకొని వారిని మఱింత కుపితులనుగాఁ జేసెను. అంతేకాని వా రుద్దేశించి నట్టుగా జీసస్సు పిఱికివంద యని జను లనుకొనునట్లు చేయుట కయి యెంతమాత్రమును సమర్థులు కాకపోయెను. ఈ వాక్యములను విన్న శిష్యులు కొందఱు మీ మాటలు ఫారిసీలను మఱింత యాగ్రహ వ్యగ్రులనుగాఁ జేయలేదా" యని యడుగఁగా "అయినను చింత లేదు. వా రంధులకు నాయకు లయి నడుపు మహాంధులు; వారల్ప కాలములోనే గోతిలో పడుట యనివార్యము." అని చెప్పి యూర కుండెను. జీస స్సెంతమాత్రమును భయపడనివాఁ డయినను, దురా గ్రహాగ్రస్తు లయియున్న ఫారిసీలు సమయము వేచి తన ప్రాణములు గొనవలె నన్న దీక్షతో గూఢముగాఁ దన్ను వెంబడింపవచ్చునని యెఱిఁ గినవాఁ డయి కొంతకాలము వారు కనుగొనలేని వివిక్తస్థలములకుఁ బోవుట మంచి దని తలఁచి, యక్కడనుండి యతఁడు టైరు సీడన్ తీరములకుఁ బోయెను.

టైరు సీడన్ పురములు ఫినీసియా దేశములోని ముఖ్య పట్టణములు. ఆకాలమునందు ఫినిసియా దేశస్థులు మిక్కిలి ధనసంప న్నులును వృద్ధిగాములును నయి యుండిరి. వారు వ్యాపారముల యందు తెలివిగలవా రయి యత్యంతసమర్థులై యుండిరి. వారు కొంత వఱకు విగ్రహారాధకులు. విగ్రహారాధకుల నెల్ల సామాన్యముగా ద్వేషించునట్లే యూదులు టైరుపురవాసులను సీడన్‌పురవాసులను

ద్వేషించుచు ... నా ... మాది భావించుచుండిరి. ఆదేశ
ములను మ్లేచ్ఛభూములుగా నెంచి ... కల్పనస్థానములను ఫారిసీలు మొద
లైన ఛాందసు లాదేశములు త్రొక్కినయెడల తా మపవిత్రుల మగుదు
మని భావించి యందు దడుగిడకుండిరి. అయినను మతోన్మాదులు కాని
యూదు లనేకులు వారి ... తిరస్కరించుకొని పోయి
యా పట్టణములలోను ... నివసించుచుండిరి. జీస
స్సీ దేశమును జేరి తన్ను సురక్షితునిగా భావించుకొనెను; అది స్వాధి
కారములోఁ జేరినది కాదు కాఁబట్టి తన్నుఁ బట్టుకొనుట కయి హీరా
డక్కడకు భటులను బంపలేఁడు; ఆ దేశమునం దడుగుపెట్టుటయే పాప
మని భావించువారగుటచేత ఫారిసీలు తన్ను వెన్నాడుటకు సాహ
సింపఁజాలరు; స్థిరనివాస మేర్పఱచుకొని యున్న యూదులు పలువు
రక్కడ నుండియుండుటచేత వారిలో కొందఱు తనయెడల మిత్రభావ
మును కనఁబఱుప వచ్చును. ఈ హేతువులచేత శత్రుబాధలనుండి
తాత్కాలిక విముక్తి నొందుట కది మంచిస్థల మని జీస స్సక్కడ
కొంతకాలముండెను గాని యెంతకాలముండెనో నిశ్చయముగా తెలి
యదు. కాని కొన్నివారము లతఁ డక్కడనుండె ననుటకు సందేహము
లేదు. స్వదేశమును పరిత్యజించి పరదేశమును శరణ్యముగాఁ జేకొని
యుండుట జీసస్సున కప్పుడు గొప్ప శోధనసమయముగా నుండి యుండ
వచ్చును. అతనికిని శిష్యులకును దక్క తక్కినవారి కందఱికిని శత్రు
వులచే నతఁడు పూర్ణముగా పరాజితుఁ డయి పలాయితుఁ డయ్యెనని
తోఁచియుండ వచ్చును. కాని యతఁడుమాత్ర మెప్పుడును ధైర్య
మును విడువలేదు. భగవంతుఁ డభిషిక్తునిగా నియమించి తన కప్ప
గించినాఁ డని యతఁడు త్రికరణశుద్ధిగా నమ్మియుండిన మహాకార్య
మీశ్వరకృపవలన కడపట సంపూర్ణవిజయము నొందక మాన దని

యతఁ డెంతదృఢనిశ్చయము గల వాఁడయి యుండినను, పరమ కర్తవ్యమయి తనపాలఁ బడిన యీ ఘనకార్యము నీబాధలలోను ప్రతిబంధములలోను తా నెట్లు నిర్విఘ్నముగా నిర్వహింపఁ గలుగుదునా యన్న చింతమాత్ర మాతని మనస్సును సదా బాధించుచుండెను. ఫారిసీలు తమ యుపాయములును కృషియు సంపూర్ణముగా సఫలము లయ్యెననియు జీసస్సు తన పన్నిద్దఱు శిష్యులతోను మరల తమకు మొగము చూపుటకు సాహసింపఁ డనియు తలఁచి తాము కృతార్థుల మయినట్లు గర్వపడుచుండిరి.

ఈ పరదేశావాసము జీసస్సున కనేకవిధముల లాభకర మయ్యెను. మొదటిది భావికర్తవ్యమునుగూర్చి చక్కఁగా నాలోచించుకొనుటకు కావలసినంత యవకాశము కలిగెను. రెండవది శిష్యులకు సర్వధర్మములందును సదుపదేశములు చేసి వారిని సునిశ్చితదృఢచిత్తులను గావించుటకయి తగిన తరుణములు తటస్థించెను. మూఁడవది కయ్యమునకుఁ గాలుద్రవ్వుచు వివాదైకశీలతతో మాటిమాటికి మీఁదిమీఁదికి వచ్చుచుండెడి యవినయపరు లయిన ఫారిసీలవలనను సమయాసమయములను విచారింపక రోగులను స్వస్థపరుపవలసినదని దీనముగా వేఁడుచు కాళ్ళు వ్రేళ్ళు పట్టుకొని విరామము లేక పయిని బడుచుండెడి మూఁకలవలనను తొందరలు లేకపోవుటచేత నాతనికి సంతత మనశ్శాంతి కలిగెను. సదా చెంతనుండి యుపదేశార్థములను శ్రద్ధాళువు లయి కర్ణరసాయనముగా వినుచుండుటచేత నూతనభక్తి బలోత్సాహములు కలవా రయి శిష్యులు తననాయకుని యెడల తొంటికంటెను సహస్రగుణాధిక మైన ప్రేమను విశ్వాసమును గలవా రైరి. జీసస్సుయొక్క వాసగృహమునకు సమీపమునఁ గాపుర మున్నయొక ఫినీసియా దేశస్త్రీకి కొంతకాలమునుండి మతిచాంచల్యము నొందియుండిన యొక

శిష్యుల కామె యెడల జాలి కలుగఁజేసి వారిచేత నామెకు తోడుపడవలసినదని పలికించుటకే గాని యామె ప్రార్థనను నిరాకరించి పంపివేయవలె నన్న యుద్దేశముతో నెంతమాత్రమును కాదు. మెస్సయా యొక్క యూదులరక్షణార్థమే పంపఁబడు నని యూదు లందఱియభిప్రాయము నయి యున్నది. జీసస్సుయొక్క శిష్యు లనుసహిత మాయభిప్రాయము పూర్ణముగా విడిచి పోయినది కాదు. ఒక్కయూదులలో మాత్రమే కాక సర్వజాతులవారిలోను సర్వదేశములవారిలోను ఈశ్వరరాజ్యమును స్థాపించుట కయి మెస్సయా పంపఁబడె నని జీసస్సు బోధించినప్పుడు శిష్యులలో నెవ్వరో "మెస్సయా యూదులకొఱకే పంపఁబడె" నని పలికి యుండుటచేత వారిమాటలు వారి కొప్పగించుట కయి వారన్యదేశస్త్రీకి సాయముచేయు నేఁడి నప్పుడు జీసస్సు పయిమాటలు పలికి యుండును.

ఇంతలో నామె సమీపించి పాదములమీఁదఁ బడి "ప్రభువా! సాయము చేయుము" అని దీనముగా వేడుకొనెను. 'నీయభీష్టసిద్ధి యగునుగాక! పొమ్ము' అని యాతఁ డామెను పంపివేసెను. ఆమె యింటికిఁ బోయి కొమారితతో జరిగినవృత్తాంతము చెప్పునప్పటి కాయువతి స్వస్థచిత్తురా లయ్యెనఁట! రోగిని చూడకయును పై రోగశాంతి కలుగుట యెట్లు తటస్థ మయ్యెనో యూహింప శక్యము కాదు. గాని చికిత్సకునిమాటయందు రోగికి సంపూర్ణవిశ్వాస మున్నచో నట్లు జరుగుట యసాధ్యము కాదని యనుభవశాలులు చెప్పుచున్నారు. దేవునిదృష్టియందు సర్వజనులును సమాను లనియు, ఈశ్వరానుగ్రహమును బడయుటకు జాతిమతదేశభేదములు లేక యెల్లవారును సమానముగానే పాత్రులనియు, అతఁడు పయిదృష్టాంతము వలన శిష్యులమనస్సులలో దృఢముగా నాటుకొనునట్లు చేసెను. యూదులు

తాముమాత్రమే యీశ్వరునికి ప్రియ మయినబిడ్డల మనియు, ఇతర జాతులవా రందఱును భగవదనుగ్రహదూరు లయినపతితు లనియు, భావించు చుండిరి. జీస స్సట్టిదుర్భ్రమ లెంతమాత్రమును లేనివాఁ డయి మానవజాతి యంతయు నీశ్వరసంతాన మనియు, జాతిదేశ వ్యత్యాసములు లేక యెల్ల వారును సోదరభావముతో నీశ్వరరాజ్య ములోఁ జేరి సుఖింపవలసినవా రనియు, అట్లు చేర్చి యీశ్వరరాజ్య మును భూమిమీఁద స్థాపించుటయే మెస్సయా యగుటవలనఁ దనపాలఁ బడిన పరమధర్మమనియు, భావించి యుండెను. ఈసత్యమును తన శిష్యకోటియొక్క హృదయఫలకములందు శిలాక్షరములవలె నాటు కొనునట్లు చేయుట కయి యతఁ డనేకవిధముల పాటుపడెను.

టైరు సీడన్ పట్టణప్రాంతములయం దీప్రకారముగా కొంత కాలము గడపినపిమ్మట జీసస్సు మరల కేపర్నాముపంక స్వదేశము నకు మరలెను. అతఁడు గాలిలీదేశములో ప్రవేశింపఁగానే జనులు యథాపూర్వముగా సంతుష్టస్వాంతములతో నతనిచుట్టును మూగఁ జొచ్చిరికాని, ఫారసీలు జాగరూకు లయి యాతని జంపనైనను జంప వలెను లేదా యాతనినో రైనను నడఁపవలెనని తా మారంభ ములో పూనినపూనిక నిప్పుడుసహిత మెంతమాత్రమును విడిచినవారు కారు. వా రాతనిని వెంటనే తారసించి నీవు మెస్సయా వయినందుకుఁ గలయమానుష మైన నిదర్శనమును జేసి నైనను జూపవలసిన దని పట్టుకొనిరి. తన వినాశనోపాయముగా వా రేదోపన్ను గడ పన్నుకొని వచ్చినారని తెలిసికొని జీసస్సు వారి కెంతమాత్రమును సందీయక "ఓ వంచకులారా! మీమాటలతో నాకేమియు పని లేదు పొండు" అని యదలించుచు వారినుండి విముఖుఁ డయి శిష్యబృందముతోడ వెడలిపోయెను. జనులకు ధర్మోపదేశములు చేసి జనానురాగమును

బడయుచు పనిచేయుచుండఁగాఁ జూచి దోషదుష్టులు తన్ను స్వదేశములో బ్రతుకనియ్యరనియు, ఇంతటితో గాలిలీ దేశములో తనపని తుదముట్టెననియు, దృఢము చేసికొని యతఁడు స్వదేశమును విడిచి యీసారి యుత్తరాభిముఖుఁడయి వెడలి తూర్పున జార్డనునదీజన్మస్థానప్రాంతములవఱకును బోయెను. ఈలోపల నతఁడు తనభావికర్మమును నిశ్చయించుకొని దారిసాగి పోవునప్పు డొకచోట శిష్యులను దారిప్రక్కకు పిలిచి నిలిపి "నే నెవరని జనులు చెప్పుచున్నారు?" అని వారి నడిగెను. సమాధినుండి లేచి బ్రతికి వచ్చినస్నానికుఁడైన జానని కొందఱును, పునర్జీవితుఁడైన యొకపూర్వప్రవక్తయని కొందఱును, చెప్పుకొనుచున్నారని వారు బదులు చెప్పిరి. అతఁడు తెప్పవాల్పక వారిమొగములవంకఁ జూచుచు "నే నెవరని మీరు తలఁచుచున్నారు?" అని యడిగెను. వారిలో పేతురనఁబడు సీమన్ "నీవు దేవునిచేఁ బంపఁబడిన మెస్సయావు" అని యనుమానింపక తత్క్షణమే యుత్తరము చెప్పెను. ఆయుత్తరమువలన జీససు మనస్సున కపరిమిత సంతోషము కలిగెను. ఫారిసీలచే బాధలుపెట్టఁబడి స్వదేశత్యాగము చేసి విదేశములో నసహాయుఁడయి యేకాకిగా తిరుగుచున్న యీకాలములోసహితము శిష్యులకు తనమీఁదిపూర్ణవిశ్వాస మణుమాత్రమును తగ్గక తన్ను మెస్సయాయని నిర్వ్యాజాచంచలభక్తితో నమ్ముచున్నారని తెలిసికొనుటయే యాతనిసంతోషమునకుఁ గారణము. "ఓయీ! సీమన్! నీవు ధన్యుఁడవు. స్వర్గములో నున్న పరమపిత నీకు ప్రకాశపఱచుట చేత నీవిది పలికినాఁడవేకాని జనులు నీతోఁ జెప్పి యుంటచేత దీనిని నీవన్నవాఁడవు కావు. ఇఁక నీపేరు పీటరు. ఈపదమునకు పర్వత మని యర్థము. ఈపర్వతముమీఁద దుష్టాధికారసమన్వితు లెవ్వరును పడఁగొట్టఁజాలని సుస్థిరధర్మమార్గ్గమును

నిర్మించెదను.” అని జీసస్సు పలికెను. ఈమాటలు పలుకఁగానే యావజ్జీవితము మనస్సులో దుర్భరముగా నుండిన భార మంతయు చేతులతో దింపివేసినట్లు తత్క్షణము తగ్గిపోయెను. మనస్సులో నున్న చింత యంతయు తొలఁగిపోఁగా, జయము కరస్థమయియున్న ట్లాతనికిఁ గానఁబడెను.

ఫారిసీలు తన్ను చంపెడుపక్షమున తాను నేర్పినబోధమును చక్కఁగా గ్రహించి జనులలో ప్రవచనము చేయఁగలవాఁ డెవ్వఁడైన నొక్కఁ డున్నాఁ డన్ననిశ్చయ మింతవఱకును జీసస్సు మనస్సునకు కలిగి యుండలేదు. అవ్యాజస్వామిభక్తి గలవాఁడయి తా నుపదేశించినధర్మసంచయమును తనయనంతరమున విడువక ప్రవచనము చేయువాఁడు సీమన్‌పీట రొక్కఁ డున్నాఁడని యిప్పు డతనికి తెలియ వచ్చెను; తక్కినశిష్యులును స్వామిభక్తివిశిష్టులయి నిస్సందేహముగాఁ దామును ధర్మప్రవచనముచేయ సంసిద్ధు లయి యున్నట్లు నమ్మఁబలికిరి. క్రొత్తమనుష్యులలో వారు చేసిన దేశాటనము వ్యర్థముగా పోలేదు. శిష్యులు తమస్వామినిగూర్చి యెక్కువగాఁ దెలిసికొనఁగలవా రయిరి. అతఁ డెట్లు కష్టములకు సహించి ధైర్యమువహించి యుండఁగలిగెనో, అన్నియాపదలలోను చలింపక తాను భగవంతునిచేఁ బంపఁబడిన మెస్సయాయని యాతఁ డెంత దృఢనిశ్చయముకలవాఁ డయి యుండెనో, వారు సదా సమ్ముఖమున నుండి చూచుచువచ్చుట చేత వారి కుండినవిశ్వాస మంతకంతకు బలపడి సుస్థిర మయ్యెను. ఫారిసీలు తామాతనిని పరదేశములకుఁ బాఱఁదోలినప్పు డాతని ప్రాబల్యమును రూపుమాపుచున్నా మనుకొనిరి గాని యీపరదేశ సంచారమే యాతనిశిష్యులలో ఫారిసీ లెవ్వఁడును నాశము చేయలేని

ప్రేమాతిశయము నూతనిపైఁ గలుగునట్లు చేసి యాతని ప్రాబల్యమును మఱింత పెంపు చెందించెను.

శిష్యగణము బయలుపఱిచిన యీ నూతనోత్సాహభక్తివిశ్వాసములచేత జీసస్సునకు తాను మనస్సులో నేర్పఱుచుకొన్న మనోనిశ్చయమును సాగించుట మఱింత సులభ మయ్యెను. జీసస్సు మనస్సులో నేర్పఱుచుకొన్న నిశ్చయము మృత్యుముఖప్రవేశమున కయి సరిగా ముందంజె వేయుటయే యైనను తాను బోయి జెరూసలేమునగరములో ధర్మప్రవచనము చేయవలె ననుట. తానక్కడ నుండఁ దటస్థించెడు కొన్నిదినములలోను జనులను మేలుకొలిపి వారికి జ్ఞానబోధ చేయుట కయి తాను జేయఁగలిగిన దంతయుఁ జేయవలెనని యాతని యభిలాషము. తరువాత శత్రువులు తాము చేయఁగలిగినంత చెఱుపును జేసి తన ప్రాణములు గొన్నను, తానీవఱకు నిర్వహించినదే తనమరణదృష్టాంతమువలన బలపడి తన శిష్యుల హృదయములయందు స్థిరముద్రిత మయి ఫలకారి యగునని యాతనినమ్మకము. తాను జెరూసలేమునగరమునకు పోక తీఱ దనియు, తనకక్కడ మరణము సంభవించుననియు, అతఁడు స్పష్టముగా తెలిసికొని యుండెను. ఎల్లప్పుడును తనచుట్టును మిత్రులు పరివేష్టించి యుందురుగాన తనకు పగటివేళ భయ ముండదనియు, తాను రాత్రివేళ పట్టుకోఁబడి రోమనుచెఱసాలలో బంధింపఁబడినపక్షమున మిత్రులకు విడిపింప సాధ్యము కాదనియు, ఎఱిఁగినవాఁ డగుటచేత నాతఁడు శిష్యులను జేరఁబిలిచి తానుద్దేశించుకొన్న కార్యక్రమమును కడపట జరగఁబోవు పర్యవసానమును వారితోఁ దెలిపెను. వారు తమస్వామిని ప్రాణాధికముగా ప్రేమించు చుండినవా రగుటచేత తమకు ప్రభువుతోడి వియోగము కలుగుననియు ప్రభువునకు విరోధులవలన నాపద వాటిల్లు ననియు

వినుటయే వారికి దుస్సహ మయి తీవ్రమనోవేదనాకర మయ్యెను. అందుచేత "ఓప్రభువా! ఈయాపద నీకు ప్రాపింపకుండునుగాక!" అని పలికి పీట రాతనిని జెరూసలేమునకు పోకుండ బోధించి యొప్పింపఁ జూచెను. పీటరు తనప్రభువుమీఁది హృదయపూర్వక మైన ప్రేమాతిశ యముచేతనే యట్లు మరలింపఁజూచెను గాని వేఱుకారణముచేతఁ గాదు. ఈసంగతి పూర్ణముగా నెఱిఁగినవాఁ డయ్యును జీసస్సు తన కీశ్వరుఁడు విధించిన కార్యకరణమార్గము క్లేశకంటకములమీఁదుగా దుర్మరణాఘాతమునకుఁ బోవలసి యున్న దని కనిపెట్టినవాఁ డగుట చేత పీటరుయొక్క ప్రార్థనము తన్నీశ్వరనిర్ణయమునుండి మరలించు ప్రయత్నమని భావించి "ఓపిశాచమా! వెనుక మరలుము. నీవు మనుష్యవాంఛితమును దెలుపుచున్నావుగాని యీశ్వరేచ్ఛను దెలుపు చున్నాఁడవు కావు" అని మందలించెను.

వా రాదేశములో నింకను గొన్నిదినములు సీజరాపురప్రాంత మునం దుండిరి. అతఁ డొకదినమురాత్రి ముగ్గురుశిష్యులను వెంటఁ బెట్టుకొని ప్రార్థనము చేయుట కయి యొకకొండమీఁదికి పోయెను. ఆశిష్యు లక్కడ తమస్వామి యిద్దఱు మహాతేజస్వు లైన దేవదూత లతో మాటాడుచుండఁగాఁ దాము చూచితి మనియు, తమప్రభు వప్పు డపూర్వ మైన దివ్యతేజస్సుతో ప్రకాశించె ననియు, చెప్పిరి. దేవదూతలు వచ్చి మాటాడి పోయిన వార్త వాస్తవ మయినను కాక పోయినను, జీస స్సీశ్వరుని హృదయపీఠమునందు నిలుపుకొని నిశ్చల భక్తితో ప్రార్థించినప్పుడు భక్త్యావేశముచేత భావమునం దతఁ డీశ్వర సాక్షాత్కారము ననుభవించి కర్తవ్యోపదేశమును బడసినట్టు భావించుకొని పరమానందభరితహృదయుఁ డయి తోఁటికంటె నధికముఖవికాసముతో శిష్యులఁ గలిసికొని యుండుననుటకు సందేహ

ముండదు. తన మరణానంతరము స సహితము పన్నిద్దఱు శిష్యులును దృఢభక్తియుక్తు లయియుండి తాను బోధించిన సత్యములను లోకము నకు ప్రకటించి ధర్మవ్యాపనము గావింతు రనియు, తన మరణము శిష్యుల మనస్సులకు తన్నధికప్రీతిపాత్రునిఁ జేసి తన యుపదేశములను శిలాక్షరములవలె దృఢముగా నాటుకొనునట్లు చేసి వారి హృదయము లలో స్థిరపడుచుననియు, ఎఱింగినవాఁ డగుటచేత నాతఁ డింకొకసారి పోయి స్వదేశమును పీడొ్కని యక్కడనుండి రాజధాని యైన జెరూస లేమునగరమున కరిగి యచ్చట నిశ్శంకముగా తాను మెస్సయా నని ఘోషించి ధర్మ ధ్వజ మెత్తి సత్యప్రవచనము చేయ నిశ్చయించు కొనెను.

ఇట్లు జెరూసలేము యాత్రాదీక్షవహించి యతఁడు శిష్య సహితముగా బైలుదేఱి కతిపయ ప్రయాణములు చేసి త్రోవలో కేపర్నామునగరము చేరెను. కేపర్నామునివాసు లైన శిష్యు లాతని రాకను ముందుగానే తెలిసికొని వృత్యుత్థానము చేసి తీసికొని వచ్చిరి. తాను జెరూసలేము యాత్రార్థము పోవుచు మార్గమధ్యమున వారిని జూడవచ్చితి ననియు, వారి ముఖదర్శనము చేయు భాగ్యము తనకు మరల లభింప దనియు, అతఁడు చెప్పినప్పుడు ప్రభుసందర్శన సంతోషపరవశు లయి యున్న యాభక్తులు తమస్వామి యొక్క శక్తి సామర్థ్యాదులను బట్టి యట్టిదుస్థితి కలుగఁబో దన్న నమ్మకముతో మనస్సులలో లేశమును క్లేశము నొందినవారు కారు. ఈశ్వరునిచే నభిషిక్తుఁ డయి మహిమాఢ్యుఁ డయిన ప్రభువును సంహరించుట ఫారి సీలవంటి నరాధములకు సాధ్యము కాదని వారు తలఁచియుండిరి. అంతే కాక జెరూసలేము చేరి మృదుమధుర గంభీరవాక్యములతో ప్రభువు తన ధర్మవచనామృత రసప్రవాహమును వెల్లిగొలుపఁగానే సమో్మ

హితు లయి యహితులు సహితము వశ్యు లగుదు రనియు, అందు చేత తమస్వామికి జయము సులభ మగు ననియు, ఒకవేళ గిట్టనివారు కొందఱు దుండగమున కొడిగట్టినను భక్తాగ్రేసరు లయి ప్రభువును గురుభావముతో ప్రేమించు ప్రజలు వారి నవలీలగా పరాజితులను జేసి యుపాయము నుండి రక్షింతు రనియు, భక్త్యావేశము చేత కేవ ర్నాము లోనిశిష్యులు విశ్వసించి యుండిరి. భక్త్యావేశము చేతను ప్రేమాతిశయము చేతను తాము గొప్పగా నెంచువారిని లోకమంతయు నారీతినే యెంచు ననిభావించుట వింతకాదు గదా! అయినను జీసస్సు మాత్రము దూరదేశయాత్రకుఁ బోవునప్పుడు కడసారి యాప్తులకుఁ జెప్పవలసిన హితవచనములు వారికిఁ జెప్పెను. శిష్యులలో నొకఁడు చెంతను జేరి "యీశ్వరరాజ్యములో నధికుఁ డగువాఁ డెట్టివాఁడు?" అని ప్రశ్న వేసెను. జీసస్సు చేరువ నున్నయొకశిశువును జేరఁదీసుకొని శిష్యులవంకఁ దిరిగి "యీ శిశువు వలె నెవ్వఁడు పావ మెఱుఁగనివాఁ డగునో యట్టివాఁ డీశ్వరరాజ్యములో నధికుఁ డగును" అని యుత్త రము చెప్పెను. ఆశిశువు నింకను చేతిలోనే యుంచుకొని జీసస్సు శిష్యులవంకఁ జూచి, "మీరు మీతోడివారి కంటె నెక్కువ వారుగా కనఁబడుట కెంతమాత్రమును ప్రయత్నము చేయఁగూడదు; మీ ప్రయత్న మంతయు వారి నెక్కువసుఖవంతులనుగా నెట్లుచేయఁ గలుగుదుమా యనుట కయి యుండవలెను; తక్కువస్థితిలో నున్న వారియెడల నెప్పుడును ననాదరభావము చూపరాదు; ఇటువంటి హీన స్థితిలో నున్నవారికే సంతోషమును సౌఖ్యమును గలిగించుట కయి యెక్కువకృషి చేయవలెను; ఇటువంటి తక్కువవారిలో నెవ్వరి విష యమున నయిన మీరపచారము చేసినయెడల, అది మీరు నావిష యమున చేసినయపచారమే; వారికి చేసిన యుపకారము నాకు చేసిన

దానినిగా నేను భావించుకొనెదను; తమ్ము రక్షించుకో లేని దుర్బలులకు హాని చేయుట కంటె మెడకు తిరుగటిరాయి కట్టుకొని లోతు సముద్రములో పడుట మనుష్యునకు మంచిది; మీ రెప్పుడును అపకారమునకు ప్రత్యపకారము చేయరాదు.” అని యీ ప్రకారము చెప్పుచుండగా “ప్రభువా! నాసోదరుఁడు నాకపకారము చేయుచు వచ్చినప్పుడు నే నెన్నిసారు లాతని క్షమింపవలెను? ఏడుసారులు క్షమింపవలెనా?” అని పేత రడిగెను. “ఏడు సారులు కాదు. అవశ్యక మయినయెడల డెబ్బదియేడు సారులు క్షమింపవలెను” అని జీసస్సు బదులు చెప్పెను. డెబ్బదియేడు సారు లన్నమాట కెల్లప్పుడును క్షమింపవలె నని యర్థము!

ఇట్లు జీసస్సు శిష్యులకు హితవాక్యము లనేకములు చెప్పి, వారు తన యెదుట నిప్పుడు ధైర్యశాలులుగా నున్నను తాను వారిని విడిచిపోయిన తరువాత నొకానొకప్పుడు బలవంతులును గర్వితులు నయిన ఫారిసీలు బాధింపఁ గడఁగినప్పుడు ధైర్యము చెడి తమ్ముఁ దుర్బలులనుగా భావించుకొనవచ్చు నని యెంచి వారికి దిటవు గలుపఁదలఁచి “మిమ్ము మించి బలవంతులు మిమ్ము బాధింపఁ దలపెట్టినను భయపడకుఁడు; వారి యధికార మీలోకజీవితమును దాటిరాదు; తరువాత మిమ్ము బహుమానించువాఁ డీశ్వరుఁ డున్నాఁడు. ఈ గొప్ప ప్రపంచముతో పోల్చిచూచినప్పుడు మీ రత్యల్పసంఖ్యవారుగానే యున్నను, నాపేరున మీరందఱును నొక్కటిగా నిలుతు రేని మీకు సాయముగా నాబలమును గలవా రయి యుందు రనియు నేనేమీకు తోడుగా నుందు ననియు సదా జ్ఞప్తియం దుంచుకొనుఁడు” అని వారికి నూతనధైర్యోత్సాహములు పురికొల్పి, అతఁడు వారినివీడ్కొని బయలు వెడలెను.

ఈసారి కేపర్నాము నుండి జీసస్సు జెరూసలేముయాత్రకు బైలుదేఱి నప్పు డాతని పన్నిద్దఱు శిష్యులు మాత్రమే గాక పౌరులలోని మిత్రులును ఇతర శిష్యులును కూడ ననేకులు స్త్రీపురుషులాతనివెంట ప్రయాణము మయి వచ్చిరి. వారిలో కొంద ఱాతనిధర్మబోధనలు వినవలె ననియు, తమసాయము కావలసివచ్చిన యెడల చేయువలయు ననియు, ఉద్దేశించుకొని వచ్చిరి. మఱికొందఱు ప్యాసోవరుపండుగ సమీపించుచున్నందున నాతని యుపదేశములు వినుచు నాతనితోడఁ గూడ గలిసి యాత్రకుఁ బోయినవత్సమున తీర్థమును స్వార్థమునుకూడ సమకూడు నని వెంటనంటిరి. వారు బహుదినములు ప్రయాణము చేసి గాలిలీ దేశమును గడచి దిగువ భాగమున జార్డను నదిని దాటి జూడియాదేశమునఁ బ్రవేశించిరి. కేపర్నాము పురమున్నది గాలిలీదేశము; జెరూసలేము నగరమున్నది జూడియాదేశము. పెక్కుబాటలకు సంధిస్థాన మయునజెరికోపట్టణమును జేరునప్పటికి నానాముఖములవచ్చు యాత్రాపరు లయినప్రజలతో జెరూసలేమునకుఁ బోవుబాట క్రిక్కిఱిసిపోవ నారంభించెను. నాజరెత్తునగరమహాప్రవక్త యనియు మెస్సయా యనియు జీసస్సుకీర్తి యీవఱకే దేశదేశములలో వ్యాపించియుండుటచే తీర్థప్రజలాతనిబోధలు వినవలెననియు ముఖసందర్శనము చేయువలె ననియు మూఁకమూఁకలుగావచ్చి యాత్రముతో నాతనిపైని బడఁజొచ్చిరి. వారిసందడినుండి కాపాడుట కయి శిష్యు లాతని చుట్టును జేరి వయిఁబడుమూఁకలను తొలఁగఁ ద్రోచుచుండిరి. ఈసందడిలో స్త్రీలు కొందఱు బిడ్డలను చంకనెత్తుకొని యొండొరులను మీఱి మెల్లమెల్లఁగా గుంపులోనుండి త్రోచుకొని వచ్చి జీసస్సును సమీపించిరి. వారతఁడు చేసెడియుపదేశములను వినవలెనన్న యాసక్తితో నంత శ్రమపడి రాలేదుగాని యటువంటి మహాను

భావుఁడు తన చేతులతో స్పృశించి తమ బిడ్డలను దీవించినయెడల వారికి మేలు కలుగు నన్న యపేక్షతో వచ్చిరి. శిష్యులు వారిని వారించి "ప్రభువువారు మిక్కిలి పనిగానున్నారని మీకు కనఁబడు చుండలేదా? ఇప్పుడు వారు మీతో శ్రమపడఁజాలరు" అని వెనుకకుఁ ద్రోచిరి. జీస స్సది కనిపెట్టి యసంతుష్టిని దెలిపెడి చూపులతో శిష్యుల వంకఁ జూచి "ఆ పసిబిడ్డల నిటు రానిండు. వారిని వారింప వలదు. ఈశ్వరరాజ్య మిటువంటివారిదే" అని పలికెను. అప్పుడు తల్లు లొకరి వెనుక నొకరు బిడ్డల నెత్తుకొని ముందుకురాఁగా జీస స్సొకరి తరువాత నొకరినిగా బిడ్డలను వారిచేతులలోనుండి తీసుకొని ప్రేమను జూపు చూపులతోను నవ్వుమొగముతోను వారిమీఁద చేయివైచి యందఱిని 'భగవంతుఁడు మిమ్ము రక్షించునుగాక' యని యాశీర్వదించెను.

ఆతనిరాకను విని దారిపొడుగునను జనులు మూఁకలు మూఁక లుగా వచ్చి యేప్రకారముగా చుట్టుకొనుచు వచ్చిరో యాప్రకారము గానే ఫారిసీలు సహితము వచ్చి చుట్టుకొని పరాభవింపవలెనన్న దుశ్చింతతో గాలిలీ దేశమునందువలెనే జూడియా దేశమునందును బహువిధప్రశ్నలువేసి బాధింపఁ జొచ్చిరి. ఆతఁడు సమయోచితబుద్ధి గలవాఁడయి సదుత్తరములు చెప్పి నోరడఁచి వారిని తిరస్కారభావ ముతోఁ బంపివేయుచుండెను. ఫారిసీ లెంత బద్ధమత్సరులయి బాధింప పాటుపడినను జెరూసలేము నగరమునందు సహితము తమస్వామికి పరాభవము గలుగఁబో దని భావించి శిష్యులు సంతతోత్సాహవంతు లయి యుండిరి. జీసస్సు వారి కుత్సాహభంగము కలిగింప నిష్టములేని వాఁడయినను, తన కాకస్మికముగా మరణము సంప్రాప్త మగునవత్సర మున భగ్నోత్సాహులయి ధైర్యమును గోలుపోయి తాను నియమిం చిన కార్యమును నిర్వహించుటకు జంకుదురేమో యన్న భయము

చేత జెరికో పట్టణమార్గసమీపమున తన పన్నిద్దఱు శిష్యులను ప్రక్కకుఁ బిలిచి వారితో "నా శత్రువులు సందఱిని నేను నోడించి జెరూసలేము నగరములో నేను మెస్సయా నయి మహాప్రభావముతోను తేజస్సుతోను వసింతునని మీరు తలఁచియున్నట్లు జరగఁబోదు. ఆచార్యులు నన్ను పట్టుకొని, వధార్హునిగా నిర్ణయించి మ్రానిపైఁ బెట్టి మేకులుకొట్టి చంపుటకయి రోమనుల కొప్పగింతురు" అని చెప్పెను. ఆమాటలు విన్నప్పుడు తాత్కాలికముగా వారి మనస్సులకు విచారము కలిగిననూ, ఆతనిశక్తియం దత్యంతవిశ్వాసము గలవా రగుటచేత తరువాత వా రంతగా చింతనొంది యుండలేదుగాని యాతఁడు మాత్రము చింతాకులితస్వాంతుఁడయియే యుండెను. వారు జెరూసలేము నగరమును సమీపించుకొలఁదిని మానసోత్సాహము హెచ్చినవా రయి తమ ప్రభు వీశ్వరరాజ్యపట్టాభిషిక్తుఁ డత్యంత శీఘ్రకాలములోనే యగు ననియు, కాఁగానే ప్రభుసన్నిధానవర్తు లగుటచేత తమ కధికౌన్నత్యము కలుగఁబోవుచున్న దనియు, సంతోషపడుచు వచ్చుటయే కాక ప్రభుసమ్మాననురాగాతిశయముచేత తమలో నెవ్వ రగ్రస్థానమును పొందువా రగుదురా యని పరస్పరస్పర్థ వహించువారు సహితము కాఁజొచ్చిరి.

తనవెంటవచ్చిన గాలిలియావారిలో పన్నిద్దఱు శిష్యులలోనివారైన జేమ్సుయొక్కయు జానుయొక్కయు తల్లియైన సాలొమె యనునామె యుండెను. ఆమె తనకొడుకులు గొప్పవారు కావలె నన్న కోరిక గలదయి వారు శిష్యకోటిలో నెల్ల నగ్రగణ్యులుగా పరిగణింపఁ బడ వలె నని యభిలషించుచుండెను. జీస స్సెల్లవారిచే మెస్సయాగా నంగీకరింపఁబడి పూజింపఁబడునప్పుడు తమ్ము ప్రథమగౌరవస్థానమం దుంచునట్లుతనచేత మాటపుచ్చుకొనవలె నన్న వాంఛను వారి మనస్సులలో

పుట్టించిన దీమెయే యయి యుండును. తా మట్టిప్రార్థనను న్యాయముగా చేయుటకు వారిష్టములేనివా రయి యామెచేత నడిగించిరైన నుందురు; లేదా యామె స్వబుద్ధిచేతనైన వారిపక్షమున నడిగియుండవచ్చును. వారు ముగ్గురును గలిసి జీసస్సువద్దకు వచ్చినప్పుడు సాలోమె తనపాదములమీఁదఁ బడి "దేవా! నా కొకవర మియ్యవలె" నని వేఁడుకొనెను. "నీ కేమికావలెను?" అని జీసస్సడిగెను. "నాయీ యిద్దఱు పుత్రులును నీ రాజ్యములో నొకరు కుడిప్రక్కను ఇంకొక రెడమ ప్రక్కను నీ యుభయపార్శ్వముల నుండున ట్లనుగ్రహింపుము." అని వేఁడెను. జీసస్సాశ్చర్యపడి వారు తమతల్లికోరికలో చేరియున్నారేమో కనిపెట్టుటకయి వారి మొగములవంకఁ జూచెను. తల్లి కోరినదే వారి కోరిక యని వారిచూపులవలనఁ దెలిసికొని వారికయి జాలి పడునట్లు నిందాగర్భముగా "మీరేమి యడుగుచున్నారో మీ రెఱుఁగరు" అని యతఁడు పలికెను. వారు మెస్సయాకు పరిచరులగుటచేతఁ దమకున్నత పదము లభించు నన్న సంతోషమే గాని తమకు రానున్న కష్టదశలను తెలిసికోలేక మనోరథ స్వర్గసుఖభ్రాంతు లయి నిలుచుండిరి. "నేను త్రాగవలసిన పాత్రాంతరాళవిషపూరమును మీరు త్రాగఁగలరా? నేను సహింపవలసిన దుఃఖప్రవాహస్నానమును మీరు భరింపఁగలరా?" అని యతఁ డడిగెను. "మేము త్రాగఁగలము భరింపఁగలము" అని వా రుత్సాహముతోను దృఢనిశ్చయముతోను బదులుచెప్పిరి. "మీరు నిశ్చయముగా పాత్రపూరిత వేదనావిషజలమును నాతో త్రాగుదురు; నావలెనే మీరు దుఃఖరసస్నానము చేయుదురు. కాని యీశ్వర రాజ్యములోని గౌరవస్థానములు నాయీవిలో లేవు. ఈశ్వరేచ్ఛా నిర్వహణము చేత వానినిబడయుట కెవ్వ రర్హులగుదురో వారికవి మన పరలోకపితచేత నియ్యబడును." అని యతఁడు మృదురీతిని చెప్పెను.

వయి ముగ్గురును రహస్యముగా తమగురువుతో మాటాడిన సంగతి యేలాగునో తక్కిన శిష్యులలో పొక్కినది. జేమ్సు యొక్కయు జానుయొక్కయు తల్లి యే యొకవేళ జీసస్సుయొక్క మృదువచనములను బట్టి యతనికి తన కొడుకులయం దెక్కువప్రేమ గల దని భ్రమపడి యితరులవద్ద డంబములు చెప్పుకొని యుండును. వా రిద్దఱును తమకంటె నెక్కువ యాధిక్యమును పొందవలె నని ప్రయత్నించినందున కయి తక్కినశిష్యులకు వారి యెడల నసూయయు కోపమును గలిగెను. ఇట్లు శిష్యులలోఁ గలిగిన యంతస్తాపమును దెలిసికొని దానిని నివారింపఁ దలఁచి యాసోదరుల వర్తనమును నిందింపక "లోకములో తాము గొప్పవారము కావలె నని ప్రయత్నించు మూర్ఖులు తలఁచునట్లుగానే మీరును తా మున్నతపదములకు నియమింపఁబడిన పక్షమున లోక మంతయు తమ్ము గౌరవించు ననుకొను చున్నారు. ఇతరులవలన గౌరవమును మాన్యతయు సంపాదించుకొనుటకు మార్గము తా మేదో యుత్తమ మయిన ఘనకార్యమును చేయుటమాత్రమే యని మీరు తెలిసికోవలెను" అని పలికి, వారు చేసినపని యనాలోచితమును బుద్ధిహీనము నైన ట్లితరులకు కనఁబడు నట్లుచేసి, జీసస్సు పదుగుఱు శిష్యుల కోపమును వారి తెలివితక్కువ కయి యా యిరువురు శిష్యుల మీఁదను గలిగిన జాలికి మార్చి, ఆయిద్దఱును తమ్ము నిందించుట కంటెను నెక్కువ సిగ్గుపడునట్లు చేసెను. వారు జెరికోపురము చేరిన తరువాత విశ్రాంతి కయి కొన్ని దినము లచ్చట నిలిచిరి. ఆదినములలో నక్కడ ననేకులు మిత్రులును శిష్యులును నయిరి. వీరిలో పలువురు జీసస్సు జెరికోనగరమును విడిచి బైలుదేరినప్పుడు శిష్యగణముతోఁ జేరి వెంబడించి జెరూసలేముపురప్రవేశ సమయమునం దతనిని పరివేష్టించివచ్చినపరివారమును మహత్తరమయినదానినిగాఁ జేసిరి.

పురబాహ్యప్రదేశము చేరఁగానే శిష్యులుకొందఱు పట్టణము లోనికిఁ బోయి యొకసుందర మగునరాసభము నద్దెకుఁదెచ్చి దానిపై మెత్తవేసి జీసస్సును కూరుచుండఁ బెట్టి పరివారము చుట్టును బలిసి నడవ పురప్రవేశోత్సవముల కుపక్రమించిరి. ఆకాలమునం దాదేశ ములో గుఱ్ఱముల నెక్కుడు వాడుక లేదు. గొప్పవారు సహితము గాడిదలపైనే స్వారిచేయుచుండిరి. మనదేశపు గాడిదల వలెఁ గాక యాదేశపుగాడిదలు పెద్దవిగాను సుందరమైనవిగాను నుండును. ఇట్లు భక్తజనులు పరివేష్టించి నడువఁగా, శిష్యులుచ్చైస్స్వనముతో మంగళ గీతములు పాడఁగా, ఇతరులు 'విజయోస్తు' అనిదిక్కులుమాఱుమ్రోఁగు నట్లు జయజయధ్వనులు చేయుచురాఁగా, జీస స్సాలివుకొండనుండి దిగి రాఁ దొడఁగెను. దిక్కులు పిక్కటిల్ల నఱచు మూఁకలకోలాహల ధ్వనులును భక్త జనులసంతోషధ్వానములును చెవినిఁబడఁగా లోపలి నుండి వెలుపలికి వచ్చి పురజను లాయుత్సవముతోఁ జేరి నడవఁదొడఁ గిరి. ఆగుంపులోనుండి "ప్రభునామమున వచ్చెడి యాతనికి శుభ మగును గాక!" యను ధ్వనులు క్రొత్తక్రొత్తవాళ్ళనుండి వెలువడి మిన్ను ముట్టుచుండెను. ఈయూరేగింపు వంతెనమీఁదుగా క్రెడన్ కాలువను దాటి పురద్వారము గుండ జయప్రదముగా సాగెను. ఈయసాధారణకోలాహలకారణమును దెలియఁ గోరి పౌరులు గృహ ములు వెడలి పరుగెత్తుకొని వచ్చి ఇదంతయు నేమి? ఈయన యెవ్వరు?" అని యడుగసాగిరి. "ఈయన మహాప్రవక్తయైన నాజ రెత్తు నగర జీసస్సు" అని శిష్యులు గర్వముతో నుత్తరము చెప్పు చుండిరి. ఇటులు వీధులలోనుండి పోవునప్పుడు కొందఱు ఫారిసీలు మనుష్యప్రవాహమధ్యమున తగులుకొని తప్పించుకొని యావలఁ బడు టకు శక్యముగాక యిష్టము లేకయే యూరేగింపుతో నడుచుచు కోప

ముతో "ఓబోధకుడా! నీమనుష్యులను మాటాడకుండ జేయుము" అని జీసస్సును గూర్చి యఱచిరి. జీసస్సు పూర్వప్రవక్తలవాక్యము లలో నొకదానిని "ఈమనుష్యులు మాటాడకపోయినయెడల శిలలే మాటాడును" అనియనువదించి యూరకుండెను. అక్కడనుండియెడమ వైపునకు తిరిగి దక్షిణాభిముఖముగా జీసస్సు తనశిష్యులను తిన్నంగా దేవాలయము వంక నడిపించెను. నిర్మలమయిన పాలరాతిస్తంభము లును స్వర్ణాలంకారములును మాధ్యాహ్నికసూర్యకాంతిచేత తళతళ లాడుచు మెఱయుచుండంగా నున్నతముఖద్వారమువద్దకు పోంగానే జీసస్సక్కడ తన ఖరవాహనమునుండి దిగి పాదచారి యయి వెడ ల్పయిన సోపానపరంపర నెక్కి శిష్యపరిజనాదికపరివృతుండయి సాధా రణముగా మతాంతరమంటప మని పిలువంబడెడు ప్రథమప్రాకారము లోనికిం బోయెను. ఇక్కడ కెల్లదేశములవారును సర్వమతముల వారును నిరాతంకముగా పోవచ్చును; అక్కడనుండి గర్భాలయము లోనికి పోయెడు మెట్లున్నవి. మెట్ల కిరుప్రక్కల నున్న రాతిస్థంభ ముల మీంద "ఈపవిత్రస్థలమునకు యూదులు తప్ప మఱియెవ్వ రయిన పోయెడు పక్షమున ప్రాణదండనము కలుగును. జాగ్రత్త" అని పెద్దక్షరములతో చెక్కంబడి యుండెను. ఈమతాంతరమండప మధ్యమున జీసస్సు నిలిచెను. అది సుందరవిశాలభవనము. దాని నేల వివిధవర్ణములు గల స్నిగ్ధము లయిన పెద్దపలకరాళ్ళతో పఱుపంబడి యుండెను. దానిచుట్టును రెండేసివరుసల పాలరాతిస్తంభము లుండి వానిమీంద కప్పు నిలిచియుండెను. ఈసుందరవిశాలస్థల మీశ్వరా రాధనమున కత్యంతానుకూల మయినదిగా నుండెను. కాని జీస స్సక్కడ నిలువంబడియున్నప్పుడు భగవద్భక్తివిషయక మయినశబ్ద మొక్కటియు నాతని చెవి సోంకలేదు. ఉపాసనాసంబంధ మయినశబ్ద

ములకు మాటుగా జంతువుల కూఁతలును, నాణెములు ప్రమోతలును క్రయవిక్రయవ్యాపారవ్యగ్రుల శబ్దజాతములును, అతని చెవిని బడఁ జొచ్చెను. స్తంభమునకును స్తంభమునకును నడుమఁగల స్థలమంతయు విదేశపునాణెములను పట్టుమనకు పుచ్చుకొని స్వదేశపునాణెముల నిచ్చుచుండువారితోను రాఁబోయెడి యుత్సవములో బలి యిచ్చునిమిత్త మయి గొఱ్ఱెలను పక్షులను విక్రయించు వణిజులతోను నిండియుం డెను. ఈవ్యాపార మంతయు న్యాయముచేత దేవాలయము వెలుపలి భాగమునందే జరగవలసియుండెను; గాని తమ మతముయొక్క పారిశుద్ధ్యమునుగూర్చి లక్ష్యము లేని యాచార్యులు ధనస్వీకారపరు లయి యీ వ్యాపారము పవిత్రాలయములోపలనే జరుగనిచ్చి యూదులు కానివారు ప్రార్థనలు జరుపుకొనుటకయి విడువఁబడిన యాస్థలము కూడ వారికి లేకుండఁ జేసిరి.

జీసస్సు భృత్యపురోగముఁడయి యాధిపత్యము వహించి సలుగడల చూపులు నిగిడించి మండప మధ్యమున నిలఁబడఁగానే యిచ్చిపుచ్చుకొనువారు తమవ్యాపారము నించుక నిలిపి యాతనిముఖము వంకఁ జూడసాగిరి. ఆతనిచూపులయం దధికారభావమును కోపమును కానఁబడెను. "ఈవస్తువుల నిక్కడనుండి తీసికొనిపొండు. దేవాలయము ప్రార్థనాలయముగా నుండవలెనని విధింపఁబడియున్నది. మీరు దీనిని దొంగల నివాసభూమిగా చేసియున్నారు" అని కేకలువేయుచు నిప్పులు కురియుకన్నులతో చేతులు చాఁచుకొని కొట్టఁబోయినట్టు జీసస్సు వారిమీఁదికి పోఁగా, తమగొఱ్ఱెలు చెదరినట్టుగా తాము ను చెదరి యచ్చటివారు నానాముఖముల పరుగులిడిరి. తమస్థానమును వదలక నిలుతమని క్షణకాలము కొంద ఱాలస్యముచేసినను, కృతనిశ్చయత్వముతో పిడికిళ్ళు పట్టుకొని తమ నాయకుని వెనుకనుండి ముం

దుకు రాఁబోవుచున్న శిష్యులను చూడఁగానే మిగిలియున్న ధైర్యశేష మును గోలుపోయి బచ్చులు వేవేగ నాణెములరాసులను తమయొడిలో బోసికొనియు, పక్షిస్వాములు వడివడి పిట్టలగూళ్లు చేతులతో వయి కెత్తిపట్టియు, వణిజులు తమవస్తువులు కొన్ని లోపల విడిచియు, భీత చిత్తులయి క్షణకాలములో దేవాలయమును విడిచి వెలుపలికిఁ బాఱిరి. తప్పుపనిని జూచినప్పుడు కలిగెడి కోపమును జీసస్ స్వామి యొక్కసారి యాపుకొలేక బయలుపఱిచెను. అతఁడు సాధారణముగాఁ జూపెడు శాంతభావము కోపము నడఁచుకొనుచువచ్చుటచేత కలిగినదే కాని కోపము లేకపోవుటచేత కలిగినదికాదు. చెడుపని జరుగుచుండఁగా చూచినప్పుడును కోపము రానివాఁడేమంచిపనిని చేయుటకును సమ ర్థుఁడుకాఁడు. సాధారణముగా కోపము రానివానిని మనము శ్లాఘింప వలసినదే కాని ఘనకార్యనిర్వహణపరాయణునకు కొన్నిసమయముల యందు తీక్ష్ణతతోఁ గూడిన యౌత్సుక్య మావశ్యక మగును. జీసస్సు చేసిన యీపనివలన శత్రువులమనస్సులలో నతనిఁమీఁద మఱింత యాగ్రహమును ద్వేషమును కలిగెను.

ఆరాత్రి యతఁడు పట్టణమున కొకమైలుకంటెకొంచెమెక్కువ దూరములో నాలీవుకొండ కావలివైపున నున్న బెథనీగ్రామమునకుఁ బోయి యక్కడ మిత్రగృహమున సుఖనిద్రచేసి మఱునాఁడు తెల్ల వాఱునప్పటికి మరల దేవాలయమునకు వచ్చెను. అప్పటికే యతఁడు చేసెడు ధర్మోపన్యాసములను శ్రవణానందముగా వినవలె నన్నయాస క్తితో వచ్చియున్న జనులతో విశాలప్రాకారాంతర్భాగ మంతయు నిండియుండెను. భక్త్యావేశముచేత వచ్చినవారిమాట యటుండఁగా నూరక వేడుక చూడవచ్చినభక్తిహీనుల హృదయములు సహితమావ ఱకు తామున్నఁడును వినియుండని కర్ణరసాయనములైన యాతని ధర్మ

వచనప్రసారముచేత కరఁగిన వయి ధర్మచింత కలవి కాఁజొచ్చెను. ఆతని నట్లు నిరంతరాయముగా బోధ చేయనిచ్చి యుండినపక్షమున, సామాన్యజనుల హృదయము లాతనివంక కాకర్షింపఁబడి యల్ప కాలములోనే నూఱులకొలఁది నాతనికి శిష్యులయి యుందురు కాని దేవాలయమున కధికారు లయి యుపాసనాదికమును నెఱవేర్చుచున్న మతాచార్యులు దురాగ్రహవ్యగ్రు లయి భయకంపితులయి యాతని పనికి విఘాతము చేయ కృతనిశ్చయు లయిరి. గతదిన మతఁ డాకస్మిక ముగా శిష్యవర్గముతో దేవాలయములో ప్రవేశించి తమయధికార మును తిరస్కరించి తమ వలన సెలవుపొందిది లోపల వ్యాపారము చేయుచుండినవారిని బలవంతముగా గుడిలోనుండి వెలుపలికి తఱిమి వేసెను. ఆతనిప్రసంగములు వినుటకయి వచ్చిన మూఁక లిప్పుడు గుడిలోసంతటను నిండి గర్భాలయములోనికి పోవ దారిలేకుండఁ జేసి తాము జరపుచున్న యారాధన కరుగుట కనేకుల కవకాశము లేకుండఁ జేసిరి. అందుచేత వారు తమకుఁ గలిగినయవమానమునకు సహింపఁ జాలక తమ యధికారబలమును జూపి యక్రమముగా వచ్చి లోపలఁ బ్రవేశించిన యాయాగంతునకు బుద్ధి వచ్చునట్లు చేయ నిశ్చయించు కొనిరి. ఈనిశ్చయమును నిర్వర్తించుటకయి వారాలోచించుకొన్న యాలోచన తమలో కొందఱు తమయధికారకంచుకములను తొడుగు కొనిపోయి పదిమందిముందఱ "ఈపనులను నీ వేయధికారముతో చేయుచున్నా" వని యడుగుట. అతఁడు మతాచార్యుఁడు కాఁడనియు, పట్టణముయొక్క కాని దేశముయొక్క కాని యే యధికారిచేతను నియమింపఁబడినవాఁడు కాఁడనియు, విద్వత్పరిషత్తుచేత బోధచేయుట కనుజ్ఞయైన పొందినవాఁడు కాఁడనియు, వారెఱుఁగుదురు. తానెవ్వారి వలనను నధికారము పొందలేదని చెప్పినపక్షమున జను లాతనిని

వంచకునిగా నెంచి కేలిచేసి సాగనంపుదు రనియు, దేవునివలన నధికారము పొందితినని చెప్పిన పక్షమున దైవదూషకుఁడని పట్టి యధికారుల కొప్పగింపవచ్చుననియు, వా రనుకొనిరి. అందుచేత వారిలో కొందఱు మూఁకలోనుండి త్రోచుకొనిపోయి, అతఁడు చేయు చున్న ప్రసంగమునకు భంగము కలిగించి, ఏయధికారముచేత నీ పనిని చేయుచున్నావు? అని గద్దించి యడిగిరి. ఈప్రశ్నకతఁడు మాత్రము తడఁబాటుపూనక తడవుకొనక నేనుకూడ మిమ్మొక ప్రశ్న యడిగెదను. దానికి మీ రుత్తరము చెప్పినపక్షమున, నాకధికార మెవ్వ రిచ్చినారో నేను చెప్పెదను. జ్ఞానస్నానము జేయుచుటకు జానున కధికార మెక్కడనుండి వచ్చినది? అది దేవునినుండివచ్చినదా? మనుష్యుల నుండి వచ్చినదా?'' అని యడిగెను. ఈప్రశ్నచేత వారు వేసినవలలో వారే పడవలసినవా రయిరి; ఆచార్యపురుషుఁడు కానిదున మత కర్మ జరుపుటకు జానున కధికారము లే దని వారి నమ్మకము. ఆమాటను పదిమందిలో నిప్పుడు బహిరంగముగా చెప్పెడు పక్షమున, జాను గొప్ప ప్రవక్త యని నమ్మియున్న యుచ్చటిజనులు దురాగ్రహావేశముచేత లేచి పైనిఁబడి దొమ్మి చేయుదురు. జాను కధికారము దేవునివలన వచ్చిన దని చెప్పెడుపక్షమున జీసస్సు తనకును దేవునివలననే వచ్చినదని యాతనికిఁ గలిగిన స్వాతంత్ర్యమే తన కును గల దని చెప్పవచ్చును. అందుచేత, వారేమి చేయుటకును పాలుపోక 'మేము చెప్పజాల' మనఁగానే అనాదరభావముతో నతఁడును "ఏయధికారము చేత నే నీపనులను జేయుచున్నానో నేనును మీకు చెప్పను.'' అనెను.

అప్పు డామతాచార్యులు భగ్నప్రయత్ను లయి క్రిక్కిఱిసి యున్నమూఁకలో నుండి వేగిరము వెలుపలఁబడుటకు శక్యముగాక

యువమా[illegible] గెలుచుకొనియుండఁగా, జీసస్సు జనులను సంబోధించి "ఒకానొక మనుష్యున కిద్దఱు కొడుకు లుండిరి. పోయి ద్రాక్ష తోఁటలో పనిచేయవలసిన దని యతఁ డొక కొడుకుతోఁ జెప్పెను. నేను పోఁజాల నని వాఁడు మొదటజెప్పినను తరువాత తండ్రియాజ్ఞ వినకుండుటకు పశ్చాత్తాపపడి పోయి తోఁటలో పనిచేసెను. తండ్రి రెండవకొడుకునకును నట్లే యాజ్ఞ చేసెను. వాఁడు చిత్త మట్లే చేసెద నని చెప్పెను గాని తరువాత తోఁట త్రొక్కి చూచినవాఁడే కాఁడు. ఈయిద్దఱిలో తండ్రియాజ్ఞ చెల్లించినవాఁ డెవఁడు?" అని యడిగెను. 'మొదటివాఁడు' అని యందఱు నేకవాక్యముగాఁ బలికిరి. అతఁ డప్పుడు నిలువఁబడి యున్న మతాచార్యులవంకఁ దిరిగి రూక్షవీక్షణములతోఁ జూచుచు "నిశ్చయముగా మీకే యిది చెప్పుచున్నాను. సుంకరులును పరమపాపులును మీకంటె ముందుగా నీశ్వరరాజ్యము లోనికిఁ బోవుదురు; వారు జాను బోధనలవలన పశ్చాత్తాపపడి దేవుని యిష్టమును సలిపిరి. దేవుని యాజ్ఞలను చెల్లింతు మని చెప్పుటకు మీ రెల్లప్పుడును సిద్ధముగా నుందురు కాని మీమాటలను మీరు నెఱవేర్పరు." అని కోపము రూపము దాల్చినట్లు పలికెను. అందఱికంటెను తామే దేవున కెక్కువచేరువగా నున్నా మని భావించుకొనువారి కిట్టి మాటలు వినుట దుస్సహముగా నుండును. అయినను వారీగర్హణము పొందుట కత్యంతపాత్రు లనుటకు సందేహము లేదు. వారి మతమంతయు కేవల కర్మాచరణ మయమయి యున్నది కాని పరిశుద్ధ వర్తనమును పాలించునదిగా లేదు.

జీసస్సింతటితో నరిపెట్టక మతాచార్యులును ఫారిసీలును దేవునిచేఁ బంపఁబడినవారిని బాధించువా రనియు, దేవుని పుత్రుఁ డయిన తన్ను పరిహసించి హింసింప నున్నవా రనియు అర్థ మిచ్చునట్లుగా

నింకొక యుపమానమును జెప్పి, వారిమనస్సులలో నవిరోధ మైన క్రోధమును పురికొల్పెను. అప్పుడక్కడ నున్నవారిలో కొందఱు ఫారిసీ లుండిరి. వారా మాటలకు మండిపడి దేహములు తెలియక నడుములు బిగించి లేచి పరుషవాక్యము లాడుచు మీఁదఁబడి జీసస్సును దేవాలయములోనుండి యీడ్చి యావలకుఁ గెంటివేయఁ జూచిరి కాని, అతనిని పరివేష్టించి యున్నయసంఖ్యాకు లయినశిష్యులు స్వామిరక్షణపరాయణు లయి కోపములు రూపము నొందినట్లు వీరరసమూర్తు లయి లేచి బాహువులు చాఁచికొని ముష్టియుద్ధసన్నద్ధులై బైలుదేఱి కలియఁబడఁబోఁగా భయపడి దంతతాడిత విషోరగములవలె రోఁజుచు వెనుక మరలవలసినవా రయిరి. ఆసాయంకాల మెప్పటివలె జీసస్సు పడకకు బెథనీగ్రామమునకుఁ బోయెను. ఈలోపల మతాచార్యులును ఫారిసీలును మఱునాఁడు దమవిరోధి నెట్లు విరోధింతుమా యని మారణోపాయము నాలోచింపఁ దొడఁగిరి.

యూదులు పలుతెగలుగా భాగింపఁబడి, పరస్పరద్వేషము గలవా రయి, యొకరి వినాశనము నొకరు కోరువారుగానుండిరి. అయినను సామాన్యశత్రుభయము సంభవించినప్పుడు గర్భశత్రువులు సహితము కొంతకాల మాశత్రుసంహారమునకయి మిత్రభావము వహించి యేక మగుదురు. కాఁబట్టి జనులు జీసస్సును మెస్సయా యని యంగీకరించుటలో దినక్రమమున నధికవిశ్వాసశీలు రగుచున్నారని భయపడి, యూదులలోని యన్నిశాఖలవారి నాయకులును తమపూర్వవైరములను కట్టిపెట్టి, దినదినప్రవర్ధమాన మగుచున్న ప్రాబల్యమును బట్టి తమ కందఱకు సమానముగానే భయోత్పాదకుఁ డగుచున్న యీ క్రొత్తశత్రువును పరిమార్చుట కయి యొక్కటిగాఁ జేరిరి. యూదులలోని యధికారవంతులును ధనవంతులును విద్యావంతులును నించు

మించుగా నందఱును నొక్కసారిగా నొక్కపురుషునిపై ధ్వజ మెత్తిరి. అతనికి గొప్పవారిలో నొక్కరును సహాయులును మిత్రులును లేరు. ఆతని కున్న బలమంతయు జ్ఞానమును సత్యమును ధర్మమును మాత్రమే.

జీసస్సు ప్రతిపక్షు లందఱును చేరి యాలోచించి యాతనిపై మరణదండనమున కర్హ మైన నేరమును దేని నయిన మోపవలె ననియు, రాజద్రోహ మట్టినేర మైనందున రోమకచక్రవర్తి యయిన సీజరునకు ప్రతికూలముగా నాతనిచేత నేదయిన ననిపించెడి యుపాయము చూడవలె ననియు, కూడబలుకుకొని యెవ్వరికిని సందేహము కలుగకుండుట కయి తమలోని నాయకులను కొందఱ నావనికి నియమించిరి. వారు ధర్మశ్రవణార్థము వచ్చెడి మూఁకలోఁ జేరి మఱునాఁ డాతఁడు ప్రసంగము చేయ నప్పుడు దాపునఁ జేరి తద్వచనామృతసారమును అవ్యాజమయినశ్రద్ధాభక్తులతో గ్రహించుచున్నట్లునటించుచు ప్రసంగావసానసమయమున చేతులుజోడించుకొని 'స్వామీ! దేవర వారు భగవత్సాన్నిధ్యమార్గమును బోధించుచున్నారనియు సత్యమును నిశ్చయముగా వచించుచున్నారనియు మేమెఱుఁగుదుము. దయచేసి మేము సీజరునకు పన్నులుకట్టుట ధర్మమేమో సెలవిండు' అని యడిగిరి. "వంచకులార! నన్నేల విమోహపఱిచెదరు? పన్ను కట్టెడి సొమ్మేదో నాకుచూపుడు" అని యాతఁ డుత్తరము చెప్పెను. వారిలో నొకఁ డొక ప్రక్కను చక్రవర్తిముఖముగల రోమనునాణెము నొకదాని నాతనిచేతిలోఁ బెట్టెను. నాణెమును పయికెత్తి చూపి "ఇది యెవ్వరివిగ్రహము?" అని యతఁ డడిగెను. "అది సీజరుది" అని వారుబదులుచెప్పిరి. "అట్లయినపక్షమున సీజరువస్తువులను సీజరునకు చెల్లింపుఁడు; భగవంతుని వస్తువులను భగవంతునకు సమర్పింపుఁడు." అని యతఁడు శాంతముతో

మనస్సునకు నాటుకొనునట్లుగా నుత్తరము చెప్పెను. ఆమాటలువిని తెల్లపోయి ఫారసీ లాండొరుల మొగమువంకఁ జూచుకొనసాగిరి. వారు పెద్దవలవేసి శత్రువును పడఁద్రోయఁజూచిరి కాని తుదకు వారివలలో నేమియుపడలేదు. అతఁడు సీజరునకు పన్ను చెల్లించవలసిన పనిలేదని చెప్పినపక్షమున రాజద్రోహము క్రింద పట్టుకొని గోనుకపరిపాలకుఁడైన పైలేటున కొప్పగింపవలెననియు, సీజరునకు పన్ను చెల్లింపవలసిన దని చెప్పినపక్షమున పరదేశప్రభుత్వమును ద్వేషించువారయిన ప్రజలతఁడు మోసగాఁడే కాని మెస్సయా కాఁడని నిశ్చయించి యాతనిని గర్హింతు రనియు, వారెన్నుకొని యుండిరి. ఇప్పుడు వారియెన్నిక వ్యర్థమయ్యెను. జీసస్సు చెప్పిన మాటలు తన్నపాయమునుండి తప్పించుకొనుటకయి పలికిన పలుకులుగాక శ్లాఘాపాత్రములయిన దివ్యవచనములయి యున్నవి. బాహ్యపదార్థము లిష్టమున్నట్లే యుండవచ్చుననియు, ఈశ్వరరాజ్యము హృదయములోని ప్రేమవలనను పరిశుద్ధతవలననుమాత్రమే నిర్మింపఁ బడవలెననియు, పయివాక్యముల యభిప్రాయము. 'ఆధ్యాత్మికవిషయములు వేఱు, లౌకికవిషయములు వేఱు' అని బోధించి, నిజమైన చిత్తోన్నతికిని నాగరికతకును మూలాధారములయినవి యీ యమూల్యవాక్యరత్నములే.

అతనిని రాజ్యాంగ గర్తములోఁ బడవేయవలె నని చేసిన ప్రథమప్రయత్న మిట్లు భగ్నము కాఁగా, రాజద్రోహమువలెనే మతధర్మదూషణమును మరణదండనమునకు దోషిని పాత్రునిచేయునది యగుట దలపోసి ఫారిసీ లాతని నేలాగున నైన స్వధర్మాధిక్షేప కూపములో బడవేయవలెనని ద్వితీయప్రయత్నము చేసిరి. వారిలో కొందఱు ముందుకు వచ్చి "అన్నిటిలో నుత్తమధర్మానుశాసన మేది ?" అని యడిగిరి. "మొదటి ధర్మానుశాసనము నీప్రభువైన దేవుని నీవు పూర్ణ

హృదయముతో ప్రేమింపవలయు ననుట. రెండవది నీపొరుగువానిని నీవు నిన్నువలెనే ప్రేమింపవలయు ననుట. ఈ రెండుధర్మానుశాసన ములమీఁదనే ధర్మ మంతయు నిలిచి యున్నది." అని యాతఁ డుత్తర మిచ్చెను. ఈయుత్తరము తమ కుత్సితోపాయసిద్ధి కనుకూల మయినది కానందున వారు లోలోపల నేమో సణుగుకొని మొగములు త్రిప్పు కొనిరి. ఇంకొక కొంద ఱొకవ్యభిచారిణిని గొనివచ్చి యాతనిముందు పెట్టి కపటవృత్తితో "స్వామీ! దీని కేమి దండనము?" అని ప్రశ్న వేసిరి. విధింపవలసినదండన మందఱు నెఱిఁగియున్నదే ప్రపంచములో పాపము చేయనివా రెవ్వరు నుండరు గాన దయనీయులను క్షమింప దగు నన్న భావము తోఁచునట్లుగా "మీలో పాపము చేయనివా రెవ్వరో ముందుకువచ్చి యీమెమీఁద మొదటిరాయి యతనిని వేయనిండు." అని యతఁడు దాంభికులమనస్సులకు శూలాయమా నముగా నుత్తరము చెప్పెను.

వా రిట్లు కపటనాటకవేషధారు లయి మాటిమాటికి వచ్చి తన్ను బాధించుచుండుట సహింపఁజాలనివాఁ డయి కోపోద్రేకముతో "ఓ మహాజనులారా! శేఖకులును ఫారిసీలును మోసెస్సుయొక్క ధర్మానుశాసనములను మీకు ప్రసాదించుచున్నారు. కాఁబట్టి వారి ధర్మానుశాసనములను మీ రనుష్ఠింపవలసినదే. కాని వారు తమ దృష్టాంతమువలన చూపిన మార్గమును మీ రనుసరింపకుఁడు. ఏల యన, వారు తమయుపదేశములనే తా మాచరింపరు. వారు మను ష్యుల బుజములమీఁద పెద్దబరువుల నెత్తి కట్టుదురుగాని మనతోడి మానవులమీఁది బరువును లేవనెత్తుట కయి యొక వ్రేలెత్తునంతటిపని నైనను తాము చేయరు. మంచిదియు సత్యము నన్న హేతువుచేత దేనిని వారు ప్రేమింపరు; జనులు తమ్ము మంచివారినిగా చెప్పుటకో

96

వలెననిమాత్రమే ధర్మము నాచరింతురు. సామాన్యజనులవిషయ మైనచింతయే వారికి లేదు; ఇతరులు తమసహోదరు లన్నజ్ఞానమే వారికి లేదు; వారిచింత యంతయు ఉత్తమపదార్థములను ఉన్నతపద వులను తాము సంపాదించుకోవలెననిమాత్రమే" అని యొక్కింత చెప్పి, అంతకంతకు కోప మతిశయించి వట్ట శక్యము కాకపోఁగా ఫారిసీలవంకను లేఖకులవంకను దిరిగి "ఓ లేఖకులారా! ఫారిసీలారా! వంచకులారా! మీకు దుఃఖ మగుఁగాక! జ్ఞానకుంచికను జనులనుండి తొలఁగించి, మీ రీశ్వరరాజ్యము వారికి లభింపకుండ మూసిపెట్టు చున్నారు. మీరును లోపలికి పోవరు; పోవఁగోరినవారిని లోపలికి పోవనునియ్యరు. మీకు దుఃఖ మగునుగాక! మీరనాథలవసతులను మ్రింగివేయు చున్నారు; పయి వేషమున కయి దీర్ఘప్రార్థనలు చేయుచున్నారు; కాఁబట్టి మీరధికతరనరకబాధల నొందుదురు. ఎవ్వనినైన నొక్కనిని మీమతములో కలుపుట కయి స్థలమును జల మును చుట్టఁబెట్టుదురు; కలిసినతరువాత వానిని నరకభాజనుని గాఁ జేయుదురు. ఓవంచకులారా! బుద్ధిహీనులారా! పొలములో పండెడు సోపుగింజలలోను జీలకఱ్ఱపాయలలోను దశాంశమును గురువున కర్పించుట మహాపుణ్యకార్యమని చెప్పుచు, దయాధర్మసత్యశౌచాదు లైన మహత్తరవిషయములను విడిచిపెట్టుదురు. ఓ బుద్ధిహీను లారా! మీకు దుఃఖ మగునుగాక! మీరు దోమనుమ్రింగ డోకు కొనుచు లొట్టియను గుటుక్కున మ్రింగివేయుదురు. మీరు లోపల మృతాస్థులతోను సకలాశుద్ధతలతోను నిండియున్నను పయికి సుందర ముగా కనఁబడెడి వెల్లవేసిన సమాధులవంటివారు. బాహ్యమునకు పుణ్యాత్ముల వలెఁగానఁబడుచు లోపల మీరు పాపకాపట్యదూషితు లయి యున్నారు. ఓలేఖకులారా! ఫారిసీలారా! వంచకులారా! మీకు

దుఃఖ మగును గాక! మీరు మీతండ్రులు చంపిన పూర్వప్రవక్తల కును పుణ్యాత్ములకును సమాధులు నిర్మించుచున్నారు. మీరును మీపూర్వులవలెనే వర్తమానప్రవక్తలను పుణ్యపురుషులను బాధలు పెట్టి చంపుచున్నారు. ఓపాపజాతులారా! విషసర్పములారా! మీరు నరక యాతన నెట్లు తప్పించు కొనఁగలరు?"

ఈపిడుగువంటి నుడువు లెవ్వరినిగూర్చి యుద్దేశింపఁబడినవో వారికి మనోవ్యథాకరములును కోపజనకములు నయి యుండెననుటకు సందియము లేదు. మిత్రమధ్యమునం దున్న యాతని నా సమయము నం దేమి చేయుటకును శక్తులు కాకపోయినను ప్రతిపక్షులలో కొందఱు దూరమునుండి యాతనిపై రాళ్ళు రువ్విరఁట! ఇంతలో జీసస్సుయొక్క కోపాగ్ని కొంత ప్రశాంతినొందగా తొంటిక్రోధము ఖేదముగా మాఱినవాఁ డయి పట్టణము నుద్దేశించి "జెరూసలేము నగరమా! కటకటా! నీవద్దకుఁ బంపఁబడిన ప్రవక్తలను నీవురాళ్ళతోఁ గొట్టి నిష్కారణముగాఁ జంపుచున్నావు. కోడి తనపిల్లలను ఱెక్కల క్రిందఁ జేర్చుకొను నట్లుగా నీప్రజలను నాయండకుఁ జేరఁ దీయుటకై నే నెన్నిసారులు కోరుచున్నాను! అక్కటా! నీవు వారిని చేరనీయవు." అని పలుకుచు నతఁడు దేవాలయమునుండి వెడల బయలు దేఱెను. అతఁడు ద్వారమువంక నడుచు నప్పుడు ప్రక్కలను దానపేటికలు కనఁబడెను. ఆపెట్టెలలో వేయబడినధనమును తీసి తరువాత ధర్మ కార్యముల కుపయోగింతురు. అతఁడా పెట్టెలవంకఁ జూచుచు నిలఁ బడియుండగా ధనికు లయిన ఫారిసీలు మొదలయినవారు తమ యొద్దనున్న పెద్దవయిన వెండిబంగారు నాణెములను పరులకు తెలి యుటకేమో యనునట్లు ఘల్లు మని ప్రోగునట్లుగా దానపేటికలో వేయుచు వచ్చిరి. అప్పుడు జీర్ణ వస్త్రములు కట్టుకొనియున్న నిరుపేదది

యయిన మృతభర్తృక యొకతు యొకపిట్టను పుల్లంగా సమీపించి తనయొద్దనున్న రెండు చిన్నినాణెములను భక్తిపూర్వకముగా దానిలో జాఱవేసెను. అదికనిపెట్టి జీసస్సు తనశిష్యులతో ఆబీదదానిధర్మమును జూచితిరా? అందఱు నిచ్చినదానికంటె సీనెఱుపేదది యిచ్చినదే యెక్కువైనది. తక్కినవారు తమ కున్నవిశేషధనములో నత్యల్పభాగము నిచ్చిరి. ఈబీదదో రాత్రితినభోజనము మాటమైన తలపెట్టక తనకున్నదంతయు నిచ్చివేసినది. ఈమె చేసినదానమే యొకకాసయినను దేవునకధిక ప్రీతికరమైనది" అనిపలికెను. ఆమాటలు విన్న ఫారిసీలు మొదలైనవా రతఁ డొక్కకాను పెట్టెలో వేసినబీదదానిని బట్టువలె పొగడుచు సువర్ణ నిష్కములను ధర్మార్థముగా వేసిన తమ వంటి శ్రీమంతులను తెగడుచు నవజ్ఞ చేయుచున్నాఁ డనికోపముతో గొణుగుకొనుచుఁ బోయిరి. జీసస్సును శిష్యులును బెథనీగ్రామము వంక నడిచిరి. ఆలివ్ కొండమీఁద నున్న బెథనీగ్రామము జీసస్సున కత్యంతప్రియ మయినది. అక్కడ నొక్క సోదరుఁడును ఇద్దఱు సోదరీమణులును గలయొక సాధుకుటుంబ మతనికి పరిచితమైనది. వారితోడి మైత్రి యతని కెంతో యాహ్లాదకరమయినదిగా నుండెను. అక్క సెల్లెండ్రిద్దఱిలో నొకామె పేరు మార్తా; ఆమె దయాదాక్షిణ్యములు గలదియు శ్రద్ధాళువు నయియుండెను. రెండవయామె పేరు మేరీ; ఆమె యొకవిధ మయినసౌకుమార్యమును ధ్యానశీలమును గల దయి జీసస్సును రంజించుచుండెను. జీసస్సుయొక్క పాదసన్నిధానమందుఁ గూరుచుండి యాయన చెప్పునది తదేకధ్యానముతో వినుచు పలుమాఱు గృహవ్యవహారములనే మఱచుచుండును. అటువంటి సమయములయం దింటిపని యంతయు తనమీఁదనే పడఁగా నామె సోదరి వచ్చి మృదువచనములతో నామెను మందలించుచుండును. అప్పుడు

జీసను మార్తా! నీ వెంతో శ్రమపడి పెక్కుపనులతో శ్రద్ధవహించు చున్నదానవు. ఆవశ్యక మయినది యింకొకయంశముమాత్రమున్నది. మేరీ యిప్పు డాయుత్త మాంశమును గ్రహించినది. దానిని వారింప వలదు.” అని పలుకును. వారిసోదరుఁ డైన లాజరెస్సుకూడ జీసస్సు నకు పరమాప్తుఁడు. జీసస్సున కాకుటుంబమువారు చేసిన సాయము నకును చూపినయాదరమునకును పరిమితిలేదు. వచ్చిననాఁడురాత్రియే జీసస్సునకు వారు గొప్పవిందు చేసిరి. యాత్రార్థ మయి వచ్చినగాలిలీ దేశస్థు లందఱును వారిసహపంక్తిని గుడిచిరి. విందునడుమను మేరీ యొక్క పరిమళద్రవపాత్రములోని గుమగుమలాడెడి యాసారభరసము నాతని పాదములకడ గ్రుమ్మరించెను. దాని పరిమళము గది నంతను గుప్పున ముంచుకొని యెల్లవారిని సంతోషసముద్రములో ముంచెను. అప్పు డామె సాగిలఁబడి తనదీర్ఘశిరోజములతో ప్రభుపాదసమార్జ నము చేసె నఁట! ఇది యాతనియం దామెకుఁ గలయసాధారణ శ్రద్ధాభక్తులను సహస్రముఖముల ఘోషించుచున్నది. ఇట్టి మిత్ర నికేతనమునకే నాఁటిరాత్రి జీసస్సు వెదకుకొనుచుఁ బోయెను.



## ఎనిమిదవ ప్రకరణము.

### జీసస్సుయొక్క విచారణ, మరణము.

ఈవఱకే శత్రువులయొక్క కోపోద్దీపనము పరమావధి కెక్కినది. జీసస్సు ప్రాణములతో నుండఁగా యూదమతము నిరపాయముగా తలయెత్తుట పొసఁగ నేరదని భావించి మతాచార్యులు సభచేసి యేయుపాయముచేత నైనను నాతని యిహలోకజీవితము నంతము నొందింప వలయునని నిశ్చయముచేసికొనిరి. అప్పటి ప్రధానమతాచార్యుఁడు కైఫా యను నతఁడు. రోమనులు జెరూసలేము నగరము నాక్రమించుకొన్న కాలము మొదలుకొని రాజపురుషుల నిగ్రహానుగ్రహానుసారముగా ప్రధానాచార్యు లేఁటేఁట మాఱుచుండిరి. కాని కైఫా రోమనుపక్షావలంబుఁ డగుటచేత పదిసంవత్సరముల నుండి యాచార్యపీఠమును వదలక యేకాధ్వర్యముగా నధికారము చెల్లించుచుండెను. అయినను అతని యధికార మంతయు నామమాత్రమే కాని ప్రధానాచార్యపట్టము లేకపోయినను నిజమైన యధికార మంతయు హానను చేతిలో నుండెను. ఇతఁ డతఁ డాడించిన ట్లాడవలసినవాఁడు. హానను కైఫాకు మామగారు. హానను పూర్వము ప్రధానాచార్యపదమునందుండి యిప్పుడు తొలఁగింపబడినవాఁ డయి యుండినను తెరచాటుననుండి యప్పటినుండియు నితఁడే కార్యతంత్రనాటకమును నడపుచుండెను. ఈతనితో నాలోచించి యాతనిసమ్మతిని బడయక కయిఫా యేముఖ్యాంశమునందును స్వతంత్రముగా కర్తవ్యనిర్ణయమును చేయఁడు. హానను కుమారులలో నైదుగురప్పుడప్పుడు ప్రధానాచార్యపదమును పొందినవారయి యుండిరి. దేవాలయమును

లోని ముఖ్యోద్యోగము లన్నియు నీతని కుటుంబములోని వారిచేతనే వహింపఁబడుచుండినవి. అందుచేత నాచార్యకోటిలోనివారి కందఱికిని హానను నాయకుఁడుగా నుండెను. ఇతఁడు సద్దూసీ తెగవాఁడు.

ఆచార్యపురుషులు చేసినసభలో జీసస్సును సాధ్యమైనంత శీఘ్రముగా పట్టుకొనుటకు నిశ్చయము చేసికొనిరి. కాని యెప్పుడెట్లు పట్టుకోవలయునా యన్న యాలోచనమాత్రము తెగలేదు. అతనిని ధర్మప్రవచనము చేయుటకయి బైటికివచ్చినప్పుడు పట్టుకొందమంటిమా, అప్పుడు తమప్రాణములనైన నిచ్చి గురువును రక్షింపవలయునని కంకణము కట్టుకొనియున్న శిష్యు లాతనిని చుట్టుకొనియుందురుగాన ఘోరయుద్ధము జరిగి వీథులలో రక్తప్రవాహములు గట్టక పట్టుకొనుట సాధ్యముకాదు. బెథనీగ్రామములో నింటఁ బండుకొని యున్నప్పుడు పోయి పట్టుకొనుటకయి భటులను బంపుదమంటిమా, ముందుగా సంగతి తెలియక మానదు గనుక పట్టుపడక యతఁడు తప్పించుకొని పోవచ్చును. ఎట్లును పాలుపోక మతాచార్యు లిట్లు తలపోతలుచేయుచుండఁగా వారికెప్పుడును నెదురుచూడని తావునుండి సాయమువచ్చెను. మతాచార్యుల మనుష్యులు వాని మనోదార్బల్యమును కనిపెట్టి యాశపెట్టి మెత్తపఱిచి లోపఱిచి పంపుటచేతఁ గాఁబోలును జీసస్సుయొక్క ద్వాదశశిష్యులలో నొక్కఁడైన జూడస్సనువాఁడు తనస్వామిని పట్టి యొప్పగించెదనని వారియొద్దకు వచ్చెను. పండ్రెండుగురు శిష్యులలోను జూడసొక్కఁడే జూడియాదేశస్థుఁడు; తక్కిన పదునొక్కండ్రును గాలిలీదేశస్థులు. తన ప్రభువుయొక్క ప్రతివక్షులకు సాయము చేయవలెనన్న స్వామిద్రోహబుద్ధితో బెథనీగ్రామమునుండి తప్పించుకొని తనతోడివారి నేమఱించి దొంగతన

ముగా నిప్పటికి వచ్చెను. ఏహేతువుచేతఁ నితఁ డిట్టి స్వామిద్రోహమున కొడిగట్టెనో తెలియరాకున్నది. ఇతఁడు మొదటినుండియు చెడ్డవాఁడయి యుండియుండఁడు; అట్లుండినపక్షమున జీసస్సితనిని పరమ విశ్వాసినిగా భావించియుండుట తటస్థింపదు. జీసస్సు తా నేరికోరుకొన్న పన్నిద్దఱు శిష్యులలోను జూడస్సొక్కనివిషయములోనే ప్రమాదమునొందెను. తనతోడివారితోఁ గలిగిన స్పర్థచేతనో మాత్సర్యముచేతనో తనస్వామిసంకల్పము సఫలమగునది కాదన్న యధైర్యముచేతనో యతఁడీయకార్యకరణమున కొడఁబడియుండును. తన ప్రియశిష్యుఁ డొక్కఁడు దుష్టులదురాలోచనలలో తగిలియున్నాఁ డన్న సంగతి సూక్ష్మబుద్ధియైన జీసస్సుయొక్క బుద్ధిప్రచారమునకు గోచరింపకుండినది కాదు. జూడస్సుయొక్క స్థలాంతరగమనవీక్షణముచేతనే యతఁ డెక్కడ కేపనిమీఁదఁ బోయెనో జీసస్సు తత్క్షణమే గ్రహించెను.

ఏప్రిల్ పదునాల్గవ తేది గురువారము ప్యాసోవరుపండుగ యారంభము. రాత్రిభోజనమున కేర్పాటుచేయుట కయి జీసస్సు కొందఱుమిత్రులను నాఁటియుదయమున జెరూసలేము నగరమునకుఁ బంపెను. ఆరాత్రి జెరూసలేములో నొక్కమిత్రగృహమునందు జీసస్సును ద్వాదశ శిష్యులును గలిసి యేకకుటుంబమువలె భోజనముచేసిరి. అది యొక్కనికిఁ దక్క శేషించిన శిష్యులకందఱకును సంతోషావహమయి తమయన్యోన్య భ్రాతృస్నేహానుబంధ ప్రతిష్ఠాపనోత్సవముగా కనఁబడెను. ఆయొక్కఁడును జూడస్సు. ఆసుహృద్గణములో తనొక్కనిగా భావించుకొనుట మానివేసినందునను, ఇంకను శిష్యుఁడయినట్టు నటించుచు తానారాత్రియే తనస్వామిని బంధించుటకయి భటవర్గమును కొనిరానున్నవాఁ డగుటచేతను, వాఁడు నిస్సందేహముగా మన

స్వాస్థ్యము లేనివాఁ డయి యుండెను. జీస స్స్వామి సూక్ష్మచర్యను బట్టి యతఁ డాచార్యులతోడి తన కుతంత్రమును పూర్తి చేసె ననియు దానిని కొనసాగించుటకయి భోజన సమాప్తి కొఱకు ప్రతీక్షించు చుండె ననియు, కనిపెట్టెను. ఈ విశ్వాస ఘాతుకత్వమును దలంచికొని మనోవ్యథ నొందినవాఁ డయి సహించి యూరకుండ లేక వేగిరపాటుతో శిష్యులవంక చూడ్కి నిగిడించి "ద్రోహి యయి మీలో నొక్కఁడు నన్ను పట్టి యిచ్చు నని నిశ్చయముగా చెప్పు చున్నాను" అని పలికెను. వారొండొరులముఖములవంకఁ జూచుచు "నేనా!" "మీరు నన్నుద్దేశించినారా" అని యాత్రముతో నందఱు నొక్కపెట్ట నడిగిరి. అతఁ డెవ్వరిపేరును జెప్పక యూర కుండెను. జూడస్సు మనోవేదన గలవాఁడయి యక్కడ నిలువనొల్లక గది విడిచి లేచిపోవుట కయి లేచెను. అతఁడు పోవునప్పుడు జీస స్స్వామి వంకఁ జూచి "నీవు చేయవలసినదానిని శీఘ్రముగాఁ జేయుము" అని శాంతస్వరముతోఁ బలికెను. జీస స్స్వామి నేదో పనిమీఁదఁ బంపు చున్నాఁ డనుకొనిరే కాని యప్పుడుసహితము శిష్యు లతఁడు స్వామి ద్రోహి యగు నని తెలిసికోఁజాలక పోయిరి.

జూడస్సు గది విడిచి పోయినతరువాత జీసస్సు తనకు రాఁబోవు చున్న మరణావస్థను మనస్సునం దుంచుకొని వారి కుత్సాహమును ధైర్యమును సంతోషమును గలిగింపవలె నన్న యుద్దేశముతో దయారస మొలుకునట్లుగా ప్రీతిపూర్వకము లైనవాక్యములు కొన్ని చెప్పి శిష్యులకు దిటవు గఱపెను. ఆరాత్రి భోజనావసానసమయమునం దొకవిశేషకర్మ నడచినది. జీసస్సు రొట్టె యొక్కటి చేతఁబట్టుకొని దానిని ముక్కలుగా విఱిచి యొక్కొక్కముక్క యొక్కొక్కశిష్యుని చేతిలోఁ బెట్టి "ఇది మీరుపుచ్చుకొని భక్షింపుఁడు. ఇదిమీనిమిత్త

మయి యియ్యఁబడిన నాశరీరముయొక్క చిహ్నమును తెలుపు చున్నది. నాస్మరణార్థముగా దీనిని మీరు తినుఁడు." అని గంభీరస్వరముతో పలికెను. అదివా రారగించినతరువాత నాతఁ డొకగిన్నెలో ద్రాక్షాసవమును బోసి త్రాగుట కయి శిష్యులచేతికిచ్చుచు "ఇది మీనిమిత్తమయి కార్పఁబడ నున్న నారక్తమును దెలుపు చున్నది దీనిని మీరు త్రాగునప్పుడెల్లను నాస్మరణార్థముగా త్రాగుఁడు" అని పలికెను. ఈపలుకు లాతనికిఁ గలద యార్ద్రహృదయమును శిష్యులయెడఁ గల యవ్యాజప్రేమమును వేయినోళ్ళతు చాటు చున్నవి. అత్యల్పకాలములోనే సంభవింప నున్నతనమరణమునకు ముందు శిష్యులలో నైకమత్యమును తనమీఁదిభక్తిని తన్మూలమున స్వార్థపరిత్యాగబుద్ధిని పురికొల్పుటకయి శిష్యులలో నొకకర్మ యావశ్యక మని భావించి బుద్ధిమదగ్రేసరుఁ డైనయతఁ డీపనిని చేసి యుండును. ఈకర్మ యిప్పటికిని భూమిని స్వర్గమునుగాఁ జేయుట కయితనప్రాణమును ధారపోసిన మహాత్ముని స్మృత్యర్థముగా "ప్రభుభోజన" మను పేర ప్రతిసంవత్సరమును సమస్తక్రైస్తవజాతులవారిలోను అవిచ్ఛిన్నముగా జరపఁబడుచున్నది.

భోజనము లయినతరువాత ప్రార్థనలు చేసి కీర్తనలు పాడి మరల బెథనీగ్రామమునకుఁ బోవ బైలుదేఱునప్పటి కించుమించుగా నర్ధరాత్ర మయినది. ఇట్టినిశాసమయమునం దొంటిగా తోఁటకు నడుచుటకు శిష్యులు కొంచెము సంశయించిరిగాని యతఁడు ప్రయాణమయి నిర్భయముగా ముందడుగు వేసినను మనస్సులో మాత్రము బెథనీగ్రామము చేరుదు నన్ననిశ్చయము లేనివాఁడయి యుండెను. కృతఘ్నుఁ డయినయాశిష్యుఁ డెప్పుడు గదిని విడిచి బైలుదేఱి బయటికి పోయెనో యప్పుడే యతఁ డేపనిమీఁద పోవుచున్నాఁడో యేమిజరగ

నున్నదో సర్వమును జీసస్సు తనకన్నులయెదుట కట్టఁబడినట్లుగా మనో
దృష్టిచేతఁ జూచెను. కాని యతఁ డెప్పుడును చావునకు భయపడిన
వాఁడు కాఁడు. అతఁడిప్పుడు తప్పించుకొని పోఁదలఁచుకొన్నపక్షమున
నొరు లెఱుఁగకుండ నెందేని పోఁగలఁడు. అయినను తానట్లు తప్పించు
కొనిపోవుట కొంతమాత్రము నిష్టములేనివాఁ డయి యతఁడు తిన్నగా
మృత్యుముఖమునకు నడచుటకు కృతనిశ్చయుఁ డయి యుండెను. తన
మరణమూలముననే తాను పూనినధర్మప్రచారమునకు జగమునం
దఖిలవ్యాప్తి కలుగవలె నని యీశ్వరసంకల్ప మనియు, తాను బ్రతికి
యుండి ధర్మబోధము చేయుచున్నప్పటికంటె తాను చచ్చి దారి
చూపుటవలననే తాను బోధించినసత్యముల కత్యంతశీఘ్రముగా లోక
ములో నధికప్రాచుర్యము కలుగుననియు, అతఁడు నిశ్చయముగా
నమ్మినవాఁ డయి ప్రపంచోద్ధరణార్థముగా తనప్రాణములను తృణ
ప్రాయముగా విడుచుటకు సంసిద్ధుఁ డయి యుండెను. అయినను
తన్ను విరోధులు నిరోధింపఁగానే శిష్యులు నిరుత్సాహు లయి యధైర్య
పడుదు రేమో యన్నభయముమాత్ర మాతనిమనస్సును బాధించుట
మానినది కాదు. అందుచేత నతఁడు వీధిలోనికి పోవునప్పుడు తలవా
కిట నిలిచి సిమనుతో "ఓయీ! పిశాచము నిన్ను తనవంకకు లాగు
కొనఁ గోరుచున్నది; కాని నీవిశ్వాసము చెడకుండునట్లు నీనిమిత్త
మయి నేను ప్రార్థనచేసియున్నాను." అని చెప్పెను. "తక్కినవారంద
ఱును విడిచిపెట్టినను నేను దృఢవిశ్వాసి నయి యుండి, ఆవశ్యకమయిన
యెడల కారాగృహమునకును మృత్యుముఖమునకును నేను నీతో
వచ్చెదను." అని యతఁ డుత్తర మిచ్చెను. అంతటిధైర్యశాలి నను
కొనుచున్న యాప్రియశిష్యుని మొగమువంకఁ జూచి విచారముతోడి
మందహాసము చేసి జీసస్సు "ఈరాత్రి ముగియుటకు మునుపే కోడికూసెడు

లోపల నీవు నన్నెప్పుడు నెఱుఁగనని యుపలపించెదవు.'' అని పలికి, శిష్యుల సందడిని జూచి "ఈరాత్రి మీరందఱును నాయొకల నాశా భంగము నొంది సాపరాధు లయ్యెదరు. గొల్లవాఁడు నేలఁగూల్పఁబడి నప్పుడు గొఱ్ఱెలమంద యెట్లో యట్లే భయకంపములతో మీరందఱును నానాముఖములఁ జెదరిపోయెదరు.'' అని చెప్పెను. వారు తమ మనస్సులలో ప్రభువు తమయోగ్యతకు తగినంతగన్యాతను తమ కియ్యలేదని తలఁచికొనినను పయి కేమియు ననలేదు. ఇంతలో నతఁడు మరల నందుకొని "సొమ్ముగాని జోలిగాని పాదరక్షలుగాని యేమియులేకుండ మిమ్ము నేను ధర్మప్రవచనార్థముగా బైటవఁపినప్పుడు మీ కెప్పుడైన నేదైన కావలసివచ్చెనా!'' అని యడిగెను. 'ఏదియు కావలసిరాలేదు' అని వారు బదులుపలికిరి. ఇప్పుడు మీలో ప్రతిపురుషుఁడును తన సంగతి తానే చూచుకొనవలెను. నావ్యవహారము ముగింపునకు వచ్చుచున్నది. ఇఁక మీపోషణముయొక్కయు రక్షణముయొక్కయు సాధనములను మీరే సమకూర్చుకోవలెను.'' అని జీసస్సు చెప్పుచుండఁగా నెవ్వఁడో యొక శిష్యుఁడు రెండు కత్తులతో ప్రపంచమునంతటను జయింపఁ గలుగుదు మన్నట్టుగా "మావద్దనివిగో రెండుకత్తులున్నవి.'' అని పలికెను. వారి యమాయకత్వమునకు లోపలనవ్వుకొని 'చాలును ఇఁక పోదము రండి.' అని జీసస్సు ముందు నడవఁ జొచ్చెను.

అది వెన్నెలరాత్రి గాన దారి చక్కఁగా గానఁబడుచుండెను. ఆ రావెన్నెలలో నిశ్శబ్దముగా నున్న వీథులలోనుండి నడిచి పురద్వారము నిర్గమించి కొన్నిదినముల క్రిందట పెద్ద యూరేగింపుతో జీసస్సు జెరూసలేము నగరప్రవేశము చేసినమార్గముననేపోయి కెద్రన్ వంతెనను దాఁటి కొన్ని నిమిషములలో బెథనీగ్రామ సమీపమున నలివుపర్వత పాదమున నున్నతోఁటలో ప్రవేశించిరి. జీస స్సిఁక

ముందునకు సాగక వారిప్రక్కకు దూరముగా తొలఁగి యక్కడ నిలువఁబడెను. జేరూసలేము భటులతోను సైనికులతోను గూడి జూడస్సు తప్పక తన్ను వెదకుకొనుచు వెంబడించి వచ్చు నని యతఁడు దృఢముగా నమ్మియుండెను. అందుచేత భటులు తన్ను పట్టుకొను నప్పు డనివార్యముగా సంభవించెడు సంక్షోభమును భీతియు బెథనీగ్రామములోని తన మిత్రులకు కలుగఁజేయ నిష్టము లేనివాఁడయి గ్రామములోనికిఁ బోవక కొంతసేపు తోఁటలోనేయుండి ప్రతిపక్షులరాగమనమును ప్రతీక్షించుచుండుట కయి యతఁడు నిశ్చయము చేసికొనెను. అంతే కాక యతఁడు తా నాలివుకొండమీఁద నిలువఁగోరుట కింకొక కారణము కూడఁ గలదు. అతని మన స్సిప్పుడు మిక్కిలి కలతనొందిన దయి స్థైర్యము లేక డోలాందోళనము నొందుచుండెను. మనశ్శాంతి కలుగుటకయి యేకాంతస్థలమున నీశ్వరుని సమీపించి తనహృదయము నాతనికి నివేదించి ప్రార్థనచేయవలసిన యావశ్యకతకూడ నతనికి కనఁబడెను. ఇతరులు నిద్రపోవుచుండిన కాలములో ననేకరాత్రు లతఁడు బైటికిఁబోయి తనకు బుద్ధిని బలమును ప్రసాదించుట కయి వేఁడుచు గంటలకొలఁదికాల మొంటిగా నీశ్వరధ్యానమునం దతఁడు తనపరమపిత సాన్నిధ్యమునఁ గడపుచువచ్చెను. కడపటి దయిన తన యీగొప్పపరిశోధన కయి పూర్ణముగా సంసిద్ధుఁడు కాఁగలుగుట కతఁడిప్పు డీశ్వరునితోఁ గొంతకాల మేకాంతముగాఁ గడప గోరియుండెను. గెత్సేమే ననిపిలువఁబడెడి క్షేత్రమునకు సమీపమున నున్న యొకయాలీవుచెట్ల యారామములో ప్రవేశించి యతఁడు శిష్యులనుద్దేశించి “మీ రిక్కడ వేచియుండుఁడు. నేను ప్రార్థననిమిత్తము ముందుకు పోయెదను” అని చెప్పెను. ఇట్లు చెప్పి పేతురును జానును జేమ్సును దన వెంటఁగొని యతఁడు చెట్లలోనికి మరి

కొంతదూరము నడిచి "నాయాత్మ మరణవేదనమునకుం బోలె నత్యంత విషాదము నొందుచున్నది మీ రిక్కడనుండి నాతో కనిపెట్టి చూడుఁడు" అని యోహానుప్పేరతోను జెప్పి, అతఁడు మఱికొన్నియడుగులు ముందుకు నడచి భూమి మీఁద సాష్టాంగపడి "ఓ నాతండ్రీ! సాధ్య మయినయెడల, ఈవిషపాత్రము నన్నుండి కడచి పోనిమ్ము. అయినప్పటికిని నాయిచ్ఛగాక నీయిచ్ఛయే నెఱవేఱును గాక!" అని ప్రార్థించెను. అతఁ డింకేమి వేఁడెనో తెలియదుగాని చాలసేపు ప్రార్థనము చేసెను. ఈశ్వరుఁడు తన్నిట్లు నడుపుచున్నాఁ డనియు, తన శత్రువులనుండి పాఱిపోవుటకంటె తన ప్రాణమును సమర్పించుటయే యీశ్వరాభిమత మనియు, అతఁడు తెలిసికొనెను. కొంచెమునే వయినతరువాత నతఁడు భూమిమీఁదినుండి లేచి శిష్యులవద్దకు వచ్చునప్పటికి వారు ముగ్గుఱును నిద్రపోవుచుండిరి. "ఏమి యిది! ఒకచిన్న గంటకాలము మీరు నాతో వేచియుండ లేకపోయితిరా? మీకును శోధనసమయము రావచ్చును గనుక, నానిమిత్తము గాకపోయినను మీనిమిత్త మయినను వేచి ప్రార్థింపలేకపోయినారా!" అని సోద్వేగముగాఁ బలికి, వారియొద్దనుండి మరలి కదలిపోయి, ఓనాతండ్రీ! ఈ విషపాత్రము నేను పానము చేసిననే కాని నన్నుండి సాగిపోరానిపక్షమున, నీయిచ్ఛ నెఱవేఱును గాక!" అని జీసస్సీసారి యధిక మనోబలమును చిత్తశాంతియుఁ గలవాఁడయి ప్రార్థించెను. ప్రార్థనానంతరమున నాతనిమనస్సు శాంతమును సబలమును కాఁగా నతఁడు మరల శిష్యులవద్దకువచ్చి వా రింకను నిద్రపోవుచుండుట చూచి "ఇంకను నిద్రపోయి విశ్రాంతి ననుభవింపుఁడు" అని పలికి, తా నొక్క యీశ్వరసాహాయ్యమునే కాని మనుష్యసాహాయ్యము నపేక్షింపనివాఁ డయి యుండుటచేత వారిని నిద్రనుండి లేపక కష్టప

చింతలో నుండెను. ఇంతలో దూరమునుండి, నడిచివచ్చుచున్న మను ష్యుల కాళ్ళచప్పు డాతని చెవిని బడఁగా, చాలును! కాలము సమీా పించినది. మనుష్యపుత్రుఁడు పాపులచేతులలో నప్పగింపఁబడు చున్నాఁడు మనము వెళ్లుదము. లెండు. అదిగో మద్ద్రోహి చేరువ నున్నాఁడు. చూఁడుఁడు" అని గుండెలు జల్లుమనుమాటలతో నతఁడు సహచరులను లేపెను. వా రులికిపడి లేచి నివ్వెఱపాటుతో నిలువఁ బడునప్పటికి జూడస్సును ముం దుంచుకొని యాయుధపాణు లయిన మనుష్యులు వారిని చుట్టవేయఁగా వారిలో పీటరు తనపట్టాకత్తిని దూసికొని వేవేగముగా వచ్చి ప్రధానాచార్యుని భృత్యులలో నొకఁ డయిన మాల్కస్సను వానిని చెవిమీాఁద పొడిచి గాయపఱుపఁగా జీసస్సతనిని వారించెనఁట! ముందుకుపోయి ముద్దుపెట్టుకొని వాడుక ప్రకారముగా ప్రణామము చేయుటవలన జూడస్సు రాజనియుక్తులకు జీసస్సెవ్వరో తెలుపునట్లు మతాచార్యులచేత నేర్పాటు చేయఁబడె నఁట! ఈదండయాత్ర యేర్పాటు చేయఁబడిన విధమును బట్టియు, పంపఁబడిన యాయుధహస్తుల విస్తారసంఖ్యనుబట్టియు, చూడఁగా నాచార్యపురుషులు పట్టుకొనునప్పు డెంతో ప్రతిరోధము వచ్చునని జీసస్సునకు భయపడినట్టు కనుపట్టుచున్నది. దీర్ఘములైన లాటీకఱ్ఱలను కరములయందు ధరించి ముందు దేవాలయ రక్షకభటులు వచ్చిరి; వారివెనుక కృపాణపాణు లయి రోమకసైనికుల సమూహము వచ్చెను. అప్పుడు జూడస్సు ముందుకువచ్చి "స్వామీా! నమస్కారము." అని జీసస్సుయొక్క చెక్కిలి ముద్దుపెట్టుకొనెను. "మిత్రుఁడా! నీవేల వచ్చి యున్నావు? ఈప్రకారముగా నాయెడల ద్రోహివగుటకు నీకు నేనేమి చేసియున్నాను?" అని నిందాగర్భముగా జీస స్సడిగెను. మృదు వయి నట్టియు మర్మచ్ఛేదకము లయి నట్టియు జీసస్సు మాటలును ఛూావ్రు

లును జూడస్సుయొక్క మనస్సులో శూలమువలె నాటుకొని తత్‌క్షణమే పశ్చాత్తాపమును లజ్జను కలిగించెను. ఇట్లు పుట్టిన లజ్జానుశోకములే తరువాత జూడస్సును ఆత్మహత్య చేసికొనునట్లు చేసెను.

అప్పుడు నాయకులుగానున్న రాజపురుషులవంకకు దిరిగి "నే నేమో దొంగనయినట్టుగా నన్ను పట్టుకొనుటకయి కత్తులను కటారులను దాల్చి మీరేల వచ్చియున్నారు? దేవాలయములో బోధ చేయుచు కూరుచుండినప్పుడు నన్నేల పట్టుకొనలేక పోయినారు? అప్పుడు నామీఁద చేయిచాచుటకు సాహసము లేకపోయినది గాని యీచీఁకటిగడియలో మాత్రము మీకు శూరత్వము వచ్చినది." అని జీసస్సు పలికెను. నాయకులు సైగచేయఁగానే సైనికు లాతని బట్టుకొని బంధించిరి. జీసస్సు వారి నెదిరించుట కించుకయుఁ బ్రయత్నింపలేదు. కాని యప్పు డాతనిమన స్సెంతో క్షోభపడి యుండవచ్చును. చేతులు వెనుకకు విఱిచికట్టి చుట్టును రాజభటులు కాచియుండఁ పేరుపడిన దొంగనువలెను హంతకునువలెను వెనుకకు పట్టణమువంక కీడ్చుకొని పోవునప్పుడు నిరపరాధి నని యెఱిఁగి యున్న యతఁ డాదార్జన్యము నకు హృదయమునం దెంతసంతాప మొందియుండునో! అతఁ డిట్లు పట్టుకోఁబడినది ప్రధానాచార్యునియొక్కయు సాన్ హెడ్రిమ్ సభవారియొక్కయు యధికారపత్రముమీఁద. ఈలోపల శిష్యులలో ననేకులు పాఱిపోయిరి. పీటరును జానును మాత్రము తమస్వామిని విడువక కావలివారికి మిక్కిలి దూరముగా వెనుక నడచి వచ్చుచుండిరి. ఎవ్వరో పేరు తెలియని తరుణ వయస్కుఁ డొక్కఁడు సన్నదుప్పటి కప్పుకొని యాతని వెంటనంటెను. కాని కావలివా రాతనిని పట్టుకొనఁ బోఁగా పయివస్త్రము వారిచేతిలో విడిచిపెట్టి పాఱిపోయెను. కడసారి యిప్పుడు జీసస్సు కెడ్రనువంతెనమీఁదుగా పురద్వారమునుండి మరల

నడిచెనుగాని యీనాటి జయజయధ్వనులు చేయు భక్తులుగాని "ఈశ్వరపుత్రా! మంగళము!" అని పలుకు శిష్యులుగాని, వెంట లేరు. న్యాయమునకుగాని దయనుకాని చూపువారుగాని లేరు. కుపితశత్రు మధ్యమున బద్ధుఁడయి యేసుఁడు విపణ్ణహృదయముతో తలవంచుకొని నడిచెను.

రాజభటులు జీసస్సును ముందుగా హానను గృహమునకుఁ దీసికొని పోయిరఁట. హానను జీసస్సును తన సిద్ధాంతములను గూర్చియు శిష్యులను గూర్చియు ప్రశ్నలు వేయఁగా, అతఁ డుత్తరము చెప్పక తన బోధనను విన్నవారిని పిలిపించి తెలిసికొమ్మని బదులు పలికెనఁట! అట్లుపలుకుట తమయజమానుని నవమానపఱచుటగా భావించి దగ్గఱ నున్న హానను పరివారములోనివాఁ డొకఁడు జీసస్సు నొకదెబ్బ కొట్టె నఁట! ముందుజరుగఁబోవు నీ యన్యాయవ్యవహారిత్వ కంతకును నిజమైన కారకుఁడు హాననే యైనను బహిరంగముగా విమర్శించి దండించుటకు తన కధికారము లేనందున నతఁడు విచారణనిమిత్తము జీసస్సును తన యల్లుఁడైన కయిఫా గృహమునకుఁ బంపెను.

ప్రధానాచార్యుఁడు సాన్‌హెడ్రిమ్‌సభ కధ్యక్షుఁడు; ఈసభ డెబ్బదిమంది ధర్మాధికారులను గలదయి, యూదులయొక్క యున్నత న్యాయస్థానమయి యున్నది. విషయములోని నిజము తీర్పుచెప్పి దండన విధించుటకుముందు మూఁడవవంతునకు తక్కువ కాని సభ్యులును సభాధ్యక్షుఁడును చేరి విచారణజరుపవలెను. అయినను రోమనులు దోషికి మరణదండనము విధింపఁబడినప్పుడు వానిని వధించు నధికారమును యూదులకు విడువక తమయందుంచుకొనిరి. సాన్‌హెడ్రిమ్ సభవారు దోషినెవ్వనినైన వధార్హునిగా నిర్ణయించినప్పుడు వారు వానిని రోమనుపరిపాలకున కప్పగింపవలెను; పరిపాలకుఁ డావ్యవ

హారమును విచారించి తన యిష్టానుసారముగా దోషిని వదలివేయుట
గాని దండించుటగాని చేయవచ్చును. జీసస్సును పట్టుకొన్నవార్త జను
లకు తెలియకముందే తమ్ము విడిపించుట కయి మిత్రులును విడిపించు
టకు జీసస్సున కవకాశము కలుగకముందే విచారణ ముగింపవలె నన్న
యుద్దేశముతో హానె హెబ్రియముసభ్యులను తనయింట సమావేశపఱచు
టకు జీసస్సును దీసికొని రాకపూర్వమె ప్రధానాచార్యుఁడు మనుష్యు
లను బంపెను. దేవాలయములో సభనింతికి నిర్భయముశ్రేయమును గడబెట్టి
చిన పురుషుఁడు తన కవకాశలేశము నిచ్చినపక్షమున తన ప్రాణరక్ష
ణార్థము పోరాడక మానఁడని యాతఁడు భావించుకొనియుండెను.
కాఁబట్టి యింకను తెల్లవారకపోయినను రాజపురుషు లాసేధింపఁబడిన
బద్ధునితో తిరిగివచ్చునప్పటి కావఱకే ధర్మాధికారులు సమకూర్పఁ
బడి వివిధసాక్షులు సంసిద్ధముగా సూచఁబడిరి. ధర్మాధికారు లావ
ఱకే జీసస్సు నపరాధి యని నిర్ధారణముచేయ నిశ్చయించుకొని వచ్చి
యున్నవా రగుటచేత ధర్మాధికారులతో సంబంధించినంతవఱకు
విచారణమునకే యావశ్యకము లేదు; కాని, పై లేటసనివ ప్రమానిపైఁ
బెట్టించి మేకులు కొట్టించి దండింపవలె నని యభిలషించినవా
రగుటచేత వారు వ్యవహారరీతిని దోష నిరూపణము చేయవల
సినవా రగుటయేకాక రోమకపరిపాలకుఁడు తమతీర్పును త్రిప్పివేయక
స్థిరీకరించునంతటి బలమైనదానినిగా జీసస్సుమీఁది యభియోగమును
ప్రతిపాదింపవలయును.

భటులప్పుడు జీసస్సును వీధిలోని యున్న తోరణద్వారమున
కాళ్లు వఱుపఁబడి యున్న బహిఃప్రాకారములోనికిఁ గొనిపోయిరి.
ఆలోపల ప్రధానాచార్యునియొక్క మందిర ముండెను. సైనికులతో
విశేషభాగ మీప్రాకారములో నిలిచిపోఁగా కాపలికై నియమింపఁ

బడినభటులు లోపలికి సభాభవనములోనికి జీసస్సును గొనిపోయిరి. అందు ప్రధానాచార్యుఁడు మధ్య నాసీనుఁ డయి యుండఁగా అర్ధ చంద్రాకారముగా చుట్టును ధర్మాధికారులు కూరుచుండి యాతని రాకను ప్రతీక్షించుచుండిరి. జీసస్సు బంధములతోనే ప్రధానాచా ర్యునివద్దకుఁ గొనిపోఁబడి యాతనిముందు నిలువఁబెట్టఁబడెను. అతని పయిని మోపఁబడిన దోషారోపణపత్రము చదువఁబడినపిమ్మట దానిని స్థాపించుటకయి సాక్షులు పిలువఁబడిరి. అతనిపై నారోపింపఁ బడిన నేరములు—అపసిద్ధాంతములను బోధించి జనులను మోస పుచ్చుట, స్వమతధర్మములను నిరాకరింపవలె నని వారి కుపదే శించుట, దైవదూషణపరుఁ డగుట.

సాక్షు లొకరితరువాత నొకరుగా ముందునకు వచ్చి దేవాలయ ములో నతఁ డుపదేశింపఁగా తాము విన్నదానిని చెప్పిరి. తామిచ్చిన సాక్ష్యములో వారొకరు చెప్పినదాని కొకరు విరుద్ధముగా చెప్పుటయే కాక రోమకపరిపాలకునిమనస్సునకు మిక్కిలి పెద్దదిగా కనఁబడెడు దానిని దేనిని చెప్పలేకపోయిరి. వారిదుర్మార్గమును దూషించుచు మతాచార్యులకు విరోధముగా జీసస్సు సంభాషించినమాట వాస్త వమేకాని యట్టిమాటలు పలికినందున కయి పైలేటు జీసస్సు ప్రాణము లను తీయించుట కంగీకరింపఁడు. తుద కిద్దరుమనుష్యులు ముందుకు వచ్చి "దేవాలయమును నాశనము చేసి నేను రెండుదినములలో మరలఁ గట్టఁగలను" అని జీసస్సు చెప్పినట్టు సాక్ష్యమిచ్చిరి. ఈసా క్ష్యమునహితము సత్య మయినది కాదు; అతఁడు దేవాలయము నాశ మగునని పలికెను, దానిని తాను నాశము చేసెద నని యెప్పుడును పలికి యుండలేదు. యూదులధర్మానుశాసనముల ననుసరించి దేవాల

యమును దూషించుట దేవుని దూషించుటయే యగుచున్నందున దోషి వధార్హుఁడగును. ఇట్లు విచారణ జరుగుచున్న కాలములో జీసస్సొక్క మాట పలుకలేదు; ఒక్కరి నొక్క ప్రశ్న యడుగలేదు. తన్ను నపరాధి నిగా నిరూపించుటకు చాలినంత బలమైన సాక్ష్యమును వారిచ్చఁ డును లేఁజాలరని తెలిసినవాఁడయినను సాక్ష్యము న్నను లేకపోయి నను వారు తన్ను చంప నిశ్చయించుకొన్నవారని యెఱిఁగి యుండుట చేత నట్టివారితో మాటాడఁజాలుట నిష్ప్రయోజనమని యాతఁడు మౌనము ధరించి యూరకుండెను. ఇతఁడు వధార్హుఁడని పైలేఖ నొడఁబఱుపఁజాలునంతటి ప్రబలసాక్ష్య మెదియు నివఱకు రాలేదని ప్రధా నాచార్యుఁడు సహితము కనుఁగొన్నవాఁడయి కోపము తెప్పించి జీసస్సు నోట తొందరమాట యేదైనఁ బలికింపవలెనని "నీమీఁద నింతమంది సాక్ష్య మిచ్చుచుండఁగా నొక్కమాటకైన మాఱుపలుక వేమి?" అనికోపముతో ననెను. తానే దోషారోపకుఁడును విచారణకర్తయు నైనవానితో మాటాడ నిష్టములేక కాఁబోలును జీసస్సు బదులుపలుకక పోవుటయేకాక యాతని మొగమువంక తలయెత్తి చూడనైన నొల్ల కుండెను. జీసస్సు తాను చెప్పఁదలఁచుకొన్న విషయము నింతవఱ కొక్క ప్రశ్నయు నడుగ లేదు. అది ముఖ్యాంశమే యయినను జీసస్సుపై నావిషయమున దోషారోపణము చేసెడుపక్షమున ననేకు లాతనిని దేవునిచేఁ బంపఁబడినవానినిగా భావింపవచ్చునని యెంచి మతాచార్యులు సాధ్యమయినంతవఱకు నావిషయము నడఁగఁద్రొక్కి పయికి రానీయక యుంచి యితరదోషారోపణముచేత నాతని వధ్య నిగా నిర్ణయింపఁదలఁచిరి కాని వారికోరిక సఫలమయినది కాదు. అందుచేత నాముఖ్యాంశమును విడిచి యాతని దండ్యునిగాఁ జేయు టకు సాధనాంతరము కనఁబడనందున ప్రధానాచార్యుఁ డాతనివంక

తెప్ప వాల్చక చూచుచు "నీవు మెస్సయా యగుదువేమో చెప్పుము" అని యడిగెను.

అకారణముగానో సకారణముగానో వారెల్లను తనప్రాణములు తీయుటకై నారని యెఱుఁగుదునుగాన, మిథ్యారోపారోపములు మీఁదఁ గాక తాను సత్యమని నమ్మిన మెస్సయా నామ ఘోషణదోష స్థాపనముమీఁదనే ప్రాణము లియ్యవలయు నని నిశ్చయించుకొని "నేను చెప్పినపక్షమున మీరు నమ్మరు" అని మౌనము మాని జేసస్సుత్తరము చెప్పెను. అతఁడు తనమాయా నాగురితో తగులుకొను చున్నాఁడని భావించి ప్రధానాచార్యుఁడు "ఈశ్వరసాక్షికముగా నీవు దేవునికుమారుఁడవైన మెస్సయా వగుదువేమో చెప్పుము" అని యడిగెను. సత్యమును గూఢముగా నుంచవలసిన కాలము పోయి బహిరంగముగా ఘోషింపవలసిన సమయము వచ్చినదని తలఁచి "నేనెవరో నీవే చెప్పియున్నావు." అని యాచార్యునిముఖమువంక దృఢముగాఁ జూచుచు వినమ్రతతో స్పష్టముగా జేసస్సు పలికెను. ధర్మాధికారుల వంక చూడ్కి నిగిడించి "ఆకాశముపై సంచరించు మేఘములమీఁద వ్రాయఁబడినదేమో యున్నట్లుగా మనుష్యపుత్రునియొక్క ప్రభావమును మహిమయు మీరు చూచెడు కాలము వచ్చును" అని చెప్పెను.

ఈమాటలు వినఁగానే ప్రధానాచార్యుఁడు దేహము తెలియక కోపముచేత మండిపడి, యితరధర్మాధికారులతో బిగ్గఱగా "ఇతఁ డీశ్వర నిందను పలికినాఁడు. ఇఁక సాక్ష్యవసాక్ష్యములతో పని యేమున్నది? ఈతని యాశ్వరదూషణమును మీరు వినియున్నారు; మీరేమని తలఁచెదరు?" అని యడిగెను. "ఇతఁడు దోషి; వధార్హుఁడు." అని యెల్ల వారు నొక్కమాటగా పలికిరి. ఇంతటితో విచారణ సమాప్తి

పోయినది. ధర్మాధికారులు తమ యధికారశాటులను తీసి దూరముగా వేసి, వేగముగా నరసింహాసనంబు యున్న యూనాపాశ ద్ధుని నివాదికి పరుగెత్తిరి. యేసుయు గొలుసులతో కట్టఁబడి యున్నందున నతఁడు దప్పడు తన్ను రక్షించుటకు స్వర్గమునుండి దూతలు రక్షింపఁగా లేని మగనస్థలో నుంచెను. భటులు వానిపైఁబడి కొట్టి మొగముమీఁద నుమ్మి వేసి, "ఓ యభిషిక్తుఁడా! నీ శక్తి యీశ్వరుని మహిమయు గలవాఁడ వైన పక్షమున, నిన్ను నుమ్మి ప్రహారములు చేయుచున్నవా రెవ్వరో మాకు చెప్పుము." అని పరిహాసము చేసిరి. అతఁడు వారి కొక్క మాట బదులు పలుకలేదు. కోపమునుగాని శోకమునుగాని తెలిపెడు శబ్దమొకటిని పెదవులనుండి రానీయఁడాయెను; అలలతాఁకుడ చలింపకున్న పర్వతమేమో యన్నట్లు వారినడుమ నతఁడు చలింపక నిలుచుండెను.

లోపల నిది యంతయు నిట్లు జరుగుచుండఁగా వెలుపల పీటరును జానును వచ్చి యెట్లో జాఱిచేసికొని ప్రాకారములోపలఁ బ్రవేశించిరి. ఆ రాత్రి మిక్కిలి చలిగా నుండెను; అందుచేత సైనికులును మఱికొందఱును చలిమంట వేసికొని దానిచుట్టును గూర్చుండి కాచుకొనుచుండిరి. పీటరు నాగుంపులో చేరి నిలుచుండి యుండఁగాఁ జూచి యెవ్వరో యొకరు "నీవు గాలిలీదేశస్థుఁ డైన జీసస్సుతోడ నుండినవాఁడవు కావా?" అని పలుకరించిరి. అతఁ డామాటలకు భయపడి "నీవు చెప్పినసంగతి యేమో నే నెఱుఁగను" అని పలుకుచు ప్రాకారములోని మఱియొకచోటికి తొలఁగి పోయెను. అక్కడ నింకొకఁ డాతనిని పట్టి "నిశ్చయముగా నీవు జీసస్సు శిష్యులలో నొక్కఁడవు, నీకట్లోచ్చారణమే నీవు గాలిలీవాఁడ వని తెలుపుచున్నది." అని పలుకఁగా నతఁడు తాను కా నని యొట్టుపెట్టుకొనెను. జీసస్సును పట్టుకొన్నవా డతఁ డక్కడ నుండఁగాఁ జూచితి నని

మూఁడవసారి పేతురొక్కఁడు చెప్పెను. "నేను జీసస్సు నెఱుఁగనే యెఱుఁగను." అని మూఁడవసారి పేతురు తెలుపుచుండఁగనే, తూర్పుదో ప్రభాతమును దెలుపుచు కోడి కూసెను. ఆ కోడికూఁత వినఁగానే కొన్ని గడియలక్రిందట జీసస్సు పలికినపలుకులు తలఁపునకు వచ్చి పేతు రావలకుఁ బోయి పెద్దపెట్టున నేడ్చెను.

దేవాలయములో నున్న సానహెడ్రిన్ సభవారు నియమిత మగుకాలమునకు మరణదండనమును విధించిన తీర్పు నక్కడ యథావిధిగఁ బ్రకటించుటకయి జీసస్సును బందీయయిన రక్షకవర్గము వెంట నుషఃకాలమునందు తొందరగాఁ గొనిపోయిరి. తీర్పు వినిపింపఁ బడినమీఁదట జీసస్సు నక్కడనుండి ప్రొద్దెక్కకమునుపే జనులు విశేషముగా వీధులలోనికి రాకమునుపే ప్రాతఃకాలమున రోమను దేశ పాలకునియొక్క నివాసనికేతనమునకుఁ దీసికొనిపోయిరి. ఆతనివెంట దేవాలయతనవపరిజనము భటవర్గము పైనికనికాయము ధర్మాధికారులు మతాచార్యులు పారిసీలలోని ప్రముఖులు మొదలైనవా రింతయుంది పెద్దయుత్సవమువలె నడచుచుండినను తచ్ఛిష్యమిత్రభక్తవర్గ రాదు లేమూలనుండి వచ్చి యాకస్మికముగాఁ పైని బడి విడిపింపఁజూతురో యను భీతిచేత వారు రాజగృహము చేరువఱకును గుండెలు తటతట కొట్టుకొన తిరిగి తిరిగి చూచుచునే పోయిరి. పైలేటుమందిరాంగణములో నడుగు పెట్టినతరువాత నక్కడఁ గావలి కాచుచున్న బలిష్ఠమైన రోమకసైన్యమును జూచినప్పుడు వారిగుండెలు కుదుటఁబడినవి.

వారప్పుడు తమవచ్చిన కార్యమును నివేదించుచు లోపలికి విన్నపము పంపఁగా, పైలేటు వెలుపలికి వచ్చి వారు కూడియున్న విశాలప్రదేశము చొచ్చి ధర్మాసనము నధిష్ఠించెను. అంతట వారిలో నొకఁడు జీసస్సును ముందు నిలిపి "ఇతఁడు యూదులరాజు నని యభి

నయుండినట్లు తనయొక్క పాదములమీఁదనే దోషస్థాపనము చేయఁబడి యుపరాధియైనాఁడు" అని పైలేటుతో విన్నపము చేసిరి. రోమనులు న్యాయచారులను నియమించి తమ యధికారమును తాలూకాలు చేయఁజూచువారిని నిర్బంధముగా కనిపెట్టుచుందురు గాన పైలేటు జీసస్సును గూర్చి తానావలకే యెఱిఁగి యుండెను. ఇప్పుడు జీసస్సుమీఁద నారోపించిన నేరము సరిగా రాజద్రోహము కయి ప్రజలను పురికొల్పుట యను నేరమును నిజముగానే చేసిన బారబ్బా యను ప్రసిద్ధ మనుష్యుఁ డొక్కఁడు పైలేటుచేత కారాగారమునందుంచఁబడి యుండెను. జీసస్సటువంటివాఁడు గాక కేవల భిన్నవర్తనము గలవాఁడనియు, మతోన్మాదమునుబట్టి పౌరులలోని ప్రముఖులతనిని ద్వేషించుచున్నారనియు, నెఱిఁగి యుండుటచేత పైలేటు మనస్సు జీసస్సు పక్షమున కొంగి యుండెను.

ప్రధానాచార్యుఁడు నేరము మోపినప్పుడును, జనులను మోసముచేసెననియు సీజరునకు పన్ను కట్టవలదని ప్రజలకు బోధించెననియు జీసస్సునకు విరోధముగా నితరులు పలికినప్పుడును, "వీరు నీపయి మోపుచున్న దోషములను నీవు వినుచున్నావుగదా! వీరి కేమి యుత్తరము చెప్పెదవు?" అని పైలేటడిగెను. ప్రతిపక్షులు పలుకు కల్లలకుత్తరము చెప్పుటకూడ సమంజసము కాదని యెంచి యతఁడు మాఱుపలుకకూరకుండెను. "నీవు రాజవనుట నిజమేనా?" అని మరల పైలేటడిగెను. వెనుక చెప్పినట్లే మరల "ఔ నట్లు చెప్పుచున్నావు నీవు నా నిజమైన పేరును నాకనుగ్రహించినావు." అని జీసస్సు పలికెను. అంతట జీసస్సు నొంటిగా తనగదిలోనికి తీసికొనిపోయి విచారింప నారంభించెను. "నేను రాజనే కాని నా రాజ్య మీలోకసంబంధమైనది గాదు. నా రాజ్యము పూర్ణముగా సత్యానుభవములోను

సత్యప్రకాశనములోను ఉన్నది. నేను సత్యమునకు సాక్షిగా నిలుచుటకు వచ్చినాను." అని జీసస్సు తనరాజ్యస్వభావమును వివరింపఁదొడఁగెను. పైలేటాతనిభావమును గ్రహింపఁజాలక, అతఁడు పరులకు బాధచేయని దివాస్వప్నరాజ్యప్రవ్యాప్తునిగా పరిగణించి సపరిహాసముగా "సత్య మన నేమి?" అని ప్రశ్న వేసెను. జీసస్సు మతాచార్యులకును ఫారిసీలకును పక్కబల్లెముగా నుండువాఁడే కాని తనకు శ్రమ కలుగఁ జేయువాఁడు కాఁడని కనిపెట్టి, పైలేటాతనిని ప్రాణములతో విడుచుట కిష్టముగలవాఁడయి యుండెను. అందుచేత నతఁడు ధర్మాసనమును మరల నధిష్ఠించి, ప్యాసోవరు పండుగలో జనులు కోరుకొన్న కారాబద్ధుఁడగు యూదుని నొక్కని విడిచిపెట్టుట యాచార మగుటనుబట్టి వారికోరికమీఁద జీసస్సును విడుదల చేయవలె ననుతలంపుతో "జీసస్సును విడిచిపెట్టవలయునా? బారబ్బాను విడిచిపెట్టవలయునా?" అని జనుల నడిగెను. జీసస్సున కారోపించిన యపరాధములను బారబ్బా నిజముగానే చేసినవాఁడగుటచేతను బారబ్బాను విడిచిపెట్టుమని కోరినపక్షమున వారు రాజభక్తి లేనివారని వెల్లడి యగు నన్న భయముచేతను, జనులు జీసస్సునే విముక్తునిఁ జేయఁగోరుదు రని యతఁడు నమ్మియుండెను. అయినను జను లావఱకే మతాచార్యులచేత బోధనొందినవా రయి యుండుటచేత "మాకు బారబ్బా నిమ్ము." అని యేకవాక్యముగా వేఁడుకొనిరి. "ఇఁక మీరాజు నేమి చేయవలెను?" అని పైలేటడిగెను. "అతనిని సిలువను వేయింపుము" అని వారు పెద్దపెట్ట నఱచిరి. "ఎందుకు? అతనియందు దోషమేమియు నాకు కనఁబడదు. అతఁడపరాధ మేమి చేసినాఁడు?" అని పైలేటు మరల నడిగెను. వారాతనిమాటలను వినిపించుకోక దొమ్మిగా "అతనిని సిలువను వేయింపుము; సిలువను

చేయింపుము" అని కోలాహలధ్వనితో కేకలు వేసిరి. అప్పు డతఁడు చేయునది లేక వారి యల్లరి చూచి తా నాతనిని విడిచిపెట్టిన పక్షమున నడఁపరాని ప్రజాక్షోభము కలుగునేమో యని భయపడియు ప్రజలు సంఘవిజ్ఞాపనమును బంపుకొన్నపక్షమున చక్రవర్తి తన్ను పరిపాలక పదమునుండి తొలఁగించునేమో యని జడిసియు తుదకు బారబ్బాను విడిచిపెట్టి జీసస్సు విషయమున సాన్‌హెడ్రిను సభవారు చేసిన తీర్పును స్థిరపఱిచెను. తమకృషి సఫల మయిన దన్న సంతోషముతో మతా చార్యులును ఫారిసీలును సభను విడిచి తమ యిండ్లకుఁ బోయిరి. రోమక సైనికులు జీసస్సును సభాభవనమునుండి యావలకుఁ గొనిపోయిరి.

రోమకసైనికులు మృగప్రాయు లైన క్రూరచిత్తులు; వారికి దయాదాక్షిణ్యములు లేవు. పైలేటు దండనమును విధించిన తరువాత జీసస్సు మానవరూపమును ధరియించియున్న యాఘాతుక మృగముల కప్పగింపఁబడెను. సిలువను వేయ విధింపఁబడినప్పు డాదండనమును జరుపుటకు ముం దపరాధిని కొరడాలతోఁ గొట్టుట యాచారము. నిష్కరుణు లయిన యీసైనికులకు చంపుటకు ముందు పిల్లి యెలుకను బాధించునట్లు బాధలుపెట్టుట పరమసంతోషము. పీంఢ్ర కశా ఘాతములచేత జీసస్సు మూర్ఛపోలేదు; కంట తడిపెట్టలేదు. ఈవిధ ముగా నాతని ధైర్యము చెడఁగొట్టి యేడిపింప వలె నని వాండ్రు చేసిన ప్రయత్నమంతయు వ్యర్థమయినది! అతఁ డెవ్వరో యెట్టివాఁడో వాం డ్రెఱుఁగరు. ఆతఁడు యూదుఁ డనిమాత్ర మెఱుఁగుదురు; యూదుల నవమానించుటయే తమ వ్రత మయినందున, వారివ్వు డేలాగునసైన నాతని వేధించి నొప్పికి తాళలేనట్టు కనఁబడునట్టు చేయవలెను; తీవ్రవేదనచేత మనుష్యుఁడు గిలగిల కొట్టుకొనుచుండఁగాఁ జూచునప్పటికంటె మఱియొకప్పుడు వారి కెక్కుడుప్రమోదము కలు

గదు. అతఁడు యూలుగనందునను దయచూపుఁ డని వేఁడనందునను వారు పెట్టుబాధ మఱింత కఠిన మైనదియు దీర్ఘతర మైనదియు నయ్యెను. ఎంతభయంకర మైన బాధలు పెట్టినవా రయ్యును తా మాతనిముఖమునందు దుఃఖసూచనలు తోఁపఁజేయు దారి కానరానం దునవా రాతనిని వ్యథపెట్టుమార్గమునింకొకదానినాలోచించిరి. యూదుల రాజ నని చెప్పుకొన్న ట్టాతనిపై మోపఁబడిన నేరమును వారు విని యున్నవారు గాన, శరీరవేదనకు తాళఁగలిగినవారు సహితము పలువు రవహాసదుఃఖమునకు సహింపఁజాలకపోవుచు వచ్చుట నెఱిఁగి, అత నిని కృతకనృపతినిగాఁ జేసి యూమూలమున నవమానపఱుప నిశ్చ యించిరి. తదనుగుణముగా సైనికులు వేసికొనెడిరీతి శోణకంచుకము నొకదానిని తెచ్చి నెత్తురు కాఱుచున్న యతని బుజములమీఁదకప్పి ముండ్లకంపతో నల్లిన కిరీట మొక్కటి యాతనినెత్తిని బెట్టి, రాజవేత్ర మునకు మారుగా శృంఖలాబద్ధము లైన యాతని హస్తములలో నొక బెత్తమును నిలిపి, ఒకరి తరువాత నొకరుగా వచ్చి పాదములముందు సాగిలఁబడి, "ఓయూదులరాజా! నమస్కారము" అని యపహసింపఁ దొడఁగిరి. అంతేకాక వారిలో కొంద ఱపహాసమున కవమానమును తోడుపఱిచి సాష్టాంగనమస్కారము చేసి లేచి వచ్చునప్పు డాతని మొగముమీఁద నుమ్మి వేసిరి. మఱికొందఱు చేతిలోని బెత్తము నెత్తు కొని నెత్తిమీఁద మొత్తిరి. అతఁ డిప్పుడు వారిచే కృత్రిమరాజుగా చేయఁబడియున్నను నిజ మైనరాజువలె నిశ్చలహృదయుఁ డయి నిర్వి కారుఁ డయి పెట్టిన బాధలెల్ల పడి యవమానము నంతను శాంత తతో సహించెను. దౌర్బల్యలక్షణము గాని భీరుత్వచిహ్నముగాని దుఃఖసూచనము గాని యాతనిముఖమునం దణుమాత్రమును గాన రానందున నాతని సంతాపకులకు సంతాపమే గాని సంతోషము కలిగి

నది కాదు. కోపము కానరాని చల్లనిచూపులతో తమవంకఁ జూచు చున్న యతని శాంతవదనమును పొడగన్నవ్వా డా క్రూరకర్ముల శిలా కఠినచిత్తములలో సహిత మొకవిధ మయిన యపరాధస్మృతి తల చూపి వారి పెదవులనుండి యావలికు వెలువడఁబోవుచున్న పరిహాస వచనాంకురమును పైకి రానీక లోలోపలనె చంపివేసెను.

ఇంతలో నధికారులు వచ్చి జీసస్సును వధస్థానమునకుఁ గొని రావలసిన దని యాజ్ఞాపింపఁగా, కావలిభటు లాతినిని వెంటఁగొని రాజమందిరద్వారమువంక నడచిరి. ఈసమయమునందే మరణదండన మును పొందవలసిన మఱియిద్ద ఱపరాధు లప్పుడు వారితోఁ జేర్పఁబడిరి. వారు సాధారణచోరులు. యూదులకు క్రొత్తయవమానమును కలిగింప వలెనన్నయుద్దేశముతో పైలేటు వారిని జీసస్సుతోడఁగూడఁబంపుట కేర్పాటు చేసె నని చెప్పుదురు. మరణదండనార్థము కొనిపోఁ బడు చున్న యపరాధికి ముందు వాఁడు చేసిన నేరమును వ్రాసినపలక నొకమనుష్యుఁ డెత్తిపట్టుకొని నడుచుట యాచారము. "ఇతఁడు యూదుల రా జయిన జీసస్సు" అని పెద్దక్షరములతో వ్రాయఁబడి యున్న పలక నిందునిమిత్త మయి పైలేటు ముందుగానే సిద్ధము చేయించెను. అవమానకర మయినచావు చావనై యున్నవానికి పైలే టిటువంటి బిరుదము నిచ్చుట కెదూసలేమువాసు లైనయూదులపై తనకుఁ గలతిరస్కారభావమును వెల్లడిచేసి వారికి తలవంపులు తెచ్చు టకే యనుటకు సందేహము లేదు. దండ్యు లయియున్న తస్కరుల నాతని సహచరులనుగాఁ బంపుటకూడ యూదుల కవజ్ఞ కలిగించుట కయియే యుండును. "దొంగల కర్హ మయినమృతి ననుభవించుట కయి దొంగలతో నడచుచున్న యితఁడు మీకు రా జగుటకు తగిన వాఁడు." అని ఫలితార్థ మిచ్చెడి యావని గర్విష్ఠు లయి యుండెడు

మతాచార్యులయొక్కయు పారిసీలయొక్కయు గర్వమునకు భంగకర మయి యవమానకరముగా నుండు నని యాతఁ డెఱుఁగును.

తాము దేనిపైని దిగఁగొట్టఁబడి చంపఁబడుదురో యాదారువును దండ్యులచేతనే వధప్రదేశమునకు మోపించికొనిపోవుట రోమనుల క్రూరకృత్యములలో నొకటి. సిలువ యని చెప్పఁబడెడి వధసాధనము రెండుభాగములు కలదిగా నుండును. అం దొకభాగ మైన నిలువుదూలము భూమిలో పాతిపెట్టఁబడి యుండును; రెండవభాగ మైన యడ్డుదూలము భూమి కయిదా అడుగుల యెత్తున మొదటి దానిలో నమర్పఁబడును. జీసస్సు వీధిలోనుండి మోచుకొనిపోవలసిన దీ యడ్డుదూలమునే. చుట్టును సైనికులు కాఁచియుండఁగా, దోషారోపకులు కొంతమంది వెంటనడువఁగా, జీసస్సు వధార్థము కొనిపోఁబడెను. పౌరులలో ననేకుల కాతనిని పట్టుకొన్న వార్తయే తెలియదు; మంచి నడిరేయిని రాజపురుషు లాతనిని బట్టుకొనిరి; మధ్యాహ్నము కాకమునుపే యతఁ డడ్డుదూలమును వహించి పైలేటుసభాగృహము నుండి బయలు వెడలెను. వీధులలోనుండి పోవుచున్నప్పుడు కొందఱు స్త్రీ లాతని నానవాలుపట్టి కీచుగొంతుకలతో రోదనము చేయఁ దొడఁగిరి. జీసస్సు వారివంక తిరిగి "ఓ జెరూసలేముపుత్రికలారా! నా నిమిత్త మయి శోకింపకుఁడు. మీనిమిత్తమును మీబిడ్డల నిమిత్తమును శోకింపుఁడు." అని వారి నూఱార్చెను.

జీసస్సు తనమీఁద మోపఁబడినభారమును మోవలేకపోయినందున, రోమను భటులు పురద్వారమువద్ద నెక్కడనుండియో వచ్చి పురములోఁ బ్రవేశింపఁబోవుచున్న యొకపరదేశస్థునిఁ బట్టుకొని బలవంతముగా నాయడ్డుదూలము నాతనిచేత గమ్యస్థానమువఱకును మోయించుకొని పోయిరి. జీసస్సు దుర్బలశరీరుఁడు కాఁడుకాని రాత్రి

నుండి భోజనములేనివాఁ డయి యుండుటచేతను, క్రూరకిరాతు లైన పదాతులచేత నెత్తురు వఱదలు కట్టునట్లుగా దెబ్బలు తినియుండుట చేతను, గంటలకొలఁదికాలము నిలువఁబడియుండి వ్యాకులమనస్కుఁ డయి యుండుటచేతను బలహీనుఁ డయి యతిభారమైన యాదారువును మోయలేక పోయెను. రోమనులు త్రోవను బోవువారి నెవ్వరినైనఁ బట్టుకొని వెట్టికిఁగొట్టి వారిచేత నిచ్చవచ్చినపని చేయింపవచ్చును. ఇట్లు పట్టుకోఁబడి బలత్కారముగా బరువుమోయునట్లు చేయఁబడినవాఁ డుత్తరాఫ్రికాలోని సైరీనువాస్తవ్యుఁడైన సిమనను పేరు గల యూదుఁడు. అతఁడు ప్యాసోవరు తీర్థమునిమిత్తమయి యాత్రకు వచ్చెను.

ఊరు దాఁటి కొంచెముదూరము నడచినతరువాత 'గాల్గోథా' యను స్థలమునకు వచ్చిరి. ఆపదమున కాభాషలో కపాలభూమి యని యర్థము. ఇదే కొంచెము సేపటిలో సిలువను వేయుట యనెడు క్రూర కర్మము జరుగ నున్న ప్రదేశము. ఇది మన దేశమునందు పూర్వ కాలమునందుండిన కొఱతను వేయుట వంటిది. ఇందు మొదటిదానిలో మనుష్యుని మ్రానిపైఁబెట్టి చేతులకు మేకులు దిగఁగొట్టువారు. రెండవదానిలో మనుష్యుని కొఱ్ఱనఁబడెడు శూలమునకు దిగఁగొట్టు వారు. ఈరెండుదండనములలోను కూడ దండితులు వెంటనే ప్రాణ ములు గోలుపోక కొన్ని సమయములయందు దినములకొలఁదిని బ్రదికి బాధపడుచుండెడువారు. అడ్డుమ్రానునఁ బెట్టి మేకులుకొట్టుటకు ముందు వధ్యులకు బాధ తెలియకుండఁ జేయుట కయి మైకము చేసెడి యొకవిధమైన మద్యమును త్రాగనిచ్చెడివారు. వాడుకనుబట్టి రోమనులు తెలియకుండఁ జేసెడి మద్యమును పానముచేయుట కయి జీసస్సుచేతి కిచ్చిరి. అతఁ డామద్యపాత్రమును నోటివద్దఁ బెట్టుకొని నాలికతో చవి చూచి యది మత్తుపదార్థమని తెలిసికొని త్రాగక నిరాకరించెను;

నొప్పి తెలియకుండ స్మృతి తప్పియుండుటకంటె తెలివి గలిగియుండి నొప్పికి ధీరత్వముతో నోర్చుకొనవలయు ననియు, తాను కోరి తెచ్చుకొన్న మృత్యువును మహావీరునివలె నిర్భయముగా నెదుర్కొనవలయు ననియు, అతఁడు తలఁచి మత్తుచేసెడు మధుపానముయొక్క సాహాయ్యము నొల్లఁ డయ్యెను. అంతట నతని వస్త్రములను దీసి యాతనిని కొయ్యల కంటఁగట్టిరి; చేతుల నడ్డుకొయ్యమీఁద నిటుప్రక్కలను చాచి మేకులను గొట్టిరి; శరీరము బరువుచేత జాఱిపడకుండ రెండు కాళ్ళనడుమనుండి దారము వేసి నడుమనున్న నిలువుకొయ్యకు నడుము వద్ద కట్టిరి. మృత్యుదేవత కనుగ్రహమువచ్చి ప్రాణములను గొనువఱకు నతఁ డీప్రకారముగా వ్రేలాడుచుండవలెను. ఆతనివెంటఁ గొనిరాఁబడిన యిద్దఱు తస్కరులును జీసస్సున కిరుపార్శ్వములయందును సిలువ కొయ్యలకు వ్రేలాడఁ దీయఁబడిరి. వారికి తగినంత మందిని భటులను కావలియుంచి తక్కినసైనికులు పురమున కరిగిరి. ఈదారుణకర్మము జరుగుచున్నంత సేపును జీసస్సు సంపూర్ణ స్థైర్యముతో నుండి యొక్క దీనవచనమునైనను పలుకక కడపట "తండ్రీ! వారేమిచేయుచున్నారో వారెఱుఁగరు; వారిని క్షమింపుము" అని ప్రార్థించెను. విశేషకాల మతఁడు లోలోపలనే ప్రార్థించుచుండెనుగాని పయికి నేమియుపలుకలేదు. ఈలోపల నాతని విరోధులు కొంద ఱాతని వినాశమునుజూచి సంతోషింపవలెనన్న నీచ బుద్ధితో పట్టణమునుండి పనికట్టుకొనివచ్చి, ఆతనిమరణవేదనను చూచి పకపకనవ్వుచు హేళనముచేయుచు "నీవు దేవునికుమారుఁడవైనవత్సమున సిలువనుండి దిగిరమ్ము. ఓయిస్రాయీలరాజా! దిగిరమ్ము. మేము నిన్ను నమ్మెదము." అని కొందఱును "నీవు దేవాలయమును నాశముచేసి మూఁడుదినములలో మరల కట్టుదువు. అట్టి నీవు నిన్ను

రక్షించుకొనుము" అని మఱికొందఱును పలికి, తమలో తా మాతఁడు వినునట్లుగా వీఁడు దేవునిని నమ్మినవాఁడు; తాను దేవునికుమారుఁడ నని చెప్పుకొన్నాఁడు గదా? ఏదీ దేవుఁడు వచ్చి యిప్పుడితనిని రక్షింపు మను. వీఁ డితరులను రక్షించునుగాని తన్ను తాను రక్షించుకోలేఁడు." అని నానావిధముల గేలిచేసిపోయిరి. వీరు వా రన నేల? తుదకు నీవ లావలల సిలువలమీఁదనుండి చావునకు సంసిద్ధులయియున్న దొంగలు సహిత మాతని నగతాళిచేసిరఁట! ఈయధిక్షేపములకు దేనికిని మాఱు పలుకక యతఁడు పర్వతమువలె నిశ్చలుఁ డయి యుండెను. ఇట్టి కష్ట సమయమునం దాతనిశిష్యులు పలాయితు లయి మొగము చూపక పోయినను కెయాసలేమున కాతనివెంటవచ్చి యుపచారములు చేయు చుండిన గాలిలియామిత్రులుమాత్ర మాతనిని విడిచినవారు కారు. మేరీక్లియోఫస్, మేరీమాగ్డలేన్, జోయన్నా, సలోము, మొదలయిన స్త్రీ లాతనిని విడిచి పోవక భక్తిని చూపుచు కావలివారు రానిచ్చి నంతచేరువను నిలిచిరి.

జీసస్సును సిలువపై నివేసిన విధ మీక్రిందిపటము చూపుచున్నది.



జీసస్సును పరాభవించుట కయి చూడవచ్చిన మహాపురుషులును దారిని బోవుచు చూచినవారును బోయి సిలువకొనను "యూదుల రాజు" అని వ్రాయఁబడి యున్న పలకను జూచి యాయవమానకర మైన వ్రాఁతనుగూర్చి యాచార్యపురుషులతో మొఱ్ఱపెట్టుకొన్నందున వా రావ్రాఁతను మార్చి జీసస్సు యూదులరాజనని తానను కొన్న ట్లర్థమిచ్చెడు వ్రాఁత వ్రాయింపవలసిన దని పైలేటుతో విన్నపము చేసిరి. కాని యతఁ డాచార్యులమాటలు పెడచెవిని బెట్టి వారిప్రార్థన నిరాకరించి పంపివేసెను.

సాయంసమయము సమీపించు చుండెను. రక్తనిస్సరణాధిక్య మువలన నాయాస మధికమయి విదాహము పుట్టఁగా జీసస్సు దప్పిక యగుచున్నదని చెప్పెను. దయాశూన్యులైనసైనికులలో నించుక దయగలవాఁ డయినభటుఁ డొకఁడు తాము త్రాగుటకుఁ దెచ్చుకొన్న పానకములో స్పంజిని (లోనికి నీరు పీల్చుకొనుసముద్రపుపాఁచి) ముంచి కఱ్ఱకొనను కట్టి యెత్తి నోటి కందియ్యఁగా జీసస్సు దానిని చప్పరించి పీల్చెను. ఆతని కంతకంతకు దేహతాపము దుస్సహము కాఁజొచ్చెను. ఎటు చూచినను ఆతనిమనస్సునకు మనుష్యునియొక్క కృతఘ్నతయు దుస్స్వభావమును గానవచ్చుచుండెను. క్షణకాల మాతని మనస్సును నిరాశామేఘములు కప్పుకొని యీశ్వరుని మఱుఁగుపఱిచెను. ఈనిరా శత్వాంధకార నిమగ్నావస్థలో నతఁడు "ఓనాదేవా! నాదేవా! నీవు నన్నేల విడిచిపెట్టినావు?" అని యఱచెను. ఎంతటిమహాత్ములకును మానుషదౌర్బల్య మొకానొకప్పుడు పొడచూపక మానదుగదా! దీనినిబట్టి యాతని కీశ్వరునియందలి విశ్వాసము తగ్గినదని యెంచఁ గూడదు. బాల్యమునుండియు పలుక నలవాటు పడి యున్న యీవా క్యము తీవ్రశారీరకవేదనానుభవసమయమున నప్రయత్నముగా పయికి

వచ్చియుండును. అది కొట్టిదయినను శరీరము క్షీణదశ నొందుచు వచ్చినకొలఁదిని ఆయనయాత్మ యంతకంతకు విమలమగుచు వచ్చి దైవికస్వభావము ప్రకాశము నొందెను. తనకర్తవ్యము స్మరణకు వచ్చెను; తనమరణమే ప్రపంచముయొక్క ముక్తికి కారణ మగునని కనఁగొనెను; తనముందు నడచు చున్న దారుణదర్శనము లదృశ్యము లయి మనస్సుతదేకనిష్ఠతో పరమపితయందు లగ్న మయ్యెను. మరణమునకు కొన్నినిమిషములు ముందుగా నతఁడు "తండ్రీ! నాయాత్మను నీచేతులలో సమర్పించుచున్నాను." అని యుచ్చైస్స్వనముతో విస్పష్టముగా పలికెను. కడపట నతఁడు "ఇది సమాప్తమయినది" అని తనలోతాను మందస్వరమున ననుకొనఁగానే తల రొమ్ముపైని వ్రేలాడఁబడెను; ప్రాణము లుత్క్రమణము లయ్యెను. సిలువను వేయఁబడినతరువాత మూఁడుగంటలలోనే యతఁడు కాలధర్మము నొందెను. ఆతని శీఘ్రమరణమునకు రక్తవాహిక యొకటి తెగుట కారణమని వచింతురు.

సాధారణముగా రోమనులు సిలువను వేయఁబడినవారి శవములను సమాధిచేయుట కయి బంధుమిత్రాదులను తీసికొని పోనిచ్చెడువారు కారు. అయినను తగినంత పెద్దలంచ మియ్యఁగలవా రున్నపక్షమున రోమకపరిపాలకులచేత నట్టిపని చేయించుటయు నసాధ్యము కాదు. రహస్యమున జీసస్సునకు పరమభక్తులయి యుండియు బహిరంగముగా తా మతనిశిష్యు లయినట్లు చెప్పనంతటి ధైర్యము లేనివారు జెరూసలేమువురవాసులలో ననేకు లుండిరి. అట్టివారిలో నొకఁడయిన జోసప్పనువాఁడు ప్రబలుఁడును విత్తవంతుఁడు నయి యుండెను. జీసస్సువిషయమయి జరుపఁబడిన యన్యాయములవలనను క్రూరత్వములవలనను కలిగినకోపముచేత ధైర్యవంతుఁ డయి పైలేటునద్దకుఁబోయి

శవమును సిలువమ్రానినుండి తీసికొని పోనియ్యవలసిన దని జోసఫ్ వేఁడుకొనెను. పైలే టాతనిప్రార్థన నంగీకరించెను. అందుచేత తత్సమీపమున నున్న జీసస్సుయొక్క మిత్రులతోడుపాటుతో నతఁడు శవమును సిలువనుండి దింపి, శుద్ధజలముతో కడిగించి, సమాధి యొద్దకు తీసికొని పోయెను. అతనితోఁటలో రాతిలో మలచిన సమాధి యొకటి యుండెను; దానిలో జీసస్సుశరీరమును బెట్టి దాని ముఖద్వారమున నొక్కమహాశిలను దాపి మూఁతపెట్టి, ఈ మిత్ర బృందము ఖిన్నహృదయములతో వెనుక మరలిపోయిరి. ఇట్లు జరిగిన దినము శుక్రవారము. ఆదివారమునాఁడు జీసస్సు తన మిత్రులకు కొందరకు సజీవుఁడయి కనఁబడె నని చెప్పుదురు. జీసస్సుయొక్క పునరుజ్జీవనకథ యిది — గాలిలీ నుండి జీసస్సువెంట వచ్చిన మేరీ మాగ్డలీ నను నామె భానువారమునాఁడు ప్రాతఃకాలమున సమాధి యొద్దకుఁ బోయి చూడఁగా దానికి మూఁత వేసినఱాయి యథాస్థానమున లేక తొలగింపఁబడియుండె నఁట! పీటరును జానును కలిసికొని జరిగినసంగతిని వారితోఁ జెప్పుటకయి యామె దుఃఖముతోను భయముతోను వెనుకకుఁ బోయె నఁట! వా రామెతోఁ గూడి సమాధియొద్దకుఁ బరుగెత్తుకొని వచ్చి లోపలఁ జొచ్చి యది వట్టిదిగా నుండుట చూచి వెంటనే వెడలిపోయిరి గాని యామెమాత్ర మేడ్చుచు నక్కడనే యుండె నఁట! కొంతసే పయిన తరువాత మేరీ సమాధి లోనికి వంగిచూడఁగా, దానిలో నిద్దఱు దేవదూతలు కనఁబడి యేల యేడ్చుచున్నా వని యడిగి రఁట! "వారు నాప్రభువును తీసికొని పోయినారు గనుక వా రాతని నెక్కడ నుంచిరో నే నెఱుఁగను" అని మేరీ యుత్తరము చెప్పె నఁట! అప్పు డామె తలయెత్తి కనుఁగొనఁగా తన సమీపమున నొక్కరు కనఁబడి "ఓకాంతా! ఏల యేడ్చెదవు?"

అని యడిగె నఁట! బాష్పముల వలనఁ గొంతవఱకు కన్నుగానని దయి యాస్థలమునకు కాపున్న తోటవాఁడని, తలఁచి "అయ్యా! నీ వాతనిని తీసుకొనిపోయి యుండినపక్షమున నీ వాతని నెక్కడ బెట్టితివో నాకు చెప్పుము" అని యామె యాతని నడిగె నఁట! అప్పు డామనుష్యుఁ డామెను 'మేరీ' అని పేరితో పిలువఁగా, "ప్రభువా అని సంతోషముతో కేక వేసి, ఆమె యతనిని జీసస్సని గురుతు పట్టె నఁట! జీసస్సుయొక్క పునరుత్థాన విషయమునఁ గల సాక్ష్య మంతయు నొక్క మేరీయొక్క మాట లయి యున్నవి. ఆమె నిజము గానే తన ప్రభువును జూచినట్టు భ్రమపడి యుండవచ్చును. ఆమె భయశోకపరీతస్వాంత యయి తదేకధ్యానముతో సదా ప్రభువునే స్మరించు చున్నప్పుడు మనోనేత్రమున కాతనిరూపము కనఁబడుటయు భావనా సంభవము లయి యాతని మాటలు వినఁబడుటయు వింత కాదు. ఇట్లే యాతని శిష్యులును వివిధస్థలములయందు తమ స్వామియొక్క శబ్దస్వరూపములను వినియు కనియు నుండవచ్చును. చచ్చినవాఁడు లేచివచ్చుట సత్యము కాకపోయినను, ఆకాలమునందుఁ గలిగిన యీ నమ్మకము శిష్యులకు నూతనస్థైర్యోత్సాహములను గలిగించుటకు జీసస్సుపదేశించిన ధర్మములకు లోకములో నత్యంతవ్యాప్తిని కలిగించుటకును పరమోపకార మయినది. తనకుఁ గల మహామహిమలతో సకలగుణగణగరిష్ఠుఁ డయినజీసస్సంతటివాఁ డేమియు చేయలేక తనకాయము నాచార్యపీఠమునకు బలిపెట్టవలసినవాఁ డయినప్పుడు శక్తిహీనులమును గుణహీనులము నయిన మే మేమి చేయఁగలుగుదు మని, శిష్యకోటిలో ప్రబలమైన నిరాశ వ్యాపించియుండినప్పుడు "జీసస్సు జీవించియే యున్నాఁడు. ఆచార్యపురుషు లాతనిదేహము నంతము నొందించినను, ఆతనియాత్మ యింకను మనలోనే యున్నది.

అతఁడు శోకార్తులయి యున్న శిష్యులకు దర్శనమిచ్చి సంభాషించుచున్నాఁడు. దిగ్విజయము చేయుటకయి మన కాతఁడు తోడుపడ నున్నాఁడు. ఈలోకమునందు మన క్షేమ సంప్రాప్త మయినను పరలోకమునం దుత్తమగతిని మన కతఁడు చూపుచున్నాఁడు" అను కర్ణపరంపరాగత మయిన జనశ్రుతి భీరువులకు నూతనధైర్యమును నిరుత్సాహులకు నూతనోత్సాహమును దుర్బలలకు నూతనబలమును పుట్టించి తమప్రభు వుపదేశించిన శుభవార్తను కష్టములకోర్చి దూషణలకు సహించి తర్జనభర్జనములకు తలయొగ్గి చావులకు తెగించి లోకములో ప్రవచనముచేయునట్లు చేసినది. మూడుగంటలకాలపుశ్రమతో జీన స్సశాశ్వత మయిన స్థూలకాయమును విడిచినవాఁ డయ్యును శాశ్వత మైన కీర్తికాయమును ధరించి ప్రపంచమునకు మహోపకారి యయి నూతనధర్మస్థాపకుఁడయి యిప్పటికిని జీవించియున్నాఁడు; ప్రపంచములో మనుష్యజాతి యున్నంతవఱకు ముందును జీవించియుండును. ఈశ్వరుఁడు ప్రపంచమున కంతకు తండ్రియగుటచేత మనమందఱ మీశ్వరపుత్రులమే యయినను జీస స్సీశ్వరపుత్రులలో నుత్తమోత్తముఁ డనఁదగినవాఁడు. ఈయుత్తమత్వము కల్యాణగుణసంపత్తిచేతఁ గూడ నీశ్వరకుమారత్వమున కర్హుఁ డగుటచేత వచ్చినది. ఇతఁడు బోధించిన సత్యములలో శ్రొత్తవనఁదగినవి యెన్నో లేవు. ఈతఁడు బోధించిన సత్యములలో నీశ్వరుని పితృభావమును మనుష్యుల యన్యోన్యసోదరభావమును ప్రధానము లయిన వని చెప్పవచ్చును. ఇవి సహితము క్రొత్తవి కావు. జీసస్సుజాతివా రయిన యూదులు దేవుఁడు తమ తండ్రి యనియు తా మాతని ప్రియపుత్రుల మనియు తమ్ముమాత్రమే దేవుఁడు ప్రేమించి యందఱి కంటెను దమ కెక్కువ యాధిక్యమును గలిగించు ననియు భావించుకొని గర్వపడుచుండెడివారు. ఈ భావన భ్రమ యనియు

నీశ్వరునికి తా మెట్లు ప్రియశిశువులో యట్లే లోకములోని యెల్ల జాతులవారును సమానముగానే ప్రియశిశువు లనియు, ఈశ్వరుడు తనయెడల నెట్లు ప్రేమ గలవాఁడయి యున్నాఁడో యట్లే యెల్ల జాతులవారియెడలను సమానప్రేమమును గలవాఁడయి యున్నాఁడనియు, జీసస్సు బోధించెను. ఇదియే యాతఁడు బోధించిన క్రొత్త సత్యము. దేవుఁడు తండ్రియు, మనుజులు కొడుకులు నగుటచేత పుత్రులకు పితృాజ్ఞానువర్తనము పరమధర్మము. ఏవిషయములోను జను లీశ్వరాజ్ఞాతిక్రమణము చేయక యీశ్వరేచ్ఛానుసారముగా సర్వ విషయములలోను ప్రవర్తించువా రయ్యెడు పక్షమున భూమిపై నీశ్వరరాజ్యము నెలకొనును. ఈయీశ్వరరాజ్యస్థాపనము నిమిత్తమే జీసస్సు తనప్రాణము ధారపోసెను. ఈ యీశ్వరరాజ్యము స్థాపింపఁబడిన యెడల జగత్తులో పాప ముండదు; అధర్మ ముండదు; అసత్య ముండదు; అన్యాయ ముండదు; ద్వేష ముండదు; వంచన ముండదు. అందఱును దేవునకు విధేయపుత్రు లయి, పరస్పరప్రేమము గల సోదరులయి, పాపవిదూరులయి, ధర్మపరులయి, సత్యవంతులయి న్యాయపరాయణులయి, సదయులయి, ఋజువర్తనులయి, పరోపకార పారీణులయి, అంతకంత కీశ్వరసామీప్యము నందుచు దేవతుల్యు లయి మనుష్యు లీశ్వరరాజ్యములో శాశ్వతానందమును బొందువా రగుదురు. యీశ్వరరాజ్యమున కందఱును సమానార్హత గలవారు. ఎంతటిపాపి యయ్యును దీనిని పొందుట కెవ్వఁడును ననర్హుఁడు కాఁడు. ముఖ్యముగా పాపుల నీశ్వరరాజ్యములో ప్రవేశపెట్టుట కొఱకే తాను తన ప్రభు వయిన తండ్రిచేత పంపబడినట్లు సంపూర్ణవిశ్వాసము గల వాఁడయి జీసస్సు వారియెడల సదయుఁడయి పాపులకొఱకే తనప్రాణములు నర్పించెను. ఈశ్వరరాజ్యము బలపడి భూమి భూతలస్వర్గ

మగునుగాక! జీసస్సు త్రోక్కిన త్రోవ లోకమునకు మార్గప్రదర్శక మగునుగాక! జీసస్సుసహితము మనవలె మనుష్యమాత్రుఁడై యయి వను తనయకళంకశుద్ధ వర్తనముచేతను, నిశ్చల నిర్మల దైవభక్తి చేతను, అవ్యాజపరార్థైక పరత్వము చేతను, దేవతుల్యుఁ డయినాఁడు. అంతవఱకును పాపమునకును పరాభవమునకును గుఱుతుగానుండిన సిలువ జీసస్సు దానిపైని హతుఁడగుటచేత ప్రభువులును పవిత్రులును గూడ గౌరవచిహ్నముగా ధరించిగర్వపడునంతటియోగ్యత కలదగునని యెవ్వరనుకొనిరి? దేవసముఁడన్నంత ఘనతను పొందుటకయి విషయ సుఖములవంక కాకర్షించునింద్రియవర్గములో నతఁ డెంత పోరాటము సలిపియుండునో! భగవంతునినుండి పరాఙ్ముఖునిఁ జేయఁజూచు పాప చింతలను మనస్సునుండి పాఱఁదోలుటకయి యెంతకష్టపడియుండునో! ఈశ్వరునితోడ నంతతసాన్నిధ్యమును గలిగించుకొని యాయన యిచ్ఛకు సదా తనయిచ్ఛ లోఁబడునట్లు చేయుటకయి యెంత నిరం తరాభ్యాసము చేసియుండునో! ఏమియు చేయకున్న నంతసులభముగా నీశ్వరరాజ్యము నతఁడెట్లు చూఱగొనఁ గలిగి యుండును? అతఁడు బోధించిన యీశ్వరరాజ్య మైహిక మయినదికాదు; మానసిక మయి నది. దేశకాలజాతివిభేదము లేక శుద్ధహృదయులును శుద్ధవర్తనులును అయినవా రందఱును దానినిబొందుటకు స్వాతంత్ర్యముగలవారు. ఈశ్వరాజ్ఞోల్లంఘనమున కనఁగా పాపమునకు పశ్చాత్తప్తులయి నిర్మల హృదయములతో తండ్రియైన పరమేశ్వరుని సమీపించు బిడ్డలంద ఱును ఈశ్వరరాజ్యములో ప్రవేశించి యానందము నొందుదురన్న మతసత్యహర్మ్యమునకు ప్రతిష్ఠాపనాచార్యుఁ డయిన జీసస్సుయొక్క సిద్ధాంతము లోకములోని సర్వమతముల యందును వ్యాపించి యనంత శుభదాయక మగునుగాక!

---

కీర్తిశేషులైన రావుబహద్దూరు

# కందుకూరి వీరేశలింగం పంతులుగారి

## గ్రంథములు

### ప్రహసనములు

మొదటి సంపుటము.

1 అపూర్వబ్రహ్మచర్యప్రహసనం
2 విచిత్రవివాహ ప్రహసనము
3 మహాబధిర ప్రహసనము
4 పునర్మరణ ప్రహసనము
5 బలాత్కారగానవినోదప్రహస॥
6 కలహప్రియా ప్రహసనము
7 మహామహోపాధ్యాయప్రహస॥
8 యోగనిద్రా ప్రహసనము
9 మహావంచక ప్రహసనము
10 అసహాయశూర ప్రహసనము
11 కలిపురుషశనైశ్చర విలాసము
12 వేశ్యాప్రియా ప్రహసనము
13 శాకుంతవర్గని
14 వినోదతరంగిణి
15 హాస్యసంజీవి మొదటి భాగము
16 ,, రెండవ భాగము
17 ,, మూడవభాగము

### నాటకములు

రెండవ సంపుటము.

1 బ్రాహ్మవివాహము
2 వ్యవహార ధర్మబోధిని
3 తిర్యగ్విద్వన్మహాసభ (మూషికాసుర విజయం)
4 మహారణ్య పురాధిపత్యము
5 ప్రహ్లాద నాటకము
6 సత్యహరిశ్చంద్ర నాటకము
7 దక్షిణ గోగ్రహణము
8 వివేక దీపిక

### భాషాంతరీకృత నాటకములు

మూడవ సంపుటము.

1 చమత్కార రత్నావళి
2 రాగమంజరి
3 కళ్యాణకల్పవల్లి
4 అభిజ్ఞాన శాకుంతలము
5 రత్నావళి
6 మాళవికాగ్ని మిత్రము
7 ప్రబోధచంద్రోదయము
8 వినీసువర్తక చరిత్ర

### వచన ప్రబంధములు

### పద్య కావ్యములు

నాల్గవ సంపుటము.

1 సత్యరాజాపూర్వదేశ యాత్రలు మొదటి భా॥
2 ,, రెండవ భా॥
3 రాజశేఖర చరిత్రము
4 శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధం

నాల్గవ సంపుటము.

5 రసికజన మనోరంజనము
6 శుద్ధాంధ్రభారత సంగ్రహము
7 అభాగ్యోపాఖ్యానము
8 పథిక విలాసము
9 జాన్ గిల్పిన్
10 నీతిదీపిక

## స్త్రీల కుపయోగించు కథలు

అయిదవ సంపుటము.

1 సత్యవతీ చరిత్ర
2 చంద్రమతీ చరిత్ర
3 సత్యసంజీవిని
4 చమత్కార రత్నావళి
5 సతీమణి విజయము
6 సుమిత్ర చరిత్రము
7 రఘుదేవ రాజీయము
8 కురంగేశ్వర వర్తకచరిత్రము
9 కళావతీ పరిణయము
10 గయ్యాళిని సాధుచేయుట
11 చిత్రకేతు చరిత్రము
12 దాసకేసరీ విలాసము
13 వైదర్భీ విలాసము
14 భానుమతీ కళ్యాణము
15 సరసిజన మనోభిరామము
16 ధర్మకవచోపాఖ్యానము
17 కుమారద్వయ విలాసము
18 పద్మినీ ప్రభాకరము
19 మాలతీ మధుకరము

## స్త్రీల కుపయోగించు పుస్తకములు

ఆరవ సంపుటము.

1 విక్టోరియామహారాజ్ఞిచరిత్రము
2 సతీహితబోధిని
3 పత్నీహిత సూచిని
4 స్త్రీ నీతిదీపిక
5 సత్యాద్రౌపదీ సంవాదము
మాతృపూజ — పితృపూజ
6 నీతికథామంజరి ప్రథమభాగము
7 ,, ద్వితీయ భాగము
8 దేహారోగ్య ధర్మబోధిని

## ఉపన్యాసములు

ఏడవ సంపుటము.

1 జన్మాంతరము
2 అతిబాల్యవివాహము
3 విగ్రహారాధనము
4 ఈశ్వరదత్త పుస్తకములు
5 ఈశ్వరోపాసనము
6 ప్రార్థన
7 మానుషధర్మము
8 విద్యార్థికుల ధర్మములు
9 జీవితముయొక్క పరమార్థము దానిని పొందు మార్గము
10 వైరాగ్యము
11 విద్యాధురీణుల యథార్థ కృత్యములు
12 వర్ణము
13 హిందూమతములు

ఏడవ సంపుటము.

14 స్వయంకృషి.
15 సకాయకష్టకర్మలు
16 వేశ్యకాంతల ఉపన్యాసములు
17 ఐకమత్యము
18 దానములు
19 స్త్రీ పునర్వివాహ చరిత్రము
20 స్త్రీపునర్వివాహ విషయకోపన్యాసము
21 స్త్రీ పునర్వివాహ విషయక ప్రథమవిజ్ఞాపనము
22 స్త్రీ పునర్వివాహ విషయక ద్వితీయవిజ్ఞాపనము
23 స్త్రీ పునర్వివాహ శాస్త్ర సంగ్రహము
24 స్త్రీ పునర్వివాహ భూతవర్తమానస్థితులు

## ఉపన్యాసములు - జీవచరిత్రలు

ఎనిమిదవ సంపుటము.

1 దేశీయమహాసభ, దానియుద్దేశము
2 స్వదేశసంస్థాన చరిత్రాదులు
3 విగ్రహతంత్ర విమర్శనము
4 ఉపన్యాసమంజరి

ఎనిమిదవ సంపుటము.

5 వివేకవర్ధని - మొదటి భాగము
6 ,, [illegible]
7 ,, మూడవ భాగము
8 శంకరాచార్యులు
9 బసవరాజు గవర్రాజుగారి జీవచరిత్రము

## సాహిత్య గ్రంథములు

తొమ్మిదవ సంపుటము.

1 సంగ్రహ వ్యాకరణము
2 కావ్యసంగ్రహము
3 అలంకార సంగ్రహము
4 నీతిచంద్రిక - విగ్రహము
5 నీతిచంద్రిక - సంధి
6 తర్కసంగ్రహము
7 సత్యవాదిని
8 ఉత్తమస్త్రీ చరిత్రములు
9 జీసస్ చరిత్ర

పదియవ సంపుటము.

పూర్వాంధ్రకవులు

పదునొకండవ సంపుటము.

1. మధ్యకాలపు కవులు
2. ఆధునిక కవులు

పండ్రెండవ సంపుటము.

స్వీయచరిత్ర (పంతులుగారిది)

పుస్తకములు వలయువారు :—

**కార్యదర్శి - హితకారిణీ సమాజము,**

**రాజమహేంద్రవరము**

అని వ్రాసిన బడయగలరు.